ఎ.బి.కె.

# నిబద్ధాక్షరి

(సాహిత్యకీయాలు)

కాంపస్ పబ్లికేషన్స్

హైదరాబాద్ - 44



ఎ బి కె

# నిబద్ధాక్షరి

ప్రథమ ముద్రణ - మార్చి 1997
వేయి ప్రతులు

పబ్లిషర్స్
కాంపస్ పబ్లికేషన్స్,
ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్,
న్యూ నల్లకుంట - హైదరాబాద్
ఫోన్ 7018559

ముఖచిత్రం
లక్ష్మణ్

కంపోజింగ్
కోపన్ గ్రాఫిక్స్,
హిమాయత్ నగర్, హైదరాబాద్
ఫోన్ 7604858

ముద్రణ
నవ్య ప్రింటర్స్, రాజ్‌భవన్ రోడ్,
హైదరాబాద్

వెల : రూ॥ 75/-

# విషయ సూచిక


- మిత్రాక్షరిః దాశరథి రంగాచార్య
- విప్పారిన అపరంజిరేకులు! : తిరుమల రామచంద్ర II
- సంపాదకీయ సురభిః డా॥ సంజీవదేవ్ IV
- నా లోపల లోలోపల V


## నందన వనం


- "రాధమ్మపెళ్ళి" జరిగి తీరుతుంది 2
- మాండలికంలో మాణిక్యదీపాలు 4
- అనగనగా! 7
- "క్రాస్‌రోడ్స్"లో కలిసిన 'కథా' శివరావు!! 10
- నమ్ముకున్న నేలను కమ్ముకున్న 'కేతు' కథనం! 14
- పీడనపై పడగెత్తిన'శ్వేత'నాగు! 18
- 'బోన్‌సాయ్' బతుకులకు సమాధానం సునీత! 22
- మానవుడే 'మాధవుడ'ని చాటిన తాత్త్విక నవల! 25
- కథాశిల్పి కేశవరెడ్డి తాత్త్విక యాత్ర 29
- స్త్రీవాద సాహితికి చిరునామా సత్యవతి! 32
- 'చంద్రకళా' పూర్ణోదయం ఎప్పుడు? చరిత్ర అబాసు కానప్పుడు! 35


## అంతర్జాతీయ విహాయసం


- ప్రవాస భారతి 40
- సాహితీ ధ్రువాలు 43
- వాలెస్ మానవుడు 46
- "ఉగ్రకోపి నేను . " 49
- "అప్పుడు పుట్టివుంటే .." 52
- నెల్సన్ రోలిహాలా గుండె గుండెలో 'మండేలా' ..! 55
- సాదత్ మంటో గతమెంతో 59
- వేదనా కలశం! 61




- దోపిడీ బతుకులను 'యాగి' చేసిన గూగి! 64
- గర్భశోకానికి శ్రుతిగా సంగీతం వెలయించిన సీగర్! 67
- నవలా ప్రపంచంలో కుండేరా 'దండోరా'! 71
- ఛాందసాలపై చాకులూ బాకులూ దూసిన "పాజ్"! 74
- వ్యథార్త జీవిత యధార్థ చిత్రం "పౌలా" 77
- ఆఫ్రికా ప్రియపుత్రికల అంతరంగ మథనం! 80
- 'భూత' ప్రపంచానికి శాగన్ చేతబడి! 83


## కవితా సరస్తీరం


- "ఆగ్రహ భార్గవులు" దిగంబరులు!! 88
- 'నీలాటిరేవు' నిర్మల 'పాతాళ గంగ' విమల!! 91
- కాంతి గోపురాలు! 94
- 'హరీన్'దా 97
- అక్షరాల్లో "అశ్వోత్సవం"! 100
- కారు మబ్బులూ! కళ్ళనిప్పులూ!! 103
- నిశ్శబ్ద క్షణంలో "బతికిన క్షణాలు"! 106
- తమ్ముల మనసులు దోచిన "తుమ్మల"! 109
- జ్ఞాపకాల వెల్లువ "వరదకాలం" 112
- "వేదనల విపంచ్రాగి"అమృతం పంచిన ఆత్రేయ 115
- విస్మయ పరిచే ఇస్మాయిల్! 118
- చిత్రదీపాలు 121
- ఆత్మ నివేదనలో అసంతృప్తి ఛాయ 'ఆకుపచ్చలోయ' 124
- కటకటాల వెనక ఉక్కు కవితలు! 128
- ఇది నవశతాబ్దపు జయశబ్దం 131


## విజ్ఞాన వీచికలు


- ఊహకందని రాణి ఉదిత సంధ్యారాణి! 136
- శక్రచాప వక్రరేఖ - శంకర పిళ్ళే!! 139
- "మృత్యు రథం" 142

- వ్యాపార కోశం కాదు - వ్యవహార కోశం! 144
- "లక్ష" రాక్షసాంశకు! లక్షన్నర మానవాంశకు!! 148
- 'ఆలయ కేళిక'! 151
- బుర్ర కరిగి కరిగి 154
- రజిత రంజని కాదు, రసభావ తరంగిణి! 157
- మానవీయ కవితకు 'మాధవీ'య స్పర్శ "గబ్బిలం" 159
- హుసేన్ తూలికా సృష్టి, కావాలి కళాదృష్టి! 163
- దాశరధి వచన వేదం 167


## వివేచన విహారం


- గాంధీ తరంలో గరిమెళ్ళ, గరీబోడు .. 172
- మాట అమృతకావ్యంగా, పాట పరమ గానంగా 175
- 'వరద' కాదు, సెలయేరుల కలకలం .! 178
- చిరంజీవులూ - చింతాజీవులూ! 180
- చిరుపల్లె విశ్వరూపం ఆర్ కె "మాల్గుడి"! 183
- కవి 'మాంచాల' ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ! 187
- కాకలు తీరిన కాకతీయ కవియోధుడు 'కాళోరా'! 190
- ఆంధ్ర 'పాల్ రాబ్సన్' గద్దర్! 193
- "తెనుగు లెంక" వెలుగు చంద్రవంక!! 196
- 1999 డిసెంబర్ 31 199
- దళిత సాహిత్యంలో 'ఆత్మకథ' విష్కరణం 201
- మరపురాని, మరవలేని మహామేధావి కె బి.కృష్ణ 205


## స్వేచ్ఛా తరంగాలు


- హల్లూరు తవ్వకాలు ఆలూరు భాష్యాలు! 210
- టిప్పుకత్తి, కమామీషు!! 213
- అయోధ్య - ఇంతకీ ఎవరిది?! 216
- "సింధు" "హిందు"గా ఎలామారింది?! 219
- నీ బాంచను దొర. .'దాసి' 222

- ప్రయోగ నాళికలో సూర్యోదయం!! 224
- పత్రికా లోకంలో చారిత్రక సంధ్య! 226
- ప్రచార కవితలు! 229
- "పైథాగరస్ కావాలా ? పైసా కావాలా?" 232
- ఈ ఆర్య వంగడం ! 235
- విజయ 'గీతా' రహస్యం! 238
- రంగారాజు లింగయ్య! నందమూరి రామయ్య!! 241
- సాహితీ వెలుగు వాకిలి - జర్నలిజం 244
- ఆ తరం వేరు, ఆ తలుపులు వేరు . ! 246


## మరెన్నో....


- ఆ పాలబుగ్గల మెరపుతావులెక్కడ?! 250
- "జాగ్వార్ నవ్వు" 253
- ఆమె పరాధీన కాదు! 256
- అనంతం, అవిశ్రాంతం .! 259
- "సూర్యపుత్ర నమస్తేస్తు ." 262
- ఆ అపూర్వ క్షణాలు . 265
- "విశ్వగామి నా మనసు .!" 268
- చిత్తశుద్ధిలేని బుద్ధపూజ!! 271
- మతసామరస్యం మంగిపూడి 'పాలిపాట!' 274
- కాంతాస్మృతిలో ఓ ఏకాంతం! 277
- చిలిపి చినుకులు, చిగురుటాకులు! 280
- మతపంజరాలు దాటి ముందుకు సాగే సాహితీమూర్తులు 283
- యథార్థవాది ఎ జి నూరాని - లోక విరోధి! 286
- 'ఆమె'ను పీడని పితృస్వామ్య వ్యవస్థ నీడలు ! 289

# మిత్రాక్షరి

స్పందనకు ఒకరూపం, ఒక అక్షరాకృతిని కల్పించేవాడు రచయిత, కళాకారుడు పాత్రికేయులూ కళాకారులే కాబట్టి వారి స్పందన, ప్రకటన వెంటనే జరుగుతాయి పాత్రికేయుల వార్తా రచన - వ్యాఖ్య - సంపాదకస్పందన ఎన్నో కళారూపాలకు కారణాలైన నిదర్శనలు ప్రపంచ వ్యాప్తంగా కోకొల్లలు

మిత్రుడు ఎబికె వార్తా రచయిత, వ్యాఖ్యాత, సంపాదకీయ స్రష్ట 'నిబద్ధాక్షరి' ని ఒకసారి పరిశీలిస్తే ఏబికె పాత్రికేయ దశను దాటి సృజనరచయిత దశకు ఎదిగాడన్ని స్పష్టం అవుతుంది అతని వచనానికి సోయగం ఉంది పరిపక్వత ఉంది పరిమళం ఉంది కళలను గురించి రాసేప్పుడు ఏబికె ఒక్కొక్కసారి వచనంలో కవిత్వపు తళుకులు చూపిస్తాడు ఒక్కొక్కసారి ఆవేశంలో అక్షర జలపాతాలు కురిపిస్తాడు ఈ శిల్పం అతనికి 'నిబద్ధత' వలన అబ్బింది

మనకు ముట్నూరి, కాశీనాధుని, తాతాజీ, నార్ల, ఖాసా, సురవరం, మాదపాటి, మందుముల వంటి వైతాళిక సంపాదకులు ఉన్నారు వారు తెలుగు పాత్రికేయరంగానికి నిలువుటద్దాలై నిలిచారు ఆ తరం సంపాదకులు పాత్రికేయులు మాత్రమేకారు వారు త్రివిక్రములు వారు రచయితలు, వ్యాఖ్యాతలు, విమర్శకులు అన్నింటినీ మించి మహా మనీషులు!

తరువాత తరంలో పత్రికను నమ్ముకొని ఒక విశిష్ట సంపాదకదశకు స్వయంకృషితో ఎదిగిన వాడు ఎబికె 'ఆంధ్రపత్రిక', తప్ప అన్ని తెలుగు పత్రికలకూ సంపాదకత్వం వహించాడు కొన్నిటిని కని పెంచి - కన్న కొడుకులచేవలె-తరిమి వేయబడ్డాడు ఇది వ్యాపార నాగరికత, ఇక్కడ అనుబంధాలకు తావులేదు

ఎబికే ది 'వసుధైవ కుటుంబం' అనడానికి అతని తొంభైరెండు వ్యాసాల్లోని విశ్వవైశాల్యం నిదర్శనం ఈ వ్యాసాలకు సంకుచిత పరిధుల్లేవు 'విశ్వగామి నా మనసు' అనే విశ్వనాథ సత్యనారాయణ సంబంధి నుండి 'రఫ్దీ' దాకా వ్యాపించి ఉండడం నిదర్శనం

తెలుగు పత్రికకు ఉన్న తొంభై ఏళ్ల వయసులో - నాకు తెలిసినంతవరకు - ముట్నూరి వారివి రెండు సంపుటాలు, నార్లవారిది ఒక సంపుటం సంపాదకీయాలుగా వొచ్చాయి ఎబికె సంపాదకీయాలు ఇప్పటికి నాలుగు సంపుటాలు వచ్చాయి! ఈ 'నిబద్ధాక్షరి' అయిదవ సంపుటమని చెప్పవచ్చు! దీని విశిష్టత ఏమంటే పేరుకు 'సాహిత్య సంపాదకీయాలు, అయినా అన్ని కళలను గురించిన వ్యాసాలూ ఇందులో ఉన్నాయి. వివరించడానికి స్థలం చాలదు - భావ్యమూ కాదు ఇందులో ప్రతిదీ ఒక కావ్యం!

ఎబికె నిత్యవిద్యార్థిగా కనిపిస్తాడు ప్రతి వ్యాసంలోనూ అతను చేసిన ఉదాహరణలు ఈ విషయాన్ని నిరూపిస్తాయి! నిరంతర అధ్యయనం నిరంతర అన్వేషణ అతని వృత్తి- ప్రవృత్తిలా కనిపిస్తాయి ప్రతి వ్యాసంలోనూ నిమగ్నమైన పరిశీలన కనిపిస్తుంది. ఈ సంపుటిలో ఎక్కడికక్కడ చదువుతున్నది ఒకే వ్యాసం అయినా అందులో ఎన్నో విషయాల వెలుగులు మనకు గోచరించడం విశేషం!

-దాశరథి రంగాచార్య
సికిందరాబాదు
ధాత మాఘ పూర్ణిమ
22-02-1997



# విప్పారిన అపరంజిరేకులు!

మిత్రులు శ్రీ ఎ బి కె ప్రసాద్‌గారి రచనలు చదివినప్పుడు, ఆయన సంపాదకీయాలు తిరగవేసినప్పుడు, ఆయనను చూచినప్పుడు, ఆయనను తలచుకొన్నప్పుడు నాకు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు నిర్వచించిన సంపాదకుడు ప్రత్యక్షమవుతాడు అప్పుడు సంపాదకుణ్ని 'విలేఖకుడ'ని వ్యవహరించేవారు వెంకటరత్నం పంతులుగారు విలేఖకుని లక్షణాలను నిర్వచించారు

తొమ్మిది లక్షణాలు ఉన్నవాడే విలేఖకుడు-సంపాదకుడు అని అన్నారు పంతులుగారు తెలుగుపత్రికలలో వివిధ విషయాలపై సంపాదకీయవ్యాఖ్య-సంపాదకీయం ఉండాలనే సంప్రదాయాన్ని ప్రవర్తింపజేసిన వారూ ఆయనే ఆయన చెప్పిన పాండిత్యం, సత్ప్రవర్తనం, జగద్వ్యాపార విజ్ఞత్వం, స్థైర్యం, ధైర్యం, ఉచితజ్ఞత్వం, శక్తిత్రయం, సూక్తిచాతుర్యం-వీటికి తోడు ధనంకూడా చేర్చారు ధనవంతుడు కాకపోతే పత్రికను నడపజాలడన్న సంగతి ఆయనకు అనుభవ విదితం

ధనం సంగతి నాకు తెలియదుగాని తక్కిన ఎనిమిది గుణాలూ-అష్టైశ్వర్యాలలాగ పూర్తిగా ఉన్నవారు శ్రీ ఎ బి.కె సంపాదకుని పని అసిధారావ్రతం, అతని సంపాదకీయ వ్యాఖ్యకూ ఒక పరిమితి ఉంది దానిలోనే అతడు బిందువులో సింధువును-చూపాలి అద్దంలో కొండను చూపాలి పరిమితి దాటినా, సూక్తిచాతుర్యం కొరవడినా పాఠకుడే 'ప్చ్' అని చప్పరిస్తాడు ఈ అసిధారావ్రతంతో చేసిన రచన శ్యామ శబల వ్రతంతో నిగ్గుదేరిన అపరంజిరేకులే అవుతాయి. అలాటివి ఎ బి కె సంపాదకీయాలు

ఇదివరకు నేను ఆయన సంపాదకీయాల సంపుటి చదివాను. సంపాదకీయాలను ప్రతిదినమూ చదువుతూనే ఉన్నాను. తెలుగు సంస్కృత ప్రాకృతాలలోని ఆశ్చర్యార్థక పదాలను అన్నింటినీ ఉచ్చరించుకొని నాలో నేనే మురిసిపోయాను, మురిసి పోతూంటాను.

ఇది సాహిత్యంపై వ్రాసిన సంపాదకీయాల సంపుటి. ఇప్పటి సాహిత్యం-వాఙ్మయం ప్రాచీనాలంకారికులు చెప్పిన లక్షణాల పరిధిని తెంచుకొని వ్యాపించింది అదొక పారావారం ప్రపంచసాహిత్య పరిచయంతో మన సాహిత్యంలోనూ ఎన్నో నూతన లక్షణాలు పుట్టుకు వచ్చాయి, వస్తున్నాయి వాటివల్ల అంతా చెడేననడం పొరపాటు పూర్వం కావ్యాల విషయంలోనూ కొందరు సంఘంలో ప్రాబల్యం ఉన్నవారు "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని శాసించినవారే. కాంతిని, గాలిని ఎలా నిరోధించలేమో నూతన ధోరణులనూ నిరోధించలేము. సాహిత్యంలో అన్నీ గ్రాహ్యాలే, ఉచితాలే వాటిపై సంపాదకుడు వ్యాఖ్య చేస్తున్నప్పుడు ఒక సాహిత్య వర్గాన్ని దృష్టిలో పెట్టుకొని వ్యాఖ్యానించడం కాక సమగ్ర సాంఘిక వాఙ్మయ దృష్టితో వ్యాఖ్యానించవలసి ఉంటుంది. అలాంటప్పుడే సంపాదకుని జగద్వ్యాపార విజ్ఞత, ధీరత, స్థిరత, ఉచితజ్ఞత, సూక్తి చతురత లోకానికి తెలియవస్తాయి

ఎ బి కె గారి ఈ సంపుటిలోని ఏ సంపాదకీయం చదివినా నా మట్టుకు నాకు ఏదో

నేను కలలోనూ చూడని నందనోద్యానంలో విహరించినట్టు, అపూర్వ సౌందర్యాన్ని సాక్షాత్కరించుకొన్నట్టు, కైలాస నాథకోన, ఎత్తిపోతల, కుర్తాళం, నయాగరాజలపాతాలలో జలకాలాడినట్టు, ఏ హెలీకాప్టర్‌లోనో ఒంటిగా - ఉహూ! మరొకరు నా పక్కన ఉంటే నా ఆనందాను భూతికి భంగం కనుక ఒంటిగా - విహాయస పథంలో తిరుగుతూ, లోకంలోని అతిలోక సౌందర్యాన్ని పర్యవేక్షిస్తున్నట్టు, షేక్ చిన మౌలానా సాహెబ్‌గార్ల నాదస్వరాన్ని, షేక్ బడేగులా మలేఖాన్ శహనాయి వింటున్నట్టు, ఎల్లా వేంకటేశ్వరరావుగారి ననమృదంగ నాదాన్నో, అల్లారఖ్ఖా గారి తబలా భాషనో వింటున్నట్టు అనిపిస్తుంది.

ఒకవైపు తిరిగాను పాలబుగ్గల మెరుపులు, మరొకవైపు ఆగ్రహభార్గవులు దిగంబరులు, ఊహకందనిరాణులు, కాంతిగోపురాలు, మాండలీకంలో మాణిక్యదీపాలు కనిపించాయి ఇంకొక వైపు తిరిగాను హల్లూరు తవ్వకాలు కనిపించి ఆలూరు భాష్యాలు వినిపించాయి మరికొంత ముందుకు వెళ్లాను గరీబోడు గరిమెళ్ల, ఇర్వింగ్ వాలెస్, శంకర్ పిళ్లె, మాట అమృత కావ్యంగా - పాట పరమ గానంగా పాడిన పుట్టపర్తి, సంఘాన్ని సంస్కరించడానికి అన్నీ ఒడ్డిన స్పెయిన్ మహా రచయిత అక్టావియోపాజ్, అనుగులెంక తుమ్మల సీతారామమూర్తి, పౌలా నవల రచించిన ఇసాబెల్ అలెండీ, "ఫట్వా" రాక్షసివెన్నంటగా ప్రపంచమంతా ప్రాణ రక్షణకోసం తిరుగుతున్న మహారచయిత సల్మాన్ రష్దీ, ఆఫ్రికా ప్రియపుత్రికలు, బోన్‌సాయి బతుకులు, అబ్బూరి ఛాయాదేవిగారూ, కేశవరెడ్డి, సత్యవతి, అర్ధాయుస్సుతో కాలంలో కరిగిపోయిన డాక్టర్ కె బి కృష్ణ-ఇలా ఎందరో పాత వారూ, కొత్తవారూ. వివిధ దేశాల వారూ కనిపించారు ఇదొక ప్రపంచం, ఇదొక కొత్త సృష్టి ఏమని చెప్పను?

నేనొక నవప్రపంచంలో విహరించాను క్షణక్షణానికీ రూపం మార్చుకుంటూ, విచిత్రరూపాలతో అలరిస్తూ తిరిగే మేఘాల మేఘాలయాన్ని చూచాను కనుచూపునకు అందనిదెల్లా నీలంగా కనిపిస్తున్న సత్యాన్ని నారాయణుని రూపంలో ఇమిడ్చిన రూపాలను సాక్షాత్కరించుకున్నాను

అంతా చదివి, చూచి ఆకళించుకొన్న తర్వాత మమ్మటుని శ్లోకం గుర్తుకువచ్చింది

*నియతికృతనియమ రహితాం*
*హ్లాదైకమయీం అనన్యాపరతంత్రామ్*
*నవరసరుచిరాం నిర్మితిం*
*ఆ దధతీ భారతీ కవేర్జయతి*

ఆహా! ఎంతబాగా ఆలోచనామృతంగా అన్నాడు మమ్మటుడు రచన విధిసృష్టికి భిన్నమయింది అది మరొక మహాలోకం

ఎ.బి.కె గారూ మీ మనస్సు మహామహితం, మీ బుద్ధి మహాతీక్షణం, మీ విమర్శ నిష్పక్షపాతయుతం, మీ ఊహలు సత్యధర్మసంయుతాలు అనడానికి ఈ వ్యాస సంపుటి చాలు

-తిరుమల రామచంద్ర

1-3-1997

# సంపాదకీయసురభి

ప్రతి సంపాదకీయ రచనకూ, ఎత్తు వుండవచ్చు, లోతు వుండవచ్చు కానీ సౌరభం వుండదు కొందరు సంపాదకీయాలకు మాత్రం సౌరభం వుంటుంది

నిపుణ సంపాదకుడు ఎ బి కె ప్రసాద్ కలంనుంచి వచ్చిన సంపాదకీయాలకు ఎత్తు వుంటుంది, లోతు వుంటుంది, వుంటుంది కూడా సురభి

రచనల్లోని ఎత్తులూ లోతులూ బౌద్ధికం (Intellectual), సురభి రససిక్తం (Aesthetic) అందుకే ఆయన సంపాదకీయాలు ఎంతో రోచకంగా వుంటాయి

వైజ్ఞానిక విశ్లేషణ సంబంధంగా రసమయ సంశ్లేషణాత్మకలఘు అభివ్యక్తి ఎంత కమనీయమో!

ఇందులోని సంపాదకీయాల్లో లేని సామాన్య విషయంకాని అసామాన్య విషయం కాని లేదు ఈ సంపుటం ఒక భూరి విజ్ఞాన సర్వస్వం

ఏ రచనైనా రచనాత్మకంగా వుండగలిగినప్పుడే అది సురచన అవుతుంది. అటువంటి సురచనలే ఈ సంపాదకీయాలు

ఇటువంటి సూక్ష్మవివరణలు ఈ గ్రంథంలో ఓతప్రోతమైవున్నాయి ఎక్కువ మందివి సంపాదకీయాలు ప్రధానంగా రాజకీయ, ఆర్థిక, సామాజిక వాతావరణలకు మాత్రమే పరిమితమై వుంటుంటే ఇందులోని సంపాదకీయాలు మిగతా వాటికంటే మానవతా విషయాలకూ, సూక్ష్మమైన సాంస్కృతిక విషయాలకూ వాహనాలుగా వ్యవహరించాయి

భౌతిక, జైవ, మనోవైజ్ఞానిక, బౌద్ధిక మొదలైన విషయాలకు తోడు ఇందులో దార్శనిక సంబంధమైన విషయాలకు కూడ కొదువ లేదు

ఈ విధంగా జిజ్ఞాసారంగాన్ని ఈ గ్రంథంలో ఎన్నిటినో ఎత్తి చూపాడు ఎ బి కె అందుకే దీనిలోని సంపాదకీయాలు ఒక వైవిధ్యాన్ని, వైలక్షిణ్యాన్ని కలిగి వున్నాయనేది. సత్య శివ సుందరాలు ఇందులో త్రివేణిగా ప్రవహించాయి

జర్నలిజంలో సంపాదకుని స్థానం ప్రత్యేకమైంది ఆ స్థానపు ఔన్నత్యాన్ని ఉజ్వలంగా కాపాడుకొనే వారు ఎక్కువ మంది వుండరు, తక్కువ మందిలోనే ఆ ఎక్కువ స్థానం ప్రత్యక్షమవుతుంది అటువంటి వారే ఎ బి కె

-డా॥ సంజీవదేవ్

# నా లోపల లోలోపల......

ఈ సాహిత్య సంపాదకీయాల రచనాకాలం 1989 1996 వీటిలో '96కు ముందు వచ్చినవి "ఆంధ్రభూమి" దినపత్రిక లోనివి '96 ఫిబ్రవరి నుంచి వచ్చినవి "వార్త' దినపత్రికలోనివి వీటిని చదివిన పాఠకులనుంచి వచ్చిన అపూర్వ స్పందనకు ప్రతిరూపమే ఈ సాహిత్యకీయాల సంకలనం ప్రపంచం ఎంత విశాలమైందో మానవ జీవితాన్ని అనునిత్యం ప్రభావితం చేసే అన్ని వైజ్ఞానిక శాఖలకూ అంత విస్తృతి ఉంది వీటిని అందినంతమేర అర్థం చేసుకోడానికి ప్రయత్నించాను ఈ ప్రయత్నానికి హద్దులంటూ వుండవు, జ్ఞానం అపారమైంది కాబట్టి సముద్రం లోతులు కొలిచేవాడు, విజ్ఞాన ప్రపంచానికి విలువలు కట్టేవాడూ లేడు! ఆ ప్రయత్నంలో భాగంగానే తోచినంత లెక్క విషయ దర్శనం చేస్తున్నప్పుడు ఆనందాతిరేకంతో దొర్లుకుంటూ వచ్చిన వ్యాఖ్యాన సహిత భావ పరంపరకు అక్షర రూపమే ఈ సాహిత్యకీయాలు

వాటికి పాఠకులనుంచి ఎందుకింత స్పందన అని నేను ఆలోచించుకున్నప్పుడు మరోసారి నేను కూడా చదువుకోవాలన్న బుద్ధి నాకు కలిగి, వాటిని పునర్దర్శించాను నిజంగా ఇవి నేనే రాశానా అని నాకే ఆశ్చర్యం వేసింది ఈ అంతర్దర్శనం నాలో మరింత విశ్వాసాన్ని పెంచింది అయితే ఈ సంపుటం ముసాయిదాను చదివిన తరువాత పండితులు, బహుభాషావేత్తలు, బహు గ్రంధకర్తలయినవారు కొందరు పంపించిన ఆప్తవాక్యాలు నేను భరించలేనంత బరువుగా నాకు తోచాయి నేను అంతటి ప్రశంసకు తగుదునా అన్న అనుమానం వచ్చింది వారి శేముషి ముందు నా ప్రతిభ సూర్యుడి ముందు దివిటీ అనిపించింది అయినా రచనా పరంగా, వారి వ్యాఖ్యలు నా ఆత్మవిశ్వాసాన్ని మరింతగా పెంచికూర్చున్నాయి! ఈ సందర్భంగా నిష్కర్షగా, నిండు మనస్సుతో ఈ సంపుటిపై అభిప్రాయాలు వెలిబుచ్చిన మాన్యులు తిరుమల రామచంద్ర, సంజీవదేవ్, దాశరథి రంగాచార్య, గుంటూరు శేషేంద్ర శర్మగార్లకు నా వినమ్రపూర్వక వందనాలు ఈ సంపుటి ప్రూఫ్ రీడింగ్ బాధ్యతలు ఎంతో శ్రమకోర్చి శ్రద్ధతో నిర్వహించిన యువ కవులు, రచయితలు చిరంజీవులైన రమేష్, శ్రీధర్, గుడిపాటి, సొదా లకు, కంపోజింగ్ బాధ్యతలు పర్యవేక్షించిన కుప్పిలి పద్మకు, ఈ సంపుటికి "నిబద్ధాక్షరి" పేరు సూచించిన సతీష్ చందర్‌కు నా కృతజ్ఞతలు

ఈ పుస్తకానికి అందంగా టైటిల్ పేజి రూపొందించిన ప్రముఖ చిత్రకారుడు లక్ష్మణ్‌కు, ద్రవ్యోల్బణం రోజుల్లో కూడా ముచ్చటగా పుస్తకాన్ని అచ్చువేయడానికి సాహసించిన కాంపస్ పబ్లికేషన్స్ అధినేత వెంకటేశ్వర్లు గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు

\- ఎబికె

# "రాధమ్మ పెళ్ళి" జరిగి తీరుతుంది!

కథకుడు స్వాప్నికుడు, యధార్ధవాది, కనుకనే కథకుడూ, కవీ లోక విరోధులు కూడా అవుతారు! అస్గర్ గౌండ్వీ అనే సుప్రసిద్ధ ఉర్దూకవి ఈ సృష్టినే ఓ కథగా ఊహించుకున్నాడు అతనిలా అంటాడు "సృష్టికథను సావధానంగా వింటున్నా అందులో కొంత స్వప్నం, కొంత యధార్ధం, ఇంకొంత కథన (శక్తి) కౌశలం ఉంది స్వప్నం అంటే కల్పన, యధార్ధం అంటె వాస్తవం, కౌశలం అంటే భావనాశిల్పం" అన్నాడు! అవునుమరి, ఈ లోకసందర్భనంలో కథక చక్రవర్తులు కాదలచినవారికి పిపీలికంనుంచి "పింగ్-పాంగ్" దాకా కథనానికి అనర్హమైన వస్తువు లేదు వాల్మీకి శోకాన్ని శ్లోకంగా దిద్దితీర్చినట్టే లోకవృత్తాంతాన్ని కథలుగా మలచగల సమర్ధులైన రచయితలు సంఘం బాగోగులు పట్టించుకొనే కథకులు, ఆనందంతో పాటు ఆరోగ్యాన్ని, రుచితోపాటు బలవర్ధకమైన ఆహారాన్ని, చక్కదనంతోపాటు మంచితనాన్ని, నీతి కథలతోపాటు ధైర్యస్థైర్యాలనూ పాఠకులకు అందిస్తారు, కలిగిస్తారు కనుకనే సంఘంలో వచ్చే పరిణామాలకు, ప్రకృతిలో వచ్చే ఆటుపోట్లకు అంత త్వరగా స్పందిస్తారు ఓ కెరటాన్ని చూచో, లేదా ఓ చిరుగాలి అనుభవించో కథకుడు తన వస్తువుకు చరమాంకం చెప్పలేడు! ఆకలితో నకనకలాడిపోతున్న ఓ తల్లిని, ఓ పిల్లని చూచీ, ఓ ఏడుపు , ఓ గాద్గదికమైన స్వరం, ఓ దీనాలాపన, ఓ ఆక్రందన, ఓ గావుకేక వినీ కలానికి పదును పెట్టుకుంటాడు సమాజంలోని అంతరాల దొంతరలు, అక్రమాలు, అవినీతి, స్త్రీలపై అత్యాచారాలు, ఆర్థిక దోపిడీ, వీటన్నింటి మధ్య సతమతమవుతూ తమ జీవితానికి నిశితమైన లక్ష్యాన్ని నిర్వచించుకొని, స్పష్టమైన విమోచన మార్గమేదో పౌరులు ఆలోచించుకొనేటట్టు చేసే కథకులు ఉన్నారు అలాంటి సుప్రసిద్ధ కథకులలో ఒకరు బుధవారంనాడు (సెప్టెంబర్ 6) చనిపోయిన "బీనాదేవి" కథకులకూ, కథానికా రచయితలకూ ఎవరికంటే ఎక్కువగా నిష్కాపట్యం, ధైర్యం, తెంపరితనం అవసరమన్నాడు ఇర్వింగ్‌హో అది పుష్కలంగా ఉన్న బహుకొద్దిమంది తెలుగు కథకులలో ఒకరు "బీనాదేవి" అన్వర్థనామంగా తెలుగు నవలా రచనలో, కథా రచనలో తనదైన స్వతంత్ర బాణీని ప్రవేశపెట్టి యువరచయితలలో నూతన కల్పనాశక్తినీ, సరికొత్త దృష్టినీ, సామాజిక దృక్పధాన్నీ పురిగొల్పి రచయిత బి నర్సింగరావు ఒక్క ఘటనచాలు - అది ఇతివృత్తంగా కథలో లోక వృత్తాంతాన్ని అవిష్కరించిన బహుకొలది మంది కథకులలో ఆయనొకరు ఈ విశ్వం సంకేతాలమయం అన్నాడు ప్రసిద్ధ రచయిత అక్టావియోపాజ్ *"Life is grasped in symbolic compression"* అన్నాడు! ఆ సంకేతాలన్నీ రా వి శాస్త్రి కథలలో మాదిరిగానే "బీనాదేవి" నవల "హాంగ్ మీ క్విక్" (లేదా "పుణ్యభూమీ! కళ్ళు తెరు") లో, కథా స్రవంతి "రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది", "ఫస్ట్‌కేస్" కథల్లో పాఠకుల అనుభవంలోకి వచ్చినవే శైలిలో, కథా సంవిధానంలో, కొసమెరుపులు విసరడంలో, క్లుప్తీకరణలో, ఉండంత మాటలో కొండంత అర్థాన్ని చూపడంలో, తొలినాళ్ళలో రా.వి శాస్త్రి రచనల ప్రభావం తనపైన కొంత ఉన్నప్పటికీ "బీనాదేవి" (భార్య సుందరమ్మ, నర్సింగరావులు "జంటకవులు"గా సాగిన కర్తృత్వం) క్రమంగా తన సొంత గొంతును పెంచుకున్నారు ఆధునిక కథా రచయితలందరికీ గురజాడ ఆదిగురువైనా, ఆ తరువాతి యువతరం కథకులకు గురుతుల్యులుగా చలం, కొడవటిగంటి, పద్మరాజు, గోపీచంద్‌లు కాగా, ఆ తరువాతి నూతన తరం కథకులందరికీ గత పాతికేళ్ళ గా ఒజ్జబంతులుగా అవతరించిన కథామూర్తి త్రయం - రా వి శాస్త్రి, కాళీపట్నం, బీనాదేవి

1960లలో తెలుగు పాఠకలోకంలో భావ విప్లవానికి దోహదం చేసిన నవలారాజాలలో ఒకటి బీనాదేవి "పుణ్యభూమీ! కళ్ళు తెరు!" సంఘంలోని అన్ని రకాల కుళ్ళును ఎండగడుతూ

యువతలో కర్తవ్య దీక్షను పెంచిన రచన అది ఆయన కథలూ అంతే రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది, రిబ్బను ముక్క, కుంకమ ఖరీదు పదివేలు, పిరికివాడి ప్రేమ, అదృష్టహీనుడు, థాంక్స్ ఫర్ ది పి ఎమ్ (పోస్ట్‌మార్టమ్) కథలన్నిటా వాస్తవ జీవితాలకు అతీతమైన చిత్రణ ఒక్కటీ మనకు కన్పించదు తన స్వప్రయోజనాలకోసం, తన సుఖంకోసం ఎదుటివాడి జీవితం నాశనమైనా పర్వాలేదనుకొనే ధనమదాంధుడి కంఠకావరంతో "నువ్వు జైలుకు వెళ్తే నీ కుటుంబం భారం నేను మోస్తాలె"మ్మని చెప్పే దగుల్బాజీలు మనకు కన్పిస్తారు ఎంత మంచివాడిని కూడా చెడగొట్టే ఎన్నికల వ్యవస్థపై నిరసన ఉంది, దారిద్ర్య బాధను, పిల్లల మనస్తత్వాన్ని, గాయపడిన లేత మనస్సులను ప్రతిబింబించే హృదయ విదార గాథ "రిబ్బను ముక్క" అందులో చిన్నపిల్ల, లేనివాళ్ళపిల్ల లక్ష్మి కోరుకున్నది - నగలూ నాణ్యాలు కావు, పట్టుబట్టలు కావు, బంగారు నగలు కావు, కేవలం ఓ రిబ్బను ముక్క! ఈయన కథల్లో బంగాళా ఇళ్ళముందు వయ్యారంగా వొంగి ఉండే రోడ్లు - భవంతులలో నివసించే వారి జోలికి దరిద్రం రాకుండా దేవుడు గీసిన గిరి గీతలు, లక్ష్మణ రేఖలట!! ఈయన కల్పనలో వెన్నెల రాత్రి వెండి పౌడరు అద్దుకుంటుంది, గోడవాచీలు సమ్మెట పోట్లతో కాలాన్ని సాగకొడుతూంటాయి, మనిషినీ, మానవతనూ విశ్వసించే కథకుడి దృష్టి సౌందర్యపోషకాలపైకీ, ఆభరణాల పైకీ పోదు ఈ విషయంలో ప్రేమ్‌చంద్ "గబన్" నవలద్వారా ఆభరణాలపట్ల మహిళా పాఠకులలో కలుగజేసిన జుగుప్స మనకు కొన్ని బీనాదేవి కథల్లో కూడా కన్పిస్తుంది ఒకచోట ఒకావిడ ఆరు వీశెల బరువున్న నగలు ధరిస్తే, మరొకచోట ఆభరణాల్లో పొదిగిన రాళ్ళు రంగుల పురుగుల్లా కనిపిస్తాయి, "మొగపంజాలకి దూది బొమ్మలై" పోతున్న లోకాన్ని కఠినంగా నిరసిస్తాడు! ఒక్క ముక్కలో చెప్పాలంటే -రా వి శాస్త్రి ఒక సందర్భంలో అన్నట్టుగా "నాలుగిళ్ళ వాకిళ్ళలోనూ, కాలేజీ గరల్స్ షోకుల్లోనూ, భార్యాభర్తల కౌగిళ్ళలోనూ, ప్రేమికుల వియోగాల్లోనూ, "ఎటర్నల్ ట్రయాంగిల్స్" లోనూ, సినిమా స్టూడియోల్లోనూ, సర్కస్ ఫీట్స్‌లోనూ నలిగిపోతున్న ఆంధ్ర పాఠకలోకాన్ని రెక్కపట్టుకొని మిగతా ప్రపంచంలోకి తీసుకురా ప్రయత్నించినవారు బీనాదేవి" నిత్య వ్యవహారాలలో నిగర్వి, సహనశీలి, స్నేహశీలి, చతురులయిన బీనాదేవి అనారోగ్య కారణాలవల్ల తన వయస్సుకు మించిన ముదిమితనాన్ని భరించవలసివచ్చి ఉండవచ్చుగాని, అరవై ఆరేళ్ళకే నూరేళ్ళు నిండవలసిన వ్యక్తి కాదు జడ్జిగా ఆయన ధర్మాసనం అధిష్ఠించింది అధర్మ తీర్పులు చెప్పడానికి కాదు బీనాదేవిలో మానవత్వం పొరలు ఆయన మూర్తిని సంకుచితమైన పరిధులలో బంధించలేకపోయాయి జడ్జి పదిమందిలో కలివిడిగా తిరిగితే తీర్పులు రాయడంలో కలం కుంటుపడుతుందనో లేక ఎవరి ప్రభావానికో లోనైపోతామోనన్న భయమూ, భీతీ, బెదురూ, అదురూ లేనివారు బీనాదేవి!, పదిమందితో కలవడం, సరదాగా చర్చించడం విజ్ఞానంగా భావించిన న్యాయమూర్తి బీనాదేవి ఈ దృష్ట్యా ఆయనను, ఇర్విన్‌కాబ్ రాసిన "ఓల్డ్ సౌత్" కథల్లోని టౌన్ జడ్జి "ప్రీస్ బిల్లీ" పాత్రతో పోల్చుకోవచ్చు!! సుప్రసిద్ధ నవలాకారుడు, ఆంగ్లభాషా నిఘంటువుకు ఎన్నో కొత్త పదాలను ప్రసాదించిన 'మోబీడిక్' రచయిత అయిన హెర్మన్ మెల్ విల్లీ గురించి మిసెస్ హాథార్న్ చేసిన వర్ణన మన బీనాదేవికి ప్రత్యక్షర సత్యంగా వర్తిస్తాయి *"A man with a true, warm heart, and a soul and reverent, very tender, and modest, has keen perceptive power"* ఏ నాటికైనా బీనాదేవి కల నిజమవుతుంది ఈ పుణ్యభూమి కళ్ళు తెరుస్తుంది! ఆగిపోయిన ఆ "రాధమ్మ పెళ్ళి" అయితీరుతుంది!

సెప్టెంబర్ 9, 1990

# మాండలికంలో మాణిక్య దీపాలు

పశువుకొక్క భాష, శిశువుకొక్క భాష, మానవుడికి మాత్రం సంఖ్యానంతపు పలుకుబళ్ళు, అన్న శ్రీరంగం శ్రీనివాసరావు నిర్వచనానికి విలువతెచ్చే "పలుకుబళ్ళ" పర్వం తెలుగు సాహిత్యంలో మొదలై అరుపూవులూ పన్నెండు కాయలుగా ఎదిగివస్తోంది పల్లె జీవనానికి, జానపదుల సుఖదుఃఖాలకు వారి అనుభూతిలోనే, వారి భావనలోనే, వారి యాసలోనే ఒక్కముక్కలో -వారి మాండలిక బాసలోనే బొమ్మకట్టి చూపే రచనల సంఖ్య ఇప్పుడిప్పుడే పెరుగుతూండడం తెలుగు సాహిత్యం ఇంతకు ముందెప్పటికంటే కూడా వైవిధ్యంతో మరింతగా దీపించడానికి మార్గం సుగమమవుతోందనడానికి నిదర్శనం ప్రజల భాషను, జానపదుల మాండలికాన్ని "నీచ" పాత్రల పేరిట, పాత్రోచిత సంభాషణ పేరిట పరిమితం చేయజూచే సాహిత్య మూర్ఖులకు, వారు పెట్టిన మడులకు, దడులకూ కాలం చెల్లిపోయింది ఇది ప్రజాస్వామ్య సాహిత్యయుగం వ్యవహారిక భాషలోనేగాక, మాండలిక భాషను అమితంగా ప్రేమించి దానికి పెద్దపీట వేయడానికి "కన్యాశుల్కం"లో ప్రయత్నించిన ఆదిగురువు కూడా మహాకవి గురజాడేనని చెప్పుకోవాలి ఎందుకంటే "నాది ప్రజల ఉద్యమం, దానిని ఎవరిని సంతోషపెట్టడానికి వదులుకోలేన"ని ఆయన ఢంకా బజాయించింది వ్యవహారిక భాషా వ్యాప్తికి మాత్రమే తన ఉద్యమాన్ని పరిమితం చేయడానికి కాదు, భాషా శాస్త్రవేత్తగా మాండలికాలను కూడా మాణిక్య దీపాలుగా తీర్చిదిద్దడానికి ఆయన ఉద్యమించాడని మరవరాదు గురజాడ పెట్టిన దీపం జాజ్వల్యమానం గాకపోయినా కనీసం ఆరిపోకుండా ఆధునిక కాలంలో మాండలిక భాషకు గౌరవ ప్రపత్తులను ప్రసాదించిన వారిలో మొదటివాడుగా మాధవపెద్ది గోఖలేను, ఆయన గుంటూరు యాసలో పొందుపరిచిన "బల్లకట్టు పాపయ్య" కథలను పేర్కొనాలి మాండలికానికి ఆ తరువాత పరిపూర్ణతను కలిగించడానికి జరిగిన ప్రయత్నం రా వి శాస్త్రి "ఆరు సారా కథలు" ఈ మధ్యలో దాశరథి రంగాచార్య, తిరునగరి రచనల్లో, కథా గమనం మధ్యలో అక్కడక్కడ సంభాషణల్లో మాండలికాలు చోటుచేసుకున్నా జానపదుల పరిపూర్ణ మాండలికాన్ని ఉపయోగించిన కథలూ, నవలలూ ప్రారంభమయింది మాత్రం అల్లం రాజయ్య "కొలిమంటుకున్నాది" రచనతోనే ఆ తరువాత - నేటి తరంలో రాయలసీమ మాండలికాలలో రచనాస్త్రాలను సంధించి అందంగాను, రసనిష్యందంగానూ కలాల జోరు హెచ్చిస్తున్నవారు - నామిని సుబ్రహ్మణ్యంనాయుడు ("సుబ్రమణి"), రామకృష్ణారెడ్డి, పూర్తి తెలంగాణా యాసలో నేటి కథా వస్తువును యథార్థ జీవిత గాథలను జానపద శైలిలో మౌఖిక సాహిత్యానికి సన్నిహితం చేసి జీవద్భాషలో సామాన్య పల్లెవానుల సుఖ దుఃఖాల ఘోషను వినిపింపజేస్తున్న ఉప్పల నరసింహం. కథలెలా రాయాలి, కథనం ఎలా నడపాలి అన్న మీమాంసతో ఎలా రాయాలో చెప్పే "పుస్తకాల"కోసం ఎగబడే వారికి - నామిని "పచ్చనాకు సాక్షి"గా, "సినబ్బ కతలు", రామకృష్ణారెడ్డి "పెన్నేటి కతలు", ఉప్పల"తిరగబడ్డ భూమి", "ముద్ర" ఓనమాలు కావాలి! ఆ ముడిపదార్థం నీ చెలకలోనే ఉంది, నీ భూమిలోనే ఉంది, నీ జనం గొంతులోనే ఉందని బోధిస్తున్న, గుబాళిస్తున్న మాండలిక మధుర వీచికలవి! రచయితలు నేలతల్లి బిడ్డలయితే తప్ప ఆ తల్లి ఉసురూ, ఆ అమ్మ ఊసూ తెలిసిన వాళ్ళయితే తప్ప ఈ రచనలు చేయలేరు

అయితే వీరిలో కొందరి దృష్టి వ్యక్తి నిష్ఠంకాగా, ఇంకొందరిది సమష్టి చింతన కావడం గమనించదగిన భేదం ఒకరికి ఎంతసేపూ అమ్మ, నాన్న, వారి భూమి, వారి బతుకుచుట్టూ

మాత్రమే కథా వస్తువు తిరుగుతుండగా, ఇంకొకరిది గ్రామ జీవనం, అందులోని సొగసులు, ప్రకృతి కరుణా కటాక్షం మధ్య పేదసాదల బతుకులు, ఆ సన్నకారు బతుకుల్లోని మిట్టపల్లాలు, సేద్యంలో యాతనలు ప్రధాన కథా వస్తువు నామిని "పచ్చనాకు సాక్షిగా", సినబ్బకతలు, రామకృష్ణారెడ్డి "పెన్నేటి కతలు" రాయలసీమలోని చిత్తూరు, కడప గ్రామ సీమలలోని రైతుల, వ్యవసాయ కార్మికుల, కష్టజీవుల బతుకులకు ఆయా ప్రత్యేక మాండలికాలలో సాగిన అనితర సాధ్యమైన వాక్చిత్రాలు! పచ్చనాకు సత్యానికి మారుపేరు ఆకు, జీవితం ఉదయ - సంధ్యలకు ప్రతీక అయితే - 'పచ్చనాకు' మోడుబారిన జీవితాలను ఏనాటికైనా చిగురింపచేయాలన్న తపనకు కల్పించిన అక్షర రూపం "నా సామిరంగా నేనే ముఖ్యమంత్రినైతే, నామినిని విద్యామంత్రిని చేస్తానన్నాడు" ఒకనాడు బతికున్న రోజుల్లో "ఎమ్మెల్యేఎల్"! అలాటి నామిని చెప్పిన కుటుంబ గాథలే, తన 'ఇస్కూలు' రోజుల కతలే "పచ్చనాకు సాక్షిగా", సినబ్బ కతలు తల్లి ఒడిలో గారంగా, తండ్రికి ముదిగారంగా, నేలతల్లికి బంగారపు సేద్యగాళ్ళుగా ఉన్నారు గనుకనే నామిని, రామకృష్ణారెడ్డి "నిజ్జంతో, పచ్చనాకు సత్తెంతో" బతుకు పుస్తకాలు విప్పి మనముందు పరిచారు! విద్వాన్ విశ్వం పెన్నేటి పాటకడితే, రామకృష్ణారెడ్డి పెన్నేటి కతలతో కడప మాండలికానికి దీపార్చనలు చేశాడు పెన్న రాకడ పెరుమాళ్ళకెరుకని చెప్పి, నీళ్ళొచ్చినప్పుడు అంత పరాయిదయపోయే పెన్న నిమ్నోన్నతాలనూ కళ్ళకు కట్టి చూపాడు ఎకరాలు ఎన్నున్నా తినడానికి గడవక జొన్న అన్నం, ఉల్లికారంతో సరిపెట్టుకున్న వాడు కాబట్టే రామకృష్ణారెడ్డి ఈ పెన్నేటి కతలు చెప్పగలిగాడు వాస్తవికతను, హాస్యాన్నీ ప్రజల జీవన రాగం వినిపించడానికి చాకిరీలుగా వీళ్ళు మలిచారు! ఈ కోవకు చెందినవే - నామిని "ఊపిరిపోయిన ఊదోడు", "ఇదంతా నా కడుపు మంట", మా ఆవు వంటిదే మా అమ్మ, కట్టె ఇస్కూల్లో మనసు బంక చేనులో, రామకృష్ణారెడ్డి "ఎర్రి పన్నేరు" 'సిత్రాట', బట్టి కోడె, సేద్యంకన్న పద్యం గొప్పదా?, ఈ పక్క పారే ఏరు, ఆ పక్క పండే పైరు, వలగలమ్మ దున్నపోతు, ఆకలి గురువులు, తూరుపునాటి కూలోళ్ళు, ఉప్పల "కురుస బొమ్మల సందున కుంకమ బొట్టు", ఎడ్డిపిల్ల లచ్చిమి జడల ఎర్రరిబ్బను, కట్టె పుస్తెలు కట్టిపిచ్చిండు, ఎట్టిచాకిరి చేపిచ్చిండు, వగైరా బతుకు కతలు! "స్కాటిష్ స్టోరీస్" సంపుటికి పరిచయం రాస్తూ హాగ్రే, కొందరు ప్రయోగ వైచిత్రిలో పరవళ్ళు తొక్కడానికి ఉద్యమిస్తున్నారని రాశాడు ఆ వర్ణన వీరిపట్ల కూడా అక్షర సత్యం!

వైవిధ్యం కోరేవాళ్ళు మాండలికాలలోని సొగసులను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి, అలవాటు పడాలి సంస్కారం పేరిట ఎదిగివచ్చేది సాహిత్య భాష అయితే సాదరంగా గుండె గొంతుకలో పలికించేది మాండలికం భాషలన్నింటికి ఆదిబాన, బాసలన్నింటికీ ఆది 'యాస' - మాండలికం మాండలిక భేదాలే మానవుని తొలి పలుకుబళ్ళు సౌధ భారం దాని పునాదికి తెలిసినట్టే, నాగరిక భాషల పుట్టుక వాటి ఎదుగుదలకు పునాదులెత్తిన మాండలికాలకు తెలుసు వైవిధ్యం, రూపాంతరాలూ వాటికి సహజా లంకారాలు ప్రామాణిక భాషకు అందని అందచందాలను ప్రాచీన ప్రాచ్యంలోని సుమేరియన్లు, అస్సీరో - బాబిలోనియన్లు, ఈజిప్షియన్లు, సింధునాగరిక జాతుల మాండలికాలేగాక, గ్రీక్, జర్మన్, సిసిలియన్ మాండలికాలు కూడా "భాగ్యరాశులు"గా పండించిన రోజులున్నాయి ఒక ప్రత్యేక ప్రాంతపు మాండలికాన్ని ఈస్ట్ మిడ్‌లాండ్ మాండలికాలలో తీర్చిదిద్దడమేగాక, దానిని విద్యావంతుల భాషగా వ్యాప్తిచేసిన ఘనత ఇంగ్లాండ్ కవి చాసర్‌ది అతను మాండలికాల్లోనే

కవితలు కుప్పించాడు స్కాటిష్ కవులు ప్రామాణిక భాషను వాడడానికి ఆదిలో చాలారోజులు నిరాకరించారు! ఇంగ్లీషు సాహిత్యంలో "అర్‌షైర్" *(Ayrshire)* మాండలికాన్ని జయప్రదంగా ప్రయోగించి, మెప్పించిన ఖ్యాతి రాబర్ట్ బరన్స్‌కు దక్కింది కనుకనే అతడు గురజాడకు నచ్చిన కవి కూడా కాగలిగాడు! గ్రామీణ జీవితంపై విలియమ్ బార్నీస్ రాసిన కవితలన్నీ "డోర్సెట్" మాండలికంలోనే ఉన్నాయంటారు అలాగే మాండలికంలో శక్తివంతంగా నవల నడిపిన వారు తామస్ హార్డీ, డికెన్సు, లారెన్సులు! కథలలో మాండలికాల సొగసులను మెచ్చుకున్న వాడు డేవిడ్ లాడ్జ్ *("Language of fiction")* మన శౌరసేని, మాగధి, ఆంధ్రి, శాకారి, అర్ధమగధి - భాషలుగా, విభాషలుగా వెలుగు చూచిన మాండలికాలే తెగల పుట్టుకకు, మాండలికాల ఎదుగుదలకూ సంబంధం చెరపరానిది కాకపోతే కాలచక్రంలో స్థిరనివాసంకోసం తాపత్రయంలో వలసల రూపంలో ప్రజలు సాగించిన మహాప్రస్థానాల ఫలితంగా గొప్ప గొప్ప తెగల మాండలికాలు అనేకం అంతరించిపోయాయి ఫ్రెంచి వారి మహేతిహాసంగా చెప్పే *"The song of Roland"* కు ఉద్దీపన మాండలికమే! డెన్మార్క్ నుంచి నార్వే విడిపోయినప్పుడు వారి మిశ్రమ భాష నేటి జాతీయ భాష "రిక్‌స్మాల్"కు పునాది అయింది! అన్ని స్థానిక మాండలికాల మధ్య సమన్వయం సాధించి సామాన్య జాతీయ భాషగా "లాండ్‌స్మాల్" పేరిట ఏకైక సాహిత్య భాషగా రూపొందించాలని ప్రయత్నించినవాడు నార్వే భాషా తత్వవేత్త ఐవర్ ఆసెన్

ఏప్రిల్ 15, 1990

# అనగనగా......

"అనగనగా ఓ రాజు, ఆ రాజుకి ఏడుగురు కొడుకులు " ఈ కథ చెప్పని అవ్వ, అమ్మ ఎక్కడా ఉండరు విశ్వకథకు విత్తనం వేసిన వారెవరు అన్న ప్రశ్నకు తృప్తికరమైన సమాధానం ఎక్కడా దొరకదు ఆదికవుల గురించి, ఆది కథకుని గురించీ అభిమానంతో, అభిజాత్యంతో మనం అతిగా ఆలోచించి ఎవరికి తోచిన అర్థం వాళ్ళు తీసుకొనకపోతే - విశ్వకథా వీధిలో వీరవిహారంచేసిన, చేస్తున్న కథక చక్రవర్తులెందరో, ఎందరెందరో! విశ్వకథకు మూలం విష్ణుశర్మ, పంచతంత్రమా? పేదరాశి పెద్దమ్మ కథలా? హాలుని గాథాసప్తశతా, గుణాఢ్యుని బృహత్కథా? క్షేమేంద్రుని బృహత్కథా మంజరా (కథాసరిత్సాగరం)? అదీ ఇదీ కాదు భారత, రామాయణగాథలే విశ్వకథా స్రవంతికి కూడా ఆకారాలా? లేక అనవాళ్ళా? వేదాంతాలైన ఉపనిషత్తులా, అందులో భాగమైన బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు - మైత్రేయకి, అతనికీ గార్గికీ మధ్య జరిగిన వాదసంవాదాలే విశ్వకథా సృష్టికి బీజాలా? 'విత్తుముందా, చెట్టుముందా' అన్న ప్రశ్నకు సమాధానం స్పష్టమైననాడు విశ్వకథకు మూలం కూడా కూలంకషంగా తెలిసివస్తుంది! బైబిల్‌లో చెప్పిన మానవుని జననవృత్తాంతంలో "ఆదాము - అవ్వ"లచేత "జ్ఞానవృక్షాని"కి కాసిన పండును తినిపించడానికి జరిగిన ప్రయత్నం కూడా మానవకథకూ, మానవుడు సృష్టించిన కథకూ మూలంగా చెప్పుకోవచ్చు "ట్రీ ఆఫ్ నాలెడ్జి" అంటూ అసలు ఉందా? ఉంటే బోధివృక్షమే జ్ఞాన వృక్షమా? తొలికథకు మూలం ఊహ ఊహాపోహలకు ఉసురూ, ఉప్పూ తిరిగి మానవుడూ, అతని పరిసరాలే కనుకనే ఆ "జ్ఞానవృక్షా'న్ని తొలి చిత్రకారులు - ఒకరు యాపిల్ చెట్టుగానూ, మరొకరు అంజూర ఫల మూలంగానూ, ఇంకొకరు ముంతమామిడిగానూ, వేరొకరు అరటి చెట్టుగానూ వర్ణించారు! అలాగే "జీవన వృక్షం" (ట్రీ ఆఫ్ లైఫ్) గురించిన కథలూ పురాణాలు పుట్టిందీ, కథలకు కాళ్ళొచ్చిందీ, ముంతలకు చెవులొచ్చిందీ ఊహాశక్తివల్లా, కల్పనా యుక్తివల్లా కనుకనే ఎప్పటికీ కథకంచికిపోదు, కథకుడు ఇంటికి చెరడు! ప్రపంచ ప్రసిద్ధ ఈసఫ్ కథలలో మానవుడి ఈ ఊహా శక్తిని, కల్పనాశక్తినీ పెంచే నాలుకను గురించి ఓ విచిత్రమైన వ్యాఖ్య ఉంది మనిషి నాలుకకంటే చెడ్డది ఈ లోకంలో మరేముంటుంది? నాలుక పాలు పంచుకోని దుర్మార్గం, పాపం ఈ ప్రపంచంలో ఏముంది గనుక? ద్రోహాలు, కుట్రలు, దౌర్జన్యాలు, అక్రమాలు, అన్యాయాలు, మోసాలు -అన్నింటికీ ఈ నాలుకే కేంద్రం సామ్రాజ్యాలు, నగరాలు, నాగరికతలూ వ్యక్తిగత స్నేహాలూ కుప్పకూలిపోవడానికి అదే హేతువు అని ఈసఫ్ అంటాడు! మానవుని ఈ చేష్టల మంచి చెడులను, వైభవ పతనాలను తిరిగి మానవుడికి అద్దంలా చూపించేదే, ఉండంత మాటలో కొండంత భావాన్ని చిప్పిల్లజేసేదే కథ, విశ్వకథ, బుల్లికథ నేటి కథకులందరూ "లవకుశులే"నని చెప్పాలి! ఎందుకంటే పురాణ కల్పన స్థాయిని దాటి మానవ పురోగతికి చెందిన అన్ని దశలనూ, అది ప్రయాణించే అన్ని దిశలనూ వర్ణచిత్రాలుగా అందజేస్తున్నాయి నేటి విశ్వకథలు సమకాలీన సమాజం, సంఘప్రవృత్తి, రాజనీతి, రాజ్యవ్యవహారాలూ, ఒక్క మాటలో లోకవృత్తాంతం - కవికీ, కథా రచయితకూ ముడిపదార్థం సోమర్‌సెట్‌మామ్, నవల ఎంత పెద్దదైనా జీవితానికి పరిపూర్ణ రూపం కాజాలదన్నాడు! ఇక కథ లేదా కథానిక సంగతి చెప్పనక్కరలేదు. కానీ, ఒక్క వ్యక్తి కేంద్ర బిందువుగా కాకుండా సంఘ పరిస్థితిని "ఫ్లాష్ పాయింట్"గా కథకుని తాత్త్వికధోరణిని శక్తివంతంగా అనితర సాధ్యంగా

ఆవిష్కరించగల మెరపుదాడి ఒక్క కథకు మాత్రమే చెల్లుతుంది ఎత్తుగడ, నడకతీరు, ఆద్యంతాలు, వస్తువిన్యాసం, విజ్ఞానం, వికాసం, వినోదం, వేదన, సంవేదన - కథక చక్రవర్తి నివేదనకు ఆరాధ్యదైవాలు ఇలా విశ్వకథా సాహిత్య వీధులకు చేరుకున్న, చేరుకొనగల స్థాయిగల తెలుగు కథలూ, కథకులూ ఉన్నారు పాశ్చాత్య సాహితీ రంగంలోని ఆధునిక రచనా వైచిత్రితోపాటు తెలుగువాడు విశ్వకథ మలుపులను కూడా తిప్పగల 'విష్ణుశర్మ'గా అవతరించాడు! ఈ కథా యజ్ఞంలో ఒకరికొకరు తీసిపోనివారు - గురజాడ, శ్రీపాద, భమిడిపాటి, చింతా, కొడవటిగంటి, పాలగుమ్మి, రా వి శాస్త్రి, కాళీపట్నం రామారావు, పురాణం, బుర్రా సుబ్రహ్మణ్యం, మా గోఖలే కా రా "యజ్ఞం", రాచకొండ "ఆరుసారా కథలు", నామిని "పచ్చనాకు సాక్షిగా", సినబ్బకతలు - ఈ కథావీధి ఎవడబ్బ సొమ్మురా అని విశ్వసాహిత్యాన్ని నిలదీసి ప్రశ్నించగల కలికి తురాయిలు! 'గాలివాన"కూ "నీలి" రచనకూ నీటుగా దీటురాగలిగిన, ఆ మాటకొస్తే వాటిని అధిగమించి కూడా విశ్వకథా లోగిలిని తట్టగల దిట్ట కథలు బుర్రా సుబ్రహ్మణ్యం - "జేబురుమాలు" ,పారిస్ రచనలు

సరిగ్గా నేటికి ముప్పై అయిదేళ్ళనాడు పురిపండా అప్పలస్వామి తెలుగువాళ్ళ కోసం ఆణిముత్యాల్లాంటి 36 కథలను సంపుటికి ఆరుకథల చొప్పున ఆరు సంపుటాలలో "విశ్వకథా వీధి" మకుటంతో ప్రసిద్ధ ప్రపంచ కథకులను పరిచయం చేశారు ఇండియా సహా 20 దేశాల ప్రసిద్ధుల కథలను అందులో చేర్చారు, భారతదేశంలో కూడా హిందీ, గుజరాతీ, హిందూస్థానీ, మహారాష్ట్ర, బెంగాలీ కథలను "విశ్వకథా వీధి"లో చేర్చగలిగిన పురిపండా తెలుగు కథను ఎలా విస్మరించగలిగారో అనూహ్యం అయితే బహుశా ఆయన "విశ్వకథా వీధి"ని ఆరు సంపుటాలకే పరిమితం చేసుకోకుండా మరికొన్ని సంపుటాలను కూడా వెలువరించడానికి ప్రణాళిక వేసుకొని ఉండవచ్చు , అయితే వచ్చిన ఆరు సంపుటాలలో ప్రచురించిన కథలు సంవిధానంలో, సత్య ప్రతిపాదనలో ప్రతిపద మధురంగా సాగిపోతాయి, అనువాదం అనిపించుకోని, తెలుగుకథల్లా నడిచిన రచనలవి ఇందులో శరత్, ప్రేమ్‌చంద్, దొండకర్‌లాంటి భారతీయ కథకులు సహా మపాసా, గోర్కి, చెహోవ్, తింగ్‌లింగ్, పిరడెల్లో, ఎడ్గార్ అలెన్‌పో, లూసన్, జేమ్స్‌జాయిస్, హెచ్ జి వెల్స్ కాపెక్, కాథరీన్ మాన్స్ ఫీల్డ్, ఎడ్మండ్ జులో లాంటి చేయి తిరిగిన ఉద్దండుల కథలున్నాయి. వాస్తవ జీవితంపై ఆధారపడిన కల్పనాశక్తిని వేనోళ్ళ మెచ్చుకొన్న సుప్రసిద్ధ రచయిత ఇర్వింగ్‌హో "కథలు, చిన్న కథలు రాసేవాళ్ళు ధైర్యస్థయిర్యాలు మూర్తీభవించిన వాళ్ళయి ఉండాలి" అన్నాడు వాస్తవ జగత్తు పరిధులలోనే వారి కల్పనాశక్తి ఖడ్గధారగా సాగాలన్నాడు! *"They stake everything on a stroke of inventiveness . The voice of the writer brushes against his flash of invention"* అన్నాడు! లిప్తకాలంలో మానవుని అన్ని చేష్టితాలు కళ్ళముందు ఆవిష్కరించుకొన్నదే మంచికథ అన్నాడు కథాసంపుటిని మూసిన తర్వాత కూడా అందులోని ప్రతి కథా మన చెవుల్లో ప్రతిధ్వనించినప్పుడే సామాజిక పరిస్థితులకు, వాస్తవాలకు ప్రతిస్పందిస్తూ, వాటిని ప్రతిబింబిస్తూ మనస్సులకు మేల్కొల్పులు పాడినప్పుడే కథకు సార్థక్యం అన్నాడు స్టీఫెన్ కాన్సర్. పురిపండా "విశ్వకథా వీధి" సంకలనం (1955), ఇర్వింగ్ హో, ఇలానా షో ఆంగ్లంలో సంకలన పరిచిన బుల్లికథల అద్భుత గ్రంథం "షార్ట్ షార్ట్స్"కు (1982) ఏమాత్రం తీసిపోదు! మన కేతన "కవులు గానని మర్మంబుకలదే జగతి" అన్నాడుగాని, కథకుల కళ్ళుగప్పి సాగే లోక వృత్తాంతం కూడా ఏదీ లేదని నిరూపిస్తున్న ఉత్తమ కథామంజరి *"Short Shorts"* రాండల్ జారెల్ పొందుపరిచిన "ది

యాంఖర్ బుక్ ఆఫ్ స్టోరీస్" తర్వాత ఇలాంటి పరిశుద్ధ సంకలనం రాలేదంటాడు వాల్టర్ క్లైమన్స్ మార్సెల్ ప్రౌస్ట్ రాసిన "గత స్మృతులు" *("Remembrance of Things Past")* రచనను ఈ శతాబ్దపు మహానవలగా మరికొందరు భావిస్తే, హెన్రీ రిచర్డ్సన్ రాసిన "మారిస్ గెస్ట్"ను సంగీతప్రియులు మాత్రమే నచ్చే మెచ్చే మేటి నవలుగా మరికొందరు పేర్కొంటారు కానీ, కథనాన్ని కవన ఝురిగా నడిపించగల ప్రపంచ కథక చక్రవర్తి మపాసా ఆ ఛాయలు మళ్ళీ తెలుగునాట రా వి శాస్త్రి కథలలో మాత్రమే కనిపిస్తాయి "సమాధినుండి" అన్న కథలో మపాసా చెప్పిన మాటలు కూడా మనకు శిరోధార్యాలే అందులో ఎంత వ్యంగ్య వైభవం అద్దంవలె గడచిన ప్రతిబింబాలూ, ఉద్రేకాలూ, అభిమానాలూ, ప్రేమలూ అన్నీ సమూలంగా తుడుచుకు పోగలిగిన హృదయమున్న మానవుడు అదృష్టవంతుడు సమాధులపై తమ బంధువులు తమ గురించి రాసిన అబద్ధాలు, అసత్య ప్రశంసలు చెరిపివేసి అందరూ (మృతులు) సత్యం రాస్తున్నారు చూశాను ఉత్తములూ, న్యాయవంతులూ, స్వార్థత్యాగులు, ధర్మాత్ములు, సత్యవంతులు అని కీర్తిపొందిన ప్రతీవాళ్ళూ ద్రోహులు, దొంగలు, ఘాతకులు, హంతకులు, అబద్ధాల కోరులు, వ్యభిచారులు, కపటులూ, మోసగాళ్ళూ జగమంతా ఎరిగిన సత్యం, ఎరిగీ ఎరగనట్లు నటించే సత్యం, భయంకరమైన సత్యం, చిత్రమైన సత్యం, మృతకళేబరాలు మాత్రమే వ్యక్తం చేసే సత్యం!! వాస్తవికతకు అద్దంపట్టే ఈ విశ్వకథలన్నీ - "విమలభూరి సుగంధ విశేష పేటికల్"!! కావా మరి?

ఆగస్టు 26, 1990

# "క్రాస్ రోడ్స్"లో కలిసిన 'కథా' శివరావు!!

ఒక దేశపు సాంఘిక వ్యవస్థ వైభవ పతనాలకు ఏది కొలబద్దో చెబుతూ జాన్ రస్కిన్ మా గొప్పగా నిర్వచించాడుః "సాంఘిక వ్యవస్థ వైభవానికి అగ్ని పరీక్ష-సమాజంలోని ఏ కొలదిమంది కోసమో సమకూర్చిపెట్టే సంపద కానేకాదు, ఎలాంటి పౌరుల్ని, ఎలాంటి మానవానుభవాల్ని ఆ వ్యవస్థ అందించి వారిని దిద్దితీర్చుతుందన్నది ప్రధానం"! ప్రజాబాహుళ్యంలో అలా నూటికి తొంభైమంది ప్రయోజనాలను ఆశించి, ఏ మార్గం అయితే ఈ దేశ ప్రజలను దరిచేర్చగలుగుతుందో ఆ వ్యవస్థవైపు పౌరులు నడవాలన్న వాంఛకల రచయితలలో ఒకరు సదాశివరావు కథల రూపంలో ఆయన జరిపిన సత్యాన్వేషణకు మారుపేరే "క్రాస్‌రోడ్స్" ఇది ఏ చార్మినార్ క్రాస్‌రోడ్సో, ఆర్ టి సి క్రాస్‌రోడ్సో కాదు! భారత చరిత్రను మలుపు తిప్పడానికి దోహదంచేసిన ఒక సంధి యుగానికి సదాశివరావు రచన అద్దం పడుతోంది ఆ 'సంధియుగం' పేరు క్రాస్‌రోడ్స్ రెండువందల ఏళ్ళ పరాయి పాలనలో మగ్గిన భారత ప్రజలు, ముఖ్యంగా సంస్థానాల ప్రజల రాచరిక వ్యవస్థను, దానిని అంటిపెట్టుకుని పెత్తనం చెలాయించిన అరాచకపు వ్యవస్థను, బ్రిటిష్ సామ్రాజ్యపు దొరల పెత్తనాన్ని వదిలించుకోవడానికి పడిన ఆవేదనను 'కథా' శివరావు ఇందులో ఆవిష్కరించారు సంస్థాన ప్రజల సుఖదుఃఖాలను, ఇంగ్లీషు ఆఫీసర్ల పైలాపచ్చీసు జీవితాన్ని, రాజుల సరదాలను, మృగయావినోదాన్ని అద్భుతమైన సంవిధానంతో మేళవించి పాఠకులను ఉక్కిరి బిక్కిరి చేసే వర్ణనలకు సదాశివరావు పెట్టింది పేరుగా ఈ సంపుటిలో కనిపిస్తారు అంతేగాదు, మారుతున్న విలువలను అంచనా వేయడంలో, తరాల మధ్య అంతరాలను పాత్రోచిత సంభాషణలద్వారా అలవోకగా వెలార్చిన ఘట్టాలు కూడా అద్వితీయం ఆంగ్లభాషా పరిచయం అంతగా లేనివారికి ఈ కథలు కొంతవరకు కొరుకుడు పడనిమాట నిజమే, అయినా సదాశివరావు ఎంపిక చేసుకున్న సంధియుగ లక్షణాలు (భాషలో, భావంలో, వేషంలో ఆడంబరాలు, నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్వాలన్న తహతహ) అలాంటివి మరి అందువల్ల రచయితను తప్పు పట్టేకన్నా ఆయా చారిత్రక సన్నివేశాల పూర్వరంగంలో ఈ కథల వైశిష్ట్యాన్ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించాలి సదాశివరావు కథాకథనం అందమైన తెలుగు స్పృహతో కూడా నడిచింది క్రాస్‌రోడ్స్" లోని 16 కథలూ పదహారు ఆణిముత్యాలు ఆనాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిణామాలకు, ఉత్పాతాలకు, ఉన్మాదాలకు, ఉద్యమ స్ఫూర్తికీ ఇవి కీర్తి కిరీటాలుగా ఉన్నాయి ఆనాటి బ్రిటీష్ ఆఫీసర్లలో భారతదేశంలో ఇంగ్లీషు వాళ్ళ పరిపాలన గురించి ఏర్పడుతున్న విభిన్న అభిప్రాయాలు--ఒకవర్గం దేశానికి స్వాతంత్ర్యం ఇచ్చి క్రమంగా తప్పుకొవాలన్న భావనను బలపరచగా, వేరొక వర్గం భారత వలసకు తాము శాశ్వత పాలకులమన్న అహంభావాన్ని ప్రదర్శించింది జలియన్‌వాలా బాగ్ దురంతాలకు కారకుడయిన డయ్యర్‌లాంటివారే అందరు ఆంగ్లోద్యోగులూ కారు, ఇండియాకు స్వాతంత్ర్యాన్ని మనసారా కోరిన ఆంగ్లేయ అధికారులు కూడా ఉన్నారు. అలాగే భారతీయ జీవనంలో కలగలసిపోయి భారత సంస్కృతీ సంప్రదాయాలను మెచ్చుకొన్నవారూ ఉన్నారు. మనది కేవలం సోమరిపోతులను పెంచి పోషించే 'కర్మ'సిద్ధాంతాన్ని ముందుకు నెట్టి దేశాన్ని, ప్రజలను నిర్వీర్యపరిచిన సంస్కృతిగా భావించినవారూ ఉన్నారు. ఈ ఇరు వాగుల వారి మధ్య సమన్వయ సాధన ఫలితమే సదాశివరావు కథా విన్యాసాలు! స్మృతుల వరదలుగా పొంగి పొరలిన ఈ కథా స్రవంతిలో

చరిత్ర ఉంది, సంస్థాన ప్రజల సంఘజీవనం ఉంది, బాధల పల్లవి ఉంది ఎన్నో భౌగోళిక సత్యాలు మూటగట్టుకున్నాయి, తాత్త్విక చింతన పూసల్లో దారంలా సాగిపోయింది, రచయిత ప్రత్యక్షంగా కనపడకపోయినా పాతతరాల చేష్టలకు విరుగుడుగా, యువతరానికి ఆదర్శంగా, మారుతున్న విలువలలో మంచి చెడులను తర్కించి నవనీతంగా దించిన నీతిబోధలూ ఇందులో ఉన్నాయి ఈయన ఆంగ్లో-ఫైల్ మాత్రమే కాదు, 'తెంగ్లో ఫైల్' కూడా అని చెప్పవచ్చు (తెలుగు-ఇంగ్లీషు జమిలిగా సాధికారంతో, చాకచక్యంతో, అంతకు మించిన సామర్థ్యంతో కథాక్రమానికి వన్నె తెచ్చారు)!

ఈ కథలు చదువుతున్నప్పుడు సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత నాథానీల్ హాతోర్నీ రాసుకున్న 'నోట్ బుక్స్' గుర్తుకొస్తుంది, లడ్విన్ విటెన్‌స్టీన్ ఏమన్నాడు? *The limits of my language mean the limits of my world* అన్నాడు అందుకని సదాశివరావు కూడ ఆ పరిమితులు పెట్టుకోలేదు అలా అని ఆంగ్లభాషను అపరిమితంగానూ వాడలేదు, ఇంగ్లీషు నుడులతోపాటు తెలుగు నానుడులనూ అంత సమర్థనీయంగానూ ఉపయోగించారు ఉదాహరణకు ఒకనాటి వైస్రాయి అయిన లార్డ్ రీడింగ్ కాలంనాటి ఢిల్లీ నగర జీవనాన్ని, కాలాన్ని , లోకాన్నీ, చరిత్రనీ అధిగమిస్తూ ఎన్నో తరాల పాలకులనూ, పాలితులనూ చూసిన ఆ నగర సంస్కృతిని సదాశివరావు చారిత్రక దృక్కోణంనుంచి ఇలా వర్ణిస్తాడు: "ఈ నేల పొరల్లో చరిత్ర కలిసిపోయి ఉంది ఈ భూమి పొరల్లో నెత్తుటి వరదల తడి ఉంది, ఆక్రోశాల ప్రతిధ్వని ఉంది ఇన్వేడర్స్ గుర్రపు డెక్కల శబ్దాలు ఈ నగర వీధుల్లో మారు మ్రోగుతూనే ఉంటాయి ఓరియంటల్ వైభవానికి ఇది మచ్చు తునక ఇక్కడ హృదయ రహితమైన ప్రభుత్వ సంస్కృతికి పరాకాష్ఠ. నంగిరి మాటలూ, దొంగ మర్యాదలూ, ఎత్తులూ, వెన్నుపోటులూ, విద్రోహాలూ, జీవన రహితమైన శుష్క ఆచారాలూ, పద్ధతులూ ఈ నగర సంస్కృతిలోని ముఖ్యభాగాలు" అన్నప్పుడు ఇప్పటికీ ఆ కాపట్యపు వాసనలు, ఆ కుట్రలూ ఇంకా ఇంకిపోలేదేమో అనిపిస్తుంది!! ఆంగ్ల సాహిత్యంలో లబ్ధ ప్రతిష్ఠుడైన ఎమర్సన్, న్యూఇంగ్లండ్ వైభవ పతన దశల్లోని వెలుగును మాత్రమే చూపి, నీడను చీడగా భావించి దానిని దాటవేశాడంటారు విమర్శకులు, అలాగే హాతోర్నీ వెలుగు నీడల్లో కేవలం నీడను మాత్రమే చూశాడు! కథారచన సమగ్రతను సంతరించుకోడానికి వెలుగునీడలు రెండూ కలానికి రెండు కళ్ళుగానే ఉండాల్సి వస్తుంది ఈ సమన్వయ సాధనలో కథాశివరావు సదా సఫలుడయ్యాడని చెప్పుకోవచ్చు! ఘట్టాల ఎంపిక, సంఘటనల పొందిక, సంభాషణ తీరు, వాక్య విన్యాసాల జోరూ--కమ్మెచ్చులాగినట్లు ఉన్నాయి. కొన్ని చారిత్రక సన్నివేశాలు ఆధారంగా ఆయాకాలాలలో ప్రజల జీవన విధానాన్ని లేదా దోపిడీ వర్గాల, ప్రజాకంటకుల పాత్రను వర్ణించడంలో వట్టికోట ఆళ్వారుస్వామి (ప్రజల మనిషి, గంగు), దాశరథి రంగాచార్య (చిల్లరదేవుళ్ళు, జనపదం, మోదుగుపూలు) నేలతల్లిబిడ్డలుగా స్పందించారు కథావిష్కరణలో తరచుగా పాఠకుడికి ఇంగ్లీషు భాషణ అడ్డురాదనుకుంటే సదాశివరావు కథలు కూడా అంతస్ఫూర్తి కలవేనని అంగీకరించవచ్చు సిద్ధహస్తులైన రచయిత కాలాతీతమైన జీవనాన్ని, జీవన పరిస్థితులను ఎలా బొమ్మకట్టి చూపించగలడో ప్రసిద్ధ కథారచయిత జాన్ స్టీన్ బెక్ చెప్పాడు ప్రకృతికి ఉదయం, మధ్యాహ్నం, రాత్రి అంటూ ఎలా కాల విభజన ఉంటుందో, మనిషికి జననం, వృద్ధి, మరణం ఎలా ఉంటాయో అలాగే కథకు ఆది, మధ్యం, అంతం అనే మూడు దశలూ ఉంటాయి. ఈ కాలజ్ఞానంతోనే కథకుడు రచనా పరిమితులను ఎంపిక చేసుకుంటాడు పాత్రోచితంగా పదసృష్టిచేస్తాడు, దయతో ఎప్పుడు

వ్యవహరించాలో, కారిన్యం ఎప్పుడు ప్రదర్శించాలో అతనికి తెలుసు రుచీ,అభిరుచీ అతని చేతి ఎత్తు బిడ్డలు స్టీన్ బెక్ అన్నట్టుగా *'A writer lives in awe of words for they can be cruel or kind they pick up flavours and odors like butter in refrigerators'*

మన సదాశివరావు ఆయా కాలాల చారిత్రక సాంఘిక శక్తులను అర్ధంచేసుకొని పాత్రలను మలచడంలో, స్పృహతో తగిన స్ఫూర్తిని కల్పించడంలో డాస్ పాసోస్ లాంటివాడు అతనికున్నంత ఆత్మవిశ్వాసం ఈయనలోనూ ఉంది, కాన్‌రాడ్ ఎకెన్‌లో ఉన్నంత యువపేశలత ఉంది, జాన్ బెరీ మాన్‌లాగా నివురుగప్పిన నిప్పులా, తొణకని బెణకని (ఉద్యోగ రీత్యా పోలీసు అధికారి కూడా అయినందున) నిండుకుండలాంటివాడు సదాశివరావు! ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడూ, కథకుడూ ఎమిలీ జోలా కథారచనలో చారిత్రక ఘట్టాల వర్ణనలో అతి సహజమైన "డాక్యుమెంటరీ నాచురలిజా"న్ని ప్రవేశపెట్టిన తొలితరం రచయితలలో ఒకరు ఆ శక్తి 'కథా'శివరావుకూ ఉందనిపిస్తుంది! ఎప్పటికప్పుడు యువత్వం, నవత్వం, నిర్మలత్వం, మానవత్వంతో కూడినదే సాహిత్యం అంటారు పెద్దలు ఆ శక్తి "క్రాస్‌రోడ్స్" లో మీకు దొరుకుతుంది! కులవ్యవస్థపైన, మనం ఎదగకుండానే ఇంగ్లీషువాడి సంపర్కంతో వచ్చిన కొన్ని పనికిమాలిన సంప్రదాయాలపైన సదాశివరావు చరిచిన చరుపులు రచయిత సామాజిక దృష్టికి నిదర్శనాలు ఆయన మాటల్లోనే "సమాజంలో ఊడలు పాతుకుని ఉన్న కుల ప్రాతిపదికకి సమాంతరంగా రూపొందిన దష్ట సంప్రదాయాలు భయానక విలువలు, ఈ దేశాన్నీ ప్రజల్నీ శాశ్వతంగా ముక్కలు చేయడానికి సహాయపడే సామాజిక సూత్రాలు! చావును గజ్జికుక్క తప్పించుకోగలిగింది కాని, సమాజాన్ని మోసగించే "తాంత్రిక్ స్వామి" తప్పించుకోలేడు! "కష్టానికి ఫలమేమిటి? ఆలోచనకి విలువేమిటి? జీవితంలోని ఒడిదుడుకులు, సామాజిక చారిత్రక కారణాలవల్ల జనించేవి అయితే గ్రహాలకీ, ఉపగ్రహాలకీ, నక్షత్రాలకీ, గాలక్సీలకీ, నవగ్రహ కూటాలకీ ఉన్న రోల్ ఏమిటి? ఎవరు ఎవర్ని ఎందువల్ల నడిపిస్తున్నారు? ఏమిటీ జగన్నాటకం? ఇది నాటకమైతే ఈ స్క్రిప్ట్ ఎవరు రాశారు? ఎందుకు రాశార"ని ప్రశ్నిస్తున్నాడు సదాశివరావు శ్రీశ్రీ అన్నట్టు 'ప్రశ్న ప్రశ్న లాగున్నది, శిలమాత్రం మిగిలినట్టు' అలాగే 'కథ' శివరావు "నా ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోయా"యంటాడు! వంచననూ, పరవంచననూ అతను సహించడుః కాపట్యం, రెండు నాల్కల తత్వమూ గిట్టదుః "టూమచ్ లీజర్, టూమచ్ మనీ, టూమచ్ టెన్షన్, టూమచ్ వర్రీ" నూతన ప్రపంచ సృష్టికీ, నవ్య భావధారకూ, ఆశాజనకమైన భావి సమాజ నిర్మాణానికీ చేటు అని "శ్రీధర్" పాత్ర చాటున దాగి సదాశివరావు కొత్త తత్వాన్ని ప్రబోధిస్తాడు అంతేగాదు, హద్దూ పద్దూలేని సంపదవల్ల వచ్చే సెక్యూరిటీతో జీవితంలో సగం ఇచ్చ చచ్చిపోతుందనీ, ఏ సమస్యలూ ఎదురు పడక, కష్టాలంటే ఏమిటో తెలియక దుర్బలమైన పౌరులుగా, ఒక తరం తయారవడాన్నీ, మాదకద్రవ్యాలకు, మద్యానికి లొంగిపోయి అర్ధాంతరంగా ముప్పయ్యేళ్ళు దాటకుండానే యువకులకు నూరేళ్ళు నిండిపోవడాన్నీ ఆయన సహించలేడు అలాగే పనులు వదిలేసి, సమాజానికి భారమై, ఇంటికి నిప్పంటించకుండానే నిప్పుపెట్టే గుర్రప్పందాలు చేస్తున్న హానిని గురించి వర్ణించిన గొప్ప కథ "అశ్వమేధం" అదో క్రేజ్ అందులో గుర్రాలతోపాటు ఎక్కిన మనిషి (జాకీ) కి కూడా హాని కలుగుతుంది "తెలియని బలి పశువులెన్నో! అశ్వమేధాలూ, నరమేధాలూ అవిచ్ఛిన్నంగా జరిగిపోవడాన్ని" కూడా సదాశివరావు చూస్తూ ఊరు కోలేడు! మనదేశంలో పేదరికం ఉన్నదన్న నిజం రేసెస్‌లో పాల్గొనేవాళ్ళెవరికీ గుర్తుండదన్న సత్యాన్ని

గుర్తింప జేస్తాడు! ఈ కథాచిత్రణలో సదాశివరావు వాడిన పరిభాష హెమింగ్వే జీవితంలో ఒకని అనుభవాన్ని గుర్తుకు తెస్తుంది 1954 లో మాడ్రిడ్ లో బసచేసిన హెమింగ్వేను ఓ విలేకరి ఇలా ప్రశ్నించాడు

"మీరు గుర్రప్పందాలకు వెడతారా?"

"అవును, వెళ్లాను, అప్పుడప్పుడూ" అన్నాడు హెమింగ్వే అంతేగాదు, రేసింగ్ ఫారమ్ చూస్తే, సదాశివరావు అన్నట్టే హెమింగ్వే కూడా కథా కళకు అవసరమైన సామగ్రి అంతా రేసింగ్‌లోనే దొరుకుతుందన్నాడు! ఎలా? "రేస్ కోర్స్ అన్ని శాస్త్రాలకీ నిలయం"! ఎందుకంటే "లక్ష్మీ కటాక్షం" అంతా "ఈజీ మనీ" లోనే ఉందని కొందరి తప్పుడు నమ్మకం ఇలాంటి విశ్వాసాల్ని తుత్తునియలు చేయడం సదాశివరావు పనిలా ఉంది! అలా అని ఆయన ఒక ప్రత్యేక సిద్ధాంత వాగురలో కొట్టుకుపోయే మనిషీకాడు "మనం మనుషులం, ఏదో విధంగా మంచినీ, చెడునీ రేషనలైజ్ చేసి బతకడం మన విధి" అని 'తుషార బిందువు'ల్లో చెప్పిన మహిమా మల్హోత్రా సూత్రీకరణే కథాశివరావు లక్ష్యంకూడానా? ఈ విషయంలో రాబర్ట్ ఫ్రాస్ట్ మాటలే సదాశివరావుకీ వర్తించవచ్చు తానో ప్రత్యేక ముఠాకు చెందినవాణ్ణి కాను (*"my instinct was not to belong to any gang"*) అన్నాడు ఫ్రాస్ట్ అయితే వ్యక్తిత్వం వేరు, ఆ వ్యక్తిత్వాన్ని పెంచి పోషించే సామాజిక నిబద్ధత వేరు! నిబద్ధత లేని వ్యక్తిత్వం ఊసర క్షేత్రంలో వర్షోదకం!!

ఆదివారం 3, నవంబర్, 1996

# నమ్ముకున్న నేలను కమ్ముకున్న 'కేతు' కథనం!

కథ గాలినుంచీ పుట్టదు, గాలికబుర్లనుంచీ పుట్టదు! దాని ముడిసరుకు ప్రకృతీ, మానవ జీవితమూ, పరిసరాలూ, అవి మానవునిలో కల్పించే ఆలోచనలూ, అనుభూతులూ, మానవుని ఉనికినీ, అతని గమనాన్నీ దిద్ది తీర్చే పరిసరాలనుంచి కథపుడుతుంది నిజానికది ఉబుసుపోని కథకాదు, మానవుడి ఉసురుకు సంబంధించిన గాథ ఆ ఉసురు నిలబెట్టుకునేందుకు జరిపే జీవన సమరంలో ఎదురయ్యే సుఖదుఃఖాల కలనేతా, వడపోతే కథ కనపడుతున్న జీవితానికి, అనుభవిస్తున్న జీవితానికి ఎవరికివారే ప్రత్యక్షసాక్షి అయినప్పుడు వేరే కథ దేనికి? రహస్యమంతా అక్కడే ఉంది ఎవరికథ వారికి తెలియొచ్చుగాని, మరొకరి గాథ ఎదుటివారికి తెలియదు ప్రత్యక్ష పాత్రల సృష్టి చరిత్ర అవుతుంది చారిత్రక సన్నివేశాలూ, జీవన సమరమూ పరోక్ష పాత్రలద్వారా కథావస్తువులవుతాయి మనకథను మన పేర్లతో యథాతథంగా అచ్చుకెక్కిస్తే 'పరువు నష్టం' అవుతుంది, మనకు ఉన్నమాటంటే ఉలుకెక్కువ కాబట్టి పరువు నష్టపు దావాలు రాకుండా ఉండేందుకైనా మనకు 'కత' అవసరం! పంచతంత్ర కథలు, గాథా సప్తశతి, క్షేమేంద్రుని కథా సరిత్సాగరం అలా వెలసినవే ప్రతి కథకుడూ ఒక విష్ణుశర్మో, ప్రశ్నించేవాడు ఒక నాచికేతుడో అయితే తప్ప మన ప్రవర్తన మారదు, మన తార్కికదృష్టి సునిశితంకాదు కథలు అందురూ చెప్పగలరుగాని, నేలతల్లి కథను వెలార్చగలవాళ్ళు కొద్దిమంతే ఉంటారు ఆ కొలది మంది అభినవ కథక చక్రవర్తులలో కేంద్రసాహిత్య అకెడెమీ పురస్కారానికి ఎంపిక అయిన కేతువిశ్వనాథరెడ్డి ఒకరు. రాయలసీమ కథక రత్నాలలో చెప్పుకోదగిన వారు మధురాంతకం రాజారాం, నామిని సుబ్రహ్మణ్యం నాయుడు, కేతువిశ్వనాథరెడ్డి అగ్రస్థానంలో నిలబడతారు గ్రామానామాల పరిశోధన గ్రంథంతో పాటు కొడవటిగంటి కుటుంబరావు సాహిత్య సంపుటాల సంకలనకర్తగా, తెలుగు అకాడెమీ ప్రచురణల సంపాదకుడిగా, ఓపెన్ యూనివర్సిటీ భాషాపాఠ్యాంశాల రూపశిల్పిగా పేరులోకి వచ్చిన కేతు కొన్ని తెలుగు అకాడెమీ ప్రచురణలకూ, అంబేద్కర్ రచనలు కొన్నింటికీ సంపాదకత్వం కూడా వహించారు జీవితం జానపదకథల్లో వర్ణించినట్టు ఉండదని కేతుకు తెలుసు అందుకే సమాజపరిణామక్రమాన్నీ, జానపదుల జీవితాన్నీ రాయలసీమ పూర్వరంగంనుంచి పరిశీలించినా ప్రాంతీయ సరిహద్దులకూ, ప్రాంతీయ దురభిమానాలకూ దూరంగా ఎదిగి, సామాజిక రుగ్మతలకు కారణాలు చెప్పి సంఘజీవులలో చైతన్యం కలిగించడానికి 'కథ'ను మాధ్యమం చేసుకున్న సంస్కారి కేతు! వచ్చిన పురస్కారం కేతు "కథలు"కు కావచ్చుగాని, "వేర్లు", బోధి"అన్న ఆయని రెండు నవలలూ కూడా ఈ పరిధికి తీసిపోని రచనలే కేతు పరిసరాలనేకాదు, మానవుని మనస్తత్వాన్నీ పరిశీలించాడు పాతికేళ్ళ సాహిత్య వ్యవసాయంలో ప్రగతిశీల దృక్పథాన్ని విడవకుండా, ఉబుసుపోని రచన చేయకుండా సమాజ ప్రయోజనమే 'కథా' ప్రయోజనమూనని ప్రకటించి పాఠకుల మనస్సుల్ని నిత్యచైతన్యం వైపూ, వాస్తవిక దృక్పథం వైపూ నడిపిస్తున్న రచయిత కేతు. పురస్కారం పొందిన కథల సంపుటి-ఓ యువకుడి ఆత్మహత్య కారణాలను తెలుసుకోవడంతో కేతు ప్రారంభించిన అన్వేషణ, నిస్సహాయుడైన నిరుద్యోగి కథగా రూపుదాల్చింది! పెక్కు కథలను జగతి పరిణామ సాక్షిగా, తానే వ్యాఖ్యాన కర్తగా పాత్రలను సంభాషణల్లోకి దించి దిద్దితీర్చాడు చిన్ననాడు తన "జేజెమ్మ' చెప్పిన కథలను చెవికోసుకుని విన్న కేతు నీతి కథల సారాంశాన్ని ఒంటబట్టించుకొని

సంఘజీవిగా మారి సామాజిక పరివర్తనలో న్యాయాన్యాయాలను బేరీజు వేసుకొన్నాడు తన చిన్నప్పటి పల్లెటూరి అనుభవాలను, ఫ్యూడల్ (భూస్వామ్య) వ్యవస్థ పూర్తిగా కనుమరుగు కాకుండానే పెట్టుబడిదారీ దోపిడీ పద్ధతులకు క్రమంగా లోనవుతున్న పల్లెపట్టులలో వస్తున్న పరిణామాలను, బతకలేక పేదసాదలు సాగిస్తున్న వలసలను కళ్ళారా గమనిస్తూ వచ్చినవాడు కేతు పేదల సమస్యలు పట్టించుకొన్నాడు వారి గుండెకోతను అర్థంచేసుకున్నాడు కంకర కొట్టే రోడ్డు కూలీల బతుకు బాధల్నీ, రైతుల, వ్యవసాయ కార్మికుల బతుకుల్ని దగ్గరగా పరిశీలించాడు తాతాలనాటి రూపాయి కూలియే ధరలు చుక్కలంటుతున్న రోజుల్లో కూడా ఇవ్వజూపే మోతుబరుల్నీ, మనస్తత్వాల్ని పరిశీలించాడు చదువు నేర్పిన ప్రొఫెసర్లు కూడా 'బాబా'ల మైకంలో పడి తమను మోసగించుకోవడమేగాక, సమాజాన్ని కూడా ఎలా మోసగించ ప్రయత్నిస్తారో ఈ కథల్లో చెప్పాడు అందుకే కేతు అన్యాపదేశంగా-తన కథల లోకం ఎలాంటిదో చెబుతూ "నేను చదివిన కథల లోకమే అద్భుత మయింది, పిప్పరమెంటులా తియ్యనైంది 'రమ్ము'లాగా మత్తెక్కించేది" అంటాడు! నిజానికి జీవిత కథను వర్ణించడానికి అల్లసాని వాడి గజిబిజి భాష అక్కరలేదు, కర్పూర తాంబూలాలిచ్చే ప్రియదూతికలూ అక్కర్లేదు, 'రమ్ము' లూ 'విస్కీ'దమ్ములూ అక్కరలేదు! జానపదుల జీవితాన్ని, మధ్యతరగతి మనస్తత్వాన్ని, సంపన్నుల అతిలోలతనూ వర్ణించి చెప్పడానికి రచయితకు పరిసరాలే పరమౌషధాలు! నిజానికి ఈ కథల్లో కేతు ముడిపదార్థం పల్లెపట్టులూ, వాటి పరిసరాలూ, పారిశ్రామిక లోకమూ పారిస్ ఇంటర్వ్యూస్ ఆధ్వర్యంలో వెలువడిన "రైటర్స్ ఎట్ వర్క్" రెండవ సంపుటానికి ముందుమాట రాస్తూ వాన్ విక్ బ్రూక్స్ రెండో ప్రపంచ యుద్ధకాలంలో జీవించిన పెక్కుమంది రచయితలు అంతర్జాతీయ దృక్పథాన్ని అలవరుచుకున్నారనీ, వారు స్థానిక సమస్యలనుంచి ప్రేరణ పొందిన దృష్టి సంకుచిత హద్దుల్ని అధిగమించి మనస్సుల్ని విశ్వజనీనం చేసుకున్నారనీ తెలిపాడు, వసుధైక కుటుంబం వాళ్ళ ధ్యేయం అన్నాడు అలాంటి దృక్పథాన్ని కేతు అలవరచుకున్నాడు రచన సరదాకోసం కాదని కేతుకు తెలుసు. అందుకే వ్యంగ్య ధోరణి ఉన్న కథనాన్ని సీరియస్‌గా నడుపుతాడు కేవల చమత్కారమే కాదు, కథావస్తువునుగాని, అందలి సంభాషణనుగాని పలచబరచడు రచనలో మనస్సును పట్టించే శైలితోపాటు ఏ డైరెక్షన్‌లో కథాగమనాన్ని తీర్చిదిద్దాలో అతనికి తెలుసు! శిల్పానికీ, వస్తువుకూ మధ్య అద్భుతమైన సమన్వయం సాధించిన రచయిత కేతు. ఈ విషయంలో ఎజ్రాపౌండ్ చెప్పిన మాటలు ఈయనకు అక్షర సత్యాలుగా వర్తిస్తాయి *"The What is so much important than how"* అంతేగాదు, సమకాలిక సమాజ పరిస్థితుల్లో ఒదుగుతూనే తనకాలపు జీవన సమరాన్ని ప్రతిబింబించగల రచయిత జీవితమే సార్థకం అన్నాడు రచయిత ఒక రాడార్ లాంటివాడు అతడొక యాంటినా, సమాజాన్ని ఊగించి శాసించబోయే ఉత్పాతాలనూ పరిణామాలనూ పసికట్టగల 'యాంటినా' కథకుడన్నాడు హెన్రీ మిల్లర్ *("A writer is a man who has antennae knows how to hook up the currents which are in the atmosphere")* కథా రచన ఒక ఇంద్రజాల విద్య అని కొందరంటారు! అయితే గురజాడ, కుటుంబరావు, మా గోఖలే, రా వి శాస్త్రి, పద్మరాజులా కేతు విశ్వనాథరెడ్డి కథ ఉనికిని సామాజిక ప్రయోజనానికి నిబద్ధం చేసినవాడు "నిబద్ధత" పదాన్ని ప్రగతిశీల రచయితలంతా ఇప్పుడు వాడుతూండవచ్చుగాని మొదటిసారిగా రచనలో ప్రవేశపెట్టినవాడు పోతనామాత్యుడు! పాశ్చాత్య ప్రపంచంలో ఈ నిబద్ధతకు వారసులు హెన్రిక్ ఇప్సన్, అనటోల్ ఫ్రాన్స్, హెమింగ్ వే, లారెన్స్, మపాసా, సోమర్ సెట్ మామ్,

గాటియర్, కోలేటీ వాస్తవికత, హేతువు-రెండు చక్రాలుగా రచనా ప్రక్రియను వారు సుసంపన్నం చేశారు

అలాగే కేతు కూడా వాస్తవికత, హేతువాద దృక్పథంతో పాటు వర్గదృక్పథంనుంచి కూడా తన కథనాన్ని సునిశితం చేశాడు "మార్పు"లో కూలినాలి జనం బతుకు చితుకులనూ, దోపిడీ వ్యవస్థ స్వరూపాన్ని చూపాడు "సానుభూతి"కథ ద్వారా సాగుసమస్య పేరిట భూసమస్య వేస్తున్న వెర్రితలలూ, వాటి ఆధారంగా పెచ్చురిల్లుతున్న రైతు-కూలీ తగాదాల గుట్టును రట్టుచేశాడు రాయలసీమ ప్రజల మూల్గుల్ని పీలుస్తున్న పాళెగాళ్ళ రాజ్యపు అవశేషాలుగా ఉన్న హత్యారాజకీయాలకు అద్దంపట్టిన కత "వెనక-ముందూ"! అవకాశవాదుల్ని ఎండకడుతూ కేతు ఒక పాత్రద్వారా ఇలా అనిపిస్తాడు "కుక్కల్లా కొట్లాడ్డానికి పార్టీలెందుకురా? (వీడికి) మందువాసన తగిలితేనే తలకాయ తిరుగుతుంది (వీడు) మారడమా? ప్రత్యేకాంధ్రోద్యమంలో తెలంగాణావాళ్ళను బండ బూతులు తిట్టాడు ఏ ప్రాంతంవాళ్ళూ వాడికి ముద్దుకాదు అవకాశం దొరకాలిగానీ ప్రత్యేక కడప రాష్ట్రమే కావాలంటాడు! మంత్రివర్గంలో లేని రాజకీయ నాయకులెంత ప్రమాదమో, వీడిలాంటి ప్రాక్టీసులేని లాయర్లూ అంతే ప్రమాదం దేశానికి!" భూమిని నమ్ముకొనే రోజులు పోయాయని ప్రజలు భావిస్తున్నారు ఎందుకని? భూసంస్కరణ చట్టాన్ని తప్పించుకోడానికి మోతుబరులు సవాలక్ష మార్గాలు వెతికారు కాబట్టి! సమగ్ర సంస్కరణలు రానందున సమాజానికి వస్తున్న నష్టమేమిటో, పంట భూములు క్రమంగా ఎలా పారిశ్రామిక వాడలుగా మారి పల్లె జీవితాలను చిందరవందర చేస్తున్నాయో, పెద్ద ఎత్తున బతుకు తెరువుకోసం కూలీ నాలి వలసలు ఎలా సాగుతున్నాయో ఈ కథలు చెబుతాయి "తల్లినో, తమ్ముణ్ణో, ఎవరో ఒకర్ని తాకట్టుపెట్టే రోజులు ఇప్పటికే రాలేదంటారా? అంతగా రాకపోతే నీ నల్లరేగడి మీద తుంగభద్ర నీళ్ళు పారనీ, నాలుగు పెద్ద ఫ్యాక్టరీలు రానీ - అన్నీ అబద్ధాల బతుకులే, అన్నీ డబ్బు చుట్టూ జీవితాలే అని తెలిసొస్తుంది వెనకా ముందూ అంతే" అని చెప్పిన పాత్ర కథకుని దూరదృష్టికి నిదర్శనం! హత్యారాజకీయాల ముచ్చట్లో భాగంగా ఒక పాత్ర "సివిల్ కేసులు నాన్పుడే అయినా కనీసం మనుషులన్నా మిగులుతారు, క్రిమినల్ కేసుల్లో అయితే అదీ లేదు" అని అక్షర సత్యం పలుకుతుంది! "చిత్తశుద్ధిలేని శివపూజల" వల్ల దేవాలయాలు, వాటిని అంటిపెట్టుకుని ఉన్న ఆచారాలు ఎలా కలుషితమయ్యాయో "ఆత్మరక్షణ" ఏకరువు పెడుతుంది! పూజారి వ్యవస్థ లోపాల్ని ఎత్తి చూపుతుంది! ఒక అనాథ స్త్రీ బతుక్కి అక్షరరూపం "ప్రేమ రూపం" ప్రేమకు కొత్త నిర్వచనాన్ని ఇందులో కేతు సాధించాడు ఊళ్ళో దిక్కులేని ఆడదాన్ని నలుగురూ ఎలా "కుక్కల్లా" వెంటాడుతారో చెప్పాడు అవసరమే ఆశ అని తేల్చిన (వెనక గోరాశాస్త్రి 'ఆశ ఖరీదు అణా' కథరాశాడు) గొప్ప కథ 'నమ్ముకున్ననేల" అది ఒక ఊరి కథ, ఒక తరం కథ, పల్లెల కథ! పారిశ్రామిక యుగం మార్పులకు లోనవుతున్న నేల తల్లి పురిటి నొప్పులు చెప్పేకథ ఇది! పూర్వవైభవం కోల్పోతున్న పుడమి తల్లి బాధలు చెప్పాడు మంచి అలవాట్ల స్థానంలో 'మట్కా'చార్టులకు ఆకర్షితులవుతున్న కుర్రకారును హెచ్చరించాడు మారిపోతున్న సంఘజీవనంలో చివరికి "మూఢనమ్మకాలతో కూడిన సంఘజీవనం కూడా" లేదంటాడు కేతు! కరువూ, అవసరమూ ముమ్మరించి భూముల విలువల్ని కోతపెడుతుంది! స్త్రీ ఇప్పటికీ ఒంటరిగా బతకడం ఈ సమాజంలో ఎంత కష్టంగా ఉందో చెప్పిన కథ "రెక్కలు" ఇలా ఒకటా అరా! అన్ని కథలూ ఆణిముత్యాలే. సంఘానికి మూలముట్టుగా దిద్దుబాటు జరిగేదాకా కేతు కథాస్రవంతి కట్టలు

తెంచుకుని పారుతూనే ఉండాలి! కేతు కథాక్రమంలో నేలతల్లి వాసనలు చూపించాడు, ముచ్చటైన మాండలిక ప్రయోగాలు-"సంచకారంగా" (బయానా) పెట్టాడు "మంగతై" (జూదం) ఆడించాడు, 'ముదెబ్బల'కాలం చూపించాడు దెబ్బతిన్నవాడు దాయాదిగా ఎలా మారుతాడో చెప్పాడు!

కేతు భాషాశాస్త్రవేత్తగా మాండలికాలతో చాకిరీ చేయించుకున్నాడు, ప్రయోగంలో సరసమైన ప్రతీకలూ వాడాడు ఆద్యంతాల బిగింపులో చమత్కారాలు పోయాడు ఆక్టోవియా పాజ్ అనలేదూ *"This universe is a vast system of signs"* అని! ఈ ప్రతీకలు భాషకు ముడిపదార్థాలు! సుప్రసిద్ధ నాటక రచయిత యూజినీ అయొనెస్కో అసంబద్ధ నాటకోద్యమ నాయకుడైన శామ్యూల్ బెకెట్ గురించి రాస్తూ మాటల్లేకుండా మౌనం ద్వారా బెకెట్ భాషను ఖూనీ చేస్తే, భాషను అతిగా వాడి తను నూతన పదసృష్టి చేస్తానన్నాడు *("Beckett destroys language with silence, I do it with too much language, with characters talking at random and by inventing words!")* కాని కేతు ఈ రెండు ధోరణులకూ మధ్యగా తన రచనా వైచిత్రిని ప్రదర్శించగలిగాడు మౌనానికీ, అతికీ మధ్య భేదం చూపాడు! వ్యక్తిగా కేతు ఎప్పుడూ చిరునవ్వులొలికిస్తూనే ఉంటాడు ఆ ఆనందానికి హద్దులు లేవు తన ఉనికిని అనుక్షణం అనుభవించడం అందరికీ చేతకాదు బహుశా అందుకేనేమో పాబ్లో నెరూడా ఫాసిస్టు దమనకాండకు బలైన గార్సియా లోర్కా గురించి అని ఉంటాడు *"a great spendthrift of happiness"!* నేటి కథానాయకుడు కేతు విశ్వనాథం ఇందుకు మినహాయింపు కాదు!

ఆదివారం 22, డిసెంబర్ 1996

# పీడనపై పడగెత్తిన 'శ్వేత'నాగు!

"స్వాతంత్ర్యం వచ్చాక బానిసత్వం, దాసత్వం రద్దయినాయన్న సంగతి, ఆ బానిసలకు ఎవరూ చెప్పనవారు లెరు వాళ్ళ వంశస్థులు తరతరాలుగా భూస్వాముల సదుపాయం కోసం బానిసత్వమే అనుభవిస్తున్నారు భూములన్నా, వ్యవసాయమన్నా ఖర్చుతో కూడుకున్న పని అవి వీళ్ళకి అందుబాటులో ఉండవు పొట్టకి అవసరమైన గింజలు ఒక్కొక్కప్పుడు మిగులుతాయి, ఒక్కొక్కప్పుడు మిగలవు, పంటపుష్కలంగా పండినా సరే! అనావృష్టి, అతివృష్టి, వరదలు ఏమొచ్చినా సరే, అప్పులు తీసుకోవడం, వేలి ముద్రలు వేసెయ్యడం, బాకీ తీర్చడం కోసం జీతం లేని వెట్టిచాకిరీ చెయ్యడం, బానిసత్వం, జన్మదాస్యం పంటలో దాదాపు మొత్తం అంతా ఎలాగూ కామందుకి పోతుంది తన వాటాకి వచ్చే స్వల్పమూ కూడా బాకీ తీర్చడానికే పోతుంది ఇంక జీతమూ, కూలీలేని వెట్టిచాకిరీయే మిగులు సర్వంస్వాహా శక్తి కలది పద్దు పుస్తకం ఆ పద్దు పుస్తకంలోని 'టిక్కు'ల్లో చిక్కుకు పోయిన బందీలే వీళ్ళు అప్పులపాలై వెట్టిచాకిరీ చేసే బానిసలు, దాసానుదాసులు"

ఈ కథకు అంతేలెదు ఏరోజోకాదు, ఈరోజుకీ యావద్భారతంలోని గ్రామీణ వ్యవసాయ సంబంధాలలో నడుస్తున్న చరిత్ర కూడా అదె, కొంచెం అటూ ఇటూగా! అణగారిన ఆర్తుల గాధలకూ, దళిత, ఆదివాసుల దయనీయ స్థితిగతులకూ పీడనా దొపిళ్ళకూ - ఒక్క మాటలో భూస్వామ్య వ్యవస్థ నగ్న స్వరూపానికి అద్దం పట్టిన మహా కథకురాలైన బెంగాలీ రచయిత మహాశ్వేతాదేవి మాటలివి! సామాజిక న్యాయానికి నిర్వచనం చెప్పి, సంప్రదాయంలోని మంచిని గుర్తించి, వర్తమానంలోని చెడులక్షణాలపై కత్తి కట్టిన 'శ్వేత'నాగు ఈ మహాశ్వేత! "జ్ఞానపీఠ్" పురస్కారం ఈమెకు దక్కడంవల్ల పుస్కార గ్రహీతలవిలువ పెరిగింది ఎందుకంటే అగ్రవర్ణుల, అంత్యవర్ణుల మధ్య అగాధాన్ని శాశ్వతంగా పూడ్చడం కోసం ఏ 'అంత్యోదయం' కోసం అంబేద్కర్, గాంధీలు శ్రమించారో, ఏ వామపక్ష ఉద్యమాలు గణనీయమైన పోరాటాలు సాగించాయో - వాటన్నింటికీ అక్షరబద్ధంగా విలువ సమకూర్చిన ఘనత మహాశ్వేతాదేవికి దక్కుతుంది పైన పేర్కొన్న ఆమె మాటలు దళిత జాతుల బాధల పల్లవి "రాకాసికోర" నవలలోనివి దేశంలోని భూస్వామ్య వ్యవస్థ గ్రామీణ ఉత్పత్తి శక్తులను ఎలా అణగార్చిందీ, అందువల్ల తాడితుల, పీడితుల సంఖ్య ఎలా పెరిగిందీ, వ్యవసాయ సంబంధాల్ని నిర్దేశించి నియంత్రిస్తున్న శక్తులు ఎలా బలం పుంజుకొన్నదీ - 'శ్వేత' రచనలు మన కళ్ళకు కట్టినట్టు చూపిస్తాయి ఆదివాస ప్రాంతాలలోనే ఆమె 'ఆవాసం' అన్నట్టుగా ముక్తిమోర్చాలు నడిపిన ఉద్యమ మహిళగా కూడా మహాశ్వేత దేవి ఎదిగి వచ్చింది బీహార్-బెంగాల్ సరిహద్దు ప్రాంతాల్లోని ఆదివాస ప్రాంతాలు ఆమెకు కార్యరంగాలు కావడమేగాక, ఆమె 'కథా'కేళికి ఆదివాసుల జీవితాలు ప్రధాన ముడిసరుకు లయ్యాయి సంతాల్, ముండారీ జాతుల తిరుగుబాట్లు రచనలకు పూర్వరంగాన్ని సమకూర్చాయి వ్యవసాయ కూలీలపైన, పేదరైతులపైన జోతేదార్లు (భూస్వాములు) సాగించిన అత్యాచారాలు ఆమె రచనా దీక్షను మరింత సునిశితం చేశాయి వాల్డో ఎమర్సన్ అన్నట్టు రచయిత "విమోచన ప్రదాత" *("Liberating God")* అలా తన గుండెనే సన్నికల్లుగా మార్చుకొని సామాజిక న్యాయసాధన కోసం జీవన రసాయనాలను తయారుచేసి పీడితులకు పంచుతున్న రచయిత "శ్వేత" ఈ

దృష్ట్యా ఆమె రచనా జీవితం ఆచరణకు మాతృకగా మారిపోయింది ప్రసిద్ధ కథకుడు, నవలా కారుడూ పి జి ఉడ్‌హౌస్ అనలేదూ *"A writer's life is the ideal life"* అని! మహా శ్వేతాదేవి మహా మొండిది కాబట్టే ఎంతకాలమని ఇలా ఆకలి దప్పుల్ని గురించి ఒకే కథావస్తువుగా రాస్తూంటావని ఎవరో ప్రశ్నించినపుడు ఆమె ఇచ్చిన సమాధానం "ఎంతకాలం ఆకలి, దారిద్ర్యం, ధనవంతులు, భూస్వాముల బహిరంగ దోపిడీ, ప్రభుత్వ యంత్రాంగాల పీడనా సాగుతాయో, అంతకాలమూ నేను అవే విషయాలు రాస్తూంటాను" అని! ఆమె సంఘసేవికగా ఉబుసుపోని కథలూ, నవలలూ రాయలేదు అవగాహనతో, అనుభవాలతో నిండిన వాస్తవ జీవిత చిత్రణ ఆమె కథన రంగం కట్టు బానిసల విమోచనోద్యమకారిణిగా శ్వేతాదేవి తండ్రి మణీష్ ఘటక్ సాహిత్య వేదికగా తీర్చిదిద్దిన "వార్తిక్" పత్రికను వ్యవసాయ కార్మికుల, పేదరైతుల రిక్షావాలాల మాటల్లోనే వాళ్ళ జీవిత దర్పణంగా మలిచింది! జేమ్స్ జాయిస్ "యులిసిస్" లాగా ఒక రోజు కథాకాలాన్ని జీవన చిత్రణ పరిధిగా మలిచిన మరో రచన "ఒక తల్లి" వర్తమాన ప్రపంచానికి కూడా చెహోవ్ బంధువెందు కయ్యాడు? నిజ జీవితాలను చిత్రించాడు కాబట్టి మహాశ్వేతాదేవి ఇటీవల కాలంలో నోబెల్ సాహిత్య పురస్కారం పొందిన ఆఫ్రికన్ - అమెరికన్ రచయిత్రి నాదినీ గోర్డిమీర్‌లాంటిది! అమెరికన్ సాంస్కృతిక జీవనానికి చేదోడు వాదోడై నాలుగు వందల ఏండ్లకుపైగా సంపదైశ్వర్యాల సృష్టికీ, మెరుగులు దిద్దడానికీ కారకులైన దళిత వర్గాలతో గొంతు కలిపిన వ్యక్తి గోర్డిమీర్ మనిషీ, పరిసరాలు - వెరసి రాజకీయాలు ఆ రాజకీయ చైతన్యాన్ని గోర్డి మీర్, అప్టన్ సింక్లైర్ గొప్ప నవల "జంగిల్" (అడవి) ద్వారా పొందింది అలాగే మానవునిలోని మంచి-చెడులను అధ్యయనం చేసిన మహాశ్వేతాదేవికి టాగోర్ శాంతినికేతన్ విద్యా సంస్కృతులు తోడ్పడ్డాయి మానవీయ దృష్టికి ఆమె తగిన వారసురాలయింది ఆ క్రమశిక్షణే ఆమె భావిజీవితానికి ఏడుగడ అయింది

శ్వేతాదేవి "రాకాసి కోర" భూస్వామ్య వ్యవస్థలోని చెడుగుల్ని ఎత్తి చూపిన గొప్ప నవల వర్గవ్యవస్థ, వర్ణవ్యవస్థ, - మతవ్యవస్థ పేదసాదలపై ముప్పేటగా జరిపిన దాడిని బట్టబయలు చేస్తుంది కొండజాతులు, దళితులు తమ భూములను ఎలా కోల్పోయి, తమ నివాసంలోనే తాము ఎలా నిర్వాసితులు కావలసి వచ్చిందీ కళ్ళకు కట్టినట్టు చూపుతుంది ఇందుకు సంప్రదాయాల ఉచ్చులూ, ఆచారాల అరదండాలు ఎలా తోడ్పడ్డాయో వివరిస్తుంది గిరిజన ప్రాంతాల్లో మైదాన ప్రాంతాల వారు సాగించే వ్యాపార దోపిడీ ఎన్ని పద్ధతుల్లో సాగుతూంటుందో తెలుపుతుంది "బాధా" గ్రామం ఆధారంగా రాజపుత్ర అగ్రవర్ణులు అక్షరాస్యులుకాని తక్కువ కులస్థుల్ని ఆదివాసుల్నీ ఎలా దోచుకుతింటారో చూపుతుంది ఉత్పత్తి సాధనాలూ, ఉపాధి ఆధారాలూ కలవారి సొత్తు అయినంత కాలం సాంఘిక న్యాయానికి అర్థాలు మారతాయని బోధిస్తుందీనవల. అంతేగాదు, సామాజిక ఆర్థిక పరిస్థితులను పొలిటికల్ ఎకానమీ ద్వారా పరిశీలించిన గొప్ప నవల ఇది యజమానులు భూముల్ని కౌలుకి ఎందుకిస్తారో సమాధానం చెబుతుందీ నవల! గ్రామం ఒకటే, భూకామందులు తొమ్మిది కుటుంబాలు, మిగతా అందరూ అప్పులపాలై అమ్ముడుపోయిన ప్రజ కొందరు యజమానుల దగ్గిర భూములు కౌలుకు తీసుకొని వ్యవసాయం చేసుకుంటారు ఈ పద్ధతి యజమానులకు అభ్యంతరం ఉండదు ఎందుకంటే వ్యవసాయానికి కావలసిన పెట్టుబడి డబ్బు రెక్క అమ్ముకున్నవాడి దగ్గరుండదని తెలుసు! అప్పులకోసం తిరిగి యజమానుల దగ్గరికే చేరతారనీ తెలుసు! అప్పు తీసుకున్నారా, వాళ్ళని ఉచ్చులో కట్టిపడేశారన్నమాటే అప్పుమీద వడ్డీ తీర్చడానికే కౌలు వాటా కాస్తా పోతుంది

ఆపైన ప్రాణాలు నిలబెట్టుకోడానికి పట్టెడు అన్నం సంపాదించుకోడానికి పాలేరు పనిచెయ్యడం మేలు! ఈ ఊడిగం ఇలా ఉండగా భూస్వామ్య సంస్కృతి పాలేర్ల సంసారాలను కూడా ఎలా చెడగొడు తుందో, వారి స్త్రీలపై అత్యాచారాలకు ఎలా దిగజారుతుందో శ్వేతాదేవి ఈ నవలలో అడుగడుగునా ఎండగట్టింది! ఈ నవలలోని ఒక మేదినీ సింగ్, ఒక గణేశ్, ఒక బరకందాజ్, ఒక రామ్‌రూప్ (పాత్రలు) భూస్వామ్య సంస్కృతికి ప్రతినిధులయితే, ఆ వ్యవస్థ రథచక్రాలకింద నలిగిపోయిన తాడితులకు, పీడితులకు ప్రతినిధులు ఒక గులాల్, ఒక గంగ, ఒక లచ్చిమా, ఒక మెహర్, ఒక హరువా, ఒక మోరీ, రుక్మని, పుత్లా, లఖ్నితియా! ఊరు ఆడపడుచుల బతుకులు, ఆలుబిడ్డల ప్రాణాలు ఎన్ని చట్టాలున్నా భూకామందులకు అప్పడాలూ, నైవేద్యాలూ! ఆస్తికీ వాళ్ళ భోగభాగ్యాలకు లంకె, సంస్కృతికి నిదర్శనం కట్టు, బొట్టూ, కంటి కడియం జుమికీ కావనీ, మానవుల అంతరంగం ప్రధానమనీ చాటుతుంది శ్వేతాదేవి కామందులు పేదసాదల భూములు లాగేసుకున్నారు, గుడిసెలు కాజేశారు, స్థలాలు ఆక్రమించుకున్నారు, తమ మాట వినకపోతే గుడిసెలు కాల్చారు, గూడేలకు గూడేలనే కూల్చారు ఆ ఆదివాసులు ఎక్కడ బతుకుతున్నారు మరి? అటవీశాఖ వారి భూముల్లో ఆదివాసులు భూములకు అగ్రవర్ణస్తులు ఎగబాకడంవల్లనే సాంఘికంగా ఆర్థికంగా దుర్బలులైన "అంత్యవర్ణస్తులు" అడవుల పాలుకావలసి వచ్చిందని - ఈ నవల పిండితార్థం ఈ పరిస్థితుల్లో ఈ పీడితులు ఎందుకు ఉద్యమిస్తారో, మరెందుకు విప్లవిస్తారో, ఎందుకు తిరగబడతారో శ్వేతాదేవి నీళ్ళు నమలకుండా, కాళ్ళు తడబడకుండా చెప్పింది పాతిక సేర్ల గోధుమలిచ్చి, నలబై ఏళ్ళ గొడ్డు చాకిరీ చేయించుకోడం - ఇదీ భూస్వామ్య సంస్కృతికి వెన్నతో పెట్టిన విద్య మరి ఈ గుట్టు ఎప్పుడు రట్టవుతుంది? ప్రచారం ద్వారా ఇన్ని బాధలమధ్యనే "అలగాజనానికి" ఒక జన్మహక్కు మాత్రం సంక్రమించిందంటుంది శ్వేతాదేవి కులప్రాబల్యం రాజ్యాధికారం చేస్తున్న ఈ దేశంలో మనుషులుగా బతకడానికి కూడా ఆస్కారం లేకుండా, స్వేచ్ఛా స్వాంత్ర్యాలు పాగొట్టుకొని వంచితులయిన పీడిత ప్రజల ప్రచార పాటవాలకు కథావస్తువులన్నీ దోపిడీ సమాజమే అందజేస్తుందంటుంది శ్వేతాదేవి ఈ హక్కును వీళ్లకు మిగిల్చిపోయినదెవరో తెలియదంటుంది! బతుకు బరువైన వేళా, కన్నీరు చెరువైన వేళా బాధితులలో చైతన్యం వెల్లివిరిస్తుంది దళిత జాతుల్లోని ఈ ఇంటింటి గాధను, భూములు, కౌళ్ళు అన్నీ బాకీలకి దఖలు పడి ఫకీరులై పోతున్న గాధను ఈ రోజుకీ మనం చూడొచ్చు ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్, కేరళల్లో ఆదివాసుల జీవనానికి అడ్డుతగులుతూ వచ్చిన స్థానిక భూస్వామ్య శక్తుల ధాష్టీకం గిరిజనోద్యమాల వల్ల కొంత కట్టుబడినా, గిరిజన భూములను చట్టవిరుద్ధంగా ఆక్రమించుకొన్న మైదాన ప్రాంతాల (సెటిలర్స్) భూస్వాముల పెత్తనం కొత్తగా తలెత్తింది ఇటీవల తీసిన లెక్కల ప్రకారం 2,000 మంది గిరిజన స్త్రీలు గిరిజనేతర భూస్వాముల ఆగడాలకు, రకరకాల మోసాలకు గురయ్యారు! గిరిజన ప్రాంత భూముల క్రయవిక్రయాలను నియంత్రించే బదలాయింపు రెగ్యులేషన్ ఉన్నా, "వన్ ఆఫ్ సెవెంటీ" రెగ్యులేషన్ ఉన్నా, హెమెండార్ఫ్ నివేదికలున్నా ఈ దోపిడీ యధేచ్ఛగా సాగిపోతూనే ఉంది గిరిజన భూములకు చెందిన అరవై వేల కేసుల్లో గిరిజనులకు అనుకూలంగా పరిష్కారమయిన కేసులు ఇరవై వేలు కూడా లే ఇది ఇలా ఉండగా, యువతరం డబ్బూ, హోదా భోగభాగ్యాలు ఇచ్చే విలువల్ని కాస్తా నిరాకరి ` ఆగ్రహావేశులై ఎందుకు అడ్డదారులు తొక్కుతున్నారో, ఎందుకిలా మారవలసి వచ్చిందో తెలియక సతమతమవుతున్న తల్లుల చరిత్ర శ్వేతాదేవి

"ఒక తల్లి" కథ! పారుపోని పదాలతో, అద్భుతమైన సంభాషణా చతురిమతో కథాచిత్రణ చేయగలిగిన దిట్ట శ్వేతాదేవి వాక్యవిన్యాసంలో, కథాసంవిధానంలో ప్రసిద్ధ రచయిత జోన్ డిడియన్ లాంటిది శ్వేతాదేవి హెమింగ్వే రాసిన "ఫేర్ వెల్ టు ఆర్మ్స్" నవల తన వాక్యనిర్మాణాన్ని సునిశితం చేసిన రచన అంటుంది డిడియన్ సూటిదనమేగాని, మార్మిక రచన తన లక్ష్యం కాదంటుంది. *("They are perfect sentences, very direct sentences, smooth rivers, clear water over granite, no sinkholes")* అలాగే శ్వేతాదేవి రచన కూడా జీవితం ఊట కాదు, అదొక జల, మహత్తర శక్తి ఆ శక్తినుంచి పుట్టుకొచ్చేదే సృజన శక్తి ఈ శక్తి రచనకూ, కళా ఖండానికీ ప్రాణం, మహాప్రాణం రచయితలో నిద్రాణమై ఉండే ఈ శక్తికి జనశక్తితో చేతులు కలిపినప్పుడే సార్థక్యం!

ఆదివారం 5, జనవరి 1997

## 'బోన్సాయ్' బతుకులకు సమాధానం సునీత!

సుప్రసిద్ధ కథారచయిత అబ్బూరి ఛాయాదేవి రాసిన "బోన్సాయ్ బ్రతుకు" కథలో స్త్రీ తన భవితవ్యాన్ని ఎలా దిద్ది తీర్చుకోవాలో చెప్పారు ప్రశ్నోత్తరాలుగా సాగిన కథనంలో అక్కాచెల్లెళ్ళ సంవాదం నుంచి ఓ మచ్చుతునక చూడండి - అక్క "తురాయి చెట్టునీ, దానిమ్మ చెట్టునీ పూలకుండీల్లో వేశారు, మరుగుజ్జుల్లా తయారవుతాయి ఏ చెట్టయినా బయట విశాలంగా స్వేచ్ఛగా పెరగడంవల్ల పెద్ద చెట్టు అవుతుంది ఎంతటి గాలి దుమారం వచ్చినా అది చలించదు అలాగే నువ్వు అపురూపంగా పెంచిన బోన్సాయ్ చూడు చూడ్డానికి కుదురుగా ముచ్చటగానే ఉంది సంసారపక్షపు స్త్రీలాగ కాని ఎంత సుకుమారమో చూడు నువ్వు వెయ్యికళ్ళతో కాపాడాలిదాన్ని -కాస్త తుఫానుకి కూడా తట్టుకోలేదు తనే ఒకరి మీద ఆధారపడి నప్పుడు మరొకరికి నీడ కూడా ఏమివ్వగలదు? మగవాడికీ, ఆడదానికీ పెంపకంలో ఉన్న తేడా వల్లనే కదా ఆడదాని బతుకు కూడా 'బోన్సాయ్'మాదిరి అయింది"।

ఈ నిశిత పరిశీలన సామాజిక చైతన్యంవల్ల మాత్రమే సాధ్యం. ఆ చైతన్యం మూర్తీభవించిన వ్యక్తి సుప్రసిద్ధ మహారాష్ట్ర రచయిత సునీతా దేశపాండే సామాజిక శాస్త్రవేత్తల దృష్టిలో-రాజకీయాలు, నైతిక విలువలు, తాత్త్విక చింతన, కళాదృష్టి, పరస్పరం ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్న సాంఘిక చైతన్యానికి విభిన్న రూపాలు చారిత్రక పరిణామక్రమంలో ఈ చైతన్య ప్రవంతినుంచి తప్పించుకొని కన్నుగానని అనంతంలోకి ఎగిరిపోవడంగానీ, లేదా బాధ్యతలనుంచి అంతుకుముందే తప్పించుకు తిరగడంగానీ సాధ్యపడదు అంతటి సంఘజీవి సునీతా దేశపాండే ఆమె 'బోన్సాయ్' మొక్క కాదు స్వేచ్ఛాజీవి, పరిమితులెరిగిన ప్రమద జీవితంలో సుశిక్షితుడైన తండ్రి కనుసన్నలలో, కుప్పిలి పద్మ "మసిగుడ్డ"కథలోని మాతృమూర్తిలాగా కేవలం వంటింటి చాకిరికి వారసురాలై రెక్కలు ముక్కలు చేసుకొని పిల్లలను ఈదుకువచ్చిన టీచర్ తల్లి అల్లారుముద్దు పెంపకంలో ఎదిగివచ్చిన సునీత అనుభవాలను మూటగట్టుకొని రాసిన స్వీయచరిత్ర *("And Pine For What Is Not")* కేవల కుటుంబగాథ కాదు ఆమె చరిత్ర స్వాతంత్ర్యోద్యమ వికాసచరిత్ర ఆమె విద్యార్థి దశనుంచీ స్వతంత్ర అభిప్రాయాలతో ఎదిగి తిరుగుబాటు దారుగా, ఆ తరువాతి దశలో స్వాతంత్ర్యోద్యమ కాలంలో విప్లవకారిణిగా, అజ్ఞాత వీరనారిగా ఒక వెలుగు వెలిగిన మహిళ ఒక రంగస్థలనటి, ఒక ఉపాధ్యాయిని, రచయిత, విద్యాసంస్థల నిర్వాహకురాలు అయిన సునీత బహుముఖ ప్రజ్ఞాశాలి శాస్త్రవేత్తలు, జీవశాస్త్ర నిపుణులూ చెవులొగ్గి వినేవారికి ప్రకృతి సంగీత మయం అంటారు జీవితంలో ఇన్ని రకాల అనుభవాలను చవిచూసిన సునీత భావనాస్రవంతి రసమయం ఆమె ప్రకృతి ఆరాధకురాలు, పుష్ప సంతతికి చెలికత్తె, కళలకు కాణాచి, చదరంగ క్రీడ, బ్రిడ్జి ఆట, తార్కికదృష్టి-ఈ మూడు ఆమెలో హేతువాద ధోరణులను సునిశితం చేసిన పరశువులు ఇది పనిగట్టుకు రాసిన స్వీయ చరిత్ర కాదు, తన జీవితంలో తారసిల్లిన ఘట్టాలను, కుటుంబ సత్యాలను, కుటుంబ బంధాలను, ఉద్యమాలతో అనుబంధాలనూ సమన్వయ దృష్టితో పరిశీలించిన చరిత్ర ఇది రత్నగిరి కొస్తాకే పరిమితం గాక మహారాష్ట్ర మహిళాలోకపు దీపకళికలలో ఒకరైన సునీత భారత జాతీయోద్యమంతో ముఖ్యంగా క్విట్ ఇండియా ఉధృతిలో ఎదిగి వచ్చిన స్త్రీ మూర్తి నెహ్రూ నుంచి, అజాద్ వరకు, జిన్నానుంచి జయప్రకాష్ నారాయణ్

దాకా జాతీయ నాయకుల ఉపన్యాసాలతో ఉత్తేజితురాలైన వ్యక్తి ఈమె ఈ చరిత్ర ఒట్టి తలపోతలు కావు, గిరిగీసుకున్న చట్రంలో జీవితాన్ని ఇమడ్చడం ఆమెకు నచ్చదు స్వేచ్ఛావిహంగంలా ఆలోచనలకు రెక్కలు తొడిగింది చిన్ననాటి ముచ్చట్లను పెద్దనాటి అనుభవాలనూ పూసల్లో దారంలో గుదిగుచ్చింది అందమైన భావాలతో కడుసుందరమైన వర్ణనలతో, తాత్వికతను మేళవించి మరీ సాగించిన రచన-ఈ స్వీయచరిత్ర "క్విట్ ఇండియా" ఉద్యమం నాటికి స్కూలు చదువులు పూర్తిచేసి పై చదువులకు వెళ్ళిన సునీత 1942 ఆగస్టు ఉద్యమం పిలుపుతో ప్రజల మనిషిగా మారిపోయింది. స్వాతంత్ర్యోద్యమంలో అజ్ఞాతవాసం చేసింది "ఫ్రీడమ్ మోవ్‌మెంట్" కు చెందిన అన్నా సహస్రబద్ధితో కలిసి రాజకీయ రహస్య కార్యకలాపాలు సాగించింది అజ్ఞాత వాసంలో దాదాపు పట్టుబడి ఎలాగో తప్పించుకుంది. బొంబాయి, దాదర్‌లలో ఉద్యమానికి అండగా బాంబులు తయారీలో నిమగ్నమయింది ఈ పనులన్నీ సునీత పదహారేళ్ళకే చేసింది! అనుభవాలు రీళ్ళుగా కళ్ళముందు తిరుగుతూన్నప్పుడు ఆమె "నా జీవితంలో ఆగస్టు ఉద్యమ అజ్ఞాతవాసం ఒక పెద్ద మలుపు ఉద్యమాలలో ఒక్కో సందర్భంలో వ్యక్తి జీవితం సమున్నత శిఖరాలకు చేరుకోవచ్చు, లేదా అఖాతంలోకి దిగిపోవచ్చు" అంటుంది అంతేగాదు, తాత్విక ధోరణిలో సునీత "ఈ జీవన సమరగాథ ఎక్కడ మొదలై, ఎక్కడ మజిలీ చేసి, మరెక్కడ ముగింపునకు వస్తుందో"నని చెప్పి దృగ్గోచరం కాని జీవన అజ్ఞాతరేఖను మాత్రం స్పృశించుకుంటూనే" ముందుకు సాగుతానంటుంది

జీవితంలో నిరాశ, నిస్పృహలుండవా? ఉంటాయి కాని, సామాజిక స్పృహతో వాటిని అధిగమించి జీవన మార్గాన్ని సుగమం చేసుకోవచ్చునన్నది సునీతా దేశపాండే నిశ్చితాభిప్రాయం నిరాశలో ఉన్నప్పుడు నింగి కూడా నీలిమగా కనిపించడం మానుకుంటుంది! కనుకనే తన స్వీయ చరిత్ర పిట్టకథల, ఫాంటసీల చరిత్ర కాదనీ, సమస్యలూ ప్రశ్నలూ లేని పరిసరాలను తాను ఊహించలేననీ తెగేసి చెబుతుంది సునీత ఈ జీవితం పూర్తి సుఖాంతమూ కాదు, విషాదాంతమూ కాదు, సుఖదు ఖాల మేలుకలయిక మాత్రమేనంటుంది నాస్తికవాది అయిన సునీత, ఆస్తిక వాదంలోని 'సుఖశాంతుల్ని'కాదనలేదు నాస్తికవాదం మనం గర్వించదగిన సిద్ధాంతమే అయినా, అందులో మానసిక శాంతి దొరకని మాట వాస్తవం అనీ, శాంతి అన్నది 'విశ్వాసం'లో దొరుకు తున్నప్పుడు వాదించకుండా అలా వదిలివేయడమే మంచిదని సునీత లౌక్యం అంతేగాదు, మనస్సుకీ, శరీరానికీ మధ్య సమన్వయాన్ని ఆధునిక వైద్యశాస్త్రం సాధిస్తున్న ఈ యుగంలో, జెనెటిక్ ఇంజనీరింగ్ జాంబవంతుని అంగలతో ముందుకు సాగుతున్న ఈ శకంలో మానవుల మధ్య ఐకమత్యసాధన ఒక సమస్యగా పరిణమించరాదని ఆమె అభిలాష శరత్‌చంద్ర ఛటర్జీలాంటి మహోన్నత రచయితల సారస్వత సంప్రదాయంలో ఎదిగిన సునీత ఊహాపోహలలో ఆధునిక పోకడలు పోయింది మరకత మాణిక్యాలు, తారా సమూహాలూ, ఏళ్ళూ, సెలయేళ్ళూ, పుష్పాలు, విషాదాలు, ఆనందాలు- వీటన్నింటినీ మన అనుభవాలకు అనుగుణంగా మలచుకోనంత వరకూ అవి వేటికవే ఒక ప్రపంచం, విలువలేని ప్రపంచంగా ఉండిపోతాయి అవి మన అనుభూతులలో పడుగుపేకలైనప్పుడు కవితా న్యాయం చేకూర్చగల శక్తిమంతమైన ప్రతీకలవుతాయని సునీత కవితాత్మతో వర్ణిస్తుంది! 'పువ్వుపేరు చెప్పండి, ఏ రుతువులో దాని ఆగమనమో చెబుతానన్నాడు' హరీన్‌దాదా! అలాగే తన ముత్తవ తల్లికీ, మనుమరాలు సునీతకూ ఒక సమాన ధర్మం ఉంది అదే- పుష్ప విలాసం చేతులారా పెంచిన

పుష్పవనం అది అక్కడ దొరకని పువ్వులేదు ఒకటా రెండా- గులాబీలు, మోదుగలు, జాజులు, విరజాజులు, చంపకాలు, చెంగల్వలు, చంద్రకాంతలు, మల్లెలు, మందారాలు, నంది వర్ధనాలతో నిండిన నందనవనం ఆ పూదోట! అంతేగాదు, తన మిత్రుడెవరో చనిపోయినప్పుడు సునీత చెప్పిన మాటలు వచనంకాదు, వచన కవిత్వమూ కాదు కవిత్వమే ఆత్మీయుడు దివంగతుడైనప్పుడు "బహుశా ఈ ఆనందాలు, విషాదాలు కూడా అలా మన గుండెల్లో గూడుకట్టుకుని ఉండిపోడానికి ఇష్టపడవు గతించిన నేస్తాల గతులను వెతుక్కుంటూ మనల్ని విడిచి వెళ్ళిపోతాయి కూడా"! వివాహాలు, కుల, మతాలు లౌకిక వ్యవస్థల గురించిన ఆమె అభిప్రాయాలు అందరూ పరిశీలించదగిన కొత్తకోణాలు! తన ఇంట్లో ఒకప్పుడు మైనారిటీల పట్ల తెలియని వివక్ష ఎలా ఉండేదో ఉదాహరిస్తూ సునీత, ఒకనాడు ఇంట్లో రెండు రకాల కాఫీకప్పుల్ని అతిథులకు అందజేసేవారని, కాలక్రమంలో కాఫీ కప్పులు కూడా ఎలా "సెక్యులర్ కప్పులు"గా మారాయో వ్యంగ్యంగా చెప్పింది! మత విశ్వాసాలు కేవలం వ్యక్తిగతమైనవని భావించిన సునీత మాతృత్వం సమస్యపై ఐరావతీ కార్వే అభిప్రాయాలతో విభేదించింది. పిల్లల్ని కనడమే మాతృత్వానికి పరమావధియా, స్త్రీత్వానికి ఆదర్శమా అని ప్రశ్నించి, బాధ్యతల నుంచి తప్పించుకు తిరిగే పురుషులను కూడా హెచ్చరించింది "శిశువుకు జననం ఇవ్వడమే మాతృత్వ పరిపూర్తికి నిదర్శనం కాదు శిశుత్వం అమాయకత్వం దాన్ని కాపాడుకోవడం చాల కష్టం ఒకసారి శిశుత్వం కోల్పోతే మళ్ళీ రాదు అలా అమాయకత్వంలో ఉండాలంటే తల్లిలాగా ఎవరో ఒకరి సంరక్షణ తప్పదు ఆ 'ఎవరో ఒకరు' అన్నారే- వాళ్ళకు తమ వ్యక్తిత్వం మీద కంట్రోల్ ఉంచుకోవాలనీ, నియమ నిబంధనల్ని పాటించాలనీ అంటుందావిడ శిశువు పెరుగుదలకు ఒక్క తల్లి మాత్రమే బాధ్యత వహించాలనడం, కేవలం కన్నంత మాత్రానే ప్రతీ భారాన్ని ఆమె మీదికి నెట్టడం, ఇతరులు చేతులు దులుపుకోవడం తగదని సునీత వాదన కుటుంబం ఐకమత్యంగా ఉండాలని, ఈ మానవజాతి యంత్ర యుగాంతంలో మానవసంబంధాలకు విఘాతం కలగకుండా ప్రేమానురాగాలు బలపడాలనీ, ఒకరి నీడను చూసి మరొకరు భీతిల్లే ఆఫ్రికన్ 'ఇక్' *(IK)* తెగలా రక్త సంబంధాలు మరిచి, బంధుత్వాలు తొలగి, సాంఘిక బాధ్యతలు తెలియని దిశగా ప్రయాణించరాదనీ సునీత ఆశాభావం

ఆదివారం మార్చి 31, 1996

# మానవుడే 'మాధవుడ'ని చాటిన తాత్త్విక నవల!

ఇప్పటికి సుమారు ముప్పయ్యేళ్ళనాడు మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావు తన సంశయ నివృత్తి కోసం "సదసత్సంశయం" కవితలో కొన్ని ప్రశ్నలు వేసుకొని సమాధానాలు చెప్పాడు " ఈ సృష్టికి ఏమర్థం/మానవునికి గమ్యమేది/ ఒక సకలాతీతశక్తి/ఉన్నట్టా లేనట్టా!" అని దానికి తానే విరుగుడు చెబుతూ "మానవ స్వభావంలో/మాలిన్యమదేమొకాని/తలలైతే తారలలో /పొరలడమో బురదలోన" అని చాటాడు! చివరికి మానవుడి జీవనయాత్ర అనంతమని చెబుతూ కష్టసుఖాలు అవిభాజ్యమని చాటి మానవుడి చివరి మజిలీని కూడా నిర్ణయించాడు ప్రాణికి మృత్యువు, జీవికి వేదనా తప్పవని తెలుసుకోమని ఇలా అంటాడు "జడిగొల్పే దుఃఖంలో/తడియకుండ గొడుగులేదు, ఆనందాలన్నీ తుదకంతమొందునొక సమాధి' విశ్వసృష్టి, మానవుడి చావు బతుకులు, ప్రకృతి పరిణామం ఇత్యాది సమస్యలు అనాదినుంచీ జిజ్ఞాసువుల్ని కదిపి కుదుపుతున్నవే, సృష్టి రహస్యాన్ని ఛేదించడానికి వేల సంవత్సరాలుగా తత్త్వజ్ఞులు జరిపిన జిజ్ఞాసయాత్ర ఒక్క ప్రశ్నతో ముగియలేదు సంతృప్తికరమైన సమాధానాలకోసం మానవుడు పంచ భూతాల్ని ప్రశ్నించాడు, మహా కవుల గ్రంథాల్ని శోధించాడు, పరివ్రాజకుల్ని ముముక్షువుల్ని కదిపి చూశాడు తనకు తట్టిన ఈశ్వరుణ్ణి నిలవేశాడు, కడిగేశాడు, తాత్త్వికుల్ని, నాదోపాసకుల్ని, గతిలేని జనాలను అడిగిచూశాడు, రాళ్ళని, రప్పలను కూడా పలకరించాడు అయినా అతని యాత్ర ముగియలేదు. గీతను, ఖురాన్‌ను, జెందావెస్తాను, బైబిల్‌నూ మరొకసారి తిరగవేసి చూశాడు అక్కడికీ సృష్టి రహస్యం అతనికి అంతుపట్టలేదు, అతని జిజ్ఞాసయాత్రా ముగియలేదు! మన ఋగ్వేదం పదవ మండలం ప్రశ్న మన అజ్ఞాన సరిహద్దులను చెరిపివేసే గొప్ప ప్రశ్న ఆదిమానవుని కల్లోల మానసిక స్థితికి ఈ ప్రశ్న ప్రతిబింబం సృష్టికిముందు సత్తు, అసత్తు (ఉంది-లేదు)అనేవి లేవు, వాయువు లేదు, ఆకాశం లేదు. మరి ఏముంది? ఎక్కడ ఉంది? ఎవరి రక్షణలో ఉంది? ఇలా ప్రారంభమైన ఋగ్వేదం 129వ సూక్తం "ముందు జలం పుట్టింది, దాన్నుంచి వేడిద్వారా మనస్సు పుట్టింది" అని చెబుతూ నేటి జిజ్ఞాసువులందరినీ కూడా ఆశ్చర్యంలో ముంచెత్తే ఒక విషయం బయటపెట్టింది· సృష్టి దేనినుంచి ప్రారంభమైందో చెప్పడం కష్టం" అని పేర్కొంది! పైగా విశ్వసృష్టి రహస్యం పరమవ్యోమంలో ఉన్న "అతనికి తెలుసు లేదా తెలియకపోవచ్చునని" సృష్టికర్త ఉనికినే ప్రశ్నించింది! ఒక్క భారతీయ దర్శనాలకే కాదు, ప్రపంచ దర్శనాలన్నీ ఈ ప్రశ్నతోనే (సృష్టి రహస్య జిజ్ఞాసతోనే) తార్కిక చర్చను పెంచుకుంటూ పోయాయి. భావనాశక్తి, ప్రశ్నోత్తరాల సంపుటమే తాత్విక ప్రపంచం ఈ మానవుడు బుద్ధిబలంతో, హస్త కౌశలంతో సాధించిన విజయాలు మిగతా జీవకోటిపైన, ప్రకృతిపైన పొందిన విజయాలు అజరామరాలు భావనా శక్తిద్వారా కవిత్వం, శిల్పం, సంగీతం ఇత్యాది లలిత కళలను పోషించాడు, ఈ ప్రగతి అర్థాన్నీ పరమార్థాన్నీ తానే వివరించుకున్నాడు దర్శనాలు ఒకటి కావు-ఎన్నో భారతీయ, గ్రీక్, క్రైస్తవ, యూదీయ, అరబ్, యూరోపియన్, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, చైనీస్ దర్శనాలు! ఇలా ఎన్నో మన వైదికం, లోకాయతం, తీర్థంకర దర్శనాలు, జైన, బౌద్ధ, భగవద్గీతలు, షడ్దర్శనాలు వగైరా ఇలాంటివే ప్రతి సమస్యకూ ఎక్కడో ఒక చోట పరిష్కారం ఉండడం సహజం. కాని "ప్రతి పరిష్కారానికి తన వద్ద ఒక సమస్య" ఉందని ప్రకటించి తర్క పరిధులు అనంతం అని తేల్చినవాడు తాత్త్వికవేత్త రాబర్ట్ జండ్! కాని సమస్యలు పరిష్కరించలేక,

ఆకుకు అందని పోకకు పొందని తెలివితక్కువ సమాధానలివ్వడమే తత్త్వశాస్త్రం అన్నాడు హెన్రీ ఆడమ్స్! అలా కాదు, సరైన ప్రశ్నలు అడిగే కళే తత్వశాస్త్రం అని చెబుతూ, తార్కికులు చెప్పే సమాధానాల్లోనే ప్రశ్నలూ పొదిగి ఉంటాయన్నాడు అబ్రహాం వెస్చెల్ కాగా, తత్త్వచింతనను సంప్రదాయాలపై నిరంతర సమరంగా కార్లయిల్ భావిస్తే, "నీకు తెలిసింది సైన్స్, తెలియనిది తత్త్వ శాస్త్రం" అన్నాడు బెర్ట్రాండ్ రస్సెల్ ఇలా ఎవరికి తోచిన అర్థాన్ని వారు చెప్పుకొంటూ పోయారు ఈ వరసలో తాజాగా వెలువడిన గ్రంథాలలో ఒకటి "సోఫీ ప్రపంచం" *(Sophies's World) నార్వే దేశస్థుడైన గ్రంథకర్త జోస్టీన్ గార్డర్ చాలా సంవత్సరాలుగా తత్త్వశాస్త్రాచార్యుడిగా పనిచేస్తున్నారు ఈ రచన ప్రత్యేకత-మానవజాతి కడచిన మూడువేల సంవత్సరాలలో సమకూర్చుకున్న తాత్త్విక చింతనా చరిత్రను బహుశా మొదటిసారిగా 400 పేజీల నవలా రూపంలో పొదగడం మన ఉపనిషత్తులలోని ప్రశ్నోత్తరాల మాదిరే ఈ రచనలో కూడా సోఫీ, అల్బర్ట్ నాక్స్, హిల్డే, మోమ్ పాత్రల ద్వారా ప్రాచ్య, పాశ్చాత్య తత్త్వశాస్త్ర పారాల్ని అతి సుబోధకంగా అందించడం ఈ పుస్తకం విశేషం జటిలమైన తాత్త్విక చింతనను పడికట్టు పదాలతో కాకుండా తేలికగా సాధారణ సంభాషణ రూపంలో గార్డర్ ఈ రచనను దిద్దితీర్చాడు థోరే "వాల్డెన్" అనే నవలలో వాల్డెన్ విజ్ఞాన యాత్రకు తలపడినట్టే ఈ "సోఫీ ప్రపంచం"లో సోఫీ అనే అమ్మాయి తత్త్వశాస్త్ర చరిత్రలో విజ్ఞాన యాత్రలు సాగిస్తుంది, సుప్రసిద్ధ ఖగోళ భౌతిక శాస్త్రవేత్త అయిన స్టీఫెన్ హాకింగ్ రాసిన "కాలం దాని సంక్షిప్త చరిత్ర" *(A Brief History of Time)* కు గార్డర్ తాత్త్విక విశ్లేషణే "సోఫీస్ వరల్డ్" రచన! నార్వేజియన్ పిల్ల సోఫీకి తన విజ్ఞాన యాత్రలో ఉత్తరాల రూపంలో ఎదురైన ప్రశ్నలకు ఊతమిచ్చిన మరో పాత్ర-తాత్త్వికుడైన అల్బర్ట్ నాక్స్. నాగరికత తొలి రేఖలు సోకినప్పటినుంచీ నేటి దాకా తత్త్వశాస్త్రజ్ఞుల్ని వేధిస్తున్న మౌలికమైన ప్రశ్నలతో సోఫీ ఆలోచనలకు పదును పెడుతుంటాడు అల్బర్ట్ వీరిరువురి జిజ్ఞాస యాత్ర పాఠకుల విజ్ఞాన యాత్రగా సాగుతుంది ఎక్కడా విసుగుకీ, విరామానికీ అవకాశమివ్వకుండా ఆసక్తితో చదివిస్తున్న సోఫియా ప్రపంచం మానవ ప్రపంచంగా, మన ప్రపంచంగా తోస్తుంది! సోఫీ తనకు వచ్చిన ఓ ఉత్తరంలో ఎదురైన తొలి ప్రశ్న ప్రపంచ తాత్త్వికులందరికీ ఎదురైనదేగాని కొత్తది కాదు "నీవు ఎవరవు? ఈ ప్రపంచం ఎక్కణ్ణుంచి పుట్టుకొచ్చింది?" అందుకే ప్రశ్నకు ప్రపంచ నాగరికతా చరిత్రలో అంత విలువ ప్రశ్నతో పుట్టిన ఈ ప్రపంచాన్ని దార్శనికులు ఎలా అన్వేషించారో, ఎలా భాష్యం చెప్పారో అతి సులభంగా చెప్పిన గ్రంథం ఇది ఇది ప్రాచీన సోక్రటీస్ నుంచి ఆధునిక జాపోల్ సార్త్రదాకా తాత్త్విక మనో మందిరాలలోకి చొచ్చుకుపోయిన విజ్ఞాన యాత్ర ఇందులోని కథ "ఈడెన్ వనం" నుంచి ప్రారంభమై ఈ విశ్వం అవతరణకు కారణమైందని భావిస్తున్న "బిగ్ బాంగ్" (బద్దలైన బ్రహ్మాండం) సిద్ధాంతంతో ముగుస్తుంది ఈ విజ్ఞాన యాత్ర కంటకమైన మార్గాల గుండా ప్రయాణిస్తూనే ఆహ్లాదకరమైన సన్నివేశాలతో, సంభాషణా చాతుర్యంతో మనసును ఆకట్టుకునే విధంగా, ఆకట్టుకున్న ప్రతీ అంశం జ్ఞాపక శక్తిని పెంచే విధంగా ముందుకుసాగుతుంది.

మానవ జీవితంలోని అనుమానాల, అపోహల పొరలు చీల్చుకొని, మార్మిక ధోరణుల, ప్రకృతి రహస్యాల విచ్ఛేదనం వైపుగా ఈ యాత్ర సాగుతుంది పాశ్చాత్య ప్రపంచానికి చెందిన మహాతాత్త్వికులైన డెమోక్రటిస్, సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్, డెస్కార్టిస్, స్పినోజా, లాకీ, హ్యూమ్, బెర్కిలీ, ఇమాన్యుల్ కాంట్, హెగెల్, కిర్క్‌గార్డ్, కారల్ మార్క్స్, డార్విన్, ఫ్రాయిడ్, సార్త్ వరకూ విభిన్న తాత్త్విక ధోరణుల మీమాంస అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు

సరసమైన డైలాగ్స్‌తో రచయిత అందించాడు ప్రకృతి ఆధారంగా, ఆరాధనా భావంతో తమ చింతనను చికిలీ పట్టిన చంద్రహాసంలా మలచుకొన్న ప్రాకృతిక తత్త్వవేత్తలైన థేల్స్ అనాగ్జిమాండర్, హెరాక్లిటస్, అనాగ్జిగోరస్‌ల సంక్షిప్త చరిత్రలు ఇందులో మనకందుతాయి మొత్తం ప్రపంచ తాత్త్విక చరిత్రకు ఆదినుంచీ సవాళ్ళుగా మారిన ధోరణులు రెండు (అ) ఏదీ మారదు, మన ఇంద్రియాల ద్వారా పొందే జ్ఞానం విశ్వసించదగింది కాదు (ఆ) కాదు, ప్రతిదీ మారుతుంది ప్రవాహ గతిని ఎవరూ అడ్డుకోలేరు ఇంద్రియాలకు గోచరమైన ప్రతిదీ విశ్వసించదగింది ఆత్మ, అనాత్మవాదాలు ప్రాచ్య, పాశ్చాత్య దర్శనాలకు సమదూరంలో ఉన్నాయి! గ్రీకు దర్శనాలకూ ప్రాచ్య దర్శనాలకూ మధ్య తాత్త్విక చింతనలో ఎక్కువ సారూప్యత ఉంది. ఈ విషయాన్ని రచయిత నిష్పాక్షిక చర్చద్వారా వివరించగలిగాడు రెండు ధోరణులలోనూ భావ వాదంతోపాటు భౌతికవాదం అనాదినుంచీ సమాన ధర్మంగానే కొనసాగుతూ వస్తోంది ఖగోళ శాస్త్రాన్ని (అస్ట్రానమీ)కాకుండా రాశీ ఫలాలమీద, నక్షత్ర బలాలమీద ఆధారపడి మానవుల మనస్సులను అస్థిమితం చేస్తున్న జ్యోతిష్యాన్ని (అస్ట్రాలజీ) నమ్మిన వాళ్ళు రెండు రకాల దర్శనాల్లోను కనిపిస్తారు మనస్సుకు కళ్ళెం లేకపోతే ఈ మానవుడు ఊహలకు నిచ్చెనలు వేస్తాడంటాడు రచయిత గార్డర్ "చరిత్ర గతిని శాసించే శక్తులేవిటన్న" ప్రశ్నను సోఫీ మరికొంత విస్తృత పరిచి ఇలా అడుగుతుంది పిల్లి దర్శనం ఈజిప్షియన్లకు మంచిదైతే ఇతరులకు ఎందుకు కాదు? ఇంకొందరికెందుకు శుక్రవారం పనికిరాదు? ఇంకొందరికి 13వ తేదీ ఎందుకు అస్పృశ్యం అయింది? "చాలమంది జనం మూఢనమ్మకాల్లో కూరుకుపోయినందు"న ఈ పిచ్చి వదలదని సోఫీ సమాధానం అందుకే వేల సంవత్సరాలనాడే డెమోక్రిటస్ తత్త్వవేత్త "జాతక చక్రాన్ని" నమ్మలేదు, కేవలం పదార్థ విజ్ఞాన శాస్త్ర సరిహద్దుల్ని విస్తరిస్తున్న అణువులనూ, రోదసినీ విశ్వసించాడు! చరిత్ర శాసకులు ప్రజలేనన్నాడు యూదులది సెమిటిక్ సంస్కృతి, గ్రీకులదీ రోమన్‌లదీ ఇండో-యూరోపియన్ సంస్కృతి యూరోపియన్ నాగరికత వేళ్ళన్నీ ఈ రెండు సంస్కృతుల వారసత్వంలో ఉన్నాయి ఇందుకు సంబంధించిన వివరమైన అధ్యాయం ఈ గ్రంథానికి ఓ అలంకారం మధ్య యుగాల గురించీ, అంధయుగాల గురించీ మనలో కొందరికి ఇంతవరకూ ఉన్న అభిప్రాయాలకు భిన్నంగా గార్డర్ ఈ రచనలో కొత్త వెలుగులు చూపాడు, ప్రాచీన కాలానికీ, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ దశకూ మధ్య ఉన్న దశను మాత్రమే "మధ్య యుగాలు"గా భావించాడు. పునరుజ్జీవనోద్యమ కాలానికి ముందు వెయ్యి సంవత్సరాల పాటు మంచి భావాలకు పునాదులు పడ్డాయని, అభ్యుదయ దశకు అంకురార్పణ జరిగిందనీ ఈ గ్రంథం చెబుతుంది! ఎందుకంటే తొలి పాఠశాల వ్యవస్థకు, కాన్వెంట్ వ్యవస్థకూ, తొలి విశ్వవిద్యాలయాల నిర్మాణానికి పాశ్చాత్య ప్రపంచంలో పునాదులు పడింది-అంధ యుగాలను కుంటున్న ఆ మధ్యయుగాల్లోనే. బాధ్యతాయుతులైన పౌరులతో కూడిన నగరాలతో "నేషన్-స్టేట్స్" అవతరించింది కూడా ఆయుగంలోనే! జానపదకళా, సంస్కృతులకు, కథా చరితలకు బీజాలు పడింది అప్పుడే అంతేగాదు, ఆ మధ్య యుగాల్లోనే సెయింట్ ఓలాఫ్, చార్లమాన్, రోమియో-జూలియట్, జోన్ ఆఫ్ ఆర్క్, ఇవాన్ హో లాంటి వీరులూ, మహావీరులూ ఆవిర్భవించి ప్రజల్ని ఉత్సాహపరుస్తూ సంచరించారు! "రినైజాన్స్" రాకతో మత ధోరణులు మారాయి. ఛాందసాలనుంచి తత్త్వశాస్త్రం, సైన్సూ విముక్తి పొందాయి దిక్సూచి, ఆయుధాలు, ముద్రణా యంత్రం, టెలిస్కోప్ అవతరించాయి "జ్ఞానమే శక్తి" అని బేకన్ చాటాడు టెక్నాలజీకి

బీజాలు పడ్డాయి. ప్రకృతిని స్వాధీనపరచుకొన్నాడు మానవుడు. రాబర్ట్ బరన్స్ "మానవుడే బంగారం" అని కీర్తించాడు ఈ యాత్ర అనంతం మధ్యలో చిన్ని చిన్ని అవాంతరాలను లెక్క చేయకుండా సాగిపోతుందాయాత్ర అందుకే అబ్బూరి అన్నాడు "ఒక్క చోట చిక్కువడ్డ/చక్కని నా జీవనౌక/అనంతాబ్ధిసాంగత్య/మ్మభిలషించి పయనమయ్యే"! ఇక ఈ పయనం ఆగదు!

ఆదివారం 4, ఆగష్టు 1996

---

* *"SOPHIE'S WORLD" by Josterin Garder*

# కథాశిల్పి కేశవరెడ్డి తాత్విక యాత్ర

"నేనే కాదు, సమాజంలో ప్రతి ఒక్కడూ ఏదో ఒక విధమైన పోరాటంలో మెడదాకా కూరుకుపోయి ఉండడం గమనించాను. కొందరు జానెడు పొట్టకోసం, కొందరు బ్యాంకులు నింపడం కోసం, కొందరు పదవి కోసం, కొందరు కీర్తి కోసం, మరి కొందరు ఆడవాళ్ళకోసం వివిధ స్థాయిల్లో పోరాటం సాగిస్తున్నారు. చీకటి మూలానే వెన్నెలను చూసి ఆనందిస్తున్నాం. దుఃఖం మూలానే సంతోషాన్ని కోరుకుంటున్నాం. మరణం మూలానే జీవితాన్ని ప్రేమిస్తున్నాం. స్పర్థ లేకుంటే జీవితం స్తబ్ధతతో నిండిపోయి నిస్సారమై పోతుంది. దీన్నిబట్టి మానవ జీవితంలో పోరాటం అనివార్యమే కాక అవసరం కూడా అని అంగీకరించవచ్చు."

ఈ మాటలు ఇప్పటికి పదేళ్ళనాడు తెలుగు పాఠకలోకానికి, కథాప్రియులకు, నవలాప్రియులకు లభించిన ఉత్తమ నవల 'అతడు అడవిని జయించాడు' రచయిత, కథాశిల్పి డాక్టర్ కేశవరెడ్డివి. తిరిగి పదేళ్ల అనంతరం ఈ నవల మలి ముద్రణ అందుకుంది. అనేక మంచి ప్రశంసలకూ, కథా సంవిధానంపై కొన్ని విమర్శలకు పాత్రమైన ఈ నవల కానీ, కేశవరెడ్డి కలం చిందులు తొక్కిన ఇతర రచనల్లో పేరొందిన "చివరి గుడిసె" మూగవాని పిల్లనగ్రోవి" నవలికలు గానీ అందిస్తున్న సందేశం మానవుడి జీవన పోరాటం, దాని అనుభవాలు, వాటి నుంచి తీసుకోవలసిన గుణపాఠాలూ. వైరుధ్యాలతో కూడిన ఈ జీవితానికి కేవలం తాత్వికులు చెప్పే భాష్యానికీ, రచయితలుగా కథకులూ, నవలాకారులూ నడిపించే కథాక్రమానికీ చాలా తేడా ఉంటుంది. ఒకటి సిద్ధాంత నిరూపణకు ప్రయత్నిస్తే మరొకటి జీవితానుభవంతో సిద్ధాంతాన్ని మేళవించి సామాజిక పరిణామక్రమాన్ని దర్శించే తీరునూ, దృష్టినీ పాఠకులకు అందించడానికి ప్రయత్నిస్తుంది. కేశవరెడ్డి రచనలు ఈ సామాజిక స్పృహను కాచి వడపోసిన జీవిత సత్యాలనుంచి తిరిగి పాఠకులలో కల్పించడానికి ఉద్దేశించినవిగా భావించాలి. మనకు గొప్ప నవలలు లేవన్న బెంగ కొందరికి ఉన్నట్టుంది. ఉన్నవ 'మాలపల్లి', జి.వి.కృష్ణారావు 'కీలుబొమ్మలు', రా.వి.శాస్త్రి 'రాజు-మహిషి', 'రత్తాలు-రాంబాబు',కాళీపట్నం 'యజ్ఞం', ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి', 'గంగు', దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు', 'జనపదం', 'మోదుగుపూలు', మధురాంతకం, మునిపల్లెరాజు, నాయిని సుబ్రహ్మణ్యం నాయుడు కథలూ సామాన్య మధ్య తరగతి పాఠకలోకాన్ని నాటికీ, నేటికీ ఊగించి శాసిస్తున్న రచనలే. మనస్సులను చిత్రికపట్టి ఆలోచనా తరంగాలను రేకెత్తించినవే. ఈ వరసలో కేశవరెడ్డి చేసిన ప్రయత్నం వర్తమాన ప్రపంచ పరిస్థితుల్లో, దేశ కాలమాన స్థితిగతులకు కర్మసాక్షిగా సామాజిక జీవితంలో, వ్యక్తి జీవనంలో వస్తున్న ఒడిదుడుకులకు, జీవన సమరంలో ఎదుర్కొంటున్న కష్టనష్టాలకు, సుఖదుఃఖాలకూ సామాన్యుడి కామనను పతాకశీర్షికగా మార్చుకోవడం! అద్భుతమైన కథాశక్తి, మానవుడి నిత్యజీవనాన్ని ప్రభావితం చేసే ప్రతి సన్నివేశాన్ని, ప్రతి చిన్న కదలికనూ సూక్ష్మదృష్టితో పరిశీలించి అక్షరరూపమివ్వడంలో సిద్ధహస్తుడు కేశవరెడ్డి. జీవితం వైరుధ్యాల పుట్టగా భావించిన రచయిత మానవుడి జయాపజయాలను సమంగానే చూడగల శక్తి గలవాడు. ప్రకృతి శక్తులపై మానవుడు సాగించే నిరంతర పోరాటంలో ఓటమిని కూడా విజయంగానే భావిస్తాడు. ఒకచోట ఆరిపోయేదీ జీవితమే, మరొక చోట వెలిగేదీ జీవితమేనన్న జూలియస్ ఫ్యూజిక్ అపురూప నిర్వచనానికి వారసుడు కేశవరెడ్డి.

పాతవారి అనుభవాలూ, సందేశాలూ ఆ తరువాతి తరాలకు అందివస్తాయి. పెద్దపెద్ద

సన్నివేశాలు కాదు చిన్న చిన్న సంఘటనల ఆధారంగానే మహత్తరమైన జీవనసత్యాన్ని, అనుభవసారాన్ని రసగుళికలుగా అందించగల శక్తియుక్తులున్న కథాశిల్పి కేశవరెడ్డి "అడవిని జయించిన" ముసలివాడు, బీభత్సరస ప్రధానమైన 'చివరిగుడిసె'లో యానాదుల బతుకుల్లో తారసిల్లే 'మన్నుగాడు', బైరాగి, కరుణరసాన్ని చిప్పిల్లచేసే 'మూగవాని పిల్లనగ్రోవి'లో, భూమి కోసం, భుక్తికోసం, దాస్య విముక్తి కోసం ప్రాణాలు విడిచిన రైతు 'బక్కిరెడ్డి' ఈ భూమిపై ఆఖరి మానవుడి విమోచన జరిగే వరకూ సామాన్యుడికి జవజీవాలున్న ప్రతినిధులుగానే, జీవన పోరాటంలో తలవంచని వీరులుగానే ఉండిపోతారు తన జైలు జీవితంలో అనుభవాలను రంగరించి నవనీతం లాంటి సారాన్ని దుష్టశక్తులపై విజయపతాకంగా ఆధ్యాత్మిక యాత్రగా జాన్ బన్యన్ అందించిన 'పిలిగ్రిమ్స్ ప్రోగ్రెస్' రచనలో సత్యాన్వేషి *(Valiant-for-truth)*, అడవిని జయించిన ముసలివాడూ ఒకలాంటి మనుషులేనని చెప్పవచ్చు! జనాధన్ స్విఫ్ట్ 'గలివర్' యాత్రలు ఒకప్పుడు ఇంగ్లీషు జీవన విధానంపై వ్యంగ్య వైభవంతో తీసిన దెబ్బలూ, 'అతడు జయించిన అడివి'లోని ముసలివాడు జీవన పోరాటంలో గడించిన అనుభవాలనుంచి సామాజికులకు అందించిన పాఠాలూ మరువరానివి జాన్ బన్యన్ ఆధ్యాత్మిక యాత్రలో దైవదత్తం చేసిన కత్తీ, జీవన సమరంలో చెడును చెండాడుతూ కేశవరెడ్డి సృష్టించిన పాత్ర 'ముసలివాడు' చేపట్టిన ఈటె-దుష్ట శక్తులను దునుమాడడానికి ఉద్దేశించిన ప్రతీకలే! అలెక్స్ హేలీ రచన'ది రూట్స్' (తెలుగులో 'ఏడు తరాల కథ') లోనూ, మోరీ తెగల గురించి కేరీ హల్మ్ రాసిన 'ది బోన్ పీపుల్' *(The Bone People)* లోనూ నడిపిన జీవన సమరం లాంటి పోరాటం కేశవరెడ్డి అన్ని రచనల్లోనూ మనకు దర్శనమిస్తుంది "బోన్ పీపుల్" రచనలో పాత్రధారిణి అయిన కెరివిన్ అనే కళాకారిణి తెగల జీవన విధానంలో పడుగుపేకల్లా అల్లుకుపోయిన మూగభాషకు (సైన్ లాంగ్వేజ్) అలవాటు పడిపోయినట్టే "అడవిని జయించిన" ముసలివాడు సామాజిక జీవనంలో అన్యాయపరంపరతోనే కాదు, అటవీ న్యాయంతో అడవిలోని ప్రకృతితో, జంతుజాలంతో, ఇతర ప్రాణికోటితో మమేకమై పోయి, వాటి భాషను తోటి భాషగా మార్చుకుంటాడు పరిసరాలకు, పరిస్థితులకు అలవాటు పడడమంటే జీవన యాత్రలో సుఖదుఃఖాలకు, పోరాటాలకూ సిద్ధం కావడమేనన్నది కేశవరెడ్డి తాత్త్విక సందేశం ప్రతి సన్నివేశాన్ని దృశ్యకావ్యంగా మలచగలిగిన కేశవరెడ్డి దృష్టిలో స్వీయానుభూతి కన్నా సహానుభూతి గొప్పది ఎందుకంటే స్వీయానుభూతి వ్యక్తిగతం, సహానుభూతి సామాజికం రాబర్ట్ ఫ్రాస్ట్ ఆలాపించినట్లు జీవనయానం అనంతం ఆ అనంత యాత్రలో ముసలివాడు, మన్నుగాడు, బక్కిరెడ్డి బతికి బట్టకట్టాలంటే బతుకుపోరుకు సిద్ధం కావాల్సిందే

కేశవరెడ్డి సృష్టించిన ముసలివాడి పాత్రనూ, లేదా అతని నవలనూ ఎర్నెస్ట్ హెమింగ్వే రచన "ది వోల్డ్ మాన్ ఎండ్ ది సీ" (ముసలివాడు-సముద్రం)తో పోల్చడం కద్దు కానీ అందులోని ముసలి బెస్తవాడు సముద్రంలో అక్కడ తారసిల్లే జంతుకోటితో జరిపే జీవన సమరంకన్నా కేశవరెడ్డి 'ముసలివాడు' జరిపే బతుకుపోరు గొప్పది అయితే హెమింగ్వే తండ్రి తన కొడుకును వేటకు, చేపల వేటకు అలవాటు చేశాడు అలాంటి అనుభవం అడవిలో కేశవరెడ్డికి ఉందో లేదో తెలియదు కానీ ముసలివాడి పాత్ర ద్వారా మనల్ని అడవి పట్టించి, ప్రకృతి సౌందర్యాన్ని, అనంత ప్రాణికోటినీ, బీభత్సాన్ని బొమ్మకట్టి చూపుతాడు ఇదెలా సాధ్యమైంది? ఆయనే చెప్పినట్టుగా "సాహిత్యం సరదా కోసమో, కాలక్షేపానికో ఉపయోగపడే ఆషామాషీ వ్యవహారం కాదన్న" దృఢ విశ్వాసం కేశవరెడ్డి రచనా లక్ష్యం కాబట్టి. తన

లక్ష్యాన్ని సాధించడంలో ఆయన వ్యర్థ పదాలు వదిలేశాడు అర్థ గౌరవాన్ని కాపాడాడు, వర్ణనా రోచిస్సులు వెదజల్లాడు హెమింగ్వే తన రచనలో ఒక నూతన శైలికి అంకురార్పణ చేసినట్లే ఇక్కడ కేశవరెడ్డి కూడా (అప్పుడప్పుడూ మధ్యే మధ్యే కృతకంగా ఉన్నట్లు కనిపించినా) ఒక కొత్త శైలీ సౌభాగ్యానికి పాఠకులను అలవాటు చేస్తున్నాడు! అయితే హెమింగ్వే కథా రచనకు సంబంధించి ఒక సందర్భంలో "రచనలో వాస్తవాన్ని వక్రీకరించని వాక్యాలుండాలి" అన్నాడు *(All you have to do is write one true sentence, a true simple declarative sentence)*

ఈ అగ్ని పరీక్షలో కేశవరెడ్డి ఏనాడో అగ్రజునిగా ఎదిగి వచ్చాడు అంతే కాదు, అబోతులతో, ఎనుబోతులతో పోరులో, వేటలో, యుద్ధంలో పొందే అనుభవాలు వ్యక్తిలో భౌతికంగా కలిగించే సెన్సేషన్‌ను సక్రమంగా అక్షర బద్ధం చేయాలన్నాడు హెమింగ్వే ఇందుకు చేయవలసిన పని-జీవితాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడం, ఆ పిమ్మట నీ సొంత పాత్రలను అందుకు అనుగుణంగా రూపుదిద్దు కోవడమంటాడు నిజానికి 'అతడు జయించిన అడవి' లో కేశవరెడ్డి వాస్తవిక సృజనే ముసలివాడు, మన్నుగాడు, సుక్కపంది, దాని పిల్లలూ, తోడుగువ్వ, నక్కలూ! ముసలివాడి ఏకాగ్రత ఎలాంటిది? దుష్టశక్తులపై సమరానికి ఆ ఏకాగ్రత అవసరం "సూదికి దారాన్నెక్కిస్తున్న వాని ముఖంలోనూ, సగం బయటికొచ్చిన పెయ్యను గర్భంనుంచి లాగుతున్న జంతువైద్యుని ముఖంలోనూ ఉండే ఏకాగ్రత అతని ముఖంలో కనిపించక" పోతే ముసలివాడి కథ కంచికి చేరేది కాదు! కళ్ళను చెవులుగా, చెవులను కళ్ళుగా మార్చుకున్నందునే అతడు బాధలు పడినా, యుద్ధంలో ఓడినట్లు భావించినా, అతడు పరిపూర్ణమైన సంకల్పశుద్ధిని, దీక్షను, చిత్తశుద్ధిని, ఓర్పును ప్రదర్శించాడు ఆ అరణ్య జీవితాన్ని, అరణ్య రోదనలనూ, అక్కడి ప్రకృతినీ అర్థంచేసుకోవాలంటే ఎన్నో అనుభవాలను కాచి వడపోసిన వ్యక్తులతో, పరిసరాలతో పరిచయం అవసరం మనలో ఎంతమందికి తెలుసు- బలసతవ్వలు, కాసేరాకు పొదలు, కిచ్చిలి చెట్లు, సుంక్రేసు చెట్లు, తీంట్ర పొదలు, బాగిమాను కొమ్మలు, బిలిచిత్రిపూలు? ఇది జీవద్భాష!

తన స్థిరచరాస్తులైన సుక్కపందుల బతుకుతెరువు ముసలివాడి ప్రాణం, సమాజ సంక్షేమం కేశవరెడ్డి ధ్యేయం! వీరత్వానికి దివిటీలు పట్టిన ముసలివాడు అజ్ఞానంపైన, మూర్ఖత్వం పైన కూడా సమరం నడిపిన సమన్వయ కర్త! శ్రమతో, బాధతో ప్రమేయం లేకుండా అవలీలగా ఏదీ ఒనగూడదన్న వర్క్ కల్చర్‌ను బోధించాడు! దోపిడీని ఈసడించాడు, అమాయకత్వంపై ధ్వజమెత్తుతూ ఒక్కోప్పుడు దుర్మార్గునికన్నా అమాయకుని వల్ల ఎక్కువ హాని ఎలా జరుగుతుందో గువ్వ ద్వారా తెలిపాడు! జయాపజయాలే సమన్వయ జీవితం అన్నాడు అయితే నిరుత్సాహం కార్యశూరుడికి లక్ష్యం కాదన్నాడు హెన్రీ జేమ్స్ "ది బీస్ట్ ఇన్ ది జంగిల్" నవలలో జాన్ మార్చర్ అనే పాత్ర ద్వారా చెప్పిస్తాడు "అతడు తన జీవిత అడవిని చూశాడు, దెబ్బదీయడానికి పొంచి ఉన్న మృగాన్ని చూశాడు." అని! మన ముసలివాడూ చూశాడవన్నీ! "ఎండ సూర్యుని నుంచి పుడుతుంది, వెన్నెల చంద్రుడి నుంచి పుడుతుంది మరి చీకటి ఎక్కడ నుంచి పుడుతుంది? వెలుగు తాత్కాలికమై ఉండగా పైశాచికమైన చీకటి అజరామరంగా ఉండటం ఎంత దారుణం?" అని ముసలివాడు తాత్త్వికంగా ప్రశ్నిస్తాడు జీవితంలో ఎన్నో తుఫానులను ఎదుర్కొన్న వ్యక్తులకు తలపోతలు ఒకటి కాదు, ఎన్నో! కవి కార్ల్‌శాండ్‌బర్గ్ అనలేదూ *"All starlights of cool memories on storm paths"* అని!

శనివారం 25, ఆగస్టు 1996

# స్త్రీవాద సాహితికి చిరునామా సత్యవతి!

అవి ఫ్రెంచి విప్లవ దినాలు ఫ్రాన్స్‌లో వస్తున్న పెనుమార్పుల్ని అక్షరబద్ధం చేయడమేకాదు కొత్త సృష్టికి పురిటి నొప్పులలో భాగంగా అప్పుడప్పుడే రాజ్యాంగ రచనకు ఉద్యమిస్తున్న రోజులవి నాటి రాజ్యాంగ రచయితలలో ఒకరైన టెలిరాండ్ "మానవ జాతిలో సగానికి సగం మందికి పరిపాలనలో ప్రాతినిధ్యం లేద"ని అనడానికి తాను సిద్ధంగా లేనన్నాడు అయితే అంతటివాడు కూడా స్త్రీలకు వోటు హక్కు ఇవ్వడానికి కొంత తటపటాయిస్తున్న దశలో "ఎందుకివ్వరు, ఇచ్చితీరాల"ని గద్దించిన వారు ఒకరే ఒకరు ఆమె పేరు ఊల్‌స్టోన్ క్రాఫ్ట్! బహుశా ప్రపంచ మహిళా ఉద్యమ చరిత్రలో ఈమెను తొలి స్త్రీవాద ఉద్యమకారిణగా, రచయితగా పేర్కోవచ్చు భర్తను సంపాదించడం, అన్ని విషయాల్లో అతని అడుగులకు మడుగులొత్తడం ఇదే స్త్రీ ధ్యేయం కారాదనీ, ఈ భావాలకు మించి మహిళా మూర్తి ఎదగాలనీ రెండు వందల ఏళ్ళనాడే దండోరా వేసిన స్త్రీవాది ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ ఈ నిర్ణయానికి ఆమె స్వీయానుభవం నుంచే వచ్చింది స్త్రీ, పురుషుల మధ్య రెండు రకాల నైతిక ప్రమాణాలకు ఆమె విరుద్ధం, నైతిక ప్రవర్తన, విలువలూ లైంగిక పరిధులకు అతీతమైనవని ఆమె అభిప్రాయం, కోరికలూ, రాగద్వేషాలూ స్త్రీ, పురుషులకు సార్వజనీనం, సార్వకాలికం ఉభయత్రా హేతు విరుద్ధమైన ప్రవర్తనను అదుపు చేయనప్పుడే ఉభయులూ అమానుషంగా వ్యవహరిస్తారని, అయితే వాళ్ళని అదుపు చేయవలసిన బాధ్యత మొత్తం మానవ జాతిదే గాని, లైంగిక సంబంధమైన బాధ్యత కాదని ఆమె చెప్పింది *("They are only brutal when unchecked by reason, but the obligation to check them is the duty of mankind, not a sexual duty")* టెలిరాండ్‌కు అంకితమిచ్చిన ఆమె "విండికేషన్" గ్రంధం తన కాలంలో పెద్దగా ప్రాచుర్యంలోకి రాకపోయినా ఆ తరువాత సుమారు పది సంవత్సరాలకుగాని ప్రపంచ మహిళా లోకం చేతులలో వాదనాస్త్రంగా రూపొందలేదు! స్త్రీలపై పురుషాధిక్యతను మొదటిసారిగా ముఖాముఖి సవాలు చేసిన ఉత్తమ గ్రంధం అది అయితే మహిళా లోకమేగాదు, యావత్తు మానవ లోకం గౌరవించిన ఈ స్త్రీవాది (ఫెమినిస్టు) ఏనాడూ కేవల పురుష ద్వేషిగా మారలేదు ఆ మాటకొస్తే పురుష ద్వేషం స్త్రీవాదం లక్ష్యమూ కాదు అది ద్వేషించేది పురుషాధిక్యతనూ, నేటికీ మట్టెలూ, పిల్లేళ్ళు కడియాల కంటే మించిన సంకెళ్ళుగా మారిన పితృస్వామిక వ్యవస్థ ధాష్టీకాన్నీ, దౌర్జన్యాలనూ మాత్రమే అందుకనే ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ ప్రపంచ మహిళలకు హక్కుల దఖలు పరుస్తూ పురుషులందరికీ వినమ్రతా పూర్వకమైన ఒక హెచ్చరిక చేసింది, వివిధ రకాల ఆరళ్ళ నుంచి మమ్మల్ని విముక్తుల్ని చేసి, సంకెళ్ళు తెంచి, బానిస విధేయతకు బదులుగా హేతుబద్ధమైన మైత్రీభావంతో మెలగ గలిగితే - మా వైఖరిలో స్నేహపూర్వకమైన మార్పును గమనించగలుగుతారు అప్పుడు మాలో మీరు మరింత నమ్రతగల కూతుళ్ళను, మరింత ప్రేమాభిమానాలుగల అక్కా చెల్లెళ్ళను, మరింత విశ్వాసపాత్రమైన భార్యలను-ఒక్క ముక్కలో బాధ్యతగల మంచి పౌరులనూ చూడగల్గుతారు!

ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ సూత్రీకరణకు వీసమెత్తు తేడా లేకుండా స్త్రీవాదానికి ప్రతీకలుగా నిలిచేవి పి సత్యవతి కథలు ఇవి 'ఇల్లలకంగానే 'పండగయిపోయినట్టు భావించవద్దని బాధ్యతలను మరచిన భర్తలకు హెచ్చరించే స్త్రీల చేతికి అందివచ్చిన విజ్ఞాన దీపికలు తెలుగునాట ఒకప్పుడు వీరేశలింగం, గురజాడ, చలం స్త్రీకి వకాల్తా పట్టి స్త్రీల కన్నీటి గాధలకు కారణాలను తెలిపి మహిళాలోకాన్ని నిద్ర మేల్కొల్పారు ఆ వారసత్వం లోనే ఇటీవల కాలంలో ఓల్గా, సత్యవతి, కుప్పిలి పద్మ, కొండేపూడి నిర్మల, విమల, విజయలక్ష్మి స్త్రీవాద

రచనలను ముమ్మరం చేస్తున్నారు చలం చెప్పినట్టు స్త్రీకి కూడా శరీరం ఉంది- దానికి వ్యాయామం కావాలి, ఆమెకు మెదడు ఉంది-దానికి జ్ఞానం కావాలి ఆమెకు హృదయం వుంది - దానికి అనుభవం కావాలి నిజానికి ఆమెకు వ్యాయామం నుంచీ, జ్ఞానం నుంచీ, అనుభవం నుంచీ పురుషాధిక్య సమాజం దూరం చేసిన దాని ఫలితమే స్త్రీవాద ఉద్యమం అని మరవరాదు సత్యవతి తన కథా స్రవంతిలో బాధ్యతగల స్త్రీవాదిగా స్త్రీ, పురుషులకు ఎలాంటి కల్చర్ అవసరమో చెప్పడానికి ప్రయత్నించిందేగానీ స్త్రీ-పురుషుల సంబంధాలను తెంచడం 'ఫెమినిజం' లక్ష్యంగా ఎక్కడా బోధించదు స్త్రీ-పురుష సమానత్వమే స్త్రీవాదం, ఒకరి ప్రత్యేక ఆధిక్యతను సహించకుండా ఉండడమే స్త్రీవాదంగా సత్యవతి ప్రతి కథనూ అద్భుతంగా తీర్చిదిద్దారు ఇందుకు నిదర్శనం ఆమె పాత్రలోని ఒక రాగిణి, ఒక సునంద సంసారం నిలబడడానికి తన స్వేచ్ఛనే సమర్పించుకున్న స్త్రీ తన యుగయుగాల నిద్ర నుంచి మేల్కొందన్న చలం సూత్రీకరణకు విస్తృతార్థంలో అక్షర రూపంగా వెలసిన రచనలు సత్యవతి కథలు

ఇవి ఉబుసుపోని రచనలు కావు లక్ష్య నిర్దేశం, ఆశావాదం, నీళ్ళునమలకుండా కాళ్ళు తడబడకుండా ఏ మార్గమైతే స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి బాటలు వేస్తుందో, ఆ ఆత్మ విశ్వాసాన్ని మహిళా లోకానికి కలిగించడం ఈ కథల ఉద్దేశం భావంలో చురుకుదనం, భాషలో కరుకుదనం, ఆలోచనలో నైశిత్యం, వాదనలో సూటిదనం, సంభాషణలో చతురిమ, కథనంలో వేగాతివేగం, సర్వత్రా వ్యంగ్య వైభవంతో దీపిస్తున్న కథలివి ఫ్యూడల్ వ్యవస్థకూ, పెట్టుబడిదారీ వ్యవస్థకూ మధ్య పరివర్తనా దశలను గుర్తించిన సత్యవతి విద్య, వైద్య రంగాలనూ, వివాహ సంబంధాలనూ వాణిజ్య ప్రయోజనాలు ఎలా శాసిస్తున్నాయో వివిధ పాత్రల ద్వారా పాఠకులను చైతన్యవంతులను చేయగలిగారు అంతేగాదు, స్త్రీవాదానికి సమర్థవంతమైన తాత్త్విక పునాదిని కూడా సత్యవతి తయారుచేయగలిగారు విమోచన పొందని సమాజంలో భర్త పీడించే వాడైతే భార్య పీడితురాలు అని ఎంగెల్స్ అన్నట్టుగానే సత్యవతి ఇలా దండోరా వేస్తోంది "పురుషుడు వ్యవస్థకి బానిస అయితే, స్త్రీ అటు వ్యవస్థకీ ఇటు పురుషుడికీ కూడా బానిస స్త్రీ తానేమిటో మరిచిపోయి, తన పేరు కోసం తన ఉనికికోసం తడుముకోవలసిన ఆవశ్యకత ఏర్పడడానికి వ్యవస్థతోపాటు పురుషాధిక్య భావజాలం కూడా కారణమే ప్రతి పురుషుడి విజయం వెనక ఒక స్త్రీ ఉంటుందని ఊరికే స్త్రీని బులిపిస్తారేగాని, ప్రతి స్త్రీ పరాయీకరణ వెనక, పరాజయం వెనక పురుషుడే కాదు వ్యవస్థ మొత్తం ఉంటుంది సమాజంలో పితృస్వామ్య భావాలు, పురుషాధిక్యత పోనిదే స్త్రీల సమస్యలు తీరవు" అయితే సత్యవతి ఫెమినిస్టు అయినంతమాత్రాన ఆడవారిలో బాధ్యతారాహిత్యాన్ని సుతారమూ సహించదు. స్త్రీవాదానికి బలం చేకూర్చే ఆమె కథలలో సామాన్య కుటుంబాలు, మధ్యతరగతి, ఉన్నతవర్గాలలోని దాంపత్య జీవనంలోని సుఖదుఃఖాలూ, కడగండ్లూ, వాటి కారణాలు, స్త్రీ-పురుషుల అనుభవాలు, వాటి స్వభావస్వరూపాలు, దృక్పథాలు, కుత్సితాలు- మనకు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తాయి ఏకకాలంలో మార్క్సియన్ భావజాలంతోపాటు, ఫ్రాయిడ్ మనస్తత్వ విశ్లేషణ, పరిసరాల అనుక్షణ పరిశీలన ఈమె కథలకు ఆయువుపట్టులు

"వేటాడే కళ్ళ" నుంచీ వెంటాడే 'మృగా'లనుంచీ బయటపడడానికి ప్రయత్నించి విఫలమైన కొందరూ, భర్తల అక్రమాలపై విక్రమించి వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్న స్త్రీమూర్తులు మనకు వివిధ పాత్రలైన-ఒక సూరీడులో, ఒక 'పూచిక'లో, ఒక ప్రమీలలో, ఒక ఇందిరలో, ఒక వరాలు, ఒక కామేశ్వరిలో, ఒక వందన, నీరజ, రాధలలో, మరొక తులసిలో, వేరొక వసంతలో దర్శనమిస్తారు ముగ్గురు ఆడపిల్లల తండ్రి మగసంతానంలేదని పెళ్ళాం మీద

రుసరుసలాడి నాల్గో కాన్పులో కూడా ఆడపిల్ల కలగడంతో మూతిముడుచుకుని ముట్టి పొగరు ప్రదర్శించిన దానిఫలితంగా చితికిపోయిన పూచిక ఒకవైపూ, వయస్సు మళ్ళినా బుద్ధిగడ్డి గరిచి రెండో పెళ్ళి చేసుకున్న ప్లీడర్ సుందర్రావు మత్తుపెట్టి చడీచప్పుడూలేకుండా అబార్షన్ చేయించగా ఒక్క నలుసుకోసం తపనపడిన గోమతి మరోవైపూ మన మనస్సుల్ని కలిచివేస్తారు! ఒక ప్రమీల చెప్పేదాకా ఇంటి గొడ్డుచాకిరీలో చివరికి తన పేరునే మరిచిపోయిన విద్యావతి 'శారద' మీకు తారసిల్లుతుంది దోపిడికీ, శ్రమను దోచుకోవడంలో అదనపు విలువకూ చక్కని కథారూపమివ్వడంలో సత్యవతికి చేదోడైన ఒక పన్నెండేళ్ల నాపసాని "ఇందిర" మీ సానుభూతిని చూరగొంటుంది గురజాడవారి ప్రొఫెసర్ రంగనాథయ్యర్‌లాంటి స్వార్థపరుడు ప్రొఫెసర్ సుందరం సత్యవతి సృష్టించిన మరో పాత్ర, కామేశ్వరి కన్నుకప్పి, కనపడిన ప్రతి స్త్రీని నేత్రమైథునం చేయడానికి సంకోచించని ఒక వెధవ కేవలం పనిమనిషి మీద ఆధారపడి ఇళ్ళు చక్కదిద్దుకోజూచే వందనకు జబాబుగా వర్క్ కల్చర్‌ను అర్థం చేసుకున్న చందన ఒక ఆదర్శం "వ్యాపార స్నేహాలు", "వ్యాపార భోజనాల"పై రాధ నడిపిన జీవన సమరం మరో ఆదర్శం వ్యాపార నాగరికతలో స్త్రీ-పురుషుల మధ్య వుండేది లైంగిక ఆకర్షణేకాని ప్రేమకాదనీ, "పెట్టుబడిదారీ సమాజపు ముఖ్య లక్షణమైన వస్తువ్యామోహ సంస్కృతి స్త్రీలో ఆలోచననీ, స్పందననీ కబళించివేసి తనవైపు లాక్కోడానికి చూస్తున్నద"నీ సత్యవతి జ్ఞానబోధ!

ఎంతో విద్యావతి అయిన సరస్వతి "సంసార సరస్వతి"గానే మిగిలిపోయింది పురమాయింపుల పురుషుడేగాని పూచికపుల్ల అవతలపెట్టని భర్త అసూయవల్ల తనకునచ్చిన మెడల్సును, కప్పులను, షీల్డులనూ ఇంట్లో దాచుకోనివ్వనప్పుడు కుమిలిపోయిన సరస్వతి గణితశాస్త్ర పరిజ్ఞానం కాస్తా చాకలిపద్దులకూ, పాలపద్దులకూ కుదించుకుపోయింది! అయితే చివరికి గాంధారి గంతల్ని తెంచేసి నిలబడిన సరస్వతిగా మనకు సాక్షాత్కరిస్తుంది! ఇలా ఎన్నెన్నో-అడుగడుగునా అనుభవాలతో, ఆదర్శాలతో, సందేశాలతో, వాదనాపటిమతో మహిళలకు జ్ఞాననేత్రాలు పంచిపెట్టే సత్యవతి కథాసత్యాలివి! ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ తర్వాత, చలానికి కొంచెం అటూ ఇటూగా మానవ చరిత్రలో యుగయుగాలుగా స్త్రీమూర్తి అనుభవాలకు రంగు, రుచి, వాసన కల్పించిన వ్యక్తి ఫ్రెంచి ఉద్యమనాయకురాలు సిమన్‌డిబోవిర్ ఆమె ఆత్మకథ "మెమోయర్స్ ఆఫ్ ఎ డ్యూటిఫుల్ డాటర్" ఆమె స్త్రీవాదంపై రాసిన "సెకెండ్ సెక్స్" ఒక మహాఇతిహాసం! తెలుగు వారి ఆడపడుచు సత్యవతి ఏ పాశ్చాత్య స్త్రీవాద రచయితకూ తీసిపోదని ఆమె కథలు నిరూపిస్తాయి. నినాబెర్బెరోవా, జిల్‌కెర్ కాన్వే, ఎలినార్ మన్రో ఇలా ఎందరో ఈ కోవకు చెందినవారే తన తల్లి స్నేహితుడొకడు జరిపిన అత్యాచారానికి గురైన గొప్ప రచయిత్రి మేయాఏంజిలస్ అనుభవాల వడపోతే ఆత్మకథ- *"I know whv the Caged Bud Sings"* సోఫియా టాల్‌స్టాయ్ "డైరీ", వర్జీనియా ఉల్ఫ్ "డైరీ"లు కూడా ఒక్కసారి తిరగేస్తే వర్ధమాన స్త్రీవాద రచయితలకు కొత్తస్ఫూర్తి కలగవచ్చు! తల్లీ-బిడ్డల పరిణామమే *("Women to Child")* సమాజ ప్రగతికి మూలం 'ఆమె'ను విస్మరించిననాడు 'అతడు' లేడు ఈ సత్యాన్నే రచయిత్రి జుడిత్ రైట్ ఇలా అందంగా చెప్పింది-" *Out of darkness rose the seed/all a world I made in me/ I am the earth I am the root /I am the stem that fed the fruit,/the link that joins you to the night* "!!

అదివారం 1, సెప్టెంబర్ 1996

# 'చంద్రకళా'పూర్ణోదయం ఎప్పుడు?

## చరిత్ర అబాసు కానప్పుడు!

లోక వ్యవహారాలన్నీ మనిషి మనస్సును ఆధారం చేసుకునే జరుగుతున్నాయి కాని ఈ సత్యాన్ని అజ్ఞానంవల్ల మూఢులు తెలుసుకోలేకపోతున్నారు కుండ ఎలా ఏర్పడుతుంది? మట్టితో అయినప్పుడు ఆ మట్టే లేనప్పుడు ఘటం(కుండ) ఎలా రూపం తొడుగుతుంది? ఈ ప్రశ్నోత్తరాన్ని ఇంగితజ్ఞానంతో సమకూర్చినవాడు "వార్తాలాపం"కర్త! ఈ జ్ఞానం లోకవృత్తాన్ని పరిశీలించడానికి, అధ్యయనానికి, శాస్త్రాధ్యయనానికి, చరిత్రాధ్యయనానికి, వచనకూ, రచనకూ మూలాధారం కావాలి దంత కథలకూ వాస్తవ గాథలకూ తేడా తెలుసుకోగలగాలి స్థల పురాణాలకూ చారిత్రక సంఘటనలకూ మధ్య సామ్యాలనూ, వైరుధ్యాలనూ గ్రహించగలగాలి స్థలమహత్యాలపై రచనగాని, నవలా రచనగాని ఆధారపడదలచినప్పుడు చారిత్రక సన్నివేశాలతో వాటికున్న సంబంధాన్ని సక్రమంగా బేరీజు వేసుకోవాలి జానపద సంపదను కాపాడుకుంటూనే సశాస్త్రీయ దృక్పథంతో చారిత్రక వాస్తవాలకు పెద్ద పీట వేయాలిగాని, మౌఢ్యాన్ని గంపలకెత్తుకోకూడదు రాజులు తమ సామ్రాజ్య విస్తరణ గాథలను, శౌర్య ప్రతాపాలను కీర్తికండూతికొద్దీ వందిమాగధుల ద్వారా ప్రజలలో ప్రచారం చేసుకొన్నారు ప్రజల చరిత్ర అడుగంటింది వారి ఆర్థిక పోరాటాలను ఆ చరిత్ర ఎక్కించదు, ప్రజల త్యాగాలను కనపడనివ్వదు అలాగే జానపద సంపదను కాపాడే పేరిట, ప్రకృతి సౌందర్యాన్ని రక్షించే పేరిట, మూఢ విశ్వాసాలను ఎదుర్కొనే పేరిట కానరాకుండా అవే విశ్వాసాలను మత ధర్మాల పేరుతో చొప్పించే రచయితల కలాలు ప్రజా చరిత్రను సృష్టించలేవు! రచయిత కలం ఎంత బలసంపన్నమైనదైతే పాఠకులపై అంత బలమైన ముద్ర వేసుకొంటుంది అయితే ఈ కలం పోటును-మూఢ విశ్వాసాలను చారిత్రక నవల పేరిట చాప కింద నీరులా ఎక్కించడానికి శక్తి మంతుడైన రచయిత ప్రయోగించకూడదు అది వంచనా, ఆత్మవంచనా అవుతుంది పండితుడు, శక్తిమంతుడైన కలం వీరుడు, వర్ణనా శిల్పి, కథాకథనాన్ని మధురంగా నడిపించగల దిట్ట, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ముదిగొండ శివప్రసాద్ "చారిత్రక"నవల "చంద్రకళ" ద్వారా చెప్పింది చరిత్రకన్నా, చరిత్ర పేరిట వ్యాపింపజేయదలచిన మూఢ విశ్వాసాలే ఎక్కువ తెలంగాణాలో రెండేళ్ళకొకసారి జరిగే "సమ్మక్క-సారక్క జాతర" ఆధారంగా యావదాంధ్ర ఏలికలుగా తెలుగులకు సమైక్య పాలనా వేదికను అందించిన ఓరుగంటి కాకతీయుల వైభవ పతన దశలను ముదిగొండ అద్భుతంగా ఇందులో పేర్కొన్నారు ఒక దశలో కులాల కంపువల్ల ఉత్తమ పరిపాలనకు వచ్చిపడిన ముప్పును యుగంధరుడి చాకచక్యంతో రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి, రుద్రమ్మ ఎలా తప్పించుకోగలిగారో చూపారు అన్నింటికంటే మించి వనచర సంస్కృతికి శోభ తెచ్చిన పరిసరాలను కాపాడడంలో పాలకుల శ్రద్ధాసక్తులను ఇనుమడింపజేసే సన్నివేశాలను వర్ణించడంలో, మానవుడి మనుగడను దిద్ది తీర్చే రకరకాల వన సంపదను చిత్రించడంలో ముదిగొండ చూపిన శ్రద్ధా బహుధా ప్రశంసనీయం వనాలు, కీకారణ్యాలు, వామనారణ్యాలు పాఠకుడికి మనోల్లాసం కలిగిస్తాయి నవలలో తారసిల్లే మంచనశర్మ, టిట్టిభశెట్టి, సారలమ్మ, సమ్మక్క, పగిడిద్ద రాజు, జంపన కుమారుడు, చిలుకల గట్టు, ప్రతాపరుద్రుడు, యుగంధరుడు, పాల్కురికి సోమనాథుడు-సజీవరూపాలేగాని కల్పిత వ్యక్తులు

కాకపోవచ్చు, చారిత్రక శక్తులే కావచ్చు  అలాగే ఒక్కరూకకు విందు భోజనాలందించే పూటకూళ్ళమ్మ లక్ష్మణక్క, నాటి కాకతమ్మగుడి, మడిసంత, మైలసంత కూడా కాకతీయుల కాలం నాటి యథార్థ విశేషాలే కావచ్చు  అలాగే దక్షిణాదిపై ఉత్తరాది పాలకుల దండయాత్రల సందర్భంగా కాకతీయ సేవా నివహాలకు చేదోడు వాదోడు కాగలిగిన వింధ్యపర్వత - గోదావరి నదీ మండల మధ్యస్థ ప్రాంతమైన వనరాజ్య అధిపతులయిన-అరణ్య నాయకులు సనపగాని రాజు, మేడరాజు, నెమలి కన్నురాజు, శిలాద ప్రభువులాంటి కోయగూడేల పెద్దల చరిత్ర కూడా నిజం కావచ్చు  కాని ఆ చరిత్ర వేరు, చరిత్ర పేరిట, స్థానికులలో అజ్ఞాన దశలలో ప్రచలితమైన మూఢ విశ్వాసాలను పెంచి పెద్దచేసి అదే ఆర్ష విజ్ఞానం పేరిట ప్రచారం చేయడానికి రచనా వ్యాసంగానికి రచయిత దిగడం వేరు  అడవి బాపిరాజు "గోన గన్నారెడ్డి" "నారాయణరావు" లాంటి చారిత్రక నవలలు రాశారు  మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ "వోల్గాసే గంగ", "సింహసేనాపతి", "దివోదాసు", "జయౌధేయ" లాంటి చారిత్రక నవలలు రాశారు  అయినా చారిత్రకాంశాల ప్రాధాన్యతను చిల్లర విషయాలతో మభ్యపెట్టడానికి వారు ప్రయత్నించలేదు  జనపదాల గమనాన్నీ, వారు కదలివచ్చిన కంటకమైన మార్గాలను, దుర్గమారణ్యాలనూ వారూ చిత్రించారు  రసరమ్యంగా వర్ణించారు  కాని వారెక్కడా, స్థానిక ఆచారాలను వివరించినా మూఢ విశ్వాసాలను వ్యాప్తి చేయడానికి చారిత్రక సన్నివేశాలను ముసుగుగా వాడుకోలేదు! తాము మౌఢ్యానికి లొంగకుండానే మూఢ విశ్వాసాలను కారణాలను పాఠకులు తెలుసుకొనేటట్టు చేశారు  విశ్లేషించడానికి ప్రయత్నించారు  కాని ముదిగొండ 'చంద్రకళ'ద్వారా చేసిన ప్రయత్నం వన సంస్కృతీ రక్షణ పేరుతో, నవ సంస్కృతికి దోహదం చేయాలనుకుని ఆకుకు అందని పోకకు పొందని మూఢ విశ్వాసాలకు హారతులు పట్టడం  రచయిత ఆ విశ్వాసాలను ఎంతో విశ్వాసంతో పంచుకొనకపోతే అంతగా వాటితో తనకు తెలియకుండానే మమేకం కాడు!

ముదిగొండ చేతిలో "శివలింగం"పరుసవేదై ఇనుమును కాస్తా బంగారంగా మారుస్తుంది! ఆయన వర్ణించే గర్భగుడి, అడవిలాగా మనకు దర్శనీయంగాని అసూర్యంపశ్య - సూర్యముఖం చూడనిది!  అయితే ఆ గుడిలో రచయితకు మాత్రమే, ఒక్క పూజారికి మాత్రమే, ఒక్క పాల్కురికికి మాత్రమే ప్రవేశార్హత! 'చంద్రకళ' ఒక్క వనచరిత్రకు, కాకతీయ సామ్రాజ్య ఉత్థాన పతనాలకు మాత్రమే కాదు, ఆర్య సంప్రదాయాలకు, ఆయుర్వేద విజ్ఞానానికి, పదచర్చకు, శబ్ద చర్చకు, సంగీత చర్చకు, ఇంద్రజాల శక్తికీ-ఒక్క ముక్కలో జానపదుల జాతర్లకేకాదు, మతం పాతర్లకు కూడా అద్దం పడుతోంది!  పరాయీకరణం పరశువేదిగా, ముట్టుకున్న ప్రతిదీ ముదిగొండ చేతిలో మతంగానో అభిమతంగానో రూపుదిద్దుకోవలసిందే!  అయితే ఆయన కొన్ని చోట్ల కొన్ని భావాలను ఆధునికం చేశారు!  వాటిలో ఒకటి 'దెయ్యాని'కిచ్చిన నిర్వచనం. దెయ్యాలు, దేవతలంటే ఆధునిక కాలంలో నమ్మేవారి సంఖ్య తక్కువని గుర్తించిన ముదిగొండ-వన వాతావరణాన్ని చెడగొట్టే శరించే శక్తిగా దాన్ని మలచారు  'దెయ్యాలు' మనలాగే తిరుగుతూంటాయి, కాని వాటి ఆలోచనలు, అవి చేసే పనులూ దుర్మార్గంగా ఉంటాయని 'సమ్మక్క'మాటల్లో పంచాయితీ చెప్పించారు!  ప్రతాపరుద్రుని విజయాలకు మూలం నిత్య వనచరులైన కోయలని చెబుతూ పాఠకుల దృష్టిని ప్రధానంగా కోయల ఆచార వ్యవహారాలవైపు మళ్ళించడంతో పాటు మూఢ విశ్వాసాలకు పాదులు తవ్వారు.  కనుకనే కోయగూడేలలో మూఢవిశ్వాసాలను ముదిగొండ వ్యతిరేకించినట్టు కన్పిస్తూనే, ఆయన తన

మనస్సును మాత్రం వాటి చుట్టూనే తిప్పుకుంటారు! 'టెస్ట్‌ట్యూబ్ బేబీ' కుటుంబాలను పలకరిస్తున్న ఈ రోజుల్లో పూజలు చేస్తే పిల్లలు పుడతారన్న విశ్వాసాన్ని గూడేల విశ్వాసంగా ముదిగొండ బలంగా ఇందులో వ్యాప్తి చేస్తారు! 'సమ్మక్క' దీవిస్తే చాలు తగలబడిన గుడిసెలకు రాత్రికి రాత్రే కప్పులన్నీ అమరిపోతాయి! కాని అంతలోనే మరోచోట రచయిత మాటలో వైరుధ్యం కన్పిస్తుంది ఇసుక ముద్దలో బంగారం దొరకడం సాధ్యమా అని ఎవరో ప్రశ్నించినప్పుడు ఇంద్రజాలికుడి నోటితోనే "ఏమో" అనిపిస్తారు ముదిగొండ! ఆయన తలచుకుంటే తాడు "ఎగరేసే నిచ్చెన" అవుతుంది బహుశా స్వర్గానికి నిచ్చెన వేయడమంటే ఇదేనేమో! పోలేశ్వర ఆలయం వద్ద అగ్నిగుండాలు తొక్కడం (ఇటీవల హేతువాదులు కూడా చాలామంది నిప్పుల మీద నడుస్తున్నారని మరువరాదు), శూలాలు పట్టుకొని నిప్పులగుండా నడవడం, నాలుకలకు నారసాలు గుచ్చుకోవడం - ఇత్యాదులన్నీ పాఠకులకు ఇందులో కొల్లలుగా కనిపించే దృశ్యాలు ప్రకృతి ఆరాధనలో, ప్రకృతి మచ్చికకాని అజ్ఞాన దశల్లో మానవుల మనస్సుల్లో ప్రవేశించిన ప్రతీకల్ని, భావముద్రల్ని ఆధునిక కాలంలో కూడా విశ్వాసముద్రలుగా వ్యాప్తి చేయకూడదు ప్రతాపరుద్రుని ఇష్టాంగన మాచల్దేవి మనిషిగా కాకుండా మోహినీ మహాలక్ష్మిగా ముదిగొండ చేతిలో ముద్రాంకితురాలయింది అంతేగాదు, జబ్బు లెందుకొస్తాయంటే ఆయన మాటల్లో "కర్మ బాగుండక", "పాపాల"వల్లనట! వైజ్ఞానిక దృక్పథంగానీ, వైద్యశాస్త్ర అనుశీలనగానీ, వివరణగానీ ఆయనకు అనవసరం! అలోపతి సహా అన్ని రకాల దేశీయ వైద్య విధానాలనూ సామాన్య ప్రజలకు అందుబాటులో ఉంచాలనడం వేరు, జబ్బునుకూడా 'కర్మ'సిద్ధాంత జాబితాలోకి ఎక్కించడం వేరు! ఈ 'కర్మ' సిద్ధాంతం పని విభజనకు ప్రతీకగా కాకుండా వర్ణవివక్షకు, కుల వ్యవస్థకూ ప్రతిరూపంగా మారింది అలాగే కోయగూడెం "గోవిందమ్మ"దెయ్యం కావడానికి కారణం పాపం కాదు, 'కుష్టువ్యాధి' అని చెప్పిన రచయిత అంతటితో ఆగడు హేతువుకు కాస్త దగ్గరగా వచ్చాడని పాఠకుడు భావించే లోగానే మనల్ని ఒక "తాబేటికాయ" తన్నుకుంటూ వస్తుంది! ఆ తాబేలు విస్తరించగా విస్తరించగా దానిపైన సమ్మక్క కూతురు సారలమ్మను, ఆమె తండ్రినీ కూర్చోబెట్టి గోదావరి దాటిస్తారు! తాబేటికాయ తీర్థం మంత్ర చికిత్స చేస్తేగాని గోవిందమ్మ పెద్దరోగం(కుష్టు)పోదు! అయితే మరో దృష్టినుంచి ముదిగొండ విచిత్రమైన రచయితగా కనిపిస్తాడు ఎందుకంటే- దేవతోపాసన వల్లనే మానవుడి కష్టాలు తీరతాయా, మానవులు మారతారా అన్న సంశయానికి సమాధానమా అన్నట్టు ఆయన ఇలా అంటాడు "మానవ ప్రకృతి అనాది సిద్ధమయింది అది దేవీదేవతల అవతారాల వల్ల మారిపోవడం సృష్టిలో ఎన్నడూ చూడలేదు అదే జరిగి ఉంటే రాముని తర్వాత, కృష్ణుని తర్వాత తిరిగి మానవ చరిత్రలో రాక్షసులు పుట్టకూడదు కదా!" అంతేగాదు, మన ప్రసిద్ధ ఖగోళ గణిత శాస్త్రవేత్తలైన ఆర్యభట్ట, భాస్కర, వరాహమిహిరుడి సిద్ధాంతాలను ఎందుకు పెంచుకోలేకపోయాం అన్న దానికి సమాధానం ఇందులో దొరక్కపోగా, మనకు అణు విజ్ఞాన శాస్త్రాన్ని తర్వాతి తరాలవారికి ఎందుకు అందకుండా చేశారో అన్న ప్రశ్నకు ముదిగొండ సమాధానం పరమ అశాస్త్రీయంగా ఉంది "అణువు అవిభాజ్యమని భీష్మద్రోణులకు తెలును వారు వాడిన బ్రహ్మాస్త్రం అణు ఆయుధమే నారాయణాస్త్రం జల సంబంధి (హైడ్రోజన్) మహాభారత యుద్ధం తర్వాత ఋషులు విజ్ఞాన శాస్త్రాన్ని తర్వాతి తరాలవారికి అందకుండా చేశారు" అన్నారు! ఈ ధోరణిని కాదన్న హేతువాదులు, నిరీశ్వరవాదులు లేదా నాస్తికులూ సమాజద్రోహులు, వినాశకులూ

ముదిగొండ దృష్టిలో! కుల వ్యవస్థను ఈసడిస్తున్నట్టు కనపడుతున్న ఆయనకు కథ చెప్పడానికి మంచనశర్మ తప్ప మరొకరు దొరకరు ఉపదేశం ఇస్తే శంకరశర్మ తప్ప మరొకరు అనరు! ముదిగొండ నవల ముగింపులో సందేహంతో ఇచ్చిన సందేశం మాత్రం గొప్పది "చంద్రకళా పూర్ణోదయం ఎప్పుడు" అని? సమాజంలో దోపిడీ, హింస, బాధలు, నిర్వేదం, దైన్యం పోయినప్పుడని చెప్పిన ముదిగొండ కొసమెరుపుతో ఏకీభవించని వారుండరు! అయితే చెట్టును బతికించాల్సిన మనిషిని ముందు బతికించుకోవాలి మనం!! అందాకా ముదిగొండ మనస్సు కూడా "తళుకుటద్దంబు సత్కవుల మనసు/వేదాది విద్యలు విహరణ స్థలములు" అన్నట్టు ఆ పక్క పక్కల సంచరించవలసిందే! నేల విడిచిన సాము పుట్ట విడిచిన పాము!

ఆదివారం 26, జనవరి 1997

# ప్రవాస భారతి

ఆడది తిరిగి, మగాడు తిరక్క చెడతారన్నది పాత రోత నిజానికి కాలు కదపకపోతే, లోక సంచారులు కాకపోతే ఉభయులూ చెడతారని, కూపస్థమండూకాలవుతారనీ లోకానుభవం చాటి చెపుతోంది! అలాగే ఇంట గెలిచి రచ్చ గెలవమని మనవాళ్ళ తాఖీదు కాని ఇందులో కూడా దేశీయంగా, (ఇంట్లోనే) గుర్తింపు లేక రచ్చగెలిచి ఇంట గెలవడానికి గజ్జె కట్టినవాళ్ళు, కడుతున్న వాళ్ళు వివిధ రంగాలలో ఉన్నారు తాత్కాలికంగా వలసపోవడంగానీ, లేదా మరో దేశంలో పరదేశిగా స్థిరనివాసం ఏర్పరచుకోవడంగానీ అనేక కారణాలవల్ల సంభవిస్తుంది కొందరు చదువుల పేరిట వెళ్ళి, ఇంకొందరు ఉద్యోగాల పేరిట పోయి, మరికొందరు వ్యాపారాలపేరిట వెళ్ళి - ప్రవాసులుగా జీవితాలు గడుపుతుంటారు ఇలా విదేశాల్లో స్థిరపడి మెట్టినచోట, మేలు బంతులై పుట్టింటికి ప్రఖ్యాతి తెచ్చిన ప్రసిద్ధులెందరో ! మనకు తెలిసిన జుబిన్ మెహతా, ఖొరానాలే కాదు, చాలామంది తెలియని అజ్ఞాతవీరులు - న్యూయార్క్‌లో స్థిరపడిపోయిన చిత్రకారులు, కళాకారులున్నారు

చాలాకాలంగా కళాకారులకు, రచయితలకు ప్రసిద్ధ వంటశాలలకు పేరెన్నికగన్న గ్రీన్‌విచ్ గ్రామం (హ్యూస్టన్) ఎందరో భారతీయ ప్రజ్ఞావంతులకు ఆటపట్టుగా మారి ఉంది న్యూయార్క్ "సోహో" అలాంటిదే రెండు దశాబ్దాలమీదట వీరు న్యూయార్క్ చేరుకున్నారు అలాంటి చిత్ర కళాకారులలో ముఖ్యులు - కృష్ణారెడ్డి, నట్వర్ భవసార, మెల్లే గోభాయ్, మోహన్ సమంత్, ఎస్.వి.రామారావు, జారినా హష్మీ వీళ్ళంతా ఇండియానుంచి అమెరికాకు ప్రవాసం వెళ్ళినవాళ్ళే, ప్రయోజనం పొందిన "ఇమిగ్రెంట్సే", పేరు ప్రతిష్ఠలు ఆర్జించుకున్న హేమాహేమీలే "యాభైవేల కళాకారులున్న నగరంలో నీలాగా ఆలోచించగలవాళ్ళు కనీసం 20 మంది ఎప్పుడైనా దొరుకుతారు. బెంగటిల్లవలసిన పనిలేదు" అని జారినా హష్మీ చెప్పిన మాటలో మాతృదేశాన్ని స్వర్గంగా భావించుకునే వారు సహితం మెట్టినింటిని కూడా స్వర్గతుల్యంగా మార్చుకోవచ్చునన్న ఆదర్శం, భావగర్భితమైన సందేశం ఉంది "నేషన్ ఆఫ్ నేషన్స్"గా పేరుపొందిన అమెరికాలో ఏదో ఒక వ్యాపకం మీద ఖండాంతర పౌరులు అనేకమంది-ఆస్ట్రియానుంచి ఆఫ్ఘనిస్తాన్ వరకు, ఇండియానుంచి ఇటలీదాకా, ఐర్లాండ్‌నుంచి ఇజ్రాయిల్ వరకు, పెరూనుంచి ఫిలిప్పీన్స్‌దాకా ఇంగ్లాండ్ నుంచి ఈక్వెడార్ వరకు, చైనానుంచి కెనడాదాకా ఏదో ఒక పనిమీద అమెరికా చేరిన ప్రవాసులు లక్షల సంఖ్యలో ఉన్నారు అమెరికాలోని 12 ప్రధాన నగరాలు ఈ ప్రపంచ ప్రవాసితులకు, వారి కార్యకలాపాలకు, జీవనానికి, వృత్తులకు, వ్యావృత్తులకు రంగ స్థలాలుగా మారాయి ప్రపంచంలోని ఇతర దేశాలన్నీ కలసి ఇముడ్చుకునే ప్రవాసుల సంఖ్యకు రెండింతలకు పైగా ప్రవాసులను అమెరికా సాకుతోందంటే - అమెరికా సాధక బాధకాలలో, కష్టసుఖాలలో ఎంతగా ఈ ప్రవాసితులు పాలుపంచుకొంటున్నారో వీరి జీవితాలను కథలలో, నవలల్లో, స్కెచెస్‌ద్వారా అప్పుడప్పుడూ అందజేస్తున్న అనితాదేశాయ్, వి ఎస్ నయపాల్‌లతో పాటు - అమెరికాలో స్థిరపడి అక్కడి సాహితీ లోకంలో సెభాష్ అనిపించుకుని అక్షరభారతికి కథలద్వారా, నవలలద్వారా నీరాజనాలు సమర్పించుకొంటున్న రచయిత లెందరో వీరిలో ఇటీవల ముందుకు దూసుకువచ్చిన మహిళ భారతీ ముఖర్జీ అమెరికాలోని ప్రవాస భారత రచయితలలో నేడు అగ్రస్థానంలో నిలబడుతున్న శ్రీమతి భారతి భిన్న "జాతులకూటమి"గా ప్రసిద్ధి చెందిన అమెరికాలో వర్ధమాన దేశాలనుంచి

వచ్చి స్థిరపడిన ప్రవాస భారతీయుల, అరబ్‌ల, ఆఫ్ఘన్ల, శ్రీలంక తమిళుల, వియత్నామీయుల, బర్మీయుల, కాంబోడియన్‌ల కష్టసుఖాలకు తన కథలలో, నవలల్లో అద్దం పడుతోంది ప్రవాసితుల జీవన సమరానికి తన గొంతు కలపాలన్న ఆలోచన భారతికి-గూగెన్‌హీమ్ ఫౌండేషన్ కథా రచనకు కల్పించిన "గ్రాంట్ల" సదుపాయంవల్ల రాలేదు స్వయంగా, కలకత్తాలోని మధ్య తరగతి బెంగాలీ కుటుంబంలో పుట్టి పెరిగి చదువుసంధ్యలు పూర్తిచేసిన కాన్వెంట్ విద్యార్థిగా తల్లిదండ్రుల ప్రోత్సాహంతో సుమారు 30 ఏళ్ళనాడు అమెరికాలోని "ఇయోవా" యూనివర్సిటీ నిర్వహించిన "రచయితల శిక్షణా శిబిరం"లో (రైటర్స్ వర్క్‌షాప్) చేరినప్పుడే ఆమెలో కల్పనకు, కథా రచనకూ అంకురార్పణ జరిగింది అక్కడే తన కెనడియన్ భర్త క్లార్క్ బ్లెయిసీతో తొలి పరిచయమై కెనడాలో కొన్నాళ్ళు గడిపి, అక్కడ ప్రవాస భారతీయులపట్ల ప్రదర్శితమైన దురహంకారంతో మానసిక కల్లోలానికి గురై అమెరికా చేరి స్థిరపడింది ప్రవాసి "భారతి" రాసిన "డార్క్‌నెస్" కథా సంపుటి అమెరికా, కెనడాలలోని దక్షిణాసియా ప్రవాసుల జీవిత గాథలకు ప్రతిబింబం కాగా, ఇటీవల వెలుగులోకి వచ్చిన "దళారీ-ఇతర కథలు" *(The Middleman and Other Stories)* అమెరికాలోని ఆసియా ప్రవాసుల కథలూ, గాథలూ ఇందులోని పదకొండు కథలలో - పూసల్లోని దారంలాగా ధర్మక్రోధవెంవల్ల కలిగే ఆగ్రహం, ఉద్రేకం, మధ్యలో హాస్యం, కొన్ని జీవన సత్యాలపట్ల కనపడీ కనపడని ఎగతాళి, జీవిక కోసం విరుద్ధ శక్తుల మధ్య ఘర్షణ, ముగింపులో అంతో ఇంతో భావగర్భితమైన సందేశం ఉంటాయి

భారతీ ముఖర్జీ "మిడిల్‌మాన్"లోని ఆల్ఫీజూడా, మేరియా, క్లోవిస్ రాన్‌సమ్, "ఎ వైఫ్స్ స్టోరీ"లోని ఇమ్రీ, పటేల్స్, "లూజ్‌ఎండ్స్"లోని జిబ్, జోండా, మిస్టర్ వీర్, "ఫైటింగ్ ఫర్ రీబౌండ్"లోని బ్లాంక్విటా, మార్కోస్, "అర్బిటింగ్"లోని మిస్టర్ వెటెల్లీ అంకుల్ కార్మైన్, "ది టెనెంట్"లోని మాయాసన్యాల్, వెర్న్, డాక్టర్ రవీంద్ర ఛటర్జీ, "జాస్మిన్"లోని డాక్టర్ వసంజీ కూతురైన జాస్మిన్, దాబూ వగైరా పాత్రలన్నీ ప్రవాసులైన ఆసియన్ల బతుకు బాటలకు అక్షర రూపమిచ్చిన అపురూప కథా స్రవంతి శ్రీమతి భారతి తన కెనడా అనుభవం గురించి కొన్ని చురకలు కెనడియన్లపై వేసినా, ప్రవాసితులు ఏ దేశాన్ని స్థిర నివాసంగా ఎంచుకొంటారో ఆ దేశాన్ని మాతృదేశంగానే పరిగణించుకోవాలని స్పష్టం చేస్తుంది పైగా అలాంటి మిశ్రమ సంస్కృతి వల్లనే ఉభయ సంస్కృతులమధ్య ఉభయత్రా ప్రయోజనకరమైన ఆదాన ప్రదానాలకు అవకాశం ఉందని విశ్వసిస్తున్న రచయిత్రి భారతి పాలనుబట్టి కూత మార్చే పిల్లిలా కాకుండా అమెరికాలో దశాబ్దిన్నర కాలంగా ఉంటున్నప్పటికీ ఆమె భారతీయ సంప్రదాయాలను విడనాడలేదు భాషలో మార్పు ఉండొచ్చు ఇండియన్ ఇంగ్లీష్ పోయి ఫక్తు నూరు పైసల అమెరికన్ ఇంగ్లీషు (అసంపూర్ణ వాక్య నిర్మాణంతో, 'స్టకాటో' శైలిలో)లో రాయొచ్చు, కాని అంతరంగంలో ప్రవాసితుల గుండె చప్పుళ్ళకు లయపెడుతుంది, వారి సుఖదుఃఖాలను అందంగా చిత్రించగల నేర్పరి "ప్రవాసులమైన మాకు చెప్పేడానికి చాలా ఆసక్తికరమైన గాథలున్నాయి మాలో చాలామందిమి అంతర్యుద్ధాలతో, మత కొట్లాటలతో తీసుకొంటున్న నూతన స్వతంత్ర దేశాలలో లేదా ఇప్పుడిప్పుడే నిలదొక్కుకుంటున్న వర్ధమాన దేశాలలో నివసించినవాళ్ళం ఈ దేశాల చరిత్రలో త్వరితగతిన వస్తున్న మార్పులకు మేము ప్రత్యక్ష సాక్షులం అవసరాన్నిబట్టో లేదా అవకాశాన్ని బట్టో ఆ దేశాలనుంచి మేమిక్కడికి (అమెరికాకు) పూర్తిగా తరలివచ్చినప్పుడు - 200 సంవత్సరాల అమెరికా చరిత్రకు ఆకస్మికంగానే అయినా

మేము వారసులం కావాలి. అమెరికన్ సామాజిక విధానాన్ని అలవరుచుకోవాలి, కొన్ని ఇబ్బందులున్నా తట్టుకోవాలి, పౌరసత్వం మారినప్పుడల్లా పునర్జన్మగానే భావించాల"ని భారతీ ముఖర్జీ అంటుంది! మనిషి ఇంట్లో కూర్చోవడం కాదు, రెక్కలు కట్టుకుని తిరిగినప్పుడే సార్థక్యం అంటుంది *("A person has to leave home Try out his wings")!* ఆదిలో అమెరికన్ ఇంగ్లీషుకు అలవాటుపడడం కొంతకష్టమైనా కాలక్రమంలో భాషలో వాళ్ళను మించిపోయింది అయినా, భాష పూర్తిగా తనది కానప్పుడు భావాల బట్వాడాలో 'దూడలు' వేయడం సహజం అంటుంది *["The language of Cervantes does not stretch around the world without a few skips in transmission"]* ఈ జీవన కథాసాగరంలో విప్లవాల గురించి, ఆర్థిక సంక్షోభాల గురించి కూడా అలవోకగా అంటింపులు ఉన్నాయి. అమెరికాలో "విప్లవాలు" ఏ విద్యార్థినినో వేధించడం వరకో సరిపెట్టుకుంటాయట, ఆల్ఫీ జూడాలాంటి ఆయుధ వ్యాపారులు, మాదకద్రవ్య వర్తకులూ మనకు తారసిల్లుతారు, కష్టపడకుండా అప్పనంగా వచ్చే డబ్బుకు వారసులను, సోమరిపోతులను పెంచే పెట్టుబడిదారీ వ్యవస్థను భారతి కథల్లో చూస్తాం! షేర్ మార్కెట్ జూదంలో సర్వస్వం కోల్పోయి నెత్తినగుడ్డ వేసుకుని వెళ్ళేవాళ్ళు ఎందరో అయితే, ఇతరుల నష్టంపైన లాభాలు గుంజేవారు కొందరు కావడం ఇందులో చూస్తాం అమెరికాలో "డౌజోన్స్" షేర్ మార్కెట్‌కూ, బొంబాయిలోని "దలాల్ స్ట్రీట్"లో దగాకోరు పనులకూ తేడా లేదని తెలుస్తుంది! ఇలా విభిన్న జాతుల సమ్మేళనమైన అమెరికాలో విద్యాధికులు, ధనార్జనపరులైన "ఎత్నిక్ గ్రూపు" లలో అత్యధిక సంఖ్యగా ఉన్న ఇండియన్లు అమెరికన్ చట్టాలను గౌరవిస్తేనే, ఆ చట్టాలు కల్పించే సాధారణ పౌరహక్కులకు రక్షణను కూడా స్వేచ్ఛగా పొందవచ్చునంటుంది భారతి ఈ మాటలు విన్నప్పుడు తామస్ ఫెరిల్ అనే కవి సూక్తులు ప్రవాసుల విషయంలో గుర్తుకురాకతప్పదు ఉన్న చోటునే స్వర్గం చేసుకోమని కవి సారాంశం *"Always begin right here where you are/And work out from here / To any dream deserving the sensible world"!!*

జూన్ 24, 1990

# సాహితీ ధ్రువాలు !

“స్ఫటికం ఎంతగొప్పది! కళాకారుడు నేర్చుకో దగ్గ గుణపాఠాలన్నీ గూడుకట్టిన వస్తువు కదా ఇది! ఇక జీవిత శకలాన్ని శిల్పంగా రచిస్తున్న కళాకారుని సృష్టికి స్ఫటికంలోని చందస్సు, సలక్షణత, కాంతి, కాఠిన్యం అన్ని ఫలకాలలో, వెలుపలా, లోపలా విశదీకృతమైనప్పుడే విలువా, సార్థకతా! స్ఫటికం ఆకృతి ధరించడం ఎంత ఆకస్మికమో కళాసృష్టీ అంతే జీవితం ఎడతెగని కల్పవికల్పాలు, వికాస వినాశనాలు పొందుతూ, చెట్ల గూళ్ళలో పిట్టల్లాగా, ధరాగర్భంలో రత్న మాణిక్యాల్లాగా ఆకృతి ధరిస్తూ ఉంటుంది (అలాగే) అప్రయత్న రచనలో చిత్రవిచిత్ర వస్తుజాలం' కూడా ఆవిష్కృతమవుతూ ఉంటుందని ఒక సందర్భంలో మహాకవి అన్నాడు అలాంటి విశ్వకళా పారంగతులుగా, సీమాంతరాలలో అమెరికా, యూరప్ ఖండాలలో లోక సందర్శనంలో మానవ, మానవేతర ప్రకృతి జీవన సమరాన్ని కథలుగా, కవితలుగా, నాటకాలుగా, వ్యాసాలుగా, హాస్యరచనలుగా, నవలలుగా మలిచి, వసుధైక కుటుంబ వ్యవస్థకు వస్తు నిర్దేశంచేసి కళాంజలులు సమర్పించిన ఉద్దండులైన సాహితీవేత్తలెందరో ఉన్నారు అంతర్జాతీయ సాహితీ జలనిధిలో తెలుగువాడి కథామాణిక్యం తక్కువది కాకపోయినా, ఈ సీమాంతర సాహితీ ధ్రువాల గురించిన పరిశీలన కూడా అవసరం ఈ సందర్భంలో ఇటీవల విశిష్టపీఠం అందుకున్న “సీరీస్” -ముప్పయ్యేడేళ్ళుగా “పారిస్ ఇంటర్‌వ్యూ” పత్రిక కొనసాగిస్తున్న సాహితీ వేత్తల పుట్టుపూర్వోత్తరాలు, రచనా వైశిష్ట్యం, వ్యక్తిగత విశేషాలను వెల్లడిస్తూ కళాజగత్తును ఉవ్విళ్ళూరిస్తున్న ఇంటర్‌వ్యూల పరంపర చూడ్డానికి “పారిస్ ఇంటర్‌వ్యూ” పత్రిక పెద్దదేమీ కాదు పిట్టకొంచం, కూత ఘనంగా 1953లో అవతరించి సాహితీవేత్తల మనస్సులను అవధరిస్తున్న కళానిధి అమెరికన్ యువకులైన పీటర్ మాతిసెన్, హెరాల్డ్ హ్యూమ్స్, జార్జి ప్లింప్టన్, థామస్ గుంజ్ బర్గ్, డోనాల్డ్ హాల్ ఆధ్వర్యంలో వెలువడుతున్న ఈ సాహితీ సుధానిధికి సంపాదకుడు జార్జిప్లింప్టన్ కథా జగతికి దూరంగా ఉండే ఇతరేతర సృజనాత్మక రచనలకే ప్రాధాన్యం కల్పించాలన్న ఆదర్శంతో తొలుత ప్రారంభమైన దీనియాత్ర రానురాను రచనా శిల్ప చర్చగా, తీగ కదిపితే డొంకంతా కదిలినట్టు - ఆదర్శ రచన, కథాసంవిధానం, కవితా లక్ష్యం, కావ్యమీమాంస, నాటక దృక్పథం, వ్యాస విన్యాసం, కల్పనా పటిమ, వాస్తవికత, సృజనశక్తి, పాఠకుల స్పందన, రచయితల ప్రతిస్పందన ఇత్యాది విషయాలన్నింటిపైన ఆమూలాగ్రంగా చర్చించిన సుమారు వందమంది రచయితల భావనా కదంబం ఇప్పటికి వెలువడిన “పారిస్ ఇంటర్‌వ్యూ” ఏడు సంపుటాలూ ఇల్యా ఎహ్రెన్ బర్గ్ “రచయితా - శిల్పమూ” ఒక్క ప్రసిద్ధుని అభిప్రాయమేకాగా, “పారిస్ ఇంటర్‌వ్యూ” సంపుటాలు విభిన్న దృక్కోణాలనుంచి నూరుమంది సుప్రసిద్ధులు చర్చించి ఇంద్రధనస్సులు వెదజల్లుతూ భావితరాలకు అందజేస్తున్న సాహితీ రసగంగాధరాలు కనుకనే ఈ సంపుటాలన్నిటికీ ఏకైక మకుటం -“ రైటర్స్ ఎట్ వర్క్” అని పెట్టారు అందుకే ఈ ఇంటర్‌వ్యూలను ప్రసిద్ధ రచయిత, నవలా కారుడైన జాన్ ఉప్‌డైక్ “ఈ శతాబ్దపు సాహితీ ధ్రువాల సాటిలేని మేటి సమ్మేళనం”గా *("an unparalled rollcall of the century's literary lights")* అభివర్ణించాడు ఈ వందమంది ఉద్దండులలో మనకు ఎక్కువ పరిచయస్తులుగా కన్పించే వారిలో ప్రముఖులు “పాసేజ్ టు ఇండియా” రాసిన ఇ ఎం ఫార్‌స్టర్ (ఈయన ఇంటర్‌వ్యూతోనే రచనాశిల్పానికి చెందిన అందమైన చర్చకు కాకపుట్టింది, అతనిదే తొలి ఇంటర్‌వ్యూ కూడా) డొరొతీ పార్కర్,

విలియమ్ ఫాక్నర్, ఆల్బర్ట్ మొరావియో, బోరిస్ పాస్టర్నక్, మేరీ మెకార్థీ, ఎజ్రాపౌండ్, ఎర్నెస్ట్ హెమింగ్వే, అల్డస్ హక్స్లీ, హెన్రీమిల్లర్, టి ఎస్ ఇలియెట్, ఆర్థర్ మిల్లర్, అలెన్ గిన్స్బెర్గ్, సాల్బెలో, జేమ్స్జోన్స్, ఆడెన్, స్టీన్బెక్, ఉప్డైక్, పాబ్లో నేరూడా, పి జి ఉడ్హౌస్, స్టిఫెన్ స్పెండర్, గాబ్రీల్ గార్సియా మార్క్వెజ్, జాన్ గార్డెనెర్ ఈ సంపుటాలు ప్రతి ఒక్కదానికీ, వేర్వేరుగా ఇంటర్వ్యూలతో బరాబరిగా తూగే విశిష్టమైన ఉపోద్ఘాతాలను అందించిన పిదుగులు మాల్కోమ్ కౌలీ, వాన్విక్ బ్రూక్స్, ఆల్ ఫ్రెడ్ కాజిన్, విల్ ఫ్రెడ్ షేడ్, ఫ్లెసిక్స్గ్రే, ఫ్రాంక్ కెర్మోడి, జాన్ ఉప్డైక్ ఇంటర్వ్యూలను "పారిస్ రివ్యూ" సంపాదకులు నిర్వహించిన పద్ధతి కూడా విశిష్టంగా ఉంది గంటలోనో, అరగంటలోనో, ముగించుకుని వచ్చిన ఇంటర్వ్యూలు కావవి ఒక్కో ప్రసిద్ధ కవితో, కధారచయితతో, నవలాకారునితో, వ్యాసకర్తతో ఎవరితోనైనా సరే ఇంటర్వ్యూ చేసే వ్యక్తి కనీసం రెండు మూడు రోజులైనా గడిపి, ఆయా రచయితల ప్రత్యేకతలను (మానిరిజమ్స్), రచనా పద్ధతులను, ప్రవర్తనను పరిశీలించి జరిపిన ఇంటర్వ్యూలు కనుకనే ఈ ఇంటర్వ్యూలలో మనకు భిన్నపాత్రలు, విభిన్న మనస్తత్వాలు, వ్యక్తుల ఉపజ్ఞ", మేధస్సు ప్రస్ఫుటమవుతూ ఉంటాయి, జీవితంపట్ల, కళాసంస్కృతులపట్ల వీరందరిలో ఆవిష్కరించుకొన్న సమష్టి అనుభవం యువతరాలకు విశిష్టానుభవంగా అందివస్తుంది

ఇంటర్వ్యూల్లో పాల్గొన్న ప్రసిద్ధులంతా ఒక్క దేశంవారే కారు, అయిదు దేశాలకు ప్రతినిధులు వీరిలో కాథలిక్కులు, ప్రొటెస్టాంటులు, యూదులు, ఉదారవాదులు, ఈశ్వరవాదులు, నిరీశ్వరవాదులు, హేతువాదులు, వివాహితులు, అవివాహితులు, విడాకులిచ్చిన వారూ, సోషలిజాన్ని, కాపిటలిజాన్ని ప్రేమించినవారూ ఉన్నారు, ప్రజా ఉద్యమాలతో, విప్లవోద్యమాలతో, యుద్ధాలతో, శాంతి ఉద్యమాలతో సంబంధాలున్న రచయితలున్నారు వీరిలో రాజకీయాలు వెంటబట్టినా రచనల్లో ప్రతిఫలింపజేయని హెమింగ్వే లాంటి మధ్యే మార్గావలంబకులూ ఉన్నారు, రాజకీయాలకు బొత్తిగా దూరంగా ఉండే హెన్రీమిల్లర్ లాంటి "అస్పృశ్యులూ" ఉన్నారు, తోటి మానవుని కష్టసుఖాలను పట్టించుకోని పలాయన తత్వాన్ని మహా నేరంగా భావించి, రాజకీయాల్ని పవిత్ర ధర్మకాండగా భావించిన టి.ఎస్.ఇలియెట్ లాంటి వాళ్ళూ ఉన్నారు. అయితే ఆ ఇంటర్వ్యూలలో వీరందరి కేంద్రీకరణ - కథారచనను, రచనా శిల్పాన్నీ ఎలా మలచాలి, "కాదేదీ కవితకనర్హం" అన్నట్టుగా కాదేదీ రచనకు అనర్హం అని నిరూపించుతూ రచయిత విశ్వరూప సందర్శనకు విపులమైన పునాదులు వేయడంపైన ఒక సందర్భంలో విలియమ్ ఫాక్నర్ అన్నట్టు "కళాకారుడైన రచయిత రాసేది విమర్శకుణ్ణి కదిలించేట్టుగా ఉంటుంది, కాగా విమర్శకుడు రాసేది కళాకారుడైన రచయితను తప్ప, ప్రతి ఒక్కరినీ కదిలిస్తుంది". రచయితకూ, విమర్శకునికీ మధ్య నెలకొన్న ఈ "లక్ష్మణరేఖ" వైశిష్ట్యాన్ని కూడా ఈ ఇంటర్వ్యూలలో మనం గమనించవచ్చు రచయిత అంతటి కళాకారుడు కాబట్టే నెల్సన్ ఆల్గన్ "నా నవలను ఓ దారువులో చెక్కి చిత్రిక పట్టి మరీ చిత్రీకరిస్తా"నని అనగలిగాడు *["I would like to carve my novel in a piece of wood"]!* బహుశా ఈ ఆరాధనకే, వేదనాకలశమైన ఈ చింతనకే, మనస్సు కేంద్రీకరణకే మరోపేరు పెట్టలేక హెన్రీజేమ్స్ తాత్త్వికార్థంలో *"Divine principle of Scenerio"* అని ఉంటాడు! అంతేగాదు, కథావిష్కరణను, దాని బీజదశను అతను వర్ణించిన తీరు కూడా అద్భుతం ఆలోచనలో కథ, కవితావస్తువు అనేది ఓ అపురూపమైన పరమాణువు . . శకలంగా, అలవోకగా

అందివచ్చే ఓ సూచన, అందీ అందని చేలాంచలంలా మనచుట్టూ పరిభ్రమించే ఓ పదం ఓ అస్పష్టరాగం, ఓ నిశ్శబ్ద తరంగం ఇందులో ఏది నవలాకారుని భావనా మందిరాన్ని తాకినా, అది మంత్రకవాటంలా తెరచుకుంటుంది దాని వైశిష్ట్యం అంతా, సులుసూత్రంగా శరీరంలోకి చొరబారే సూదిమొనలా మానవ మస్తిష్కంలోని అంతస్సారాన్ని పిండుకు రాగల లోచనాశక్తిలో, భావనా శక్తిలో ఉంది" అంటాడు! రచన మొదలెడితే అదే పరుగు, విరుపులుంటాయి గాని, విరామాలు ఉండవు! నెల్సన్ అల్‌గ్రెన్ లానో కలం ఎక్స్‌ప్రెస్ రైలులా పరుగెడితే, విలియమ్ స్టిరాన్ రచనలా, ఫిలిప్ లార్కిన్ కవిత్వంలా (మన దేవులపల్లి కృష్ణశాస్త్రిలానే) ప్రతిపదాన్నీ, పేరాను, వాక్యాన్నీ, అడుగడుగునా రోజులతరబడి చిత్రికపట్టి గాక మరీ వదలని వారూ ఉన్నారు ఈ అవస్థనొకాయన 'న్యుమోనియక్'కళ అని వర్ణిస్తే ఇంకొకాయన *"I seem to have some neurotic need to perfect each sentence "* అని వ్యంగ్యీకరించాడు! అలాగే హెమింగ్‌వే మనస్సుకంటే ముందు రచనలో మునివ్రేళ్ళు పరుగులెడతాయట! రచనా శిల్పంలో అతనొక రేఖా గణితం కాబోలు! హెన్రీ మిల్లర్ రచనాకాలం అపరాత్రి నుంచి ఉషోదయం దాకా ఉంటే, హక్స్‌లీకి ప్రత్యూష పవనాంకురాలు అప్రతిహత వ్యాసంగ విన్యాస ఘడియలు అయితే విక్‌బ్రూక్స్ అన్నట్టుగా 20వ శతాబ్దపు రచయితలు, కోల్‌రిడ్జ్, డిక్వెన్సీలా కేవలం నల్లమందు భాయీలు కారు నవల పూర్తిచేయాలంటే బాల్జాక్‌కు 50వేల కప్పుల కాఫీ కావాలట అయినా రచయితఅన్నవాడు ఎలా రాస్తాడు, ఎందుకు రాస్తాడని కూపీలాగడం ఏట్స్ కవికి ఇష్టం లేదు! వాస్తవాన్ని మసిపూసి మారేడుకాయ చేసినట్టుగా జోక్యాన్ని "వసంత శోభను చెదరగొట్టడం"గా చిత్రిస్తాడు *(muddying the spring)* సతతహరితాన్ని, నిత్యవసంతాన్ని కోరుకునే కవి ఎన్నడూ జోక్యాన్ని సహించడట బ్రౌనింగ్ అనలేదూ *"Where the apple reddens, never pry - Lest we lose our Eden, Eve and I"* అని!!

జూలై 15, 1990

# వాలెస్ మానవుడు

"కొత్త గొంతుక చెవిని పడితే గుడ్లు నిప్పులు చెరుగుతాయ"ని ఒక మహాకవి సూక్తి! అలాటి నిప్పులు చెరిగిన ఆధునిక సుప్రసిద్ధ అమెరికన్ రచయితలలో, మూడు దశాబ్దాల కాల గతిలో మానవుణ్ణి మాధవునిగా కొలిచిన నవలా రచయితలలొ ఒకరు ఇటీవలనే (జూన్ 30) చనిపోయిన ఇర్వింగ్ వాలెస్. రెండవ ప్రపంచ యుద్ధంలో అమెరికన్ సైనికులలో ఒకరుగా వాలెస్ పొందిన అనుభవాలు, ఆ తరువాతి కాలంలో మానవ దర్శనంలో అతని తాత్త్వికచింతననే మార్చివేశాయి. యుద్ధానుభవం కొందరిని నిరాశావాదులుగా మలచితే, మరికొందరిని శాంతికాముకులుగానే గాక ఆశావాదులుగా భవిష్యజ్జీవితానికి బంగారు బాటలు వేయగల దార్శనికులుగా దిద్ది తీర్చుతుంది. కడచిన మూడున్నర దశాబ్దాలుగా వాలెస్ "నవల" పేరిట చిత్రించిన కథలూ, గాథలూ పేరుకుమాత్రమే ఊహాచిత్రాలు గాని, తీరుకుమాత్రం అవినీతికర పాలనా వ్యవస్థలపైన, మానవుని కడగండ్లపైన, నాయకుల కపట నాటకాలపైన, నాల్క చీలిన పాలకుల నిరంకుశ ధోరణులపైన, సంస్కృతిలో తలెత్తి స్వైరవిహారం చేస్తున్న మూఢవిశ్వాసాలపైన, మౌఢ్యం చాటున చెలామణి అవజూస్తున్న అనేక తప్పుడు విలువలపైన కత్తివేట్లుగా భావించవచ్చు! నిజమైన కావ్య లక్షణాన్ని ఓ కవి "విశ్వమానవ కళాకంతుల" ప్రదర్శనకు వీలైన సుదర్శనచక్రంగా వాడుకోమని చెబుతూనే "నిలువుం కోతకు సమ్మతించి జడమై నిద్రించు దుర్జాతితో /తలక్రిందై తపమాచరింపు మపుడే ధన్యంబు నీ జన్మమున్" అన్నాడు! ఆ తపన, తపస్సు కవికే కాదు, రచయిత అన్న ప్రతివాడికీ అవసరం. జడత్వాన్ని వదిలించడానికి రెండు మాటలు తాను ప్రేమించే ప్రజలను అన్నా, తిట్టినా తప్పులేదు. అలాంటివాడు ఇర్వింగ్ వాలెస్ కూడా! ప్రెసిడెన్షియల్ వ్యవస్థ, లేదా బైబిల్ - దేనిని తన కథా వస్తువుగా స్వీకరించినా వాలెస్, పురావస్తు సంచయం పూర్వాపరాలలోకి పోయి, గతానుగతికంగా విశ్లేషణ జరిపి, నవలలు రాసినవాడు. ప్రతి నవలకు ఒక చారిత్రక ఘట్టాన్నో లేదా ఒక పురాతత్వ పరిశోధనాంశాన్నో ఆకరంగా చేసుకొని మరీ రచన సాగించినవాడు. ఈ విషయంలో ఇర్వింగ్ వాలెస్‌కు ఇండియాలో ఉజ్జీలుగా పేర్కొన దగిన వ్యక్తి మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్. "వోల్గా-సే-గంగ", "సింహసేనాపతి", "జయజౌధేయ" చారిత్రక నవలలను తీర్చిదిద్దిన పద్ధతికీ ఇర్వింగ్ వాలెస్ తన 35 నవలల్లో ప్రముఖంగా పేర్కొనదగిన "ది మాన్", "ది వర్డ్", "ది చాప్‌మన్ రిపోర్ట్", "ది సెవెన్ మినిట్స్", "ది ప్రైజ్" నవలలను మలిచిన తీరుతెన్నులకూ వ్యత్యాసం కంటే, పోలికలే ఎక్కువని చెప్పొచ్చు. ఈ శతాబ్దపు అమెరికన్ రచయితలలో వాలెస్‌ను, మానవతా వాదులు, హేతువాదులు, నీతివాదులూ అయిన హాతోర్న్‌తో, వాల్ట్‌విట్‌మన్‌తో, జాన్ చేవర్‌తో పోల్చుకోవచ్చు. జీవితంలోని కృత్రిమతను, వెర్రిబాగులతనాన్ని, అతివేలాన్నీ ఎంతో చతురిమతో తూర్పారబట్టిన నవలాకారుడుగా, కథకుడుగా పేరొందిన చేవర్ నిజమైన కథా లక్షణం జ్ఞాన నేత్రాలు ప్రసాదించడమనీ, మానవ మేధస్సును జాగృతం చేయడమనీ అన్నాడు *(Fiction is meant to illuminate)*, అంతేగాదు, నవల, కథ ఓ కళ, సాంఘిక జీవనంలో సంక్షోభ దశలపైన, అల్లకల్లోలంపైన అంతిమ విజయం సాధించడమే కళ అని కూడా అన్నాడు. ఈ మాటలు వాలెస్ విషయంలో కూడా అక్షర సత్యాలు. వాలెస్ కర్త్‌వోనిగట్ లాంటి నిరాశావాద రచయిత కాదు.

కనుకనే "ది మాన్" నవలలో వాలెస్ - జాతి, మత వైషమ్యాలను, వర్ణ వివక్ష పేరిట జరిగే నర మేధాన్ని ఈసడించుకుని నీగ్రోల పౌర హక్కులను సమర్థించి అబ్రహాం లింకన్ తరువాత కూడా కడచిన వందేళ్ళకు పైగా అమెరికాలో సాగుతున్న మానవతా ఉద్యమానికి బాసటగా నిలుస్తాడు, ఒక పాత్రద్వారా అందులో ఆయన "కమ్యూనిజం తమకు తిండి పెడుతుందని, కాగా కేవల ప్రజాస్వామ్యం (డెమోక్రసీ) మనిషికి వోటు హక్కును, సంపాదక లేఖలు రాసుకొనే హక్కును మాత్రమే ఇస్తుందనీ పేద ప్రజలకు తెలుసు" అంటాడు! ఈ నవలకు ఆధారంగా, అందులోని వాదనకు వత్తాసుగా వాలెస్, ఒకనాడు అబ్రహాంలింకన్‌కు సలహాదారుగా, సంఘ సంస్కర్తగా, రచయితగా సమానత్వ హక్కుల సమస్యపై అమెరికన్ వైస్ ప్రెసిడెంట్ పదవికి పోటీచేసిన అభ్యర్థిగా ఉన్న ఒక నీగ్రో బానిస తన స్వదస్తూరీలో ఉన్న ఓ లిఖితప్రతి లోని వాక్యాలను కూడా ఉదాహరిస్తాడు ఆ బానిస మాటల్లో చెప్పాలంటే - "మనది ఉమ్మడి సంస్కృతి, వివిధ వ్యావృత్తులలో ఉంటూ ప్రపంచం నలుమూలలనుండి జాతి, మత, రంగు భేదాలతో నిమిత్తం లేకుండా ఒక్కచోటుకు చేరుకున్న మానవ కుటుంబం మనది చట్టం ముందు అందరూ సమానులే మరి కాని నిత్యజీవనంలో కూడా వాడు కలవాడు, వీడు లేనివాడు, వాడు ఉన్నతుడు, వీడు తక్కువ స్థాయివాడు, వాడు తెల్లవాడు, వీడు నల్లవాడు అన్న విభేదాలను అనుమతించడానికి వీలులేదు వెరసి - అందరిదీ ఒకే దేశం, ఒకే పౌరసత్వం, సమాన హక్కులు, అందరిదీ ఒకటే గమ్యం " అందుకే ఈ విద్య వంటబట్టిన వాలెస్ 1883లో ఫ్రెడరిక్ డగ్లస్ చెప్పిన మాటలను నదురు బెదురు లేకుండా అమెరికన్ పాలకులకు హెచ్చరికగా ఉదాహరించాడు "పౌరునికి జీవించే హక్కును, అతని స్వేచ్ఛను, సుఖప్రదమైన అతని ప్రశాంత వ్యాపకాన్నీ రక్షించలేని, సంరక్షించలేని ప్రభుత్వాన్ని ప్రజలు ఎలాంటి ఆలస్యం లేకుండా సంస్కరించాలి లేదా కూలదోసెయ్యాలి!!" ఈ భావాలనే వాలెస్ "ది మాన్"లో ఆయా పాత్రలద్వారా వ్యాప్తి చేస్తాడు మంచి - చెడుల పూర్ణకుంభమైన ఈ మానవుడు అధికారం పేరుతో ఎంతటి నైచ్యానికి అయినా ఎలా సిద్ధపడతాడో నిరూపిస్తాడు, రాజకీయ స్వార్థం కోసం పాలకులు అవసరం లేకపోయినా దేశంలో "ఎమర్జన్సీ" ని ఎలా ప్రకటిస్తారో చెబుతాడు, మానవుని నవనాడులు బంధించే ఎమర్జెన్సీ - వ్యవస్థకు, శాంతిభద్రతలకు, దేశరక్షణ ప్రయోజనాలకు ఎలా విరుద్ధమో నిరూపిస్తాడు, ఇండియాలో ఎమర్జెన్సీ అమలులో ఉన్నప్పుడు (1975-76) "ది రీకన్‌స్ట్రక్షన్" అన్న నవలను నిషేధించారు ఎందుకట? "పునర్నిర్మాణ" కార్యకలాపాల పేరుతో ఒక దేశపు ప్రెసిడెంట్ తన ప్రత్యర్థులను దెబ్బతీయడం కోసం గూఢచారి శాఖను, ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్‌వెస్టిగేషన్‌ను ఎలా స్వార్థానికి వినియోగించుకుంటాడో, ఎలా దేశంలో ఎమర్జెన్సీని విధించి, అల్లకల్లోలం సృష్టించచూస్తాడో ఆ నవల చిత్రించింది ఆ నవల ఆనాటి మన దేశ పరిస్థితులకు కూడా అద్దంగా భావించి, నిలువు లోతున మన పాలకులు పాతిపెట్టేశారు

"ది మిరకిల్"ను (అద్భుతం) పైకి కథా చిత్రంగా పేర్కొన్నప్పటికీ, అందులోని పాత్రలు, స్థలాలు, పేర్లు, ఘటనలూ రచయిత ఊహాచిత్రాలేనని చెప్పినా, మన దేశంలో "బాణామతి" బాపతు బీభత్సరసప్రధానమైన, ప్రజల చైతన్యాన్ని దెబ్బతీసే చేతబడులు, "అద్భుతాల" పేరిట జరిగే దోపిడిని వెల్లడించే నవల అది చాదస్తాలను చాటలతో పంచే సాహిత్య దళమూ కాదు, తులసిదళమూ కాదు! మిరకిల్స్ పేరిట జరిగే మోసాలపై చెలరేగిన నిప్పుకణం తన రచనకు ఒక అవతారికగా "మిరకిల్స్" పై అభిప్రాయాలను వాలెస్ ఒక మతాచార్యునిగా

రివరెండ్ జాన్ లాఫార్గే అన్న మాటలలో ఉదాహరిస్తాడు - "దేవుణ్ణి నమ్ముకొనే వారికి ఆ విషయంపై వివరణ అనవసరం/ దేవునిలో విశ్వాసం లేనివారికి వివరించడం అసాధ్యం!" అశ్లీల సాహిత్యం గురించి, ఏది శీలం, ఏది అశ్లీలం అన్న మీమాంస ప్రపంచ వ్యాపితంగా చెలరేగుతున్న ఘడియలలో వెలసింది "ది సెవెన్ మినిట్స్" అన్న నవల ఈ విషయంపై ఎన్ని కోర్టు తీర్పులు, శషభిషలు నడిచినా చర్చ ఒక కొలిక్కి రాని సమయంలో ఇర్వింగ్ వాలెస్ ఈ నవల ద్వారా న్యాయమూర్తి బారెట్ కోర్టులో జరిపించిన విచారణ చిత్రం "నభూతో నభవిష్యతి" అనిపిస్తుంది సువ్యవస్థాపితమైన అనేక విశ్వాసాలు ఈ తీర్పులో చెల్లాచెదురవుతాయి విచారణ దృశ్యాలు విద్యా నిలయాలుగా కన్పిస్తాయి వాలెస్ ఈ నవల ద్వారా క్రైస్తవమతంలో కూడా కల్లోలం పుట్టించాడు విచారణ సందర్భంగా పాత్ర మిసెస్ వైట్‌ను, న్యాయమూర్తి బారెట్‌ను ఏది అశ్లీలమో అభిప్రాయం చెప్పమని ప్రశ్నిస్తూ అనేక పుస్తకాల నుంచి వాక్యాలకు వాక్యాలను ఉటంకిస్తాడు, "ఇందులో అశ్లీలం లేదు" అని వైట్ చెప్పిన మరుక్షణంలోనే జడ్జి, హోలీ బైబిల్‌లోని ఓల్డ్ టెస్ట్‌మెంట్ నుంచి మానవజన్మ వృత్తాంతానికి సంబంధించిన ఒక పేరాను (అది బైబిల్ నుంచి అని చెప్పకుండా) ఉదాహరిస్తాడు మిసెస్ వైట్ ఆ పేరాకు మండిపడి *"Obscene, utterly and definetly obscene"* అని కోర్టులో అరిచేస్తుంది! ఆమె క్రైస్తవ మతావలంబి అలాంటి అభ్యంతరకర ఘట్టం బైబిల్‌లో ఉంటుందని ఆమె ఊహించలేదు తనను తాను నమ్మలేకపోతుంది! ఇక వాలెస్ 'ది ఆల్‌మైటీ" నవల వ్యాపార పోటీ పేరుతో పత్రికాధిపతులు వార్తల సృష్టికోసం సెన్సేషనలిజం కోసం చివరికి హత్యా రాజకీయాలకు కూడా వెనుదీయని దుస్థితికి పరాకాష్ట మనకు పత్రికా లోకంలో సి పి స్కాట్, వికహామ్‌స్టెడ్ లాంటి ఉత్తములు కావాలి గాని "ఆల్‌మైటీ"లోని ఎడ్రో ఆర్మ్‌స్టెడ్‌లు మాత్రం వద్దు, వద్దు!!

జూలై 8, 1990

# "ఉగ్రకోపి నేను...."

సరసాలు ఎన్ని రకాలో, విరసాలు కూడా అన్ని రకాలు! 'నిరసన' ఎన్ని రకాలో నిరసనోద్యమాలు అన్ని రకాలు కోపానికి ధర్మకోపానికీ, తాపానికి ప్రతాపానికీ కూడా సవాలక్ష సంకేతాలున్నాయి ఉన్న వ్యత్యాసమల్లా వాటిని వ్యక్తంచేసే తీరులో మాత్రమే "పేదవాడి కోపం పెదవికి చేటు" అన్నంత మాత్రాన మూతికుట్టుకుని కూర్చోవలసిన అవసరం లేదు జీవితం పాఠాలు నేర్పుతుంది, అనుభవం ఆగ్రహం తెప్పించి, జీవన పరిస్థితులపట్ల తోచిన పద్ధతుల్లో అభిశంసన తీర్మానం ప్రతిపాదిస్తుంది! అదే జరిగింది కొలదిరోజులనాడు అమెరికాలో తన జీవన పరిస్థితులు దుర్భరంగా మారినందున ఉన్న ఇల్లు నివాసయోగ్యం కాకుండా మారిపోయినందున తన నిరసన తెలపడానికి మేడమ్ మేరియా టెర్విన్ అనే ఆవిడ వెస్ట్ వర్జీనియాలోని బెర్కెలీ స్ప్రింగ్స్ (మోర్గాన్) కోర్టువద్ద ఓ వింతపద్ధతి అనుసరించింది ఇంటి యజమానిగాని, మునిసిపాలిటీగానీ, ప్రభుత్వంగానీ, చివరికి కోర్టుగానీ తన ఇబ్బందులను పట్టించుకోని దశలో ఆమె ఎంత శిక్షకైనా సిద్ధపడి - కోర్టు గదిలోనే సాక్షాత్తూ మేజిస్ట్రేట్ 'మార్గరేట్' గోర్డాన్ బల్లవద్దనే మిసెస్ గోర్డాన్ విచారణజరుపుతున్న సమయంలోనే, వేలకొలది బొద్దింకలను వదిలిపెట్టింది! అహింసాయుత నిరసన అయినా కంపరం ఎత్తిపోయిన మిసెస్ గోర్డాన్ పిటీషనర్ ఫిర్యాదును విచారించడం మానేసి, మిసెస్ టెర్విన్‌పైన కోర్టు ధిక్కార నేరం మోపింది కోర్టులో ఇంతకుముందెన్నడూ ఇలాంటి ఘటన జరుగలేదని, ఇది దుస్సహమనీ మేజిస్ట్రేట్ ఎదురు నిరసన తెలిపింది! మిసెస్ టెర్విన్ "అన్యాయా"నికి నిరసనగా కోర్టులో వదిలిపెట్టిన డబ్బాడు బొద్దింకలూ మేజిస్ట్రేట్‌ను వేధించడంతో ఆగకుండా రెండో అంతస్తులోని ఆఫీసుల్లోకి, హాల్స్‌లోకి, కక్కుసు దొడ్లలోకి, ఇతర మేజిస్ట్రేట్స్ గదుల్లోకి చరచరా పాకిపోయి కలవరం సృష్టించాయి! ఒక రోజంతా క్రిమిసంహారక మందులు కొడితేగాని ఆ బిల్డింగ్ తిరిగి ఉపయోగంలోకి రాలేదట! నిరసన మానవుడి సొత్తేకాదు, మానవుణ్ణి ఆసరా చేసుకుని జీవిస్తున్న పరాన్న భుక్కులైన ఇతర జీవులకు కూడా తెలిసిన విద్య చేసేవాడొకడు, చేయించే వాడొకడు అందుకే ప్రాణికోటిలో ఏదీ "కాదేదీ కవిత కనర్హం" అన్నట్టుగానే కవితామయమైన "కాక్రోచ్" (బొద్దింక) కూడా మనిషి నిరసనోద్యమంలో ఒక సమిధకాక తప్పలేదు! మానవాళిలో కవితాశోభ, నిరసన ప్రతిభ సర్వాంతర్యామిగా సాగిపోతున్నాయి కాబట్టే తిరుపతి కవులు నచ్చినవాటి మీద, నచ్చని వస్తువుల మీద కూడా సరదాగా రాసిపడేశారు సూదులు, చీపురుపుల్లలు, పాదుంబుర్రలు, చేతికర్రలు, చెదపురుగుల మీద కూడా కవిత్వాలు రాసేశారు మన స్వాతంత్ర్యోద్యమంలో బ్రిటిష్‌వాడిపై సాగించిన సహాయ నిరాకరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహం (దండియాత్ర) ఆగ్రహభార్గవులైన ప్రజలు ప్రదర్శించిన నిరసన తప్ప మరొకటి కాదు ఆగస్టు ఉద్యమం ప్రజల ఆగ్రహజ్వాలాతోరణం కాంగ్రెస్ వారు సహా అన్ని రకాల మిలిటెంటు శక్తులూ రైళ్ళు ఆపారు, రైలుపట్టాలు పీకారు, తంతితీగలు తెంచారు, డొంకలు కదిలించారు, "టెరరిస్టులు" సెంట్రల్ అసెంబ్లీలో బాంబులు పెట్టారు, ఇప్పుడు రిజర్వేషన్ అనుకూల, ప్రతికూల ఉద్యమాలలో కూడా బస్సులూ, రైల్ళు, సైకిళ్ళు నిరసనకు గురయ్యాయి ఆత్మాహుతి మరో బెదిరింపు! అలాగే నక్సలైట్ల, పోలీసుల కిడ్నాప్‌లు, ఎన్‌కౌంటర్లు వాళ్ళ వాళ్ళ ఉద్దేశాలనుంచి, ఆగ్రహ ఆవేశాల నుంచీ బయలుదేరిన ఉగ్రరూపాలలో వెలువడుతున్న పరస్పర నిరసన తప్ప మరొకటికాదు, ఆగ్రహంలో కూడా

రకరకాలు - కొందరు 'నిరశన'వ్రతం మాత్రమే పూనగా, ఇంకొందరికి నిరసన పేరిట కంటికి కనపడినదల్లా బద్దలుకొట్టేవరకూ నిద్రపట్టదు ఇంకొందరికి బూట్ పాలిష్‌కొట్టడం ద్వారా, కార్ల గ్లాసులు తుడవడం ద్వారా నిరసన తెలుపుతారు కాని ఈ క్రమంలో వారు చేస్తున్న పని కొన్ని వృత్తి పనులను, సోదర ఉద్యోగులను పరిహసిస్తున్నామన్న జ్ఞానం కోల్పోవడం! ఇందిరాగాంధీ వోడిపోయే దాకా పెరిగిన గడ్డం తీయనని, శోరోముండనం చేయించుకోనని భీష్మించిన రాజ్‌నారాయణ్‌ది మరొక తరహా నిరసన! అంతేగాదు, ప్రతిభ ఉన్నచోట అనుకూలురతోపాటు ప్రతికూలురు కూడా ఉంటారు! అలాంటి వ్యక్తి ప్రతికూల సమయంలో ఏంచేస్తాడో, ఎలాంటి పనికి దిగుతాడో, తన నిరసననూ ఆగ్రహాన్నీ ఎలా ప్రదర్శిస్తాడో ఎవరూ చెప్పలేరు చాటుకవితా పితామహుడు వేములవాడ భీమకవి గురించి కథలు కథలుగా ఉన్నాయి భీమకవికి ప్రజాదరణను, రాజాదరణను గమనించిన నన్నయ్య ఉడుకుబోతుతనం పట్టలేక భీమకవి రెండర్థాలతో రాసిన "రాఘవ పాండవీయం" అనే కావ్యాన్ని తగలబెట్టించాడట! దాంతో మండిపోయిన భీమకవి నిరసనగా కోపంతో చేసిన పని-నన్నయ్య రాసిన "ఆంధ్రశబ్ద చింతామణి"ని గోదావరి పాలుచేయడం! అనూయ అనే అంధకారంలోనే కాదు, ధర్మకోపంలోనూ, ఆగ్రహమనే అవధులులేని ఉగ్రతలోనూ కిందా మీదా తెలియకుండా ఇలా నిరసన వెల్లడవుతూంటుంది!

ఎంతసేపూ ఇతరులను గేలిచేసే ఉద్దేశంతో సవాళ్ళు, ఎదురు సవాళ్ళు నడిపించే వాళ్ళు కూడా మనకు తగులుతారు తిట్టు కవిత్వాల ద్వారా పరస్పరం కల్పించుకొని కొట్లాటలకు దిగిన కవులు మనకు చాలామంది ఉన్నారు అయితే వీళ్ళు కోర్టులకూ, కోర్టుధిక్కార నేరాలకూ అతీతులుగానే బయటపడుతూ వచ్చారు తమను గేలిచేసిన వాళ్ళు తిరిగి తమను గెలిచేవరకూ ఉన్న "మీసం" తీసేదిలేదు పొమ్మన్న తిరుపతి కవులు ఆత్మకూరు సంస్థానంలో బజాయించిన ఢంకా తెలుగు విద్వల్లోకంలో ఇంకా "రింగులు" కొడుతూనే ఉంది! శాపానుగ్రహశక్తి యుక్తులున్న కవులకు తలమానికంగా భావించే భీమకవి తన ప్రతిపక్షులందరికీ "నెత్తిమీద రంపమై" చలాయించుకురాలేదూ?! అతడెంత శక్తిమంతుడు కాకపోతే-వట్టి గొడ్డుకు మేత దండుగ అన్నట్టు వట్టి చెట్టుకు చిగురుపట్టదని ఊరుకోక ఉగ్రకోపిగామారి చిగురు పుట్టిస్తానని భీష్మించి తన పంతం నెగ్గించుకోగలడు?! అందుకే అతను "ఉగ్రకోపి నేను ఓపుదు శపియింప/ క్రమ్మరింప శక్తికలదు నాకు / వట్టి మ్రాను చిగురు పుట్టింప, గిట్టింప /బిరుదు వేముల వాడ భీమకవిని" అని చెప్పుకున్నాడు! అంతటితో ఆగక ఎవడో తనను "విధవ కొడుకువి" అని ఆరోపించి, ఇంట్లోకి అడుగుపెట్టనివ్వలేదని, విందుకురానివ్వలేదనీ ఆగ్రహించిన భీమకవి ఆ ఇంటితలుపు సందులగుండా విస్తళ్ళలోని పదార్థాలు చూచి కడుపుమండి-అవన్నీ కప్పలుగా, సున్నంగా, రాళ్ళుగా మారిపోయేట్టు శపించాడట! నిరసన అంటే అది, పట్టుదల అంటే అదీ! ఈ 'ప్రతిభా పాటవం' ఎక్కువగా ఉన్నవాళ్ళు సంఘ దురాచారాలపట్ల, అత్యాచారాలపట్ల, అన్యాయాలపట్ల మరింతగా తిరగబడడం కూడా సహజం మన స్వాతంత్ర్య సమరంలో నిర్మాణ కార్యక్రమంలో భాగంగా ప్రారంభమైన గాంధీ "రాట్న" ప్రచారానికి అండదండలుగా కొత్తతరహా నిరసనోద్యమం తలెత్తింది. అప్పుడు జాతీయ కవులు "ఏకులు కావలెనా-దాస్యపు మోకులు కావలెనా" అని చెవులు మెలితిప్పి ధర్మాచరణవైపు ప్రజల దృష్టిని మళ్ళించారు! అలాంటి పనిని మిలిటెంట్ కవులు, పాశ్చాత్య దేశాల్లోనూ, నేటి భారతంలోనూ చేస్తూనే ఉన్నారు ఇందుకు బీటిల్స్,

యాంగ్రేయంగ్‌మెన్ నడిపిన కవితా ఉద్యమాలు నిదర్శనం "బీటిల్స్" తరానికి ఉద్దండుడుగా పేర్కొనదగిన గిన్స్‌బర్గ్ రాసిన "హౌల్" కవితలు అశ్లీల రచనగా, అవాచ్య ప్రక్రియగా పేర్కొని, కోర్టుకు ఈడ్చితే - "మానవుని అనుభవాలపైన గమనించదగిన భాష్యం"గా సాహితీవేత్తలు అభిప్రాయపడ్డారు అందులో అశ్లీలమేదీలేదని జడ్జికేటన్ హారన్ ప్రకటించాడు! " ఏ ఇద్దరు మనుషులూ ఒకలా ఆలోచించరు అందరం ఒకే మూసలోంచి వచ్చిన వాళ్ళమేగాని, ఆలోచనలు వేరు, దారులు వేరు" అని సరిపెట్టుకున్నాడు! ఎందుకని? గిన్స్‌బర్గ్ మాటల్లో చెప్పాలంటే - *"I Saw the best minds on my generation destroyed by madness/Starving hysterical nacked /filth! Ugliness /Children screaming under the stairways! Boys sobbing in armies! Old men weeping in Parks!"*

అలాగే చార్లెస్ రెనికోఫ్ అనే అమెరికన్ కవి తన ప్రజలకు శత్రువులుగా తయారైన వాళ్ళపై ముళ్ళగుత్తులు విసురుతా, కళ్ళల్లోకి మిణుగురు పురుగుల్ని వదులుతా అని చెబుతూ *"I will write songs against you"* అని వాపోతూ తన నిరసనను వ్యక్తం చేశాడు వెనక ఇంగ్లండ్‌లో చార్టిస్టు ఉద్యమం సందర్భంగా - తమ నిరుద్యోగానికి యంత్రాలు కారణమని భావించి యంత్ర విధ్వంసానికి కార్మికులు దిగినప్పుడు కూడా ఇలాంటి నిరసన భావాలే వ్యక్తమయ్యాయి ఈ నిరసన సర్వ రంగాలకు వ్యాపించి చివరికి న్యాయస్థానాలపట్ల, న్యాయవాదులపట్ల నిరసనకు కూడా దారితీసింది అందులో మచ్చుకొక శకలం *"Harrah for the masses / The lawyers are asses /There are no Upper Classes/The Judges are goint to Jail"* ఈ సర్వనిరసన లోకయాత్రకు ఎదురీదగలవాడు ఇంకా పుట్టినట్టు కనిపించదు! ఒకవేళ పుట్టి ఉంటే, వాడు బాలభట్టు అయినా బడబాగ్ని భట్టు అయినా ఇంకా ఓనమాల దశలోనే ఉండి ఉండాలి!!

సెప్టెంబర్ 20, 1990

# "అప్పుడు పుట్టి ఉంటే...."

"అప్పుడు పుట్టి ఉంటే" అందరూ అలాగే కృష్ణశాస్త్రిలా తామూ అనుకునే వాళ్ళు। అది రాయలయుగంలోకి మెడలు చాచి "భువన విజయ" సరదాలు తీర్చుకుంటున్న అష్టదిగ్గజాల సరస కవితలను ఆస్వాదిస్తున్న కృష్ణశాస్త్రి ఆలోచన। అదొక తరహా సమాలోచన। అందుకే చలం అన్నాడు కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ, ప్రపంచం బాధంతా శ్రీశ్రీ బాధ। అలాగే దేశ చరిత్రను మలుపు తిప్పుతున్న ప్రభాత ఘడియలలో ప్రజల కష్టసుఖాలను, వారి త్యాగాలను కొనియాడుతూ భావితరాలను ఉత్తేజపరిచే రచనలు కూడా ఆవిష్కరించుకుంటూ ఉంటాయి కొన్ని సందర్భాలలో ఉద్యమ దశలోనే కవితలు, కథలు, చిత్ర రచన సాగుతూంటాయి మరికొన్ని సందర్భాలలో ఉద్యమాలు, విప్లవాలు సమసిపోయిన తరువాత తీరుబడిగా రానున్న తరానికి ఉద్దీపనగానో ఉద్దేశ పూర్వకమైన హెచ్చరికగానో సాహిత్య సృష్టి జరుగుతూ ఉంటుంది రెండు వందల ఏళ్ళనాడు జూలై14 ఫ్రెంచి విప్లవ దశను సమీక్షిస్తూ "మానవహక్కుల" మహోన్నత గ్రంధకర్త థామస్ పేనీ ఒకమాటన్నాడు "ఈ వర్తమాన యుగం హేతువాద యుగంగా, ఈ వర్తమాన తరం నవ్య ప్రపంచపు ఆదాము తరం'గా *(Adam of New World)* భావితరాలకు అనిపించవచ్చునన్నాడు ఫ్రెంచి విప్లవ దినోత్సవానికి ముందు కొలది రోజుల క్రితం వార్షికోత్సవం జరుపుతున్న "తెలంగాణా సాయుధ పోరాటం" రోజుల్లో కూడా ఆరుద్ర "త్వమేవాహం", సోమసుందర్ "వజ్రాయుధం" లాంటి ఉద్యమ కవితలు, విప్లవ కవితలు వచ్చాయి పోరాటం ముగింపుదశలో కొసమెరుపులుగా [illegible]నేని "ఎర్రజెండాలు", లక్ష్మీకాంత మోహన్ "సింహగర్జన", బొల్లిముంత "మృత్యుంజయులు" వెలిశాయి అలాంటి ప్రభాత సమయాలలో పాలుపంచుకోని వారందరూ, ఉద్యమ కవితలను, సాహిత్యాన్ని ఇప్పుడు మాత్రమే చదువుకొని స్ఫూర్తిపొందే వారందరూ ఎవరికివారు తామూ "అప్పుడు పుట్టి ఉంటే" అని తలపోసుకోకుండా ఉండలేరు ఉద్యమ కాలం కవితలల్లడానికి తగిన సమయం కాకపోవచ్చు కాని, కాయకష్టం చేసే వారిలో విరామ చిహ్నంగా కూని రాగాలు, ఊల పాటలు, ఏలపాటలూ పుట్టు కొచ్చినట్టే విప్లవ దశల్లో కూడా ప్రాప్తకాలికమైన భావోద్రేకాలు అలవోకగా కవితా రూపంలో జాలువారుతూంటాయి ఇంగ్లాండ్‌లో చార్టిస్టు ఉద్యమ కాలంలో ప్రజలను దీవిస్తూ, కొందరు న్యాయవాదులను దుయ్యబడుతూ "హంగ్రా టు మాసెస్ లాయర్స్ ఆర్ యాసెస్" అంటూ చార్టిస్టులు వీధులలో ఊరేగారట అలాగే ఫ్రెంచి విప్లవం మధ్య తరగతి నాయకత్వ విద్రోహంవల్ల వీగిపోయి, నిరంకుశ నెపోలియన్ చక్రవర్తిత్వంలో ప్రజలు మళ్ళీ బాధలు అనుభవించేదాకా ఫ్రెంచి సాహిత్యంపై విప్లవ ప్రభావం అంతగా పడలేదు ఈ పరిణామాన్ని ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వకారుల్లో ఒకరైన డిడెరో ముందే ఊహించాడు అయితే కవి స్టైంతాల్ ఉద్యమ కవితలో వచ్చిన ఈ మందకొడితనానికి లేదా ఈ "హేమంతా"నికి కారణం చెప్పాడు 1792-1800 సంవత్సరాల మధ్యలో ఫ్రెంచి ప్రజలు తమ భూభాగాల రక్షణ సమస్యలతో తలమున్కలై ఉన్నారు, ఇక 1800 నుంచి 1814 వరకూ ఫ్రెంచి విప్లవ ప్రచండ ప్రభావం సాహిత్యానికి పరివ్యాప్తం కాకుండా "సెన్సార్ షిప్" విధించి నెపోలియన్ ప్రభుత్వం జాగ్రత్త పడింది (ఇక్కడ "ఝుంఝు", 'మార్చ్' కవితా సంకలనాలను అసమర్థులైన అభినవ "నెపోలియన్" లు నిషేధించినట్టుగా, బ్రిటిష్‌వాడు ఉన్నవవారి "మాలపల్లి" పై కన్నెర్ర చేసినట్టుగా)।

అయినా అరచేతిని అడ్డుపెట్టి, సూర్యకాంతిని ఎవరూ ఆపలేరు నిర్బంధాల మబ్బు తెరలను చీల్చుకొని కవితా ప్రభాకరులు ఉదయించారు అలాంటి వారిలో ఒకడు యువకిశోరం ఆంద్రేషెనార్ అతను రాసిన విప్లవ కవితలు 1819 వరకూ అజ్ఞాత చిత్రాలుగానే ఉండిపోయాయి అతణ్ణి మాత్రం రాయలిస్టులు వధ్యశిల పైకి ఎక్కించారు! అతని కవితలు దొరకక, అతని మూర్తిని మరువలేక రిపబ్లికన్ కళాకారులు షెనార్‌ను భావ చిత్రాలతో అజరామరం చేశారు! దేశభక్తి, గీతాలు, "మార్సెలీ" కదన గీతం (మార్చింగ్ సాంగ్), విప్లవకారుడు మరాత్ చండ ప్రచండ ప్రసంగ పారాలు, పత్రికా రచనలూ సెయింట్ జస్ట్ వ్యంగ్య ప్రసంగాలూ - ఆనాటి ఉద్యమానికి ఉప్పనందించాయి తర్వాత పదేళ్ళలో వెయ్యి నాటకాలు ఈ విప్లవానికి అంకితమయ్యాయి! విప్లవకాల్పనికతనూ, రైతాంగ వాస్తవ జీవన పరిస్థితులను కలగలిపి స్టెంతాల్ ఎన్నో రచనలు చేశాడు విద్రోహ చర్యలవల్ల విప్లవం కుంటుపడినందువల్ల తారుమారైన సామాజిక పరిస్థితులను కూడా అతడు చిత్రించాడంటారు ఫ్రెంచి విప్లవాన్ని పరిమిత పరిధులలోనే కీర్తించిన కార్లయిల్ ఆ విప్లవాన్ని "గుంపు రాచరికం" *("King Mob")* అన్నాడు కాని లాకార్మనోల్ మాటల్లో ఫ్రెంచి విప్లవం "ఇంచుమించులు సరిచేయడానికి" ఉద్యమించిన ఉత్పాతం! న్యాయం ముందు అందరూ సమానులన్న సూత్రాన్ని ప్రతిష్ఠిస్తూ చెప్పారు, ఆ ముహూర్తం రానే వచ్చిందన్నారు

*"Giants must be cut down to size*
*And little people must be made taller"*

అంతేకాదు, కటికి దారిద్ర్యంలో మగ్గుతున్న ప్రజాబాహుళ్యాన్ని, రొట్టె ముక్క కోసం రోడ్డులెక్కిన ప్రజలనూ అవహేళన చేసిన పదహారవ లూయీ చక్రవర్తి భార్య ఆంటోనిటీని పారిస్ మహిళలు ఈసడించుకుంటూ కదంతొక్కుతూ కవిలతలల్లారు! వర్సేల్స్‌లో తలదాచుకున్న చక్రవర్తి వద్దకు రొట్టె కోసం పారిస్ మహిళలు పెద్ద ఊరేగింపు తీశారు 1871 నాటి పారిస్ కమ్యూన్ తిరుగుబాటులో కూడా మహిళలు ఘనంగా పాల్గొన్నారు బాధలు అనుభవించారు ఆనాడూ రొట్టె కోసం వడిగాపులు పడ్డారు. ఆహారం కోసం, ఇతర కనీసావసరాల కోసం సాగుతున్న ఈ జీవన సమరాన్ని ఆ మహిళలు "జన కవిత"లో వినిపించారు

"షాపు లేదు, స్టోరు లేదు
ఎటు చూసిన ఎటు పోయిన
ఏదీ కనిపించేదే లేదు!
గడపలు తొక్కండి
తలుపులు తట్టండి
అయినా ఫలితం శూన్యం
కట్టెపుల్లకు కూడా దైన్యం!"

*("Not a single shop or store Has got anything on show ")*

ఈ ఫ్రెంచి విప్లవం పందొమ్మిదో శతాబ్దపు సాహిత్యాన్ని బాగా ప్రభావితం చేసింది ఆంగ్లో - ఫ్రెంచి యుద్ధం ప్రారంభమయ్యే వరకూ ఫ్రెంచి విప్లవంతో ప్రభావితుడైన వర్డ్స్ వర్త్ కవి ఆ తర్వాత సంకుచిత జాతీయ వాదానికి లోనయి ఆశ నిరాశల మధ్య ఊగిసలాడాడు

విప్లవోదయ సంధ్యకు మనిషి కర్మసాక్షిగా ఉండడమే ఒక మహానుభూతిగా, సహానుభూతిగా, ఆ శుభ ముహూర్తాన తాను యౌవన దశలో ఉండడం మరింత స్వర్గానుభూతిగా భావించిన కవి - "మళ్ళీ ఎప్పటికో మానవాళికి మంచి రోజులొచ్చేది", అని కూడా దిగాలుపడ్డాడు *("Whence better days to all Mankind")!* ఆశల ఆదర్శాల కల్పనా జగత్తులో ఓలలాడుతున్న ఫ్రాన్స్‌ను *("a country in romance")* ఏ సంప్రదాయాలూ, చట్టాలూ బంధించలేవని భావించాడు "మన్ను తిన్న పింజేరుల"ను వెన్ను తట్టి నిద్ర లేపిన విప్లవంగా *("the inert were roused")* కీర్తించిన కవి "ప్రపంచానికి విషమెక్కింది", ఇక చెడిపోయిందని నిరాశలోపడ్డాడు *("The world is poisoned at the heart")* వర్డ్స్ వర్త్‌లానే పెక్కుమంది విప్లవ వైఫల్యం తర్వాత నిరాశ, నిస్పృహలలోకి జారుకున్నారు కాని తమ ఆఖరి శ్వాసవరకూ ఫ్రెంచి విప్లవ ఆదర్శాలలో విశ్వాసం కోల్పోని ప్రపంచ మహాకవులు ఇద్దరే ఇద్దరు విలియమ్ బ్లేక్, పెర్సీ షెల్లీ ఒకవైపున తామస్ పేనీ జూలై 14 విప్లవం "యావత్తు యూరప్‌నే జయించిన" ఘటనగా కీర్తిస్తే, షెల్లీ "మనం నివసిస్తున్న శకానికే అదొక మహత్తరమైన కథా చిత్రం, వ్యథా చిత్రం" అన్నాడు ఆ ఊపుతోనే ఆయన, హేతు వాదానికి పునాదులు వేసిన ఆ విప్లవం ఆదర్శంగా మానవాళికి "నాస్తిక వాద ఆవసరం" *("The necessity of Atheism")* గురించి ఓ విశిష్ట కర పత్రం రాశాడు మరొకవైపునుంచి స్త్రీ స్వేచ్ఛ గురించి అదే కాలంలో మేరీ వూల్ స్టోన్ క్రాఫ్ట్ సరికొత్త ప్రణాళిక ప్రకటించింది విలియమ్ బ్లేక్ ఫ్రెంచి విప్లవాన్ని కీర్తిస్తూ అసంపూర్ణ కవిత రాశాడు

*"O! Heavens of France the Voice of the people arising, from valley and hill hear the voice of valleys, the voice of the Meek "*

బీదలపాట్లు చూచి బాధను వ్యక్తం చేసిన బోద్‌లీర్ పలాయనవాదాన్ని ఆశ్రయించగా, మరొక వైపున "జర్మినల్"లో విప్లవ ప్రజాబాహుళ్యానికి ఎమిలీ జోలా హారతులు పట్టాడు!

కనుకనే బ్లేక్ "కవిత్వానికి సంకెళ్ళు మానవజాతికే సంకెళ్ళు"గానూ కవిత్వం, చిత్రలేఖనం, సంగీత శక్తుల జయాపజయాలే జాతుల ప్రాభవ పతనాలకు సంకేతాలుగాను చెప్పిపోయాడు

జూలై 16, 1989

# నెల్సన్ రోలిహాలా గుండె గుండెలో 'మండేలా'...!

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సులువైన రహదారులుండవని పండిట్ నెహ్రూ చెప్పాడు! ఈ మాట ఎంత సత్యమో, సుమారు 20 ఏళ్ళ వ్యవధిలో పుట్టి పెరుగుతూ వచ్చిన భారత జాతీయ కాంగ్రెస్, దక్షిణ ఆఫ్రికా నేషనల్ కాంగ్రెస్ బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, తెల్లవాళ్ళ జాత్యహంకారానికి, దుర్మార్గ పరిపాలనకు వ్యతిరేకంగా సాగిస్తూ వచ్చిన స్వాతంత్ర్య సమరాలు నిరూపించాయి రేపోమాపో జరుగనున్న నెల్సన్ రోలిహాలా మండేలా విడుదల ఒక వ్యక్తి కృషి ఫలితం కాదు, ఒక వ్యక్తి ప్రయోజనం కోసం కాదు, నవ ఆఫ్రికా నిర్మాణం కోసం. 80 ఏళ్ళుగా దక్షిణాఫ్రికా నల్లజాతి ప్రజలు, తదితర రంగు జాతుల ప్రజలు మైనారిటీ తెల్లజాతి ప్రభుత్వంపైన, దాని వర్గ, వర్ణ వివక్షా విధానాలపైన సాగిస్తున్న సమష్టి పోరాటానికి, సాయుధ పోరాటానికి అంతిమ విజయం మండేలా విడుదల, అది యావత్తు ఆఫ్రికా ప్రజలకు సంతోష సంబరం! నాడు దక్షిణాఫ్రికా ఇండియన్ల తరపున రాజకీయ పోరాటం సాగించిన (స్మట్స్ చట్టాలకు వ్యతిరేకంగా) గాంధీజీకి కేంద్రమైన డర్బన్ సాత్విక, అహింసాయుత ప్రతిఘట నోద్యమాన్ని, సత్యాగ్రహాన్ని ప్రసాదించగా, మండేలా సారధ్యంలో కేప్‌టౌన్, క్లిప్‌టౌన్ నగరాలు దక్షిణాఫ్రికా నల్లజాతి ప్రజల స్వాతంత్ర్య సమరానికి సాయుధ పోరాట కేంద్రాలుగా మారాయి. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ సుమారు అర్ధశతాబ్దం వరకు (1961 వరకు) జాత్యహంకార ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాత్వికంగానే పోరాడుతూ వచ్చింది. అహింసనే పరమధర్మంగా నమ్ముతూ వచ్చింది అయినా స్మట్స్, వెరవోర్డ్, బోతాల వంటి జాత్యహంకార పాలకులు నమ్ముకున్నది మాత్రం తుపాకీ గొట్టాన్ని, సైనిక శక్తిని మాత్రమే! కనుకనే అంతవరకు పిటిషన్లతో,సమ్మెలతో, సాధారణ ఉద్యమాలతో, రాయబారాలతో, చర్చలతో అహింసాయుతంగా సాగుతున్న ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఉద్యమం సాయుధ పోరాటాన్నే ఏకైక సాధనంగా చేసుకుంది " ఈ ఉద్యమానికి నాయకత్వం వహించదలచిన నేషనల్ కాంగ్రెస్ ప్రత్యేక సదస్సు ద్వారా ముప్పయిదేళ్ళనాడే సమరశీల స్వేచ్ఛా పత్రాన్ని *(Freedom Charter)* రూపొందించింది. ఈ రూపకల్పనలో ప్రధాన శిల్పుల లుతూలీ, సిసులూ, నెల్సన్ మండేలా, ఆలివర్ టాంబో ఉన్నారు. దక్షిణ ఆఫ్రికా సమస్యను అర్థం చేసుకోవాలంటే 'మాలపల్లి చట్టాలు' అర్థం అయి ఉండాలి అంటే 'వెలివేత' చట్టాలు తెలిసి ఉండాలి. దక్షిణాఫ్రికా సమస్య మన దేశంలో కుల, వర్గ వ్యవస్థలాంటిదే! పాస్‌లాస్, రేస్‌లాస్ లేకుండా తెల్లజాతి మైనారిటీ ప్రభుత్వం పరిపాలించే స్థితి లేకుండా పోయింది మనుషులను చీల్చినట్లే భూములనూ చీల్చారు, జాతులను చీల్చినట్లే నీతులనూ చీల్చారు తెల్లవాడికొక నీతి, మెజారిటీ నల్లజాతి ప్రజలకొక రీతీ నల్లవాళ్ళను విద్యకు దూరం చేశారు ఉద్యోగానికి దూరం చేశారు. ఈ దారుణ నిరంకుశ విధానాల ఫలితమే, వర్ణ వివక్ష ఫలితమే నెల్సన్ మండేలా లాంటి నాయకుల ఆధ్వర్యాన సాగుతున్న నేషనల్ కాంగ్రెస్ సాయుధ పోరాటం ఈ పోరాటం తెల్లవాడు స్వార్థం కోసం బలవంతాన రుద్దినదే కాని, నల్లవాడు కావాలని నెత్తిపైకి తెచ్చుకున్నది కాదు. అందుకే ఒకప్పుడు మండేలా అన్నాడు "బుద్ధి ఉన్నవాడు ఎవడూ కావాలని జైలుకి వెళ్ళడు. నా జీవితంలో సంభవించినట్లే ప్రతివారికి ఒక్కో సమయం వస్తుంది - సాధారణ జీవితాన్ని సాగనివ్వకుండా, ఆ హక్కును అనుభవించనివ్వకుండా ప్రభుత్వం మనిషిని ఎప్పుడు దూరం చేస్తుందో, అప్పుడు ఆ మనిషి బహిష్కృతుడుగా, 'నేరస్తుడు'గా పైకి జీవించాల్సి వస్తుంది.

అటువంటి చట్టాలను చేయడం ద్వారానే ప్రభుత్వం పౌరులను హింసామార్గానికి నెడుతుంది"
ఈ జీవన సత్యం తెలిసిన మండేలా మనందిరి గుండెలు కూడా మండేలా ఒక ప్రకటన చేశాడు! ఆ ప్రకటన *'Freedom Charter'* వెలువడినప్పుడే చేశాడు ప్రజల మధ్య ఉన్నప్పుడూ, అజ్ఞాతవాసంలో ఉన్నప్పుడూ కూడా ఆ ప్రకటనకే కట్టుబడి ఉన్నాడు "మీతో భుజం భుజం కలిపి ఈ ప్రభుత్వంతో పోరాడుతాను, అంతిమ విజయం సాధించేవరకూ పోరాడుతాను మీరూ తేల్చుకోండి ఏమి చేయబోతున్నారో ఈ పోరాటంలో మీరు కూడా నాతో కలిసి వస్తారా, లేక మన ప్రజలందరి ఆశయాలను, ఆదర్శాలను కాలరాచేందుకు కాచుకుకూర్చున్న ఈ ప్రభుత్వ దమనకాండతో సహకరించదల్చారా? నా ప్రజల, మన ప్రజల జీవన్మరణ పోరాటంలో ఏమీ పట్టనట్టుగా ఎవరికి వారు తటస్థంగా ఉండిపోదల్చారా? నా మట్టుకి నేను తిరుగులేని నిర్ణయం చేసుకున్నాను - నేను దక్షిణాఫ్రికాను విడిచిపోయేదీ లేదు, ప్రభుత్వానికి లొంగిపోయేది లేదు నా జీవితమంతా పోరాడాను, ఇంకా పోరాడుతున్నాను, నా ఆఖరి శ్వాసవరకూ పోరాడుతూనే ఉంటాను దక్షిణాఫ్రికా చరిత్రలో ఒక నూతనశకం ప్రారంభం కాబోతుంది"

ఆ 'నూతన శకం' ప్రారంభం కావడమే కాదు ప్రజల త్యాగాల మధ్య లక్షలాది వీరుల రక్తతర్పణ మధ్యనే సజల నేత్రాలతో ఆ సమరానికి ఒక అందమైన ముగింపు కూడా రాబోతూంది! తన జీవితంలో సుమారు సగభాగం ఏకబిగువున జైలు జీవితం గడిపిన నెల్సన్ మండేలాకు ప్రపంచ రాజకీయ నాయకులలో ఉజ్జీగా చెప్పుకోదగినవాడు, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో బహుశా ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ ఒక్కడే ఆయన అయినా మొత్తం మీద 26 సంవత్సరాల జైలు జీవితం గడిపినవాడే కాని వరుసగా 26సం॥లు జైలులో గడిపినవాడు మాత్రం కాదు దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య పోరాటంలో మండేలా జీవితాన్ని దిద్దితీర్చడంలో ఆయనను ప్రభావితం చేస్తూ వచ్చినవి జాత్యంహంకార నిర్బంధ చట్టాలూ, దమనకాండ మాత్రమే కావు, గాంధీజీ సత్యాగ్రహోద్యమాలు, నెహ్రూ 'యూనిటీ ఆఫ్ ఇండియా' జాత్యహంకార ప్రభుత్వనేత 'స్మట్స్' మురికివాడల బిల్లుకి వ్యతిరేకంగా సాత్విక ప్రతిఘటో ద్యమానికి నాయకత్వం వహించిన తమ సహచరులు ఇస్మాయిల్ మోర్, జె ఎన్ సింగ్, నేటాల్ గాంధేయవాది మోతీ నాయకర్, ట్రాన్స్‌వాల్ కమ్యూనిస్టు నాయకుడు యూసుఫ్ దాదూల ప్రభావం కూడా ఉంది తన ఉద్యమాన్ని నడిపించడంలో మండేలా అన్ని ప్రపంచ ఉద్యమాల ప్రభావానికి లోనయ్యాడు దక్షిణాఫ్రికాలోని నిషిద్ధ రాజకీయ పక్షాలలో ఒకటైన దక్షిణాఫ్రికా లిబరల్ పార్టీ నాయకుడు ఎడ్డీ డేనియల్స్ కోర్టులో ఒక వాఙ్మూలము సందర్భంగా మండేలాను ఇలా వర్ణించాడు "అతను రాజుల్నీ ఒప్పించగలడు, పేదల్నీ ఒప్పించగలడు ..." *("He can walk with kings and he can walk with beggars")!* ఉద్యమానికి కత్తులు నూరుకోడంలో మండేలా - లిడిల్ హార్ట్, క్లాజ్‌విజ్, మావో సేటుంగ్, షేగువేరాల యుద్ధ వ్యూహరచనలను, ఎత్తుగడలనూ ఆపోశనం పట్టాడు అందుకే మండేలా ఏనాడూ తన జీవితమే ఒక పోరాటంగా భావించకుండా "పోరాటమే తన జీవితం" అని ప్రకటించాడు (ఆయన రాసిన పుస్తకం పేరు కూడా *"The Struggle is my life"* వెనుక 'విద్రోహ' నేరం పేరిట డ్రిఫస్‌ను 'డెవిల్స్ దీవి'లో పెట్టారట. అలాగే మండేలాను ప్రజల నుంచి దూరం చేయడానికి ఒకచోట కాదు పలుచోట్లకు, కాకులు దూరని కారడవులకు మార్చారు! భారత జాతీయ ఉద్యమంలో నైనిటాల్, ఆగాఖాన్ ప్యాలస్, కడలూర్, అహమ్మద్‌నగర్‌ఫోర్ట్ ఎలా మన జాతీయ నాయకులకు ప్రసిద్ధ ఖైదులుగా, రాజకీయ పాఠశాలలుగా మారాయో, అలాగే దక్షిణాఫ్రికాలో ప్రిటోరియా, రాబెన్ ఐలాండ్, పోల్స్‌మూర్

జైళ్ళు మండేలాకు రాజకీయ పోరాట కేంద్రాలుగా మారాయి ఐనా జాత్యహంకార ప్రభుత్వాలు ఇన్నేళ్ళుగా దేశవ్యాప్తంగా సాగుతున్న ప్రజాపోరాటాలను అణచలేకపోయాయి ఫలితం షార్ప్‌విల్లీ, సొవెటో, బ్రాడ్‌ఫోర్డ్, కేప్‌టౌన్, నేటాల్, ట్రాన్స్కీ, కేప్ కేంద్రాలలో ప్రజలు లక్షలాదిగా తిరగబడ్డారు రాష్ట్రాల్లో రక్తతర్పణ జరిగింది, మైనారిటీ శ్వేతపత్రానికి 'రక్తస్రావం' జరిగింది! దేశాల సమస్యలకు సరిహద్దులుండవు ఇక్కడ గిరిజనుల భూములను గిరజనేతరులు ఆక్రమించుకున్నట్టే అక్కడ దక్షిణాఫ్రికాలో నల్లజాతివారి భూములను తెల్లజాతివాళ్ళు ఆక్రమించుకొని కులుకుతున్నారు! ఈ కులుకు రంగుజాతివారి గుండెలలో ములుకుగా మారి మంటలుగా చెలరేగి మండేలాలుగా మారి, సాయుధ పోరాటం కంటికి కన్ను పంటికి పన్నుగా మారింది! దేశాన్ని ఆక్రమించి మైనారిటీలో కూర్చున్న తెల్లవాడు 'బుద్ధిమంతుడ' య్యాడు తమ సర్వస్వాన్నీ కోల్పోతున్న నల్లజాతివారూ, పోరాటంలో ఉన్న ఇతర రంగు జాతుల వారూ 'కుట్రదారు'లయ్యారు!

మన జాతీయోద్యమ కాలంలో బ్రిటిషు సామ్రాజ్యవాదులపై ధ్వజమెత్తిన విప్లవకారులపై కాన్పూర్, కాకోరి, చిటగాంగ్ కుట్ర కేసులు పెట్టినట్లే, ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన భూములను రక్షించుకోడానికి, వారికి దక్కించడానికి విప్లవించిన కార్యకర్తలను కుట్రదారులుగా మార్చి, పార్వతీపురం, రామ్‌నగర్ కుట్ర కేసులు పెట్టినట్లే జోహన్స్‌బర్గ్, సొవెటో, షార్ప్‌వెల్లీ కుట్ర కేసుల పేరిట ఒక అర్థశతాబ్దంగా వేలాది మంది ఆఫ్రికా నేలతల్లి బిడ్డలను తెల్లవాడి ప్రభుత్వం జైళ్ళలో కుక్కింది, అనేక మందిని ఉరితీసింది. మండేలా, సిసూలూ ప్రభృతులను ప్రజల నుంచి దూరం చేసి నిర్బంధించింది ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లోనే చీలికలు తేవడానికి ప్రయత్నించింది విద్రోహ కేసులు మోపి విచారణలు జరిపింది 'ట్రయల్ ఆఫ్ డిఫైన్స్' పేరిట తప్పుడు కేసులు బనాయించింది పీటర్ మోరెజ్‌బర్గ్, జూలూలాండ్, పోండోలాండ్ మొదలైన ప్రాంతాల నుంచి వేలాది మందిని ఈ కేసులలో ఇరికించింది కమ్యూనిస్టుల అణచివేత పేరిట, టెరరిస్టుల అణచివేత పేరిట మన నేషనల్ సెక్యూరిటీ చట్టం లాంటి అంతరంగిక భద్రతా చట్టాలను కుప్పలుగా చేసింది! వీటన్నింటిని ప్రతిఘటిస్తూ ఉద్యమాన్ని చంద్రవంక దశనుంచి సంపూర్ణ చంద్రుని దశ వరకూ, ప్రచండ తేజస్సుతో ప్రకాశించే అరుణోదయం వరకు పెంచుతూ, తాము పెరుగుతూ వచ్చినవాళ్ళు - మండేలా, సిసులూ, డుమానోక్వీ, మైకేల్ స్కార్ట్, బ్రాస్‌ఫిషర్, మెపెట్లా మోఫీ, లిలియన్ నోయీ, అహమ్మద్ తిమోర్ (యువ భారతీయుడు)!

ఈ మండేలా ప్రభృతులందరూ తెల్లజాతి ప్రజలకు వ్యతిరేకంగా ఉద్యమించిన స్వార్థపరులు మాత్రం కారు తెల్లవారితో సహా ఆఫ్రికన్ల అందరి సమష్టి సంక్షేమాన్ని కోరుకున్న వీరులు, మహానాయకులు ఈ రోజుకీ ఈ విషయమై ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లో మిలిటెంట్లకూ, సామరస్య వాదులకూ మధ్య సాగుతున్న కీచులాటలు కూడా సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటనకు మెజారిటీ ప్రభుత్వ స్థాపనకు ప్రతిబంధకంగానే ఉన్నాయి దీనికి తోడు దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య సమరానికి, అదే తెల్లజాతి ప్రభుత్వ నిర్బంధకాండకు గురిఅవుతూ వచ్చిన నైరుతి ఆఫ్రికా (నమీబియా) ప్రజలకూ మధ్య ఏర్పడిన అనుబంధం కూడా తెల్లవాడికి కంటకంగానే మారింది. ఇరుగుపొరుగు మొజాంబిక్, అంగోలా, జాంబియా లాంటి అగ్రగామి సహాయక దేశాలకు, నేషనల్ కాంగ్రెస్‌కు మధ్య ఏర్పడిన సంబంధాలు కూడా తెల్లవాడి మెడకు ఉచ్చుగా మారాయి అయినా నేషనల్ కాంగ్రెస్‌లో చీలుబాటలను తెల్లవాడు

అవకాశంగా తీసుకొని దశాబ్దాలుగా నాటకమాడుతూ ఎప్పటికప్పుడు మండేలాను విడుదల చేస్తున్నట్లు ప్రకటనలు చేయడమేగాని విడుదల చేయడంలేదు! జాత్యహంకారి బోతా పోయి డీక్లెర్క్ అధికారంలోకి వచ్చినా ఇదే పరిస్థితి కొనసాగుతోంది ఎమర్జన్సీ ఎత్తివేయలేదు కాని నేషనల్ కాంగ్రెస్‌పైన నిషేధాన్ని తొలగించాడు దానితోపాటు పాన్ ఆఫ్రికన్ కాంగ్రెస్, దక్షిణాఫ్రికా కమ్యూనిస్టు పార్టీలపై కూడా నిషేధం తొలగించాడు అయితే ఎమర్జన్సీని మాత్రం అలాగే ఉంచాడు. విచారణ లేకుండా డిటైన్ చేసే అధికారాన్నీ అలాగే ఉంచాడు! అందుకే ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ తన సాయుధ పోరాటాన్ని నిలిపివేయడానికి నిరాకరిస్తోంది ప్రవాసంలో ఉన్న నేషనల్ కాంగ్రెస్ మిలిటెంట్లు బయటకు వస్తే మళ్ళీ నిర్బంధకాండ పురివిప్పుకోదన్న గ్యారంటీ లేదు! చర్చల పేరిట ఇన్నాళ్ళూ సాగుతున్న తతంగం కూడా ఇదే అందుకనే యావజ్జీవ ఖైదీగా ఉన్న మండేలా కూడా తెల్లవాడి మనస్సేదో స్పష్టం కానంతవరకు తాను విడుదలయ్యే ప్రసక్తి లేదంటున్నాడు వ్యక్తిపూజను మానుకోవచ్చుగాని వీర పూజను ప్రపంచం మానుకోలేదు

1962 నుంచి కటకటాల మధ్యనే మగ్గుతున్న మండేలాకు రోమ్, గ్లాస్కో, ఒలంపియా, అబర్డీన్, గ్రెనోబ్లే తదితర ప్రపంచ నగరాలన్నిటా గౌరవ పురస్కారాలు లభిస్తున్నాయి సోషలిస్టు దేశాలు, ఇండియా ఆశీర్వదించి, అహ్వానించాయి ఫ్రీడమ్ చార్టర్‌తోపాటు, 'ఉమన్స్ చార్టర్' కు కూడా రూపకల్పన చేసి మహోద్యమాలు నిర్మించిన సిసూలు భార్య ఆల్బర్టనీ, మండేలా సతీమణి విన్నీని 'దక్షిణాఫ్రికా మాతృ మూర్తులు'గా ప్రజలు ప్రకటించుకున్నారు ప్రతి తప్పుడు కేసు, ప్రతి కోర్టు విచారణ మండేలాకు ఒక ఆటవస్తువుగా, క్రీడారంగంగా మారాయి బాధల మధ్యలో చతురతను కూడా ప్రదర్శించాడు ఒక కోర్టు విచారణలో అతను ప్రాసిక్యూషన్ వారితో సంభాషిస్తూ "ఈ రోజు మాకు చాక్‌లెట్ ఇవ్వబోతున్నారా, వెనీలా ఇవ్వబోతున్నారా?" అని సరదా చేశాడు! అంతేకాదు, స్వాతంత్ర్య సమరవీరుల విడుదల బేషరతుగా జరగాలే గాని షరతులు కూడవని భావించినవాడు మండేలా అందుకే అతను "స్వేచ్ఛ పొందిన వీరులు మాత్రమే సంప్రతింపులలో పాల్గొనగలుగుతారు. ఖైదీలెప్పుడూ శత్రువులతో కాంట్రాక్టులకు దిగరు! నా స్వేచ్ఛ, ప్రజల స్వేచ్ఛ విభజించరానిదీ, విడదీయరానిదీ. ఆ అనుబంధం **అంక్షలకు అతీతం**" *("Only free men can negotiate, prisoners cannot enter into contracts")* అని ఏనాడో దండోరా వేశాడు! ఏక నాయకత్వం ఏ పార్టీలో అయినా నిరంకుశత్వానికీ దారితీస్తే బహునాయకత్వం అరాచకత్వానికి మార్గాలు వేస్తుంది. 70 ఏళ్ళ దక్షిణాఫ్రికా ప్రజల పోరాటం, ఆ ప్రజల వాణి, ఆ వీరుల, వీరనారీమణుల త్యాగాలు, ఆ సమరశీల శక్తి వృథా పోకుండా ఉండాలంటే ఇప్పటికైనా ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లోని అన్ని గ్రూపులు ఒకే మాటగా, ఒకే బాటగా ముందుకు సాగాలి అంతవరకూ మండేలా ప్రభృతుల విడుదల ఎప్పటికప్పుడు ఎండమావులుగానే ఉండవలసి వస్తుంది! ఆఫ్రికన్ విప్లవ రచయిత్రి నోమూసా జాబా ఎలుగెత్తి చాటినట్టు మహోద్యమాల పట్ల, త్యాగాల పట్ల కావలసింది కడివెడు కన్నీళ్ళూ కావు, దోసెడు సానుభూతీ కాదు, కావలసిందల్లా లక్ష్యసాధన కోసం పోరాటం, నిరంతర పోరాటం అన్నాడు! *(No time to grieve/for, the struggle continues to continue/There is no time for tears)!!*

**ఆదివారం 11, ఫిబ్రవరి 1990**

# సాదత్‌మంటో గతమెంతో!

అసూయ మాయాపొరలు కమ్మిన వేళ -

అసహనం జోడు గుర్రాల వేగంతో కదంతొక్కిన నాడు -

అహంకారం పురివిప్పి కృద్ధనర్తన చేసిన ఘడియ -

కులమతాలు హేతువును చంపి, మనస్సులను ముక్కలుగా నరికి, మమతలను తుంచిన వేళ -

అంతర్యుద్ధం అన్నదమ్ములనూ అక్క చెల్లెండ్రనూ తల్లి దండ్రులనూ, బిడ్డలనూ చీల్చి ఎవరికి వారు ఎవరికీ కాకుండా విసిరివేస్తున్న ఆ విషాదకర దుర్ముహూర్తాన-

మనస్సు కకావికలు కానివాడెవ్వడు? గుండె బద్దలు కానివాడెవ్వడు? 1947 దేశ విభజన నాటి అల్లకల్లోలానికి అణువణువునా స్పందించి, ఆగ్రహించి కథా భారతికి రక్తాక్షరాలు సమర్పించిన భారత ఉపఖండ రచయితలలో ఒకరు సాదత్ హసన్ మంటో "కింగ్ డమ్స్ ఎండ్ అండ్ ఆదర్ స్టోరీస్" పేరిట పెంగ్విన్ ఇండియా ప్రచురించిన సాదత్ మంటో కథా సంపుటి చూపులకు కథలేగాని, ఉపఖండ ప్రజలు ఒకనాడు పడిన బాధలకు, దురంత దుఃఖాలకు కట్టిన పల్లవి! మంటో రచన చదువుతున్నంత సేపూ "'స్కార్మెంటాడో యాత్రలు" *(The Travels of Scarmentado)* కథల్లో వోల్తేర్ చెప్పిన మాటలు గుర్తుకొస్తాయి ఒక దేశం అల్లకల్లోలానికి గురికావడం లేదా అశాంతిలో కొట్టుమిట్టాడడం ఎంత స్వల్పమైన కారణాలపై జరుగుతుందో వోల్తేర్ అందులో ఉదాహరిస్తాడు ఆయన ఫ్రాన్స్ అనుభవాన్ని వివరిస్తూ ఇలా అంటాడు 'ఈ దేశం నిరంతరం అంతర్యుద్ధంతో తీసుకొంటోంది - ఒకసారి మంత్రి మండలిలో పదవి కోసం తగాదా వల్లా, ఇంకోసారి ఏదో ఒక పుస్తకంలో కొన్ని పేజీలు వివాదాస్పదం ఉన్నాయన్న మిషపైనా ఈ అంతర్యుద్ధం సాగుతోంది నిరుపయోగమైన ఈ తగాదాలవల్ల, దశాబ్దాలుగా సుందరమైన మాతృభూమి సంకుల సమరాంగణంగా మారి తల్లడిల్లిపోతోంది' అన్నాడు

అయితే ఫ్రెంచి అంతర్యుద్ధానికి వోల్తేరు చూపించిన కారణాలు వేరయినా మానవ మారణహోమం పట్ల అతని ఆగ్రహాన్ని, మానవత్వం పట్ల మమకారాన్నీ ఆ మాటల్లో చూస్తాం అలాగే భారత ఉపఖండంలో దేశ విభజన వల్ల హిందూ-ముస్లిం సఖ్యతకు వాటిల్లిన అపారమైన నష్టాన్ని, జరిగిన మారణహోమాన్ని హసన్ మంటో ఎంతగానో ఏవగించుకున్నవాడు దేశ విభజనకు ముందు పంజాబ్‌లోని సాంబ్రాలాలో పుట్టి, విభజనానంతరం కృత్రిమంగా లాహోర్‌లో స్థిరపడి అక్కడే 1955లో అకాల మరణం చెందిన మంటో రెండు దశాబ్దాలలో రెండు వందలకుపైగా కథలూ, నాటకాలూ రాశాడు సాహిత్యపరంగానూ, పాత్రికేయ వృత్తిపరంగానూ అనేక వ్యాసాలూ రాశాడు లాహోర్, అమృత్‌సర్‌లు తన కథా స్రవంతికి కేంద్రాలుగా, రావి, బియాస్, సట్లెజ్ కర్మసాక్షులుగా సాదత్ మంటో రాసిన కథలలో - ఏ ఒక్కటీ ఉబుసుపోక రాసింది కాదు. కొన్నాళ్ళు తాను స్థిరపడిన బొంబాయిలో గడిపిన జీవితాన్ని కూడా ఈ కథల్లో చిత్రించాడు. ప్రతి కథకూ సమకాలీన సమాజం, అందులోని మానవుల రాగద్వేషాలు, సుఖదుఃఖాలు బలమైన కవచాలుగా ఉంటాయి చతురిమ, వ్యంగ్య వైభవం మంటో

కథలకు ప్రాణం సాధారణ విద్యలో పెద్దగా రాణింపునకు రాలేకపోయినా సామాన్య మానవుని సమస్యలను అర్థం చేసుకొని అతడి మూగబాధలకు రాగంతో అనురాగంతో తన వంతు గొంతు కలిపిన వాడు మంటో! మతం ప్రాతిపదికగా ప్రపంచంలో ఎక్కడా ఏ దేశమూ రెండుగా బద్దలు కాలేదు కాని ఆ పని భారతదేశంలో జరిగినందుకు కుపితుడైన మంటో ఈ కృత్రిమ విభజనకు కారకులయిన వారందరినీ - హిందూ, ముస్లీమ్, సిక్కు అన్న భేదం లేకుండా - ఈ కథల్లో ఎంతో వ్యంగ్యంగా, అవసరమైన చోట్ల సూటిగా ఎత్తిపొడిచాడు చివరికి 1919లో జలియన్‌వాలాబాగ్ ఘోరకలికి కారకుడయిన డయ్యర్‌తోపాటు, ఆనాటి మారణహోమానికి ప్రజలలోకూడా ప్రబలిఉన్న కొన్ని అనాలోచిత ధోరణులు ఎలా కారణమయ్యాయో "ఇట్ హోపెన్డ్ ఇన్ 1919" అన్న కథలో చెప్పిస్తాడు దేశ విభజన (1947) వల్ల జరిగిన ఘోర కలిని 'తమస్' సీరియల్ ద్వారా దూరదర్శన్ ప్రేక్షకులకు అందించకముందే -ఏనాడో సాదత్ మంటో ఆనాటి ఉన్మాదపు వాతావరణాన్ని "ది రిటర్న్", "ఉమెన్ ఇన్ రెడ్ రైన్‌కోట్", "ది ప్రైజ్ ఆఫ్ ఫ్రీడమ్", "తోబా టేక్‌సింగ్" కథల్లో వివరించాడు ఆనాటి మత మౌఢ్య కుడ్యాలను ఈ రోజుకీ బద్దలు కొట్టుకుని సమతా దృక్పథాన్ని మనం అలవరుచు కోలేకపోతున్నాం కాని అంతటి మత కల్లోలం మధ్య కూడా మిణుకుమిణుకుమంటూ మానవత తన కాంతి కిరణాలను ఎలా ప్రసరింపచేయడానికి ప్రయత్నించిందో "రైన్‌కోట్" కథ ఒక ఉదాహరణ భీతిల్లిన మనస్సుకు రక్షణ పొందడం తప్ప కుల మత విచక్షణ తెలియదు. మత రాక్షసి వెంటాడినప్పుడు వేర్వేరుగా రెండు చోట్ల నుంచి బయలుదేరిన ఇరువురు మనుషులు (ఒక స్త్రీ, ఒక పురుషుడు) ఒక చోట కలుసుకున్నప్పుడు - వారి నరనరాలను స్పందింపచేసేవి మానవ సంబంధాలు తప్ప మతం కాదు, తోడూ - నీడా తప్ప మరొకటి కాదు. "రైన్ కోట్" కథ మనం పాలగుమ్మి పద్మరాజు "గాలి-వాన" కథలా ఉంటుంది! ఇక మానవ పురోగతికి మతం ఎంతటి అడ్డుగోడో - వ్యంగ్యంగా నిరూపించిన కథ "తోబా టేక్‌సింగ్" దేశ విభజన తర్వాత కొన్నేళ్ళకు ఇరుదేశాల ప్రభుత్వాలకు ఓ 'గొప్ప' ఆలోచన తడుతుంది విభజనవల్ల ఉభయ మతాలకు చెందిన, మతిభ్రమించిన, పిచ్చెత్తిపోయిన వాళ్ళు కొన్ని అనాథాశ్రమాల్లో ఉంటారు విభజన వల్ల ఈ 'పిచ్చివాళ్ళ'ను ఎటు తరలించాలి? దీనిపైన తర్జనభర్జనలు జరిపిన ఉభయ దేశ అధికారులు తరలింపు ఏర్పాట్లు చేస్తారు అపుడు ఆ 'పిచ్చివాళ్ళ' తో పారాలు చెప్పిస్తాడు సాదత్ మంటో! వారిలో కొందరు అధికారులకు అందకుండా "చెట్లు" ఎక్కి కూర్చుంటారు ఎంతకూ దిగిరారు అందులో ఒకడంటాడు "నేను ఇండియాలోనూ ఉండను, పాకిస్తాన్‌లోనూ ఉండను ఈ చెట్టు మీదనే ఉంటా" అని!! బహుశా అతను "చెట్టు నా ఆదర్శం" అన్న మన కవి ఇస్మాయిల్ కవిత చదివాడో లేదో తెలియదుగాని, అనుకోకుండానే పచ్చపచ్చని జీవనానికి ప్రతీక అయిన చెట్టును మాత్రమే నమ్ముకొన్నాడు, పిచ్చివాడైనా!! అలాగే "ది రిటర్న్" కథలో సిరాజుద్దీన్ దేశ విభజన సమయంలో తప్పిపోయిన తన కూతురు సకీనా కోసం పడిన పాట్లూ, సకీనా అచేతనస్థితీ - మన గుండెలను కోత పెట్టే సన్నివేశాలు. ఒక ముస్లిమ్, ఒక హిందువు, ఒక సిక్కు - కథా వస్తువులుగా సాగిన మంటో కథలు జీవితం గురించి సమన్వయ దృష్టిని అలవరుచుకోగోరేవారు ఒక్కసారైనా చదవదగిన ఆణిముత్యాలు "మతం వేరైతేను ఏమోయ్, మనసు లొకటై మనుషులుంటే జాతమన్నది లేచి పెరుగు"నని చాటి చెప్పిన ఆధునిక తెలుగు కథా పితామహుడు గురజాడ మాటకు విలువ తెచ్చే రచన - సాదత్ హసన్‌మంటో కథలు బుద్ధిచెప్పువాడు గుద్దితేనేమయా అన్నారు ఆ పిడిగుద్దులు మతోన్మాదులపై వర్షించినవాడు మంటో!

ఆదివారం, సెప్టెంబర్ 10, 1989

# వేదనా కలశం!

భిన్న మనస్తత్వాలతో విభిన్న పాత్రలను పోషిస్తున్న ఈ మానవ లోకంలో తాము వేదనల విషం తాగి జనతకు మాత్రం అమృతం పంచడానికి ప్రయత్నించే వాళ్ళ సంఖ్య ఎప్పుడూ తక్కువగానే ఉంటుంది అలాంటి వాళ్ళు నిరాశావాదులుగా కొందరికి తోచవచ్చుగాని, వస్తుతః ఆశావాదులుగా ఉన్నవాళ్ళు 'నిరాశావాదులు'గా మారలేరు! సామాజిక దురన్యాయాలపైన, దోపిడీ వ్యవస్థలపైన మనస్సులో సుడులు తిరిగి జడలువిచ్చి నర్తించే ధర్మ కోపానికి, తామనుకున్న పరిధిలో, నిర్ణీత కాలంలో సాధించుకోలేని లక్ష్యానికి ప్రతీకగా మాత్రమే నిరాశను పరిగణించాలి గాని - అదేదో మానవ ద్వేషానికి ఆనవాలుగా భావించుకోకూడదు! నిజానికి కొందరలా భావించుకోబట్టే, కన్నీళ్ళమధ్యనే కమనీయమైన హాస్యంతో సాంఘిక అసమానతలపై, అక్రమాలపై వ్యంగ్య వైభవంతో చురకలు వేసి ఏకకాలంలో ఆనందాన్నీ, బాధనూ, ఆలోచననూ పంచిపెట్టిన బస్టర్‌కీటన్, చార్లీ చాప్లిన్‌లను కూడా తప్పుగా అర్థం చేసుకున్నారు! అలాగే ఈ ఇరవయ్యో శతాబ్దపు రంగస్థల రచయితలలో, నాటక కర్తలలో సుప్రసిద్ధుడుగా ప్రసిద్ధి చెంది కొలది రోజులనాడు అస్తమించిన బ్రిటిష్ నాటక కర్త శామ్యూల్ బెకెట్‌ను కూడా నిరాశావాదిగా చిత్రించడానికి కొందరు ప్రయత్నించారు కాని జీవితం సుఖదుఃఖాల సమ్మేళనంగా భావించగల వారికి బెకెట్ ప్రపంచ రంగస్థల చరిత్రను కొత్త మలుపులు తిప్పిన సుప్రసిద్ధ నాటక కర్తగా కనిపిస్తాడు, కొందరికి అసంబద్ధ నాటక కర్తగా *("Theatre of the Absurd")* కనిపించే బెకెట్, మరి కొందరికి మాటకూ చేతకూ సంబంధంలేని దుర్దశకు సజీవ వ్యాఖ్యాతగా, సమవర్తిగా దర్శనమిస్తాడు దుఃఖాన్ని కూడా సుఖాంతపు సరిహద్దులకు చేర్చాలన్న తపనే గొప్పది కాగా కరుణరసం ద్వారా శాంతరసానికి తలుపులు తెరచేవారు కొద్దిమందే! మధురమైన వియోగానికీ, అంతకంటే ఎక్కువగా విషాద యోగానికీ దివిటీలు పట్టిన మన కృష్ణశాస్త్రి "ఎవ్వరని యెంతురో నన్ను? ఏ ననంత శోక భీకర తిమిరలోకైక పతిని" అని చెప్పాడేగాని, అలా అని మానవతపైన, లోకం పైనా విషం కక్కలేదు! పైగా అతనిలోని ఆశావాది "మంది కృత మహాయుగం / ముందున్నది ముందున్నది/ ముందున్నది మందే/ మరి మందే యువ మహాయుగం" అని చాటలేదూ! నాటక కర్త, కవి, నవలాకారుడూ అయిన బెకెట్ మన కవి "బైరాగి" లాంటివాడు! బెకెట్ నాటకాలకు భాష్యం చెబుతూ ఫిలిప్ టాయిన్‌బీ ఒక మాటన్నాడు "మనలో చాలామంది అనైచ్ఛికంగానే నరకలోక యాత్రలు చేస్తుంటారు, కాని బెకెట్ సృష్టించిన నరకం (హెల్) ప్రతివాడూ నిత్యం అనుభవిస్తూండే నరకమేనని! మరొకమాటలో చెప్పాలంటే బెకెట్ తన నాటకాలలో, నాటికలలో ("వెయిటింగ్ ఫర్ గోదే", "ది ఎండ్ గేమ్" వగైరా) మానవ జీవితంలోని, అతని ప్రవర్తనలోని వైరుధ్యాలనూ, వైమనస్యాలనూ ఎండగట్టాడు అన్యాయాలను ఎదిరించి నిలబడలేని మానవునిలోని దౌర్బల్యాన్నీ, అసమర్థతనూ, నిరాశనూ అధివాస్తవిక ధోరణిలో (సరియలిస్టిక్) బహిర్గతం చేస్తాడు. ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూడొద్దనీ, పరిష్కారం నీకు నీవుగానే ఆలోచించుకోమనీ శ్రీశ్రీ అన్నట్టుగానే, కళ్ళు కాయలు కాచేటట్టు ఎవరికోసమో ఎదురుతెన్నులు చూచే మానవుని పరాధార స్థితినీ, నిరాధార బతుకునీ బెకెట్ చూపిస్తాడు నైతిక విలువలను పెంచడం కోసం, ఎంతకూ "మానవుని నైజం మారడం లేదు" *(The essence does not change)* అని ఒకటికి పది మార్లు అనిపించి ఆవేదనతో ఆ నైజం

మారేటట్టు పరోక్షంగా ప్రోత్సహిస్తాడు "గొదే" నాటకంలో వ్లాడిమీర్ ఎస్ట్రాగాన్, పోజో పాత్రల మధ్య సంభాషణ అంతా మానవ మనస్తత్వాన్ని ఊగించి కాసిస్తున్న వైరుధ్యాలకు అద్దం పడుతుంది అనుకున్నవేవీ జరగడంలెదు, అంతే, ఏమీ జరగదు, అది అంతే అన్న ఒక పాత్రకు సమాధానంగా మరొక పాత్ర వచ్చి ఈ బతుకంతా 'బోరు' కొడుతోందా నీకు" అంటాడు! మరొకడొచ్చి "ఏదో కొంత వరకు" అంటే, ఇంకొకడొచ్చి నాకు మాత్రం సరదాగానే' ఉందంటాడు! అందుకే "ఎండ్ గేమ్" ఏకాంకికలో ప్రతి వ్యక్తి ఒక ప్రత్యేక మూర్తి" *(Every man is a speciality)* అని చెప్పించి, జీవితంలో వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాడు విశ్వాస, అవిశ్వాసాల మధ్య మానవుని ఊగిసలాటను, చైతన్యానికీ స్తబ్దతకూ మధ్య వైరుధ్యాన్నీ చూపిస్తాడు మనిషిని మంచి - చెడుల పూర్ణకుంభంగా చూపుతాడు ఇలా తన యాభయ్యేళ్ళ రచనా కాలంలో బెకెట్ ఆధునిక రంగస్థలాన్ని సాంకేతికంగానూ, కొత్త ఇతి వృత్తాలతోనూ నూతన మార్గాలు పట్టించడానికి ఎంతో కృషి చేశాడు ఆధునిక యుగంలో ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలంలో, అగ్రరాజ్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధమేఘాలు ఆవరించి వర్ధమాన దేశాల భవిష్యత్తును కూడా పీడిస్తున్న ఘడియలలో మానవునిలో పెల్లుబికి అంతర్ మథనానికీ, ఆందోళనలకూ ప్రతిబింబంగా అవతరించిందే బెకెట్ 'అసంబద్ధ నాటక రంగం' ఇందుకు అతనికి ఈడూ జోడుగా నాలుగేళ్ళనాడు చనిపోయిన జీన్ జెనేను చెప్పుకోవచ్చు! నిజానికి నూతన పరిణామాల కోసం ఎదురు చూచిన వాడు బెకెట్ కనుకనే ఆ 'గొదే" ఎవరో కాదు, ఈ బెకెట్టే!

అందుకే అతని సమకాలీన నాటక కర్తలలో ఒకరైన జాన్ స్పర్లింగ్ అన్నట్టుగా బెకెట్ ప్రవేశం కోసం యూరప్ రంగస్థలం ఎదురుచూస్తున్నట్టుగానే, ఓ మంచి థియేటర్ కోసం బెకెట్ కూడా నాడు పడిగాపులు పడ్డాడు ఈ తపనను, రెండవ ప్రపంచ యుద్ధమూ, దాని ఫలితాలూ, తద్వారా ప్రపంచంలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం, దేశాలమధ్య ఘర్షణలూ, అస్థిరత 1930ల్లో లాగానే కళారంగాన్ని కూడా కుదిపివేసింది అయితే 1930లలో ఎంతటి ఆర్థిక సంక్షోభం ఉన్నా, రాజకీయంగా అల్లకల్లోల పరిస్థితులున్నా ఆ దశలోకూడా జేమ్స్ జాయిస్, పికాసో లాంటి ఉద్దండులు సాహిత్య కళారంగాలకు వన్నె చిన్నెలు కూర్చలేదా? కూర్చారు అలాగే బెకెట్ కూడా యుద్ధానంతర పరిస్థితుల్లో - 1950ల నుంచి 1970 వరకూ రంగస్థలాన్ని పెక్కు విమర్శల మధ్యనే కొత్త పుంతలు పట్టించాడు మూకాభినయానికి (మైమ్) మూర్ధాభిషేకం చేశాడు ఇక్కడ ఎన్ ఆర్ నంది "మరో మొహెంజదారో' చదివినప్పుడు కొన్ని ఘట్టాలు బెకెట్ నాటకాలను గుర్తుకు తెస్తాయి అతని కొన్ని నాటకాలకు ఆరుబయలు రంగస్థలం, చౌరాస్తాలు ప్రధాన భూమిక అని తెలుసుకున్నప్పుడు ఆంధ్ర యూనివర్సిటీ థియేటర్ ఆర్ట్సువారు అత్తిలి కృష్ణారావు నేతృత్వంలో ప్రారంభించిన "వీధి" (రోడ్డే వేదిక) ప్రయోగ నాటకాలపై బెకెట్ ప్రభావం స్ఫురణకు రాకమానదు! డాంటే, షేక్స్పియర్, మిల్టన్, జాయిస్, ప్రౌస్ట్ భావనాస్రవంతి ప్రభావం తనపై ఉన్నా బెకెట్ సొంత గొంతును నిలబెట్టుకున్నాడు, తన తనాన్ని చాటుకున్నాడు అతని "మర్ఫీ" నవలలోని "సీలియో" ఇతర హీరోయిన్లకు భిన్నంగా, మన గురజాడ వారి "మధురవాణి"కి మాత్రం దగ్గర పోలికగా కనిపిస్తుంది! అలాగే చలం బోధించిన "ఎకానమీ ఆఫ్ వర్డ్స్"కు (పదాల పొదుపు) బెకెట్ నాటకాలు పెట్టింది పేరు! నిశ్శబ్దం నుంచే భాష పుట్టుకొచ్చింది కాబట్టి తనకు తోచిన పద ప్రయోగం చేస్తానని చేసి "ఎ ప్లే వితౌట్ వరడ్స్" అనే "మూకీ" నాటకంలో భాషకు కొత్త భూషలు తొడిగాడు ఇందులో

అతనికి పోలిక మహాకవి ఇలియెట్ జీవిత పటాన్ని సాధ్యమైనంత తక్కువ పద చిత్రాలలో భావ గర్భితంగా పొదగడానికి చూస్తాడు కనుకనే మానవుని అసమర్ధతకు ప్రతీకగా బెకెట్, ఇసుకలో తలదూర్చిన ఉష్ట్రపక్షి బాపతుగా మనిషి కూరుకుపోయినట్టు చూపిస్తాడు (ఇలియెట్ అనలేదూ *"Let immersion in a sand-dune equal human impotence)!* బెకెట్ దాదాపుగా తన అన్ని రచనలలోనూ ఎందుకిలా విషయాలను అతి వ్యంగ్యంగా, అసంబద్ధంగా వర్ణిస్తాడు? ఐర్లెండ్ వాసులకు కళ్ళకు కనపడిన ప్రతీ దృశ్యాన్నీ లేదా ప్రతీ ముద్రనూ వ్యంగ్యపరచి చూపడం చాల ఇష్టమట! అదే బెకెట్‌కూ అబ్బింది అయినా దోపిడి వ్యవస్థను ప్రత్యక్షంగా విమర్శించకుండా, నానబెట్టిన పాత చెప్పుతో కొట్టినట్టుగా "ఎండ్ గేమ్" నాటికలో ఒక పాత్ర ద్వారా అనిపిస్తాడు మనిషిని పూర్తిగా చావకుండా జీవచ్ఛవంలా ఉంచి బాధపెట్టగల రీతిలో రోజుకో మెతుకు రాల్చుతానంటాడు అందులోని పాత్రధారి! కనుకనే బెకెట్, మనిషి ఈ ప్రపంచాన్ని దర్శించే తీరులోనే అసలు రహస్యం ఉందంటాడు బెకెట్ పైకి నిరాశావాదిగా కనిపించినా, ఈ అడుక్కుతినే వ్యవస్థ పోవాలనీ, స్వయం పోషకం కావాలనీ కాంక్షించిన అజ్ఞాత ఆశావాది! ఒక మహాకవి చెప్పినట్టుగా భావితరాల కోసం ఆత్మ త్యాగాలూ, వీర పూజలూ తప్పవేమో *"To evoke posterity/ Is to weep on your own grave"!* అందుకే కాళరాత్రి, అరుణోదయం అయ్యేదాకా తన అరుపులూ, పెడ బొబ్బలూ చాలించదట!!

జనవరి 21, 1990

# దోపిడీ బతుకులను 'యాగీ' చేసిన గూగీ!

గీతాలాపన తన నిత్యకృత్యం కాకపోయినా, జైలులో మరో వ్యాపకం లేదుకాబట్టి కవితా గానం ద్వారానైనా స్వేచ్ఛాదినం కోసం ఉవ్విళ్ళూరిన డాక్టర్ హోచిమిన్, స్వేచ్ఛా ప్రియత్వానికి చెల్లించవలసిన మూల్యం ఎలాంటిదో ఇలా చెప్పాడు "రోకటి పోటులో ఎన్ని బియ్యం నలగాలో! దంచిన తరువాత అవి పత్తిలా తెల్లబడతాయి / మనుషులక్కూడా అదే వరవడి - ఈ నికృష్ట జీవిత కర్మాగారమే / వారిని చికిలీ పట్టిన చంద్రహాసాలుగా మార్చుతుంది" ఈ చిర సత్యం కాయకష్టంలో ఉన్నవారికే కాదు, కవులకూ, రచయితలకు, ఇతర మేధావులకు, విప్లవకారులకు కూడా వర్తిస్తుంది జాతీయ స్వాతంత్ర్య సమర చరిత్రలు చాటిచెపుతున్న మేటి సత్యం కూడా అదే అలాంటి సత్యాలను ఏళ్ళ తరబడి కాచివడపోసిన ఆఫ్రికా రచయితలలో ఒకరూ, కెన్యాలో సుప్రసిద్ధ పండితుడుగా, నవలా కారునిగా, నాటక రచయితగా, ప్రజల పక్షాన నిలబడిన మేధావిగా, ప్రజారంజకుడైన రాజకీయ, సాహిత్య సైద్ధాంతికునిగా ప్రపంచ ఖ్యాతినొందిన గూగీ వా తియోంగీ ఒకరు తూర్పు ఆఫ్రికాలో బ్రిటిష్ వలస సామ్రాజ్యవాదుల పెత్తనంనుంచి విముక్తి కోసం, ఆ తరువాత, (1963 తర్వాత) రాజ్యాధికారానికి నయా వలస విధానానికి ముద్దుబిడ్డగా ఎదిగివచ్చిన దేశవాళీ ధనికవర్గ ప్రభుత్వ పాలన క్రింద నలిగి రూపు చెడిపోయిన కెన్యాను దోపిడీ పాలననుంచి శాశ్వతంగా విముక్తి చేయడానికి పాటుపడుతూ వచ్చిన మేధావులలో ఒకరు గూగీ అంటీఅంటకుండా ముట్టీ ముట్టకుండా పైపై కబుర్లతో కాలక్షేపం చేసినంతకాలం ప్రొఫెసర్ గూగీ 'మంచివాడి' కింద లెక్క! పీడనా దోపిళ్ళనుంచి తన జాతిని రక్షించేందుకు నడుంకట్టి తాను తిరగబడ్డ (రెబెల్) రోజునుంచీ అతను "అతివాది, తిరుగుబాటుదారు కాబట్టి కరచరణాలు కదలకుండా అతణ్ణి బంధించాల' 'ని ఫర్మానాలు! జైలులో దినచర్య గురించి, "ప్రిజన్ డైరీ"లు చాలామంది రాశారు కొందరు కవితలుగా, ఇంకొందరు క్షణిక భావ శకలాలుగా రాశారు కాని కెన్యా జాతీయ స్వాతంత్ర్య సమరం లక్ష్యాలను, అది కడచి వచ్చిన దశలనూ, స్వేచ్ఛా జీవులుగావడానికి ప్రజలు పడిన కష్టాలూ, విమోచన పోరాటాన్ని తూట్లు పొడవడానికి ప్రయత్నించిన మేధావులూ, దానిని సమున్నత శిఖరాలకు చేర్చడానికి ఆస్తిపాస్తులనూ ప్రాణాల్నీ త్యాగంచేసిన మేధావుల గురించీ - ఈ మహాప్రస్థానంలో ఎవరి స్థానం ఏమిటో 'జాతకాలు' చెప్పిచూపిన ఖైదీ డైరీ గూగీ రాసిన ప్రిజన్ డైరీ - అదే "డిటైన్డ్" *("Detained")* నైరోబీ యూనివర్సిటీ ప్రొఫెసర్ అయిన గూగీని శిక్షించింది వలస ప్రభుత్వం కాదు, స్వతంత్ర కెన్యా ప్రభుత్వం! తెల్లవాడు పోయిన చోట నల్లవాడు అధికారానికి వచ్చినా "వర్గ ప్రయోజనాలు"న్న చోట నల్లవాడు అధికారానికి వచ్చినా ఆ "వర్గ ప్రయోజనాలు" పాలకుల గుణగణాల్ని శాసిస్తాయిగాని, వ్యక్తిగత సంబంధాలు, ప్రయోజనాలూ కావని నిరూపించిన ప్రిజన్ నోట్సు గూగీ రచన అంతేగాదు, "డైరీ" ప్రారంభంలోనే కారల్ మార్క్స్ 1852 లో రాసిన వ్యాసంలో ఒక కార్మిక ప్రతినిధి ప్రసంగాన్ని ఉదహరిస్తూ చెప్పిన మాటలు అక్షర సత్యాలు అవి మానవుని ఉనికికి అర్థాన్ని తెలుసుకోవలసిన అవసరాన్ని గుర్తుచేస్తాయి "ఖైదీగా పట్టుబడినవాడి పిల్లలపట్ల దయనూ, ఆర్ద్రతనూ తెలపలేనివాడు పొట్టఅమ్ముకుని బతుకీడ్చే బానిసల *(labour-slaves)* పిల్లలను పట్టించుకోడు, వారికోసం బాధపడడు" అన్నాడు! వలసవాదానికీ, నయా వలస వాదానికీ

ఇదే సమష్టి కార్యాచరణగా మారింది! ప్రజల పక్షాన నిలబడినందుకే, వారి గొంతుకతో తన గొంతు కలిపినందుకే గూగీకి జైలుశిక్ష నైరోబీ యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా వృత్తిధర్మాన్ని కొనసాగించడానికే వీలులేకుండా గూగీపై కెన్యేట్టా ప్రభుత్వం ఆంక్షలు విధించింది వృత్తిలో ప్రమోషన్‌లు లేకపోయినా జీతం పెంచకపోయినా, ఉన్న జీతానికి ఎసరు తెచ్చారు, జీవితానికీ ఇబ్బంది కలిగించారు - ఆఖరికి దేశం విడిచిపొమ్మన్నారు గూగీ కథ పాలకవర్గాల దోపిడీని, నిరంకుశ విధానాలను అడుగడుగున యాగీ చేసే ప్రతి మేధావి గాథ కనుకనే కెన్యాలో ఒకనాడు ప్రజల తలలో నాల్కగా మెలిగిన కెన్యేట్టా, వలస పెత్తందారీ నిర్బంధకాండను చవిచూసిన కెన్యేట్టా, స్వాతంత్ర్యానంతరం స్వదేశంలోని దేశీయ ధనికవర్గ దోపిడీని అణచలేక ప్రజల పక్షాన నిలబడిన మేధావులపైనా, ప్రగతిశీల ప్రజాస్వామిక సంస్థలపైన విరుచుకుపడి, తన ఉనికిని కాపాడుకోజూచాడు తన గతాన్ని మరచిపోయాడు కనుకనే ప్రముఖ నల్లజాతి మనస్తత్వ శాస్త్రవేత్త, అల్జీరియా విప్లవకారుడూ రాసిన ఈ "భూలోకపు మాలోకాన్ని" *(Wretched of the Earth)* చదువుకున్న గూగీ కూడా తిరగబడ్డాడు అందుకే మేధావి అన్నవాడు "గోడమీద పిల్లి"లా ఉండకూడదన్నాడు సమస్యకు సమాధానం "అవును" లేదా "కాదు" అని మాత్రమే ఉండాలన్నాడు ఏ భాషలోనైనా సరే - ఈ రెండు మాటలకే విలువన్నాడు *('Yes, No Nadio La")* అన్యాయం, దౌర్జన్యం, పీడన, దోపిడీ, విద్రోహం, భీతావహ వైఖరి, లొంగుబాటు-వీటన్నింటిపట్ల ఈ రెండు మాటలలో ఏదో ఒక దానితోనే సమాధానం (అవుననో, కాదనో) చెప్పాలి నంగితనానికీ లొంగుబాటుకూ గూగీ నిఘంటువులో చోటులేదు అందుకనే తన డిటెన్షన్‌ను అతడు ఒక సాంఘిక, రాజకీయ, చారిత్రక పరిణామ క్రమంలో భాగంగా భావించాడేగాని "వ్యక్తిగత సమస్య"గా ఎన్నడూ తలంచలేదు! కెన్యా ప్రజలు ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక బానిసత్వానికి వ్యతిరేకంగా సాగించిన ప్రతిఘటనోద్యమ దశలన్నీ ఈ ప్రిజన్ డైరీలో కన్పిస్తాయి తాను కెన్యాలోని "కామిటీ" జైలులో ఉన్నప్పుడు అక్కడి రాజకీయ ఖైదీలందరూ, రచయితలూ, లేదా వాగ్గేయకారులూ కావడం ఒక విశేషం! కెన్యాలోని నిలోటిక్ తెగవారి 'లూవో' సంస్కృతినుంచి స్వాహిలీ, కిస్వాహిలీ భాషా సాహిత్యాల వరకూ ప్రతినిధులైన వారంతా ఆ జైలులోనే గడిపారు వెనక ఘనా నాయకుడు ఎన్‌క్రూమా ఫోర్ట్ ప్రిజన్‌లో వాడినట్టుగా, ప్రసిద్ధ ఆఫ్రికన్ కవి డెనిస్ బ్రూటస్ రాబెన్‌దీవి ఖైదులో ఉపయోగించినట్టుగా, కామిటీ జైలులో డిటెన్యూలుగా ఉన్న నవలాకారులంతా కాగితం దొరక్క నవలా రచనకు టాయిలెట్ పేపర్‌ను వాడుకున్నారు! మూడు సెక్షన్‌లుగా ఉన్న ఈ ప్రిజన్ డైరీ గూగీ జైలు అనుభవాలకూ, అతని తలపోతలకూ అద్దం పట్టడమే గాక, జైలు లేఖలూ, డాక్యుమెంట్లూ కూడా పొందుపరిచిన రచన తనను ఉపాధికి దూరంచేసేందుకు ప్రభుత్వమూ, నైరోబీ యూనివర్సిటీ పన్నిన కుట్రను గూగీ ఇందులో బహిర్గతం చేశాడు అతని ఉద్దేశంలో కెన్యా ఈ రోజుకీ నయా వలస దేశమే ఆ మాటకొస్తే పెక్కు ఆసియా - ఆఫ్రికా దేశాల పరిస్థితి అలాగే ఉందని అతని విశ్వాసం! "పెట్టుబడిదారీ వ్యవస్థను దోపిడీ, దొంగతనం, అవినీతిపై ఆధారపడి తప్ప మరొకలా సాకలేరు, నిర్వహించలేరు. ఆర్థికంగా ప్రతిదానికీ పరాధార స్థితిలో ఉన్న కాపిటలిజంలో పరిస్థితి మరింత అధ్వాన్నం నయా వలసల్లో అవినీతికర దేశావాళీ ధనిక వర్గం అండలతో విదేశీ పెట్టుబడులు (మల్టీ నేషనల్స్, పెప్సీకోలాలా) దేశంలోకి చొరబడి వర్ధమాన దశలో ఉన్న దేశీయ పెట్టుబడులను కూడా దెబ్బతీస్తున్నాయ"ని ఆవేదన వ్యక్తం చేశాడు ప్రొఫెసర్ గూగీ కనుకనే దేశీయ "ఆర్థిక, సాంస్కృతిక రంగాలపై విదేశీ ప్రయోజనాలు

పెత్తనం చెలాయించినంత కాలం ఏ దేశమూ తాను రాజకీయంగా స్వతంత్ర శక్తినని చెప్పుకోజాలదు" అన్నాడు! ఈ వైఖరితోనే ఆయన కెన్యా భాషా సమస్యను కూడా పరిశీలించాడు కెన్యా జాతీయ భాష స్వాహిలీకి స్వాగతం చెబుతూనే 'కికూయూ' లాంటి ప్రాంతీయ భాషలను చంపొద్దన్నాడు! అతను "కికూయూ" ప్రాంతీయ భాషలో రాసిన రెండు నవలలూ *("Ngaahika Ndeenda", Caitaani Mutharabaini")* విదేశీ భాషా ప్రభావానికి ప్రతిఘటనగా ఉద్యమించిన భాషా పోరాటాలకు గొప్ప కానుకలుగా, రక్తరేఖలుగా భావించుకుంటారు మనం అంతా ఏ మార్పును కోరుకుంటామో దాన్ని ఆచరణలో సాధించి పెట్టేవాడే తిరుగుబాటుదారు - రెబెల్ - అన్నారు రోలోమే *("Power and Innocence")!* లోకంలోని పాపాలను, తప్పిదాలనూ తనమీద వేసుకొని సంస్కరణకు బయలుదేరేవాడే రెబెల్ అన్నారు అతడే తిరుగుబాటుదారూ, రక్షకుడూ కూడా అతను తిరగబడి వాజమ్మలైన మనల్ని రక్షిస్తాడు కనుకనే నాగరికతకు తిరుగుబాటుదారు అవసరం అన్నారు ప్రొఫెసర్ గూగీ కూడా అలాంటివాడే అన్యాయంపై ధ్వజమెత్తిన అక్షర కుక్షి, నల్లకలువ పూబంతి, ఎల్లవారికి మేలుబంతి!

సెప్టెంబర్ 24, 1989

# గర్భశోకానికి శ్రుతిగా సంగీతం వెలయించిన సీగర్!

విదేశీ వస్తువ్యామోహంలో పడినవాడికి సుందరమైన స్వదేశీ సరుకు నచ్చదు. గానంతో, వీనులవిందు చేసే రాగంతో సంబంధం లేకుండా డమడమాల వాద్యాల రణగొణల మధ్య చెవులకు చిల్లులు పొడిచే ఆధునిక కచేరీలకు అలవాటుపడినవాడు జానపద సంగీత సాహిత్యాలలోని మాధుర్యాన్ని ఆనందించలేడు. జాతి హస్తగతమైన సాహిత్యమే జానపద సాహిత్యం. ఆటపాటల మేలుకలయికే జానపదం. 'గుమ్మడేడే గోపీదేవీ" ఒక్కటే కాదు, "రాయాకు పాపమ్మ ఆడవే పాప/రాజులందరుగూడి చూడవచ్చేరు" లాంటి పాటల్లోనూ, "కారాలలో చెల్లు రెండు కారాలు/ ఉప్పు కారమొకటి" లాంటి పదసాహిత్యంలోనూ జానపదుల వాంగ్మయం హొయలు చిందుతుంది. అది ఒక సెలయేరు, నిత్య ప్రవాహం. జానపద సాహిత్యంలో జాతి జీవనంలోని ఆచార వ్యవహారాలు, సుఖదుఃఖాలు, ప్రకృతి శోభ ప్రతిఫలిస్తాయి. సకల రంగాలూ-గృహజీవనం, బాల సాహిత్యం, స్త్రీల సాహిత్యం, భక్తి సాహిత్యం, వ్రతోత్సవ సాహిత్యం, వ్యవసాయ వాంగ్మయం, శ్రమజీవుల సాహిత్యం, ప్రణయ సాహిత్యం జానపదుల ఉసురు. కృత్రిమత్వం జానపద గీతాలకు, కళారూపాలకూ బద్ధవిరుద్ధం. సహజసుందరమైనశైలి దాని ప్రత్యేకత. ఆ మహా సాగరంనుంచి పుట్టుకొచ్చే అమూల్య రత్నాలు ఎన్నో, ఎన్నెన్నో! యక్షగానాలు, బుర్రకథలు, జక్కుల కథలు, జముకుల కథలు, పిచ్చుగుంట్ల కథలు, జంగం కథలు, ఒగ్గు కథలు, కాటమరాజు కథలు మాత్రమే కాదు, వీరకొలువులు, పీర్ల గీతాలు, కలుపు పాటలు, పెండ్లిండ్లలో తలుపువద్ద పాటలు, ముద్దు గుమ్మల మద్దెల ధ్వనులు, మాచల్దేవి క్రీడాభిరామం, కామవల్లి కథలు, కామేశ్వరి కథలు, ఎరుకచెప్పే ఎరుకలసాని, తెరవెడలిన నాంచారి, కురవంజి విద్యలు, జక్కుల పురంధ్రి, బంగారక్క, బతకమ్మ, కేతిగాడు, సింగి-సింగన్న, గడసాని గరిడీలు, చిందు బాగవతాలు, కోనసీమ కోలసంబరం, వానదేవుడు పాటలు. కప్పల పెళ్ళి పాటలు, తొలకరి తొగరు పదాలు, ఏరువాక ఆరాధన, ఉయ్యాల పదాలు, వొలియ పదాలు, ముద్దుల బావలు, సిన్ని మువ్వల సిన్నోళ్ళు, వీరగాథలూ - అన్నీ జానపద సంపదే. నేదునూరి గంగాధరం తెలుగునాడంతా కలయ తిరిగి రేయింబవళ్ళు నిద్రాహారాలు లేక ఒక్క చేతిమీదుగా 'సెలయేరు', 'మిన్నేరు' అందించాడు. అలాగే సీమ దాటి మెడలు రిక్కించి చూస్తే - ఈ జానపద సంపదను, ప్రజాసంగీత, సాహిత్యాలనూ 'నా బొందో' అంటూ భుజాన వేసుకొని అమెరికా, యూరప్, లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండ దేశాలలో తిరిగి ప్రదర్శనలిచ్చిన ప్రజాగాయకుడు, జానపద కళాకారుడూ పెటీ సీగర్ (అమెరికన్). న్యూ ఇంగ్లాండ్ కుటుంబానికి చెందిన సీగర్ అమెరికన్ గ్రామీణ ప్రజలకే కాదు, యావత్ప్రపంచ శ్రామిక లోకానికీ ఆత్మీయుడు, మానవతావాది. నీగ్రో అయి ఉండి కూడా తన సహజాతాన్ని కోల్పోయి తెల్లవాడి మెరమెచ్చులకోసం వాణిజ్య లోకపు తళుకు బెళుకుల సంస్కృతికోసం, తన తనాన్ని వదులుకొని తన చర్మాన్ని కూడా తెల్లవాడి చర్మంతో 'అంటు' కట్టించి ప్లాస్టిక్ సర్జరీ చేయించుకొన్న పాప్ సింగర్ మైఖేల్ జాక్సన్ ఎక్కడ? సుప్రసిద్ధ గాయకుడూ, జానపద కళాకారుడూ, సంస్కృతీపరుడూ, కళను కమర్షియలిజానికి తాకట్టుపెట్టని పెటీ సీగర్ ఎక్కడ! నక్కకూ నాగలోకానికీ ఉన్నంత తేడా! ఇరువురూ ఇటీవల మనదేశాన్ని సందర్శించినవాళ్ళే. అయినా ఇరువురి మధ్య మనం చూపిన వివక్ష భారతీయ సంస్కృతీ విలువలకు తలవంపులుగా భావించాలి. ఒకప్పుడు ప్రపంచ ప్రసిద్ధ

రచయిత అనటోల్ ఫ్రాన్స్‌ను ఎవరో "పాటవల్ల ఒరిగేదేమిటి?" అని ప్రశ్నించాడట అందుకు సమాధానమిస్తూ ఆయన "పాటలు రాజులనూ, వారి రాజ్యాలనూ కూలగొట్టాయయ్యా" అన్నాడు! పాటకు ఆ విలువే లేకపోతే యుద్ధభేరీలకు, మార్చింగ్ సాంగ్స్‌కూ అర్థం లేదుమరి! రెండో ప్రపంచ యుద్ధానికి ముందూ, ఆ తరువాత కొన్నాళ్ళపాటూ సామ్రాజ్యవాద వ్యతిరేక, జాతి వివక్షా వ్యతిరేక ప్రజా ఉద్యమాలకూ, ప్రపంచ శాంతి ఉద్యమాలకీ బాసటగా నిలబడి అమెరికాను, యూరప్‌ను ఆకట్టుకుని తన సంగీత ఝురిలో ఉర్రూతలూగించిన పాల్ రాబ్సన్‌కు దీటైన వారసుడు పెట్ సీగర్ రాజకీయంగానూ,సాంస్కృతికంగానూ, కళాప్రదర్శనల నిర్వహణను గుండె గొంతుకలో పలికించడంలోనూ ఈ ఇద్దరికీ ఎన్నో పోలికలున్నాయి రెండో ప్రపంచ యుద్ధకాలంలో 'గోడకు చెవులుంటాయ'న్న సామెతకు అక్షర సాక్ష్యంగా నిలిచింది గూఢచారి వ్యవస్థా, జనరల్ మెకార్థీ గుడ్డి కమ్యూనిస్టు వ్యతిరేకతా ఉన్మాదమూ ఆ హిస్టీరియాకు అనేకమంది ప్రజాస్వామ్యవాదులను ప్రభుత్వ విధానాలు బలిచేశాయి వారిలో వర్ణవివక్షను, "మాలపల్లి చట్టాల"ను నిలువెల్లా నిరసించి ప్రజలను పెద్ద ఎత్తున కదిలించడానికి నీగ్రోమాతల గర్భశోకానికి శృతిగా సంగీతం వెలయించిన గీతకారులూ, ప్రజాగాయకులూ పాల్ రాబ్సన్, పెట్ సీగర్! కాళ్లు తడబడకుండా నీళ్ళు నమలకుండా కుండ బద్దలు కొట్టినట్టు అభిప్రాయం వ్యక్తీకరించడంలో ఇద్దరూ ఎవరికి వారే సాటి! వాళ్ళ ఉద్దేశంలో ప్రపంచంలో వర్ణవివక్షను రద్దుచేసి, జాతి, మత, వర్ణ వివక్షను నేరంగా ప్రకటించి ఆచరించిన దేశం పాత సోవియట్ యూనియన్ అలాంటి సోవియట్‌పై కత్తిదుయ్యడానికి కలిసిరానందుననే రాబ్సన్, సీగర్‌లు ప్రభుత్వం దృష్టిలో కొన్నాళ్లు 'దేశ ద్రోహులు' కావలసి వచ్చింది! కాని ఈ ప్రజాగాయకులు కోటానుకోట్ల అమెరికన్ ప్రజల కనుపాపలయ్యారు వీరు, వారి మనోమందిరాలలో అధిష్ఠాన దేవతలయ్యారు! ఉభయులకూ మెకార్థీయిజం నుంచీ అమెరికన్ సైనిక వ్యవస్థ పెంచి పోషించిన "కూక్లుక్స్ క్లాన్" లాంటి వర్ణవివక్ష సంస్థ నుంచీ బెదిరింపులొచ్చాయి ప్రాణాలకు ముప్పువచ్చింది అమెరికా "వ్యతిరేక కార్యకలాపాల" పార్లమెంటు విచారణ సంఘం ముందు ఇద్దరూ సాక్ష్యాలిచ్చారు రాబ్సన్ ఎదురుతిరిగి "అమెరికా వ్యతిరేక కార్యకలాపాలు నావికావు విద్రోహులు మీరు" అని ముఖం వాచేటట్టు పెట్టాడు, వీధిగాయకుడిగా మారి ప్రజా సమూహాలను ఖంగుమనే కంఠస్వరంతో దేశవ్యాప్తంగా సమీకరించాడు అలాగే పెట్ సీగర్ కూడా విచారణ కమిటీముందు సాక్ష్యమిచ్చాడు తనది ప్రజావాణి అన్నాడు అయినా సీగర్ సంగీత కార్యక్రమాలను, కన్సార్ట్స్, పాటలనూ, రచనలనూ పదహారేళ్ళపాటు నిషేధించారు 1968లో నిషేధం తొలగింది సీగర్ గొంతు ఆగలేదు గాఢ్ఢదికమైన గాత్రం మళ్ళీ విజృంభించింది తెలుగు నాట గద్దర్‌లా జానపద సాహిత్యంలోని వీరగాథలను తనదైన బాణీలో విప్లవీకరించాడు 20వ శతాబ్దాన్ని వర్ణవివక్షా శతాబ్దిగా వర్ణించాడు ప్రసిద్ధ నీగ్రో చరిత్రకారుడు డూబాయ్ పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రజాసంస్కృతికి బద్ధవిరోధి అని గ్రహించిన పెట్ సీగర్ చరిత్ర పాఠాలు ఏకరువు పెట్టాడు. స్వాతంత్ర్య ప్రదాతలు, రాజ్యాంగ నిర్దేతలైన టామ్‌పైనీ, జఫర్సన్‌లు పెంచి పోషించదలచిన అమెరికాను, థోరే, లింకన్, ఫ్రెడరిక్ డగ్లస్, మార్క్‌ట్వైన్, డూబాయ్‌లాంటి మహనీయులు వృద్ధిలోకి తేవాలని కలలు కన్న అమెరికాను పాలకులు నాశనం చేస్తున్నారని సీగర్ ఆవేదనచెందాడు కలుషితమవుతున్నవి నదులూ, గాలీ, వీధి వాతావరణమే కాదు,కలవారికీ లేనివారికీ మధ్య అగాధం కూడా పెరిగిపోతున్నందుకు, ప్రజలలోని వివిధ వర్గాల మధ్య అంతరాల దొంతరలు పేరుకు

పోతున్నందుకు నేడు తన డెబ్బయ్యేడవ ఏటకూడా బాధపడుతున్నవాడు పెటీ సీగర్ వీరగాథల కాణాచి అయిన జానపద సాహిత్యాన్నీ గీతాలనూ మానవ విమోచనకు వారి సుఖశాంతులకోసం మలచిన జానపద గాయకుడూ, వాగ్గేయకారుడూ సీగర్ ప్రజా కళను తిరిగి ప్రజలకోసం పునరుద్ధరించిన సీగర్ అమెరికాలోని 50 రాష్ట్రాలు పర్యటించి నూతన బాణీలకు ఒరవడిపెట్టాడు గేయకర్తగా సాహిత్యాన్ని ప్రజాయత్తంచేశాడు 1960లలో అమెరికాలో జానపదసాహిత్యం, కళలపై ఆసక్తిని పునరుద్ధరించి పెంచిన మహోద్యమానికి నాయకుడు సీగర్ బకింగ్‌హామ్ నుంచి పశ్చిమ బెంగాల్‌దాకా, న్యూయార్క్‌నుంచి ఢిల్లీ, తిరువనంతపురం, కలకత్తా, బెంగుళూరులదాకా పెటీసీగర్ సాగించిన సంస్కృతీ యాత్రలు మరపురానివిగా సంస్కృతీపరులు భావిస్తారు పలుఖండాలలో సీగర్ చేసిన ప్రసంగాలు, ప్రకటనలు, ప్రదర్శనల విశేషాలను జోమెట్కాఫ్ స్వార్ట్జ్ సంకలనం చేశాడు *(The Incomplete Folk Singer)* ఈయన 19వ శతాబ్దంలో తొలి జానపద సాహిత్య సంకలనకర్తలైన జాన్ లోమాక్స్, సెసిల్ షార్ప్‌ల సంప్రదాయాలను పరిశీలించినవాడు "కౌబాయ్ బ్యాలే" (నృత్యసంగీత నాటకం)లలో కళాసృష్టిని జానపదుల సందేశాన్ని లోమాక్స్ కనిపెట్టాడు 1927లో కారల్ శాండ్‌బర్గ్ సంకలనం "ది అమెరికన్ సాంగ్ టాగ్" ఆధారంగా సీగర్ సొంత గొంతుకను పెంచుకున్నాడు సీగర్ నిరసనోద్యమ గీతాలలో ఒకటి - ప్రసిద్ధి పొందిన "యు ఆర్ మై సన్‌షైన్"।

కళాకారుడికి సరిహద్దులు ఉండవు కాని నేలవిడిచి సాము చేయకూడదు ఈ జ్ఞానం ఉన్న సీగర్ రష్యా, చైనాలు అమెరికా నుంచి నేర్చుకోగలిగిన పాఠాలున్నట్టే, అమెరికా కూడా రష్యా, చైనాలనుంచి నేర్చుకోదగిన గుణపాఠాలెన్నో ఉన్నాయని భావిస్తాడు అలాగే అందరమూ కలిసి ఆఫ్రికన్ సంస్కృతీ విలువలనుంచి నేర్చుకోదగిందీ ఎంతో ఉందన్నాడు। జానపదసాహిత్యంలో కొత్తపాతల మేలు కలయికను సాధించిన ఊడీడా గథ్రీ, లీడ్ బెల్లీ, ప్రజాగాయకుడైన సీగర్ పరిశోధననూ, ఆలోచనా స్రవంతినీ ప్రభావితంచేసిన వాగ్గేయకారులు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఊడీ ఆయుధం "గిటార్" వాద్యం అనటోల్ ఫ్రాన్స్ ఆదరించినట్టే పాట మానవుల బాటను తీర్చిదిద్దింది, 'గిటార్' ఫాసిజానికి ఉచ్చుగా మారింది. ఊడీ సందేశమే జనసందోహంగా మారింది 'గిటార్' ఫాసిస్టులపై ఎక్కుపెట్టిన 'మారణా యుధం'గా తయారైంది. *("Guitar is the machine that kills fascists")* ! ఆ "గిటార్"కు వారసుడే 'బంజో' వాద్య విద్వాంసుడు పెటీ సీగర్ యుద్ధానంతరం కూడా 'గిటార్' ధ్వనులు వినిపిస్తూనే ఉండాలన్నాడు ఊడీ। ఎందుకట? సంపన్నులు తమ అధికారాన్ని కోల్పోకుండా సైనికాధికారులైన జనరల్స్‌నుంచి సహాయాన్ని అర్థించినపుడల్లా ఫాసిజం తలెత్తుతూనే ఉంటుందని హెచ్చరించాడు। కనుకనే ఈ భూమ్మీద జానపదులున్నంతకాలం జానపద గీతాలూ, సంస్కృతీ, ఆటపాటలూ అజరామరం అంటాడు సీగర్. గానమే ప్రాణంగా సంగీతజ్ఞులైన కుటుంబంనుంచి వచ్చిన సీగర్ వినమ్రతతో పేరుపేరునా తన ముందు తరాలకు చెందిన గీతాకారులూ, సంగీత విద్వాంసులూ అయిన బాబ్ డిలాన్, జోయి బిల్, స్టీఫెన్ ఫాస్టర్, జాన్ బ్రన్నర్‌లకు నివాళులర్పించాడు చిత్రకారుడు కూడా అయిన సీగర్ దృష్టిలో "సంగీత ప్రపంచంలో ఎదురయ్యే ప్రశ్నలన్నింటికీ సమాధానాలు తెలిసిన వాగ్గేయకారుడెవరూ ఉండరు"। పాట తెలిస్తేనే చాలదు, ఆ పాట వెనుక కథానాయకులైన ప్రజల మనోభావాలు పట్టుకోగలిగిన వాడే, స్పందించగలవాడే గాయకుడూ, గేయకారుడూ అన్నాడు। ప్రాచీన, అర్వాచీన జానపదసాహిత్య సంపదకు వారసుడైన సీగర్ గురించి ఊడీ

రాసిన పాట ప్రజాగాయకుని విస్తృతిని వివరిస్తుంది *"Ah, he just stole from me/But I steel from everybody/Why, I am the biggest song stealer there ever was"!* సీగర్ "పీపుల్స్ సాంగ్స్" పత్రికనూ, "సింగ్ అవుట్" మాగజైన్‌నూ నడిపాడు 1963లో అమెరికాలో తలెత్తిన "సదరన్ ఫ్రీడమ్ మూవ్‌మెంట్" ఉద్యమం ఆధారంగా జానపద గేయాలను ఇక్కడ గద్దర్ మాదిరే రాజకీయ సందేశాలుగా మలిచి బహుళవ్యాప్తిలోకి తెచ్చాడు సీగర్ అప్పుడే కాదు, అంతకుముందు 1954లో కూడా పౌరహక్కుల రక్షణోద్యమానికి మేధావులను కుదిపి వీధులలోకి కదిలించిన సుప్రసిద్ధ భౌతిక శాస్త్రవేత్త డాక్టర్ ఐన్‌స్టీన్ సందేశంతో ఉత్తేజితుడైన ప్రముఖులలో సీగర్ ఒకడు వ్యక్తిస్వేచ్ఛకు బాసటగా నిలిచిన రాజ్యాంగ హక్కుల్ని భంగపరిచే ఎలాంటి పూచీకత్తులు ఇవ్వడానికి వీలులేదని నిరాకరించమని ఐన్‌స్టీన్ మేధావులను హెచ్చరించాడు! ఆ సహాయ నిరాకరణోద్యమంలోనే సీగర్ ఏడాది జైలు శిక్ష అనుభవించాడు నీ జీవనానికి మరో మార్గం దొరకనప్పుడు మాత్రమే, మరో అధరువు లేనప్పుడు మాత్రమే కమర్షియల్ ఆర్టిస్ట్‌గా కొన్నాళ్ళు కాలక్షేపం చేయమన్నాడు గాని, అదే వృత్తిగా పెట్టుకోరాదన్నది సీగర్ భావన లక్ష్యసాధనలో అతని కేంద్రీకరణకు ఉదాహరణ కళోపాసనలో మనస్సును లగ్నం చేయడమంటే అర్థం కొన్నాళ్ళు సొంత సుఖాలు వదులుకోవడం అన్నాడు *"Forget the dishes, forget the beds, and the sweeping for a while"!!* ఆ స్ఫూర్తితోనే అతను ఆటోహార్ప్, ఉకులూలీ, బంజో, గిటార్, పియానో, డల్సిమోర్ లాంటి విభిన్న వాద్యాలను మీటాడు! శాంతి ఉద్యమదశలో *"We shall over come"* పాటతో, యుద్ధవ్యతిరేక ఉద్యమంలో *"Where have All the flowers Gone"* గీతంతో, వియత్నాం ఘోరకలిలో *"If I had a hammer"* అన్న గేయంతోనూ, శ్రోతలను ఆకట్టుకున్నాడు ఇండియాలో రవీంద్ర సంగీతానికి తోడుగా 'జనగణమన', 'రామ్‌దున్' పాటలు పాడి శ్రోతలను ఉర్రూతలూగించాడు జోలపాటలేకాదు, లాలిపాటలు కూడా సీగర్ ముని వేళ్ళు తాకితే చాలు అమరగీతాలయ్యాయి!

ఆదివారం 15, డిసెంబర్ 1996

# నవలా ప్రపంచంలో కుండేరా 'దండోరా'!

దీర్ఘాలు తీసేవాడు, దుందుడుకుగా చదివేవాడు, తలను ఊరకే ఆడించేవాడు, వ్రాత చూసి చదివేవాడు, అర్థం తెలియక చదివే వాడు పాఠకులలో అధములన్నాడు భర్తృహరి నీతిశతకంలో! వ్యక్తిత్వ వికాసాలను అభిమానించే రచయితలూ, స్పష్టతను కోరుకునే భావుకులూ, సమాజ శ్రేయస్సును కాంక్షించే నవలాకారులూ, కథకులూ, కవులూ, కళాకారులూ మానవ జీవితాన్ని దర్శించే తీరేవేరు అలాంటి అగ్రగామి పాశ్చాత్య నవలాకారుల్లో ప్రసిద్ధ నీతివాది అయిన మిలన్ కుండేరా ఒకరు రచయితలు కొన్ని సందర్భాలలో సమాజం తమపై ఉంచిన బాధ్యతలను ఎలా విస్మరించి, వ్యక్తి ప్రయోజనం పేరిట విశృంఖలతను ఎలా ప్రోత్సహిస్తున్నారో కుండేరా ఆవేదన వ్యక్తం చేశారు ఆయని మధురోహల తాజా సంపుటి, సహరచయితలకు విజ్ఞాన పేటి "టెస్టమెంట్స్ బిట్రేడ్" *("Testaments Betrayed")* ఉల్లంఘించిన కట్టుబాట్లు నిబద్ధతా వాతావరణంలో పెరిగిన మిలన్ కుండేరా చెకోస్లొ

---

******ఈ సంపాదకీయం చదివిన తరువాత ఒక పాఠకుని స్పందన ఈ లేఖ "Testaments betrayed" అన్న కుండేరా పుస్తక మకుటం వెనుక గాథను తెలుపుతూ అదనపు సమాచారాన్ని సమకూర్చారు కుండేరాపై అవగాహనకు ఈ లేఖ భాగాన్ని పొందుపరుస్తున్నాను - రచయిత*

*ఈ శతాబ్దపు ప్రముఖ రచయితలలో ఒకరైన ఫ్రాంజి కాఫ్కా మరణానికి ముందు తన "వీలునామా"ని తన మిత్రుడయిన మాక్స్‌బ్రాడ్ అనే వ్యక్తికి వ్రాసిన రెండు ఉత్తరాల రూపంలో వదిలి వెళ్ళిపోయాడు అందులోని ఒక ఉత్తరంలో తాను అంతవరకు వ్రాసిన తన రచనలన్నింటిని తగలబెట్టెయ్యవలసిందిగా తన కోరికను వ్యక్తపరుస్తాడు కాఫ్కా అయితే అందుకు విరుద్ధంగా కాఫ్కా స్నేహితుడైన బ్రిడ్, కాఫ్కా రచనలన్నింటిని, చివరికి ఉత్తరాల రూపంలో ఉన్న అతని "వీలునామా" (విల్ అండ్ టెస్టమెంట్)తో సహా ప్రచురించి ముందు తరాల కోసం భద్రపరుస్తాడు ఇలా చెయ్యడంలో, కాఫ్కా అతని స్నేహితుడయిన బ్రాడ్ చేతిలో నమ్మకద్రోహానికి గురి అయ్యాడా? లేక కాఫ్కా రచనల్ని, రానున్న కాలానికి సంబంధించిన కాఫ్కా జోస్యాన్ని ముందు తరాలకు భద్రపరిచి అందించాలనే సదుద్దేశ్యం బ్రాడ్‌చేత ఈ పనికి పురికొల్పిందా? అన్నవి అంత సులభంగా సమాధానం చెప్పకోలేని ప్రశ్నలు కాఫ్కా రచనల్లో "ది ట్రయల్"అనే పుస్తకం ఎంత ప్రసిద్ధి పొందిందో, ప్రపంచ వ్యాప్తంగా పలువురు మేధావులచేత ఎన్నెన్ని దృక్కోణాల్లోంచి అర్థం చేసుకోబడి వ్యాఖ్యానించ బడిందో వేరే చెప్పక్కర్లేదు. కాఫ్కా కోరిక మేరకు బ్రాడ్ గనుక కాఫ్కా రచనలన్నింటిని అప్పుడే మసిచేసి ఉండినట్లయితే ఈ రోజు ప్రపంచ సాహిత్యానికి "ది ట్రయల్" లాంటి మంచి పుస్తకం దక్కి ఉండేదికాదు తన స్నేహితునికి బ్రాడ్ చేసిన నమ్మక ద్రోహం వల్లనే ఇది సాధ్య మయిందన్నది స్పష్టం అయితే కాఫ్కా కోరికకు విరుద్ధంగా అతని రచనలన్నింటిని మరణానంతరం అచ్చువేయించి బహిర్గతం చెయ్యడం నైతికంగా ఎంతవరకు న్యాయం? అన్నది అసలు ప్రశ్న ఏదేమయినా ప్రపంచ సాహిత్యానికి "ది ట్రయల్" పుస్తకం దక్కింది "టెస్టమెంట్స్ బిట్రేడ్"ని తెలుగులోకి అనువదించుకోవాల్సి వస్తే "మన్నన పొందని మరణ శాసనం"గా అనువదించుకోవచ్చేమోనని నాకనిపిస్తుంది*

వేకియాపై సోవియెట్ సేనల ఆకస్మిక దాడివల్ల మనస్సు చెల్లా చెదురై తాను నమ్ముకున్న వ్యవస్థే తన మాతృదేశాన్ని కుమ్ము తున్నప్పుడు కుపితుడైపోయాడు అయితే మానసిక కల్లోలానికి కొంతకాలం గురైనప్పటికీ సహేతుకమైన దృష్టిని మాత్రం ఆయన కోల్పోలేదు రాజకీయాల అస్థిరతకులోనైన ఆనాటి చెకోస్లావేకియా పరిణామాలను గమనించిన దరిమిలా ఆయని తొలి నవల "జోక్"కు చెక్ రచయితల సంఘం అవార్డు ప్రకటించి సత్కరించినా పాలకవర్గం ఆ రచనను తమను ఆటపట్టించిన వ్యంగ్య చిత్రణగా భావించింది దానిఫలితంగా "జోక్"తో సహా మరి రెండు నవలలను ("లైఫ్ ఈజ్ ఎల్స్ వేర్", "ఫేర్‌వెల్ పార్టీ") కూడా బహిష్కరించింది జాతీయ పుస్తక భాండాగారాలనుంచి తొలగించింది నిజానికి ఈ రెండు నవలలకు పెట్టిన పేర్లు మాతృదేశంలో కుండేరాకు తారసిల్లిన అవమానాలకు ఆనవాళ్ళుగా నిలిచిపోయాయని చెప్పాలి దేశాన్ని విడిచి సర్వమానవ సమానత్వానికి పెద్దపీట వేసిన రూసో, వోల్తేర్‌ల సంప్రదాయంలో ఎదిగి వచ్చిన ఫ్రాన్స్‌లో స్థిరపడవలసి వచ్చింది కుండేరా. పాశ్చాత్య ప్రపంచంలో నవల, సంగీతం ద్విగుణీకరిస్తూ సంస్కృతీ జీవనంలో పడుగుపేకలా అల్లుకుపోయిన రెండు విశిష్టలతలు పాత్రపోషణలో, జీవన చిత్రణలో రబెలా, సర్వానెట్స్ ఇతనికి గురుతుల్యులు కళాకారుని, చిత్రకారుని వ్యక్తిత్వానికి అతని నైతిక హక్కులకూ గొడుగుపట్టిన కుండేరా మన రా వి శాస్త్రి, కాళీపట్నం రామారావులకు కథాచిత్రణలో, చమత్కార

---

*ఇక కుండేరాపై కాఫ్కా రచనల ప్రభావాన్ని గురించి కాస్త. "అధికార యంత్రాంగపు దురాగతాలకు వ్యతిరేకంగా మానవుడు సలిపే పోరాటం-మరపునకు వ్యతిరేకంగా జ్ఞాపకం సలిపే పోరాటంవంటి"దని నిర్వచించాడు కుండేరా తన "ది బుక్ ఆఫ్ లాఫ్టర్ అండ్ ఫర్‌గెటింగ్" అనే పుస్తకంలో ఒక మహా నియంత ఆలోచనలకు, మాటలకు, చేతలకు వ్యతిరేకంగా మాటలు కలిపిన ప్రతి స్వాప్నికుడూ నిర్బంధించ బడి, హింసించబడి, దేశ బహిష్కృతుడయిన దృష్టాంతాలు చరిత్ర గతిలో ఎన్నో కమ్యూనిజం పేరుతో స్టాలిన్ పాలనలోని రష్యా ఆక్రమిత చెకొస్లోవేకియా (1968)లో కాఫ్కా తన రచనలలో ఏదైతే ఊహించాడో దాన్ని కుండేరా సజీవంగా అనుభవించాడు నేరం చేసిన వ్యక్తి పాలన యంత్రాంగపు న్యాయ వ్యవస్థ నుండి శిక్షను ఎదురు చూడడం సహజం, న్యాయం అయితే కమ్యూనిజం పేర స్టాలిన్ నియంతృత్వ పాలనలో శిక్షితుడయిన "నేరస్తుడు" తాను చేసిన నేరం గురించి తెలుసుకోవడానికి విఫల ప్రయత్నం చేసి చివరికి నేరాన్ని అర్థిస్తాడు అని విశదీకరిస్తాడు కుండేరా "సమ్‌వేర్ బిహైండ్"అనే మరొక వ్యాసంలో. అప్పటికి ఒక అర్థ శతాబ్దం క్రితమే కాఫ్కా ఈ పరిస్థితిని ఊహించగలిగాడు*

*కల్పన అయినా కాఫ్కా నవల "ది ట్రయల్"లోని జోసఫ్ కె అనే పాత్ర పరిస్థితికీ వాస్తవంలో కుండేరా పరిస్థితికీ పెద్ద తేడా కనిపించదు. అందుకనే కుండేరాను "ది అదర్ జోసెఫ్ కె. ఫ్రమ్ చెకొస్లోవేకియా" అన్నారు పుట్టి పెరిగిన నగరం అయిన ప్రాగ్‌ని వదిలి 1975 లో పారిస్‌కు వలస వెళ్ళిపోతాడు కుండేరా. వెళ్తూ ప్రాగ్ నగరాన్ని "తనతోపాటు ఒక అందమయిన పద్యాన్ని మాయం చేస్తూ కాలిపోతున్న కాగితం"గా అభివర్ణిస్తాడు*

*కుండేరా జీవనాన్ని, ఆలోచనా సరళిని ఎంతగానో ప్రభావితం చేసినవాడు కాఫ్కా.*

*-వి వెంకటరావు,*

*సికిందరాబాద్.*

పొకడలలో సమ ఉజ్జీ కాగలుగుతాడు  ఒక నవల పఠనం పూర్తి చేశావంటే, ఆ నవల ప్రారంభాన్ని, దాని ఎత్తుగడను గుర్తుంచుకోగలగాలని చెప్పినవాడు కుండేరా  అనవసర సన్నివేశాలను గుప్పించి విసిగించే అంశాలతో పాఠకుని బుర్రను తినివేసే ఘట్టాలను ఆయన ఏవగించుకుంటాడు. కనుకనే కథనం పేరిట చారిత్రక పూర్వరంగాన్ని గుప్పించి కథాగమనాన్ని కుంటుపరిచే పద్ధతిని కుండేరా "పోలీ హిస్టారికల్" *(polyhistorical)* అని వర్ణించాడు. అయితే అయన సీతాకోక చిలుకలా ఉల్లాసంగా గడిచిపోయే నిరాసక్త ధోరణిని నిరసిస్తాడు!

ఒక నవల ముగింపు నీతి వాక్యంతో విధిగా ముగియాలా లేక రచయిత ఎలాంటి తీర్పునివ్వకుండా పాఠకులకే కథనుబట్టి పరిష్కారాన్ని ఊహించుకునే విధంగా అలా వదిలివేయాలా అన్న మీమాంస కుండేరా చేశాడు  దేశపరిస్థితులు, ప్రవాస జీవితానుభవాలు, రచనానుభవాలు కలబోసి - నైతికమైన తీర్పును చెప్పకుండా కథకుడు వదిలేయడం అవినీతికి చిహ్నంగా భావించరాదని ఆయన అంటాడు  ఎందుకని? సాధారణంగా మానవ స్వభావం- అన్ని పరిస్థితులను, పరిణామాలను క్షుణ్ణంగా పరిశీలించకుండానే త్వరపడి ఓ నిర్ణయానికి రావడమూ, అది ఆధారంగా అవగాహన కలగకుండానే తీర్పరి కావడమూ  అందువల్ల కథనంలో పాత్రల మధ్య ఘర్షణ కేవలం రచయిత నీతి సూత్ర పరిధులకు బందీ అయి సాగకూడదన్నది కుండేరా భావన  మీకు నచ్చకపోతే ఒక పుల్లయ్యని పిరికివాడనో, ఒక ఎల్లయ్యను దగుల్బాజీ అనో ఆరోపించుకోవచ్చు  అది వ్యక్తిగతం  కాని నవలాకారుడు ఆ పాత్రను తానై పుచ్చుకోకూడదు

వినమ్రతలో కుండేరా ఎవరికీ తీసిపోడు  బహుశా ఈ అతివినయంతోనే అతను తనను గురించి తానే డబ్బా వాయించుకోడానికి ఎన్నడూ ఇష్టపడలేదు  "అన్ బేరబుల్ లైట్‌నెస్ ఆఫ్ బీయింగ్" అన్న రచన కుండేరా ప్రశస్తినడమంత్రపు సిరి కాదు, ఎదురేగి నడిచి వచ్చిన సిరి  నవలా రచనకు కుండేరా కల్పించిన విశిష్టత అంతా ఇంతా కాదు  "ముగింపులేని ఈ ప్రపంచాన్ని బొడ్లో చేయివేసి ఎప్పటికీ ప్రశ్నించగల అవకాశాన్ని మానవుడికి ప్రసాదించిన చివరి మజిలీ నవల" అంటాడు కుండేరా!

ఆధునిక ప్రపంచంలో మానవుని అస్తిత్వం చిక్కుముడులతో కూడి ఉందని భావిస్తున్న కుండేరా ఆ సమస్యల పరిష్కారానికి జాగ్రత్తగా అన్వేషించాలని సూచిస్తాడు  ఆకుకు అందని పోకకు పొందని అంశాలతో, నిరుపయోగమైన ఘట్టాలతో, ఉబుసుపోని చెత్తతో నవలా పాత్రలనూ, రచనాశక్తినీ దుర్వినియోగం చేసుకోరాదన్నది కుండేరావేసిన దండోరా  బహుశా అందుకనే కాబోలు ఫ్రాన్స్‌లో "కవిలకట్టలకంటే భావధారనే, సరికొత్త భావాలనే ప్రజలు ప్రేమిస్తార"న్నది ఒక సామెత  ఆ సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకున్నవాడు కుండేరా.  తను నిరసిస్తున్న వర్తమాన ప్రపంచానికి సాహితీ క్షేత్రంలో ఉత్తమ వ్యాఖ్యాతగా కుండేరా నిలిచి పోతాడు

ఆదివారం ఫిబ్రవరి4, 1996

# ఛాందసాలపై చాకులూ బాకులూ దూసిన "పాజ్!"

గాంధీజీకి థోరే, ఎమర్సన్‌లు ఎందుకు దగ్గర వాళ్ళయ్యారు? టాల్‌స్టాయ్, షోఫనోవెర్‌లకు భారతీయ దర్శనాలు ఎందుకు నచ్చాయి? సామాజిక పురోగతిని సాధించి మానవాళిని ముందుకు నడిపించడానికి సంప్రదాయాలలోని మంచిని పాటిస్తూనే ఛాందసభావాలను వదిలించుకోవాలన్నది తొలి వేదాల, ఉపనిషత్తుల సారం జ్ఞానమే మోక్షంగాని ఛాందస సంప్రదాయాలు కావనీ ("జ్ఞానాదేవ తు కైవల్యమ్"), మతాలలో చొరబారిన దురాచారాలను ఖండించిన ఉపనిషత్‌లు ఘోషించాయి అయినా చారిత్రకంగా, సాంస్కృతికంగా మనకు వర్తించని కొన్ని ఛాందసాలనుతలకెత్తుకొని సర్వమత సామరస్యాన్ని, సమభావ దృష్టినీ నేడు చెడగొట్టజూస్తున్న కొన్ని మతశక్తులు ఇండియాలో తలెత్తి విజృంభిస్తున్న దశలో ఇండియాలో సుమారు ఆరేళ్ళపాటు మెక్సికో రాయబారిగా పనిచేసిన సుప్రసిద్ధ లాటిన్ అమెరికన్ కవులలో ఒకరు ఇటీవలనే సాహిత్య రంగంలో నోబెల్ బహుమతి పొందిన ఆక్టావియో పాజ్ అభిప్రాయాలు మనకు ఆదర్శం కావాలి స్పానియార్డ్‌ల సామ్రాజ్య విస్తరణకు లోనై సుమారు మూటయాభయ్యేళ్ళ పరాయి పెత్తనం కింద నలిగిపోయిన అనేక లాటిన్ అమెరికన్ దేశాలలో ఒకటైన మెక్సికో ప్రజల సుఖదుఃఖాలకు ప్రత్యక్ష సాక్షిగా నిలిచిన కవీ, రచయితా, వీను మిగిలిన దౌత్య వ్యవహర్త లోగడ సాహితీ రంగంలో ప్రకటించిన నోబెల్ బహుమానాలను పాబ్లో నెరూడా, జాపోల్ సార్త్‌లాంటి ఉద్దండులు సహేతుకమైన కారణాలపైన తిరస్కరించినా, ఇప్పుడు పాజ్ అదే పురస్కారానికి సమ్మతించినా లాటిన్ అమెరికన్ అభ్యుదయ సాహిత్యోద్యమంతో, దోపిడీ వ్యవస్థలపై సాగిన నిరసనోద్యమాలతో, మానవజాతిపై సామ్రాజ్యవాదులు తలపెట్టిన దురాక్రమణ యుద్ధాల నిరసన పరంపరతో నెరూడా, పాజ్‌లు నిరంత[illegible] సంబంధాలున్న మహారచయితలు "గానములేక ప్రాణములేద"ని మనకిక్కడ కృష్ణశా[illegible] గొంతెత్తి చాటినట్టే పాజ్ "చావనైనా చస్తాను గాని కవితలల్లకుండా ఉండలేను" అని [illegible]వాడు కవిత్వంలో మార్మికతను ఆశ్రయించినా ధార్మికతను వదులుకోనివాడు [illegible] [illegible]ధికారహోదాలో దౌత్యానికీ సత్యానికీ మధ్య ఘర్షణ చెలరేగినప్పుడు లోకం కోసం [illegible]' పేరిట నాటకం ఆడలేక దౌత్యోద్యోగి పదవికే రాజీనామా చేసినవాడు పాజ్ సరిగ్గా [illegible]వై రెండేళ్ళనాడు ఇదే నెలలో (అక్టోబర్ 2న) మెక్సికో నగరంలోని ఒక ప్రాంతంలో విద్యార్థి ఉద్యమకారులపై నిర్బంధ విధానానికి నిరసనగా ప్రదర్శనలు జరుపుతున్న యువకులపై పోలీసులు కాల్పులు జరిపి వందలాది మంది యువకులను పొట్టనపెట్టుకున్నప్పుడు క్రుద్ధుడైన పాజ్ తన పదవిని కాలితో తన్నినవాడు స్పానిష్ అమెరికాను పట్టిపీడిస్తున్న రాజకీయ, చారిత్రక ఛాందసాలేమిటో ఆయనకు తెలుసు ముందు ఆ మత్తునుంచి ప్రజలను బయటకు లాగితే తప్ప సామాజిక ప్రగతీ, ఆర్థిక దోపిడీ నిర్మూలన సాధ్యపడదని నమ్మినవాడు పాజ్ సాహిత్య, కళారంగాలలో, రాజకీయ రంగంలో, మానుష శాస్త్రంలో నిష్ణాతుడైన పాజ్, యూరోప్ దేశాలను ప్రభావితం చేసిన ఆధునిక కళా, సాహిత్యాలకు వారసురాలుగా ఎదుగుతూ వచ్చిన లాటిన్ అమెరికన్ సంస్కృతికి ఉత్తమ ప్రతినిధులలో ఒకరుగా రాణించిన వాడు థోరే, ఎమర్సన్, వాల్ట్ విట్‌మన్ మాదిరే ఆక్టావియో పాజ్ కూడా మన వైదిక, బౌద్ధ సంప్రదాయాలలోని ప్రగతిశీలమైన ధోరణులను ఆకళింపు చేసుకున్నవాడే కనుకనే అతను ఇండియాలో రాయబారిగా ఉన్న సమయంలో పెక్కు ప్రాంతాలను, కళాక్షేత్రాలను విజ్ఞాన విహార

యాత్రాకేంద్రాలను సందర్శించి సమ్మోహితుడైపోయి "ది ఈస్టరన్ స్లోప్" ("ప్రాగ్దిశా గతి") అన్న మకుటంతో ఒక కవితా సంపుటిని ప్రకటించాడు! అతని రచనలలో మనకు "పూసల్లో దారం"లా కనిపించే సత్యం - సమాజాలు పోనుపోను వ్యక్తుల స్థాయిలోనూ, వ్యవస్థాగతంగానూ కూడా మానవీయం కావాలన్న ఆకాంక్ష, ప్రజాస్వామిక సంప్రదాయాలు, పద్ధతులు పరిఢవిల్లాలన్న తపనా. గురజాడవారి "నీలగిరి" పాటల్లాగా, "ఊటి చోద్యమేమిచెపుదు, ఉవిద నేర్పునే" లాంటి పాటల్లాగా గంగ, బృందావనం, ఉదకమండలం మకుటాలతో పాజ్ మార్మికంగానే అయినా, భావగర్భితంగా చెప్పి పాఠకుణ్ణి గిలిగింతలు పెట్టిస్తాడు బరువైన భావాలను బట్వాడా చేస్తాడు శ్రీశ్రీలాగానే సుమారు యాభై ఏళ్ళపాటు ఎడతెగకుండా కవితా గానం చేస్తూ వచ్చిన పాజ్, స్పెయిన్‌లో చిలీ కాన్సల్‌గా పనిచేసిన పాబ్లో నెరూడా లాంటి విప్లవ కవీ గిన్స్‌బర్గ్ లాంటి నిరసన కవీ

నిత్యజీవితంలో కవితా వ్యసనానికి ఉన్న పరిమితులు కూడా అతనికి తెలుసు నోబెల్ బహుమతికి ఉబ్బిపోకుండానే పాజ్, బహుమానంవల్లనే మనిషి అజరామరుడు కాకపోయినా, కవి గొంతును ఇంతకు ముందుకంటే ఎక్కువ సంఖ్యలో జనం వినడానికి పురస్కారం ఒక అవకాశం కల్పిస్తుందని నమ్రతగా ప్రకటించాడు! ఈ రోజుల్లో కవిత్వం ఒక పాపులర్ ఆర్ట్ కాకపోవచ్చుగాని, "మానవ జీవితంలో ఒక ముఖ్య వ్యాపకం" అని భావించిన పాజ్ గొప్ప భావదృశ్యాలు చూపించినవాడు భావ ప్రకటనకు భాష ఎన్ని తలుపులు తెరిచి చూపుతుందో ప్రతి నూతన సంవత్సరం ద్వారాలు అలా వివృతమవుతాయంటాడు *"The year's doors open like those of language toward the unknown"* పదాల పొందికలో 'భావ వ్యక్తీకరణలో' భాషా ప్రయోగంలో కొత్త పోకడలు పోతూ *"Snow on the houses, Silence on the snow"* అంటాడు! "వ్యాలీ ఆఫ్ మెక్సికో" రచన అతని అద్వైత భావనకు ఒక తార్కాణం తననొక నిమిత్తమాత్రుణ్ణిగా భావించుకుని మానవ సంబంధాలకు మేలిమి వారధిగా మెలిగిన వాడు పాజ్ *("I am pure space, the battle ground")!* గుడిపాటి వెంకటచెలం 'మహాప్రస్థానం' రచనకు రాసిన పరిచయంలో ధైర్యం, చావ ఉన్నవాళ్ళే ఈ పుస్తకం తెరవమన్నట్టుగా పాజ్ కూడా తన కవితను ఆస్వాదించదలచిన వారిని *"Peer into its song, throw yourself into the fire"* అని రెచ్చగొడతాడు! స్వార్థం ఆశించి చేసేది స్నేహం కాదని చెబుతూ, తన స్నేహం నిర్గుణం, నిరాకారం, నామరూపరహితం అంటాడు *"There is none here Presence without name surrounds me"* అని అంటాడు దేశాన్నీ , భాషనూ చిరంజీవులను చేసేది కవితాత్మఅనీ, కవితాస్ఫూర్తికి దూరంగా ఉన్న వాళ్ళకు వాచోవిధేయత కొరవడుతుందని అంటాడు! అతని తొలి కవితా సంపుటి "ది లేబిరింత్ ఆఫ్ సాలిట్యూడ్"కాగా, 1989 లో వచ్చిన విశిష్ట కవితల కదంబం "ది బెస్ట్ ఆఫ్ ఆక్టావియో పాజ్" మరో లాటిన్ అమెరికన్ ప్రసిద్ధ రచయిత, 1982 నోబెల్ బహుమతి పొందిన "వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్" (వందేళ్ళ ఏకాంత వాసం) గ్రంథకర్త అయిన గాబ్రేల్ గార్సియా మార్క్వేజ్ లాగా పాజ్ కూడా - ఈ భూఖండంపైన చివరి మానవుడు దోపిడీ నుంచి, అక్రమాలనుంచి విముక్తి పొందే దాకా దుష్టశక్తులపై మానవుని పోరు తప్పదని విశ్వసించిన వాడు ఒకనాటి సీరియస్ మార్క్సిస్టుగా పాజ్ కాలక్రమంలో హోవార్డ్ ఫాస్ట్‌లాగా పిడివాద ధోరణులకు, అసహన వైఖరులకూ దూరంగా జరిగినప్పటికీ అభ్యుదయ మార్గం నుంచి మళ్ళినవాడుకాడు. చేసిన తప్పును ఒప్పుకోనివాడు సత్యవాది ఎలా కాలేడో, సోషలిస్టునని చెప్పుకొనే వాడు కూడా అంతేనని పాజ్ వాదన! శతాబ్దం పాటు

ఎదుగుబొదుగు లేకుండా సుఖశాంతులకు నోచుకోకుండా తరతరాల దోపిడీలో నలిగిపోయిన కొన్ని జాతులకు ఈ శతాబ్దంలో కూడా ఈ భూమిపైన పునర్జన్మ (జీవించగల మరో అవకాశం) లేకపోవడం దారుణమన్నాడు మార్క్వెజ్ "ఈ శతాబ్దపు మొదటి తరం వాడ్ని చెట్టుకు కట్టేశారు కడగొట్టు బిడ్డను చీమలు పీక్కుతింటున్నాయ"ని దోపిడి వ్యవస్థ స్వభావాన్ని వ్యంగ్యంగా చిత్రించాడు! అదే మాటను పాజ్ కూడా నొక్కిచెబుతూ, రెండు ప్రపంచ యుద్ధాలను, కాన్సన్ట్రేషన్ క్యాంపులను చూచిన ఈ శతాబ్దం క్రూరమైనదని బాధపడతాడు అదే సమయంలో, క్యాంపులలో అకృత్యాలకు ఆహుతైన కవులను తలచుకుంటూ 'స్వేచ్ఛాసమాజానికి స్వాగతం పలుకుతాడు

అక్టోబర్ 19, 1990

# వ్యధార్త జీవిత యధార్థ చిత్రం "పౌలా"

రాశికెక్కిన రచనలు ఎన్నయినా వాసికెక్కినవి కొన్ని మాత్రమే ఉంటాయి గులకరాయి విలువ గులకరాయిదే రత్నం విలువ రత్నానిదే వస్తువును బట్టి గుణాన్ని గ్రహిస్తాం ప్రవర్తనను బట్టి మనిషికి విలువకడతాం కథగాని, కావ్యంగాని, నవలగాని, నాటకంగాని- చివరికి తమ ఉనికిని సాంఘిక ప్రయోజనం దృష్ట్యానే సమర్థించుకోవలసి వస్తుంది అవధాన విద్యలు సొంత డబ్బా కొట్టుకోడానికి పనికి వస్తాయేగాని సంఘానికి మేళ్ళు చేకూర్చలేవన్నాడు చెళ్ళపిళ్ళ అంతటి శతావధాని కూడా అలాగే స్వీయ చరిత్రలూ, జీవిత చరిత్రలూ కూడా. ఆత్మగతమైన జీవిత చరిత్రను కథావస్తువుగా స్వీకరించి నవల రాసిన వారెందరో ఉన్నారు మన తెలుగు దేశంలో జి వి కృష్ణారావు "కీలు బొమ్మలు", కుటుంబరావు "అనుభవం", గోపీ చంద్ "పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా' అలాంటి నవలలే వాటిలో తమకాలంనాటి సంఘజీవనం, రాజకీయ, ఆర్థిక పరిణామాలు, సంఘజీవిగా రచయిత స్వీయానుభవాలూ పడుగు పేకల్లా అల్లుకుపోయి ఒక మధురానుభూతిని పాఠకుడిలో కలిగిస్తాయి కర్తవ్యాన్ని అలవోకగా బోధిస్తాయి పాశ్చాత్య సాహితీవనంలో పాబ్లొ నెరూడా "మెమోయిర్స్" తర్వాత, ఇటీవల కాలంలో జీవన సమరం నుంచి మానవీయ కథా చిత్రంగా పూచిన ఒక మోదుగ పూవు ఇసాబెల్ అలెండీ నవల "పౌలా" చిలీ పేరు చెబితే చాలు-అమెరికన్ సామ్రాజ్యవాదుల గూఢచారి సంస్థ సి.ఐ ఎ అండతో చిలీలోని ప్రగతి నిరోధక శక్తులు పొట్టన పెట్టుకున్న అభ్యుదయోద్యమ రథసారథీ, చిలీ అధినేత అలెండీ పేరు చటుక్కున గుర్తుకు రావలసిందే ఆ అలెండీ కుటుంబానికి స్నేహితురాలూ, సన్నిహితులూ ప్రాణసమానురాలు రచయిత్రి ఇసబెలా అలెండీ, ఆమె కుటుంబమూ నవల అనేక అంశాల మేలుకలయిక అది కవిత్వం కావచ్చు, అద్భుత గాథ కావచ్చు, సాహసయాత్రకావచ్చు, ఫాంటసీ కావచ్చు, తత్త్వ శాస్త్రం కావచ్చు, సూక్తిముక్తావళి, వ్యాసచంద్రిక కావచ్చు-లేదా వాటన్నింటి సమాహారంగా వెలసిన అనుభవాల పేటిక కావచ్చునన్నాడు మిలన్ కుందేరా అందులోనూ తన కుటుంబగాథను, వ్యధలతో కునారిల్లిన కుటుంబజీవిత యధార్థ దృశ్యాన్ని కళ్ళకు కట్టేట్టు చూపించగలనేర్పరితనం చిలీ ఆడపడుచు అలెండీకి వెన్నతో పెట్టిన విద్య చావు బతుకుల పొలిమేరలలో ఉన్న తనకూతురు "పౌలా"ను చూసుకొని అనుక్షణం కుంగిపోతూన్న దశలో అలెండీలో ఆత్మస్థయిర్యాన్ని కల్పించింది ఆమె సాహిత్య స్పృహ ఆసుపత్రి కేంద్రంగా అలెండీ రాసిన "పౌలా" నవల ఒక విధంగా ఆమె స్వీయ చరిత్ర, ఆమె కుటుంబ చరిత్ర, కాదు - ఒక తరం కథ, ఒక దేశం కథ! అలెండీ రచన ఝురీవేగంతో ప్రవహించే ఒక సెలయేరు; పాతనీరును కొట్టుకుపోయే కొత్తనీటి సద్దు రచనా సంవిధానం, శైలీ విన్యాసం పాఠకుణ్ణి మంత్రముగ్ధుణ్ణి చేస్తుంది మనం ఇంతవరకు ప్రపంచంలో కులాల కంపుతో తీసుకుంటున్నది ఒక్క భారతదేశమే అనుకుంటున్నాం చిలీ చరిత్రను సోదాహరణంగా చెబుతూ అలెండీ 'ఒకనాడు ఇండియాలో కంటే ఎక్కువ కులాలతో భ్రష్టుపట్టిన సమాజం చిలీది' అంటుంది చారిత్రక దృక్పథం, సామాజిక దర్శనం, సాహిత్య పరిశీలనం, ఆయా కాలాలలో వ్యక్తులు నిర్వహించిన పాత్రలూ "పౌలా" రచనను సుసంపన్నం చేశాయి లాటిన్ అమెరికన్ సంస్కృతీ వారసత్వంలో మెక్సికన్ కుడ్య చిత్రాలకొక ప్రత్యేక స్థానం ఉంది. తన జ్ఞాపకశక్తిని అలెండీ ఆలంకారికంగా ఈ చిత్రాలతో పోల్చుకుంటుంది! ఎందుకని? మన ఊహా చిత్రాలకు తగినట్టుగా మన

జ్ఞాపకాలను కూడా మలుచు కోవచ్చునంటుంది అలెండీ! అంతేగాదు, రచయిత కాదలచుకున్న వ్యక్తికి రచనా వ్యాసంగంలోనే జ్ఞాపకశక్తి వర్ధిల్లుతుందన్నది ఆమె విశ్వాసం చెప్పదలచుకొన్న మాటల్ని కాగితంపైకి ఎక్కించకపోతే కాలం కాస్తా వాటిని తుడిచిపెటుతుందన్నది ఆమె నిశ్చితాభిప్రాయం

చిలీ ఫ్యూడల్ వ్యవస్థలో అనుభవాలను తాతముత్తాలనుంచి, జేజెమ్మలనుంచీ తెలుసుకున్న అలెండీ, చిలీ సంస్కృతీ విలువలను ఆకళింపు చేసుకున్న అలెండీ అధునాతన పెట్టుబడిదారీ సమాజంలో ప్రజల కడగండ్లను, వర్ధమాన దేశాల దారిద్ర్య బాధలనూ క్షుణ్ణంగా పరిశీలించగల శక్తియుక్తులున్న రచయిత్రి "పౌలా" రచన ఒక మనస్తత్వ శాస్త్రం, ఒక పారాసైకాలజీ, సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిణామాల వ్యాఖ్యాన చిత్రం తాతపడిన ఇబ్బందులు చూసింది నాన్న విచ్చలవిడితనాన్ని కళ్ళారా చూసింది తల్లిపడిన కష్టాల గురించి రాస్తూ, పైలా పచ్చీసుగా వ్యవహరించి కుటుంబ బాధ్యతలను పూర్తిగా విస్మరించిన తండ్రిని, కుటుంబాన్ని దివాళా ఎత్తించిన తండ్రిని నిలువెల్లా ఈసడించుకొంది తండ్రి చనిపోయేదాకా అతడి ఊసు కుటుంబానికి తెలియదు కనీసం తెలుసుకోవాలన్న కోరికా కుటుంబానికి లేదు-అంతగా అతడు బాధలు పెట్టాడు అయినా 'మగవాడు' కాబట్టి చెలామణీ చేసుకున్నాడు! ఈ ప్రవర్తనే, ఈ బాధ్యతారాహిత్యమే, ఈ పరాన్నభుక్కు జీవితమే అలెండీని, ఆమె కుమార్తె "పౌలా"ను మాతృస్వామిక వ్యవస్థ అవసరాన్ని గుర్తించేటట్టు చేశాయి ఫెమినిజం ఎందుకు ప్రపంచంలో తలెత్తుతుందో, ఏ పరిస్థితులు స్త్రీవాదానికి ఆహ్వానం పలుకుతాయో "పౌలా" పాఠం చెబుతుంది తండ్రిలో "విలన్"ను చూసి కథానాయకుని కంటే ఈ విచిత్ర పాత్రలే తనకు కథావస్తువులు కావడం ఇష్టమంటుంది అలెండీ, వ్యంగ్యంగా! తన బాల్యం గురించి చెబుతూ ఆమె "గొంతు విప్పి చెప్పలేని భయాలతో గడిచిపోయిన బాల్యం నాది" అంటుంది నా అనుకున్న స్నేహితురాలు దూరమైపోయింది తాగుబోతు నాన్న ఎప్పుడొచ్చి ఇల్లు చేరతాడోనన్న భీతి ఒకవైపు, యుక్తవయస్సులోనే తండ్రి చనిపోగా బతికి ఉన్న తల్లి ఎప్పుడు గుటుక్కు మంటుందోనన్న భయం మరొకవైపు, మేనమామ రౌడీచేష్టలు, ఆడపిల్లల్ని వేధించే 'ఊరకుక్క'ల బెడద ఇంకొకవైపు-ఇన్ని ముళ్ళ కంచెల మధ్య సాగుతున్న జీవనయానాన్ని పట్టుదలతో దారి మళ్ళించుకున్న చైతన్యమూర్తి ఇసబెలా అలెండీ ఆమె చదువుల తల్లి. తొమ్మిదేళ్ళ వయస్సులోనే షేక్స్పియర్ రచనలను సాహిత్య విలువలకోసం కాకుండా చిక్కుముడులతో కూడిన జీవితాన్ని, అందులోని సుఖదుఃఖాలనూ పరిశీలించడమే వ్యావృత్తిగా పెట్టుకుంది జార్జి బెర్నార్డ్ షా, జూలియస్ వెర్నీ, మార్క్ట్వైన్, ఆస్కార్‌వైల్డ్-అలెండీ అభిమాన సాహితీమూర్తులు. "నేను రాసిన ప్రతి కథలో నేను సజీవ పాత్రనే" అంటున్న ఆమె, కూతురు పౌలా డిప్రెషన్ వ్యాధితో ("పోర్ఫిరియా") కృశించిపోయి ఆసుపత్రి పాలైనప్పుడు తల్లిగా తాను పడిన ఆవేదన, మనోవేదన వర్ణనాతీతం ఆమె ఆసుపత్రి వరండాలో పిచ్చెత్తిన తల్లిలా, సంఘసేవకురాలైన కూతురి ప్రాణాలు దక్కించుకోడానికి పడిన తాపత్రయ ఘడియలు ఆమె వర్ణిస్తేనే ఆ విషాదాంత గాథకు విలువ గంటలూ, రోజులూ కాదు, నెలల తరబడి నిద్రాహారాలు లేక నిస్సత్తువ మధ్యనే నికరమైన సాహిత్య కృషి చేసిన స్రష్ట అలెండీ. ఆమెక్కు పౌలా అంటే ఎందుకంత ప్రేమ? కూతురనా? కాదు, చిలీలో పేద పిల్లల సంక్షేమం కోసం అహోరాత్రాలూ పనిచేస్తున్న స్వచ్ఛంద సేవిక పౌలా ఆ అనురాగం కేవలం స్వార్థపూరితమైన తల్లీ-బిడ్డల సంబంధమే కాదు, సంఘసేవానుభవంతో పుట్టిపెరుగుతున్న ఆత్మీయతల కలబోతే ఆ బంధం

ఈ మానవీయ కథాచిత్రాన్ని ముగింపునకు తెస్తూ అలెండీ-వైద్యం వికటించి కూతురును మృత్యువు ఆహ్వానించిన తుది ఘడియలలో చెప్పిన మాటలు గుండెలను పిండి చేస్తాయి "ఈ క్షణం నుంచీ నీవు జీవితాన్ని చాలిస్తున్నావు, అమ్మా! నేనూ అంతే ఇద్దరం కలిసి మనకు తెలియని ఒక మార్మిక ప్రాంగణం నుంచి బయటపడుతూ, కళ్ళుపొడుచుకున్నా కానరాని కాళరాత్రిలోకి, ఆ కారుచీకటిలోకి అడుగు పెడుతున్నాం *['entered into zone of inky darkness']!"* ఇది కావడానికి "పౌలా" కేంద్రబిందువుగా సాగిన కథాచిత్రమే అయినా వందేళ్ళపాటు చిలీ సమాజం అనుభవించిన మాతృస్వామిక వ్యవస్థ వైశిష్ట్యం గురించి అలెండీ తలపోతల సర్వస్వంగా కూడా గణించుకోవచ్చు స్త్రీని వంటింటి కుందేలుగా ఉంచడాన్ని ఆమె అంగీకరించదు ఆచారాల పేరిట, సంప్రదాయాల పేరిట సంఘపరమైన ఒత్తిళ్ళు, చట్టపరమైన ఒత్తిళ్ళూ ఎన్ని వచ్చి మీదపడినా చైతన్యవంతురాలైన స్త్రీమూర్తిని అణగదొక్కజాలవని ఆమె దృఢవిశ్వాసం స్త్రీ లొంగిపోయిన చోట్ల పితృస్వామ్య వ్యవస్థ తలెత్తి తీరుతుందంటుందామె అన్నింటికంటే విశేషం-తనను అడుగడుగునా అణగదొక్కే వ్యవస్థను స్త్రీ ఎదిరించలేక సమర్థించినప్పుడల్లా "తలబిరుసు కొడుకులూ, బానిస కుమార్తెలూ అవతరించడానికి స్త్రీయే కారకురాలవుతోంద"ని అలెండీ అభియోగం! ఈ తప్పుడు ప్రమాణాలను తారుమారు చేయడానికి స్త్రీలు నడుంకట్టగలిగితే పితృస్వామిక అహంకారాన్ని, ధాష్టీకాన్ని ఒకే ఒక్కతరంలో కట్టిపెట్టించ వచ్చునని చెబుతుంది అందుకే అలెండీ "రొమాన్స్ కన్నా అర్ధనిమీలిత నేత్రాల భయంకర బాధల పాటల పల్లవి" దుర్భరం, దుస్సహం అంటుంది *["suffering was more powerful than romance]* అంతేగాదు, వర్ధమాన ప్రపంచంలోని పేదరికాన్ని ప్రస్తావిస్తూ, అన్ని హంగులూ ఉన్న సంపన్న స్త్రీలు మాత్రమే తమ బిడ్డలు చకచకా ఎదిగిరావడం కళ్ళారా చూసుకోగలుగుతున్నారనీ, కాని పేదరికంలో ఉన్న స్త్రీలు శతాబ్దాలుగా పౌష్టికాహారం కరవై చిన్న తనంలోనే బిడ్డల్ని కోల్పోయారని ఆవేదన చెందింది అలెండీ ఈ 'బాధల పల్లవి'ని కూతురు "పౌలా" అకాల మరణంలో అమె వింటుంది క్రమంగా తేరుకుని తాత్విక చింతనలోకి ప్రవేశిస్తుంది ఈ విశ్వంలో మిధ్య అనేదిలేదు, ఉన్నదంతా ప్రకృతిమయం, వెలుగునీడల సమ్మేళనం నేను సత్తునూ, అసత్తునూ కూడా అడవిలోని ప్రతి ఆకులో నేనున్నా, ప్రతి హిమబిందువులో అణువణువునా నేనున్నా, సెలయేరు మోసుకొచ్చే ప్రతి ఇసుక రేణువులో నేనున్నా, నేను పౌలా, నేను ఇసాబెల్ నేను లేను-ఇహపరలోకాల్లో ఉన్నవన్నీ చిరంజీవాలు, అజరామరాలు! ఇదీ అలెండీ వీలునామా "పౌలా" సత్యం, శివం, సుందరం!

శనివారం ఫిబ్రవరి 24, 1996

# ఆఫ్రికా ప్రియపుత్రికల అంతరంగ మధనం!

సుమారు ముప్పై అయిదేళ్ళనాటి మాట చరిత్ర తీర్పు చెప్పే రోజు వస్తుందనీ, అయితే ఆ చరిత్ర వాషింగ్టన్, బ్రసెల్స్, పారిస్, ఐక్యరాజ్యసమితులలో పుట్టదనీ చెప్పినవాడు వలస సామ్రాజ్యవాదులు పెట్టిన యమయాతనలు అనుభవిస్తూ చిత్రవధలకు ఆహుతి అయిన ఆనాటి కాంగో ప్రధాని పాట్రిస్ లుముంబా చరిత్ర బోధలు స్వేచ్ఛపొందిన దేశాలలో వినిపిస్తాయనీ, ఆఫ్రికా తన చరిత్రను తానే రచించుకొంటుందనీ, ఆఫ్రికా ఉత్తర దక్షిణ ప్రాంతాలన్నిటా అదొక మహోజ్వల, మహిమాన్విత చరిత్ర కాగలదనీ తన భార్య పాలీనాకు రాసిన కడసారి లేఖలో అభిభాషించాడు ఆ లేఖ రాయడానికి కొన్నాళ్ళముందు కాంగో సంపూర్ణ విమోచనను కోరుకుంటూ ఒక "ముక్తగీతి" రాశాడు కాలగతిలో వెయ్యేండ్ల చరిత్రను మూటగట్టుకున్న ఆఫ్రికా, వలస సామ్రాజ్యవాదుల కసాయిపాలనకింద అనుభవించిన కష్టాలను జ్ఞాపకం చేసుకుంటూ లుముంబా ఇలా పాటకట్టాడు

"యుగయుగాలుగా చెరగని జాతిసంపదను
జానెడు బెత్తెడు తెల్లవాడు బంగీకట్టాడు
వాడు విసిరిన చీకటివలలో
మీ చిన్న కుటీరాలు చిక్కుకున్నాయి
మీ కన్నె పడుచుల కన్నీటి విలాపాలు
నెత్తుటి ఆర్తనాదాలు అవని అంతటా అలముకున్నాయి .
ఆ దుష్టకాళి మృత్యుకేళి కరాళ జిహ్వకి
నీ ఆలుబిడ్డలు అప్పడాలు! నైవేద్యాలు!"

ఆ వెయ్యేళ్ళ బరువుకు అక్షర సత్యంగా వెలసిన తాజా గ్రంధాలలో ఒకటి "ఆఫ్రికా ప్రియపుత్రికలు" *("Daughters of Africa")* ఆఫ్రికా, ఉత్తర అమెరికా, కరిబియన్, లాటిన్ అమెరికా, యూరప్ నలుదిక్కులనుండీ వినిపిస్తున్న ఆఫ్రికన్ మహిళాలోకపు విభిన్నాభిప్రాయాలు- కవిత, కథ, గల్పికా కదంబమే ఈ సంకలనం ప్రాచీన ఈజిప్షియన్ మహిళా రచయితలనుంచి ఆధునిక ఆఫ్రికన్ మహిళల వరకూ ఆఫ్రికన్ సారస్వతా లోకంలో వస్తువులో, శిల్పంలో రచనా వైవిధ్యంలో కానవస్తున్న వివిధ దృక్కోణాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఈ ఉత్తమ సంపుటికి సంకలనకర్త మార్గరెట్ బుస్‌బీ ఇది ఒక్క గొంతుకాదు, ఆయా కాలాలలో ఆఫ్రికన్ మహిళలు అనుభవించిన అన్యాయాలకు, అత్యాచారాలకు నిరసనగా వెలువడిన యుగళగీతం కనుమరుగైన చారిత్రక విభాత సంధ్యలలో మానవ కథవికాసాన్ని వివిధ సాహిత్య ప్రక్రియలద్వారా మచ్చుతునక లుగా అలవోకగా అందిస్తున్న సంపుటం ఇది ఆఫ్రికా ఖండంగురించీ, ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలోని నల్లజాతివారి బతుకు వెతల గురించీ, సుఖదుఃఖాలగురించీ వినిపింపజేస్తున్న స్త్రీవాద ఖడ్గధారలివి! ఈ సంపుటిని పరిశీలిస్తున్నంతసేపూ యుగయుగాలు తెరలు తెరలుగా కళ్ళముందు కదలాడుతుంటాయి 200 మందికిపైగా కవులూ, కథ, నవల, గల్పికా రచయితలు ఆఫ్రికన్ మహిళలలో వివిధకాలాల్లో పెల్లుబుకుతూ వచ్చిన ఆత్మ స్థయిర్యాన్నీ, విశ్వాసాన్ని తమ రచనలలో ప్రతిబింబించారు ఇందులో ఒక సందర్భంగా పేర్కొన్నట్టు ఈ సంపుటి "నల్లజాతి

మహిళల సమైక్య రాజ్యసమితి" అంటే అతిశయోక్తికాదు! ఇందులో ప్రాచీన, ఆధునిక కవితలు, కథలు, గాధలున్నాయి భావకవిత్వం, ప్రేమకవిత్వం, లాలిపాటలున్నాయి బాలగీతాలున్నాయి, పిట్టపాటలున్నాయి, పొలంగట్టు పాటలున్నాయి, ఆశ నిరాశలు, ప్రేమానురాగాలు, కలలూ, పీడకలలూ, జనన మరణాలు-జీవన రంగాలన్నిటా మానవుల అనుభవాలకు ఇది నిలువుటద్దంగా ఉంది నల్లజాతి మహిళలగొంతులు ఎప్పుడు, ఏకాలంలో, ఎందుకు, ఎవరివల్ల మూగబోయాయి, ఇవి ఇంతకాలం ఎందుకని విస్మృతగాధలుగానే మిగిలిపోయాయి-అన్న ప్రశ్నలకు సమాధానాలుగా మనస్సును కదిలించే కవితలూ, కథలూ ఇందులో ఉన్నాయి ఆడా, మగా ఎక్కడున్నా ఒక్క 'జాతే' కాబట్టి భారతీయ సమాజంలో ఉన్న ఏకత్వమూ, భిన్నత్వమూ, స్త్రీ పురుష సమస్యలూ, వర్గ వైఖరులూ ఈ రచయితల కలం చిందులలో కూడా మనకు కనిపిస్తాయి ఆఫ్రికన్ మహిళల పుట్టుపూర్వోత్తరాలు లిఖిత పత్రాల తబిశీళ్ళకు అందేవి కావు ఒకావిడ తన కవితలో "ఇంటికి నాధులు మగవాళ్ళు!/మనకు అందివచ్చిన సత్యం అదే/కాని మాతృమూర్తులే గిరి శిఖరాలు" అంటుంది! గ్రంధానికి పెట్టిన "డాటర్స్ ఆఫ్ ఆఫ్రికా" మకుటం మేరియా స్టూవర్ట్ కవితా ఖండికనుంచి ఎంపిక చేశారు *("O Ye daughter of Africa, awake awake arise")* ఒక దేశానికో ఒక ప్రాంతానికో పరిమితం కాని ఈ గ్రంథంలోని రచనలు అటు మౌఖికసాహిత్యం నుంచీ ఇటు లిఖిత గాధలనుంచీ ఏర్చికూర్చిన ఖండికలు

నల్లజాతివారికే గాక ప్రపంచ ప్రసిద్ధ చరిత్రకారులలో ఒకరైన డాక్టర్ డుబోయ్ రాసిన "నల్లజాతి అంతరాత్మలు" ("ది సోల్స్ ఆఫ్ బ్లాక్ ఫోక్") అన్న గ్రంథం తరువాత బ్లాక్ పోరాట చరిత్రను, ముఖ్యంగా నల్లజాతి మహిళల అనుభవాలకు అద్దంపట్టిన గ్రంథం ఇదొక్కటేనని చెప్పాలి వెయ్యేళ్ళ చరిత్రను యుగవిభజనద్వారా తెలియజెపుతున్న సంపుటం ఇది ఆఫ్రికా నుంచి అమెరికా వరకూ సాగిన బానిస వలసల్లో తన పాత తరాలు పడిన కష్టాల గురించి ఒక్కసారి తలపోసుకుంటూ నాన్సీమోరే జాన్స్ రాసిన "బ్లాక్ ఉమెన్" కవిత బాధలపాటల పల్లవి, రాగ ద్వేషాల సమ్మిశ్రమం "కొత్త ప్రపంచా"న్ని కళ్ళకు కట్టిచూపిస్తామని తెల్లవాళ్ళు, అమెరికన్ల బంగారం చూపి బానిసల్ని కొనివేసిన ఫలితంగా రెండుకోట్లకు పైగా ఆఫ్రికన్ బ్లాక్స్ పడుతున్న ఇబ్బందులను అనేకమంది రచయితలు వ్యంగ్యార్థాలలోనూ, సూటిగానూ తమ రచనల్లో వర్ణించారు మరొక రచయిత్రి "ముందు దారి మసక మసకగా ఉన్నప్పుడు ఒక్క చరిత్ర మాత్రమే చైతన్యాన్ని ప్రసాదిస్తుంది" అని చెప్పింది *('Only history plants consciousness in the opaque moment")!* మానవుల అననుకూల పరిస్థితులలో కష్టాలకారడవిలో చిక్కుకున్నప్పుడు మనో నిబ్బరం కోల్పోకుండా చారిత్రక పోరాలూ, భావిజీవితాన్ని దిద్ది తీర్చగల సాహసోపేతగాథలూ ఎలా తోడ్పడగలవో చెబుతుంది 400 ఏళ్ళపాటు సహారా మీదుగా, తూర్పు ఆఫ్రికాలో సాగిన తెల్లవాడి బానిస వ్యాపారాలు, అట్లాంటిక్ మీదుగా సాగిన బానిస వ్యాపారాల గుట్టుబట్టులన్నీ ఇందులో కథావస్తువులు, కావ్యవస్తువులూ అయ్యాయి ఈ బానిస వ్యాపారంలో నేరగాళ్ళు అమెరికా, యూరోపియాన్ రాజ్యాధినేతలు బానిసల వేలంపాటల సమయంలో, యువతులను విక్రయిస్తున్నప్పుడు కన్నతల్లులు ఎలా కన్నీరు మున్నీరుగా విలపించారో, ఈ కన్యావిక్రయం పేరిట సాగిన దారుణ కృత్యాలు నల్లజాతిని ఎలా చిందరవందర చేశాయో ఈ కవితలు చెబుతాయి కొన్ని చారిత్రక యుగ సంధ్యలకు ఈ రచనలు వాస్తవిక భాష్యాలుగా నిలుస్తున్నాయి స్త్రీ వాద కవితగా చెప్పదగిన ఒక కవితలో

బానిసల తిరుగుబాటును సమర్థిస్తూ సాజోర్నర్ ట్రూత్ అన్న కవయిత్రి 19వ శతాబ్దంలోనే స్త్రీ-పురుష వివక్షను ఖండించింది. స్త్రీ ఏదో అబల అయినట్లు భావించి, ఆమె బరువు బాధ్యతలకు తానే కారకుణ్ణి అని, తాను లేకపోతే స్త్రీ బతకలేదని భావించే పురుషుణ్ణి ఎద్దేవా చేసింది. తట్టలు మోసింది తాను, మట్టి పిసికింది తాను, వంటచేసేది తాను, పిల్లల్ని సాకేది తాను, అరక దున్నింది తాను, విత్తులు నాటింది తాను - అయినా స్త్రీ చేయలేనిదేమిటో చెప్పమని సవాలు చేస్తుంది! రష్యన్ మహిళ వలెంటీనా రోదసీ యాత్ర జయప్రదంగా ముగించుకు వచ్చిన తరువాత, సాహిత్యంలో ఆఫ్రికన్ మహిళ టోనీ మారిసన్ నోబెల్ బహుమతి పొందిన తరువాత, నింగినీ నేలనూ ఒకటిగా చేయడంలో-మగవాడికి సరిదోడు మహిళ అని రుజువైంది. అందుకే సాజోర్నర్ ట్రూత్ అంటోంది. శక్తి మంతురాలైన తొలి మహిళాదేవత ఒక్కతే ("ఈవ్") ఈ ప్రపంచాన్ని ఇంత తలకిందులు చేయగలిగినప్పుడు, మహిళలంతా కలిసి చేతులు కలిపితే మళ్ళీ ఈ ప్రపంచాన్ని క్రమగతిలో నడిపించలేమా *("If the first woman God even made was strong enough to turn the world upside down all alone/together women ought to be able to turn it right side up again")!!*

అంతేగాదు, ఎంతగా ప్రజాస్వామిక దేశాలని చెప్పుకున్నా అమెరికాలో, బ్రిటన్‌లో కూడా మనదేశంలో మాదిరే వర్ణవివక్ష నానాట పెచ్చరిల్లిపోతోంది. ఇక్కడ కులంపేరిట, గోత్రంపేరిట కక్షలు, కార్పణ్యాలు పెరుగుతూండగా అక్కడ నల్లజాతివారిపైన తెల్లజాతి వాళ్ళు ఒంటికాలుమీద లేవడం ఇంకా తగ్గలేదు. ఇక్కడ 'మాల'అంటే చండాలుడనీ, చండాలుడంటే 'మాల'అనీ నిఘంటువులు సహితం అర్థాలు పొదుగుతుండగా, అక్కడ 'నీగ్రో' అన్న పదాన్ని నీచార్థంలో తెల్లవాడు వాడుతున్నందుకు నల్లజాతివారు అభ్యంతరాలు తెలుపుతున్నారు. "చైతన్యం తెల్లవాడి సొత్తేకాదు, నల్లజాతివారి సొత్తుకూడా. మానవజాతి మొత్తంలో 57 వర్ణాలతో *(colours)* ఇంద్రధనుస్సుల్లా దీపిస్తున్న ఏకైక జాతి నల్లవారిదేనని" ఆఫ్రికన్ యువత చాటిచెబుతోంది! కనుక తామే అసలుసిసలు రంగుజాతాలవారమని ప్రకటిస్తోంది. ఈ వర్ణ వివక్ష సూత్రాన్ని పాతిపెట్టడం కోసమే న్యూజెర్సీలోని నల్లజాతి కవయత్రి హతీ గాసెట్ ప్రాపంచిక దృక్పథం అవసరాన్ని ప్రతిపాదించింది. "ప్రపంచంలో ఉన్నవారికన్నా లేనివారి సంఖ్య ఎక్కువ/ రంగు జాతులు కానివారి కన్నా రంగు జాతుల వారి సంఖ్య ఎక్కువ/పురుషులకన్నా స్త్రీల సంఖ్య ఎక్కువ"! ఈ వాస్తవాన్ని గుర్తించి అందరూ మెలిగితే మంచిదంటుందావిడ!

ఆదివారం మార్చి 24, 1996

# 'భూత' ప్రపంచానికి శాగన్ చేతబడి!

తమస్సును చీల్చి ఉషస్సును ప్రసాదించమన్నది ఉపనిషత్ వాక్యం చీకటిని ద్వేషిస్తూ కూర్చోక ఓ చిరుదివ్వెనైనా వెలిగించుకుని చూడమన్నది ఓ సామెత అలాగే మనస్సును ఆవరించిన అంధకారాన్ని పటాపంచలు చేసుకొంటూ విజ్ఞాన శాస్త్రమనే (సైన్స్) కొవ్వొత్తిని వెలిగించుకొని ముందుకు సాగిపొమ్మన్నవాడు ప్రపంచ ప్రసిద్ధ రచయిత, ఖగోళశాస్త్రవేత్తలలో ఒకరైన కారల్ శాగన్ సైన్స్ మానవుడి జ్ఞాన నేత్రమని, అదే మూడవకన్ను అనీ చెప్పిన వాడు జవహర్‌లాల్ నెహ్రూ మానవుడికి ఈ జ్ఞాననేత్రం లేకపోతే, అది సకాలంలో తెరుచుకొనకపోతే ఈ "నరలోకపు చెరసాలకు నలువైపుల కటకటాలు" తొలగిపోవు! ఆ కటకటాలలో పెద్ద కటకటం "అజ్ఞానం" దానిని తొలగించుకోడానికి అవసరమైన జ్ఞాన భిక్షను ప్రసాదిస్తున్న 20వ శతాబ్దపు సైన్స్ ఫిక్షన్, సైన్స్ గ్రంథకర్తలలో ప్రసిద్ధుడైన కారల్ శాగన్ ఇటీవలనే రచించిన "భూత పీడిత ప్రపంచం" ("ది డెమెన్ హాంటెడ్ వరల్డ్") మాధవుడే మానవుడు అనిగాక మానవుడే మాధవుడని విశ్వసించిన ప్రపంచ శాస్త్రవేత్తలలో అసిమోవ్, కారల్ శాగన్, ఆర్థర్ క్లార్క్‌లు అగ్రగణ్యులుగా వస్తారు ఒక కవి కుమారుడు చెప్పినట్టుగా-"నీడలేని వెలుగునకై ఈడేరని కాంక్షలూ రపరితపించి భ్రమియించే/భ్రాంతులార, బంధులార!/వినలేదా!వినలేదా/విజ్ఞుల శంఖారావము,/మాయలేని మహిమలేని/మానవుడే మనదైవం" అని!

మాయలు చేయడం, మహిమలు చూపడం భస్మరాశులనుంచి భర్మ (బంగారు) పాత్రలను, ఉంగరాలను సృష్టించడమూ, చేతబడులు చేయడమూ, సమర్థించడమూ కారల్ శాగన్ వ్యాపకం కాదు ఆ అమాంబాపతు మోసాలను, వేల సంవత్సరాలుగా కష్టించి సృష్టించుకొన్న వస్తు సంపదను, అతడి శ్రమనూ కించపరిచే మౌఢ్యానీ, అజ్ఞానాన్ని పెంచడం శాగన్ శాస్త్రవేత్త ధర్మంగా ఎంచడు భారతీయ తాత్త్విక చింతనతో పరిచయమున్న శాగన్ తన గ్రంథానికి పెట్టిన పేరు కూడా *(The demon-haunted world)* ఈశోపనిషత్‌నుంచి తీసుకొన్నదే ప్రపంచాన్ని ఈ రోజుకీ పీడిస్తున్న దెయ్యాలు, పిశాచాలు-ఒక్క ముక్క'లో - "పిశాచగణ సమవాకారం" ఎవరి సృష్టోకాదు, మానవుడి సృష్టే! భయభ్రాంతులతో మానవకథ విభాత సంధ్యలకు ముందు ప్రకృతిని లోబరచుకోడానికి మానవుడు ముందుబాట కోసం జరిపిన జీవన సమరంలో కనపడిన ప్రతి దృశ్యానికీ దైవమనో, దెయ్యమనో ఆపాదించుకొని ఆరాధించాడు ఈ అంధకారయుగాన్నే ఉపనిషత్‌కూడా "తమోజగతి" *(utter darkness)* అని వర్ణించింది ఆ వర్ణననే శాగన్ తన గ్రంథానికి మకుటంగా మలచు కొన్నాడు ఆ "పిశాచం" ఎక్కడోలేదు, మనలోనే ఉంది మన అజ్ఞానమే ఆ పిశాచం అంటాడు! తనలో విశ్వాసం సన్నగిల్లినవాడు తననూ, ప్రపంచాన్నీ కూడా నడిపించలేడంటాడు ఆత్మవిశ్వాస సూర్యోదయానికి విజ్ఞాన శాస్త్రంతోనే అంకురార్పణ జరగాలిగాని ఛాందసాలవల్ల, అక్కరకురాని అపోహలవల్ల, మూఢత్వంవల్ల కాదని చెబుతాడు! ఈ సందర్భంగా ప్రసిద్ధ భౌతిక శాస్త్రవేత్త అసిమోవ్ అన్న మాటలను మననం చేసుకోవడం అవసరం "నేను నిరీశ్వరవాదిని కాకపోయి ఉంటే " అని ఒక ప్రశ్నవేసుకొని తానే ఇలా ఆత్మ విశ్వాసంతో సమాధానం చెప్పుకొంటాడు· "ఉబుసుపోని మాటల్ని గాక ప్రజల జీవిత సారాన్ని అర్థంచేసుకొన్న వాడే దేవుడైతే ప్రజలకు అతను ముక్తిదాత అవుతాడు కాని టి వి లో రోజూ దేవుడా!దేవుడా! ఓ దేవుడా!" అని పదిసార్లు అరిచే ప్రబోధకుడు

/ప్రవక్త అచరణలో పరమజారుడూ, పతనమైన వ్యక్తి నిజానికి దేవుడనే వాడుంటే అలాంటి వాడికి బదులు నిజాయితీ పరుడైన, ధర్మమూర్తి అయిన నిరీశ్వరవాదినే విశ్వసిస్తాడని మరవకండి" అని అసిమోవ్ చెప్పాడు కంటికి కనిపించని వస్తువుల గురించి మనస్సులో ఏర్పడే భయమే 'మతం' అనే భావనకు బీజాలు నాటిందన్నాడు హాబ్స్ (17వ శతాబ్దం) అనుమానం లేదా సంశయం కలగడమే స్వేచ్ఛకు ఉదాహరణ ఆ స్వేచ్ఛనూ, ప్రశ్ననూ చంపి బతికందే ఛాందసం ఆ ఛాందసాలపైన, మత మౌఢ్యంపైన, శ్రమజీవిగా మానవుడు సాధించిన నాగరికతా విధ్వంసకులపైనా చాకులూ, బాకులూ దూసిన శాస్త్రవేత్తలలో ఒకరు కారల్ శాగన్ ఈయనే ఇంతకు ముందు విశ్వపరిణామం గురించి "కాస్మోస్" అనే ఉత్తమ గ్రంధం రాశాడు మన మేధ పరిణామం చరిత్రను గురించి రాసిన మరో పుస్తకం "డ్రాగన్స్ అఫ్ ఈడెన్" అజ్ఞానం అనే అంధకారాన్ని చీల్చుకుపోయే దివిటీగా, కారు చీకటిలో కాంతిరేఖగా ఒక ప్రశ్న వేసుకొని విజ్ఞాన శాస్త్రాన్ని కొలుచుకుంటున్న మేధావి శాగన్ తన "పిశాచ పీడిత ప్రపంచం" పుస్తకాన్ని తన మనుమడికి అంకితం ఇస్తూ ఇలా అంటాడు "దెయ్యాలు, భూతాలులేని, తేజస్సును ప్రసాదించే కాంతి పుంజాలతో నిండిన ప్రపంచంలో నీవు జీవింతువుగాక"! శాగన్ పుట్టి పెరిగిన వాతావరణం అతనిలో అదినుంచి విజ్ఞాన బీజాలు నాటింది బిడ్డలో ప్రశ్నించే హక్కును గౌరవించి, గుర్తించిన తల్లిదండ్రులు అతని అదృష్ట దీపికలు! శాస్త్రీయ దృక్పథం శాగన్‌లో కలగడానికి చిన్ననాటినుంచీ అనువైన పరిసరాలను కాపాడిన వారు తల్లిదండ్రులు వివరణ, విశ్లేషణ శాస్త్రీయ పరిజ్ఞానానికి ఆయువుపట్టు అందుకే అంటాడు శాగన్ "చాకుతో వెన్నను దూసినట్టే విశ్లేషణతో అజ్ఞానాన్ని దూసేయాలి"! భారతీయ మేధావి ఎస్ చంద్రశేఖర్‌నుంచి గణిత శాస్త్రం లోతుపాతులు తెలుసుకున్నాడు విజ్ఞాన శాస్త్రం మూడవకన్నుగా మానవుడికి ఎదిగిరాకపోతే భూమి సూర్యునిచుట్టూ తిరుగుతోందన్న కోపర్నికస్ సిద్ధాంతం స్థానంలో సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతున్నాడన్న టోలమీ వక్రభాష్యమే ఊళ్ళేలుతూ ఉండేది! మానవ పురోగతికీ మానవ పరిజ్ఞాన సరిహద్దుల విస్తరణకూ సైన్స్ పడుగుపేకలా తోడునీడయిందని శాగన్ అంటాడు చికాగో యూనివర్శిటీలో ఖగోళ శాస్త్రాధ్యయనం ముగించుకొన్న తరువాత శాగన్ అన్నమాటలు చిన్నతనంలోనే తల్లిదండ్రుల వైజ్ఞానిక నాయకత్వం బిడ్డలలో పురోగమన భావాలకు ఎలా ప్రోదిచేస్తుందో చెబుతాయి "నేను నేర్చుకొన్న ముఖ్యమైన విషయాలు స్కూలు ఉపాధ్యాయులనుంచీ కాదు, యూనివర్శిటీ ప్రొఫెసర్లనుంచీ కాదు, సైన్స్ గురించి తెలియకపోయినా ఇంగిత జ్ఞానంగల నా తల్లిదండ్రులనుంచే" అంటాడు!

ఖగోళ శాస్త్రంలో ఉద్దండపిండమైన కారల్ శాగన్ ఆస్ట్రానమీని కాలక్రమంలో కొందరు 'ఆస్ట్రాలజీ'గా మార్చినందుకు శరిస్తాడు ఈ గ్రంధంలో "విలియమ్ బక్లీ" అనే ఆధునిక విజ్ఞాన శాస్త్రం గురించి బొత్తిగా అవగాహనలేని ఒక అమాయకుణ్ణి పాత్రచేసి, అతని ద్వారా మానవ జీవితానికి సైన్స్ ప్రయోజనాలను తెలియజెబుతాడు. డీప్‌సీ తవ్వకాలు, కాలగర్భంలో కలిసి పోయాయని భావిస్తున్న అట్లాంటిస్, లెమూరియా ఖండాల తబిశీళ్ళు, 40 లక్షల సంవత్సరాలనాటి అగ్ని పర్వతం బద్దలైనప్పుడు బూడిదలో దొరికిన మన ప్రాచీనుల అడుగుజాడలు, ఆసియా మైనర్‌లోకి ఇండియా జారుకున్నప్పుడు హిమాలయాల పెరుగుదల గురించిన తబిశీళ్ళు, ఎల్సా నాగరికత వైశిష్ట్యం, సుదూర గ్రహాలలో జీవరాశి మనుగడ-ఇలా

ఎన్నెన్నో విషయాలగురించి ఆ పాత్రద్వారా శాగన్ వివరించడానికి ప్రయత్నిస్తాడు తన పాత్ర "విలియమ్ బక్లీ" ఎందుకలా విజ్ఞాన శాస్త్రానికి దూరం కావలసి వచ్చింది? చర్చీ, చర్చి ప్రభావంలో ఉన్న రాజ్యవ్యవస్థలూ, మత దురహంకారమూనని శాగన్ సమాధానం! అందుకే శాగన్ అంటాడు "మన సంస్కృతీ ప్రతీకలూ, మన విద్యావ్యవస్థ, మన సమాచార వ్యవస్థా- అన్నీ మనిషిని (విలియమ్ బక్లీ) సైన్స్‌కు దూరంచేశాయి, పనికిరాని వాడిగా మార్చాయి కాని శాస్త్రవిజ్ఞాన పరివ్యాప్తికి మారుగా ఏ సామాజిక వ్యవస్థను అనుమతించారు? నటన, గందరగోళం, అయోమయం! ఫలితం-మానవునికి ఉపకరించే నిజమైన సైన్స్‌కూ, చౌకబారు అనుకరణలకూ మధ్య తేడాను ఎలా కనిపెట్టాలో ఈ వ్యవస్థ అతడికి నేర్పలేదు" 'దున్నపోతు ఈనిందంటే వెంటనే దూడను కట్టెయ్యండి' అన్న మౌఢ్య సంప్రదాయంలో పెరుగుతున్న జనాలను కట్టుకథలతో లోగొట్టుకోవడం తేలికని మత ప్రవక్తలకూ, మోస కారులకూ తెలుసు కనుకనే లేని "అట్లాంటిస్" ఖండాన్ని ఉన్నట్టు నమ్మించడానికి ప్రయత్నించడమేగాక, "అట్లాంటియన్ స్ఫటికల్ని" సంపాదిస్తే అవి మానవుడి మనస్సులు పనిచేసే తీరును కూడా కనిపెడతాయని, కొత్త భావాలను బుర్రలోకి ఎక్కిస్తాయని, ప్రాచీన చరిత్రకు అవి పేటికలుగా పనికి వస్తాయనీ, ఈజిప్షియన్ పిరమిడ్లకు ఆ స్ఫటికాలు (క్రిస్టల్స్) నమూనాలుగా ఉంటాయని ఏవేవో కథలల్లారు వీటికి ఒక్క దాఖలా కూడా లేదని శాగన్ నిరూపించాడు! అందుకే శాగన్ సైన్స్‌కు, సైన్స్‌అని భ్రమింపజేసే టక్కరి సైన్స్‌కూ ("సూడో సైన్స్") మధ్య బేధాన్ని పౌరుడు గుర్తించాలంటాడు వాస్తవికమైన విజ్ఞాన శాస్త్రాన్ని ప్రచారంద్వారా ప్రజాయత్తం చేయకపోతే, కుహనా శాస్త్రమే కూసువిద్యగా మారుతుందని హెచ్చరించాడు నేడు అమెరికన్లలో నూటికి 95 మంది శాస్త్రీయంగా నిరక్షరాస్యులేనన్నాడు సైన్స్‌కూ, గణిత శాస్త్రానికీ పౌరులను దూరం చేయడమే ప్రాచీన ఏథెన్స్ పతనానికి కారణం అందుకే ఆధునిక సమాజాలు కూడా ఈ రెండు విజ్ఞాన శాస్త్రాలపట్ల అప్రమత్తులై మెలగాలని శాగన్ ఆదేశం శాస్త్రపరంగా ప్రదర్శితమవుతున్న ఈ "నిరక్షరాస్యత" ఇంతకు ముందెప్పటికంటే నేటి ఆధునిక ప్రపంచానికి మరింత ప్రమాదకరమని హెచ్చరించాడు శాగన్ ప్రపంచవ్యాపితంగా పరిసరాలు వేడెక్కడం, ఓజోన్ పొర క్షీణించడం, పెరుగుతున్న వాతావరణ కాలుష్యం, విషపదార్థాలు, రేడియో ధార్మిక శక్తిని వెదజల్లే వ్యర్థపదార్థాలు, ఆమ్ల వర్షాలు, కోసుకుపోతున్న భూ ఉపరితలం, ఉష్ణప్రాంతాల్లో అడవుల కోత, జనాభా పెరుగుదల- ఈ సమస్యల పట్ల ఆధునిక సగటు పౌరుడు విజ్ఞానవంతుడుకాకపోతే అతని ఉనికికే ప్రమాదమని గ్రహించాలి అంతేగాదు, శాగన్ లెక్కప్రకారం అమెరికన్ పార్లమెంట్‌లోని 535 మంది సభ్యులలో ఒక్కశాతం సభ్యులు మాత్రమే సైన్స్ పరిజ్ఞానం ఉన్నవారు! అతని ఉద్దేశంలో శాస్త్రవిషయాలు తెలిసిన అక్షరాస్యులైన ప్రెసిడెంట్లలో బహుశా ఆఖరివాడు తామస్ జఫర్సన్! 2500 సంవత్సరాలనాటి వైద్యపితామహుడైన హిప్పొక్రటిస్‌ను అందరూ కొలిచేది-వైద్యులకు ప్రవర్తనా నిబంధనావళిని రచించినందుకు కాదు, మూఢవిశ్వాసాలనుంచి వైద్యాన్ని విముక్తిచేసి విజ్ఞానశాస్త్ర పరిధిలోకి తీసుకొచ్చినందుకు! ఆనాటినుంచి నేటిదాకా మరణాల సంఖ్య శిశుమరణాలసంఖ్య, తగ్గింది, జీవన ప్రమాణాలు పెరిగాయి జీవితకాలం పెరిగింది- మనుషులు అవగాహన చేసుకోనందువల్లనే మూర్ఛను దైవదత్తంగా భావించారని హిప్పొక్రటిస్ అన్నాడు అందుకే జ్ఞానం ప్రధానం అన్నాడు శాగన్

అందువల్ల సైన్స్‌ను, శాస్త్రీయ దృక్పథాన్ని వదులుకోవడమంటే ఎయిర్‌కండిషనర్లను, సి డి ప్లేయర్స్‌నూ, హెయిర్ డయర్స్‌నూ, ఆధునికమైన కార్లనూ మొదలైన చిరు అవసరాల్ని వదులకోవడం కాదు, భయంనుంచి, పిరికితనం నుంచి రక్షించుకోవడమే శాస్త్రీయ దృక్పథం అని శాగన్ ప్రకటించాడు!!

ఆదివారం జూన్ 23, 1996

# "ఆగ్రహ భార్గవులు" దిగంబరులు!!

కారణంలేని తోరణం ఉండదు ఆగ్రహానికీ, ఆక్రోశానికీ, ఆవేశానికీ, తపనకూ, కడుపు రగలడానికీ, పుడమి పగలడానికీ కూడా కారణం ఉంటుంది! వారంరోజులనాడు రజతోత్సవ సంవత్సరానికి చేరుకున్న దిగంబర కవితా శకానిది కూడా కారణజన్మమైనదని అంగీకరించి తీరాలి! పాతికేళ్ళనాడు కొందరు అభ్యుదయ కవులు సహా సాహితీ క్షేత్రంలోని అనేక మంది పెద్దల దృష్టికి అసహనంగా, అశ్లీలంగా, హింసగా, "విషపుష్పాలు"గా, "ఉత్తి తాటాకుమంట"గా కనిపించిన దిగంబర కవితోద్యమాన్ని గమనశీలమైన తెలుగు కవితా ప్రస్థానంలో ఒక చారిత్రక దశగా గుర్తించకతప్పదు సందడి మాత్రమే చూచి, సరకు నాణ్యతను గమనించలేని వాడిలా ఆనాటి దిగంబరుల ఉద్యమ లక్ష్యాన్ని తరచిచూడనివారు మాత్రమే నాడు తొందరపాటుతోనో లేక విరోధ భావంతోనో దిగంబర కవులను ఆడిపోసుకున్నారు నిజానికి ఈ శషభిషలకు తావులేకుండానే దిగంబరులు తమ మూడు కవితా సంకలనాలకు పొందుపరిచిన ముందు మాటలో అరమరికలు లేకుండానే తమ ఉద్దేశాలను ప్రకటించుకున్నారు ఆ మాటకొస్తే - భోళాభోళీ తనమే దిగంబర శకం విశిష్టతగాని, మనలో కొందరిలా అభ్యుదయం ముసుగులో దాగిన నాలిముచ్చుతనం కాదు కాదుకనుకనే, అభ్యుదయ రచయితల ఉద్యమం నిస్తబ్ధతా దశకూ, విప్లవ రచయితల ఉద్యమం పుట్టుకకూ మధ్య సంధికాలంలో (1965-70)యువతలో, సమాజంలోని వివిధ వర్గాలలో పేరుకొన్న నైరాశ్యాన్నీ, నిర్లిప్తతనూ చీల్చి, భావంలో, భాషలో నవ్యధోరణులను ఆవిష్కరించిన "కెటాలిస్ట్"(ఉత్ప్రేరక శక్తి) దిగంబర శకం అభ్యుదయ సాహిత్యోద్యమం ఒకప్పటి కేవల కాల్పనిక, భావకవిత్వ ధోరణులపై వచ్చిన తిరుగుబాటు ఒక సందర్భంగా శ్రీ ఆరుద్ర పేర్కొన్నట్టు "తిరుగు బాటుదారులపైన తిరుగుబాటు కూడా ఒకప్పుడు అవసరం" ఆ అవసరాన్ని దిగంబర శకం ఆవిష్కరించింది అంతమాత్రాన దిగంబరులు లేకపోతే 'విరసం'కు అస్తిత్వంలేదని అర్థం కాదు! కాని 1905 విప్లవం లేకుండా 1917 అక్టోబర్ మహావిప్లవానికి వన్నెలేదు అలాగే ఇదీను, కవితా రంగంలో అలాంటి చారిత్రక దశావిష్కరణకు కారకులు, నిస్తబ్ధతా తిమిరాన్ని చీల్చుకువచ్చిన విక్రమార్కులూ, విప్లవార్కులూ దిగంబరులు! 1965లో దిగంబర శకావతరణకు ఒక్క ఏడాదిక్రితమే "సుఖాలతో బాధలతో/ గాథలతో బోధలతో/మానవ జీవనరూపం/చిత్రవర్ణహరి చాపం" గానూ "ఈ హృద్గీతి భావం యుగసంధ్యా కాలం"గానూ చాటుకున్న వారు సంవత్సరం తిరగకుండానే - బోధలవల్ల లాభంలేదనీ, మనస్సులను భేదోపాయంతో మలిచి, అవసరమైతే పాశాలతో తొడపాశాలతో మమతలను కొత్తపుంతలకు మళ్ళించడానికి, తద్వారా సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా పేరుకుపోయిన దురన్యాయాలకు, దుర్నీతికి చరమాంకం పాడించడానికీ నడుంకట్టారు వారిలో కొందరు క్రమంగా అస్పష్టతనుంచి స్పష్టత దిశగాను, అనిబద్ధతనుంచి నిబద్ధతవైపు గానూ పరిణతి చెందడానికి కూడా వారిలోని ధర్మక్రోధం, తపనా తోడునీడై నిలిచాయి దేశీయంగానూ, దేశాంతరాలలోనూ అంతకుముందు కవితాపరంగా సాగుతున్న రకరకాల తిరుగుబాట్లకు అగ్రశ్రేణిలో నిలిచిన ఉద్యమాల ప్రభావం ఈ దిగంబరులను కూడా ఊగించి, శాసించింది 1950లలో, 1960లలో యూరప్‌లో గిన్స్‌బర్గ్ సారథ్యంలో తలెత్తిన "బీట్స్" ఉద్యమం, జార్జి ఆర్వెల్ నాయకత్వంలో క్రోధామూర్తులైన యువతరంగా పేరుగాంచిన "యాంగ్రీయంగ్‌మెన్" ఉద్యమం, ఇటు 1962లో బెంగాల్‌లో దేవీరాయ్, మలయరాయ్

చౌదరి, వాసుదేవ్‌ల నేతృత్వంలో ప్రసిద్ధిలోకి వచ్చిన "ఆకలితరం" (హంగ్రీ జనరేషన్), హిందీలో "అకవితా" ఉద్యమం, మైథిలీ భాషలో ఉత్తరప్రదేశ్‌లో సాకేతానంద్, వీరేంద్ర, బాలేశ్వర్‌ల ఆశీస్సులతో ప్రభవించిన 'అనామ" కవితా ఉద్యమం - తెలుగునాట "అగ్నిముని"గా నగ్నముని సారథ్యంలో దిగంబర శకాన్ని ప్రభావితం చేసిన ఉద్యమాలు! గొంతులు వేరైనా, కవితా ప్రక్రియలు వేరైనా వీరందరి లక్ష్యం ఒక్కటే వారి నిరసన, ఆవేదన ఒక్క నగర జీవితానికే పరిమితమైనది కాదు, మొత్తం సంఘంలోని అన్యాయాలపైనా, ధనస్వామ్య రాజకీయాలపైన, కుళ్ళిపోతున్న విలువలపైన, ఆత్మవంచనపైన, సామ్రాజ్యవాద దోపిడీపైన, అణుయుద్ధ ప్రమాదంపైన, విశ్వశాంతికోసం వీరు - నిర్మోహంతో, కుండబద్దలుకొట్టినట్టు, నీళ్ళు నమల కుండా, కాళ్ళు తడబడకుండా, వాడిగా, వేడిగా, అసిగా, కసిగా జానపదుల అమాయకత్వాన్ని పోలిన అతి నిర్మలమైన మనస్సుతో కవితా క్రోధాన్ని విరజిమ్మారు ఈ సర్వనిరసనను ఒక ఉద్యమంగా చేపట్టిన దిగంబరులు కలం పేర్లతో దూసుకురావడమేగాక, ఋతువుల పేర్లను, సంవత్సరాల పేర్లను కూడా మార్చి సర్వత్రా కొత్తదనానికి దారులు తెరిచారు అందుకే కేశవరావు నగ్నమునిగా, కమ్మిశెట్టి వెంకటేశ్వర్రావు మహాస్వప్నగా, బద్దం భాస్కరరెడ్డి చెరబండరాజుగా, వీరరాఘవాచారి జ్వాలాముఖిగా, మన్మోహన్ సహాయ్ భైరవయ్యగా, యాదవరెడ్డి నిఖిలేశ్వర్‌గా అవతరించారు. బెంగాల్‌లో "ఆకలితరం" కవులు "న్యూటెస్టమెంట్" పేరిట తమ కవితలను ప్రకటించుకుంటే ఇక్కడ దిగంబరులు "ఫీవర్స్‌ఫ్రంట్" బంధాలను కూడా తెంచి వచన కవితా సరిహద్దులను, యతిప్రాసల సమ్మోహనాస్త్రాలను కూడా ఛేదించుకొని తమ కవితా ఖండికలకు "దిక్"లని నామకరణం చేసుకున్నారు "బీట్స్" అవతరించినప్పుడు యూరప్‌లో వారిని *"rebels without a cause"* అని కొందరు నిరసించినట్టే ఇక్కడ కొందరు వీరి రచనలనూ ప్రతికూలించి ఉండొచ్చు కానీ, వీరందరి మౌలిక ప్రవృత్తి జీవితంపట్ల నైరాశ్యం కాదు, విపరీత మానవతా దృష్టితో అట్టడుగు మానవుని బతుకును సార్థకం చేయాలన్న ఆవేదనతో అమితమైన తపనతో కూడిన పట్టరాని ఆవేశం, ఆక్రోశం మాత్రమే! ఆ ఆవేశమే లేకపోతే ఆరుగురు దిగంబరులలోనూ కవితాధార ఖడ్గధార కాగలిగేది కాదు, నాడు ప్రభుత్వమూ వాళ్ళవి "నిప్పులరవ్వలు" గా ఫిర్యాదు చేసుకొనేదీ కాదు! నైర్మల్యానికి తగిన అక్షరపూజ-వెరసి దిగంబర కవులను "ఆగ్రహ భార్గవులుగా"నేగాక సామూహిక పరివర్తనా శకంలో ఒక చారిత్రక దశకు ఆదర్శ కవితామూర్తులుగా నిలబెట్టింది "కావ్య విమర్శ" శీర్షికతో పాల్ ఎలార్డ్ రాసిన గీతంలో కుళ్ళిపోయిన సామాజిక, రాజకీయ వ్యవస్థను "నేను ద్వేషిస్తున్నంత తీవ్రంగా/ద్వేషించనివాడ్ని మరీ తీవ్రంగా ద్వేషిస్తాను/ అసలు నేను వ్రాసిన కావ్యాలన్నింటిలో ఈ ద్వేషగీతం చాలా బాగుందని ఎవడైతే అనడో/ ఆ దొంగ తొత్తుకొడుకు మొగంమీద ఉమ్మృతాను" అంటాడు! అలాగే దిగంబరులు కూడా మనకు నచ్చినా నచ్చకపోయినా కవితా లోకంలో నవ్యసృష్టిని ఏవహించుకున్న వారిని, ధర్మకోపానికి అడ్డుగా నిలచినవారినీ "నోర్ముయ్" అన్నారు, "నపుంసక హావభావాలు" వద్దన్నారు, చివరికి "నయాగరా జలపాతం" లోకి తమతోపాటు దూకలేనివారిని కసిరికొట్టారు! "నిజమైన మనిషికోసం" వీరు సాగించిన అన్వేషణలో అన్ని నియమాలను కాలదన్నుతున్నప్పుడు గిన్స్‌బర్గ్ ప్రకటించుకొన్నట్టుగా *"I am the defense early warning radar system"* అని వీళ్ళూ వ్యవహరించారు! గిన్స్‌బర్గ్ కవితా సంపుటి "హౌల్" ("ప్రచండ ధ్వానం")ను "బీట్" ఉద్యమానికి అగ్నిశిఖగా భావించి, అశ్లీలత పేరిట శాన్‌ఫ్రాన్సిస్కో మునిసిపల్ కోర్టుకు ఈడ్చినట్టే, ఇక్కడ 'విరసం' సభ్యులుగా మారిన కొందరు

దిగంబరకవులను, వారి రచనలనూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు పాలకులు లాగారు అయినా, శాన్‌ఫ్రాన్సిస్కో కోర్టు గిన్స్‌బర్గ్ కవితలు ధర్మక్రోధ కవితలుగా ఆగ్రహకలశాలేగాని అశ్లీలాలు కావని ప్రకటించినట్లే, ఇక్కడ జస్టిస్ చిన్నపరెడ్డి కూడా భావప్రకటనా స్వేచ్ఛ పరిధులలోనే ఉన్న ధర్మభావావేశ ఖండికలుగా దిగంబరుల రచనలపై తీర్పు చెప్పవలసి వచ్చింది! నిష్కర్ష, నిజాయితీ 'అశ్లీల'మైన చోట ఇక మనం సంరక్షించుకోగలిగిన సంస్కృతి ఉండదు దిగంబర కవితలు - "తొడవిరిగిన తరం", "మా", "ఆత్మయోని", "సూర్యస్నానం", "నన్నెక్కనివ్వండిబోను", ఎముకల కేకలు, వందేమాతరమ్, 'దిగంబరి', "షష్టిపూర్తి", కుష్ఠురోగి, ఏ కాలానికైనా నిలబడగల సత్తావున్న ఖండికలు జీవితం చరమదశలో సిల్వియాపాత్ ఓ కఠోర ఖండికరాసింది *"Beware, Beware/Out of ash/I rise with my red hair/And I catch men like air"* అంటుందావిడ! అంతేకాదు : *"I always hated the men who ran my country/but I was a loyal citizen"* అంటుంది అలాంటి భావాలెన్నింటినో వెదజల్లిన వాళ్ళు దిగంబరులు 1957లో సీగ్ ఫ్రిడ్ సెసూన్ అనే ఆగ్రహ భార్గవునికి కవితా పురస్కారంగా "క్వీన్స్ మెడల్" బహూకరిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం ఓ ప్రకటన చేయవలసివచ్చింది *"today's angry youngman is notoriously tomorrow's recipient of honours"* అని! ఆ పురస్కారం దిగంబరులకు దక్కకపోయినా "కాలం కదలిక మొదలైన చోట/కలలకు రెక్కలు మొలుస్తున్నచోట/ ఈ జీవితానికి అవతలి ఒడ్డున/మన రక్తంలో రేపటి సూర్యుడు ఉదయిస్తున్నాడు" చూడమని మన కళ్ళల్లో వొత్తులు నిలిపి తమ చారిత్రక పాత్రకు అందమైన ముగింపు తెచ్చుకున్నవారు దిగంబరులు!

మార్చి 1, 1992

## 'నీలాటి రేవు' నిర్మల! 'పాతాళగంగ' విమల!!

మనకు తీర్మానాలు ఏనాడు లేవు, ఆచరణ తప్ప?! మనకు సంకల్పబలం ఏనాడు కొదువ, సామాజిక స్పృహ తప్ప!

మనకు వాత్సల్యం ఏరోజున కొరత, వాగ్దానాల భంగం తప్ప!

భారత జాతీయోద్యమానికి రంగు, రుచీ కల్పించిన కరాచీ కాంగ్రెస్ తీర్మానాలు, స్త్రీ పురుష అసమానతలను, సామాజికపరమైన అంతరాలను, దోపిడీ వ్యవస్థను తొలగించి, రాజకీయ, ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యాన్నీ స్వేచ్ఛనూ కల్పించే నవభారత నిర్మాణానికి బ్లూప్రింట్‌గా తయారైన లాహోర్ (కాంగ్రెస్) ప్రతిజ్ఞాపత్రమూ, తమ బాగోగులను పట్టించుకోలేని ప్రభుత్వాలను గద్దెనుంచి దించివేసే హక్కును రావీనది సాక్షిగా గుర్తించిన తీర్మానమూ మనకు లేవా? ఉన్నాయి తీర్మానాల దారి, తీర్మానాలది, ఆచరణ గుంట పూలు పూస్తున్నది అలాగే ఏడాదికొకసారి గతించిన ఆత్మీయులకు పెట్టుకునే "తద్దినం" లాగా ప్రతి ఏటా ఎనిమిదవ తేదీన అంతర్జాతీయ మహిళా దినోత్సవం వస్తుంది, పోతుంది! స్త్రీ-పురుష సమానత్వం కోసం, ఆర్థిక స్వాతంత్ర్యం కోసం, న్యాయం కోసం మహిళల హక్కులను మరోసారి చాటుతూ ఆరోజు ముగుస్తుంది ఏడాదికేడాదికి స్త్రీలపై తరగవలసిన అమానుషాలూ, అకృత్యాలూ, అన్యాయాలూ-పెరిగిపోవడానికి కారణం ఏమిటి? ఏనాడూ లేనన్ని వరకట్నపు చావులు నేడు పెచ్చురిల్లడానికి బాధ్యులెవరు? హోర్డింగులపైన, టెలివిజన్‌లో ప్రసారమయ్యే వ్యాపార ప్రకటనల్లోనూ స్త్రీల వ్యక్తిత్వాన్ని అవమానపరిచే అడ్వర్టయిజ్‌మెంట్లను ఎందుకు ఇంకా అనుమతిస్తున్నారు?

వీటన్నిటికీ సమాధానం - రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్న దేశం సాంఘిక, ఆర్థిక విప్లవాన్ని జయప్రదం చేసుకోలేకపోవడం, 'మనువు' పోయినా మనిషిలో అమానుష ప్రవర్తన మిగిలిపోవడానికి అధర్మ సూత్రాలను, అసమానతలకు ఆమోదముద్రవేసే ధర్మశాస్త్రాలనూ మార్చుకపోవడం, కనుకనే, ఈ రోజుకీ - అంటే, సుమారు రెండు వందల ఏళ్ళ తరువాత కూడా ప్రపంచ మహిళా ఉద్యమానికి ప్రచండ నాయకిగా అవతరించి, ఓ మాగ్నకార్టాలాగా, ఓ బిల్ ఆఫ్ రైట్స్‌లా మహిళలకు మొట్టమొదటిసారిగా మిస్ ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ ప్రకటించిన "మానిఫెస్టో" గుర్తుకు రావలసిందే అది కేవలం మగవారిపై దండయాత్రకు సిద్ధంచేసిన ప్రణాళిక కాదు. కేవలం ఫెమినిజం కాదు, ఆడ-మగ భేదాలను మనస్సులనుంచి తుడిచిపెట్టి జీవితాలకు బంగారుబాటలు వేసుకొనే సమ ఉజ్జీలైన మానవమూర్తులుగా దిద్దితీర్చడం దాని లక్ష్యం మహిళా దినోత్సవం వచ్చినప్పుడు మాత్రమే మనకు - ఓ ఝాన్సీరాణీ, ఓ రుద్రమదేవి, ఓ జోన్ ఆఫ్ ఆర్క్, ఓ ఇందిరాగాంధీ, లేదా ఓ నాయకీ నాగమ్మ జ్ఞప్తికి వస్తారు ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ అలా కాదు - ఈ ప్రపంచం ఉన్నంతవరకూ, మాతృస్వామిక వ్యవస్థను విచ్ఛిన్నం చేసి, పితృస్వామిక వ్యవస్థకు పాదుకలు తొడిగిన అసమవ్యవస్థ ఉన్నంతవరకూ ప్రపంచంలోని స్త్రీలందరూ జాగరూకులై ఉండాలని బోధించి పోయింది! అందుకే ఆవిడ ఫ్రెంచి విప్లవం ముగిసిన మూడేళ్ళలోనే (1792) "ఆడపిల్లలలో భావోద్దీపన కలిగించే పుస్తకాలు" అందించడం కోసం *"Thoughts on the Education of Daughters"* రాసింది! నేడు మహిళా కవులూ, రచయితలు కొంత స్వేచ్ఛతో ముందుకువచ్చి స్వయం ప్రతిభను చాటుకో

గల్గుతున్నారంటే - ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ పోరాటం ఫలితమే తన మానిఫెస్టోను ఆమె *"A Vindication of the Rights of Woman"* అని పేర్కొన్నప్పుడు, ఈనాడు మన కవయిత్రులను కొందరు ఎద్దేవా చేసినట్లుగానే - హన్నామోర్ అనే మహిళా విమర్శకురాలు అపహాస్యం చేస్తూ "స్త్రీలకు హక్కులా! చాలుచాలు, రేపటినుంచీ పిల్లల హక్కుల గురించిన హోరుకూడా ప్రారంభం కావచ్చు" అని ఏడ్చింది!

నిజానికి నాడే కాదు, నేటికీ మహిళకు సరైన రక్షణలేని ఈ పురుషాధిక్య సమాజంలో, ఈ వర్గ సమాజంలో అసలు, పిల్లలకు కూడా హక్కులుంటాయని గుర్తించేవాళ్ళెంతమంది? నోరు లేనివాడి మాటకు విలువెంత?! అందుకే స్త్రీకి ప్రత్యర్థి స్త్రీయేనని ఆవిడ విమర్శించవలసి వచ్చింది ఇక్కడ తెలుగుదేశంలో దూసుకువస్తున్న వర్ధమాన కవయిత్రులు కొండేపూడి నిర్మల, విమల కూడా - ఒకరు "సందిగ్ధ సంధ్య"ను చీల్చుతూ, వేరొకరు "అడవి ఉప్పొంగిన రాత్రి"ని ప్రసాదిస్తూ, స్త్రీని ఒక ఆటవస్తువుగా, భోగ్యవస్తువుగా, కేవలం పిల్లలను కనే పునరుత్పత్తి పరికరంగా భావించి, చివికిన పాతగుడ్డగా వదిలేసే వ్యత్యాస భారతానికి సవాలుగా అవతరించారు కనుకనే నిర్మల "ఒక్క నేనే ఇన్ని ముక్కలు కదా / ఎవరో ఏకీభవించలేదని ఏడవడం ఎందుకో" అర్థం కాదని చెప్పి, మహిళల్లో ఐక్యతా వారధికి ఆత్మవిమర్శతో ప్రారంభోత్సవం చేసింది! చలనం కోల్పోయిన "మృత్యువిశ్రాంతి"ని ఏవగించుకునే నిర్మల - "ఆత్మను అవసరానికి మేల్కొట్టి", తన అచేతనత్వానికి సవాలక్ష కారణాలు వెదకడంలో పొద్దుపుచ్చుతూ, "ఫ్రిజర్"లో చెడిపోని చప్పుడు చెయ్యని శవంలా, స్పర్శజ్ఞానం కోల్పోయిన చూపులతో కాలక్షేపం చేసే ఓ "మగమహారాజు" కంటే ఒక మూగవాడు, ఓ గుడ్డివాడు, ఓ కుంటివాడు నయం కాదా అంటుంది! "తెగబడిన కలల ప్రపంచం"లో విమల ఉద్యమకారిణిగా అవతరించి - స్త్రీలు కేవలం "పునరుత్పత్తి పరికరాలు"గా, కొవ్వొత్తి ప్రతిరూపాలుగా కుమలడం మానుకొన్నప్పుడు "సమూహం ప్రవాహం" గా మారడానికి సామాజిక చైతన్యమే సారధి కావాలంటుంది! దీని అర్థం - మగవాడిపైన మహిళ చేసే దాడి అని కాదు, వస్తూత్పత్తీ, ఉత్పత్తి పరికరాలూ ఈ ఉభయుల శ్రమ ఫలితమైనప్పుడు ఆ శ్రమజీవన సౌందర్యంలో ఉభయులూ సమభాగులేగాని పరస్పరం అంటరానివారుగా ఉండకూడదనే!

పితృస్వామిక వ్యవస్థ రద్దు అయి, దోపిడీపై ఆధారపడిన వర్గ సమాజం తొలగిపోతేగాని ఆ గ్యారంటీ ఉండదు అప్పుడు మాత్రమే ఊల్‌స్టోన్ క్రాఫ్ట్ చెప్పినట్టు భార్య-భర్తల మధ్య బానిస బంధ విధేయత తొలగిపోయి హేతుబద్ధమైన సమభావం, సమధర్మం నెలకొనదు. అప్పుడు మగవాళ్ళు కూడా స్త్రీలను ఎలా భావిస్తారో ఆమె చెబుతుంది *"They would find us then more observant daughters, more affectionate sisters, more faithful wives, more reasonable mothers, in a word, better citizens We should then love them with true affection, because we should learn to respect ourselves"!*

అందుకే ఆవిడ ఫ్రెంచి విప్లవంతో రద్దుకాబోతున్న "రాచరికపు దైవిక హక్కుల" మాదిరిగానే, విడాకుల హక్కును గుర్తించిన ఫ్రెంచి విప్లవంలా - "భర్తలు భావించుకునే దైవిక హక్కుల"ను కూడా వెంటనే రద్దుచేయాలని కోరింది! శృతిమించి రాగాన పడిన పెంకిపిల్లలుగా మగవాళ్ళను *("over grown children")* నుతిమెత్తగా అంటించింది. అందుకే ఆమెను "పెట్టీకోటులో దాగిన క్రూరజంతువు" *(Hyena in Petticoats)* గా, తత్వబోధలు చేస్తున్న "విషసర్పం"గా నాడు కొందరు ఆడిపోసుకున్నారు అలాగే నిర్మల, విమల కవితలు చదివిన వారు కొందరిలో - ప్రకటించుకోలేని బాధ మిగిలిపోక తప్పదు!

మాతృమూర్తిగా స్త్రీ ఆవేదనను అర్థం చేసుకొన్న మనస్సులకు మాత్రమే ఈ ఇరువురి కవితలు ఆరాధ్యమూర్తులవుతాయి నిర్మల - "లేబర్‌రూమ్", "హృదయానికి బహువచనం", "పెళ్ళిచూపులు", "ఈ సంప్రదాయం మాకొద్దు", విమల కలంగీసిన "నిశ్చల చిత్రం", "పాట పక్షులైన వేళ" "మాటల పతకాల్ని ఎగరేయండి", "సౌందర్యాత్మక హింస" ఉత్తమ కవితా ఖండికలుగా చిరకాలం నిలిచిపోతాయి "సౌందర్యాత్మక హింస'లో-ఆస్ట్రేలియన్ ఉద్యమకారిణి జెర్మైని గ్రేయర్ చాన్నాళ్ళనాడు విమల మాదిరే "అందం పోటీయైన చోట / అందం సరుకైన చోట / మన మనుగడకు అందమే అనివార్యమైన చోట / ఈ జీవితాన్నే ద్వేషిద్దాం" అని స్త్రీలోని అచేతనత్వంపై చరుపు చరిచి, లోకంలో నిలబెట్టడం కోసం "ఫిమేల్ ఈనక్" అనే గొప్ప గ్రంథం రాసింది ఈ ఇరువురు కవయిత్రులూ (నిర్మల, విమల) - ఒకరు నీలాటిరేవు, వేరొకరు పాతాళగంగ! ఖండాంతరాలలో ఆల్ఫోన్సినీ స్టోర్నీ (అర్జెంటీనా), అడా నెగ్రీ (ఇటలీ), మేరియా టెలిసా హోరా (పోర్చుగల్), మేరియా వైన్ (స్వీడన్) కవయిత్రులకు ఏమాత్రం తీసిపోని విదుషీమణులుగా వీరు ఎదిగివస్తున్నారు ఒక్క ముక్కలో వీరంతా మహిళా ఉద్యమ అగ్నిశిఖలు - *"Woods of the horizon are on fire"!!*

మార్చ్ 11, 1990

# కాంతి గోపురాలు!

**20వ** శతాబ్దపు గద్య రచనలో తొంగిచూసిన సరళతను కవితలోకి పొందికగా పొదిగి వచన కవితా ఉద్యమాన్ని రసమయం చేసి ఎందరో యువకవులకు మార్గదర్శి అయి కాంతి గోపురాలు ఆవిష్కరించినవాడు కుందుర్తి, క్రాంతి శిఖరాలను ఆవాహన చేసినవాడు శ్రీశ్రీ వచన కవితను ఆ తర్వాత సునిశితం చేసి మరింతగా ప్రజాయత్తం చేసిన వారు ఆ తరువాతి "విరసం" కవులుగా అవతరించిన ఒకనాటి దిగంబరులూ, వారి 'దిక్కు'లూ పాతికేళ్ళుగా అవిశ్రాంతంగా సాగిన విరసం ప్రస్థాన భేరి శాసించిన దిక్కులను అందుకున్న నవయువ కవులెందరో! వీరు వచనా కవితా సొగసులను, జానపదకళా చంధోరీతులనూ అందుకొని ముందుకుసాగుతూ అలంకార ప్రాయంగానేగాక, అందమైన పదచిత్రాలతో అర్థవంతమైన సామాజిక కవితా ప్రస్థాన భేరీలు మోగిస్తున్న యువతరం, "శివసాగర్" తరం, "నరుడో భాస్కరుడో"ని మించిపోతున్నతరం! ఎవరికీ అందని, లొంగని వినూతన తరం! ఈ అక్షర సూర్యులు-చిరంజీవులు సౌదా, త్రిపురనేని శ్రీనివాస్, అల్లం నారాయణ, అఫ్సర్, ఎస్ ఎ రవూఫ్, వసీరా, అలిసెట్టి ప్రభాకర్, శిఖామణి, ఆశారాజు, కోట్ల వెంకటేశ్వరరెడ్డి వీరిలో కొందరు ఉద్యమ కవులుకాగా, ఇంకొందరు ప్రజా ఉద్యమాలకు ఊతకోలగా కవితాత్మను అంకితం చేసుకున్నవారు కొందరిలో స్పష్టత సూర్యనేత్రంలా ప్రకాశిస్తుండగా ఇంకొందరిలో అక్కడక్కడా అప్పుడప్పుడూ అస్పష్టత (యాబ్‌స్ట్రాక్ట్) వైరూప్య చిత్రాలుగా కళ్ళముందు అవతరించి మనస్సులకు చీకాకు కలిగిస్తున్నాయి అయితే వీరందరి కవితలలోనూ కొమ్ములు తిరిగిన కవులు కూడా చూపలేని సొగసైన పదచిత్రాలు కనిపిస్తాయి శ్రీశ్రీ, శివసాగర్‌లు తమ భావకవితా కాంతి గోపురాలకు క్రాంతదర్శులుగా, ధృవతారలుగా ఉన్నప్పటికీ - ఈ నవయువ కవులలో ఎవరికి వారు తమ సొంతముద్రలు వేసుకొనే మార్గంలోనే పయనిస్తున్నారు తొక్కుపలుకుల మధ్యనే ఉక్కుకవితలు మొలిపిస్తున్నారు వీరంతా తమ గీతాలను భావికి ఆశా రక్షగానాలుగా మలుస్తున్నారు, మాటల కర్మాగారాలు కడుతున్నారు, కళ్ళను సెలయేళ్ళుగా తిప్పుతున్నారు, అక్షరాల రహదారిలో వచనా కవితా పుష్పాలు వికసించనివ్వని పహరా 'కొత్వా'లను కవనఖడ్గంతో నరికేస్తున్నారు, శిఖండిపదాలను ఉరితీస్తున్నారు, "పొగగొట్టపు కాటుక జలపాతం"లో కదులాడిన అశ్రుకణాల్లో విద్యుత్తును చూస్తున్నారు; "నిరాయుధమైన మట్టి సాయుధం కానిదే" మట్టి చరిత్ర మారదంటున్నారు, శబ్దాన్ని మాత్రం ప్రతిధ్వనిస్తూ అజ్ఞాతవీరుల కోసం కవితా రహస్యోద్యమానికి అనితర సాధ్యమైన మార్గాలు నిర్మిస్తున్నారు! నిర్బంధ సంధ్యల్ని విద్రోహ వింధ్యల్ని దాటిస్తున్నారు, అడగలేని ఊహలకు అడుగులు నేర్పిస్తున్నారు; చీకటిపొరల్ని చీల్చి అక్షరాల శిఖరాలపైన "ఈ కళ్ళవెనుక కదలాడే నీడల్ని" నిల్పోబెడుతున్నారు, అస్తిత్వం ఎక్కడో వదులుకొని చిలక్కొయ్యలకు వేలాడుతున్న మనుషులను ఎండగడుతున్నారు మెదడు పొరల్లో మేలుకొంటున్న అశాంతి స్వప్నాలు చూపిస్తున్నారు. నీళ్ళటాంకి కోసం జనం ఎదురు చూస్తున్నవేళ, ఊరికి పిలవని పేరంటంలా వచ్చే పోలీసు శకటాల వైపు మన దృష్టి మరల్చుతున్నారు, ఊపిరిని యుద్ధ మేఘంగానూ, ప్రతీ తలపునూ ఖడ్గంగానూ మెరిపిస్తున్నారు, విద్యావ్యాపార వ్యవస్థలో నెత్తురోడుతున్న అసంఖ్యాక "నిరుద్యోగ క్రీస్తు"లను చూపిస్తున్నారు, సూదిమొనమీద అవగింజని మోపడం వృధా శ్రమగానూ, నియంతృత్వపు తుపాకీ గొట్టంపైన భూగోళాన్ని ఆపటం భ్రమగానూ బోధిస్తున్నారు, వీర సంస్మరణల మధ్య నుంచి జీవన

సంగీతం మళ్ళీ ఈ జీవితం కొరకే వినిపిస్తుంటుందని జూలియస్ ఫ్యూజిక్ "రక్తాక్షరాల"ను మరొక్కసారి స్ఫురణకు తెస్తూ "అందుకే ఈశాన్య ప్రత్యూషరేఖ మా తీర్పు" అని చుటుతున్నారు ఒక్కముక్కలో చెప్పాలంటే - "జీవితం నుండి జారిపోయిన జారుడు కవిత్వాన్ని యెందుకు రాస్తారా కవిత్వాన్ని, నిషేధించడానికి అర్హతలేని కవిత్వాన్ని" అని వీరు జబర్దస్తీ చేస్తున్నారు!

ఈ యువ గళాలలో శాబ్దిక సౌందర్యం తక్కువా? లేదు రొడ్డకొట్టుడు కవులు రోజువారీ మనకు చూపించే సూర్యచంద్రులు, చీకటి రాత్రులు, నదీనదాలు, అడవులూ, చరాచర ప్రకృతి అంతా - వీళ్ళ కవితల్లోనూ ప్రత్యక్షర సత్యంగా దర్శనమిస్తాయి తేడా అల్లా - వారి ఆకాశానికి నక్షత్రాలు పూస్తే, నిశీథిలో వీరి అంబరానికి బుల్లెట్లు పూస్తాయి; వారి దృష్టిలో నెలవంక మరొక పౌర్ణమికి ఉద్దీపన, కాగా వీరి దృష్టిలోని నెలవంక తుపాకీలా వేలాడుతుంది! అంతేగాదు, సంప్రదాయాల సృష్టిలో సంపన్నులే మనుషులు, ఆపన్నులు చాకిరీకి తాకట్టు బానిసలు, కాగా ఈ నవయువకుల దృష్టిలో అలగాజనం నలిగి అలిగిన జనమై ప్రవాహజనమై, ప్రవాహ గిరిజనమై, వొక సృజన ప్రవాహంగా, స్వజనాశ్రుజన ప్రవాహంగా తరలిపోయి నూతన సమాజాన్ని ఆవిష్కరిస్తుంది! కనుకనే ఇక జనం పాలకవర్గాల కపటనాటకాలను నమ్మరని విశ్వసిస్తున్న యువత "సింహాసన కంటక నేత్రంలో చంద్రోదయ కపటాన్ని" ధరించి చీకట్లో ఇంకా శ్వాసించలేమంటోంది! ఈ భావాల కొలిమి తిత్తులే శ్రీనివాస్, సౌదాలు రాసిన "గోదావరీ ప్రవహించు", సౌదా "జైలునుండి ప్రేమలేఖ", అఫ్సర్ "అద్దంలో నెత్తుటి మరక", "నా జన్మభూమి", "నేనొక సమూహం", అల్లం నారాయణ "జగిత్యాలపల్లె", వసీరా 'లోహనది' అలిసెట్టి "రక్తరేఖ", సాదనాల "దృశ్యం", రవూఫ్, "పదరేఖలు", ఒబ్బిని "అక్షర సూర్యుడు", ఆశారాజు "మనం అక్షరాలు రాయాల్సి ఉంది", కోట్ల వెంకటేశ్వరరెడ్డి "రహస్యాలు లేని వాళ్ళు", "మట్టి చరిత్ర మారదు"

ఇవన్నీ వీరిలోనే ఓ కవి చెప్పుకొన్నట్టు - ఓ చినుకుజారి పడినప్పుడో, ఓ కన్నీటి చుక్క రాలినప్పుడో, ఓ ఆర్తనాదం వినిపించినప్పుడో, ఓ వార్త కదలించినప్పుడో కలిగిన హృదయ స్పందనలు, అనుక్షణం సంకుల సమరంగా మారిన అంతరాల దొంతర్ల సామాజిక వ్యవస్థలో దోపిడీపైన, అన్యాయాలపైన, అరాచకాలపైన, అత్యాచారాలపైనా, కలాలు పోటెత్తిన సముద్రాలుగా తిరగబడిన గళాలు! అయితే నైరూప్య శబ్దచిత్రాల వాడకంలో కొందరు యువకవులు "అజంతా" ముద్రనుంచి బయటపడలేక పోతున్నారు వాస్తవాలను, అధివాస్తవాలను నైరూప్య వాక్చిత్రాలలో కూడా బొమ్మకట్టించి ఒప్పించగల ఆలోచనా తరంగం, "నేర్పుల ఉత్తుంగ తరంగం అజంతా అది అతని ప్రత్యేక ముద్ర దానిని అంత సమర్థవంతంగా దిద్ది తీర్చు కోలేనప్పుడు ముద్రాంకితులు కావడానికి ఉత్సాహపడకూడదు. పైగా ప్రజా కవితకు విప్లవకవితకు వారసులుగా ప్రకటించుకునే వారికి ఈ "యాబ్‌స్ట్రాక్ట్" కవితా ధోరణి పనికిరాదు ఎందుకంటే, "నిలువెత్తు శోకధాత్రిని రహస్యోద్యమమై వేటాడతాన"ని చెప్పే కవి, ఈ భూగోళానికి అసలు సూర్యుణ్ణి తానేనని దండోరా వేయగలిగిన కవి, "ఫుట్ నోట్సులు ఉన్నది కవిత్వం కాదన్న"కవి, అక్షరానికి అక్షరమే వివరణ అన్న కవి-తీరా నైరూప్య వాక్యాలాపనకు దిగి, కవిత్వానికి "ఫుట్ నోట్సుల" అవసరం కల్పించజూడడం బాల్యచాపల్యం! కాకపోతే ఏమిటి చెప్పండి - ఒకరివెనక నడవడం చేతకాని, "ఒకరి నీడ కింద ఆలోచన కదలాడని" కవి, శరీరంలో రసాయనాలున్న (జవజీవాలున్న) మనిషి బయట ఉత్ప్రేరితం అయి, మెదడు లోపలి నిప్పులంటించి కొత్త సృష్టికి జన్మభూమి అవుతాడన్న కవి, చపలత కొద్దీ "ట్యూబులైటు

సిలింఢ్రికల్ శబ్ద రాహిత్యంలోకి కరిగిపోయిన కాంతి రుతువు లాలిత్యంలోకి" అమాంతంగా అయోమయంగా అస్పష్టంగా మనల్ని నదిలోకి తోసేసినట్లుగా తోసేయవచ్చా?! వద్దు, ఆ ముద్రలు మనకొద్దు! కాగా అల్లం "జగిత్యాలపల్లె"లోని"అమ్మ" ను చదివితే గొర్కి "అమ్మ" తలపునకు రావలసిందే! పొద్దుతోపాటు పంట పొలంలో పొడిచే అమ్మ "కంట్లో కారు చీకట్లు దాచుకొని వెన్నెల పువ్వుల్ని విరిసిన అమ్మ" మాత్రం వంటింటిగడప మీద శిలయింది అన్నప్పుడు కళ్ళు చెమ్మగిల్లుతాయి స్త్రీకి పుట్టి ఆ స్త్రీనే అవమానపరిచే దుష్టశక్తి ప్రాణికోటిలో ఈ మానవుడొక్కడే కాని ఆ దుష్ట సంప్రదాయంపై కత్తికట్టి స్త్రీమూర్తిని అవ్యాజాను రాగంతో, గౌరవంతో గుండె గొంతుకలో ఆవాహనం చేసే వాళ్ళు చిరంజీవులు "నువ్వు రక్తం పంచి, చిక్కిశల్యమైన నీ దేహంలోనే చాలీచాలని చోటిచ్చి, పెంచి పోషించుకున్న నీ కలల బిడ్డ మృతరూపాన్ని! తల్లీ, క్షమించు! ఇది నిజం!'' అన్న యువ కవి గొంతుక గాద్గదికమవుతున్నప్పుడు ఆధునిక బ్రిటిష్ కవి అడ్రియన్ మిషెల్ "ఫైనల్ ఛాంట్" అన్న కవితలో *"We have done enough killing - Long live the man Long live the Woman Who use both courage and compassion Long live their children"* అన్న వాక్చిత్రాలు జ్ఞప్తికి వస్తాయి అందుకనే ఈ సందర్భంగా మన యువకవి ఒకరు అన్నట్టు-"నినాదాలు కాదు, నిర్మాణం కావాలి ప్రాక్టికాలిటీ ప్రాణం లేనప్పుడు ఏం లాభం"? ఈ ప్రశ్నకు జవాబు దొరకనంత కాలం - అక్షరాల ఎముకల్ని పోగుచేసి వాటికి మాటల ఆకారాలు తొడిగి "మైకుల్లో పంపిణీ చేయడమే" ఉద్యమ కవితా లక్షణంగా మిగిలిపోవలసి వస్తుంది! లేదా కవి తామ్‌గన్ అన్నట్టు ఎవరికి తోచినట్టు వారు తాము వలచిన దానినే *"Call it heaven, call it hell Join me and see the world I sell"* అని అనుకునైనా తృప్తిపడవలసి వస్తుంది!!

ఏప్రిల్ 8, 1990

# "హరీన్ దా"

"నీకు వయస్సు మగ్గినను నిగ్గుల నొగ్గు త్వదీయ కావ్య / లక్ష్మీకురులందు నీ నగలు మేలివి మా నగకంటె మెత్తనై " అని ఓ తెలుగు కవి కుమారుడు రసగుంఫితమైన కవిత్వానికిచ్చిన నిర్వచనం భారత కవితాశ్రీ నొసట ఎన్నెన్నో రసగంగాధరాలు దిద్ది శనివారంనాడు అస్తమించిన కళారవి హరీంద్రనాథ్ చటోపాధ్యాయకు వర్తించే అక్షర సత్యమంటే అత్యుక్తికాదు! యావత్తు కుటుంబమూ గజ్జెకట్టి చెలరేగిన విద్యల కేంద్రంగా, విద్వత్ కుటుంబంగా కృత్రిమ సరిహద్దులు చెరిపి విశ్వవిఖ్యాతి పొందిన కుటుంబాలను దేశంలో వేళ్ళమీదనే లెక్కించవచ్చు వాటిలో రవీంద్రుని తరువాత అంతటి శేముషిని సంతరించుకున్న కుటుంబం "హరీన్ దా' 'ది చటోపాధ్యాయ అఘోరేంద్రనాథ్ కొడుకు అయినందుకో, సరోజినీదేవి సోదరుడైనందుకో, విప్లవకారుడైన వీరేంద్రనాథ్ తన తమ్ముడయినందుకో హరీన్ మనకు దగ్గరయినవాడు కాడు! 20వ శతాబ్దం తొలి దశకం నుంచీ తన తనాన్ని మొహరువేసుకోడానికి స్వయం సాధనలో రాటుదేలి - కవిగా, చిత్రకారుడుగా, నటుడుగా, గాయకునిగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా, సంఘ సేవకునిగా, పాత్రికేయునిగా, వక్తగా, ప్రవక్తగా, హిస్వరసాధినేతగా ఏడుదశాబ్దాలుగా ప్రజల నాలుకలమీద తాండవించిన వ్యక్తి "హరీన్ దా" బతికున్నరోజుల్లోనే ప్రపంచ ప్రసిద్ధ రచయిత సోమర్‌సెట్ మామ్ "ప్రాచ్య ఖండంలోనే ఇంతగా కంచులా ఖంగుమని మోగే కంఠాన్ని నేనింతవరకూ విననేలేద"ని చాటి చెప్పాడు ఆ సత్యాన్ని గ్రహించడానికి తెలుగువాడికి మరొకరి తోడు అక్కరలేదు అఘోరేంద్రనాథ్‌కు, సరోజినీదేవి కుటుంబానికి హైదరాబాద్ నగరంతో ఉన్న అనుబంధం "హరీంద్రా'దులను కూడా భాగ్యనగర సంస్కృతిలో అంతర్భాగంగా దిద్దితీర్చబట్టి, తెలుగునాట కాంగ్రెస్ నిర్బంధ విధానం తర్వాత ఇండిపెండెంట్ అభ్యర్థిగా, కమ్యూనిస్టుల మద్దతుతో (1952లో) పెద్ద మెజారిటీతో లోక్‌సభకు విజయవాడ నియోజకవర్గ ప్రజలు హరీన్‌ను ఎన్నుకొనగలిగారు నిజామ్ సంస్థానంలో ఉన్నతస్థానాలలో ఉండి, నిజామ్ కళాశాల వ్యవస్థాపకాచార్యులలో ఒకరైన తండ్రి అఘోరేంద్రనాథ్ నిజాముకు గులాము కావడానికి నిరాకరించినట్టే, విక్టోరియా రాణి యుగంలో పుట్టి పెరిగిన హరీన్ దా కూడా తెల్లవాడికీ, వాడి పాలనకూ ఏనాడూ జోహుకుం అనలేదు చాలామంది హరీన్‌దాను ప్రకృతి కవిగానే, సౌందర్యారాధకుడుగానే ఈ రోజుకీ పేర్కొంటున్నారు, తద్వారా ఆయనలోని పరిణామశీలతను, వ్యక్తిత్వాన్ని, జీవితాన్ని ప్రేమించి దానిని సమున్నత శిఖరాలకు నడిపించాలని కలలుకన్న ఒక విశిష్టవ్యక్తిగా, తాత్వికునిగా, అద్వైతిగా, అభ్యుదయ పథగామిగా, పీడిత ప్రజల వాణిగా పేర్కొనడానికి జంకుతున్నారు నిజానికి "హరీన్ దా" ప్రకృతి ముడిపదార్థంగా సౌందర్యాన్ని ఆరాధించడమేగాక, దానిని సంక్షుభిత జగత్తులో సమస్యల చౌరాస్తాలో కకావికలవుతున్న సామాన్య మానవుడి అనుభవంలోకి దించాలనీ, ఆనాడే శాంతి అనీ భావించినవాడు! ప్రకృతి కవితా దశనుంచి ప్రజా కవితా దిశగా, కేవల సౌందర్యారాధన నుంచి సామ్యవాదారాధనకు మళ్ళినవాడు హరీన్. రవి కవిలోని మార్మికవాదం కొంత వొంటబట్టినా, ప్రకృతి వర్ణనలో కూడా ఎన్నడూ నిరాశను దరిచేరనీయనివాడు హరీన్ తెలుగునాట భావకవుల యుగానికి సన్నిహితుడయిన హరీన్ కాల్పనికత మధ్యనే కాలజ్ఞానిగా మారి ప్రకృతిలోని ద్వైధీభావాన్ని అర్థంచేసుకొని మానవుని పురోగతికి, పరిణామవాదానికి హారతులు పట్టినవాడు ప్రతి ఒక్కరి తొలి కవిత - ప్రేమ కవితగానే ప్రారంభమవుతుంది,

అదో ప్రాథమిక విన్యాసం, పాట కట్టులో పాటవ పరీక్ష! ఇక్కడ శివశంకర శాస్త్రి "అపుడు నిల్చితినోయి, నా ప్రియు/రాలి శాంత మనోజ్ఞరూపము/తనివిదీరగ జూచు తలపున స్తంభన విధమునన్ " అని అలా నిలిచిపోయి వాపోతూన్న సమయంలో తొమ్మిదేళ్ళకు గంటం పట్టిన సరోజినీ దేవికి తమ్ముడైన హరీన్ ఎనిమిదేళ్ళకే కలంపట్టి, పదేళ్ళప్పుడు రాసిన తొలి కవితలో ప్రేమకొద్దీ ఆడపిల్ల 'వెంటపడి' వేధించినవాడు *"As I was walking in the street/I spied a maiden fair and sweet/She hurried down her little feet/Towards a lovely desert "!!* అయితే హరీన్ దా కూడా గాఢ తిమిర మధ్యంలో కాంతుల రాకడ చూసినవాడు, మానవేతిహాసంలో మలుపుల పోకడ చూసినవాడు! కనుకనే ఆద్యంత రహితమైన ఈ జీవన సమరానికి సమన్వయం కుదర్చడానికి ప్రయత్నిస్తూన్న ఘడియలలో "హరీన్ దా" ప్రకృతిని మాటలకందని విచిత్రశక్తిగా, కవి కలానికొక సవాలుగా *("Challange to a poet's pen")* పేర్కొని, ప్రకృతి ద్వంద్వ ప్రవృత్తిని వెల్లడించాడు సౌందర్యం కన్పించే ప్రతిదానిలోనూ భీకర స్వభావం కూడా ఉంటుందని చెబుతూ, సత్యం, శివం, సుందరం దేనికదే ఒక నిప్పు కణంగా భావించి, *"Nature is most beautiful where she is savage"* అంటాడు! దివారాత్రాలు ప్రకృతి అనే వివృత చదరంగంలో చతురస్రాలు *("Squares on her spread chessboard")* అంటాడు! అయితే ఆఖరి గెలుపు వసంతానిదే, గులాబీదేనంటాడు! అనుక్షణం కలరవాలతో నిండిన ఈ ప్రపంచాన్ని సంఖ్యలు, అంకెలు, కొలతలు - శాసిస్తున్నాయంటాడు పైథాగరస్ అలాగే హరీన్ దా కూడా తన అసంపూర్ణ ఆత్మకథలో ("లైఫ్ అండ్ మై సెల్ఫ్") ప్రాకృతిక సౌందర్యం నిగూఢమైన మానవుని ఉనికిని అడుగడుగునా ఎలా శాసిస్తోందో అదే సమయంలో అది (సౌందర్యం) ఎంత అస్థిరమో చెబుతాడు సౌందర్యం క్షణికంగాని, జీవితం కాదంటాడు! అందులోనే ఉంది అతని హేతువాద దృష్టి

మౌఢ్యంతో కాకుండా మానవతతో, హేతువుతో 'స్వర' కల్పన చేసి సమన్వయ భారతానికి తన తలపోతలను సంగీత ఝురులుగా ఎన్నో కవితా ఖండికలను అందించినవాడు హరీన్‌దా టెన్నిసన్ రాసిన *"Lady of Sallot"* పదే పదే చదివి అంత్య ప్రాసావిన్యాసాలతో తొలికవితకు పూజలు జరుపుకొన్న హరీన్ కలం 1943 బెంగాల్ కరవుకాలంలో ప్రజాకవిగా అతణ్ణి మలిచి, భూరివిరాళాల సేకరణలో సంఘ సేవకునిగా "భూఖాహై బెంగాల్" అన్న తొలి ప్రజా కవితను గానంచేయించి వదిలింది అఖిలభారత ప్రజా నాట్యమండలి వ్యవస్థాపక సభ్యులలో ఒకరుగా హరీన్ దా "బావార్చీ" నాటక ప్రదర్శనలో మరో సుప్రసిద్ధ నటుడు హంగల్‌తో కలిసి ప్రజల మధ్యకు దూసుకు వెళ్ళాడు షెల్లీ, టెన్నిసన్, లాంగ్‌ఫెలో, స్కాట్ కవితా సంప్రదాయాలను, భావాలను, చైతన్య ప్రవంతిని ఆకళింపుజేసుకొన్న హరీన్ దా హైదరాబాద్ నగరంలో షేక్స్పియర్ నాటకాలాడి ప్రేక్షకులను రంజింపజేసినవాడు ఒకనాడు గోపాలకృష్ణ గోఖలేను సహితం తన కవితా ఖండికలతో మత్తిల్లజేసిన హరీన్ దా *("That boy's genius gives me electric thrills")* విప్లవకారుడైన ఖుదీరామ్ బోసును తెల్లవాడు ఉరితీస్తున్న రోజున "ది డయింగ్ పేట్రియెట్" పేరిట రాసిన స్మృతిగీతం గుండెలవియగొట్టే విషాద రచన, భారత స్వాతంత్ర్య సమరాన్ని సునిశితం చేసిన ధర్మకోపం, అదొక అగ్రహ నివేదన, అగ్ని గీతం!

స్వాతంత్ర్యయోధునిగా హరీన్ దాలో సహదేశభక్తునిపట్ల ఉదయించిన ఈ ఆర్ద్రతకు, సంఘీభావానికి పూర్వరంగాన్ని తల్లి వరదసుందరి తన విశ్వమానవ దృష్టితో పొందుపరిచి ఉండకపోతే, హరీన్ దారి వేరుగా ఉండేది! ఒక విధంగా వరదసుందరి కూడా తెలుగు

పడుచేనని చెప్పుకోవచ్చు! క్రైస్తవులు, బౌద్ధులు, పార్శీలు, ముస్లిములు, హిందువులు, శిక్కులకు - సర్వ మత సమ్మేళనంగా భువన విజయంగా భాసిల్లిన అమె ఇల్లు మత సామరస్యానికి పెట్టనికోట, అద్వైత దృష్టికి పరసీమ తండ్రితో బెంగాలీలో, పిల్లలతో హిందూస్తానీలో, పనివాళ్ళతో తెలుగులో ముచ్చటించే మాతృమూర్తి భావధార, క్రమశిక్షణ హరిన్ దా భవిష్యత్తును మలిచిపెట్టింది ఆర్థిక దోపిడీని, దురన్యాయాలను సహించలేని కవి మనస్సు ఒకనాడు తెలంగాణా సాయుధ పోరాటానికి బాసటగా నిలిచింది కాటూరు - ఎలమర్రులలో నాటి పోలీసు అఘాయిత్యాలను నిరసిస్తూ హరీన్ దా గొంతెత్తి చాటాడు, "హింసవల్ల పీడవల్ల హీన హేయ మాయవల్ల/ఖైదువల్ల, కత్తివల్ల, హత్యా సత్యాలవల్ల /నిరంకుశుల పరిపాలన నేల రాలడం తథ్యం/ అణగారిన ప్రజల గుండె లాగవులే ముమ్మాటికి/దిగజారిన తిరుగుబాటు తిరిగిలేచునొకనాటికి / పెద్ద పెద్ద వాళ్ళంతా, గద్దెమీది వాళ్ళంతా/శ్రద్ధ బూని వినడానికి చేస్తున్న హెచ్చరిక"! కనుకనే అతను "కుర్బానీ" ద్వారా నిజమైన స్వాతంత్ర్యయోధుని సందేశం వినిపించదలచాడు, "రహీం చాచా" ద్వారా భాగ్యనగర్ కేంద్రంగా మృణాల్ సేన్ సహాయంతో ఆధునిక సమాజంలోని "ఆలీబాబాల" దోపిడీని ఎండగట్టబోయాడు! ఇదెలా సాధ్యం? వసంతాగమనం కోకిలకు తెలుస్తుంది! కవికోకిల హరీన్ దా రోజాను చూచి ఆ వసంతం లక్షణాన్ని పసికట్టగలడు! అందుకే అతను కవితకు, భవితకూ క్రాంత దర్శి *"I can tell you the quality of spring/by looking at a rose"* ఆ సామ్యవాదం వచ్చేదాకా హరీన్ దా సామ్యవాణి మనకు వినపడుతూనే ఉంటుంది!!

జూన్ 26, 1990

# అక్షరాల్లో "అశ్వోత్సవం"!

అనగనగా - చాలారోజుల క్రితం, చైతన్య స్రవంతిలో కథా ప్రపంచాన్ని దిద్ది తీర్చుకున్న ఘడియలలో "నన్ను గురించి కథ వ్రాయవూ" అన్న ఓ కథలో బుచ్చిబాబు అధివాస్తవికత (సర్రియలిజం)కు సంబంధించిన ఓ సత్యాన్ని చెప్పకుండానే చెప్పాడు "మానవుడి బుర్రలో అధోలోకం ఉందంటారు అక్కడ అతని రహస్యమైన కోర్కెలూ, బైటకు చెప్పుకోలేని తీరని వాంఛలు అడవి మృగాల్లా తిరుగుతాయట అవి అన్ని సమయాల్లోనూ బయటికి రాకుండా బుద్ధి కాపలాకాస్తుంది అవి బైటకి రాలేకపోయినప్పటికీ ఎప్పుడో, నిద్రలోనో, బలహీనమైన స్వప్నావస్థలోనో, గర్జించి వాటి ఉనికిని బాహ్య ప్రపంచానికి వెల్లడిస్తాయట" ఈ వెల్లడికి కవితా రంగంలో, చిత్రకళారంగంలో మారుపేరే "సర్రియలిజం"! వాస్తవాన్ని మించిన లోకాలను సందర్శించడమే కాదు, వాస్తవ జగత్తులోకి సందుగొందులలో, ఇరుకు మనస్సులలో పరుగుపెట్టే మనస్తత్వాలను కూడా బయటకు లాగి ఎండకట్టడానికి మరో పేరే సర్రియలిజం ఆ అధివాస్తవికతను తెలుగునాట పచ్చిపచ్చిగా కాకపోయినా పరోక్షంగానూ, ఘాటుగానూ కొన్ని సందర్భాలలో కవితా రూపంలో, కథ రూపంలోనూ వ్యక్తం చేసినవారు శ్రీశ్రీ, నారాయణబాబు, ఆరుద్ర, అజంతా, మోహన్‌ప్రసాద్, త్రిపుర అంతేగాదు, మనస్సులలో అవ్యక్తంగా ఉన్న భావాలకు రెక్కలుతొడిగి అధివాస్తవిక రచనా శక్తినీ, ఆసక్తినీ పెంచిన దాని ఫలితమే - "త్రిపుర కథలు", అతని కవితా సంపుటి "బాధలూ, సందర్భాలూ" జేమ్స్‌జాయిస్ "యులిసెస్" ప్రభావమూ, సాల్వడార్‌డాలీ చిత్రాలు, అధివాస్తవిక స్వాప్నిక ఛాయా చిత్రాల ప్రభావమూ మన రచయితలపైన ఉంది మరొక ముక్కలో చెప్పాలంటే - నీవూ నేనూ ఊహించని దృశ్యాలు ఊహించడమే సర్రియలిజం ప్రత్యేక లక్షణం శైలిలో, పదబంధాలలో, పదచిత్రాలలో, భావచిత్రాలలో "ధ్వని" ప్రాధాన్యతనేగాక, దృశ్య ప్రాధాన్యతను కూడా ఒకేసమయంలో సమపాళ్ళలో పోషించగల నేర్పే సర్రియలిజం ఈ అధివాస్తవిక రచనలో - శిశువు గాఢనిద్రలో "ప్రాచీన స్మృతులూచే" చప్పుళ్ళన్నీ మనస్తత్వంలో శిశుప్రాయంగాఉన్న కవి కుమారుడిలో కూడా ధ్వనిస్తూనే ఉంటాయి! నలుపు తెలుపుగా కనిపిస్తుంది, వింతరోచిస్సులు కళ్ళముందు నాట్యమాడతాయి, నీవు చూడలేని దృశ్యాదృశ్య ప్రపంచం సరియలిస్టు కళ్ళముందు బొమ్మకడుతుంది, అతని కళ్ళు చూడవు, మాట్లాడతాయి చెవులు వినవు, చూస్తాయి, ధ్వని కిరణంగా మారి, కిరణం తరంగంలా కనిపిస్తుంది చిత్రమైన పదబంధాలూ, విచిత్రమైన వాక్యనిర్మాణాలూ, అప్పుడప్పుడూ పాఠకునికి "అగ్నిపరీక్షల"తో బాధపెట్టినప్పటికీ నరికొత్త భావచిత్రాలతో ఆలోచింపజేసే అంతరంగాలూ ఆవిష్కరించుకుంటూ ఉంటాయి! "త్రిపుర కథలూ", కవితలూ కూడా ఇలాంటివే ఆయని "పాము" కథనుంచి నిన్నటి "వలస పక్షుల గానం" దాకా, కొత్తగా వెలువడిన "బాధలూ, సందర్భాలూ" అన్న వచనా కవితా సంపుటిదాకా - "త్రిపుర" లో మనకు కనిపించే వ్యక్తి కేవలం అధివాస్తవికుడే కాదు, ప్రకృతిలోని ద్వైధీభావాన్ని వ్యక్తిలోని ద్వైధీభావాన్ని ఏకత్వంగా మలచుకోనేందుకు ఉద్యమిస్తున్న మూర్తి ఏకాంతాన్ని అభిలషించే వ్యక్తి "త్రిపుర"దృష్టిలో సామూహిక సద్వర్తనకు అలవాటు పడిన మానవుడుగా కూడా రూపొందాలి అతని దృష్టిలో నిశ్శబ్దాన్ని ప్రేమించిన కవి అలజడినీ ప్రేమిస్తాడు వాస్తవికతను ఆశ్రయించినవాడు అధివాస్తవికతనూ ప్రేమిస్తాడు, అహింసను ఆరాధించేవాడు గాంధీజీలా సమాజ శ్రేయస్సు

కోసం, దురన్యాయాలను ఎదిరించడంలో అవసరాన్నిబట్టి హింసనూ సహిస్తాడు, "తత్త్వమసి"గా, సమదర్శిగా, నిరాసక్తంగా ఈ లోక వృత్తాంతానికి రచనా కర్మసాక్షిగా అవతరిస్తున "త్రిపుర" తన లక్ష్యాన్ని ఒక సందర్భంలో ఇలా స్పష్టం చేశాడు "తన్నుతాను తెలుసుకోవాలి (తత్త్వమసి) తనకేది కావాలో తెలుసుకోవాలి అలా తెలుసుకోవచ్చునని తెలుసుకోవాలి, 'తన'లోంచి వేరుబడి తనను వేరే చూసుకోవడం నేర్చుకోవాలి ఆ క్షణంలో అతను ఏమిటి చేయాలో, అతని గమ్యం ఏమిటో అతనికి తెలుస్తుంది" "త్రిపుర కథల్లో"గానీ, వాటిలోని సూత్రపాత్రలుగానీ, ఆయన కవితలలో గానీ లోపాయకారిగా అంది వస్తున్న సందేశం ఇదే రెండు ప్రయోగాలలోనూ (కథ, కవిత) త్రిపుర చేసిన, చేస్తున్న పని సమాజంలోని దురన్యాయాలపైన, వ్యక్తమవుతున్న "నాగరికపు ఉన్మాదం" పైనా అధివాస్తవిక రచనాకళ ఆధారంగా కత్తివేటులు పెట్టడమే, ఇందుకు ఆయన అక్షరాలతో "అశ్వోత్సవా"లు నిర్వహిస్తున్నాడు! ఒంటరితనాన్ని అభిలషించినట్టు కనిపిస్తాడేగానీ ఆయన రచనలలో అభివ్యక్తమయ్యే ఆవేదన, ఆశయం - కలివిడితనమేనని మరవరాదు, అతను ప్రేమించి అభిలషించే మనిషిలోని "నేను" వ్యక్తిత్వపు సరిహద్దులకే పరిమితంగాని సమష్టిని ప్రతిబింబించే "మన"కు ప్రతికూలంకాదు ఆశయాలు, ఆదర్శాలు తుడుచుకుపోతున్నందుకు అతను పడుతున్న బాధకు నిదర్శనం "భగవంతం కోసం", "వలస పక్షులగానం" కథలు! అయితే త్రిపుర రచనలు అందరికీ అర్థమయ్యేవికావు, దానికి కారణం రచనా క్లిష్టతకాదు, శైలీ, భావచిత్రాల గంభీరత అందుకు కారణం సాల్వడార్ డాలీ సరియలిస్టు చిత్రాలను "అస్వాభావిక" చిత్రాలుగా కొందరు తలంచినప్పుడు వింత్రాప్ సార్జంట్ అనే ప్రసిద్ధ విమర్శకుడు *There is nothing abnormal about Dali He is simply anti-normal* అన్నాడు! అలాగే త్రిపుర రచనలు కూడా డాలీ ఒక పెద్ద కోడిగుడ్డు బొమ్మగీసి *"I am reborn"* అని తాను అందులోంచి పుట్టకొచ్చిన మనిషిగా చూపెట్టాడు! కాలీఫ్లవర్ బొమ్మగీసి *"All art begins with this humble vegetable"* అని చిత్రంగా వర్ణించాడు! ఒక జర్నలిస్టు తన ఇంటర్వ్యూకోసం వస్తే డాలీ "రావయ్యా, ఆ చెట్టుమీద హాయిగా కూర్చొందాం" అంటూ చెట్టు కొమ్మల మధ్య రెండుపడక కుర్చీలను అమర్చి ఉంచడాన్ని చూపెట్టాడు! ఇలా మనం ఊహించని భావచిత్రాలను, మనోవిన్యాసాలనూ పచ్చి పచ్చిగా, నిక్కచ్చిగా చూపెట్టడమే సర్రియలిస్టుల ఉద్దేశం నైరాశ్యం వల్లనే ఈ పనిచేస్తుంటారు కవులు అన్నమాట అర్థ సత్యమేగానీ, అసలు వాస్తవం కాదు! బహుశా అందుకే డాలీ "ఉన్మాదికీ నాకూ ఉన్న తేడా - నేను ఉన్మాదిని కాకపోవడమే"నని చెప్పి, ప్రజల్ని వెర్రెత్తించడం తన ధ్యేయం అన్నాడు! అయితే త్రిపురలాంటి కవులు ఆ ఉన్మాదానికి పోకుండానే, భారతీయ సమాజంలోని జీవన వైరుధ్యాలకు ప్రతిబింబాలుగా సింబల్స్ ద్వారా తమ నిరసనను తెలపడంతోపాటు, మనిషిలోని ఔన్నత్యానికి కూడా దివిటీలు పడుతున్నారు

సిద్ధాంత రాద్ధాంతాలతో విసుగెత్తిన త్రిపుర మనస్సు అప్పుడప్పుడూ నైరాశ్యంలో ("కళ్ళనీళ్ళ టీపాట్") "శూన్యపు విహారాల నిశ్శబ్దపు గంటల రాహిత్యంలోకి" వెళ్ళి విశ్రాంతి తీసుకున్నా, "కర్కశపు ప్రేమలతో జన్మలిచ్చిన మనతల్లుల్నీ తండ్రుల్నీ" శపించినా అదంతా సమాజ పరిస్థితిని శరించడంగానూ, ధర్మకోపంలో ప్రకటిస్తున్న ఆగ్రహంగానూ మాత్రమే భావించాలి! ఎందుకన్ని? [illegible] పక్కకి పెట్టుకుంటూ వెళ్తుండే మనిషి/అలసి, ఆఖరికి సొలసి/పిడికిళ్ళు తెరుచుకుంటాయి సముద్రపు అరచేతులు విడతాయి" అని అదే కవి భరోసా ఇవ్వగలుగుతున్నాడు! కవి అతడు చూపే ల్యాండ్ స్కేప్పు, డ్రీమ్ స్కేప్పు ఈ మనిషి

ఉద్ధరణకోసమే, వాడిలోని ద్వంద్వ ప్రకృతిని మాన్పించి "ఏకత్వం"వైపు అతణ్ణి నడిపించడానికే ఉద్దేశించాడు! కనుకనే అతను డాలీ లాగానే "కళ్ళచివర కాసారాల్లో వయోలిన్ రాగాల్ని" వంచుకోనూగలడు, "కలల పువ్వుల్ని రెక్కలు రెక్కలుగా" విరుచుకొని బయటకు విసిరి వేయకుండా భవిష్యత్తుపై ఆశతో 'గాజు సంతృప్తి కూజా"లో ఒక్కటొక్కటిగా పేర్చుకోనూగలడు! "పరుగునేర్చిన నేను పరుగెత్తాలి" అన్నప్పుడూ, "మనకి ఇండిపెండెన్సేమిటి మనం శుద్ధ వెధవలం, మనకి రక్షణొకటా, ఉత్తి ఫకీరు జాతి మనిది" అన్నప్పుడూ వ్యక్తమయ్యేది దేశభక్తేగాని, దేశద్రోహంకాదు, అది ప్రగతిరథం అవినీతిగుంటలో దిగబడిపోయి గుంటపూలు పూస్తున్నందుకు కవిలో పుట్టకొచ్చిన ఆవేదన, అసహనమూ మాత్రమే నిరాశలో సాయంకోసం ప్రకృతినో, దైవాన్నో ఆశ్రయించి, ఉపాసించే ధోరణిని త్రిపుర అపహాస్యం చేస్తూ మానవుల సామూహిక జీవనంలోకి సున్నితమైన కోణాలను మనకు చూపిస్తాడు; ఆఖరికి చనిపోయేటప్పుడు ఈ "మనుష్యుల భుజాలమీంచే పోతావు నీ అంతిమ విశ్రాంతికోసం/నీ చితి చుట్టూ చేరిన మనుష్యుల/కళ్ళ నీళ్ళలోనే మెదులుతూ వుంటావ్/ఆ మనుషుల జ్ఞాపకాల కళ్ళనీళ్ళలోనే కదులుతూ వుంటావ్"!! ఎంతటి విశ్వాసం, ఆత్మవిశ్వాసం అందుకే రాబర్ట్‌బరన్స్ కవి "మనిషే బంగారం" అన్నాడు. మానవ సమాజంలోని వైరుధ్యాలను నిరాసక్తంగా, నిష్పాక్షికంగా, వాస్తవికంగా, అధివాస్తవికంగా వర్ణిస్తున్న త్రిపుర దృష్టిలో కూడా జేమ్స్ జాయస్ అన్నట్టు *"Every life is mans day after day"* మార్మిక సౌందర్యంలోనే వజ్రసమానమైన భావచిత్రాలు "త్రిపుర"వి!!

డిసెంబర్ 30, 1990

# కారు మబ్బులూ! కళ్ళ నిప్పులూ!!

కడుపు నిండిన వాడి బేరం వేరు, కడుపు మండిన వాడి సారం వేరు! కష్టాల తిరుగలిలో నలిగిన వాడికే మానవ జీవితంలోని ఎత్తుపల్లాలు, సుఖసౌఖ్యాలు అర్థమవుతాయి అందులోనూ కవి అన్నవాడి దృష్టి, అతని కవితా సృష్టి సమకాలీన సమాజాన్ని రాజకీయంగానూ, సాంఘికంగానూ స్పృశించగలిగినదైతే జీవనరాగానికి శ్రుతిలయలు కుదురుతాయి ప్రజల, సామాన్య ప్రజల సుఖదు.ఖాలను, ప్రభువర్గాల నుంచి వారికెదురయ్యే ఇబ్బందులనూ, తరచుగా నిర్బంధ యంత్రాంగం నుంచి తారసిల్లే నిర్హేతుకమైన అణచివేతలను, అక్రమాలను మానవ అస్థిపంజరాలపై వ్యాపారం చేసే రాజకీయ వేత్తల వికారపు సంస్కృతినీ, ప్రజా వాంఛలనూ, నిరసననూ, సంతోషాన్నీ అక్షర బద్ధంచేసే ప్రజాకవికి ఆదరణ ఎప్పుడూ ఉంటుంది సాహిత్య అకాడమీలు సమాదరించడంకోసం కవి కవితలల్లడు స్పందన లేని జీవితాన్ని ప్రేమించలేని కవి మాత్రమే సామాన్యుని కామనను అర్థం చేసుకోగల్గుతాడు; ఆ కామనే అతని వేదన "నిజాయితీ లేకుండా, గాఢంగా నమ్మకుండా ఒక్క అక్షరం కూడా రాయలేదని" ఆత్మవిశ్వాసంతో ప్రకటించుకోగలిగిన కవుల కోవకు చెందిన కె.శివారెడ్డికి "మోహనా! ఓ మోహనా" కవితా సంపుటికి కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారం లభించినా, ఈ ఇరవై ఏళ్ళుగా సామాజిక స్పృహతో కవి పడుతూ వచ్చిన అంతర్మథనానికి, మొత్తం కవి తాత్త్విక చింతనకూ లభించిన ఆదరణగానే భావించాలి తన దేశాన్ని తన దేహంగా భావించుకున్న కవి స్పష్టంగా మార్గ నిర్దేశం చేసుకోగలుగుతాడు, సాముహిక చైతన్యాన్ని సమాదరించే వాడికీ, ఆరాధించేవాడికీ ప్రజల సుఖదుఃఖాలు అర్థమవుతాయి, అతనికి వ్యక్తి చైతన్యం జన చైతన్యంలో అంతర్భాగం, సామూహిక చేతన తనలోని వ్యక్తిత్వాన్ని మేలుకొలిపే ఒరపిడి రాయి "ఆసుపత్రి గీతం", "చర్య", "భారమితి", "మోహనా ఓ మోహనా" - 'శివ'న్నలో సైద్ధాంతిక క్రమ పరిణామానికి, అతనిలో తీవరిస్తూ వచ్చిన సంఘ చైతన్యానికీ ప్రతిబింబాలు దేనికదే మనిషిలో కర్తవ్య దీప శిఖలు నిలపడానికి ఉద్యమించిన అకుంఠిత ప్రయత్నానికి ప్రతీకలు నరాల్ని మండించి, గాలిలో చెమటని ఆరబెట్టుకొనే 'శివ'న్నకు కష్టంలోని సుఖం గురించి ఎవడూ ప్రత్యేకించి పాఠం చెప్పనక్కరలేదు! చైతన్యంలేని మానవుని జనవాన్నీ, మధ్యతరగతి కృత్రిమ మందహాసాలను అపహాస్యం చేసి పేదల నోళ్ళకు కవితా మార్గంలో ఘనంగా వాకిళ్ళు తెరిచిన కవికి - భావన ప్రధానం భాష, చందస్సులు అభిప్రాయ వ్యక్తీకరణను సునిశితం చేసి పెట్టే కేవల చాకిరీ సామాగ్రి! శివారెడ్డి వచన కవితలు వక్తృత్వ కవిత్వంగా కొందరు భావించవచ్చుగాని, ప్రజాకవి తన ప్రజలతో భావాల బట్వాడాలో ఏర్పడే అంతరాన్ని , అర్థంగానితనాన్నీ భరించలేడు కాబట్టి సూటిగానే, అలంకారాల మధ్యనే గొప్ప గొప్ప భావచిత్రాలతో కూడా ముందుకుసాగి స్పందన కలగజేస్తాడు. బహుశా కుందుర్తి ప్రభృతులు ప్రారంభించిన వచన కవితా ప్రక్రియను అందమైన పద చిత్రాలతో సమున్నత శిఖరాలకు చేర్చుతున్న బహుకొలదిమందిలో 'శివ'న్న ఒకరని చెబితే అత్యుక్తికాబోదు! కవి రాబర్ట్ ఫ్రాస్ట్ ఒకప్పుడు వచన కవితలను నేలబారు కవితలుగా భావించి *"Writing free verse is like playing tennis with the net down"* అని చపలత్వం ప్రదర్శించినప్పటికీ వెంటనే సర్దుకుని *"free verse is the triumph of mind over meter"* అని తలవంచ వలసివచ్చింది! ప్రజలతో, వారు అనుక్షణం సాగించే జీవన సమరంతో మమేకం కాగలిగిన శివారెడ్డి, మాటకు, భాషకు, కవిత్వానికీ చెప్పిన

లక్ష్య నిర్వచనం వేరు  శోకగీతాలకూ అశోక రాగాలకూ అర్థం తెలిసిన కవి మాత్రమే - "శత్రువు గుండెపగిల్తేనే/ఆ నెత్తుట్లోనే జీవన్మందారం వికసిస్తుంద'న గల్గుతాడు! వచన కవితను ధారాపాతంగా సాగించిన వాల్ట్ విట్‌మన్ లానే 'శివ'న్న మట్టి చరిత్రను గౌరవిస్తూ సామాజిక మార్పులకు, మలుపులకూ కారణమైన మనిషిని అతనికి దన్నుగా ఉన్న ప్రకృతినీ, జీవశక్తినీ, జీవితాన్నీ కీర్తిస్తాడు  తన కలాన్ని విచక్షణలో తెరిచిన నేత్రంగా, "కోటానుకోట్ల సూర్యుళ్ళని ప్రభవించే" ధృవతారగా మలచుకున్న కవి, ఆశ చావని మనిషిని గొప్ప వస్తువుగా భావించి అతనిలో మంచికోసం ప్రతిఘటనా శక్తిని పెంచుతాడు! 'శివ'న్న చరిత్రకు నూతనార్థం ఇచ్చాడు - ఊహకి భూమి పునాది, భూమిలోంచి ఎదిగిన మానవ వృక్షమే మనం; మట్టి చరిత్రే చరిత్ర, మట్టి మనిషి చరిత్రే చరిత్ర అన్నప్పుడు మన నారాయణబాబు వర్ణించిన "మాతృ మృత్తికా మధుర వాసనలు" గుర్తురావడమేగాక, మానవుణ్ణి చైతన్య స్వరూపుణ్ణి చేయడానికి కవి "ఛార్జి" చేస్తున్నాడని గమనిస్తాం! భూమిలో స్నానం చేయడం తెలిసిన 'శివ'న్న పశువులు తొక్కిన నేలని పుస్తకంగా భావించడం ఓ సహజ సుందర భావన! అది బతుకు పుస్తకం, అందులోనివి అనుభవ పుటలు!

శివారెడ్డి తన కవితా ప్రస్థానంలో అక్కరకు తెచ్చుకున్న ప్రతి అక్షరమూ, భావ చిత్రమూ, పద చిత్రమూ సంఘంలోని అన్ని వర్గాలలో పేరుకొన్న అవినీతినీ, నాల్క చీలిన ధోరణులను, దోపిడిని, వర్గపీడనను, ప్రజా వ్యతిరేక రాజకీయ కుట్రలను కుళ్ళబొడవడానికి వాడుకున్న కురారాలే, అతడు - ఆకాశపు పిడుగులేకాదు, కళ్ళ నిప్పులు, సాహసపు తొడలు, తుహిన వర్షపాతాలు, నిర్జీవ శాంతి కామధేనువులూ, నరాల్లో నిర్భీతి నదులూ, సిరానరసులమీద మహానగరాలు, కారు మబ్బులను చీల్చే కళ్ల నిప్పునూ చూపిస్తాడు, రాగోదయ కాహళులు పడతాడు, కుట్ర రాజకీయాలద్వారా జనాన్ని హత్యచేసే సుప్రభాతాలను కూడా చూపిస్తాడు, మాటల నాగళ్ళకూ, మంటల నాలుకలకూ స్వాగతం చెబుతాడు, చారెడు నేలకోసం జరిగే "యుద్ధ తపస్సులు" చిత్రిస్తాడు, ఏకాకి మనసు అంచులలో పేరుకొన్న సాంద్రనిశ్శబ్దాలనే కాదు, కట్టలు తెగి వీరావేశంతో దూకే నేత్ర సముద్రాలను సహితం కళ్ళకు బొమ్మ కడతాడు, అంతేగాదు, "ప్రతి మనిషినీ ఒక కల్లోలిత ప్రాంతంగా" మార్చే ఈ దోపిడీ వ్యవస్థలో సామూహిక చైతన్యమే ఏకైక రక్ష రేకగా భావిస్తాడు; కనుకనే ప్రజా ఉద్యమాన్ని "సామూహిక ఆగ్రహం" గా భావించి, మనిషిని మంచి చెడుల పూర్ణకుంభంగా ఎంచి - "మనిషంత విలువైన వస్తువూ మనిషే / విషతుల్యమైన వస్తువూ మనిషే" / నని చాటి, ఈ మనిషి బతుక్కోఅర్థమూ అతని అనుభవ సంపన్నతా సమూహంలోనే అని స్పష్టీకరించగలిగాడు! జోసెఫ్ ఉడ్ క్రచ్ అన్నట్టు *"poetry is a report of some human experience ordered in terms of concepts involving a value judgment"* కనుకనే, ఈ ప్రపంచంలో ఎంత విధ్వంసం జరిగినా - ధ్వంసం కాని "పరమ విధ్వంసక శక్తి", ఉత్పత్తికీ, పునరుత్పత్తికీ నిరంతరం పురుడుపోయగల జీవశక్తి జనమేనని 'శివ'న్నకు తెలుసు! ఎందుకని? జనం దేశానికి "సిరలూ, ధమనులూ", ఆ మొరటు పాదాల పవిత్ర ముద్రలే మానవాభ్యున్నతికి రాచబాటలూ గనక! ఈ సమ్యగ్ దృష్టి ఉన్నందువల్లనే శివారెడ్డి - రక్తమాగిపోయిన వాడు స్పందనను కొలవలేనట్టే, కళ్ళల్లో సూర్యుడు కదలాడని "వాడు ప్రపంచాన్ని స్పృశించలేనట్టే, శిరస్సు శిఖరాగ్రం పైకెక్కి "తలకిందులుగా జనం:జలధిలోకి దూకకపోతే" అది కవిత్వం కాదు పొమ్మంటాడు! నిత్య జాగరణలో, జాగరితమై సాగించే పాదయాత్రలూ, పదయాత్రలే కవిత్వానికి పద యాత్రలంటాడు! ఎందుకని?

మాటకు విలువుంది. రంకునేర్చిన "మాట" రాచకార్యమూ చేస్తుంది, జనద్రోహమూ చేస్తుంది కనుకనే ఈ అప్రమత్తత! నిశ్శబ్దం నిష్క్రియతకు ఆనవాలు, నిష్క్రియా వైధవ్యం తొలగడానికి అప్పుడప్పుడూ రక్తం చిందించవలసి వస్తుందన్నప్పుడు - దేశ స్వాతంత్ర్యమనే దొడ్డ వృక్షాన్ని కాపాడుకోడానికి అప్పుడప్పుడూ ప్రజలు త్యాగాలతో "ఎరువు" పెట్టుకుంటూనే వుండాలన్న జఫర్సన్ మాటలు గుర్తుకొస్తాయి! "మోహనా!" ఒక దురన్యాయంపైన, ఒక దుర్ఘటనపైన, చాపకింద నీరులా జరిగిన ఒక నేరంపైన 'శివ'న్న తెరిచిన (మూడో)సూర్య నేత్రం! చలనంలో జీవిస్తూ, ఆద్యంతం ప్రవహిస్తూ కోటి సూర్య ప్రభల్తో ఈ విశ్వం మీద వికసిస్తానని ఢంకా బజాయించే కవి శంకరుడేగాని శంకాపీడితుడుకాడు ! విట్మన్ అనలేదూ *"Beat! beat drums! Blow! bugles! blow"* అని! సత్యం, శివం - 'శివ'న్న కవిత సుందరం!!

డిసెంబర్ 23, 1990

# ఆ నిశ్శబ్ద క్షణంలో "బతికిన క్షణాలు"!

శైశవాన్ని ఎన్నటికీ వీడనివాడే కవి! ఎందుకని? ఎదిగినవాళ్ళలో ఉండే మాలిన్యం ముక్కుపచ్చలారని శైశవంలో ఉండదు, ఓ సముద్రపుఒడ్డును చూచి వచ్చిన ఓ చిరుతడు "ఇన్ని నీళ్ళిక్కడ ఎవళ్ళు ఒలకబోశారు" అంటే సమాధానం చెప్పడం కన్నతల్లికే కాదు, కవికి కూడా కష్టమే! శ్రీశ్రీ అన్నట్టు "శిశువు చిత్రనిద్రలో ప్రాచీన స్మృతులూచే చప్పుడు"ను వర్ణించడం కూడా ఎవడితరమూ కాదు! వాడెందుకు ఆ నిద్రలో ఉండుండి ఏడుస్తాడో, అకస్మాత్తుగా నవ్వుతాడో మనకు తెలియదు ఆ శిశుప్రాయమైన విచిత్రావస్థను మనం ఎంత తరచినా ఎలా అసంపూర్ణ అనుభవంతో, అసంతృప్తితో మిగిలిపోవలసి వస్తుందో - కవులు ప్రపంచాన్ని, అందలి వస్తురాశిని, మానవ మానవేతర ప్రకృతిని దర్శించే ఆ "మనః ప్రపంచపుటావర్తాలను" పట్టుకోడంకూడా అంత తేలికైన పనికాదు! బహుశా అందుకేనేమో సుందరమైన నైరూప్య కవితా చిత్రాలను అందంగా, రసనిష్యందంగా "చితి-చింత"లోనే ప్రారంభించి "బతికిన క్షణాలు" తలపోసుకుని ముందుకు సాగుతున్న సుప్రసిద్ధ ఆధునిక కవి మానవతావాది వేగుంట మోహన్ ప్రసాద్ కూడా తన బాల్యాన్ని వదులుకోడానికి ఇష్టపడడంలేదు అందుకే అతను "ఏనాడూ శైశవాన్ని మరచిపోకు/మనమింకా నేలా బండా ఆడుకునే పిల్లలం" అని ఏనాడో చాటుకున్నాడు! ఆ శైశవక్షణాలు ప్రకృతి ఆరాధ్యమూర్తులుగా ఆత్మకథా చిత్రంగా ఆత్మీయతా తలపోతల ఒలకబోతలతో, వాస్తవాన్ని మించిన అతివాస్తవంతో - అధివాస్తవికంగా అద్భుత భావచిత్రాలతో ఆంధ్రదేశం మీదికి వేగుంట అచ్చుబోసి వదిలిన సజీవచిత్రాలు "బతికిన క్షణాలు"! శిశువుమనస్సు అర్థమయితే ఈ ఆత్మకథ అర్థమవుతుంది జేమ్స్‌జాయిస్ "యులిసెస్" లాగా, ఐన్‌స్టీన్ "సాపేక్ష సిద్ధాంతం"లాగా, "బతికిన క్షణాలు", కూడా ఒక్క పఠనంతో అర్థం కాకపోవచ్చు కొంటె కోణాలు, పచ్చినిజాలు, కొంత తాత్త్విక దృక్పథం, ఇంకొంత ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య పరిచయాలూ, మరికొంత మనస్తత్వశాస్త్రం - ఇన్నింటి కలగాపులగపు రచనే అధివాస్తవిక రచన ఎందుకంటే వ్యవహార జీవితంలో తారసిల్లని వాస్తవికతను కూడా కవి కల్పనాజగత్తులో ప్రవేశపెట్టడం "సర్రియలిస్టు" సంప్రదాయ లక్షణం. సాల్వడార్ దాలీ చెప్పినట్టు ప్రజల్ని (పాఠకులను) వెర్రెత్తించడమే వేగుంట ఆశయం కూడా అయితే తాను ఉన్మాది కాకుండానే ఇతరులను "చల చంచల సౌందర్యపు" ఉన్మాదంలోకి కవి జయప్రదంగా నెట్టినట్టే లెక్క! బాల్యదశలోని తన అనుభూతులను అరమరికలు లేకుండా కవి అధివాస్తవిక చిత్రణ ద్వారా, గొప్ప భావచిత్రాల ద్వారా - "చైతన్య స్రవంతికి" మించిన భావధారగా అదే జీవధారగా సాగించిన రచన "బతికిన క్షణాలు" మరొక మాటలో చెప్పాలంటే అశ్లీలంగా కనిపించే పచ్చినిజాలు సహా అనుక్షణం పరిణామంలోఉన్న మానవజీవితంపైన, మంచి చెడులపైన అవహేళనతో అభిశంసనతో, ఆత్మగౌరవంతో, శిశు మనస్తత్వంతో, స్ఫటికంలా సాగిన వ్యాఖ్యానం ఇది భావ ప్రకటనకంటే కూడా భావసూచన - 'శబ్దం'ద్వారా ప్రతీకలతో (సింబల్స్) చేయడంలో కవి ఉన్నత శిఖరాలు అందుకున్నట్టే కన్పిస్తుంది సంజ్ఞను మాత్రమే సమాశ్రయించి, భావచిత్రణను సాధ్యమైనంత కుదించి కాలానికీ, స్థలానికీ మధ్య తాత్త్విక సమన్వయం సాధించిన రచనగా దీన్ని చెప్పుకోవచ్చు ఇది సంప్రదాయాల సర్వనిరసన కాదు, నిరాశకూ, నిట్టూర్పుకూ నిలువుటద్దంగా వెలసిన రచన అంతకంటే కాదు! విలువలు కోల్పోతున్న ప్రపంచానికి నిరసన మాత్రంగానే అయినా ఆశావహమైన మానవతా దృక్పథాన్ని

అబ్బించడానికి ప్రేమతో చరిచిన దెబ్బలివి, సర్రియలిజం అంటేనే - ఒక్కముక్కలో పచ్చినిజాలు అన్నీ! ఈ రచన 'నూత్న ప్రయోగం'గా తానెందుకు తలచిందీ చెబుతూ కవి చెప్పిన పదమూర్ఛనలలో కూడా అందమైన భావచిత్రాలు రసగంగాధరాలుగా ఇట్టే ఆకట్టుకుంటాయి. "వాస్తవాన్ని అధివాస్తవికంగా మలచుకునే ప్రయత్నంలో వచనం విరిగి ముక్కలయి ఆ గాజు పెంకులు పద్యానికి గుచ్చుకొంటాయి", అయితే "తారీఖులూ, దస్తా వేజులూ ఏమీలేని అనామక స్వీయజీవనచిత్రణ ఈ బతికిన క్షణాలు" అని వేగుంట ఎంత చెప్పినా, పల్లె జీవనంతో పెనవేసుకున్న మోహన్‌ప్రసాద్ అక్కడి సహజసుందర దృశ్యాలను, చిన్ననాటి మొదటి గుర్తులైన కర్వేపాకు, బండివాడి చర్నాకోలు, రాయపూడి జామతోటల్లో దొంగతనంగా పళ్ళు కోసుకొచ్చిన క్షణాలు, ఆ తొలినాటి ఆశలు, ఆకారాల సంస్మరణ మనకు వింతరుచులుగా మాటల రంగులలో చూపుతాడు ఈ రచనకు ఆధారం కూడా జాయిస్ "యులిసెస్' లో "మిస్టర్ బ్లూమ్" ఒకరోజు జీవితం లాంటి ఇరవై నాలుగ్గంటల జీవన దృశ్యాలే, మనోఫలకంపై ముద్రితమైన రకరకాల అనుభవాలే, తెగి ఎగిరిన గాలిపటాల్లాంటి అనుభూతి శకలాలే జాయిస్ అన్నట్టుగా ఇవి కూడా *"a mobility of illusory forms immobolised in space, remobilised in air"!*

ముప్పయి తొమ్మిదేళ్ళకే నూరేళ్ళు నిండిపోయిన డిలాన్ థామస్ దక్షిణవేల్స్ (ఇంగ్లండ్)లోని పల్లె జీవనంలో తన చిన్ననాటి జ్ఞాపకాలను ఇలాంటి అధివాస్తవిక వాసనలు తొడిగి "పోర్ట్రేట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ యంగ్ డాగ్" అనే ఆత్మకథను ప్రచురించాడు. రూకలకు రెక్కలు రావడం అంటే ఐశ్వర్యం అస్థిరమని చెప్పడమే! అలాంటి భావచిత్రాలు, రసమయభావాలూ, చిత్రవిచిత్ర వర్ణనలూ, వర్ణనా వైచిత్ర్యంతో కనులకు విందు, మనసులకు పసందూ చేస్తాయి కవి నిర్మలమైన మనస్సుకు నిదర్శనం "కల్పిత రహస్యాల్ని విప్పారిన కళ్ళతో ఒలకబోసుకున్న క్షణాలు వృథాకావు లాగు జేబుల్లోనూ చొక్కా చేతుల్లోనూ ఉండవు పక్కచూపులు, స్నేహ సహాయాలూ" అని కవి చెప్పడం. అతనే చెప్పినట్టు "ప్రకటితం చేయలేని ఆందోళన ఇతర మార్గాలద్వారా వ్యక్తం కావడమే" సర్రియలిజం కాదా? జాయిస్ చూపిన కొత్త టెక్నిక్ అసంపూర్ణ చిత్రాలలోనే అలవోకగా సంపూర్ణభావనా ప్రపంచాన్ని ఆవిష్కరించడం, చలం ఆశించినట్టు పదాలలో ఏకనామినీ పాటించడం, ఈ కవి లక్ష్యం కూడా మునిసిపల్ లైట్లను "నగరంలో రహస్య కాంక్షల దారుల చీకటివెలుగులకు ఊగుతున్న పురపాలక వెల్తురు గాజుబుడ్లు"గా చిత్రించాడు ఉన్నట్టుండి అసందర్భంగానే అయినా ఏ అచేతన దశలోనో సంధ్యకేసి చూచినప్పుడు ఓ బీచీలో కనిపించిన ఓ "కన్యకా పరమేశ్వరి" నిరాశలోవున్న వాడి భుజం తట్టి "నిద్రలో ఊగిన ఊయలని మళ్ళీ ఊపిన" ఓ డాక్టర్ ఫణిక్కర్ స్ఫురణకు వస్తారు! మనిషి సవాళ్ళను ఎదుర్కొని నిలబడాలేగాని, జీవితం నుంచి పలాయనం చిత్తగించే యత్నం పిరికితనంగా కవి భావించాడు అలాగే "ఏమి రాసినా చీకట్లో రాయాలి వెలిగే కలంతో" అని భరోసా చెబుతూన్న కవి తన అమాయకత్వాన్ని కూడా ప్రదర్శించుకోకుండా ఉండలేడు తాను స్వాప్నికుడుగా, అధివాస్తవికుడిగా జీవిత వ్యాఖ్యాతగా, జీవిత సహచరుడుగా, మనిషి అభ్యుదయాన్ని కాంక్షించి ధర్మకోపంలో శపించగల విశ్వామిత్రుడుగా ప్రవర్తించే వేగుంట మనిషిలోని పిరికితనాన్నీ పిసినారితనాన్నీ, హ్రస్వదృష్టినీ, వాస్తవాన్ని చూడనొల్లని ధోరణినీ ఒక్క వాక్యంలో చెప్పాడు "ఆరేళ్ళో అరవైఏళ్ళో బతుకుతాం. ఆరేళ్ళ ముందు ఎలా పుట్టామో ఎవడికీ తెలీదు అరవై తర్వాత ఎలా చస్తామో మనకీ తెలీదు, తీసుకుతీసుకుని తడిసిన నులకమంచానికి తప్ప! ఆరునుంచి అరవైదాక ఈలోపల బేరమాడ్తాం!" మరికొన్ని భావదృశ్యాలు

కలల కళ్ళు మెలకువలో పగిలిపోతాయ్. ప్రతి పదార్థానికి ఒక చైతన్యం ఉంటుంది పలుగే తవ్వుతుంది వజ్రాన్ని వేలుజారిన ఉంగరం వేలికి తగుల్తుంది కాలుజారిన అమ్మాయి రూపాయిచేతులకు చిక్కుకొంటుంది. అలల్లో వలలోకి కవల చేపపిల్లలు చిక్కుకుంటాయి ఆశల కాంతులు నిరాశలో నీడలవుతాయి, వీడిన శ్వాసలే ఈ ప్రపంచమంతా వీచేగాలి. అలారం గుక్కపట్టి ఏడ్చే పసిపాప - " ఇలా ఎన్నెన్నో దృశ్యాలు కవి మనస్సుపడే బహిరంతర సంఘర్షణ, గొణుగుడు, సణుగుడూ అధివాస్తవిక రచనారూపంలో ప్రతిఫలించిన భిన్నార్థాల, ఏకకాలంలో స్పందించిన అనుభూతుల సమ్మేళనమే "బతికిన క్షణాలు" జాయిస్ "యులిసెస్" రచన పాఠకులకు అర్థం కావడానికి ఓ వ్యాఖ్యాన గ్రంధాన్ని *("A Study")* రాసిన ప్రసిద్ధుడు స్టూవర్ట్ గిల్‌బర్ట్ అవసరమైతే అలాంటి వ్యాఖ్యాత ఒకరు వేగుంట కలానిక్కూడా అవసరమేమో! నిరంకుశుడైన కవిని మరింత స్పష్టత కావాలని శాసించలేనప్పుడు, ఇలా అయితే మా కర్థమవుతుందని పాఠకులు కోరుకోవడంలో తప్పులేదు. *"Poetry is the synthesis of hyacinths and biscuits"* అన్న కారల్ శాండ్ బర్గ్‌లా చివరికి ఏ కవీ నా కవిత నాకే అర్థం కాలేదన్న స్థితికి కూడా *("I've written some poerty I don't understand myself")* రాకూడదు కదా! "బతికిన క్షణాలు" పూర్తిగా అర్థం కావడానికి తగిన తాళంచెవులు కూడా వేగుంట దగ్గరే ఉన్నాయి! కాని అతను బయటపెట్టడు! బయటపెట్టేదాకా కొంత మనకీ అన్వేషణా తప్పదు!!

నవంబర్ 18, 1990

# తమ్మల మనసులు దోచిన 'తుమ్మల'!

"లోకంలోని అక్రమాలను జూచి ఆక్రోశించిన రక్తం, ఉన్నత భావాలను ఉద్రేకించిన రక్తం, పరుల సేవలో పాలిపోయిన రక్తం, పవిత్ర భావాలచేత పావనమైన రక్తం, గొట్టాలు చిమ్మినట్టు ప్రవహిస్తున్నది" ఈ మాటలు విన్నవాళ్ళూ, చదివినవాళ్ళూ ఈ భావాలు ఏ 'విరసం' కవులవనో లేదా నక్సలైట్ల త్యాగాలకు హారతులు పట్టిన వారి కీర్తి పతాకాలను ఎగురవేయదలచిన ఏ పుండాకోరువోననో భ్రమించే అవకాశం ఉంది! కాని సుప్రసిద్ధ గాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధులలో ఒకరైన ఉన్నవ వారు "మాలపల్లి" నవలలో భూస్వాముల దౌర్జన్యానికి బలైపోయిన వ్యవసాయకూలీ "సంగదాసు"ను 1921లోనే వర్ణిస్తూ చెప్పిన మాటలివి ఒకనాడు తెలుగు సాహిత్యంపైన రష్యా అక్టోబర్ మహావిప్లవం నెరపిన ప్రభావంలో వెలసిన రెండు గొప్ప నవలలు మాలపల్లి, నారాయణరావు (అడివి బాపిరాజు). ఆ విప్లవ ప్రభావంలోనే మరి ఇరవై మూడేళ్ళకు మార్క్సిస్టు భావాలతో ఆంధ్ర సాహిత్య సంస్కారంలో నూతనాధ్యాయానికి వాకిళ్ళు తెరిచిన దశ అభ్యుదయ రచయితల ఉద్యమం ఇది ఒక్క రోజున పుట్టింది కాదు, ఒక్క పూటలో ఎదిగింది కాదు అది రకరకాల సంస్కారాలకు సేతువూ, హేతువూ భారత జాతీయోద్యమం, కాంగ్రెస్ ఉద్యమం, బ్రహ్మసమాజ భావాలు, వీరేశలింగం సంఘసంస్కర ణోద్యమం, గాంధేయవాదం, సోషలిజం వ్యాప్తి, ఫాసిజం ప్రతిఘటన - వీటన్నింటి సమాహారంగా, మేలిమి సంస్కృతికి వారసత్వంగా, ప్రగతిశీల భావాల కోలాహలంగా రూపుకట్టుకొన్నదే ఆంధ్ర అభ్యుదయ రచయితల ఉద్యమం ఈ ఉద్యమ నిర్మాణంలోని కష్టసుఖాలను ఆదినుంచి పంచుకొని, సంఘంతో పాటు ఎదుగుతూ వచ్చిన సారస్వతేయులలో ఒకరు మూడేళ్ళనాడు కన్నుమూసిన తుమ్మల వెంకట్రామయ్య. ప్రసిద్ధుల జీవిత - సాహిత్యాలను పరిశోధించి ఇటీవల వెలికితీస్తున్న డాక్టర్ ఏటుకూరి ప్రసాద్ సంపాదకత్వాన తాతాజీ జీవితం- రచనలు, కొంపెల్లవారి జీవిత, సాహిత్యాల తర్వాత తాజాగా జాలువారిన ఉత్తమ సంపుటి "తుమ్మల సాహిత్యం" "తెనుగులెంక" సీతారామమూర్తికి, అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్మాతలలో ఒకరైన వెంకట్రామయ్యకు పోలిక ఇంటిపేరులోనే గాదు దోపిడీలపై కలాలచే తిరుగుబాటు చేయించి కవితా ధర్మాన్ని చాటడంలో కూడా ఇరువురికీ సామ్యం ఉంది. "ధరలు పడియె/సేద్యంబు తక్కువాయె, శిస్తుమెండాయె" అని ఒకరు వేదనపడితే ఇంకొకరు "వెలలు బొత్తిగ కూలిపోయెను/కాసుయొక్కటి కానరాదుగ, రాగిదమ్మిడి రత్నమాయెను" అని ఆవేదనపడితే, మరొకరు "అగునా జీవాలు/సాగునా లోకాలు" అని ఆక్రోశిస్తే, 'అభ్యుదయ' తుమ్మల కమ్యూనిస్టు ఉద్యమ ప్రకాశనంలో ముందుకు సాగి "సామ్రాజ్యవాదంబు నమసిపోవంగ/ధనిక వాదంబెల్ల/దగ్ధమైపోవ/పేద రక్తలమేను/వేడిరక్తంబుంటె/కూలీల గొంతులో కొనవూపిరుంటేను" అదురుబెదురు లేకుండా 'ఎర్రజెండా' ఎగరేయమని ప్రబోధించిన వాడు. సుమారు నలభయ్యేళ్ళ అవిశ్రాంత సేవలో తమ్మల వెంకట్రామయ్య రాజకీయవేత్తగా, సంస్కర్తగా, విప్లవకారునిగా, అజ్ఞాత కలం వీరుడుగా, అభ్యుదయ సాహిత్య రచయితగా, కవిగా, కథకుడుగా, జర్నలిస్టుగా, వ్యాసకర్తగా తెలుగువాట కమ్యూనిస్టు ఉద్యమానికేగాక సాహితీ యువతరం ఎదుగుదలకు ఎంతో సహకరించిన మేధావి. రచనలు బళ్ళకొద్దీ చేయకపోయినా, అతను రాసిన కొలదిపాటి కవితలు, సమీక్షలు, వ్యాసాలు, అనువాదాలూ అభ్యుదయ సాహిత్యోద్యమానికి పట్టుగొమ్మలుగా పనిచేసాయి. తెలుగుతల్లి,

నవశక్తి, "స్వతంత్ర భారత్", ప్రజాశక్తి, అభ్యుదయ, విశాలాంధ్ర పత్రికల తీరుతెన్నులు దిద్దితీర్చడంలో నాడు ప్రముఖ పాత్ర నిర్వహించిన ముఖ్యులలో ఒకడాయన తనను పట్టభద్రుణ్ణి చేసిన కాశీ విద్యాపీఠం నుంచి రాజమండ్రి వరకూ రాజకీయ, సాంస్కృతిక కళారంగాలే తుమ్మలకు విశ్వవిద్యాలయాలు నిగర్వి, నిరాడంబరుడు, సౌమనస్యం, సౌశీల్యం మూర్తీభవించిన వ్యక్తిగా సారస్వత వివేచనలో సంస్కృతీ దర్శనంలో, రాజకీయ భావధారలో భిన్నధృవాలమధ్య కూడా సామరస్యాన్ని సాధించి కాపాడగల సమన్వయ కర్త

ఇవన్నీ ఒక ఎత్తుకాగా, ఆంధ్ర అభ్యుదయ రచయితల ఉద్యమంలో, సంఘ నిర్మాణంలో, రచయితలను నవ్య సమాజ వ్యవస్థవైపునకు ఆకర్షించడంలో తుమ్మల ప్రలోభాలకు, ప్రచారానికి దూరంగా, అజ్ఞాతంగా చేసిన కృషి - అనన్యసామాన్యం తుమ్మలకు గురువూ, ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో, సాహితీవేత్తలలో ఒకరూ మద్దుకూరి చంద్రశేఖరరావు తెలుగువాడి సంస్కృతీ పునరుజ్జీవనోద్యమానికి, సంస్కరణోద్యమానికి బీజాలు నాటి చైతన్య జ్వాలలు రగుల్కొల్పడానికి ఉద్యమించిన వీరేశలింగం, గిడుగు, గురజాడ, చిలకమర్తి లక్ష్మీనరసింహం, బళ్ళారి రాఘవ, దామెర్ల, కాశీనాధుని నాగేశ్వరరావు, కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతులను క్రమంగా దేశం విస్మరిస్తున్న విషమ ఘడియలవి. మనకూ ఒక చరిత్ర ఉందని చాటి, యూరప్‌లోనూ, ఇండియాలో ఉత్తరాదినా సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు నడిచినట్టే ఆంధ్రులకూ అలాంటి మేలిమి సంప్రదాయం ఉందని చాటి ఆ మహనీయులనూ వారి రచనలనూ ఒక్కచోట చేర్చి ప్రచురణార్థంచేసి మొదటిసారిగా వాడవాడలా అనన్య ప్రచారంలోకి తీసుకురావడానికి అంకురార్పణ చేసినవాడు మద్దుకూరి, అందుకు చేదోడు, వాదోడైనవాడు తుమ్మల నాటి వారి వివేచనకు కొలబద్ద జాతీయత. ఆ పూర్వరంగంలోనే అభ్యుదయ రచయితల సంఘం (అరసం) ఆవిర్భావమూ భాషలో, భావంలో ప్రజాస్వామ్య విప్లవ యుగాలకు అది శ్రీకారం చుట్టింది దిగవల్లి శివరావులాంటి ఏ ఒకరో ఇద్దరో తప్ప - ఆనాడు తెలుగు మేధావులెందరో "అ ర సం" కృషిని కేవల వాగాడంబరతగా, ఉబుసుపోని కవితా మండలిగా, శవప్రాయమైన రచనా సంస్థగా కాకుండా సంస్కరణోద్యమ పతాకగానే భావించారు. మానవాభ్యుదయ ఆదర్శంలో, సాహితీ సేవాదీక్షలో నాడు "అరసం"కు చేయూత నిచ్చినవారు ఒకరా, ఇద్దరా - తాపీ ధర్మారావు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, దేవులపల్లి, అడివి బాపిరాజు, కొడవటిగంటి, శ్రీశ్రీ, ముద్దుకృష్ణలాంటివారు ఎందరెందరో ఉన్నారు అయినా దిగవల్లి దృష్టిలో అరసం కృషి అనర్థదాయకం! ఎందుకట? అమ్మ తాను పెట్టదు, తిననివ్వదన్నట్టుగా తెలుగు సంస్కృతీ పునరుజ్జీవన కర్తలైన వీరేశలింగం ప్రభృతుల కృషిని ముందుకు తీసుకువెళ్ళడానికి కలేజా ఉన్న కటిబద్ధులైన 'మొగాళ్ళు' కలికానికన్నా దొరకని సమయంలో అభ్యుదయ రచయితల సంఘమూ, కమ్యూనిస్టు మేధావులూ మాత్రమే ఆ బరువు బాధ్యతలను తలకెత్తుకున్నారు కనుకనే అరసం తొలి మహాసభను (1945) "ఆంధ్ర సాహిత్య చరిత్రలో చరిత్రాత్మక దృశ్యం"గా విజ్ఞులు ప్రశంసించవలసి వచ్చింది అయినా వారు "వీరేశలింగాన్ని కామ్రేడ్ వీరేశలింగం"గా సృష్టిస్తున్నారని దిగవల్లి వాపోయి అభాసు పాలయ్యారు. అరసం గొడుగునీడే లేకపోతే నాడు 'ప్రజానాట్యమండలి'లేదు, సాహితీ వ్యవసాయ క్షేత్రంలో 'అరసం' భావంలో, భాషలో రాజనాలు పండించకపోతే, దాని ప్రభావమే లేకపోతే, అంతకుముందు ఫైజ్‌పూర్ కాంగ్రెస్ నాటికే అరసం నిర్మాణ చర్చలు ఒక ఆకృతిని దాల్చి ఉండకపోతే -

తెలుగు సరస్వతి తెగువతో ఇన్ని 'మహాప్రస్థానా'లు, 'ఖడ్గసృష్టి'లూ ప్రసవించి ఉండేది కాదు విశ్వసాహిత్యమాల, నవ్య సాహిత్యమాల, ఆదర్శ గ్రంధమండలి, సంస్కృతీ గ్రంధమండలి అంత ఉధృతిలోకీ, వ్యాప్తిలోకీవచ్చి ఉండేవి కావు, "నయాగరా"లు, "కల్పన"లూ "వజ్రాయుధా"లు, "అరుణరేఖలు", "రుధిరజ్యోతి"లూ "తెలంగాణా", "అగ్నిధార" "సంఘర్షణ" ప్రాచుర్యంలోకి వచ్చేవి కావు, "కొత్త పాళీలు" పదునెక్కేవిగావు! అలాగే మరచిపోయిన తెలుగు కళారూపాలను మరవరాని సంస్కృతీ ఖండాలుగా మలచిన "ప్రజానాట్యమండలి" సమక్షంలో "మాభూమి", "పరివర్తన", "వీరకంకణం", "పోతుగడ్డ" విస్మృత కళారూపాలుగానే మిగిలిపోవలసి వచ్చేది!! కనుకనే తుమ్మల 'అరసం' సభలకు ముందే "తెలుగుతల్లి"లో లక్ష్యాన్ని నిర్వచించి, విజయాన్ని ఆవాహనం చేస్తూ విశ్వ సంస్కృతిలో ఆంధ్ర సంస్కృతి ఎలా అంతర్భాగం కావాలో చెప్పాడు 'బానిసత్వమూ, దారిద్ర్యమూ, సంకుచితతత్వమూ, అజ్ఞానమూ సంస్కృతిని బంధించిన నాలుగు ఉక్కు గోడలు; విశ్వహృదయాన్నీ మనవ మేధస్సునూ ఆవరించుకున్న చీడపురుగులు చీకటిలో ఆక్రమణ నుండి సంస్కృతిని రక్షించాలి ఆత్మరక్షణ చేసుకోవాలి.. స్వాతంత్ర్య సమతా ఖడ్గధారులైన వీరుల బారులో, దాస్యదుర్గవిచ్ఛేదనానికి సాగిపోతున్న వీరులబారులో, విశ్వసంస్కృతి చేరాలి - చేరక తప్పదు సంస్కృతి జీవచ్ఛవమై పడివుండరాదు - పడివుండలేదు చరిత్ర ప్రసిద్ధమైన సర్వకళా సంశోభితమైన ఆంధ్ర సంస్కృతి స్థానం ఆ వీరుల బారులోనే - ప్రథమశ్రేణిలోనే"! ఆ విశ్వాసమే ఆయన ఉఛ్వాసనిశ్వాసాలు ఆయనే ఓ సందర్భంలో చెప్పుకొన్నట్టుగా దప్పికగొన్నవాడు కావ్యరసంతో దప్పిక తీర్చుకోలేడు, ఆకలిగొన్నవాడు వ్యాకరణంతో ఆకలి తీర్చుకోలేడు అందుకే సంస్కృతీ విభావానికి అర్థం మానవుని భౌతిక పరిస్థితులను మార్చడం, తద్వారా అతనికి మానసిక ఔన్నత్యాన్ని సాధించడం, ఇందుకోసం నిరంతర పోరాటం సాగించడమూ కనుకనే ఎందరెందరి తమ్ముల మనస్సులనో దోచుకున్న తుమ్మల ఏనాడో దండోరా వేశాడు "కలకాలం ఈ రాక్షస కలికాలం నిల్వబోదు/కలకాలం ఈ దానవ పరిపాలన సాగబోదు"!!

జనవరి 1, 1990

# జ్ఞాపకాల వెల్లువ 'వరదకాలం'!

చౌకలి పద్దుల్లాంటి చచ్చుపుచ్చు రచనలతో కాలక్షేపం చేసేవారి సంగతేమోగాని జీవన సమరాన్నీ, ఇంద్రధనుస్సులానే విభిన్న జీవన రంగాలను ప్రతిబింబించే రచనలకే ఏనాటికైనా విలువా, విశిష్టతా కావలసింది, రొడ్డకొట్టుడు రచనలు కాదు, మానవులమధ్య, మానవ జీవితంలోని సుఖదుఃఖాలకు, సాహిత్యానికీ, సరదాలకు అద్దంపట్టే రచనలు అన్నాడు ఎ బి ఆల్కాట్ *("The less of routine, the more of life")* వయొలిన్‌తో శ్రోతలకు వీనులవిందు చేస్తూనే - వాద్యపరికరం గురించి కూడా ఏకకాలంలో తెలుసుకోగోరేవాడే మంచికళాకారుడన్నాడు శామ్యూల్ బట్లర్ ఈ లక్షణాలు ఏకాంతంలోనేగాక పదిమందితో కలివిడితనంవల్ల మరింత ఎక్కువ రాణింపునకు వస్తాయి విద్యాగోష్ఠులు, విద్వద్గోష్ఠులూ వర్ధమాన రచయితలకు, కళాకారులకూ అభ్యుదయ పరంపరాభివృద్ధికి ముఖద్వారాలు కుటుంబ సంస్కారం, సాహిత్య సంపర్కం ఈ అభిరుచిని ఇబ్బడిముబ్బడిగా పెంచే ముడిపదార్థాలు విజ్ఞానఖని అయిన అబ్బూరి రామకృష్ణారావుకి "పండితపుత్రుడు"గా కాకుండా తండ్రికి దీటైన సాహితీ మూర్తిగా, నాటకకర్తగా, కవిగా, రచయితగా, పాత్రికేయునిగా, ప్రయోక్తగా, చేయితిరిగిన ప్రచురణ కర్తగా, గ్రంధకర్తగా ఎదిగివచ్చిన వరదరాజేశ్వరరావు మరొక రచన "వరదకాలం" నవ్య సాహిత్య చరిత్రకు, ఆదునికాంధ్ర సాహిత్య చరిత్రకు, కవితా విప్లవాలకూ పూర్వరంగాన్ని సమకూర్చి, పథనిర్దేశంలో వైభవ పతనాలను, అన్ని రకాల కవితా ఉద్యమాలకు మెట్టినిల్లుగా మారిన అబ్బూరివారి సాహిత్య సదనంలో జరిగే గోష్ఠి కార్యక్రమాలను వర్షిష్ణువుగాసన్నిహితంగా పరిశీలించిన "వరద" రచన సాహిత్య చరిత్రకాదు, స్వీయచరిత్రే! అయితే అది ఇంకా అసంపూర్ణమే 1985లో ఒక దినపత్రికలో ధారావాహికంగా తెలుగు సాహితీలోకాన్ని భావనా రసజగత్తులో ఓలలాడించిన "వరదకాలమ్" ఏనాడో అచ్చుకావలసింది కానీ, 1987-88లో వచ్చిన 'కవన కుతూహలం" ముందు అచ్చయింది ఎందుకంటే - వరద కవనకుతూహలానికి పూర్వరంగం 'వరదకాలమ్'కాగా, అర్ధశతాబ్దంగా సాగిన సాహితీ సమరాంగణంలో రాజేశ్వర్రావు కర్మసాక్షిగా తెలుగువారికి పంచవలసిన భావపరంపర ఇంకా అనంతంగానే మిగిలిపోయింది కారణం - వరద ఒక సందర్భంలో చెప్పినట్టుగా "నాకు తెలిసిన వన్నింటినీ అక్షరబద్ధం చేసి అచ్చువేయడం కష్టం, కొన్ని బహిరంగంగా చెప్పుకోవడానికి వీలువేనివి ఉంటాయి కీర్తిశేషుల మీద గౌరవం కొద్దీ అలా రాయడానికి వీలుండదు. భావ్యం కాదు" అని భావించి, తన సంస్కారాన్ని ప్రకటించుకోవడం అర్ధశతాబ్దం సాహితీ చరిత్ర అంటే మరొకవిధంగా సాంఘిక చరిత్ర అనే అర్థం సంఘ జీవనం ఆధారంగా, జాతీయ, రాష్ట్రీయ ఉద్యమాలు ఊతగా కదలుతున్న కావ్యరథమూ, భావనాస్రవంతీ రచయితల స్వీయచరిత్రను ఆవిష్కరిస్తూ ఉంటుంది. వరద కవన కుతూహలం, వరదకాలం సాహిత్య గోష్ఠుల, సాహితీమూర్తుల హృదయ వీణాతంత్రులు వినిపించగా, ఆయన "నాట్యగోష్ఠి" తెలుగునాట రంగస్థల నిర్మాణ, నాటికా, నాటక ప్రయోగాల విశిష్ట రచన తన ప్రత్యక్ష అనుభవాలకూ, అనుభూతులకూ, ఏభయ్యేళ్ళ రాజకీయ సాహితీ సాంస్కృతిక రంగస్థలాలపైన పాత్రధారులైన అసంఖ్యాకమైన ఉద్దండపిండాల కార్యకలాపాలకూ సరసమైన ప్రతిబింబం, గడుసు రచన "వరదకాలం"! రచనలో నైశిత్యం, వాక్కులో చమత్కారం రథచక్రాలుగా సాగిన శారదామూర్తి రచయిత అసాధారణ జ్ఞాపకశక్తికీ, ఆశువుగా సాగిన అనుభవ సంపద ఆవిష్కరణకూ ఇది తిలకప్రాయం

గురజాడ, గిడుగు, రాయప్రోలు, అబ్బూరి, ఉమాకాన్తం, దేవులపల్లి, శ్రీశ్రీలు పురోహితులుగా కావ్యరచనారోచిస్సులు చిందించిన నవ్యకవిత్వ, అభ్యుదయ కవితా ఉద్యమాల ప్రభావంలో ముందుకు సాగిన తెలుగు భారతికి ఇది వ్యక్తి పరిచయస్థాయిలో సాగిన అందమైన వ్యాఖ్యానం ఈ తరం వారికి తెలియని ఎన్నో విషయాలు తెలుసుకోదగిన వారికి ఈ గ్రంథం తోడ్పడుతుంది కవిత, రంగస్థల ఉద్యమాలకు, వృత్తి పదకోశాలకూ, పదప్రయోగ కోశాలకూ ఆద్యులలో ఒకరుగానే గాక పత్రికా సారస్వాతా నుబంధాలకు, రసమంజరీ నాదాలకు కూడా తొలి పూజలు చేసినవాడు రామకృష్ణారావు తొలి తెలుగు కథానికలకు ఒరవడి పెట్టిన ఒకరిద్దరిలో ఆయనొకడు ఇంతవరకూ జాడ తెలియని "మంగళసూత్రం" డిటెక్టివ్ రచనకు, "తెలుగు సంసారా"నికి కర్తకూడా రామకృష్ణారావే 'హిందూ'లో పనిచేసిన ప్రథమాంధ్రుడు కుందూరి ఈశ్వరదత్తు, కస్తూరి కుటుంబం యాజమాన్యంలోకి రాకముందు "హిందూ" వ్యవస్థాపకులలో ముఖ్యుడు న్యాపతి సుబ్బారావు ఇలాంటి విశేషాలెన్నో కుంభవృష్టిలా కురిపించింది "వరదకాలం" ఎందరో ప్రశంసలందుకున్న "కవిత" సంచికలకు, మోడ్రన్ తెలుగు పొయిట్రీకి, సంకలనకర్త ఆయన సతీమణి ఛాయాదేవి కాగా "అందాకా" అన్న స్వీయ కవితా సంకలనానికి "మోడరన్ ఇండియన్ పొయిట్రీ", "ఇండో-ఆంగ్లియన్ పొయిట్రీ" సంకలనాలకు బాధ్యుడు వరద వర్కింగ్ జర్నలిస్టుల భారతీయ సమాఖ్య, హైదరాబాద్ యూనియన్‌ల వ్యవస్థాపకులలో ఒకరు వరద అక్కిరాజు, దుగ్గిరాల, కొండా వెంకటప్పయ్య, సుందరయ్య, బసవరాజు, బళ్ళారి, లంక సుందరం, చలం, తాపీ ధర్మారావు, మరో మధురవాణి లాంటి ఎన్నో దీపస్తంభాలను, వారి శక్తిసామర్థ్యాలనూ వరదకాలం చూపిస్తోంది ఎన్నో విద్యా లయాలు, విద్యా కేంద్రాలూ, అక్కడి జ్ఞాపకాలూ మనం పంచుకుంటాం! స్టేట్ కాంగ్రెస్ అభ్యుదయ పథంలో వరదపాత్ర అర్థమవుతుంది

దాదాపుగా స్వీయచరిత్రలుగా పరిగణించదగిన సాహిత్య చరిత్రలు మనకున్నాయి ముఖ్యంగా ఇటీవలకాలంలో అసమగ్రంగానే అయినా, అరమరికలు లేకుండా అర్ధశతాబ్దపు అనుభవాలను అలవోకగా అందించిన ఇతర రచనలు హనుమదింద్రగంటి "మరపురాని ముచ్చట్లు" (గౌతమీ గాథలు) తాపీ ధర్మారావు "రాలూ - రప్పలూ", శ్రీశ్రీ "అనంతం", కోదాటి నారాయణరావు 'చిన్ననాటి జ్ఞాపకాలు" సాహిత్య స్థాయిలోనూ, వ్యక్తిగత స్థాయిలోనూ కొన్ని విలువలు కోల్పోతున్న నేటి వాతావరణంలో నేటి తరం విద్యార్థి యువజనులందరికీ ఈ గ్రంథాలు పాఠ్య గ్రంథాలుకావాలి రాజుల దండయాత్రలను యాత్రలుగా మాత్రమే చిత్రించి ఆత్మగౌరవాన్ని చంపుకొన్న తెలుగు మేధావులను ఉమాకాన్తం శరించినందుకు "వరదకాలం" మెచ్చుకోవడం అభినందించదగ్గది అంతేగాదు, రాజకీయాలలో పతనదశ గురించి, డెమోక్రసీ పేరుతో నాయకత్వాల "నామినేషన్" సంస్కృతిగురించీ ఇంటర్ విద్యార్థుల సివిక్స్ పాఠ్యగ్రంథంలో విమర్శలున్నందుకు కొందరు ప్రజాప్రతినిధులు బాధపడిపోతున్నారట! కానీ "వరదకాలం" చదివితే వారి బాధ ఇంకా 'యమగోల'గా పరిణమిస్తుంది! వరద పెట్టిన చీవాట్లు వినండి "మా తరం దిగ్గజాల్లాంటి రాజకీయ నాయకుల్నీ, గాయకుల్నీ, పండితుల్నీ, కవుల్నీ, నటుల్నీ చూసింది ఆనాడు పెద్ద మనుషులే రాజకీయాల్లోకి వచ్చేవారు నీతి నిజాయితీపరులే రాజకీయ రంగంలో ఉండేవారు అప్పటికింకా రాజకీయం వృత్తిగా మారలేదు తెలుగువాడు దుర్యోధనుడిలాంటివాడు, దుర్యోధనుడు తనకేమీ కావాలనడు ధర్మరాజుకి మాత్రం ఏమీ ఉండకూడదంటాడు తెలుగువారూ అంతే ముగ్గురు తెలుగువాళ్ళు

జమ అయితే పార్టీ పెడతారు ఇద్దరు కూడితే మురాలు కడతారు, ఒక్క తెలుగువాడైతే ప్రతిపక్షం పెడతాడు! ఈ పరిస్థితి అనాదినుంచి మారలేదు ఈ శతాబ్దం రెండో దశాబ్దాంతాన కూడా తెలుగువాడు అలాగే ఉన్నాడు!" కాని, శతాబ్దం ఆఖరి దశాబ్దంలోకూడా పరిస్థితి మారలేదు! వరదరచనలు ఇంగ్లాండు లోని బ్లూమ్స్బరీ గ్రూపులో ప్రముఖుడైన లిటన్‌స్ట్రాచీ సారస్వత వివేచనతోనూ, ట్రూమన్ కపోటే "ది మ్యూజెస్ ఆర్ హర్డ్" రచనతోనూ పోల్చదగినవి గడసరి, మాటకారి అయిన 'వరద' కూడా కపోటేలాంటి మాంచి కన్వర్సేషనలిస్టు *Conversation will always come with me* అంటాడు!

ఈ శక్తి విద్వద్గోష్టుల ద్వారా, వినికిడి ద్వారా, స్వాధ్యాయనం ద్వారా 'వరద'కు కూడా అబ్బింది తన ఇల్లు ఒక శారదా నిలయం కాగా జార్జెస్ సిమెనాన్ (అమెరికన్ రచయిత) లాగా అందులో వరద ప్రేక్షకుడే కాదు, పాత్రధారి కూడా *("All the day, I am one of my characters")* రాబర్ట్ ఫ్రాస్ట్‌లాగా చతురంగానే అయినా లోకంతో తగాదాపడడం వరదకు సరదా *("I had a lovers's quarrel with the world")* అన్నాడు ఫ్రాస్ట్! రాజకీయ వాసనలతో మిళితమైన సాహితీ ఆత్మకథా రచనలో 'వరద' మనకొక లియోనార్డ్ ఉల్ఫ్ ఉల్ఫ్ నాలుగైదు సంపుటాలలో ఆత్మకథ రాశాడు వరద తెలుగుసాహితీ లోకానికి కనీసం ఇంకా రెండు సంపుటాలైనా 'బాకీ' ఉంటాడు రామకృష్ణారావుగారు "రసపిపాసిని నేను పారమ్ము లేని గగనవీధి విశాల రంగములయందు అందగారాని తలంపుల కందమైన రూపముల దిద్ది క్రీడింతు సరసి" అని చెప్పుకొన్నారు తండ్రిని మించిన కొడుకు - ఈ జ్ఞాపకాల వరద!

# "వేదనల విషం త్రాగి" అమృతం పంచిన ఆత్రేయ

"నాటకం విజయవంతం కావడానికి మూడు షరతులు నెరవేరాలి, నాటక కర్త మహారచయిత కావాలి, రసహృదయులైన ప్రేక్షకులు కావాలి, చలనం, సంచలనం దాని ఆత్మకావాలి" అన్నాడు సుప్రసిద్ధ విమర్శకుడు డెనిస్ సారా నాటక కళను వ్యాపార కళగా మార్చి ఫ్రెంచి డ్రామాను "కంచి"కి పంపించిన విక్టోరియన్ సారూను కాబోలు తూర్పారబడుతూ సారా ఆ మాట చెప్పాడు ఈ భాష్యం, ఈ సాలోచన తెలుగు నాటక రంగానికి కూడా వర్తిస్తుంది ఒక వర్గ సమస్యతో, అందునా కేవలం ఒక కులంలోని రెండు శాఖల మధ్య కుమ్ములాటలు, కుట్రలు ఇతివృత్తంగా తొలి నాటకంగా ప్రారంభమై (వావిలాల వాసుదేవశాస్త్రి "నందక రాజ్యం") సాంఘిక వ్యవస్థా సమస్యగా తెలుగు నాటక రంగానికి విశిష్ట భూషణంగా గురజాడ "కన్యాశుల్కం" అవతరించిన తరువాతనే -సామాజిక స్పృహకు రచనా పరంగా విలువ వచ్చింది క్రమంగా పౌరాణికాలు వెనుకడుగు వేసి, సాంఘికాలు ముందడుగు వేయజొచ్చాయి, పద్య నాటకాల దశదాటి, గద్య నాటికా నాటకాలు తమ ఉనికిని చాటుకో ప్రారంభించాయి సమస్యా నాటకాల దశ క్రమంగా సందేహ నాటకాల దిశగా రూపుదిద్దుకొంటోంది ఈ పరిణామం క్రమంగా అర్ధశతాబ్దంగా సాగిసాగి - తెలుగు నాటక రంగం పురోగతి మూడు ప్రధాన వ్యవస్థల ప్రచారానికి ప్రభావితమయింది ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు ప్రయోగాత్మక నాటక రంగానికి 1943లో తలుపులు తెరవగా, ఆంధ్ర నాటక కళా పరిషత్తు 1944లో "పోటీ"ల దశను ప్రవేశ పెట్టగా, 1945 నుంచీ డాక్టర్ రాజారావు నాయకత్వంలో "ఆంధ్ర ప్రజానాట్యమండలి" నాటక రంగాన్ని వ్యాపార ధోరణులనుంచి, కేవలం పోటా పోటీ కళా ప్రదర్శనల దశ నుంచీ తప్పించి రంగస్థలాన్ని ప్రజాయత్తం చేసి, నాటక కళను జానపద కళారూపాలతో సహా ప్రజారంజక విద్యగా పంచిపెట్టింది! ఈ విశిష్ట దశలో తెలుగు రంగస్థలంపై నటునిగా, నాటకకర్తగా, దర్శకునిగా, ప్రయోక్తగా వెలసి తన తనాన్ని నిరూపించు కున్నవాడు గురువారంనాడు కన్నుమూసిన ఆచార్య ఆత్రేయ. చలన చిత్ర రంగం పోటీకి తట్టుకోలేక అన్ని నదులూ సముద్రంలో కలిసినట్టే, సకల సాహిత్య శాఖలూ సినీకళకు తాకట్టు పడుతున్న దశలో బతుకు పుస్తకాన్ని భద్రం చేసుకోడానికి ఆత్రేయ వెండితెరను కొన్నాళ్ళు ఆశ్రయించుకుని ఉండవచ్చుగాక కాని నాటక రంగంలోగాని, సినీ రంగంలోగానీ తన కాలంనాటి సాంఘిక వ్యవస్థ, అధికార వ్యవస్థ, అందులో సామాన్యుని పీల్చి పిప్పిచేస్తున్న రాజకీయ ఆర్థిక దురన్యాయాలు ఇత్యాది పరిణామాల పట్ల ఆత్రేయ ఎన్నడూ నిర్లిప్తత ప్రదర్శించినవాడు కాడు. నాటక రంగంలో పూర్వ సంప్రదాయాలను తెలుసుకున్నవాడు, వర్తమాన కాలానికి అనువైన పాత్రలతో, సన్నివేశాలతో ప్రేక్షకులను ఊగించి, శాసించి, సంస్కరణాభిముఖుల్ని చేసినవాడు. 1930లలో పి.వి.రాజమన్నార్ "తప్పెవరిది" నాటకం తెలుగు రంగస్థల చరిత్రలో ఒక మలుపును ఆవిష్కరించగా, ఆ తర్వాత సుమారు పదిహేనేళ్ళకు ఆచార్య ఆత్రేయ "పరివర్తన", "ఎన్‌జివో" (గుమస్తా) నాటకాలు మరొక పరివర్తనకు అంకురార్పణ చేశాయి! ప్రపంచశాంతి ఉద్యమ కాలంలో రాసిన "విశ్వశాంతి" ఒక వినూత్న ప్రయోగం. సంఘ సంస్కరణ దృష్టితో తనకు ముందు నాటకాలు రాసిన కాళ్ళకూరి, సంఘతిరస్కార దృష్టితో రాసిన త్రిపురనేని, ముద్దుకృష్ణ, చలం, పేద రైతాంగ, ప్రజల సమస్యల పరిష్కారాభిలాషతో, సంస్కరణాభిలాషతో నాటికలు రాసిన నార్ల (కొత్తగడ్డ), ప్రదర్శన

సౌలభ్యంతో రచనలు చేసిన కొప్పరపు సుబ్బారావు, పింగళి, సంస్కరణోద్యమం వైపుగా కలాలు కదిపిన గోరా, జి.వి.కృష్ణారావు ప్రభృతుల ప్రభావం ఆత్రేయపై ఉంది. కొన్ని ఆత్రేయ నాటకాలకు ఆంగ్ల మాతృకలు లేకపోలేదని కొన్ని విమర్శలు ఉన్నా, ఈ విశాల ప్రపంచంలో అనుక్షణం జరుగుతున్న భావవ్యాప్తి ఏ ఒక్కడి సొత్తూ కాదని, అదంతా మానవాళి శ్రమైక జీవన సౌందర్యం నుంచి జాలువారిన సమష్టి సంపుటీకరణ అనీ భావించుకోవాలి. ఆ మాటకొస్తే నాటక రంగ చరిత్రలో ఇబ్సన్, స్ట్రింగ్‌బర్గ్, చెహోవ్, బెర్నార్డ్‌షాల ప్రభావం అంతో ఇంతో పడని తెలుగు సాహితీ మూర్తులెవరో చెప్పమనండి! చివరికి ఆధునిక గద్యనాటకాలకు ఆద్యుడుగా లోక ప్రసిద్ధుడైన ఇబ్సన్‌కూడా తన కాలంలో అప్పుడప్పుడే రంగస్థలంలో ప్రభవిల్లుతున్న నూతన భావాలకూ, పాత్రపోషణకూ, సన్నివేశ కల్పనకూ ఉత్తేజితుడై, మరికొంత చేయూత నిచ్చాడని మాత్రమే విమర్శకులు కూడా ఒప్పుకోవలసి వచ్చింది. తమ నాటకాలకు భారీ పీఠికలు రాసుకున్న నార్లకు ఆదర్శం బెర్నార్డ్‌షా పీఠికలు *("Prefaces")*! అలాంటి ప్రభావం ఆత్రేయపై కూడా ఉండి ఉండొచ్చు. గాల్స్‌వర్దీ "సిల్వర్ బాక్స్" సాంఘిక నాటకానికీ, "జస్టిస్" నాటకానికీ ఆత్రేయ "పరివర్తన", "ఎన్.జి.వో"లు ఏమీ తీసిపోవు! ఆత్రేయ ప్రభావంలో ముందుకు సాగిన నాటికా నాటక కర్తలలో ప్రసిద్ధులు అనిసెట్టి ("గాలిమేడలు"), పినిసెట్టి ("కులంలేని పిల్ల", "అన్నా - చెల్లెలు"), ఎన్.ఆర్. నంది ("అరణి", "మరో మొహంజదారో"), బెల్లంకొండ రామదాసు ("పునర్జన్మ"). ఏకాంకికా రచనలో కూడా ప్రయోక్తగా, ప్రధాన పాత్ర ద్వారా ముగింపులో రచయిత సందేశాన్ని వాచ్యంగా చెప్పడంలో మార్గదర్శకత్వం ఆచార్య ఆత్రేయదే. 1955 ఎన్నికల్లో రాసిన "అంత్యార్పణ" "ఓటు నీకే" నాటికలు విశిష్ట రచనలు.

జీవితంలో అతి దారిద్ర్యమూ, అంతస్తులూ చూచిన ఆత్రేయ చలన చిత్ర రంగంలో ఆటపాటల మేలుకలయికతో ఆదర్శ కవితా ఝరిని అందించిన రచయిత. తెలుగువాడి మనస్సు, వాడి ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, పలుకుబళ్ళు, జానపదుల లౌకికతత్వం, బోళాతనం, నెల్లూరు వాడైనా తెలుగు నేల నాలుగు చెరగులా గుమ్మడిపాదులా పాకిపోయిన మాండలికాలలోని తియ్యందనాలు ఆకళించుకున్నవాడు ఆత్రేయ. కనుకనే నాటకాలు, నాటికలలోనేగాక సినిమాలకు రాసిన మాటలూ, పాటలూకూడా - కొన్ని సందర్భాల్లో అవి ఏ దేవులపల్లో, శ్రీశ్రీయో రాసిఉంటాడని క్షణకాలం అనుమానం వచ్చేటట్టుగా - అంతటి మానవతా విలువలు కలవీ, హృదయాలను స్పందించేవి, కన్నీళ్ళు పెట్టించేవి, ఉద్రేక పరిచేవీ, ఉత్సాహ పరిచేవీ, అవి సందేశాత్మకాలూ, వేదనా కలశాలూ. ఇతివృత్తం సాంఘికమైనా, శృంగారమైనా - అశ్లీలతా సరిహద్దులను తాకకుండా పాటనూ, మాటనూ ఆవేదనా భరితాలుగా మలిచి కుటుంబ సభ్యులు సమష్టిగా, బరువుగానూ ఆహ్లాదంగానూ చిత్రాన్ని ఆద్యంతం అనుభవించగలిగేటట్లు చేసిన 'మనసు కవు'లూ మధుర కవులూ మనకు వేళ్ళమీద మాత్రమే లెక్కించదగినవారున్నారు. వారు - మల్లాది రామకృష్ణశాస్త్రి, దేవులపల్లి, శ్రీశ్రీ, ఆచార్య ఆత్రేయ. ఈ పనిని వీరు అప్పుడప్పుడూ కాదు - కక్కుర్తి పడకుండా, రాసినంత కాలం నిష్ఠగా ఆ పనిని చేసి చూపారు. సమాజాన్ని చెడగొట్టడం తేలిక, కాని మధురవాణి చెప్పినట్టు "చెడని వారిని చెడగొట్టవద్దని చెప్పింది నా తల్లి" అని దమ్ములతో చెప్పగలవాళ్ళు కరువైన ఈ సమాజంలో ఆ ఆదర్శాన్ని ఆ మహావ్యక్తులు సాధించారు. కనుకనే ప్లెఖనోవ్ అన్నట్టు ఆత్రేయకూడా సమాజం కోసం కళాకారుడుగాని, కళాకారుని కోసం సమాజం కాదన్న ఆదర్శాన్ని నరనరాన జీర్ణించుకున్న రచయిత. రాజకీయ వ్యవస్థపైన, సామాజిక వ్యవస్థపైన, బ్యురాక్రసీ పైన

రాజీపడకుండా ధ్వజమెత్తిన ఆత్రేయ మత సామరస్య ధోరణికి ప్రతీక "ఈనాడు" నాటకం కాలంతోపాటు రంగస్థలం, చలన చిత్రం - కథా వస్తువులోనూ, టెక్నిక్‌లోనూ మార్పులు చేసుకోవాలని భావించినవాడు ఆత్రేయ సన్నివేశానికి, సంభాషణకూ, సంగీతానికి, సంకీర్ణమైన ఛాయాగ్రహణకూ మధ్య అపూర్వమైన సమన్వయం, అనుసంధానం అవసరమని గుర్తించిన బహుకొద్దిమంది రైటర్-టెక్నీషియన్లలో ఆత్రేయ ఒకరు కనుకనే ఆయన 'జీవన తరంగాల' ను దిద్ది తీర్చాడు, శిలలపై అందమైన శిల్పాలు చెక్కాడు, మూగ కళ్ళతో బాసలాడగలిగాడు, "వేదనల విషం త్రావి జనతకు సమతామృతం" పంచిపెట్టాడు! జీవితం ఉన్నంత కాలం నాటకానికి విలువుంటుంది, నాటకం సాగుతున్నంత కాలం జీవితం రూపురేఖలు దిద్దుకుంటుంది "మాట-మౌనం" రూపకంలో కృష్ణశాస్త్రి ఏమన్నాడు? "తామసి మౌనమ్మైతే తారకమాట/తావియ మౌనమ్మైతే పూవేమాట/ పొలతుక మౌనమ్మైతే పురుషుడు మాట"! లోక వృత్తానికి స్త్రీ-పురుషులు ఆకరాలు ఈ "శివపార్వతుల" మేలుకలయికే నాటక కర్త! అతడే మన ఆత్రేయ!!

ఆదివారం, సెప్టెంబర్ 17, 1989

# విస్మయపరిచే ఇస్మాయిల్!

అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు జీవితాన్ని దర్శించడంలో, దానిలోని ఇంద్ర ధనుస్సులను ఆనందించడంలో, కష్టసుఖాలను, నిమ్నోన్నతాలను సమభావనతో పరిశీలించ డంలో, సమన్వయపరచడంలో - పడికట్టు భావాలతో, మడులతో దడులతో మానవుడు మనస్సును సంకుచిత పరుచుకోరాదు అయితే అంతమాత్రాన ఆదర్శహితమైన జీవితాన్నీ, ధర్మాన్నీ మనం కాలదన్నలేము కనుకనే అతివాద, మితవాదాలు రెండూ 'అతే' అన్నాడు కవి యేట్స్ ఈ రెండింటి మధ్య నిలబడిన మనిషి తన మార్గాన్ని తను దిద్ది తీర్చుకోవాలన్నాడు *("Between extremities/Man runs his course")!* అరిస్టాటిల్ సూత్రీకరణ కూడా అదే మన ప్రాచీనుల వాదం కూడా అదే. ఒకనాడు తానూ ఒక "వడ్రంగి పిట్ట"గా ఉన్నా, కవి ఇస్మాయిల్ కూడా ఈ మధ్యేమార్గేన్నే ఎంచుకుని ప్రయాణిస్తున్నాడు, కవితా యాత్రలు చేస్తున్నాడు గొప్ప భావ చిత్రాలు కవనఝరిలో చూపించగల ఇస్మాయిల్‌కు ఆదర్శాలపై నమ్మకం లేదు స్థిరచిత్తం లేదు "స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, సౌభ్రాత్రం" లాంటి జనరల్ సూత్రీకరణల్లానే "స్వేచ్ఛ", "ప్రేమ" తత్వాలు మినహా మరొక ఆదర్శాన్ని ఊహించలేడు వ్యక్తివాదం తానెత్తిన పతాకం దాన్ని జయకేతనంగా మలచడానికి అతను కవిత్వం ద్వారా చేస్తున్న పని - 'స్వేచ్ఛ' పేరిట వ్యష్టిని మాత్రమే ముందుకునెట్టి సమష్టిని వెనక్కి నెట్టజూడడం ఆయన ఉద్దేశంలో "జీవితంలోని వివిధ అంశాల్లో ఏ ఒక్క అంశానికైనా దాని పరిణామానికి మించిన విలువనిస్తే రబ్బరు బుడగలా అది చిన్న పిన్ను పోటుకు కూడా పగిలే అవకాశం ఉంది" కాబట్టి దేనిలోనూ అతివాదం పనికిరాదంటాడు! ఈ సూత్రీకరణకు నేపథ్యం మనకు మాథ్యూ ఆర్నాల్డ్‌లో కనిపిస్తుంది మనిషన్నవాడు సమస్తాన్నీ ఎలా దర్శించగలుగుతాడు, ఊహించగలుగుతాడు? అంటాడు. *("Fools! that in man's brief term/He cannot all things view/Affords no ground to affirm /That there are Gods who do ")* అందువల్ల ఇస్మాయిల్ కవిత్వం కేవల 'అనుభూతి' వాదం ఆంగ్ల కవితలో దీనికి సరిపోలిన ప్రక్రియను 'సబ్జెక్టివిజం' అన్నారు మరో మాటలో, అదే ఆత్మాశ్రయ కవిత విశ్వనాథ అనలేదూ - "తనదైన అనుభూతి తనదిగాన" అని! అలాగే ఇస్మాయిల్ ఒక స్వేచ్ఛా విహంగం పైగా కృష్ణశాస్త్రి ప్రభావం 'అతి'ని ఇతర వాదాలలో, 'ఇజా'లలో ఈసడించుకునేవారు వ్యక్తి స్వేచ్ఛలోనూ, 'ప్రేమ' పరిధుల విస్తరణలోనూ 'అతి' ని ఆహ్వానిస్తున్నారు! పైగా ఈ ప్రేమ పరిధుల విస్తరణ 'వ్యక్తి'తో ప్రారంభం కావాలిగాని "మూకల"తో కాదని జనాన్ని ఈసడించుకుంటున్నారు! అందుకనే 'సబ్జక్టివిజం' అంటే వ్యక్తి అనుభవం, వ్యక్తివాదం అనేగాక - ఊహల చాంపేయమాల, భ్రమా పూరితమైన భావన అని కూడా అర్థాలు ఉండడం గమనార్హం! ఎక్జిస్టెన్షియల్ అతివాదం (కేవల అస్తిత్వవాదం) తనకు పడనప్పుడు, కవి అన్నవాడు కేవల 'వ్యక్తి' వాదాన్ని కూడా ఆశ్రయించకూడదు! మనిషి ఏకాకిగా పుట్టి, ఏకాకిగానే చనిపోతాడు కాబట్టి, ఈ మధ్యకాలంలో కూడా కాకిలా 'ఏకాకి'లానే గడపాలన్న వాదన ప్రమాదకరమైనదీ, సంఘ వ్యతిరేకమైనదీనూ! సమాజ శ్రేయస్సుకు బద్ధమైన వ్యక్తిత్వాన్ని పెంచవలసిన చోట కేవలం వ్యక్తి స్వేచ్ఛ పేరిట సామాజిక పరిశీలనా దృష్టినుంచి వ్యక్తిని వేరు చేయడం, వ్యష్టిని సమష్టి నుంచి దూరం చేయడం - మేధావులు చేయవలసిన పనికాదు సమష్టికి లోబడని వ్యష్టి, సంఘానికి పెద్ద 'నష్టి'! "ఆదర్శాలు సంఘర్షించే వేళ ఆయుధం అలీనం కాదన్న" కవికీ, 'స్వేచ్ఛ', 'ప్రేమ' పేరిట - చెట్టునూ, పిట్టనూ, ఎగిరే డేగనూ, బావినీ,

పిల్లంగోవినీ ఆదర్శంగా భావించే ఇస్మాయిల్‌కూ లోకాలోకనంలోనే ఆకాశానికీ భూమికీ ఉన్నంత తేడా ఉంది! మధ్యేమార్గం 'అలీనత' లాంటిది చుక్కాని లేని పడవనీ, స్పష్టతలేని ఆదర్శాన్నీ ఊహించలేము! అందుకే ఇస్మాయిల్‌కు ఆల్బర్ట్ కామూ ఎంతనచ్చక పోయినా, ఈ విషయంలో కామూ చెప్పిన మాటలను మనం కాదనలేము *"One cannot hope to remain aloof (from society) in order to pursue the reflections and images that are dear to him"* భావ వ్యక్తీకరణకు మించి సింబల్స్ ప్రయోగించిన ఇస్మాయిల్ కవితాలక్ష్యాన్ని నిర్దేశించ వచ్చేసరికి తేలిపోతాడు అయనకు స్పష్టతగానీ, స్పష్టమైన ఆదర్శం కాని కొరవడనిదల్లా ఒక్క - మార్క్సిజంపై ధ్వజమెత్తడంలోనే! "వడ్రంగి పిట్ట", "పార్టీ(గా) మహాసభ", "మార్క్సిస్టు మిత్రునికి" అన్న కవితలలో కూడా అతని భావన దేనికి దగ్గరో, దేనికి దూరమో చెప్పడు! మార్క్సు నచ్చి, మార్క్సిజం నచ్చకపోవడం అన్నది కొత్తరకం వంచనా శిల్పం! ఈయనకు స్పష్టమైన లక్ష్యం లేదనడానికి ఉదాహరణ - ధన ప్రభావాన్ని దరిచేరనివ్వని కవి "డబ్బు మీద (అల్లిన) రెండు పద్యాలు"లో చెప్పిన భావాన్నీ, "హనీ" కవితా ఖండికలో అదే డబ్బుతో అనుమతించిన కరప్ట్ ప్రాక్టీసునూ (యక్షుడి తల పగలగొట్టి ఆ 'మనీ' తీసుకెళ్ళి మనుమరాలు 'హనీ' కివ్వడం) ఏకకాలంలో మనం ఎలా సమర్థించగలం?! "దేశభక్తి"లో కూడా 'మాను' కిచ్చిన ప్రాముఖ్యం మనిషికి లేదు! "బుద్ధిగా ప్రేమించుకోక / యుద్ధాలెందుకు చేస్తారో / నాకర్థం కాదం"టాడు! నిజానికి అర్థంకాని దేమీలేదు, అర్థం చేసుకోనిదే, చేసుకోడానికి ఇష్టపడనిదే జాస్తి! అక్కడే తార్కిక దృష్టి, గతి తార్కిక దృష్టీ అవసరమవుతాయి రాజ్యాధిపతులకు ఈ మాత్రం 'ప్రేమ' లూ 'శాంతి' ప్రయోజనాలు తెలియక కాదు, యుద్ధాలు చేస్తున్నది! బౌద్ధానికి, ఉపనిషత్తులకు పునాది కార్యకారణ సంబంధం కారణం లేని తోరణాలు, వీరణాలూ ఉండవు స్వార్థ బుద్ధికీ, సామ్రాజ్య కాంక్షకూ, దాని వ్యాప్తికీ, పేదవాళ్ళపై కలవాళ్ళ రాపిడికీ, దోపిడీకి పునాది ఆర్థికం, ప్రయివేటు ఆస్తి ఆర్థికం రాజకీయాన్ని నడిపిస్తుంది రాజకీయం శాంతికీ అశాంతికీ మూలం అందుకే ఏ రాజకీయం మనిషికి కావాలో ఎంచుకోవాలి రాజకీయాన్ని బట్టి రాగల మార్పులు చెప్పొచ్చు, వర్తమానాన్ని బేరీజు వేసి భావి పరిణామాలను కొలవొచ్చు అప్పుడుగాని ఎవరుగాని "బుద్ధిగా" ఎందుకు "ప్రేమించుకోరో", యుద్ధాలెందుకు చేస్తారో తెలిసొస్తుంది! ఒక్క ముక్కలో ఈ పరిణామ చరిత్రనే - "పొలిటికల్ ఎకానమీ" అన్నారు! "వేతన శర్మల" ఆలోచనకు కూడా - వాళ్ళకు తెలియని ఈ పొలిటికల్ ఎకానమీయే పునాది అని గ్రహించాలి!

అయితే - ఇస్మాయిల్ అలక్ష్యానికి సంబంధించి ఎన్ని మనం మాట్లాడుకున్నా అద్భుతమైన సింబల్స్ ద్వారా మన మనసుల్ని కొంతసేపు ఆలోచింపచేస్తాడు! భావశబలత అక్కడక్కడా కృతకంగా ఉన్నా (కోసిన మామిడి పండు, హాస్పిటల్‌లో ప్రేమ) కొన్ని ప్రతీకలకు పతాక సన్నివేశాలు కల్పించాడు! మబ్బు కడుపులు, వేవిళ్ళగాలులు, వర్షా గర్భంలో వర్థిల్లే శిశుపిండాల్నీ చూపాడు, ఎగిరే డేగని స్వేచ్ఛా విహంగంగా చూపి దానికి "తీక్షణంగా వీక్షించే సూర్యనేత్రాన్ని" ఆదర్శంగా ఉంచాడు జలనిధికీ/ఝంఝకీ/అలజడి పైకే/కాని హృదయాలతి ప్రశాంతం" అన్న కామన ఎంతటి బొమ్మకట్టినిలిచే భావన! రేవుకు "పియానో మెట్లు" కడతాడు, తొలిసంజలూ, తెలి ఎండతొనలనూ పంచిపెడతాడు! ప్రకృతి ఆరాధనలో తనకు ఆదర్శమైన కృష్ణశాస్త్రి చేరుకున్న సమున్నత శిఖరాలను తాను అందుకోలేకపోయినా ఇస్మాయిల్ కొన్ని అందాలు చూపాడు కోనసీమ అందాన్ని అగస్త్యునిలా పుక్కిటపట్టాడు కోనసీమ

సౌందర్యాన్ని మరింత కాల్పనికం చేశాడు! 'సృష్టి' రహస్యం చెప్పాడు "ధనియాల తిప్ప"ను సందర్శించినపుడు కలిగిన అనుభూతిని ఇస్మాయిల్ అక్షరబద్ధం ('తెరచాప ఎత్తిన పడవ') చేసినపుడు ప్రసిద్ధ ఆంగ్లకవి మేస్‌ఫీల్డ్ "డాబర్" అన్న కవితలో సముద్రం వద్దకు చేరిన ఒక కళాకారుడు రసార్ద్రంగా అలల సంచలనాన్ని మైళ్ళ పర్యంతం కొలిచిన *(natural scenes)* ఉదంతం గుర్తుకొస్తుంది! అలాగే లోకవృత్తంలో అన్ని కోతిచేష్టలనూ కవి ప్రతిబింబించాలి అందుకనే మరో కవి చెప్పినట్టు అది యుగ లక్షణం - *(The age demanded an image/Of its accelerated grimace")!* బహుశా అందుకేనేమో ఇస్మాయిల్ కూడా పోనుపోనూ మధ్యేమార్గపు రథ్యలో మిధ్యాతాండవం చేస్తూ "వికట ప్రతిబింబాల/అద్దాల చెరసాల/ బందీని నేనే బందిఖానాని నేనే" అని ప్రకటించుకోవలసి వస్తోంది!

అక్టోబర్ 10, 1989

# "చిత్ర దీపాలు"

జీవితానికి నిరాశ కూడదు రేపటిని గురించిన విశ్వాసమే మానవుణ్ణి అనునిత్యం చిరంజీవిని చేస్తున్న రసాయనం! కనుకనే వాల్మీకీ అన్నాడు జీవించే ఉంటే నూరేళ్ళకయినా సరే ఆనందం వచ్చి మనిషిని ఆశ్రయించుతుందని (ఏతి జీవంత మానందో నరం వర్షశతాదపి)! అలాగే నిరాశను నిరాశ్రయంచేసి ఆశకు చలువ పందిళ్ళు వేయడంలో కొందరు కవులు సిద్ధహస్తులు ఇందుకు సమాజ పరిశీలన, లోకదృష్టి, సత్యశోధన, స్వీయానుభం, తాత్త్వికచింతన, సగటు మానవుని సమస్యలపట్ల, పేదసాదల బతుకుపట్ల స్పందన, చమత్కార దృష్టి, రచనలో వ్యంగ్య వైభవం - ఇవన్నీ సమపాళ్ళలో ఉన్న కవి ప్రౌఢ సంప్రదాయానికి చెందినా, ఆధునిక కవితా ప్రక్రియలకు చెందినా మనం ఆహ్వానించవలసిందే అలాంటి ఆధునిక కవుల్లో ఒకరు, నిత్య పరిశోధకుడు, సత్య పరిశీలకుడు అయిన డాక్టర్ గోపి కులాలు, కుత్సితాలు ఎరగనివాడు, సమతావాది, ఆచరణవాది కాగలిగిననాడు సమాజ వికాసం ఆరు పువ్వులుగా పన్నెండు కాయలుగా ఉంటుంది గోపీ కోరుతున్నదీ అదేనని 1976లో పూయించిన "తంగెడు పూలు" 1989 లో వెలిగించిన "చిత్రదీపాలు" నిరూపిస్తాయి! ఈ కవితా ఖండికలలో కొన్ని తెలంగాణా మాండలిక సౌరభాలను వెదజల్లేవి కాగా, మిగతావి ఆధునిక భావాలను వ్యంగ్య వైభవంతో వెలార్చినవి సమాజ పురోగతికి అడ్డుగా ఉన్న సంప్రదాయాలను చెదరగొట్టి కుళ్ళిపోతున్న సమాజం నడ్డి విరగ్గొట్టడానికి తనతో కలిసి మరి నాలుగు దెబ్బలు వేయగల యువకులు కావాలన్నాడు చలం అందుకు పనికివచ్చే పలువురు కవితా సైనికులలో, భీమకవి 'ఖడ్గసృష్టి'కీ, శ్రీశ్రీ మహాప్రస్థానానికీ దోహదం చేయగల కవులలో గోపీ ఒకరు ఒక ఆంగ్ల మహాకవి సమాజ పురోభివృద్ధికీ, సంస్కృతీ వికాసానికి "ముది మది తప్పిన మొదటి వేల్పులు" కాకుండా, ముదిమి నెరుగని మేధోమూర్తులూ, కళా ఖండాలూ కావాలన్నాడు! *("monuments of Unageing intellect")!* ఈ దృష్ట్యా, కడచిన పదమూడేళ్ళుగా డాక్టర్ గోపి దృష్టి నిశితమవుతూ వచ్చిందేగానీ తరగలేదని అతని తాజా కవితా సంపుటి "చిత్రదీపాలు" మాత్రమేగాక, "తంగెడుపూల" నుంచి "మైలురాయి" దాకా సాగిన ప్రస్థానం, "వేమన్న వాదం" నుంచి "వ్యాసనవమి" వరకూ చేసిన వ్యాఖ్యానాలూ, వ్యాసపరంపరా సాక్ష్యం వేమన కాలంలో సాంఘిక వ్యవస్థ, ప్రాచీన కుటుంబ వ్యవస్థ బీటలు వారుతున్న పరిస్థితి, కులాలు విచ్చుకత్తులతో సాగిస్తున్న వీరావేశాలు, మతాల శిథిల సంధ్యా తాండవాలు - ఈ పరిణామాలపట్ల వేమన్న ఆవేదనకు ఆటవెలదులకు అపురూప వ్యాఖ్యానం అందించినవాడు గోపి ఈతని రచనకు ఉజ్జీగా, లేదా మరికొన్ని వివరాలతో సరికొత్త లోకజ్ఞతతో తులతూగేవి త్రిపురనేని వెంకటేశ్వరరావు, గుర్రం వెంకటరెడ్డి, పోచన రామిరెడ్డి రాసిన పరిశోధనాత్మక గ్రంథాలు మాత్రమే! కొన్ని సందర్భాల్లో వేమన్న రచనకు కుంఫిణీ ఉద్యోగి చార్లెస్ బ్రౌన్ జోడించిన వ్యాఖ్యలను కూడా సవరించాడు గోపి. గోపీ కేవలం పరిశోధకుడుగానే కాదు, తత్త్వారాధకుడుగా మానవతత్వం, మానవత్వం తెలిసిన కవిగా, ఆశావాదిగా "చిత్రదీపాల"లో కనిపిస్తాడు చూపుల కుంచెలతో "సముద్రం కాన్వాస్" మీద ఏ చిత్రమైనా గీయగలిగిన గోపి "ప్రయాణం" లో చెమట చుక్కలను పద్యాలుగానూ మలచగలడు, స్వప్నాలను తూనీగలుగానూ దిద్ది తీర్చగలడు! అద్భుతమైన భావ చిత్రాలతో, వ్యంగ్య చిత్రలతో సమాజ దర్శనం చేస్తున్న యువకవి నిశ్చలంగా ఉన్న చెరువు నీటికి 'గాలి' వేళ్ళు తగిలితే చాలు - "వేల వేల పూల డిజైన్లతో నీటిమీద షోలాపూర్

దుప్పట్లు" పరుస్తాడు! జ్ఞానం ఒక్కటే (బ్రహ్మం) ప్రధానమన్న సత్యాన్ని గుర్తిస్తూ ద్వైతాద్వైత భేదాన్ని గమనిస్తూనే "రెంటికీ మధ్య బ్లేడుతో గీసిన రక్తరేఖ"ను మాత్రం చూడకుండా తప్పుకోవద్దని హెచ్చరిస్తాడు! కర్మ సిద్ధాంతానికి చెంపపెట్టు పెడుతూ హేతువాదిగా నిలబడతాడు! కన్నీళ్ళను దాచడం ఎవడికీ సాధ్యపడదన్న గోపి, దిగులుతో ఉన్న మనిషికి "చంద్రుడూ, చుక్కలూ వెలిసిపోయిన అక్షరాలు"గా కన్పిస్తా యంటాడు "అవిశ్రాంత సంధ్యలో/ఆరని గుండె అగ్నిగుండమవుతుంద"న్నప్పుడు ధూర్జటి సాయంకాల వర్ణనంలో "దివినుండి దేవదానవ యుద్ధ రక్తార్ద్రమై నేలకూలిన రథాంగం" మనకు జ్ఞప్తికి వస్తుంది! తొలకరినాటి వాన చినుకులు నేలతల్లికి కొత్త వాసనలు తొడగడాన్ని గోపీ "గుప్పున లేచిన మట్టి వాసనలు ప్రియురాలి తొలినాటి శ్వాసల"తో ఉపమించినప్పుడు - శ్రీరంగం నారాయణబాబు కీర్తించిన "మాతృమృత్తికా మధురవాసనలు" స్ఫురణకు వస్తాయి!

సామాజిక వ్యవస్థపై గోపి నిశితమైన వేట్లు వేశాడు ఇది ఎలాంటి లోకం? అంతరాల దొంతరులు పెంచి, అసత్యాన్ని అంబారీ ఎక్కించి సంబరాలతో ఊరేగుతున్న సమాజంలో - సామాన్యుడు "ప్రశాంతికోసం అశాంతి పాలుకా"గలిగితేనే, "చిరునవ్వులకోసం కన్నీళ్ళు ఖర్చుచేయ"గలిగితేనే, "ప్రతిఫలం కోసం యాచించ" గలిగితేనే, చివరికి "కవిత్వం కోసం" కూడా "కాకిలా అరవగలిగి"తేనే అతడికి భుక్తీ, ముక్తీ! ఇంతకూ గోపీ కనబరిచే ఆర్ద్రత ఎవరిపట్ల? సగటు మానవునిపట్ల, పేదసాదల పట్ల. అతడు పాలరాతి ప్రాసాదాల వైపుగాకుండా దిగులుపొగలు నిండిన పూరిపాకల వైపు చూస్తాడు, పల్లంనుండి నడిచొచ్చే అనాథ బాలిక పాదముద్రలు గుర్తిస్తాడు! ఇలా "ఉదయ సూర్యుని కంటిలోని నలక"నే కనిపెట్టగలిగిన డాక్టర్ గోపికి, ఉదయం లేచింది మొదలు రాత్రి తలవాల్చేదాకా ఉసురు నిలుపుకోడానికి పేదసాదలు పడే పలు బాధలూ, పడిగాపులూ కావ్య వస్తువులయి, అవే గీతాలుగా, సంగీతాలుగా, 'కిరణజన్య సంగీతాలు'గా తోచడంలో, మనకు వినిపింపచేయడంలో అబ్బురపడవలసింది లేదు! ఒక వైపున భ్రష్టుడైన రాజకీయవేత్త చిద్విలాసాలను వ్యంగ్యంగా వర్ణిస్తూనే, నాటి స్వాతంత్ర్య సమరయోధుల నేటి కడగండ్లనూ అంత బాధతోనూ, చమత్కారంతోనూ వడపోసి చూపెడతాడు. "వాడు" (రాజకీయవేత్త) ప్రభుత్వ "యంత్రాంగానికి ప్రౌఢవ్యాకరణం" (అంటే కాఠిన్యం, నిరంకుశత్వం) నెలకొల్పి ప్రజల "స్పందనల మీద బుల్‌డోజర్లు నడుపుతాడ"ట! కులతత్వాల "విషం తయారీకి లేబొరేటరీలు" పెడతాడట! ఇక మన గత కాలపు స్వాతంత్ర్య సమరయోధుని స్థితి నేడెలా ఉందట? "అర్ధరాత్రి మెట్లు దిగిపోయిన సిద్ధార్థుడు/కపిలవస్తులో రొట్టె దొంగిలిస్తూ పట్టుపడ్డాడు /అతడితడే" నంటాడు గోపీ! సర్వస్వాన్నీ కోల్పోయి గోచిగుడ్డ కోసం యాచిస్తున్న ఈ ఆదర్శవాది, వేలాది మైళ్ళు నడిచినవాడు ఈ సర్వోదయవాది, వాహనాలు చల్లిపోయే మురికిని తానే ఉతుక్కునే ఈ ఆదర్శమూర్తి చివరికి "రూపాయి సూర్యోదయం కోసం" (దారిద్ర్యంవల్ల) "యోగ నమస్కారాలు చేసుకో"వలసిన దుస్థితి, దుర్గతి పట్టింది! ఈ పదాలు చదువుతున్నప్పుడు బ్రిటిష్ ఆధునిక కవుల్లో ఒకరైన బరన్స్ సింగర్ అన్నమాటలు గుర్తుకొస్తాయి *"The saints are counting money/ Because the saints are men!"* ఇంతకూ, కవిత్వం అనేది మానవుని స్పందనకు అక్షర రూపమిచ్చే ప్రక్రియగా మాత్రమే భావించి దాని పరిమితులను గుర్తెరిగిన గోపి - మానవుల జీవితాలను మార్చేదీ, మార్పించేదీ సాంఘిక, ఆర్థిక విప్లవం అని విశ్వసించిన కవి "ఓటమి నా కవిత" లో అదే కనిపిస్తుంది "ఉపమానాల కొయ్యలకు తగిలించిన మాసిన దుస్తులు కవితలు/

ఎగసిన అగ్నికణాలు బూడిదయినట్టు/అనుభవాలను వ్యక్తంచేసే పెనుగులాటలో / ఓడిపోయిన రక్తం గుర్తులు కవితలు" అది సత్యాగ్రహంలో కలిగిన నిరాశమాత్రమే. అంత మాత్రాన అచేతనుడైపోయి "రక్తారోహణం" చేయకుండా మానుకోలేదు గోపీ - "నేల రాలే రక్తబిందువుల్లో తడిసి పిడికిళ్ళు బిగుసుకుంటాయ'ని తనే మళ్ళీ భరోసా చెప్తాడు! అందుకే అతనిని నినాద కవితకు దూరమై, ఆవేదనకూ ఆలోచనకూ చేరువైన నివేదనా చిత్రాలు, గుండె మంటలకు దివిటీలెత్తిన దీపచిత్రాలు, సమాజ చిత్ర దీపాలు!!

డిసెంబర్ 10, 1989

# ఆత్మనివేదనలో అసంతృప్తి ఛాయ 'ఆకుపచ్చలోయ'!

మనిషికి అనుకున్న కోరిక నెరవేకపోతే అశాంతి, పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించుకోలేకపోతే క్షోభ, ఆదర్శంలో విఫలమైతే మనస్సులో పెనుతుఫాను, విశ్వాసం పటాపంచలయితే వియత్తలమే విరిగిపడినంత బాధ, ఆశ-నిరాశల మధ్య తన ఉనికిని సమర్థించుకోడానికి తగిన వాతావరాణాన్ని కల్పించేది ప్రకృతి పచ్చదనం-నిరాశలో ఉన్నవారిలో ఆశల్ని చిగురింపజేస్తుంది ఆకుపచ్చదనం ఆశకు, జీవనానికీ సంకేతం మోడుబారిన చెట్లు చిగురిస్తాయి మోడుబారిన బతుకులూ అంతేః తొక్కు నడకలతో పడిలేచే పసివాడికున్న ఆత్మవిశ్వాసం పచ్చదనం! ఆ పచ్చదనమే ఒకరికి శాంతి చిహ్నం, ఇంకొకరికి పోరుబాటలో 'బందూకు', పొగరల వాడితనాన్ని బట్టి బుద్ధిబలంతో శిల్పి రాతిని 'నాతి'గానూ మలచగలడు, కోతిగానూ మలచగలడు అందుకే యూరప్ లోని సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ కాలంలో పికోడెల్లా మిరాండోలా మానవుడి ఔన్నత్యం గురించి ప్రస్తావిస్తూ *("Treatise on the greatness of man")* మానవుణ్ణి ఉద్దేశించి ఇలా అంటాడుః నిన్నీ ప్రపంచం మధ్య నిలబెట్టాం చుట్టు చూపుతో మసలుకో నీవు దివిలో తిష్ఠవేసుకునే దివ్యశక్తివీ కావు, దివి నుంచి భువికి దిగివచ్చే ఓ అనూహ్య శక్తివీ కావు! నీవు నీవే స్వతంత్రంగా నిన్ను నీవు దిద్దితీర్చుకో ఓ శిల్పిలా ఏ ఆకృతిలో నిన్ను నీవు మలచుకుంటావో నీ ఇష్టం"! దుర్మార్గుల జాబితాలో నిలబడతావో సన్మార్గుల వరసలో సమున్నత స్థాయికి ఎదుగుతావో, నీ ఇష్టం! "పచ్చదనాన్ని నమ్ముకున్న వాడికి తాత్కాలిక ఇబ్బందులు విరామ చిహ్నాలు 'ఆకుపచ్చలోయ'ని నమ్ముకున్న వారికి ఇబ్బందులూ అంతే! ఆంద్రేగైడ్ రాజీపడడానికి భయపడినవాడు! నిస్పృహకు మరొక ముఖమే నిరాశ. అయితే ఆ నిరాశ బతుకు మీద కాదు ఉద్యమంలో కొనసాగలేకపోయానన్న అసంతృప్తి నుంచి పుట్టుకొచ్చిన మనోవేదన. ఓ పదేళ్ళపాటు ఉద్యమాలలో పుట్టి, వాటితో మమేకత పెంచుకున్న వారందరిలోనూ, ముఖ్యంగా బతుకుతెరువుకోసం ఇష్టంలేని చోట తలదాచుకోవలసి వచ్చిన వారందరిలోనూ ఆ ఆవేదన సహజం. కాని ఆ మేరకైనా అది 'రాజీ' అని అలాంటి వారు గుర్తించలేకపోవడమే ఒక బలహీనత అని అంగీకరించాలి ఉద్యమానుభవాలు, కష్టసుఖాలు, వాటితో మిళితమై ఉన్న ఆశయ ఆదర్శాలు, వాటి వైఫల్యసాఫల్యాలు, ప్రకృతి సాక్షిగా అనుభూతుల భావచిత్రాలను వినూత్నశైలిలో, సరికొత్త శయ్యతో వచ్చిన యువకవితా సంపుటాల్లో ఒకటి నామాడి శ్రీధర్ "ఆకుపచ్చలోయ" చేవచచ్చి, వచన కవితా ప్రక్రియ నిర్వీర్యపడుతున్న దశలో కొత్త భావచిత్రాలను రూపుకట్టుకొని నవ్య వచన కవితా కిశోర వాయువులతో మనస్సులను తాకుతున్న సంపుటి "ఆకుపచ్చలోయ" ప్రధానంగా ఈ సంపుటిలో కవి పదేళ్ళపాటు ఉద్యమ సంబంధి కావడం వల్లనో ఏమో గానీ భావుకతలో మార్మికత తరచుగా దోబూచులాడుతోంది శ్రీశ్రీ ఒక సందర్భంలో చెప్పినట్టు "ఆలోచనాలాలోకొస్తే" ఒక సంగీతం వినపడినా, ఒక సందేశం విడివడినా కవి ఆదర్శిస్తున్న ఆకుపచ్చనిలోయ నలుగురికీ ఆర్ద్రగీతంగా, సతతహరిత గీతంగా అందిరావాలనుకున్నప్పుడు మార్మికతకు హద్దులు పెట్టుకోవాలి ఆకులలో అణగిమణిగి కవిత కోయిల పలుకు బంగారాలు పంచడం తప్పులేదుగాని--తన ఆవేదనను పదుగురితో పంచుకోవాలన్న కవి ఆశకు సాఫల్యం సిద్ధించాలంటే తన కవిత అందరికీ హృదయవేది కావాలి! శ్రీధర్ కవిత పరిస్థితుల కారణంగా

ఉద్యమం నుంచి వేరుపడి ఆత్మద్రోహాన్ని సహించలేని ఒక అంతర్ముఖి నిజాయితీతో సమర్పించిన నివేదనే-ఈ "ఆకుపచ్చలోయ" అని గుర్తించి తీరాలి మనిషి ఎదుగుదలకు సాక్ష్యం అంతర్మథనం, ఆత్మ వివేచన, పరిశీలనా దక్షత వెలుగునీడలకు అద్దంపట్టే వాడే రచయిత అనుకున్నప్పుడు శ్రీధర్ ప్రయోగం నిజాయితీపరులందరికీ అనుభవ కలశం! ధర్మాగ్రహం అతని చేతి విచ్చుకత్తి! ఆశ నిరాశల మధ్య ఉద్యమ తాత్త్వికతతో ఊగిస లాడినప్పటికీ ప్రతి పదకవితలోనూ ఆశను రెక్కొట్టే జీవనజ్యోతి మనకు కనిపిస్తుంది నిరాశను పారదోలే జీవన గీతాన్ని ఎవరైనా అడ్డుకొంటే సహించడు దాన్ని ఆలాపించనివ్వమని వేడుకుంటాడు జీవనంలో శ్రీధర్ వసంతోదయాన్ని చూస్తాడు తన "కలల పిట్ట"ను కాపాడుకోడానికి ఎక్కడున్నా తన శాయశక్తులా ప్రయత్నిస్తాడు! సోవియెట్ పతనంపై 'ఎలిజీ' గా రాసిన కవితలో జీవధాతువుల పునరుజ్జీవనానికి స్వాగతం పలుకుతాడు రేయింబవళ్ళు తారతమ్యం లేని "మనీప్లాంట్స్" (బోన్సాయ్ బతుకులు)ను ఆహ్వానించలేడు, సూర్యకాంతిలో ఎదిగివచ్చే జీవధాతువులనే ఆశ్రయిస్తాడు అందుకే ప్రతి ఒక్కరూ ఆ సూర్యకాంతిని కాపాడుకోవడానికి "రశ్మి రక్షకులు" కావాలంటాడు! కొత్తవారికి శ్రీధర్ కవితలు మధ్యలో తెగిపోయిన గాలిపటాల్లా అనిపించినా, అవి మధురోహలు నింపే స్వప్నకలశాలు కావడం విశేషం వాటిలో అపురూపమైన భావుకతే కాదు, చిత్రకారుడికి పని కల్పించగల భావ చిత్రాలున్నాయి అతని కవిత తాత్త్విక చింతనలో స్నానమాడుతుంది. అందులో ఆదిభౌతికమే కాదు, అధివాస్తవికమూ తొంగిచూస్తున్నాయి. శ్రీధర్ కవిత తన ముందరి వచన కవితా సామ్రాట్టులయిన అజంతా, త్రిపుర, స్మైల్, ఇస్మాయిల్ కవితలను కూడా స్ఫురణకు తెస్తుంది, సర్రియలిస్టులను, సింబాలిస్టులను గుర్తుచేస్తుంది అయితే ఏ ధోరణి అయినా శ్రీధర్ ధోరణికి లొంగి ఉండడం అతని కవితా వైశిష్ట్యం అని గుర్తించాలి! ఆ వ్యక్తిత్వ నిరూపణలో మనకొక రింబా, మలార్మ, నవ్య శైలీ విన్యాసంలో ప్రతీకలను ప్రతిష్ఠించడంలో ఒక బ్లాక్, ఒక లోర్కా, ఒక ఇలియట్ గుర్తుకొస్తారు వాళ్ళతో పోలిక అని కాదు- సింబల్స్ ఎంపికలో భావచిత్రాలలో శ్రీధర్ నూతన పోకడలు పోతున్నాడని చెప్పడంకోసమే ఈ పోలిక మయకోవస్కీ లానే శ్రీధర్ కూడా చాలా సందర్భాలలో స్వీయానుభూతిని, తనకాలపు పరిసరాలనూ కవితలో మార్మికంగా వర్ణించాడు. మయకోవస్కీ ఒక అసంపూర్ణ కవితలో (*"Aloud and Straight" I myself will speak of me and my time*) అని రాసుకున్నట్టే శ్రీధర్ కూడా "ఆకుపచ్చలోయ" లో సొంత గొంతును మంది గొంతుగా మార్చాడు! కవితా విన్యాసంలో భావనా చిత్రాలు ఎన్నిరకాల శైలిలో ఆవిష్కరించుకుంటాయో రష్యన్ కవి చెబుతున్నాడు *("To The Army of Arts") " To you/fig-leaf-Camouflaged mystics/force-heads dug over furrows sub-lime/futuristic/imagistic/acmeistic/ stick tight in the cowebs of rhyme")*

శ్రీధర్ భావచిత్రాలలో - మనోరథసాధనలో విఫలులైన విదూషకులు కనిపిస్తారు, పచ్చిక మీద నడుస్తున్నా దినపాదాలకు అంటుకునే మరవని కన్నీళ్ళ తడి ఉంటుంది, మధ్యాహ్నాలను ఓదార్చే కొబ్బరి తోటలుంటాయి; అతను భావించిన జీవనదిలో లంగర్లు దించుకున్న గాయాల పడవలెన్నో, ఒడ్డున పడి గిలగిల్లాడుతున్న చేపలెన్నో, తీరని కోర్కెల పశువులెన్నో, అగరు మొక్కకుపూసిన మోదుగ(ఎర్ర) పువ్వు పాడిన హరిత గీతం ఏకాంతాన్ని జ్ఞాపకాల మల్లె తీగలా అలుముకోవడం చూస్తాం! పీత పిల్లల మెంకెన పూలు కనిపిస్తాయి, నెలవంకను వంతెనగా

మార్చుకొని మీటే స్వప్నతంత్రులు వినవస్తాయి, వసంతంలో మింటిని తాకే రెక్కలు, కౌగిలించుకునే ఆశల మొండి గోడలూ, స్వప్నాలుగా మారిన ప్రత్యుత్తరాలకు నోచుకొని ప్రేమలేఖలూ-ఇలా ఎన్నో పదచిత్రాలు శ్రీధర్ మన ప్రహ్లాదుడికి దగ్గరగా వెడతాడు-స్త్రీ మూర్తి పట్ల గౌరవాదరణలో "అన్యకాంతలు కన్నుదోయికి అడ్డంబైన మాతృభావన చేసి మరలు వాడు" ప్రహ్లాదుడు! అలాగే శ్రీధర్ "తల్లీ" కవితలో స్త్రీ మూర్తిని ఆరాధించిన తీరు "మిస్ వరల్డ్" పోటీలో ఉన్న వాళ్ళకు గుండెకోత పెట్టిస్తుంది! మగవాడి దృష్టిదోషాన్ని అందులో ఎండగట్టాడు 'ఆమె' ఎదురు చూసేది కేవలం మగవాడి శరీరం కోసం కాదు, ఆత్మ పుష్పంకోసం, ఈ సత్యాన్ని ప్రకటిస్తూ శ్రీధర్ "నిరవధిక చాకిరీలో/లీనమయిన పరధ్యానంలో/ నీ మాంసపు కండల్ని/కబళించే నా కంటి కోరలు" అని శరించుకొని "తల్లీ! నీవు నా ఆత్మ పుష్పంకోసం శతాబ్దాల తరబడి అన్వేషిస్తున్నావు" అంటాడు నేటి సంతదోపిడీలో (మార్కెట్ ఎకానమీ) ప్రేమ, సరసత అమ్మకానికి దొరికే సరుకులు అనాత్మ సౌందర్యం కోసం ఎగబడే వారేగాని ఆత్మ సౌందర్యం కోసం కాదు! నరమాంసపు ముద్దలే గాని చెరవీడిన చరణదాసులు కారు సముద్రమంత విశాలమైన జీవితాన్ని మనసారా ప్రేమించగలవాడే సుఖదుఃఖాలకు, రాగద్వేషాలకు అతీతంగా అంచనా కట్టగలుగుతాడు శ్రీధర్-సమూహంలో మసలుతున్నా, స్వప్నాలు రాలిపోతున్నా తన ఏకాంతాన్ని తలచుకొని (ఉద్యమానికి దూరమయ్యానన్న బాధతో) కుమిలి పోతాడు, చేసేది లేక దిక్కుతోచని పరిసరాల్లో ఇమిడి పోవడానికి ప్రయత్నిస్తాడేగాని, ఇమడలడు! నిర్బంధ విధానంలోని కర్కశత్వాన్ని, అమానుషత్వాన్ని వేదసారానికి మించిన ఆవేదనా సాగరంలో ఉతికేస్తాడు నీళ్ళకు కూడా దూరమైన రోజుల్ని తలచుకుంటూ నరుడి దుస్థితిని చూసి కూడా శిరమొగ్గని 'నది' దైన్యస్థితికి కారణాన్ని శ్రీధర్ వెతికి పట్టుకున్నాడు "కావడానికి నదినే కానీ/తీరమంతటా పహరా" ఉన్నందున నిర్బంధపు నీలి నీడల్లో గుక్కెడు మంచి నీళ్ళకు కరువు వాసిపోయాడు! ఉద్యమానికి దూరమైనందుకు పశ్చాత్తాపంలో కూడా ఆత్మధిక్కారానికి పాల్పడగల ధైర్యం ఉన్న బహు కొద్దిమంది కవుల్లో శ్రీధర్ ఒకడు తన ఆత్మక్షోభను ఎవరూ తీర్చలేరు, ఆర్చలేరు కనుక "నేను విననుగాక వినను" అని తన పశ్చాత్తాపాన్ని అడుగడుగునా నిప్పులాంటి నిజాయితీతో ప్రకటించు కుంటాడు! యాంత్రికమైన జీవన చెరసాలలో బందీననుకుంటాడేగాని తన ఆత్మలోపల ఎగిసిపడే కలత మధ్య గోడలు కట్టుకోడానికి ఇష్టపడని కవి చిరంజీవి శ్రీధర్ ఈ క్షోభతోనే తనను తానుగా కూడా పలకరించుకో నిరాకరిస్తాడు అతనిలోని పురాగానం ఆగదు అక్కడికీ "కొంపదీసి మీకెవరికయినా వినిపిస్తుందేమోనని తప్పించుకు తిరుగుతున్నాన"ని కూడా ధైర్యంగా చెప్పి పట్టుబడి పోతాడు! యువతలో సహజంగా ఉండే నైర్మల్యం, నిజాయితీ శ్రీధర్ మాటలో ఉంది, పాటలో ఉంది అదే అసలు పచ్చదనం! ఆరేడేళ్ళుగా కవి అనుభవించిన అంతర్మథనానికి, అశాంతికి అనుశ్రుతి, మనఃపూర్వకమైన ఆత్మనివేదనలో పెల్లుబికి వచ్చిన అసంతృప్తిఛాయ "ఆకుపచ్చలోయ"! తనకన్నా దేశదిమ్మరి సీతాకోక చిలక జీవితమే ధన్యమనుకుంటాడు శ్రీధర్! అయితే ఇన్ని జీవన సత్యాల్ని వెతికి పట్టుకోగల శ్రీధర్ "పోరంబోకు కబుర్ల"కు దూరంగా ఉండవచ్చుగాని, తనను తాను ఒక కవితలో "పేడపురుగా"గా చిత్రించుకోవడమూ తప్పే, తనకు రేపు తోడునీడగా అందివచ్చే స్త్రీ మూర్తిని "ఆడపురుగుగా" గా భావించుకోవడమూ తప్పే! నిరాశగాని, నిస్పృహగాని హద్దుమీరకూడదు. తెలివి మీరాలి. పరిష్కారం తనచేతిలోనే ఉన్న పరశువేది!

మనస్సు చంద్రహాసం! చరిత్రలో ఏ ఒకటి రెండు ఉదాహరణలో మినహాయిస్తే - ఏ విప్లవకారుడు ప్రకృతి సిద్ధమైన ప్రేమకూ సంసారానికీ దూరంగా ఉన్నాడో చెప్పగలిగితే శ్రీధర్ ధన్యుడవుతాడు! కాని అతను చెప్పడు, చెప్పలేడు! ఎందుకంటే, రాబర్ట్ గ్రీవ్స్ అన్నట్టు "డబ్బు కొనని వస్తువులేదు, ఒక్క నిజాన్ని తప్ప! అలాగే డబ్బు కొనని సరుకులేదు, నిప్పు లాంటి నిజాయితీ పరుడైన ఒక్క కవిని తప్ప!" అందుకే శ్రీధర్ నిజాయితీగల నిగూఢ కవి! నిండు కుండ!

ఆదివారం 24, నవంబర్ 1996

# కటకటాల వెనక 'ఉక్కు' కవితలు!

"ప్రేయసీ  అలకించినదాది మదీయ హృదయ / దుగ్ధవార్ధిని మధన ముద్భూతమయ్యే" అన్న ప్రేమగీతంలోని కామపాశంలో చిక్కుపడిపోయిన మనకు--

"ఈ వియోగ నిరాశాక్షణక్షణ ప్రతీక్ష చెదరి ఎగసి ఎగసి పగిలిపోదును " అన్న కవి కుమారుని విరహవేదనను పంచుకున్న మనకు--

"ప్రేయసీ, లేచిరమ్ము / శీతలచ్ఛాయలోన యౌవన వసంత శుభోదయమయ్యే" అని అదే ధ్యాసతో కవితా గానం చేసే భావకవితో ఇన్నాళ్ళుగా ముద్దుముచ్చట్లు తీర్చుకున్న మనకు--

ప్రజలకోసం ప్రజా ఉద్యమాలతో కలగలిసిపోయి సామాన్యుని కామనకు అక్షరసాక్షిగా నిలిచి కవితా క్షేత్రంలో వీర విహారంచేస్తూ ప్రతి ఒక్కరూ ఒక కావ్యకంఠ మునిగా కదంతొక్కుతూ జైళ్ళపాలై, కటకటాలనుంచి వినిపించే 'ఉక్కు' కవితలు కొత్తగా తోస్తాయి!

"జైళ్ళలోకూడా కవితలా", అని ప్రశ్నించే వారుండొచ్చు కాని ఆకులందున అణిగిమణిగి ఉండే కోయిల ఎందుకు కలకూజితాలు వినిపిస్తుంది? మనిషికి ప్రాణం ఉన్నంతదాకా గానం ఉండి తీరుతుంది, మనిషి గూనివాడైనా గుడ్డివాడైనా సరే కనీసం కూనిరాగమైనా తీసి తీరుతాడు! కవితలల్లడం నిత్యవ్యాపకాలలో ఒకటిగా చేర్చ నిరాకరించిన డాక్టర్ హోచిమిన్ కూడాతాను జైళ్ళపాలయినప్పుడు-- "జైలు గోడల మధ్య ఇంతకన్నా చేసేది లేదు, బందీగా కవితా బంధం చేస్తాను, పాడుతూనే స్వేచ్ఛాదినం చేకొని తెస్తాను" అని ఒక జీవన రహస్యాన్ని వెల్లడించాడు ఆహార విహారాలు, సెక్సు జీవరాశికి నిత్య నైమిత్తికాలు కాని జీవిత వ్యాపకానికి అవే పరసీమలు కావు! మానవజీవనాన్ని సుఖవంతం చేయడంకోసం, పీడనా దోపిళ్ళనుంచి శ్రమజీవుల్ని శాశ్వతంగా విముక్తి చేయడంకోసం సాగే ఈ నిరంతర జీవన సమరంలో మైలురాళ్ళుగా జైళ్ళ జీవితాలు ప్రజాకవులు కూడా గడపవలసి వస్తుంది అప్పుడా జైళ్ళను రాజకీయ పాఠశాలలుగా మలచుకోవలసి వస్తుంది, ఉన్నతాశయాల సాధనకోసం మనస్సును విశాలం చేసుకోవలసి వస్తుంది, మరింతగా కాకలు తీరవలసి వస్తుంది

మానవునిలోని బలహీనతలను బహిర్గతం చేస్తుంది జైలు జీవితం అతి స్వల్పమైన విషయాల పైనకూడా తగాదాలకు ఆస్కారమిచ్చే వాతావరణం అది కాని ఉక్కు మనుషులు ఈ బలహీనతలను అధిగమించగలుగుతారు అలా అధిగమించి చరిత్రలో విజేతలుగా బయటపడిన విప్లవ కవులూ, రచయితలే--ఎర్నెస్ట్ టెల్లర్, హోచిమిన్, జార్జి జాక్సన్, గూగీవా తియాంగో, గాబ్రేల్ పెరీ, ఎర్నెస్టో గువేరా వీరందరూ జైలు జీవితానుభవాలు ఆధారంగా జైలు దినచర్యలు--ప్రిజన్ డైరీస్--రాసారు కొందరు కవితలుగా రాస్తే, ఇంకొందరు రసవత్తరమైన వచన కవితలుగా దిద్దితీర్చారు జాతీయోద్యమ దినాలలో నెహ్రూ, కూతురు ఇందిరకు రాసిన లేఖలు ప్రపంచ చరిత్రగా రూపొందినట్టే, విప్లవ కవులు రాసిన ప్రిజన్ డైరీలు ప్రపంచ చరిత్రకు వ్యాఖ్యానాలుగానేకాక, చరిత్రను కొత్తపుంతలు పట్టించగల వాఃకణాలుగా, కవితా గానాలుగా రూపుదిద్దుకున్నాయి! విప్లవకవులు ప్లాటో సూత్రాన్ని కాలదన్నారుః 'మనిషే ఒకఖైదీ ఆ ఖైదు తలుపులు తెరుచుకొని, విదిలించుకుపోయే హక్కు అతనికి లేద'ని అతడు నిరాశావాదాన్ని వ్యాప్తిచేసి శాసించ బోయాడుగాని ప్రపంచ చరిత్ర అందుకు భిన్నంగా నడుస్తోంది! జీవన సత్యాలను ధైర్యంతో ముఖాముఖి ఎదుర్కోలేనివాడే పలాయనవాదాన్ని ఆశ్రయిస్తాడు కష్టాలను వోర్వలేని ఎఫ్ డబ్ల్యు హార్వే ఓ సందర్భంలో

ఇంక ఈ బాధలు పడలేను, పోయి అందమైన బాతుల్ని కళాఖండాలుగా దిద్దితీర్చి ఒక ఆర్ట్ గ్యాలరీ పెట్టుకుని అమ్ముకుంటానన్నాడు (*From the troubles of the world I turn to Ducks")*। కాని అందరూ అలా ఉండరు। మనిషిలో నిజాయితీ ఉంటే అది కవితలో ప్రతిబింబిస్తుందనీ, ఒకవేళ రాగద్వేషాలు కవికి ఉన్నా వాటిని వెలిగక్కడంలో కూడా నిజాయితీ ఉండాలనీ అన్నాడు డచ్ హెచ్ ఆడెన్ (*'One must be honest even about one's prejudices'*) ।

తెలుగునాట కొడాలి ఆంజనేయులు పాత తరం కవి స్వాతంత్ర్యయోధులలో ఒకరు। "రాతి గుండెలు గలిగిన రాచభటుల / కర్కశాఘాతముల మేను కందిపోయె / శీతల హిమాంబుకణముల చిల్కరించు అమృత కిరణాల స్పృశియింపుమయ్య మమ్ము" అని జైలులో ఉన్నప్పుడు చందమామను వేడుకొన్నాడు బయట మనుషుల్ని చిదిమినట్లే, ఆఘ్రాణించ శక్తిలేనివాడు, అనుభవించ లేనివాడూ పూలకారును కూడా నాశనం చేస్తాడు। కాని హోచిమిన్ "సంధ్యారాగం" లో గుండె బద్దలుగొట్టే సందేశాన్ని వినిపించాడుః "సాయంకాలం గులాబి వికసించి క్రమంగా వాడిపోతుంది / అది రేకులు విడడం, రాలిపోవడం ఎవ్వరూ గమనించరు / కాని ఆ పరిమళం జైలు అంతరంగంలోకి / అలలుగా వ్యాపిస్తుంది / జీవన దురంత దుఃఖాలను ఖైదీలకు వినిపిస్తుంది" అంటాడు

అలాంటి అనుభవాలను హృద్యంగా అందించినవారిలో కె వి ఆర్ "జైలుకోకిల", చెరబండరాజు "పల్లవి", వరవరరావు "సహచరులు" ఎవరి కష్టసుఖాలు ఎవరు ఎంత సానుభూతితో పంచుకున్నా, జైలు "ప్రేమలేని రాత్రి" గా వరవరరావుకు తోస్తుంది జైలులో కూడా పూలు పూయడం ఆయనకు ఆశ్చర్యం కల్గించినా, మీరట్ మతకల్లోలాలలో మానవులు ప్రాణాలు కోల్పోయినప్పుడు (ఇక్కడ ఏ మతస్తులని ప్రశ్నించడం దుర్మార్గపు ఆలోచన) అతను చెప్పిన మాటలు ప్రతి భారతీయుని ఉనికినీ ప్రశ్నిస్తాయిః "క్రౌంచ మిధునం కోసం పెట్టుకున్న కన్నీళ్ళు / కావ్యమైన వాల్మీకి పుట్టిన దేశంలో / పక్షులే ఆక్షులూ, పక్షాలూ, పంచప్రాణాలు / అయిన సలీం అలీ పుట్టిన కాలంలో మనుషుల్ని ప్రేమించే మనుషులే కరువయ్యారా!" వరవరరావు జైలు డైరీకి "సహచరులు" అని పేరు పెట్టడానికి బహుశా ప్రేరణ, స్ఫూర్తి జార్జి జాక్సన్ జైలు లేఖలు "సొలిడాడ్ బ్రదర్స్" అయి ఉంటుంది "ఆనందం - ఆందోళన" అధ్యాయంలో పేర్కొన్న "వసంతం ఎప్పుడూ విడిగా రాదు/ ఎండాకాలంతో కలిసి వస్తుంది" అన్న భావనకు జార్జి జాక్సన్ జైలు లేఖల్లో ఉదాహరించిన *"Without the cold and desolation of winter there I could not be the warmth and splender of spring"* చాల దగ్గరగా ఉంది। అలాగే హోచిమన్, ప్రకృతి సౌందర్యాన్ని గానం చేసిన ప్రాచీనులను గౌరవిస్తూనే "ఈ వేళ ఇనుము, ఉక్కుకూడా మనం కవితలలో చేర్చాలి / కవి తానూ ప్రతిఘటించడం నేర్చాలి" అన్నట్టుగానే వరవరరావు కూడా ప్రజా రాజకీయ ఖైదీల ఉనికిని ఇలా సమర్థిస్తాడుః "వాళ్ళు ప్రజల్లో ఉన్నప్పుడు / ప్రభాతంలా ఉంటారు / ప్రవాసంలో ఉన్నప్పుడు / పరిమళంలా ఉంటారు / జైల్లో ఉన్నప్పుడు / కొలిమిలో ఇనుములా ఉంటారు"! ఇనుమూ, ఉక్కు లేకుండా ఆధునిక ఆయాధోత్పత్తి లేదు। బహుశా అందుకనే యువకవి 'వసీరా' కూడా ఇటీవల ఒక కవితా "లోహనది"ని సృష్టించాడు। "కాళ్ళు తడవకుండా / మహాసముద్రాల్ని దాటిన మేధావికూడా / కళ్ళు తడవకుండా జీవితాన్ని దాటలేడు"అంటాడు కవి సౌదా "జైలునుండి ప్రేమ లేఖ" లో తన సహచరుల త్యాగాల్ని వాసనపట్టి వారి అడుగుజాడల వెంట కవిత్వాన్ని

రాసుకుంటూ, శబ్దాన్ని మాత్రం ప్రతిధ్వనిస్తూంటాడు! కవి విలియమ్ బ్లేక్ ఒకచోట, దమ్ములుంటే "పాషాణ చట్టాలతో నిర్మించిన జైళ్ళనూ / పాశవిక మత కుడ్యాలతో పేర్చిన వేశ్యా గృహాలను" సమూలంగా సంస్కరించడానికి ముందుకు రండని సవాలు చేస్తాడు! ఏనాడో ఆ సవాలును అందుకున్నవాడు ఫ్రెంచికవీ, రచయిత, నాజీలు ఉరితీసిన గాబ్రేల్ పెరీ ఉరికంబమెక్కుతూ అతనిచ్చిన తుది సందేశమే చరిత్ర ప్రసిద్ధికెక్కిన "ది లాస్ట్ టెస్టమెంట్" అది "వర్తమానం ఆకుల చాటున కనిపించని భవిష్యత్ కోకిల" (*Singing tomorrows*) ఆలాపించిన ఉషోగీతిక! అందుకే మరో సుప్రసిద్ధుడు లూయీ అరగాన్ అతణ్ణి వెలలేని 'రాయంచ'గా భావించి ఫినీషియన్ మట్టినుంచి పుట్టిన మాణిక్యంగా పెరీని ఇలా వర్ణించాడు: *"I have not forgotten the memory of him sang like a swan--Who seemed a prince made of that Phoenician clay- Whose fineness has remained a secret since antiquity"!*

ఆగస్టు 20, 1989

# ఇది నవశతాబ్దపు జయశబ్దం

ఆసియా ఖండంలోని మహోన్నత నాయకులలో ఒకరుగా, ప్రగతిశీల భావుకుడిగా, నిగర్విగా, కవిగా, విప్లవ కవిగా పేరొందిన డాక్టర్ హోచిమన్ తన జైలు జీవితంలో కొన్ని కవితలు రాశాడు వాటిలో ఒకటి

"ప్రాచీనులు ప్రకృతి సౌందర్యాన్ని గానం చేశారు
హిమాలు, సుమాలు
చంద్రుడు, చల్లగాలి
పొగమంచులు, పర్వతాలు
పొంగులు వారే నదులు, ఇలా-
కాని ఈ వేళ ఇనుము, ఉక్కు కూడా
మనం కవిత లో చేర్చాలి!
కవి తానూ ప్రతిఘటించడం నేర్చాలి!!"

కాని భావుకుడైనవాడు ఇప్పుడు ఇనుము, ఉక్కుతోనే కవితాబంధం చేయడంలేదు, మానవుడి అంతరంగంలోకి తొంగిచూడడమేగాక విశ్వాంతరాళంలోకి మెడలు చాచి వైజ్ఞానిక రహస్యాలను కూడా శాస్త్ర, సాంకేతిక పరిభాషతో అక్షరబద్ధం చేస్తున్నాడు మరో మాటలో చెప్పాలంటే సైన్సును, టెక్నాలజీని కావ్యవస్తువులుగా స్వీకరిస్తున్నాడు విశ్వాన్నే విచిత్ర కావ్యంగా దిద్ది తీర్చాలను కొంటున్నాడు పాఠకుల మనస్సులను రోదసీ రాస్తాలతో రాగరంజితం చేస్తున్నాడు అయితే సైన్స్ కవితలు, లేదా వైజ్ఞానిక కవితా కదంబాలు రాసిన కవులు ప్రపంచ సాహిత్యంలోనే అరుదుగా ఉంటే, తెలుగులో అవి మరింత 'నల్లపూసల'నే చెప్పాలి అలాంటి సైన్స్ కవితలను చక్కని పదబంధాలతో, అర్థగౌరవంచెడకుండా, శాస్త్రసాంకేతిక పరిభాషకు దూరంకాకుండా తెలుగులో విజయవంతంగా విశిష్ట ప్రయోగం చేసిన కవి విశ్వ సత్య శ్రీమన్నారయణ అతనే కొత్తపల్లి శ్రీమన్నారాయణ! మనకు భూతకవులూ, అనుభూతి కవులూ చాలామంది ఉన్నారు కాని సహానుభూతి కవులు తక్కువ! తన అనుభూతి శకటానికి ప్రగతివాదాన్ని ప్రచండ బావుటాగా తగిలించుకొన్న చక్రనేమి శ్రీమన్నారాయణ అతను రాసిన సైన్స్ కవితలు "అక్షరంలో అంతరిక్షం". తెలుగు అక్షరంతో 'వార్త' దినపత్రిక తొలి అంతరిక్ష ప్రయోగం చేయగా, గ్రహాంతర కవితా సీమల్లోకి మనల్ని నడిపించినవాడు శ్రీమన్నారాయణుడు! పదార్థ విజ్ఞానానికి పెద్దపీట వేసిన ఘనత భౌతిక విజ్ఞాన శాస్త్రానిది కాగా, ఈ శాస్త్రాన్ని అజరామరం చేసింది ఇరవయ్యో శతాబ్దం మన కాలంలో ఎన్నో సత్యాలను అద్భుతవ్యాఖ్యానంతో వివరించి చెప్పిన గ్రంథం జె బ్రొనోస్కీ రాసిన "మానవ విజయం" ("ది ఎస్సెంట్ ఆఫ్ మాన్") భౌతిక విజ్ఞాన శాస్త్రం ఒక వ్యక్తి సృష్టికాదు మానవజాతి సమష్టి కృషికీ మానవ జిజ్ఞాసకూ అది ప్రతిబింబమనీ, ఈ విజయానికి సరిజోడు లేదనీ, పిరమిడ్ల నిర్మాణం, "ఇలియడ్" కావ్యం, సంగీత రూపకాలూ, గుళ్ళుగోపురాలూ ఏవీ సరితూగవనీ బ్రొనోస్కీ అంటాడు! దేనికైనా 'భావన' అన్నది ముడిపదార్థం. అలాంటి కొత్త భావనా స్రవంతికి ఈ యుగంలో తోడునీడగా ఉన్నవారు ఎందరెందరో! అందరూ అగ్రగాములే

మెండలీవ్ ప్రకృతిలో లభించే ధాతువుల సంఖ్యను తేల్చడానికి కుస్తీ పడుతూ వచ్చాడు, అణువును విభజించడం సాధ్యపడదన్న గ్రీకుల నమ్మకాన్ని జె జె థామ్సన్ తుత్తునియలు చేసి, అణువును బద్దలు కొట్టవచ్చని నిరూపించాడు, రూథర్ ఫర్డ్ ఈ నిర్ణయాన్ని సదవకాశంగా మార్చుకొని గ్రహవ్యవస్థను స్థిరపరిచాడు, నీల్‌బోర్ విజ్ఞాన శాస్త్ర పురోగతికి దానినొక ఆదర్శంగా మలిచాడు, చాడ్విక్ "న్యూట్రాన్"ను కనిపెట్టగా, దాని తబిశీళ్ళు తీసి, అణుగర్భం (న్యూక్లియస్) రూపురేఖల్ని మార్చిన వాడు ఫెర్మీ, ఇంధనానికి అణుస్వభావానికీ కల్పించినవాడు మాక్స్‌ప్లాంక్, అసలు అణువులున్నాయా లేవా, లేక అవి ఊహాజనితాలా అన్న మీమాంస ఈ శతాబ్దం తొలి రోజుల్లో ప్రపంచ విజ్ఞాన శాస్త్రవేత్తలను వేధిస్తున్నప్పుడు వియన్నా నుంచి ఎర్నెస్ట్ మాక్ 'లేదు, అణువనేది లేద'న్నాడు, గొప్ప రసాయన శాస్త్రవేత్తగా పేరొందిన విల్ హెల్మ్ ఆస్వాల్డ్ కూడా అలాగే పెదవి విరిచాడు కాని 'అణువు' అనేది లేదన్న ప్రతికూల సిద్ధాంతాలన్నీ ఆనాడు ప్రాచుర్యంపొంది ఉంటే, విజయం పొంది ఉంటే-ప్రపంచ విజ్ఞాన శాస్త్రం అనేక దశాబ్దాలపాటు, కనీసం నూరేళ్ళపాటైనా వెనుకంజవేసేదని బ్రొనోస్కీ అన్నమాట అక్షరసత్యంగా భావించాలి కాని అ ప్రమాదాన్ని తప్పించి నేటి విజ్ఞానశాస్త్ర ప్రగతికి మార్గం వేసినవాడు-లడ్విగ్ బోల్ట్జ్‌మాన్ ఇతనికి నివాళులర్పించాలంటే కవి విలియమ్ బ్లేక్‌ను మాత్రమే మనం ఆశ్రయించగలం ఎందుకని? బ్లేక్ విశ్వరహస్యాన్ని ఇలా విప్పి చెప్పాడు

"ఇసుక రేణువులో ప్రపంచాన్ని దర్శించడానికి

అడవిపువ్వులో స్వర్గాన్ని దర్శించడానికి

అనంతాన్ని నీ అరచేతిలోకి తీసుకో

అప్పుడు క్షణాలలో నీకు విశ్వరూపం సాక్షాత్కారమవుతుంది"

అదిగో! ఆ విశ్వరూప సందర్శనం తాను చేసి, మనకు చూపుతున్నదే 'అక్షరంలో అంతరిక్షం' సైన్స్ కథలు ఎందరో రాశారు హెచ్ జి వెల్స్, అసిమోవ్, ఆర్థర్‌క్లార్క్ వాస్తవాలనిపించేంతగా సైన్స్ కథలను (ఫిక్షన్) దిద్దితీర్చారు అసిమోవ్ "ఫౌండేషన్" కథాత్రయం అంతా మానవుడు సాధించగోరుతున్న స్వప్నలోకమే! ఈ స్వప్నలోకయాత్రలో తెలుగులో కవితావ్యవసాయం చేసిన కొద్దిమందిలో దేవులపల్లి, శ్రీశ్రీ వస్తారు ఈ విశ్వం అంతమా, అనంతమా అన్న ప్రశ్న వచ్చినప్పుడల్లా-

"విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన

వీధివాకిలి ఏది చెల్లెలా" అన్న దేవులపల్లి గుర్తు రావలసిందే, భవిష్యత్తు మీదనే ఎప్పుడూ నిఘా పెట్టుకున్న శ్రీశ్రీ నవీన విశ్వవిద్యాలయాల్లో పురాణ కవిత్వాలకూ, శ్రవణయంత్రశాలల్లో శాస్త్రీయ సంగీతానికీ ఇష్టపడక "శరచ్చంద్రిక"లో మినహాయింపులేని క్షమాపణలు లేని సౌందర్యవంతమైన ఆ స్వర్ణయుగంలోకి" మనల్ని తీసుకెళ్ళాలని కలలు కన్నాడు కనుకనే అతను "ఇంద్ర ధనుస్సు పీల్చే ఇవాళ్టి నేత్రం సాంద్ర తమస్సు చీల్చే రేపటి మిణుగురు పురుగుగా" విజ్ఞాన శాస్త్రానికి ఆహ్వానం పలికాడు శ్రీమన్నారాయణ కూడా తన సైన్స్ కవితల్లో అడుగడుగునా నవీన మానవుడిగా, త్రివిక్రముడుగా మన ముందుకొచ్చి నిలబడి

'మనదారి ఎటు'అని ప్రశ్నిస్తాడు! శ్రీశ్రీ "చరమ రాత్రి", "శరచ్చంద్రిక", శ్రీమన్నారాయణ "అన్వేషణ", "నవీన సరస్వతి" ఒకే కోవకు చెందినవిగా భావించవచ్చు విశ్వంలో మరెక్కడైనా జీవకోటి ఉంటే దానికోసం ఇక్కడి సమాచారాన్ని నిక్షిప్తం చేసిన ఒక వ్యోమ నౌకను (ఛాలెంజర్?) అమెరికన్లు పంపించినప్పుడు రాసిన "అన్వేషణ" కవితలో శ్రీమన్నారాయణ వేసిన ప్రశ్నలు ఆసక్తికరంగా ఉన్నాయి "ఎవరక్కడ? ఎవరైనా ఉన్నారా? ప్రాణులెవరైనా ఉన్నారా? అంతమే లేని శీతల విశ్వమహాంధకారంలో/అక్షయాగ్ని కీలల గెలాక్సీల మధ్య ఎక్కడైనా ఉన్నారా! /పిల్లా పాపల నవ్వుల పొంగే/సుందరబంధుగ్రహమేదైనా ఉందా!లేదా!/ ఒంటరిదేనా భూమి/ భయంకర హిమనిశ్శబ్దంలో/భగభగ రగిలే కాష్ఠజ్వాలల రొదలేనా! శ్మశాన విశ్వంచాటున విశాల సత్యం/ఏదైనా ఉందా! లేదా!/గద్గద జగద్గళం సవరించే మంగళ మృదు హస్తం/ఏదైనా ఉందా! లేదా!"

ఇలా ఝరీవేగంతో సాగే వైజ్ఞానిక రసగంగాధర కవితలు ఈ ప్రపంచాన్ని సమస్తకోణాలనుంచి పరిశీలించి విస్తరింపజేసిన భావనాతరంగాలు నేడు శాస్త్ర, సాంకేతిక రంగాలనుంచి ముమ్మరిస్తున్న ఎన్నో పదాలకు అందమైన భావ చిత్రాలు ఈ సంపుటి అందజేస్తుంది "కంప్యూటర్ డాట్-నవీన సరస్వతి", "వ్రోజో మార్గం", "జనని జనరేటర్" కొంత నైరూప్య కవితలుగా తోచినప్పటికీ విజ్ఞాన శాస్త్ర విజయాలతో ఏమాత్రం పరిచయ మున్నవారికైనా దేనిని గురించి కవి ఉద్దేశిస్తున్నాడో అర్థమవుతుంది నేడు మన ఆలోచనలను, నిత్య వ్యవహారంలో ఆఫీసుల్లో, ఇళ్ళల్లో శాసిస్తున్నది "చిప్" సంస్కృతి ఈ "సిలికాన్" సింగారాలు అన్ని శాఖలనూ ఆవరిస్తున్నాయి జెనెటిక్స్, బయోజెనెటిక్స్, క్రయోజెనిక్స్, సూపర్ కండక్టివిటీ ఇత్యాది శాఖలన్నిటా ఎంతో పురోభివృద్ధిని మానవజాతి సాధించుకొంటోంది వ్యక్తిత్వ వికాస పతనదశలకు కారణాలయిన జన్యుకణాలను వేరుచేయడానికి జెనెటిక్ ఇంజనీరింగ్ శరవేగాన పరుగులు పెడుతోంది ఈ సైన్స్ కవితల్లో వైజ్ఞానదృష్టికి కళకం రాకుండానే మానవుడి పిదప బుద్ధుల మీదకూడా తగినన్ని చరుపులున్నాయి! విజ్ఞాన శాస్త్రం సమష్టిఆస్తిగా సామూహిక ప్రయోజనానికి తోడ్పడాలని ఆశిస్తున్న కవి దృష్టిలో ప్రస్తుత సమాజం "అంతరిక్షంలా తూట్లుపడిన" సమాజంగా కనిపించింది. మానవుడి అదుపుతప్పిన విజ్ఞాన శాస్త్రం, విశ్వకల్యాణానికి తోడు నీడకావలసిన విజ్ఞాన శాస్త్రం "రేపటి సుజ్ఞాన యాత్ర" లో ఎలాంటి ఉపద్రవాలు సృష్టిస్తుందోనన్న హెచ్చరిక కూడా ఈ కవితలు అందిస్తున్నాయి

పరిణామశీలమైన ఈ ప్రపంచానికి ఉన్న హద్దులూ సరిహద్దులూ ఎరిగిన కవి సైన్స్‌కు ఇచ్చిన నిర్వచనం ఆహ్వానించదగ్గది "సరికొత్త ఫిలాసఫర్" "సైంటిస్ట్", "సైన్స్ గమనం" కవితల్లో-విజ్ఞాన శాస్త్ర లక్ష్యాలను హేతుబద్ధంగా వివరించగలిగారు. సైన్స్‌ను మార్గదర్శిగా, మహర్షిగా భావించిన శ్రీమన్నారాయణ "నిత్యజాగృతంగా తప్పించుకొనే/జిత్తులమార్జి జగద్ధర్మాన్ని/నిత్య జాగృతుడే పట్టుకోవాల"ని చెప్తాడు! అంతేగాదు, పదార్థజ్ఞానమే సర్వమానవులకు సమాన జ్ఞాన నైవేద్యం అంటాడు! కనుకనే నవీన సంస్కృతి లోనే నవ భారత నిర్మాణమని పరిపూర్ణంగా విశ్వసిస్తున్న వైజ్ఞానిక కవి విశ్వసత్య శ్రీమన్నారాయణ! విలియమ్ బ్లేక్ తాను దైవ దత్తంగా భావించిన కొన్ని కొలతలు ఆధారంగా ఈ వసుంధర

రూపురేఖా విలాసాలను వృత్తాలతో చక్కదిద్దబోయాడట! విశ్వం అనంతం అని తెలుసుకోలేక బ్లేక్ ఆ పనిచేసి ఉండొచ్చు కాని "అక్షరంలో అంతరిక్షం"కవి మాత్రం "అక్షరాలే అణువులుగా ముందుకుసాగి విశ్వరహస్యాలను ఇకముందు కూడా కవితా బద్ధంచేసి మనకు వినిపించగలడని విశ్వసించవచ్చు

ఆదివారం మార్చి 17, 1996

# ఊహకందని రాణి ఉదిత సంధ్యారాణి !

అంతర్జాతీయ రంగస్థల దినోత్సవం మరి రెండు రోజులలోనే (మంగళవారం నాడు - మార్చి 27) జరగబోతున్న సమయానికి "కవన కుతూహల" కర్త అబ్బూరి వరద రాజేశ్వర్రావు "నాట్యగోష్ఠి - నాలుగు నాటకాలు" కూడా వెలువడడం, చలనచిత్రరంగం తెలుగు రంగస్థలాన్ని దాదాపుగా మింగివేసిన దుర్దశలో కళాభిమానులందరిలో కొత్త ఆలోచనలకు అంకురార్పణ చేస్తుంది తెలుగునాట నాటకరంగ వైభవానికి, ఆధునిక రంగస్థల రూపక నిర్మాణానికి ఎంతగానో దోహదం చేసిన అగ్రగణ్యులలో ఒకరైన అబ్బూరి రామకృష్ణారావు ఉద్దండుడైన నాటక కర్త, ప్రయోక్త తండ్రికి తగిన వారసుడు 'వరద' రోమన్-గ్రీక్ నాటక రంగాలకు ప్రతిబింబాలుగా తెలుగు నాటక రంగాన్ని దిద్దితీర్చడానికి కథనంలో, రంగస్థల కథనంలో 'కన్యాశుల్కం'తో ప్రారంభోత్సవం చేసిన గురజాడ అంతటి నాటక కర్తగా కాకపోయినా, ప్రయోక్తగా గిరి శిఖరంగా నిలిచిన వారు రామకృష్ణారావు "ఈ వేషం వెనుకటిదే ఏమీ లేదావేశం/ప్రయోగాలులేని నుడులు అమోమయపు పలుకుబడులు"గా భావించిన రామకృష్ణారావు నిర్మాణ కర్తగా నిత్య ప్రయోగంలోనే పండిపోయిన మేధావి జీవితంతో ప్రత్యక్ష సంబంధంవున్న వేదిక కనుకనే కావ్యాలలోకెల్లా రమ్యమైనదిగా నాటకాన్ని పేర్కొన్నారు నాటకాంతం సాహిత్యం అన్నారు ఆ విషయాన్ని 1963లోనే రామకృష్ణారావు అంతర్జాతీయ రంగస్థల దినోత్సవం సందర్భంగా (1961లోనే ఈ దినోత్సవానికి బీజావాపనం జరిగింది) అందజేసిన సందేశంలో స్పష్టం చేశారు! "నాటక రంగంతో సంబంధంలేని విద్యగాని, శాస్త్రంగానీ లేనేలేదు అది సకల కళా నిలయం శోకార్తులకూ, శ్రమార్తులకూ విశ్రాంతినీ, వికాసాన్నీ, వినోదాన్నీ, ఆనందాన్నీ కల్పిస్తుంది వాద ప్రతివాదాలతో కాదు - లోక వృత్తాంత దర్శకమైన రంగస్థల దృశ్యాలు చూచి తమతమ మనో మాలిన్యాన్ని క్షాళనం చేసుకోవాలి" అన్నారు! కనుకనే ఒకనాటి ప్రసిద్ధ నటులు డి వి సుబ్బారావు నాటక రంగానికి, చలనచిత్ర రంగానికీ ఉన్న తేడాను ఎవరికంటే కూడా తడబడకుండా బాగా చెప్పగలిగాడు "బతికున్న మనిషితో మాట్లాడండి. ఫొటోతో మాట్లాడండి"! అదీ రెండు రంగాలకూ ఉన్న భేదం! నిజమే ఒకటి పరిపూర్ణ కళాఖండంగా తల్లిపాలతో ఎదిగిన బిడ్డ, వేరొకటి పోతపాలతో పెరిగిన బిడ్డ. రంగస్థల చరిత్రలో ఈ విపరిణామానికి సవాలక్ష కారణాలు ఉండవచ్చుగాక విద్య వ్యాపారమైన చోట సర్వ కళలూ ఆ వైపుగానే ప్రయాణించక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి దశాబ్దాలుగా తెలుగు నాటక రంగమూ, కళాకారులూ పడుతూ వస్తున్న ఇబ్బందుల గురించి, రంగస్థల పతనానికి కారణాల గురించీ ఎంతో అవగాహనతో, ఆవేదనతో చర్చించడమేగాక, రంగస్థలం పూర్వరంగాన్ని అవనికాంతర ఘోషగా వినిపిస్తున్న రచన వరద రాజేశ్వర్రావు "నాట్యగోష్ఠి" రూపక నిర్మాణానికి, రంగస్థల నిర్మాణానికి సంబంధించిన సిద్ధాంత రాద్ధాంతాలకు జల్లెడపట్టినవేదిక అబ్బూరివారి "నాట్యగోష్ఠి" కాగా, అందుకు ప్రయోగశాలగా, నటీ నటుల శిక్షణా కేంద్రంగా (రిపర్టరీ) తన గజ్జెల రవళిని, తెలుగునాట వినిపించిన దాని అనుబంధ సంస్థ "నటాలి" 1930ల తర్వాత, ముఖ్యంగా యుద్ధకాలంలో, ఆ తరువాత కొలది రోజులదాకా - చిత్తూరునుంచి చికాకోలు (శ్రీకాకుళం) దాకా ఆధునిక రంగస్థల సంస్కారంతో, వినూత్న ప్రయోగాలతో ప్రేక్షక సమూహాలను ప్రయోజనకర రంగస్థలాన్ని సమాశ్రయించేందుకు ఉత్సాహపరిచి ఉద్యమింపచేసిన సంస్థ 'నటాలి' దక్షిణ భారతంలో తొలి రిపర్టరీ "నటాలి" ఇక్కడో సత్యాన్ని చెప్పక తప్పదు "ప్రజా నాట్యమండలి" కూడా ఇంచుమించు రెండో యుద్ధం

నాటికే అవతరించి తెలుగునాట ప్రభంజనంలా దూసుకుపోయింది అప్పటికి మరచిపోయిన తెలుగువారి అన్ని కళా రూపాలను - బుర్రకథ, జముకుల కథ, ప్రజా సమస్యలు ఆధారంగా మా భూమి, పరివర్తన ఇత్యాది నాటకాలతో రంజింపజేసింది ప్రజలను విజ్ఞానవంతులను చేసింది నటాలివారి "ప్రతిమా సుందరి" (ఊహకందని రాణి) 200 ప్రదర్శనలిస్తే "మా భూమి" కనీసం వెయ్యి ప్రదర్శనలిచ్చి చరిత్ర సృష్టించింది ప్రజా నాట్యమండలికి డాక్టర్ రాజారావు ఎలా గుండెకాయగా వ్యవహరించాడో హైదరాబాద్‌లో పోలీసు చర్య తరువాత మొదటిసారిగా 1950లో ఆంధ్రాభ్యుదయోత్సవాలను ఆసరాచేసుకొని సామాజిక ప్రక్రియగా నాటకాన్ని ప్రవేశపెట్టిన ప్రముఖుడు మంత్రి శ్రీనివాసరావు ఆయనకే "నాట్యగోష్ఠి" అంకితం అఖిల భారత స్థాయిలో పీపుల్స్ థియేటర్, నేషనల్ థియేటర్ లాంటి సంస్థలు వెలసి దేశవ్యాప్తంగా ప్రాంతీయ శాఖల ఏర్పాటుకు నాందీ వాచకం పలికాయి "నాట్యగోష్ఠి" లోని నాలుగు నాటకాలు ఒక ఎత్తు అయితే, ఈ పూర్వరంగ చరిత్ర అంతా 'వరద' సుదీర్ఘ పరిచయగోదావరిలో అంతర్వాహినిగా సాగిపోయింది!

"నటాలి" తరపున లేదా "నాట్యగోష్ఠి" పనుపున ప్రయోగంగా గురజాడ వారి మహోత్తమ సాంఘిక నాటకం "కన్యాశుల్కం"తో పాటు ఎదిగివచ్చిన నాటికా నాటకాలు, నాలుగు అవి జోలపాట, ప్రతిమా సుందరి, సంపెంగతోట, ముక్తయాత్ర మొదటి మూడింటికీ మాతృకలు పాశ్చాత్య నాటకాలు నాల్గవది రేడియో నాటిక అయితే ఇంచుమించు అన్నింటిలోనూ లోకవృత్తాంతం, సంప్రదాయ నిరసన, రాచమర్యాదల అవహేళన, అహంకార ప్రతిఘటన, స్వేచ్ఛాప్రియత్వం, సంఘ సంస్కార ప్రియత్వం పూసల్లో దారంలా కళ్ళకు కట్టినట్టు ఉంటాయి కావ్యాలలో నాటకం, నాటకాలలో 'శాకుంతలమ్', మళ్ళీ అందులోనూ నాల్గవ అంకం విశిష్టమైనదన్న లోకోక్తి ఎలా ఏర్పడిందో - వరద, శ్రీశ్రీ రష్యన్ చెహోవ్ నాటకం "చెరీ ఆర్చర్డ్ ' కు అనుకృతిగా రాసిన "సంపెంగ తోట"ను ఈ నాలుగింటిలో శిఖరాయమానంగా చెప్పి తీరాలి దానిని అనుకృతి అనడం కంటే అనుభూతి కృతిగానే చెబితే అతిశయోక్తికాదు - తెలుగువాడు తెలుగులోనే రాసినట్టు రచనలో, రూపక నిర్మాణంలో, రంగాలంకరణ సూత్రాలలో అంత బిగువుగానూ సాగింది దురదృష్టం ఏమంటే, తెలుగు నాటక రంగ దుస్థితిని ఆనాటినుంచి ఈనాటి వరకు ఎందుకు పదేపదే చెప్పుకోవలసి వస్తోందంటే, ప్రదర్శనకు సరిపోయినన్ని స్టేజి థియేటర్లు లేకపోవడం ఇక్కడ మనం 'సంపెంగతోట"ను దర్శించలేని సమయంలోనే ఇంగ్లండ్‌లోని "లిరిక్ హామర్‌స్మిత్" థియేటర్‌లో చెహోవ్ "చెరీ ఆర్‌చెర్డ్", బెర్నార్డ్‌షా "పిగ్మాలియన్" శత దినోత్సవాలు, ద్విశత దినోత్సవాలూ చేసుకున్నాయి! ఆస్కార్ వైల్డ్ వర్ణించిన సారాబెన్ హార్ట్ అంతటి *("the divine sarah")* పాత్రగాకపోయినా చెరీ ఆర్‌చెర్డ్‌లో చెహోవ్ సృష్టించిన మదామ్ రనేవస్కయా పాత్రను పోషించిన ఆంగ్ల నటీమణి సీలియా జాన్సన్‌కు మన "సంపెంగతోట"లోని "జయశ్రీ" ఏమాత్రం తీసిపోదు!

"సంపెంగతోట"ను తొలిసారిగా ఆస్వాదించే భాగ్యం తెలుగువారికి ఎప్పుడు కలుగు తుందో చూడాలి! అందులోని "అనంతం" కూడా మరపురాని పాత్ర, ఆధునిక భావాలకు ప్రతీక బరువుగా ముగిసే ఈ నాటకాంతం ఓ గొప్ప కళాసృష్టి సీరియస్ నాటక కర్తలందరికీ సుఖాలకంటే కష్టాలే ఎక్కువ బెర్జెన్ థియేటర్‌లో తలమునకలై ప్రయోగాలు చేస్తున్నప్పుడు ఆధునిక నాటక రంగస్థల పితామహుడైన ఇబ్సన్ తన తొలి వైఫల్యాలనూ, ఎదురైన ఇబ్బందులనూ *"a daily abortion"* అని హాస్యరస భరితంగా వర్ణించుకున్నాడు! జాతీయతను,

రాజకీయాలను, సంఘదృష్టినీ కళారంగానికి అబ్బించిన ఖ్యాతి ఆయనదే ఆధునిక యుగంలో - 'వరద' పేర్కొన్న ఔత్సాహిక నాటకరంగానికి ఉత్తేజంగా యూరప్‌లో తలెత్తిన (డబ్లిన్) "లిటిల్ థియేటర్" ఉద్యమ నిర్మాత లేడీ గ్రిగరీ ఐరిష్ జాతీయోద్యమానికి అండగా, రైతు కార్మిక జీవితాలకు సుఖ దుఃఖాలకూ అంకితమైన రంగస్థలం అది సహ దేశభక్తుడు, అసంబద్ధ నాటక కర్తలలో ఒకరైన బెకెట్ ఆమెకు తోడూ నీడగా నిలిచాడు డబ్లు బి ఏట్స్ పండితుడు, మరికొందరు ఇతరుల చేయూతతో లేడీ గ్రిగరీ ఐరిష్ నేషనల్ థియేటర్ కంపెనీకి మాతృమూర్తి కాగల్గింది బాలీనుంచి బ్రాడ్‌వే వరకూ సాగే సుఖ దుఃఖాల యాత్రగా మానవ జీవితాన్ని వర్ణించుతూ ఓ పెద్ద మనిషి *"men and women come together to act out drama and comedy of life"* అన్నాడు అలా లోకవృత్తాంతాన్ని ఆవిష్కరించడానికి సుశిక్షితులుగా ప్రసిద్ధ కళాకారులను దిద్దితీర్చినవే మాంచెస్టర్, బ్రిస్టల్, స్ట్రాట్‌ఫోర్డ్, లివర్‌పూల్ - రిపర్టరీలు 'వరద' విదేశ పర్యటనలు ఈ శిక్షణా కేంద్రాల వైశిష్ట్యాన్ని తెలుసు కునేందుకు ఎంతగానో తోడ్పడ్డాయి లిటిల్ థియేటర్ ఉద్యమకాలంలోనే, "నటాలి" గజ్జెల చప్పుడు విన్పిస్తున్న కాలంలోనే - బ్రిటన్‌లో "ఫ్రింజి థియేటర్" గ్రూపూ, "పిప్‌సిమాన్స్" గ్రూపూ, 7,000 మంది సభ్యులతో "రెబెల్ ప్లేయర్స్ అండ్ రెడీ రేడియో" గ్రూపు సమన్వయ సంస్థగా, కార్మికోద్యమ రంగస్థలంగా "యూనిటీ థియేటర్" అవతరించాయి ఇలాంటి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్నావాడే మన వరద రాజేశ్వర్రావు!

మార్చ్ 25, 1990

# శక్రచాప వక్రరేఖ - శంకర పిళ్ళై!!

మహాకవి వాల్మీకి సృష్టిలో - మారేడుచెట్లు మృదంగాలు వాయిస్తాయి, తాండ్రచెట్లు తాళం వేస్తాయి, రావిచెట్లు భరద్వాజుని ఆదేశం వల్ల నాట్యం చేస్తాయి, సరళ వృక్షాలు, తాడిచెట్లు, తిలకాలు, పున్నాగలు ఆనందంతో చిట్టి పొట్టి సేవకుల రూపంలో సేవలు అందజేస్తాయి, మాలతి, మల్లె, జాజి తీగలు స్త్రీ రూపం దాల్చుతాయి! అలాగే - కయాంకులమ్ శంకరపిళ్ళై చేతిలో కుంచెలు వింత సోయగాలు పోతాయి, అతని కుంచె శక్రధనువుగా, వక్రరేఖగా వ్యంగ్య చిత్రవైభవ దశ లెన్నింటినో చూచింది!

ప్రపంచ రాజకీయ వ్యంగ్య చిత్రకళకు ఒకటిన్నర శతాబ్దాల చరిత్ర ఉందని తెలుసుకున్నప్పుడు అందులో సుమారు అరవయ్యేళ్ళు, మంగళవారం నాడు అస్తమించిన భారతీయ రాజకీయ వ్యంగ్య చిత్రకళకు పితామహుడుగా, 'తీర్థక్షేత్రం' అయిన కార్టూనిస్టు శంకర్ సొంతమని చెబితే అతిశయోక్తి కాబోదు! ఈ అర్ధ శతాబ్దంపైగా ఆయన చేసిన పని - భారత స్వాతంత్ర్య సమరంలోనూ, స్వాతంత్ర్యానంతరమూ రాజకీయ వ్యవస్థల్లో, నాయకులలో పేరుకున్న కల్మషాన్ని కుంచెతో కడగడం! ఆ పర్సనాల్టీలూ, పాలసీలూ, పాలకులు తెల్లవాళ్ళయినా శంకర్ కుంచెను తప్పించుకోలేకపోయాయి! పాశ్చాత్య దేశాలలో ముమ్మరించిన సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం, సంస్కరణోద్యమం, ఫ్రెంచి విప్లవ సంప్రదాయాలలో పుట్టి, పెరుగుతూ వచ్చిన కార్టున్ కళా చరిత్ర శంకర్‌కు తెలుసు కనుకనే అతని కుంచె మార్దవం, కాఠిన్యం సమపాళ్ళుగా ముందుకుసాగినా, మాత్సర్యం (ద్వేషం) మాత్రం ప్రదర్శించేది కాదు శాంతికాలంలోనూ, యుద్ధ కాలంలోనూ, జాతి పునర్నిర్మాణ కాలంలోనూ శంకర్ కలమూ, కుంచె పోరు తీరులోనే ఎదిగివచ్చాయి! ఇండియాలో దినపత్రికా సంపాదకీయ వ్యాఖ్యలకు దీటైన ఉజ్జీలుగా ఆయన కుంచె ఎన్నెన్నో 'గీతా' రహస్యాలు చెప్పింది, 'చిత్ర'కవితలు వినిపించింది! అందుకే కార్టూన్లను *"poems in pictures"* అన్నారు! పత్రికా రంగంలో ఒక్కొక్క శాఖకు దేనికదే ప్రత్యేక మాగజైన్లు అవతరిస్తున్న ఈ రోజులతో పోల్చుకున్నపుడు, నలభై ఏళ్ళనాడు ఎడిటోరియల్ కార్టూనింగ్ కళను ఒక ప్రత్యేక శిల్పంగా భావించి వ్యంగ్య చిత్ర కళా వైభవానికి దివిటీ ఎత్తి అందుకొక ప్రత్యేక పత్రికనే - "శంకర్స్ వీక్లీ" ఊహించుకుని స్థాపించడమే గొప్ప సాహసం! అంతకంటే మరొక సాహసం-చతురత, సరసం తెలిసిన పండిట్ నెహ్రూ ఆదరాభిమానాలను అపారంగా చూరగొన్న "శంకర్స్ వీక్లీ", ఇందిరాగాంధీ హయాంలో, ఎమర్జెన్సీ చీకటిలో కలాలకు, కుంచెలకూ సంకెళ్ళు పడుతున్న దశలో (1975 ఆగస్టు) "ఇక వెళ్ళొస్తాను - అయితే సంతోషంగా కాదు సుమా" అని బరువైన కొసమెరుపు హాస్యాన్ని అందించిన "శంకర్స్ వీక్లీ"ని శంకర్ మౌనముద్రలోనే అశేష పాఠకజనానికి దూరం చేయవలసిరావడం! ఒకనాడు "శంకర్" నన్ను మినహాయించొద్దు" *("Don't spare me, Shankar!")* అని వెన్ను చరిచి ముందుకు నెట్టిన నెహ్రూను తరచు గుర్తుచేసుకొంటూండే శంకర్‌కు క్రమంగా చేదునిజాలు అనుభవంలోకి వచ్చాయి. కనుకనే "శంకర్స్ వీక్లీని" హంస'గీతి' గా శంకర్ అనవలసి వచ్చింది "పత్రికను నడపడమే ఒక పోరాటం, కాగా ఎల్లకాలం ఈ పోరు సాగుతూనే ఉండడం మరింత పరిహాసం"! అప్పటికి కడచిన నలభయ్యేళ్ళలో వివిధ దినపత్రికలలో ఎదురుగాని దుర్భర పరిస్థితి ఆయన మానసిక శాంతిని, కన్న కలలను ధ్వంసం చేయడం వల్లనే అలా వ్యాఖ్యానించాడు మనస్సు నుంచి బాల్యం తొలగిపోనివాడు

మానవతకు దగ్గరవుతాడు  కనుకనే అతను బాలబాలికలలో చిత్రకళా పిపాసను పెంచి పోషించేందుకు ప్రతి ఏటా చిత్రలేఖన పోటీలను నిర్వహించడమేగాక, సాలార్‌జంగ్‌లా తన ఒక్క చేతిపైన ప్రపంచం నలుమూలల నుంచి ఎన్నెన్నో బొమ్మలు సేకరించి మ్యూజియమ్ సమకూర్చడమేగాక, బుక్ ట్రస్టును కూడా ఏర్పాటుచేశాడు! "ప్రపంచ బాలల దినోత్సవం" పేరిట ప్రపంచ పాలకులు చేయలేని పనిని శంకర్ - చిరంజీవుల మనో వికాసానికి చిరంతన చిహ్నంగా ఏర్పాట్లు చేసిన చిరంజీవి, అమరజీవి!

వృత్తి ధర్మంలో భుక్తి ధర్మాన్ని మరిచి ఏకాగ్రచిత్తులయిన కొలదిమంది మేధావుల్లో ఒకడు శంకర్  "బొంబే క్రానికల్"లో ఎడిటర్ హార్నిమాన్ తన కార్టూన్‌లకు చెల్లించిన రూ 10ల పారితోషికాన్ని (నాడు కార్టూన్ ఒక్కంటికి రూ 1 చెల్లించేవారు) చెక్కుగా ఇస్తే, బ్యాంకు అక్కౌంట్ లేదని క్యాష్ చేసుకోకుండా మురగబెట్టుకున్న మేధావి శంకర్! "హిందూస్తాన్ టైమ్స్"ను దేవదాస్ గాంధీ సారథ్యంలో సమున్నత శిఖరాలకు చేర్చిన మూర్తిత్రయం - శంకర్, చలపతిరావు, ఎడతాత నారాయణ! ఆ తర్వాత "శంకర్స్ వీక్లీ" గురుకులంగా ఉత్తరోత్తరా జాతీయ స్థాయిలో పొలిటికల్ కార్టూన్ కళలో ఓనమాలు దిద్దుకొని క్రమంగా తన తనాన్ని నిరూపించుకొని నిలదొక్కుకున్న ప్రసిద్ధు లెందరెందరో! కుట్టి, శామ్యూల్, విజయన్, రాజేంద్రపూరి, మికీపటేల్, కేరళవర్మ, లక్ష్మణ్‌లు ఈ కళలో ప్రతిష్ఠులు కాగా, నేటి వర్ధిష్ణువులు సుధీర్‌ధార్, రవిశంకర్, మోహన్, శ్రీధర్, సురేంద్ర! ఇండియా ఏలికలుగా స్వాతంత్ర్య సమరాన్ని అణచడంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రతినిధులుగా వ్యవహరించిన వైస్రాయిలు - విల్లింగ్డన్, లిన్‌లిత్‌గో, వేవెల్‌లను కూడా శంకర్ కుంచె విడిచిపెట్టలేదు! శంకర్‌కే ఘాటు అనిపించిన తన చిత్రాలను సయితం ఈ వైస్రాయిలు కళ్ళకద్దుకోవడం, తమ ఫైళ్ళలోకి ఒరిజినల్స్‌ను తెప్పించుకుని భద్రపరచడం జీవితంపట్ల బ్రిటిష్‌వాళ్ళ రసైక దృష్టికీ, మన అరసికతకూ ఎంత తేడా ఉంది, అనిపిస్తుంది! అందుకే శంకర్ అంటాడు: 'ఇండియన్లలో హాస్యప్రియత ఉందా? చచ్చిపోయిందా? నా అనుభవాలన్నింటిని సమకూర్చి ఈ ముఖ్యమైన అంశంపైన ఓ గ్రంథమే రాద్దామనుకుంటున్నాను"! నిజానికి చతురతకు, రసికతకు దూరమైనవాళ్ళు రాజకీయ నాయకులేగాని, మరొకరుకారు! ముల్లును ముల్లుతోనే తొలగించడానికి ప్రయత్నించినప్పుడు ఈ ఘర్షణ అనివార్యం! ఎమర్జెన్సీలో బీట్ కానిస్టేబుల్ (సెన్సార్) ఎడిటర్ ఏది రాయాలో, కార్టూనిస్టు ఏది గీయాలో శాసిస్తున్నప్పుడు ఆ మాటను, నెహ్రూ కుటుంబంతో ఉన్న సాన్నిహిత్యం మూలంగా శంకర్ చెప్పలేక చెప్పలేక మౌనంగా నిష్క్రమించడం వ్యక్తి బలహీనతనే చెప్పాలి! హాస్య ప్రియతకు పెద్దపీట వేసిన నెహ్రూ నాయకులను ఎగతాళి పట్టించే *(lampooning)* వ్యంగ్య చిత్రకళకు గొప్ప నిర్వచనం చెప్పాడు  "పబ్లిక్ జీవితంలో ప్రవేశించిన వారిలోని రాగద్వేషాలను, ఉచ్చనీచాలనూ శంకర్ కుంచె సామర్థ్యంతో ఎండగట్టి చూపాడు. మనీందరికీ ఇది మంచే చేకూరుస్తుంది. మనం డంభంతో, స్వార్థంతో బతుకులీడుస్తున్నాం. అందువల్ల అప్పుడప్పుడూ మన అహంకారాల ముసుగు విప్పి చూపడం అవసరం - ఎందుకంటే అలాటి చిత్రాలు ఆత్మ పరిశీలనకు అవకాశమిస్తాయి"! అలా ఎగతాళి పట్టించే వ్యంగ్య చిత్రకళలో "పంచ్" పత్రిక కుంచె వీరుల తర్వాత "శంకర్స్ వీక్లీ" చిత్రకారులే మిన్నగా ముందుకొచ్చారు శంకర్‌కు పాశ్చాత్య వ్యంగ్య చిత్రకళా రంగంలో ఒక్క తామస్ రౌలాండ్సన్, డాక్టర్ డేవిడ్‌లో తోనే పోలికలు! "శంకర్స్ వీక్లీ"ని దిద్దితీర్చిన వారంతా ఒకనాటి "వానిటీ ఫేర్" మాగజైన్‌కు నేతృత్వం వహించిన లీజ్‌లీవార్డ్, కార్లో పెలిగ్రినీలకు ఏమాత్రం తీసిపోరు. రెండో ప్రపంచ

యుద్ధకాలంలో శంకర్ సమకాలికులుగా ప్రసిద్ధి పొందిన కళాకారులు ఎడ్మండ్ బర్క్, బిల్‌మాల్డిన్, రూబీ గోల్డ్‌బెర్గ్! కార్టూన్ కళలో "ఆంత్రపోమార్ఫిజం" శాఖను ఇండియాలో ప్రారంభించిన వాడు కూడా శంకరే పార్లమెంటు సభ్యులను "గాడిద"లుగా చిత్రిస్తున్న "మార్చ్ ఆఫ్ టైమ్స్" శీర్షికకు అభ్యంతరం వచ్చినప్పుడు - గాడిదలుగా మాత్రమే చిత్రించినందుకు బాధపడుతున్నారు కాబట్టి, కోతులు, పిల్లులు, కుక్కలు, గుర్రాలుగా కూడా వ్యంగీకరించి మళ్ళీ నోరెత్తకుండా చేసిన ఘనత కూడా ఆ శంకర్‌దే! పైకి నవ్వలేక నవ్వడం, లోలోపలనే కుళ్ళడం - అక్షర సత్యంగా వ్యంగ్య రమ్య చిత్రంగా కార్టూన్ కళను మలచినవాడు శంకర్!

డిసెంబర్ 28, 1989

# "మృత్యురథం" !!

పుట్టిన వాళ్ళు గిట్టక తప్పదు. కాని అకాలంగా మృత్యువును కొని తెచ్చుకోడం - ఒక్క మానవుడికి మాత్రమే తెలిసిన 'విద్య'!! "మృత్యుమాయ" (డెత్ ట్రాప్) అంటే మయసభ లాంటిదన్న మాట! అదే రుణగండం! సహాయమనే భ్రమలోకి నెట్టి ప్రశాంతంగా సంహార క్రియను అమలు జరపడం! పాత, కొత్త నయావలస వాదులందరూ నేడు వర్ధమాన దేశాలను సరిగ్గా ఆ ఉచ్చులోకే దించి చిచ్చుపెడుతున్నారు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలను వలస సామ్రాజ్యవాదులు లోగడ దోచినన్నాళ్ళు దోచారు, వాటి ముడిసరుకులు కొల్లగొట్టారు మానవ సంపదను దుర్వినియోగం చేశారు, ఆర్థికంగా పీల్చి పిప్పి చేసింది చాలక రాజకీయంగా, సామాజికంగా బానిస మనస్తత్వాన్ని పెంచి వెళ్ళారు తీరా ఈ దేశాలు స్వాతంత్ర్యం పొందిన తరువాత నయా వలసవాదులు చేసిన పని - దోచుకున్న చేతులతోనే పెట్టబడుల రూపంలో వచ్చి, వడ్డీలు పెంచి వర్ధమాన దేశాల నడ్డి విరగొట్టడం, దేశాల కరెన్సీ విలువలను దిగగోసి తమ కరెన్సీ విలువలను ఎగదోసి ఆర్థికంగా కట్టు బానిసలను చేసే స్థితికి దిగజార్చుతున్నారు! వాటి ఫలితమే 1990 లలో ఈ మూడు ఖండాలలోని పెక్కు దేశాల ప్రజలు ముఖ్యంగా ముక్కుపచ్చలారని ముద్దు బిడ్డలు - బాలబాలికలు "మృత్యురథం" ఎక్కబోతున్నారు! ఒక్క ఆఫ్రికాలోనే సుమారు 20 దేశాలు కనీవినీ ఎరగని కాటకానికి గురి కాబోతున్నాయి అపారమైన సహజ వనరులు, మానవ సంపద ఉండి కూడా వలస దోపిడీ వల్ల కునారిల్లిపోయినందున ఈ దుస్థితి దాపురించింది. సుప్రసిద్ధ ఆఫ్రికన్ కవి ఎంపాలీ, బహుశా రానున్న ఈ "మృత్యు మాయ"ను దృష్టిలో పెట్టుకొనే "మృత్యు రథం" *(Death Chariot)* అన్న రచనలో ఎత్తిపొడుపుగా ఓ హెచ్చరిక చేశాడు కరవు కాటకాలకు గురైనా కంటతడి పెట్టొద్దు, పాలకుడున్నాడు నీకు శిలువ వేసే బాధ్యతను అతను చేపడతాడులే అంటూ వ్యంగ్యంగా అంటించాడు, రుద్రభూమి చేరడానికి మృత్యురథం ఎక్కమన్నాడు *"They rode upon/ the death Chariot / to their Golgotha We are hot! We are thirsty!/ We are Hungry! Dont cry to me/but to Caesar who crucifies you!"* ఆ శిలువెక్కే ఘడియ ఇప్పుడు దాపురించిందని, కడచిన సుమారు యాభై ఏళ్ళుగా నాటి వలసలలో, నేటి వర్ధమాన దేశాలలో ప్రపంచ సామ్రాజ్యవాద, నయా వలసవాదులు తమ పెట్టుబడులతో సాగిస్తున్న ఆర్థిక దండయాత్రను, దోపిడీని ఆపలేక గుడ్లు అప్పగించి చూస్తూన్న ఐక్యరాజ్యసమితీ, ప్రపంచ ఆర్థిక సంస్థలూ ఈ రోజున రుణ భారపు "మృత్యు మాయ" గురించి మనల్ని హెచ్చరించ రావడం ఎంత సిగ్గుచేటు! రేగన్ హయాములోని బేకర్ పథకం, బుష్ జమానాలోని బ్రాడీ పథకం వర్ధమాన దేశాలను ఈ రుణం నుంచి బయటపడవేయడానికి కాదు, వాటిని మరింతగా "అప్పుల పోలయ్య"లుగా దిగజార్చడానికే తోడ్పడుతాయి ఇండియా సహా ఈ వర్ధమాన దేశాలు తెచ్చుకున్న లక్షల కోట్ల రుణాలపై కేవలం వడ్డీల కిందనే ఏడాదికి 2 లక్షల 84 వేల 800 కోట్ల రూపాయలు పోతుంది! అంటే ఈ దేశాలు పొందే రుణాలకు వడ్డీల తీరుమానాలే మూడింతలు పెచ్చు అన్నమాట! అంతేగాదు, పెద్దలు చేసే నేరానికి పిన్నలు శిక్ష అనుభవించవలసి వస్తోంది పౌష్టికాహారం అందక రోగ నిరోధక శక్తి నశించడంవల్ల డీహైడ్రేషన్, రక్తహీనత, న్యూమోనియా, ధనుర్వాతం, తడపరి, కోరింత దగ్గులకు గురిఅయి (ఆర్థిక వనరులు కరవై) రోజుకు 40,000 మంది పిల్లలకు అకాలంగానే "నూరేళ్ళు" నిండిపోవడం దుర్భరం, దుర్మార్గం, దుస్సహం కాదా?

మరో మాటలో చెప్పాలంటే, రుణభారంవల్ల, బడ్జెట్ల కోతవల్ల, ఒక్క 1989లోనే అయిదు లక్షల మంది అకాల మృత్యువాత పడవలసి వచ్చింది! పైగా ప్రతి ఏటా ప్రపంచవ్యాపితంగా అకాల మృత్యువాత పడుతున్న చిరంజీవులలో నూటికి 40 మంది ఇండియా, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లకు చెందినవారే కావడం మనస్తాపానికి మరింత కారణమవుతోంది! అలాగే లాటిన్ అమెరికాలోనూ, ఆఫ్రికాలోని కొన్ని దేశాలలోనూ "చిరంజీవుల" అకాల మరణాలు సామాజిక అశాంతిని తెచ్చి పెడుతున్నాయి, ఆర్థిక దుస్థితివల్ల నిజ వేతనాలు 50 శాతం పడిపోయాయి, సంక్షేమ కార్యక్రమాలకు పెట్టవలసిన ఖర్చు కోతపడింది, వందల సంఖ్యలో చికిత్సా కేంద్రాలు మూతపడుతున్నాయి కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు కుంటుపడ్డాయి, చివరికి ఈక్వెడార్, పెరూ, పనామా, పెరుగ్వేలలోని ఆరోగ్య సేవా సంస్థలకు 1989 ప్రథమార్థానికే టీకా మందులు కూడా కొనలేని దుర్గతి పట్టింది! 1990 నాటికే లాటిన్ అమెరికాలో 8 కోట్ల మంది పిల్లలు కటిక దారిద్ర్యంలో జీవించవలసి వస్తుందని మరో అంచనా.

ఆఫ్రికా దేశాలు నేడు 30 ఏళ్ళ నాటికంటే ఎక్కువగా పేదరికపు కోరల్లో పడి నలిగిపోతున్నాయని ప్రపంచ బ్యాంకి అధ్యక్షుడు బార్బర్ కోనాబిల్ ప్రకటిస్తున్నాడు. అపారమైన సంపద ఉండి కూడా ఈ దుస్థితికి ఈ దేశాలు జారుకున్నాయి! పశ్చిమ దేశాల పెట్టుబడిదారీ సంస్థలకు రాజకీయ నాయకత్వం వహించే సామ్రాజ్యవాద ప్రభుత్వాలు "లాభం లేనిదే వరదన పడి" కొట్టుకుపోవు. దేశాలను స్వాతంత్ర్యానికి ముందు దోచుకున్నవీ అవే, ఇప్పుడు దోచుకుంటూ రుణాల పేరిట అగాధంలోకి తీసినవీ అవే, తీరా ఈ రుణభారం నుంచి తేరుకోలేక కొట్టుమిట్టాడుతున్న వర్ధమాన దేశాలను మధ్యలో ముంచడానికి ఉద్యుక్తమవుతున్నవీ ఈ సామ్రాజ్యవాద ప్రభుత్వాలేనని మరువరాదు! అయితే, వర్ధమాన దేశాలు మరింతగా దిగజారిపోడానికి అంగీకరించే పక్షంలో, తమ రాజకీయ, ఆర్థిక షరతులను అవి ఆమోదించే పక్షంలో రుణం పెట్టి మరింత రణం పెంచడానికి ఈ ప్రభుత్వాలు సిద్ధం! కాని "పేదవాడి కోపం పెదవికి చేటు" వర్ధమాన దేశాలకు మిగిలింది అభిమానం, ఆగ్రహం! అందుకే, తన ఖండంలో (ఆఫ్రికా) శతాబ్దాల దారుణ దోపిడీనేగాక, వర్ధమాన దేశాలలో స్వాతంత్ర్య సముపార్జన తర్వాత కూడా సాగుతున్న ఆర్థిక దోపిడీని, పీడననూ కళ్ళారా చూస్తున్న సుప్రసిద్ధ నీగ్రో తిరుగుబాటు కవి అమీ సీజర్ తన కవితా ఖడ్గాన్ని ఝుళిపించాడు! పీడకుని ప్రతిఅడుగూ ఓ దండయాత్రగా, విధ్వంసకాండగా, ప్రగతి నిరోధక పదఘట్టనగా, హత్యాకాండగా అతను భావించాడు· *"Each one of your foot steps is a conquest/and a spoliation and a misconstruction/and an assassination"!* అంతేగాదు, దోపిడీపై నిప్పులు విరజిమ్ముతూ నీగ్రో జాతి సంఘీభావాన్ని చాటాడు, తన ఊరు చెప్పడు, తన పేరు విప్పడు, తన స్థానం తెలపడు, తన వయస్సు చెప్పడు - మరి ఏమని చెబుతాడో చూడండి "నా కుటుంబం పేరు - ఆగ్రహం; నా పేరు - అవమానం; నా స్థానం - తిరుగుబాటు; నా వయస్సు రాతియుగం!" అంటే, పరిస్థితులు దుర్భరమైనపుడు మానవుడి మనస్సు దుండగుల 'వేట' వైపూ, ఆయుధ పూజ వైపూ మళ్ళుతుందన్న మాట! నయా వలస దోపిడీని చూస్తూ భరించే తన సమాజపు నిర్లిప్తతనూ, అమాయకత్వాన్నీ నేరంగా పరిగణిస్తూ అమీ సీజర్ సమాజం అంగాంగంలో, నరనరాన ప్రవహిస్తున్న రక్తం తనదే కాబట్టి సమాజం తనకు పూచీ పడాలని దండోరా వేశాడు

*"Arrest that innocent man. He carries my blood on his shoulders/He carries, my blood in his shoes/He hawks my blood in his nose!!"*

**డిసెంబర్ 17, 1989**

# వ్యాపారకోశం కాదు, వ్యవహార కోశం!

పూౌత మెరుంగులు సారెసారెకున్, అన్నాడు పెద్దన  ఆ మెరుగులు పెట్టుకోవటం మధుర కవితలకు, కావ్యకన్యకలకే కాదు, పదకోశాలకూ, శబ్దార్థ దీపికలకూ నిత్య కల్యాణం కావాలి  అందులోనూ, పత్రికా రంగాన్ని అనునిత్యమూ దిద్దితీర్చుతూ శబ్దాలతో శాసించే "నిత్తెమల్లె" అయిన నిఘంటువు తీరు తెన్నులే వేరుగా ఉండాలి  ఎందుకంటే 'అండపిండ బ్రహ్మాండా'లను అణువునుంచి అంతరిక్షందాకా అనలుతొడిగి కొనలుసాగే అఖిల శాస్త్రాలనూ తనలో ఇముడ్చుకొని జ్ఞాన దీపాలను, అందుకు సంబంధించిన పద సంపదను, పారిభాషిక పదాలనూ అనుక్షణం పంపిణీ చేసే సాధనాలు - పత్రికా రాజాలు  ఈ స్పృహతో పత్రికల్లో వివిధ రంగాలకు చెందిన విభిన్న శాస్త్రాల తాలూకూ పుట్టుకొచ్చే పదాలకు వాడే అర్థాలు వ్యవహారంలో రూఢమైనవిగా ఉండాలి గాని పాండిత్యపు పైత్యంతో కూడిన అర్థాలకు నిఘంటువుల్లో చోటు ఉండరాదు  ఇంగ్లీషులో, ఇతర భాషలలోనూ కేవలం పత్రికారంగానికి చెందిన భాషా నిఘంటువులు కొన్ని ఇంతకుముందే వెలువడ్డాయి  వివిధ ప్రాంతాల మాండలికాలకు, వృత్తులకు, విభిన్న విజ్ఞాన శాస్త్రాల పదాలకు, పద బంధాలకు ప్రత్యేక

---

*ఈ సంపాదకీయం చదివిన తర్వాత 'కోశ' కర్త, ప్రసిద్ధ పరిశోధకుడు బూదరాజు రాధాకృష్ణ ఒక లేఖ రాశారు  అందులో ఆయన 'జర్నలిజి' (Journalese) అన్న పదాన్ని ఈ వ్యవహార కోశంలో చేర్చకపోవడానికి కారణం - ఆ పదానికి వివరణ ఇస్తే అది పాత్రికేయవృత్తి పట్ల న్యూనతా భావం కలిగించే ప్రమాదం ఉంటుందని! కాని కావ్యానికి కృత్యాద్యవస్థ ఎలాగో  ప్రతి వృత్తిలోనూ, భాష పెరుగుదలలోనూ నిమ్నోన్నతాలు, ఒడిదుడుకులూ, తప్పొప్పులూ సహజం  అవి తప్పటడుగులేగాని తప్పు అడుగులు కావు  కనుక 'జర్నలిజి' అన్న పదానికి మొదట్లో దుర్బలమైన వాక్యనిర్మాణమైనా ప్రాచుర్యం పొందిన స్వతంత్రమైన శైలీవిన్యాసంగా పేరుండేది ("reputedly loose construction and independator artificial style" Oxford Dictionary -Gaint copy)  కాని కాలక్రమంలో ఆ అభిప్రాయం కూడా తొలగిపోయి ఏ సీరియస్ రచయితకూ, కళాకారుడికీ కూడా సాధ్యంకాని గుండెలోతులకు వెళ్ళి పరిశోధించి అందమైన శైలిలో విషయాల్ని పాఠకులకు విడమర్చి చెప్పగల ప్రత్యేక విద్యగా, జర్నలిస్టులకు మాత్రమే సాధ్యమైన ప్రక్రియగా 'జర్నలిజం' విశ్వవిఖ్యాతిపొందింది కాలంతో పరుగు పందెంలో కాలాతీతవ్యక్తి  జర్నలిస్ట్ అని అన్నారు  నిర్ణీతగడువులోగా (డెడ్‌లైన్) పత్రికను తీర్చిదిద్దడం అతనికో యజ్ఞం! పదాలకు తీరుబడిగా నగిషీలు పెట్టుకొనే వ్యవధి అతనికి దొరకదు. ఆవ్యవధిలోనే పదాలూ, వాక్యాలూ ఆకుధారగా వచ్చిపడాలి  రచనా రంగంలో ఇతరులకూ, పాత్రికేయులకూ అదే తేడా  అందుకే పండిత-పాత్రికేయుడైన తిరుమల రామచంద్ర 'దినపత్రికలో పనిచేసే ప్రతీ సబ్-ఎడిటర్ ఒక కళాప్రపూర్ణుడే' అని అభివర్ణించి ఉంటారు! ప్రాప్తకాలజ్ఞతకు పటిష్టమైన రూపాన్ని ఇచ్చే కళాకారుడే పాత్రికేయుడు! "Journalists can only work to a deadline  Having to create against the clock gives their prose a spontaneity and relevance inevitably lacking in that of so called serious writers  The Journalists,--------shouting his copy down the phone from some distant troublespot will inevitably perceive things that the artist or academic, however devoted, is bound to miss" [Henry Roots  "world of Knowledge" weidlenfeld and Nicolson London]

నిఘంటువులు కూడా వెలువడుతున్న ఈ రోజులలో పత్రికా భాష, ఈ అన్ని శాఖలలోని అందచందాలను ఇముడ్చుకొంటూ అవ్యవధిలోనే శబ్దసాగర మధనంలో అజరామరమై ముందుకు సాగుతోంది పదేళ్ళనాడు "తెలుగు-ఇంగ్లీషు" నిఘంటువును ఉన్నంతలోనే (150 పేజీల లోనే) అందంగా సంకలనం చేసిన బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు తమ "విజ్ఞాపన" లో ఒక విషయం స్పష్టం చేశారు "ఆరోప భాగం పరాయి భాష అయి అర్థ వివరణ మన భాషలో జరుగుతూంటే ఆ అన్యభాషా పదానికి మన భాషలో పర్యాయపదం సూచిస్తే చాలదు, ఆ పద వివిధార్థచ్ఛాయలు - వీలైతే ప్రయోగ సహాయంతో - వివరించడం అవసరం"

నిజానికి ఈ లక్ష్యంతోనే బొమ్మకంటి ఆ చిరు నిఘంటువును సమకూర్చారు ఆ పనిలో ఆయన చేసిన పని - గ్రాంధిక విలక్షణాలైన 'ఱ' (బండిరా)లు, అరసున్నలు తొలగించడం, అలాగే కొన్ని వ్యవహారంలో ఉండి, తెలుగు లిపిలో లేని వర్ణాలను కూడా తొలగించి సుఖంగా ముందుకు సాగిపోవడం! అంతేగాని, పత్రిక "భాషా స్వరూపం"పేరిట "మాటల మూటల" ముసుగులో మరొక చిన్నయసూరిగా అవతరించడానికి ఉబలాటపడే పండితులు, పత్రికా రంగానికి పనికిమాలినవాళ్ళు, భాష పారుదలలో ఉన్న నీరు లాంటిది దానికి 'పాండిత్యం' పేరిట 'పాచి' పట్టనివ్వకూడదు "ఉషోదయ"వారి "వ్యవహారకోశం" లో కొన్ని ఆంగ్లపదాలకు తెలుగులో పొందుపరిచిన కొన్ని అర్థాలూ, శబ్దాల వివిధార్థచ్ఛాయలూ బాగున్నాయి గాని, మరికొన్నింటికి అందించిన అర్థాలు కృత్రిమంగానే కాదు, చాలా ఎబ్బెట్టుగా ఉన్నాయి, ఇంగ్లీషు పదాలకు అర్థాలు సమకూర్చే ప్రయత్నం జరిగిందేగాని, సంకేత చిహ్నాలను కూడా (ఎబ్రివియేషన్స్) పేర్కొని వివరణ ఇవ్వకపోవడం ఒకలోపం ఉదాహరణకు 1981లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్-రచయితలకు, పత్రికా సంపాదకులకు ప్రత్యేకించి ఉద్దేశించిన ప్రచురణ "ది ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ ఫర్ రైటర్స్ అండ్ ఎడిటర్స్" అందులో ఆక్స్‌ఫర్డ్ ఆంగ్ల నిఘంటుశాఖ చేసిన జయప్రదమైన కృషి లిఖిత, వ్యవహార పదాలతో నిత్యం నిమిత్తం ఉన్న రచయితలకు, జర్నలిస్టులకు, సంపాదకులకు, ప్రచురణ కర్తలకు ఎంతగానో తోడ్పడగల సులభమైన నిఘంటువు నిర్మాణం నాలుగు వందల పేజీలలో వాళ్ళు ఉచ్చారణపైన, విరామ చిహ్నాలపైన, సాంకేతిక చిహ్నాలపైన, అన్యభాషా పదాలపైన, నుడులు నానుడులపైన, అచ్చుతప్పుల సవరణ (ప్రూఫ్ రీడింగ్) చిహ్నాలు, పద్ధతులపైన, - ఒక్క ముక్కలో, ప్రచురణ పరిశ్రమకు సంబంధించిన అన్ని మెలకువలపైన కేంద్రీకరించారు! వ్యవహారంలో ఉన్న శబ్దాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు మారుమూల పదాలను వదిలేశారు. అలాగే ఆంగ్లభాషలోని గ్రామ్యపదాలనూ, సంప్రదాయ విరుద్ధ శబ్దాలనూ విరివిగా వినియోగంలోకి వచ్చిన రూఢమైన పదాలనూ యాభై ఏళ్ళపాటు శ్రమించి కూర్చి "డిక్షనరీ ఆఫ్ శ్లాంగ్" తయారు చేసినవాడు ఎరిక్ పాట్రిడ్జ్ ఆ తరువాత అతనికి వారసుడుగా ఎదిగివచ్చి ఆ కృషిని 1979 తర్వాత, ఫాక్‌ల్యాండ్స్ యుద్ధం తర్వాత వ్యవహారంలోకి చొరబారిన సరికొత్త పదాలతో, నుడులతో నిఘంటువు ముచ్చట తీర్చిన వాడు పాల్ బెలీ వేలాదిగా కొత్త ఎంట్రీలు చేర్చాడు ఇలా వ్యవహారంలో ఉన్న ఎన్నో పదాలను నిఘంటువుకు ఎక్కించాడు ఉచ్చారణలోనూ, భావంలోనూ గందరగోళంగా ఉన్న పదాలను, ఒక అర్థానికి బదులు మరొకటి స్ఫురింపచేసే "స్పూనరిజా"నికి, "మలప్రాపిజాని"కి పుట్టిన శబ్దాలను కూడా ఎన్నింటినో ఇంగ్లీషు వాళ్ళు నిఘంటువుల కెక్కించారు

కాని ఉపోదయావారి "వ్యవహారకోశం"లో పత్రికా రంగానికి రోజువారీ తోడ్పడే పెక్కు పదాలకు కొన్ని సరైన అర్థాలు సమకూర్చడంతో పాటు అనేక పదాలను కూడా వదిలేయడమో లేదా అసలు చేర్చకపోవడమో లేదా తప్పుడు అర్థాలు ఇవ్వడమో జరిగింది ఉదాహరణకు పాండురోగమైన "ఎనిమియా"ను "లుకేమియా"గా భావించి "లుకేమియా" పదానికి రక్తంలో పుట్టే క్యాన్సర్ అనో లేదా "బ్లైడ్ క్యాన్సర్" అనో పేర్కొనకుండా శంకర నారాయణుడు "అదొక రకం చెట్టు" అన్నట్టుగానే "ఒక విధమైన పాండురోగం" అని రాసేశారు!! అలాగే తరచు పత్రికలవారికి ఎదురయ్యే "బ్లండర్" పదానికి అర్థం చేర్చారుగాని, "బ్లూమర్"కు చేర్చలేదు, ఆర్థిక శాస్త్ర పరిభాషకు చెందిన "డిప్రెషన్" కూ, "రెసిషన్"కూ ఒకే అర్థం ("ఆర్థిక మాంద్యం") తగిలించారు అందులో ఒకటి సంక్షోభానికి, వేరొకటి మాంద్యానికి ప్రసిద్ధి అన్న సంగతి మరిచారు! ముడుపులు, లంచాలు పెరుగుతున్న ఈ రోజుల్లో "కిక్‌బాక్స్" పదానికే ఈ కోశంలో ఏ కోశాన చోటులేదు, "వోట్ ఆన్ అక్కౌంట్"కు తాత్కాలిక బడ్జెట్ అని చెప్పారు గాని తెలుగువాడికి బాగా తెలిసివున్న "అనామతు పద్దు"ను చేర్చలేకపోయారు! "పౌండ్" శబ్దానికి వివిధార్థచ్ఛాయలు తెలుపుతూ ప్రయోగార్థం చెప్పేటప్పుడు "పెన్నీవైజ్ - పౌండ్ ఫూలిష్" సామెతకు "పాసి (లోభి)కి పదింతల నష్టం" అన్న తెలుగు నుడికారం మరిచిపోయి, "కొంచానికి లోభించి ఎక్కువ పాగొట్టుకొను" అని కృతకంగా మార్చారు "రిపారియన్" అంటే "నదీతీర సంబంధి" అని రాశారేగాని పత్రికలవారికి రైతులకు అవసరమైన "పరీవాహక ప్రాంతం" ఊసులేదు, "జర్నలిస్టు"కు కొందరు ఛాందసులమాదిరిగా పాత్రికీయుడు" అని వాడకుండా "పాత్రికేయుడ"ని వ్యవహారార్థంలో సుఖంగానే వాడారు, కాని పత్రికా రచనకు ప్రధానమైన తొలిపదం* "జర్నలీజ" *(Journalese)* ని కోశంలో చేర్చనేలేదు అలాగే "ఎరన్డ్‌లీవ్' ' కు రూఢమైన "ఆర్జిత సెలవు"కు విడాకులిచ్చి "సంపాదించిన సెలవు"తో వియ్యం అందారు! గురజాడ అప్పారావు కాలంనుంచీ ప్రసిద్ధిపొంది ఉన్న "నాచ్" శబ్దానికి ఇందులో స్థానంలేదు, "ఎడిబుల్" అంటే "తినెడు" అర్థం ఇచ్చారుగానీ, "ఎడిబుల్ ఆయిల్"కు వంట నూనెల అర్థం వదిలేశారు "జెట్టిసన్" అన్న పదాన్ని అన్ని పాత నిఘంటువులు (ఇంగ్లీషు కోశాలు సహా) అక్కడితో ఆపినట్టే, "జెట్-సెట్"అని 1960లో కొత్తగా వచ్చిన పదాన్ని ఈ వ్యవహార కోశంలో తెలుగువాడు కూడా చేర్చుకోలేదు సంపన్న వర్గాలకు చెందిన యువ దంపతుల జంటను పైలా పచ్చీసుగా జెట్ స్పీడులో ఖండాంతర విలాసయాత్రలు కొట్టేవారని "జెట్ సెట్" అంటారు! "మోనోటోనస్"కు విసుగు పుట్టించే లేదా రొడ్డకొట్టుడు అనడానికి మారుగా ఏకరూపి, అభేద అని వాడారు రౌండ్‌పెగ్ ఇన్‌స్క్వేర్ హోల్‌కు "సరిపోని"లేదా "తను దూరకంతలేదు మెడకో డోలు" అని చెప్పాలిగాని "అనుపయుక్త వస్తువు/వ్యక్తి" ఏమిటి? వ్యవహార కోశంలో వ్యవహారపదాలే ఎక్కువ ఉండాలి "ఓపియమ్"కు "నల్లమందు" అన్నప్పుడు అర్థంకాని "అభిని"వేశం అనవసరం కాదా?! ఈ బాదరబందీ అంతా ఉంటుందనే రోజర్‌ఫౌలర్ ఆధునిక పదాలకు నిఘంటువును తయారు చేసినప్పుడు *("A Dictionary of Modern Critical terms" - 1973)* 22 మంది నిపుణుల సహాయం తీసుకున్నాడు. రైమ్, రొమాన్స్, ఈస్థటిక్స్, డాడాయిజం, సిన్సియారిటీలాంటి పదాలకు ఒక్కోదానికి కనీసం ఒక్కో పేజీ అర్థ వివరణ ఇచ్చాడు! హాస్యానికి చెందిన "విట్" పదానికి అర్థవివరణద్వారా పాఠకునిపై ముద్ర వేయడానికి అందులో- " *A King, that ruled as he thought fit/The universal Monarchy of wit"* అని వ్యవహార జ్ఞానాన్ని వ్యాప్తి చేశాడు! "టేస్ట్" అన్న పదానికి ఎన్నెన్నో రుచి భేదాలను

చెబుతూ అలెన్ పో, బోద్‌లీర్, ఫ్లాబర్ట్, ఎజ్రాపౌండ్, ఇలియెట్‌లనుంచి రసవత్తరంగా ఉదాహరించాడు! భాషా ప్రయోగాలు చేయడంలో మనకొక జేమ్స్ జాయిన్‌లాంటి వాడింకా ఎదగలేదు గాని, ఈసరికి వ్యవహార కోశాలను తరచుగా సవరించుకోవలసి వచ్చేదేమో! "ఉషోదయ" ప్రయత్నం వ్యాపార కోశంగా కాకుండా "వ్యవహార కోశం" గానే ఎదిగిరావాలంటే తిరుపతి కవుల హెచ్చరికను సదా గుర్తుంచుకోవలసిందే! "పెరుగును వడ్లను కలపోసిన, ముచ్చటగునే?!" పత్రికల వ్యవహార కోశం ప్రత్యేక నిర్మాణమేగాని కలగూర గంపకాదు! కారాదు!

సెప్టెంబర్ 2, 1990

# "లక్ష" రాక్షసాంశకు! లక్షన్నర మానవాంశకు!!

ఈతడొక 'పద్మశ్రీ', కళాప్రపూర్ణ, మధురకవి, ఈనాటి జ్ఞానపీఠ్ పురస్కార పురుషుడు అతడే డాక్టర్ సి నారాయణరెడ్డి ఒకనాడు రాక్షసుణ్ణి పట్టుకున్నవాడికి "లక్షరూపాయల బహుమతి"ని ప్రకటించిన పత్రికావార్త ఆధారంగా ప్రచలితుడై అందుకు వేట ప్రారంభించిన వాడు 'సినారె' మంచి-చెడుల పూర్ణకుంభమైన మానవునిలోని సగం రాక్షసాంశ, సగం మానవాంశను గురించి, అతడి అంతరంగంలోకి చొరబడి, రాక్షసుడెక్కడి వాడోకాడు, నీలో నాలో ఉన్నాడని చాటాడు దెయ్యాలు వేదాలు వల్లించినట్టు భగవద్గీతనూ, భర్తృహరినీ అదే పనిగా పదే పదే వల్లిస్తుండే, తిరగేస్తుండే ఈ పయోముఖ విషకుంభం "దండలు వేయించుకుంటూ", దండోరా వాయించు కుంటూ, గుహల్లో తానై, గ్రూపు ఫొటోలో తానై, సభల్లో తానై, సంతళ్ళో తానై, ప్రదర్శనశాలల్లో తానై, పానశాలలోనూ తానై చరించే ఈ మానవుడెవడు? పై లక్షణాలున్న రాక్షసుణ్ణి 'సినారె' పసికట్టాడు: "ప్రతి ఇద్దరిలో ఒక రాక్షసుడు/ ప్రతి ఒక్కరిలో ఒక రాక్షసుడు/ అంతరంగంలోకి తొంగిచూడగా అక్కడా ఒక రాక్షసుడు!" అయితే ఈ పరిశోధనను జైత్రయాత్రగా సాగించిన నారాయణరెడ్డి అపరాధ పరిశోధనకై ప్రకటించిన "లక్షరూపాయల బహుమతి" తనకు చిక్కనందుకు చింతించనక్కరలేదు! తన స్వరూపం తెలిసినందుకు (మానవుని అంతరంగం) సంతృప్తిగా నాడు నిట్టూర్చినందుకు ప్రతిఫలంగా, మానవునిలో రాక్షసాంశ పోనూ మిగిలిన మానవాంశకు గుర్తింపుగా, మానవతా విలువలకు నివాళిగా జావళీ పట్టిన "జ్ఞానపీఠ్" లక్షన్నర రూపాయల అవార్డ్లు ప్రతిభా పురస్కార పరిహారంగా భావించుకోవచ్చు! నాడూ, నేడూ కూడా లోకవృత్తానికి కేంద్ర బిందువైన ప్రకృతినీ - మానవుణ్ణి తన చైతన్య కవితారథానికి రెండు చక్రాలుగా మలచుకున్నవాడు సినారే ఈ లోకం మానవ ద్వేషికీ, సమున్నత శిఖరాలను అధిరోహించగోరే మానవతా ఉన్మేషికీ భిన్నరూపాలలో దర్శనమిస్తుంది ఆ [illegible]దర్శనంలో భాగంగానే విశ్వనాథ, రాయప్రోలు, మధునాపంతుల, శ్రీశ్రీ, బైరాగి, రావిశాస్త్రి, బీనాదేవి అమోఘమైన రచనలు చేశారు అయినా గత పందొమ్మిదేళ్ళలో 'విశ్వనాథ'కు తప్ప మిగతా వారెవరినీ 'జ్ఞానపీఠం' పురస్కరించి తన ప్రతిష్ఠను నిలబెట్టుకో లేకపోయింది పంతొమ్మిదేళ్ళ తరువాత మరొక తెలుగువాడికి (సినారెకు) ఈ పురస్కారం లభించినందుకు సంతోషించని వాడుండడు అయితే అవార్డు ప్రకటనానంతరం సినారె హుందాగా, నిగర్వంగా చెప్పినట్టు "ఆంధ్రదేశంలో అర్హతగల ప్రతిభావంతులయిన కవులూ, రచయితలూ కనీసం పదిమంది ఉన్నారు వారిలో తానొకణ్ణ"ని బెర్నార్డ్‌షాలా దిలాసాగా ప్రకటించాడు, అయితే "వారిలో ఎవరికి ఈ అవార్డు వచ్చినా నేను సంతోషించే వాణ్ణే"నని చాటారు! ఎందుకంటే, నిజానికి ఒక "ఆంధ్రపురాణం", ఒక "మహాప్రస్థానం" అవార్డులకు మించిన అనంత ప్రతిభా సంపన్నాలు, అఖండ కీర్తిమంతాలు. అవి, సినారె "మంటలూ మానవుడూ", "విశ్వంభర" కావ్యాలకు ముందు విశ్వజనీన సత్యాలను విశాల ప్రపంచానికి పంచిపెట్టిన నవనీతాలు

ఈ విశ్వం పుట్టుకకూ సినారె "విశ్వంభర" కావ్యజనానికీ పూర్వరంగం ఒక్కటే 'బిగ్ బ్యాంగ్' తర్వాత ఈ భూమండలం ఏర్పడినప్పుడు పుట్టిన మంటలు కాలక్రమంలో చల్లారాయిగాని మనిషిలోని ఆవేదన చల్లారలేదని సినారె "మంటలూ-మానవుడూ" కవితా ఖండికలలో చెప్పాడు "మార్కొండేయుని లాంటి /మారుతిలాంటి/మహోజ్వల భావి చిరంజీవి మానవుడు చల్లారలేదు" అన్న కవి "విశ్వంభర" ద్వారా కావ్యనాయకుణ్ణి మానవుణ్ణి చేసి,

కథకు నేపథ్యంగా ప్రకృతిని ఉపాసించి వాటి పుట్టు పూర్వాలనూ, అభ్యుదయ పరంపరనూ కీర్తిస్తాడు "సృష్టికి జీవహేతువేదో, ప్రకృతి పురుషులకు మూలధాతు వేదో" చెబుతాడు మానవుని ఉషోదయానికి ముందు ప్రకృతి పురిటి నొప్పులను పరవశించి వర్ణించాడు కావ్యసాధనకూ, కార్యసాధనకూ పొట్టి మాటలలోనే గట్టి భావాలూ, చిట్టిపాదాలలోనే దిట్టతనమూ వ్యక్తం చేస్తాడు సినారె శిరస్సున, కవి, మనస్సున, కవి కనుకనే వ్యక్తిత్వం, సహృదయత అతని రచనలకు ఆయుధాలు అతని దృష్టిలో, సాహిత్య సృష్టిలో ఉపమాలంకారం లేనిదే మానవుని ఉనికే ఉబుసుపోనిది ('ఉపమా సినారెస్య')। ఉక్తిలోనూ వక్రోక్తిలోనూ అందెవేసిన చెయ్యి కనుకనే "విశ్వంభర"లో ప్రకృతిలో అంతర్లీనమైన మానవుని జీవనాదం వినిపించాడు ఆత్మరక్షణకు నేర్చుకున్న ఆది పాఠాలు చెప్పాడు, మృత్యుహత్యకు వేసుకున్న మూలపీఠాలు (అవే జ్ఞాన పీఠాలు కావా?) చూపాడు! మనిషి మనస్సులో ఒక ప్రభాతం వెలసి మౌనాన్ని చీల్చుకుపోతున్నప్పుడు ఆ నాదం స్వరసంగమానికి నాంది ఎలా అయిందో వినిపిస్తాడు "విశ్వంభర" రెండో అధ్యాయం ఒక రసవత్ గుళిక పదపదంలో పరిమళం, భావనలో సమ భావనలో మంగళం! నిజానికి పరిమళ బిరుదులు కుమార గిరికే (వసంతరాయలు, కర్పూర వసంతరాయలు) కాదు, సినారెకూ వర్తిస్తాయి, సంస్కృతంలో పరిమళ కాళిదాసుల్లో, తెలుగులో ఘంట సింగయలాంటి మలమయారుత కవుల్లా! ఎందుకంటే ఉపమాలంకార ప్రియుడైన సినారె "పొడుపుకొండ మీద/ శిరస్సు జెండా ఎత్తి/ అడుగేసిన ఉదయా"న్నీ "పడమటి ఉరికంబంమీద వెలుతురు తలను వేలాడదీసిన అస్తమయా"న్నీ ఒకటిగా భావించినప్పుడు "ఉగ్రూతలూగెడు ఉదయాస్తగిరులతో ఆకాశ లక్ష్మి కోలాటమాడె"నన్న నాచనసోముడు చటుక్కున గుర్తుకొస్తాడు! పద్య కవిత కంటే, వచన కవిత ఎంత కష్టమో సినారె ప్రయోగాలూ, కుందుర్తి శ్రమా స్పష్టం చేస్తాయి. మాత్రా ఛందస్సులో తొలి మజిలీ "నాగార్జునసాగరం" కాగా, "కర్పూర వసంత రాయలు" మలి మజిలీ కాగా, 'మంటలూ-మానవుడు' వచనకవితా ఖండికలూ 'విశ్వంభర' వచన కవితలో సమగ్ర కావ్యం మాత్రా ఛందస్సులో కూడా డి హెచ్ లారెన్స్ *("Mountain Lion")* లాగా ఛందోమాత్రలు మార్చడమే కాదు, గతులను కూడా అందంగా మార్చుతాడు సెలఏళ్ళూ జలపాతాలూ కావ్యాత్మను ఊగించి శాసిస్తాయి హెర్మన్ మెల్‌విల్లీ "మాబీడిక్"ను నవల అయినా కావ్యంగా భావించారు, వాల్ట్ విట్‌మన్ "లీవ్స్ ఆఫ్ గ్రాస్" వచన కవిత అయినా ఒక సమగ్ర కావ్యంగా తలంచారు ఆ మాటకొస్తే, కాల్పనిక కవులైన బైరన్ సుదీర్ఘ కవిత రాయగా, టెన్నిసన్ వచన కవితలో ఒక నవలే ("ది ప్రిన్సెస్") రాసిపడేశాడు! కథా కావ్యం నడిపిన మాస్ ఫీల్డు కూడా అంతే విల్ఫ్రెడ్ ఓవెన్ మాదిరిగా *("The Poetry is in the Pity")* కరుణ, శృంగారాలకు, ధీరత్వానికీ సమపాళ్ళలో సినారె జ్ఞాన పీఠాలు అమర్చాడు! మానవుణ్ణి ఉద్దేశించి "మిత్రమా! నీ రాకతో/ ధాత్రి నవచైతన్యగాత్రి/ అప్పుడా! నీ రేఖతో ప్రకృతి రూపెత్తిన ద్యుతి"అని సినారె అన్నప్పుడు - డబ్ల్యు బి యేట్స్ కవి *("Easter 1916")* చరణాలు గుర్తుకు వచ్చితీరుతాయి *"All changed, changed utterly/A terrible beauty is born"* అంతేగాదు, సాహసానికీ, సాలోచనా పూర్వకమైన జ్ఞానానికీ మధ్య సరిహద్దులను నిర్ణయించడంలో ఓవెన్ కవికీ, సినారెకు పోలికలు కన్పిస్తాయి

*"Courage was mine, and I had Mystery*

*Wisdom was mine, and I had Mastery"* అని ఓవెన్ అంటే ఇక్కడ సినారె "సత్యమంటే నగ్నమైందని/తాండవ నృత్యంకంటే ఉద్విగ్నమైందని/ఇన్నాళ్ళు అనుకొనే వాణ్ణి/సత్యానికీ

అందముందని/చత్రాయిలోనూ హృదయ స్పందముంద"నీ చాటాడు! ఎందుకని? దురంత పద్మ వ్యూహాలవల్ల కానిది రవంత అనురాగంవల్ల అవుతుందన్నది, సినారె విశ్వాసం అతను శ్రమ జీవి చెమట బిందువుల్లో ఆణిముత్యాలను మాత్రమేగాక, అగ్నిగోళాలను కూడా ఏకకాలంలో చూడగలిగిన కవి! మానవుణ్ణి చేతనామూర్తిగా మలిచి, కొలిచిన కవి వాగర్థమూర్తి ఆ "వెలుగు ఆవులించే కాలానికి వెన్ను చరుపు/ ఆ అడుగు ఆగిపోయిన మార్గానికి మరో మలుపు" అందుకే సినారె కూడా అభ్యుదయ కవితా ప్రస్థాన భేరీ మోగిస్తున్న కవీ, రవీ, పవీ! అసినీ, కసినీ అభ్యుదయ మార్గాన్ని సునిశితం చేయడానికి మందు మాత్రంగానైనా వాడిన మంటల మానవుడూ, విశ్వంభరా జ్ఞానపీఠమూ సినారె!!

సెప్టెంబర్ 19, 1989

# 'ఆలయ కేళిక'!

కొన్ని పరిణామాల గురించి విన్నప్పుడు, లేదా వాటికి ప్రత్యక్ష సాక్షులుగా ఉన్నప్పుడూ "ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములేవి తల్లీ" అన్న శ్రీశ్రీతో మనమూ గొంతుకలుపుతాం.

ఒకనాటి ఢక్కా మజ్లిన్ ఏమైపోయింది? ఆనాటి గ్రామీణ చేతి వృత్తులు, వాటి ప్రభావం ఏ గంగలో కలిశాయి? విదేశీ వస్తు బహిష్కరణకూ, విదేశీ వస్త్ర బహిష్కరణకూ చిహ్నంగా, స్వేచ్ఛా పతాకగా నిలిచిన "ఖాదీ"కి పెద్దపీట వేసి నేతలను దిద్దితీర్చిన ఆ చేనేత పరిశ్రమకు గతి నేడెందుకిలా పట్టింది? మంచినీటి కొరత తీర్చలేని పాలకులు 'పెప్సీకోలా'కు చలువపందిళ్ళు ఎందుకు వేసారు? పేద రైతుల పరిస్థితిని మెరుగుపరచవలసిన "హరిత విప్లవం" నూటికి 80 మంది సామాన్య రైతులను కూలీలుగా మార్చి కులుకుతూ ధనిక రైతులను ఎలా పెంచగలిగింది? గ్రామీణ చేతి వృత్తులను నాశంచేసి, నిరుద్యోగ భారం పెంచడానికి కారకులెవరు? నగరాలకు 'వెన్న', పల్లెలకు 'సున్న' పంచిపెడుతూ స్వదేశీపాల ధరలను పడగొట్టి, విదేశీ పాలపాడి దిగుమతులను పెంచడానికి ఎవరు బాధ్యులు? "నీలి విప్లవం" పేరిట స్వదేశీ పడవలను పక్కకునెట్టి, పెద్ద ఎత్తున విదేశీ ట్రాలర్లను దిగుమతిచేసి కంట్రాక్టర్లను దించి బెస్తవాళ్ళ నోళ్ళు కొడుతున్నదెవరు? ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానం చెప్పుకొనగలిగితే - కొన్ని ప్రాచీన కళలు అంతరించిపోవడానికి, వాటిని అంటిపెట్టుకొని ఉన్న ప్రసిద్ధ కళాకారులు క్రమంగా దైన్యస్థితిలోకి వెళ్ళి శాశ్వతంగా కళ్ళు మూయడానికీగల కారణాలు కూడా తెలుస్తాయి! ఒకప్పుడు వైభవంతో ఆగమ సంప్రదాయంలో వెలుగొందిన ఆలయ నృత్యాలు అంతరించడమేగాక, వాటిని నమ్ముకొని కళామ తల్లికి నృత్య భారతులూ, నిత్య హారతులూ అందిస్తూ వచ్చిన విదుషీమణులు కూడా నానా అగచాట్లకూ గురికావలసి వచ్చింది. వారిలో కొసమెరుపుగా, కొసమాణిక్యంగా నేటికీ సజీవశక్తిగా ఉన్న వృద్ధ ఆలయకేళిక సరిదె మాణిక్యమ్మ. ఉన్న జీవనం పోయింది, కొత్త జీవనానికి అలవాటు పడలేదు, ప్రత్యామ్నాయం క్రమ పద్ధతిలో అమరనప్పుడు పరాయి పంచలు పట్టుకు తిరగవలసి వస్తుంది. ఎలుక దూరిందని చెప్పి చూరుకు నిప్పంటించుకున్నట్టుగా, ఎవడో అవినీతికి పాల్పడ్డాడని చెప్పి, అకాడెమీలన్నింటినీ పాలకులు రద్దుచేసిన దాని ఫలితం ఎవరో కారు, కళా నిష్ణాతులైన మాణిక్యమ్మలాంటి వారే అనుభవించవలసి వస్తోంది! శాస్త్రీయ సంగీత విద్యలో, కర్నాటక విద్యలో, అభినయ విద్యలో, నృత్యపూజలో, పదాలు, జావళీలు, శ్లోకాలు, సాత్వికాభినయంలో అందే వేసిన ఈ మాణిక్యమ్మ విద్యల తల్లి! అవ్వభారతి! పశ్చిమగోదావరి జిల్లా కాల్దరి నుండి బయలుదేరి బల్లిపాడు "మదనగోపాలస్వామి"ని ఆశ్రయించి అక్కడే "స్వామి"కి అంకితమైపోయి దేవనర్తకిగా సుమారు అర్ధశతాబ్దంగా కళాసేవలో నిమగ్నురాలైపోయిన మాణిక్యమ్మ "అధ్యాత్మ రామాయణ" కీర్తనలకు పదునుపెట్టిన తెలుగుపడుచు. కూచిపూడి నర్తన రీతికి వన్నె తెచ్చే "నవపారిజాతం" "ఆంధ్ర నాట్యం" పునరుద్ధరణకూ, తద్వారా స్త్రీ ఏకపాత్ర నర్తన రీతికీ విఖ్యాతి తెచ్చిన నటరాజ రామకృష్ణకు చేదోడువాదోడై వినూత్న నాట్య పార్శ్య ప్రణాళికా రచనకు దుగ్గిరాల జగదాంబ, జంపా ముత్యంతోపాటు శ్రీకారం చుట్టిన మాణిక్యం సరిదె మాణిక్యమ్మ! ప్రాచీన నృత్యకళ శాస్త్రోక్తంగా తెలిసిన, నేటికీ సజీవులై ఉన్న నర్తకీమణులలో కొసమెరుపుగా మాణిక్యమ్మను పలువురు పేర్కొంటున్నారు.

1972లో రాష్ట్ర నాటక అకాడెమీ రాజమండ్రి సభలలో ఈమె విద్వత్తును, నర్తన కౌశలాన్నీ గుర్తించి ఆదరించి, అచ్చెరువొందినప్పటికీ, ఈ రోజుకీ ఆమె నెలసరి బత్తెం కోసం "చిత్తం" అనవలసి రావడం దుర్భరం, దుస్సహం, ప్రభుత్వానికి అవమానకరం ఆమె సత్తాను పూర్తిగా గ్రహించి కూడా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ అకాడెమీలు 'నిమ్మకు నీరెత్తి'నట్టు కూర్చోడం అంతకన్నా బాధాకరం పైగా కేంద్ర అకాడెమీ కొందరు విద్యార్థులకు ఆమె వద్ద ప్రత్యేక శిక్షణ ఇప్పించికూడా ఆమెకు శాశ్వత జీవనభృతికి ఏర్పాట్లు చేయకపోవడం (బిరుద బీరాలమాట అలా ఉంచండి) మరీ దారుణం రాజమండ్రి సభల తర్వాత అయిదేళ్లకు కాబోలు, మహబూబ్‌నగర్ జిల్లా జడ్చెర్లలో మనస్సున్న ఒక దాత సహాయంతో నృత్య శిక్షణాలయంలో నెలకు రూ 250/- వేతనంపై కాలం వెళ్ళబుచ్చుకున్న మాణిక్యమ్మ ఈ ద్రవ్యోల్బణ వ్యవస్థలో కూడా ఎలా ప్రాణం నిలుపుకోవాలో తెలిసిన "కళామూర్తి" కూడా అయి ఉండాలి! శ్రీరామ జననం, రావణ సంహారం, పట్టాభిషేక ఘట్టాలను భక్తిరస స్ఫోరకంగా ఈ రోజుకీ-అంత వయస్సులో కూడా, అభినయంలో వీసమెత్తులోటు లేకుండా వయస్సులో ఉన్నప్పటి మాణిక్యమ్మను మళ్ళీ మనకు తలపింపజేసే లాస్య విన్యాసంతో, తొస్సుపడని ఉచ్చారణతో తులతూగే వాచికాభినయంతో దర్శించ గలుగుతాం మునిపల్లి సుబ్రహ్మణ్య కవి "ఆధ్యాత్మ రామాయణా"నికి అక్షర కుసుమాలు మాణిక్యమ్మ సంకీర్తనలు! ప్రతి పాదంలోనూ ఆంగికానికి గాకుండా సాత్వికానికి, హావప్రకటన కంటే భావ ప్రాధాన్యానికి ఆమె లొంగిపోయి, శ్రోతలను లొంగతీసుకుంటుంది. ఆమె సమకాలికులు మారంపల్లి వైదేహి, ఇందువదన "గోపికా సంవాదం"లో అందెవేసిన కళామూర్తులుగా ఖ్యాతికెక్కారు 1947లో "దేవదాసీ చట్టం" రావడంతో ఆలయ నృత్యకళకు ఆఘాతం కలిగింది పూజా నృత్యాల పేరిట అంతవరకూ దేవనర్తకులకు ఇస్తున్న "సర్వీసు ఈనాములు" ఈ చట్టంతో రద్దుకావడంతో "సర్వీసూ" పోయింది, వచ్చే 'ఈనామూ' గతించి పోయింది! ఉన్న ఉపాధి పోయింది, వేరు ఉపాధి రాలేదు అభినయ భాగంగా ఈ కళను రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలు గుర్తించగలిగితే మాణిక్యమ్మ లాంటి వారి సేవలను సద్వినియోగం చేసుకోవచ్చు ఎంతైనా లబ్ధిపొందవచ్చు అవార్డులకు, గుర్తింపులకూ అర్హమైన వాళ్ళను రాజకీయ వ్యామోహంలో ఈదులాడుతున్న పాలకులు అజ్ఞాతంగా ఉంచకూడదు! మహిళలలో తెలుగు వాళ్ళకు ఇంతవరకూ ఎవరికీ కేంద్ర సంగీత, నాటక అకాడమీ అవార్డులు ఇవ్వలేదు ఈసారైనా ఆ అవకాశాన్ని కేంద్ర అకాడమీ జారవిడుచుకోరాదు ప్రజాస్వామ్య యుగంలో కళలూ, సంస్కృతీ ప్రభుత్వ పోషణతో కాదు, ప్రజల ఆదరణతోనే ఎదిగి వస్తాయి. కాని దురదృష్టకరమైన విషయం - మన పాలకులకు కళావిముఖుడైన "ఔరంగజేబు మనస్తత్వం" ఇంకా వదలకపోవడమూ, ఆ మనస్సును కదిలించడం కోసం నటులూ, కవులూ, గాయకులూ "శోకరాగాల" ద్వారా 'ప్రభువు'లను ఆకర్షించడానికి ప్రయత్నాలు చేసుకోవలసి రావడమూ! మాణిక్యమ్మ దురదృష్టం బహుశా - ప్రసిద్ధ నర్తకి లవంగిలా షాజహాన్ కాలంలో, తారామతి, ప్రేమావతిలా పాదుషాల హయాములో, ఒక భాగమతిలా గోల్కొండ నవాబుల కాలంలో, తొలి యక్షగాన కర్త మాచల్దేవిలా కాకతీయుల ఏలుబడిలో, లకుమాదేవిలా కొండవీటి రెడ్డిరాజుల పాలనలో, కుప్పాయిలా రాయల దేవిడీలో, రంగరాజమ్మలా నాయకరాజుల ఛత్రఛాయల్లో, ఒక రాచకొండ భోగినిలా, ఒక ద్రాక్షారామ మాణిక్యాంబలా, ఒక చదలవాడ సామ్రాజ్యంలా పుట్టకపోవడమో, మెట్టకపోవడమో! అందుకే

మహానుభావుడు విలియమ్ బ్లేక్ పాలకులను ఒక్క చరుపు చరిచాడు కవిత్వం, చిత్రలేఖనం, సంగీతం ఏ మేరకు వర్ధిల్లుతాయో లేదా పతనమవుతాయో / ఆ మేరకు దేశాలు, జాతులూ ప్రభవిల్లుతాయి లేదా పతనమవుతాయి, / అది మానవుని పాటి విజ్ఞత, కళాదృష్టి కూడా లేకపోతే ఎలా అన్నాడాయన *["Nations are destroyed or flourished in proportion as their poetry, / painting and Music are destroyed or flourished"]*

ఆదివారం, ఆగస్టు 13, 1989

# బుర్ర కరిగి కరిగి.....

ఇది, సంస్కరణోద్యమాల ద్వారా రాజా రామమోహన్‌రాయ్, వీరేశలింగం పునీతం చేసిన వీరగడ్డే అయితే -

ఇది, దురాచారాలను ఖండించి జ్ఞానభిక్ష పెట్టడానికి ప్రయత్నించిన గురజాడ పుట్టిన దేశమే అయితే -

ఇది, పీఠాధిపతుల దుర్మార్గాలను అడుగడుగునా ఎండగట్టి తూర్పారబట్టిన చిలకమర్తి లక్ష్మీనరసింహం మెట్టిన దేశమే అయితే -

ఇది, అనాచార ప్రవృత్తినీ, చెడు సంప్రదాయాలనూ చీల్చిచెండాడిన త్రిపురనేని రామస్వామి తిరుగాడిన దేశమే అయితే -

ఏనాడో సంస్కర్తల చలవవల్ల అకుంఠిత దీక్షవల్ల పరిష్కారమై, ఇకనెంతమాత్రం సమాజానికొక సమస్యగా లేని వితంతు వివాహాల గురించి సరికొత్త వివాదాన్ని సృష్టించుతున్న పీఠాధిపతుల ప్రచారాన్ని అడ్డుకొనితీరాలి జీవితం నుంచి పలాయనం చిత్తగించిన వ్యక్తులు జీవిత సమస్యల పరిష్కారానికి అనర్హులని చాటాలి ఆచారాల పేరిట ఈ రోజుకీ 'సతీసహగమ' నాన్ని, అస్పృశ్యతను, వర్ణాశ్రమ ధర్మాల పేరిట కుల వ్యవస్థను బరితెగించి బాహాటంగా ప్రచారం చేస్తూ అస్పృశ్యతా నివారణ చట్టాన్ని కూడా ధిక్కరిస్తూన్న పీఠాధిపతుల వైఖరిని వేనోళ్ళ ఖండించాలి "తల్లిని దైవం"లా పూజించాలని ఒక నోటితో చెబుతూనే, "స్త్రీ"కి ఒక్క పేరు కాదు, పది పేర్లు తగిలించి పొగుడుతూనే, వేరొకవైపున స్త్రీ వికాసానికి వేయి విధాల అడ్డుతగులుతున్న పీఠాధిపతులు సమాజ పురోభివృద్ధికి శత్రువులని ప్రకటించాలి స్త్రీ కడుపున పుట్టి ఆ స్త్రీనే అడుగడుగునా అవమానపరిచే సంప్రదాయం ఇంకా సజావుగానే సాగిపోతున్నది - నోరులేని పశువులలో కాదు, పశుప్రవృత్తిని మానుకోలేక మనిషి రూపంలో ఉన్న ఈ దానవులలోనే కావడం మరీ విచారకరం. వితంతువులు తిరిగి వివాహం చేసుకోవడం ఎంతమాత్రం "ధర్మసమ్మతం కాద"నీ, పురుషుడికి మూడు పెళ్ళిళ్ళయినా సరే చేసుకోవడానికి అవకాశం ఉందిగాని, స్త్రీకి భర్త ఒక్కరే ఉండాలనీ, ఏకశరీరులుగా ఉన్న భార్యాభర్తల్లో భర్త చనిపోతే, భార్య "విధవ" అవుతుంది కాబట్టి, ఆమె భర్తతో మరణించినా, విధవగా మిగిలిపోయినా తప్పులేదనీ కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతి ఇటీవల విజయవాడ సభలో ప్రకటించారని వార్త

ఈ ఇరవయ్యో శతాబ్ది ఆఖరి పాదంలో ఈ ప్రల్లదనం, బాల్యవివాహాలకు స్వస్తి చెప్పించి, వితంతు వివాహాలకు అనేక విపత్తుల మధ్యనే పౌరోహిత్యం వహించి, స్త్రీ జనోద్ధరణలో నూతనాధ్యాయం తెరిచిన కందుకూరి వీరేశలింగం వేసిన బాటను అవమానించడమే కాదు, "స్త్రీల కన్నీటి గాథలకు కారణం నాకు తెలుసు"నన్న గురజాడ మూర్తిని వెక్కిరించడమే కాదు, సతీసహగమనాన్ని రూపుమాపడానికి బెంటింగ్ సంస్కరణలకు చేదోడు వాదోడైన రాజా రామమోహన్‌రాయ్‌ను ఎద్దేవా చేయడమే కాదు, అసలు "జ్ఞానం ప్రధాన"మన్న ఆదిశంకరుని విజ్ఞాన సంప్రదాయానికే జయేంద్ర సరస్వతి మాటలు చేటుగా పరిగణించాలి "సత్యం జ్ఞాన మనన్తమ్" అన్నది పిదప బుద్ధుల కోసం కాదు, పరిణతి చెందిన సంస్కార ప్రియుల కోసం! వేదాలూ, వేద సంహితలు, బ్రాహ్మణాలలో ఉన్న మంచిని వదిలి, సంఘ పురోభివృద్ధికీ, స్త్రీ-

పురుష సమైక్యతా బంధానికి వేరుపురుగులుగా ఉన్న కొన్ని నియమాలను భుజాన వెసుకొని ప్రచారం చేయడం క్షంతవ్యం కాదు. అర్థం తెలియని వేద వచనం ఇంద్రజాలికుడు కల్పించే 'మాయగోవు' లాంటిదని ఋగ్వేద భాష్యకారుడు సాయణుని ప్రవచనం. వేదం 'గంట' లాంటిదన్నారు. ఒకసారి మోగించి విడిస్తే అది చాలాసార్లు మోగుతున్నట్టుగానే సంస్కృత శబ్దం కూడా ఒకసారి ప్రయోగించినపుడు చాల అర్థాలను ఇస్తూంటుందట! అందుకనే భాష్యాలు మారుతున్నాయి. ఈ అదను చూసుకొనే బహుశా జయేంద్ర సరస్వతి కూడా వేదార్థాలు కొన్నింటిని తారుమారు చేస్తున్నట్టుంది. "కర్మ" శబ్దానికి "పని" అని క్రియగా అర్థం చెప్పారే గాని, 'నీ కర్మ నీవనుభవించు' అన్న అర్థంలో కాదు, అలాగే 'పునర్జన్మ'కు అర్థం చచ్చినవాళ్లు మళ్ళీ మళ్ళీ పుట్టడమని కాదు - లోకధర్మానికి కర్మసాక్షులుగా ఉన్న సూర్యచంద్రులను మళ్ళీ మళ్ళీ ఉదయించమని వేడుకోవడం! అయినా 'పునర్జన్మ' సూత్రంతో జనాలను భయపెట్టి ఉన్న జన్మకే ఎసరు పెట్టారు! అలాగే పురుషాధిక్యతా సమాజంలో సరకుల ఉత్పత్తికి, పునరుత్పత్తికీ స్త్రీ ఒక వాడక వస్తువుగానే మిగిలిపోయి, సంసార జీవితంలో కూడా ఆ ఆధిక్యతనే పురుషుడు నిలబెట్టుకోడానికి "ఇంట్లో ఈగల మోత" సాగించినా బయట "పల్లకీ మోత" కోసం స్త్రీని కావాలని అబలను చేశాడు, అశక్తురాలుగా చూపించాడు. మనకు ఈ 'పెద్ద మనుషులు' వేద కాలంనాటి గార్గి, మైత్రేయి విదుషీమణుల గురించి ఎంతగొప్పగా చెప్పినా, 'దూరపు కొండలు నునుపు' అన్నట్టుగా ఆ పేరిట కావాలని అందని కబుర్లు చెప్పి ఆడవాళ్ళను అప్పుడూ బాధపెట్టారు! వాదనా పటిమగల గార్గిని "ఇక నీ ప్రశ్నలు కట్టిపెట్టు" అని యాజ్ఞ వల్క్యుడు శాసించినట్టు కనబడుతుంది! ఇది పురుష అహంకారం. దీర్ఘతముడు భార్య ప్రద్వేషిణిని ఒక సందర్భంగా కోపగిస్తూ "పతి హీనులైన వనితలు అలంకారాలకు దూరంగా ఉండాలి, మాంగల్యాలను తెంచుకొని బతకాలి" అని శాసించాడు!

భార్యాభర్తల అన్యోన్యతకు ఆశీస్సులు పలికిన బ్రాహ్మణాలు "వివాహం వల్ల మనిషికి పూర్ణత్వం సిద్ధిస్తుంద"ని చెప్పినప్పుడు ఆ సౌకర్యం పునర్వివాహం వల్ల స్త్రీకి ఎందుకు కలుగరాదో చెప్పలేదు?! అంతేగాదు, "స్వయంవరాన్ని" అంగీకరించిన ఐతరేయ బ్రాహ్మణం పురుషుడికి "బహు భార్యాత్వాన్ని" సమ్మతం చేసి, స్త్రీకి "బహు భర్తృత్వాన్ని" నిషేధించడం కేవలం పురుషుని స్వార్థం కోసం చేసిన పని! అలాగే వివాహ విధిలో భాగంగా జరిగే "సప్తపది" (ఏడడుగులు) తంతులో కూడా కొన్ని అనాచారాలు చోటుచేసుకున్నాయి. దంపతుల సౌఖ్యాన్ని కోరుకునే బ్రాహ్మణులు సంతానం దగ్గరకు వచ్చేసరికి (వసంత సారే లాగా) పురుష సంతానం తప్ప స్త్రీ సంతానం కలగకూడదని శాసించడం కేవలం పురుషాధిక్యతకు నిదర్శనం కాదా? రూపవతి అయిన భార్య శత్రువు అన్నది కూడా తన నీడను తాను చూసుకుని భయపడే పురుష అహంకారే! కాని అవే బ్రాహ్మణాల్లో చెప్పిన గృహ్య సూత్రాలలో - "ఇంట్లో ఆధిక్యం (అత్తమామల మీద కూడా) వధువుకే" ఉండాలని శాసించినా కట్నపిశాచ బాధలవల్ల అత్తవారింట్లో ఆడపిల్లలు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు! అయితే "అధర్వ సంహిత" లో దాచేస్తే దాగని సత్యాలున్నాయి, స్త్రీని వశపరచుకోవాలంటే ఏం చేయాలో చెప్పారు గాని, ఆమె రక్షణకు ఏం చేయాలో చెప్పలేదు! స్త్రీ వశీకరణ తర్వాత వీళ్ళు మాయమాటలతో లోక వశీకరణకు, వంచనకూ పాల్పడ్డారు! ఎంతసేపూ భర్తతో ప్రియంగా మాట్లాడే భార్య గురించి చెప్పారు గాని, అదే సూత్రాన్ని భర్తకు వర్తింపచేయలేదు! చివరికి "అగ్ని వేదిక" (అగ్నికుండం) నిర్మాణం కూడా స్త్రీ స్వరూపంలా ఉండాలని (యోషా వై వేదిః) బ్రాహ్మణాలు

పలికాయి! రుషులూ, మహర్షులూ కూడా ఎంతసేపూ స్త్రీని సౌందర్య దృష్టితోనే చూశారు గాని, శ్రమజీవన సౌందర్య దృష్టితో చూడలేదు! ఇదీ, పురుషాధిక్యతా సమాజానికి పుట్టిన పుండేనని మనం మరువరాదు! "గుండ్రాయి (సన్నికల్లు) దాస్తే పెండ్లాగదు" అన్నారు అలాగే ఎంతమంది జయేంద్ర సరస్వతులు వితంతు వివాహాలు కూడదని అరిచినా జీవన సత్యాన్ని, లోకధర్మాన్నీ ఎవరూ అడ్డుకోలేరు! అందుకే కృష్ణశాస్త్రి ఏనాడో చెప్పాడు "వేద విద్య నాటి వెలుగెల్ల నశియించె - బుర్ర కరిగి కరిగి బొర్రగా మారెరా"!

జూలై 9, 1989

# రజిత రంజని కాదు, రసభావ తరంగిణి!

"తెలుగు మీసము నిలుపంగ తివురు డింక" అని కొప్పరపు సోదరులు తిరుపతి కవులను ఎందుకు సవాలు చేశారో తెలియదుగాని, ఈ శతాబ్ది సాహిత్య దర్పణంగా "రంజని" సాహితీ సంస్థ రజతోత్సవ సంచికగా (1987-88) వెలువరించిన "రజిత రంజని" సంపాదకవర్గం అంతపనీ చేసింది! తెంపరితనంతో తెలుగు భారతికీ, తద్వారా తెలుగు జాతికీ పదికాలాలపాటు పదిలంగా ఉండదగిన మణిపూసగా, ప్రయోజనకర సంపుటంగా దిద్ది తీర్చారు

ఇలాంటి శతాబ్ది సమీక్షలు, సంకలనాలు, సంపుటాలు ఇతర భాషల్లో కూడా వస్తున్నాయి కొలది సంవత్సరాలనాడు "హిందూ" పత్రిక శతజయంత్యుత్సవాల సందర్భంగా, భారత జాతీయోద్యమానికి రచనాపరంగా విశ్వరూప సమీక్షగా పేర్కొనదగిన వందేళ్ళ చరిత్రను ("హిందూ హండ్రెడ్ ఇయర్స్") ప్రచురించింది అందులో మోర్లీ సంస్కరణల నుంచి మోతీలాల్, మహాత్మాగాంధీ ఉద్యమాల వరకూ, కాంగ్రెస్ జననం నుంచి దానిలో పెద్ద ఎత్తున వచ్చిన చీలికల దాకా చరిత్రను నిక్షిప్తం చేశారు అలాగే "బెడ్ సైడ్ బుక్స్" కొన్ని ఉంటాయి ఇవి ఆహ్లాదం అందించడమేకాదు, ప్రగతిశీల ఆలోచనలు రేకెత్తించే అనుశీలన, అనుభవాలు రంగరించిన నవనీతాలు అందుకే వాటిని నిద్రాహారాలు మాన్పించే రచనలుగా *("suitable for sleepless nights")* నిఘంటుకారులు పేర్కొన్నారు! ఇలాంటి సంకలనాల్లో చెప్పదగిన రచన జూలియన్ షక్‌బర్గ్ ఎడిట్ చేసిన "ది బెడ్ సైడ్ బుక్" ఒకటి ఇందులో జన జీవితాన్ని ప్రభావితం చేసి కళామయం చేయగల అన్ని శాఖలూ - కవిత్వం, కథ, నవల, అభినయ కళలు, అభినవ కళలు, చరిత్ర, విజ్ఞానశాస్త్రం, హాస్యవల్లరి, విమర్శ, సినిమా ఇత్యాది అంశాలు "సింగిల్ విండో" పథకం మాదిరి పాఠకులకు కనువిందూ, వీనులవిందూ చేస్తాయి! డేవిడ్ సెసిల్ రాసిన "జేన్ ఆస్టిన్ కథ" నుంచి డేవిడ్ అటెన్ బరో రాసిన "ధరా చరిత్ర" *(The story of Earth)* వరకూ ఇందులో దర్శనమిస్తాయి అంతేగాదు, కొన్నాళ్ళ క్రితం బ్రిటానికా విజ్ఞాన సర్వస్వ ప్రచురణ కర్తలు "ది గ్రేట్ ఐడియాస్ టుడే" అని ఓ గొప్ప సంకలనం అచ్చువేశారు ఇందులో రససిద్ధాంతం నుంచి, పుస్తక సమీక్షా ప్రక్రియ వరకూ రీతి వాదం నుంచి నీతి వాదం దాకా, ఆత్మ కథా పరిశీలనం నుంచి శాస్త్రీయ భావనా పటిమాంపై సమీక్ష వరకూ, ఇరవయ్యో శతాబ్ది రంగస్థల చరిత్ర నుంచి ఆధునిక విజ్ఞాన శాస్త్రం, ఆపైన అనుక్షణ పురోగమనంలో ఉన్న సాంకేతిక శాస్త్ర పరిశీలన వరకూ, సామాజిక శాస్త్రాల పురోగతివరకూ అందమైన, విలువైన సమీక్షలున్నాయి అలాగే సెల్డెస్ రాసిన "విట్‌నెస్ టు ఎ సెంచరీ" పుస్తకం కూడా. ఇంతటి వైవిధ్యంతో పరివ్యాప్తమైన సాహితీ బృందావనంలో వస్తు నిర్దేశం ద్వారా, "ఆరగించు" కోగల శక్తి ఉండాలేగాని, ఏ శాఖను ఎంపిక చేసుకోవాలన్నది వ్యక్తిగత అభిరుచికీ, సంస్కారానికీ సంబంధించిన విషయం అందుకే ఓ పెద్ద మనిషి ఆ ఎంపిక నిర్మోహంగా సర్వజన సమ్మతంగా ఉండేటట్టుగా *("make the choice as catholic as possible")* సంకలనాలు, సమీక్షలూ వెలువడాలని కోరుకున్నాడు.

ఇలా ఏ ప్రమాణాలతో చూచినా తూచినా "సర్వ పాఠక సమ్మతం"గా కనిపిస్తున్న సంపుటం "రంజని"ఈ శతాబ్ది సాహిత్య దర్పణం. భావన స్థిరపడితేగాని ప్రయోగ వేదిక కుదరదు తెలుగుగడ్డపై కడచిన వందేళ్ళుగా వివిధ సాహిత్య శాఖలలో సాగుతున్న కసరత్తును,

దాని క్రమ పరిణామాన్ని తులనాత్మకంగా దేశీయ, పాశ్చాత్య సాహిత్య రీతుల నేపథ్యంలో పరిశీలించి, వాటి ప్రభావంతో సరిపోల్చి చదువరులకు 'గోరుముద్ద'ల్లా అందించాలన్న తలంపే గొప్పది ఆ పనిని "రంజని" సంపాదక మండలి సాధించింది ఇది రజత రంజని కాదు రసభావ తరంగిణి, ప్రగతి, ప్రచండ వాదాల సమీక్షా శింజని! ఉద్యమాల యుగంగా ఈ శతాబ్దిని భావించుకొని, ఆయా దశాబ్దులలో తలెత్తిన ఉద్యమాల నీడల్లో విభిన్న కోణాల నుంచి ఎదుగుతూ వచ్చిన కవిత, కథ, నవల, నాటకం, విమర్శలపై చేసిన వివేకవంతమైన సమీక్షలు ఇందులో ఉన్నాయి ఈ శతాబ్దిని వీరు - సంప్రదాయోద్యమం, సంస్కరణోద్యమం, జాతీయోద్యమం, కాల్పనికోద్యమం, హేతువాదోద్యమం, అభ్యుదయోద్యమం, విప్లవోద్యమం, రూపపరిణామోద్యమం అని ఎనిమిది శాఖలుగా విభజించారు ప్రతి ఉద్యమ దశకు అయిదుగురు ప్రసిద్ధుల చేత, ఆ ఉద్యమ ప్రభావంలో ఉదయించిన వివిధ సాహితీలతలు ఎలా పుష్పించి పెరిగాయో, సమీక్షలు రాయించారు ఇలా యుగ విభజనలోని ఎనిమిది ఉద్యమ దశలకూ మొత్తం 40 మంది ప్రముఖులు నిశితంగా, నిష్కర్షగా సమీక్షలు పొందుపరిచారు ఈ శతాబ్దిని ఉద్యమాల యుగంగా పేర్కొన్న "రంజని" సంపాదకీయంలో, యూరప్‌లో అనేక ఉద్యమాల ఊపులో జాలువారిన పెక్కు సాహిత్య ధోరణులేగాక (సంప్రదాయ వాదం, కాల్పనిక వాదం, అధివాస్తవిక, ప్రతీక వాదం, వగైరా) ఈ ఉద్యమాలను ఆయా దశల్లో ప్రభావితంచేసిన పారిశ్రామిక, రాజకీయ విప్లవాలను గురించి కూడా ప్రస్తావించారు

ఈ శతాబ్ది సాహిత్య వివేచనలో కావ్యరంగానికి సంబంధించి సంప్రదాయ పరిధిలోని విశ్వనాథ రామాయణ కల్పవృక్షం నుంచి శ్రీశ్రీ 'మహాప్రస్థానం', విప్లవ రచయితల 'ఝుంఝు'ల వరకూ సమీక్ష సాగింది కథా క్షేత్రంలో కందుకూరి నీతి కథామంజరి నుంచి గురజాడ 'దిద్దుబాటు' మీదుగా నగ్నముని కథలూ, "సింగరేణి కథల" దాకా స్పృశించారు నవలా పరిణామంలో "రాజశేఖర చరిత్ర"తో ప్రారంభమైన సమీక్ష ఉన్నవ, శ్రీపాద, కొడవటిగంటి, వట్టికోట ఆళ్వారు స్వాముల రచనలను పలకరిస్తూ అల్లం రాజయ్య "కొలిమంటుకున్నాది", "నల్లవజ్రం" దాకా కొనలు సాగింది నాటక రంగంలో పానుగంటి వారి "కంఠాభరణం", గురజాడ "కన్యాశుల్కం"ల గాయతూ సి ఎస్ రావు "ఉమ్మడి బతుకుల"ను చూపిస్తూ, జన నాట్యమండలి ప్రగతి వరకూ సమీక్ష నడిచింది. ఇక విమర్శనాక్షేత్రంలో గురజాడ చేసిన హెచ్చరికకు విలువ వచ్చింది తెలుగు సాహిత్యం విమర్శ లేకనే నిరసిస్తూ వచ్చిందన్న ఆయన హెచ్చరికను పాటించి, వస్తు నిర్దేశం నుంచి రూప నిర్దేశం వరకూ ప్రత్యేక విభాగంగా ఇందులో చర్చించారు "అత్యుక్తులు, అపోహలు, అభిమానాలు లేకుండా గతాన్ని పరిశీలించినప్పుడే వర్తమాన జీవితాన్ని అవగాహన చేసుకొని" అభివృద్ధి సాధించగలమన్న స్పృహకు ఇందులో ఆమోద ముద్ర లభించింది అయితే ఇందులో కొందరు సంప్రదాయ పద్యకవిత చాటున దాగి, కంఠవశంగాని కవితకు, వచన కవితకూ కాలం చెల్లిందని, దానినెవరూ ఆదరించరనీ ఏకపక్షంగా తీర్పు చెప్పారు ఈ సంప్రదాయ వాదులకు సమాధానం ఎవరో కాదు, నవ్య సంప్రదాయాన్నీ ఆధునికతను ప్రవేశపెట్టిన తిరుపతి కవులే [illegible]వారు "కవుల మున్నటి రూల్పుకు కట్టుబడము" అన్నారు! సంస్కార దృష్టిని లోకులకీ [illegible]వర్ణచాలంటే అందుకు తగిన సాధనం వచనమే అన్నాడు శ్రీపాద! అభిరుచులను శాసించవద్దు

జూలై 2, 1989

# మానవీయ కవితకు 'మాధవీ'య స్పర్శ "గబ్బిలం"

కడుపు నిండిన బేరానికి, కడుపు మండిన బేరానికి తేడా ఉంది ఆ వ్యత్యాసమే ప్రణయ సందేశానికీ, ప్రళయ సంకేతానికీ మధ్య కూడా ఉంటుంది! మహాకవి కాళిదాసు మేఘసందేశం- కథానాయకుడి ప్రణయ సందేశం. మహాకవి జషువా "గబ్బిలం" కథానాయకుడైన క్షుదాగ్ని పీడితుడి కన్నీటిగాథ ఇద్దరూ మహాకవులే కాని ఒకరి కథావస్తువు మన్మథాగ్ని కాగా, వేరొకటిది మానవీయమైన సందేశం జాలువా కవితల జాషువా "గబ్బిలం" తరతరాలుగా కుల, మత, వర్గ, వర్ణ వైషమ్యాల మధ్య నలిగిపోయిన దళిత జాతుల దుర్భర జీవితాలకు ఒక ప్రతీకగా వెలసిన గొప్ప కావ్యం అడుగడుగునా కడగొట్టు బిడ్డడి ఆర్తినీ, ఆర్తనాదాన్నీ వినిపిస్తూనే తెలుగువారి, భారతదేశ ఉద్ధతినీ, దుర్గతినీ కూడా ఒకే సమయంలో పాఠకులకు స్ఫురింపజేసే మహోన్నత కావ్యం దేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ప్రభావితం చేసిన మహోద్యమాలలో భాగమైన సంస్కరణోద్యమం సంస్కృతీ ఉద్యమాల్లో అంతర్భాగమే కవితా ఉద్యమాలు దేశభక్తీ, దేశారాధనా ఏక ముఖంగా సాగిన కాలమిది సమకాలీనతకు, సంస్కరణకూ అద్దంపట్టిన తెలుగుకావ్య రాజాలలో ఒకటి "గబ్బిలం" ఇక్కడ చెప్పదలచుకున్న విశేషం -గబ్బిలం ప్రాశస్త్యం గురించి మరొకసారి ఉగ్గడించడమో, వల్లె వేయడమో కాదు ఆ అవసరం ఇన్నాళ్ళ తర్వాత జాషువా కవితకు లేదు! అది తెలుగు లోగిళ్ళలో నిత్య ప్రవాహిని కాని తెలుగువాడి దౌర్భాగ్యం-మన మహాకవుల రచనలు విస్తృతంగా ఆంగ్ల భాషకు, పరాయి భాషలకు ఎక్కకపోవడం! ఇప్పుడిప్పుడే, అదీ నత్తనడకలో తెలుగు ప్రముఖుల రచనలకు అనువాద భాగ్యం కలిగినందుకు సంతోషించాలి అస్పృశ్యతను ఎదిరించి సర్వజాతుల సమైక్యతను బోధించి, సాంఘికంగానూ ఆర్థికంగానూ అంతరాల దొంతరలు పోవాలని ప్రబోధించి సమగ్రతా దృష్టిని తన దేశ ప్రజలకు కల్పించడానికి కవితాపరంగా స్వాతంత్ర్యం ప్రకటించుకున్న జాషువా "గబ్బిలం", పరిపాలనా వ్యవహారాలలో దక్షుడైన రాష్ట్ర ప్రభుత్వ చీఫ్ ప్రిన్సిపాల్ సెక్రటరీ కె మాధవరావు చేతుల్లో ఆంగ్లానువాదానికి నోచుకుంది. గబ్బిలం చరిత్ర దళితుల చరిత్ర, జాతీయోద్యమ చరిత్ర ఆ ఉద్యమ ఉధృతిలో సాహితినీ, సంస్కృతినీ ఊగించి శాసించిన కవితా శాఖలెన్నో, కవులెందరో! స్వదేశీ ఉద్యమం పూయించిన కవితా కుసుమాలెన్నో! తమిళంలో సుబ్రహ్మణ్యభారతి, మలయాళంలో వల్లథోల్ మాదిరిగా తెలుగునాట చిలకమర్తి, గురజాడ, మంగిపూడి వెంకటశర్మ, గుర్రం జాషువా, త్రిపురనేని తుమ్మల, విశ్వనాథ ఇలా ఎందరో జాతీయోద్యమ లక్ష్యానికి చేదోడువాదోడు కాగలిగారు తెల్లవాడికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమం ఏకాకి కాదు. యూరప్‌లో యుద్ధానంతరం ప్రారంభమైన ప్రజాస్వామ్య ఉద్యమాలు, రష్యాలో అక్టోబర్ సోషలిస్టు విప్లవం మన స్వదేశీ ఉద్యమానికి ధైర్యస్థైర్యాలు అందించాయి. ఆ ఊపులో వెలువడినవే ఉన్నవ మాలపల్లి, జాషువా "గబ్బిలం", గరిమెళ్ళ "మాకొద్దీ తెల్లదొరతనం" కవితా ప్రసూనాలు. అయితే ప్రథమాంధ్ర దళిత కవి అయిన జాషువా పుట్టి, పెరిగి వచ్చిన సామాజిక పరిస్థితులు వేరు, మిగతా కవులవి వేరు వర్గ, వర్ణ వ్యవస్థలో అట్టడుగు జనాల ఆర్తిని అర్థం చేసుకోగల వారే దళిత కవుల ఆవేదనకు అక్షర రూపమివ్వగలుగుతారు అందుకే జాషువాయే "నాదు కన్నీటి కథ సమన్వయము సేయ/ఆర్ద్ర హృదయంబుగూడ కొంతవసరంబు" అన్నాడు! ఆ హృదయాన్ని తెలుగు భాషరాని ఇతరులకు ఆంగ్ల పాఠకులకు, విద్యావిశారదులకు విప్పిచూపాలని నడుం

కట్టినవాడు మాధవరావు బడుగు జీవులకు ప్రతినిధిగా జాషువా ఎంచుకున్న ప్రతీక "గబ్బిలం" మాధవరావు అంగ్లానువాదంలో సార్థకత పొందింది అనువాదానికి అంత తేలికగా లొంగని జాషువా రసరమ్య కారుణ్య కవితను ఫ్రీవర్స్‌లో మాధవరావు అనువదించి, చాలవరకు న్యాయం చేకూర్చగలిగారు అటూ ఇటూ ఆదాన ప్రదానాలు తక్కువ కాబట్టిగాని ప్రపంచంలోని ఆంగ్లేతర భాషలెన్నో ఆంగ్లంలోకీ, ఆ పిమ్మట తెలుగులోకీ వచ్చి పాఠకులకు వీనుల విందు చేస్తున్నాయి ముద్రణాపరంగా కనులవిందూ చేస్తున్నాయి! తెలుగులో కాళిదాసు 'శాకుంతలా' నికి ఎన్నో అనువాదాలు వచ్చినా, ప్రాచుర్యం పొంది పాతుకు పోయిన రచన వీరేశలింగం "అభిజ్ఞాన శాకుంతలం" ఒక్కటే! అలాగే ఉమర్‌ఖయ్యామ్ రుబాయీలకు ఇంగ్లీషులో ఎన్ని అనువాదాలొచ్చినా ఫిట్జరాల్డ్ అంగ్లసేత ఒక్కటే ఫ్రీవర్స్‌గా నిలిచి పోయింది ఆ తర్వాత తెలుగులో ఉమర్‌ఖయ్యామ్ కవితకు న్యాయం చేకూర్చడానికి ప్రయత్నించిన వారెందరో ఉన్నారు అయినా దువ్వూరి రామిరెడ్డి 'పానశాల' ఖయ్యాము పర్షియన్ భాషను మరిపించేదిగా ఉందన్నది పాఠక లోకం శాసనం! నేడు ఇంగ్లీషులో తామరతంపరగా వస్తున్న కథా, కవితా సంపుటాలన్నీ వివిధ దేశాల సంస్కృతీ విలువలకు అద్దం పడుతున్నవే వెస్ట్ ఇండియన్లు, ఆఫ్రికన్లు, ఆఫ్రికన్-అమెరికన్లు రచిస్తున్న ఆధునిక కవితలలో పెక్కింటిని గెరాల్డ్ మూర్, ఉలీబార్ "మోడరన్ ఆఫ్రికన్ పొయెట్రీ"గా తీసుకొచ్చారు ఇందులో 23 దేశాలకు చెందిన 67 మంది కవుల 200 కవితలున్నాయి! ఇవన్నీ ఎవీ, యొరుబా, హౌసా, స్వాహిలీ, లూవో భాషలకు చెందిన కవితా ఖండికలు, లాంగ్‌స్టన్ హ్యూస్ దించిన "ది నీగ్రో స్పీక్స్ ఆఫ్ రివర్స్" ఇలాంటిదే. "బ్లాక్ ఆర్ఫియన్" నీగ్రోల కవితా ఝుంఝుకు ఒక విశిష్ట సంస్కృతీ వేదిక ఆంగ్లానువాదాలవల్లనే డెన్నిస్ బ్రూటస్, అగస్తినో నాటో, క్రిస్టోఫర్ ఒకీబో, వోలే సోయింకా (వీరిలో కొందరు స్వయంగా ఆంగ్లంలో రచనలు చేయగల సత్తా ఉన్నవాళ్ళు కూడా) లాంటి ఉత్తమశ్రేణి నీగ్రో కవుల గురించి మనకు తెలిసి వచ్చింది బెంగాలీ సాహిత్యం ప్రపంచ ప్రసిద్ధి పొందడానికి ఇతర భాషల్లోకి దాని అనువాదాలే తోడ్పడ్డాయని మరవరాదు ఆధునిక తెలుగు కవితలకు ముహూర్తం 1956 లో అబ్బూరి వరదరాజేశ్వరరావు, ఛాయాదేవి ప్రకటించిన "యాంథాలజీ ఆఫ్ మోడరన్ పొయెట్రీ"తో గాని కుదరలేదు! శబ్ద సౌందర్యం, అర్థగౌరవం చెడకుండా వెలుగుచూసిన తొలి ఆంగ్లానువాద తెలుగు కవితా సంపుటి అది ఆ తరువాత దాదాపు ప్రతి దశాబ్దానికి, ఆలస్యంగానైనా ఒక్కో సంపుటి వస్తోంది 1970-1980 మధ్యలో రెండు మూడు ఆంగ్లానువాద కవితా కదంబాలు వచ్చాయి అవి వేగుంట మోహన్‌ప్రసాద్ సంపాదకత్వంలో వెలువడిన "దిస్ టెన్స్ టైమ్", శ్రీశ్రీ "త్రీ చీర్స్ టు మాన్" (ఇందులో కొన్ని అమరేంద్ర అనువాదాలు) రాజమండ్రి ముద్రణ యువ కవితా సంకలనం 'పొయెట్రీ లాబ్' (కవితా లాబ్)! ఇవిగాక 1990లలో ఆధునిక కవితా దశలు దాటి మరో ముందడుగు వేసిన అత్యాధునిక ఆంగ్లానువాద సంపుటి ఫ్రీవర్స్ ఫ్రంట్ విడుదలచేసిన "డౌన్ టు ది ఎర్త్" గత శతాబ్దంలో చెప్పుకోదగిన అనువాదం - బ్రౌన్ వేమన శతకం! ఇవిగాక ఒకనాటి మద్రాసు కాంగ్రెస్‌కు హాజరైన గురజాడ ఆ సభ తీరుతెన్నుల గురించి "కాంగ్రెస్" పేరిట రాసిన ఒక పారడీకి శ్రీశ్రీ "స్సామవేదం"గా తెలుగు అనువాదం ఇచ్చారు. కాగా 1930 నాటి గరిమెళ్ళ స్వీయ అంగ్ల కవితలను "హార్ట్ ఆఫ్ ఇండియా"గా ప్రీతికుమార్ ఇటీవల అందించారు. దీన్ని లాంగ్‌ఫెలో రాసిన *"Psalms of Life"* తో పోల్చిందావిడ

- అలాగే జాషువా "గబ్బిలం" ఆంగ్లానువాదం (లేదా అనుసరణ) సమకూర్చిన

మాధవరావు మాతృకకు బాగా దగ్గరగా వచ్చారు 15-16 శతాబ్దాలనాటి యూరప్ వికాసనోద్యమ దశలో రెండు పాయలున్నాయని చెప్పాడు జె.బి.ప్రీస్ట్లీ ఒకటి - కులీన వర్గ కవులూ, వేరొకటి కుమిలిపోతున్న వర్గం కవులూ అని! పేదవాళ్ళ పట్ల ఆర్ద్రత ఉన్నప్పటికీ ఆ కృత్రిమ సంస్కృతీ విలువలకు వకల్తా పట్టిన ఆ కాలంలో కవితలు, రచనలూ రాచనగరులకు, సంపన్న వర్గాల ప్రయోజనాలకే పరిమితమయ్యాయన్నాడు కాని మరోవైపున సమాజ పరిస్థితులు వేరన్నాడు అవి రాచనగరులకు వెలుపల ఉన్న ఆకలి దప్పుల, నిరాశ నిస్పృహల మధ్య జీవిస్తున్న బడుగు ప్రజలు అన్నాడు. అవే పరిస్థితుల్ని తానసుభవించి, కళ్ళారా చూసిన జాషువా కవితా దోరణివేరు. అందుకే "గబ్బిలం" సాయంతో ఆంధ్ర చరిత్రలోని, దేశ చరిత్రలోని వెలుగు చీకట్లను సందర్శింపచేసే ఉజ్వల రచన మనకందించాడు కర్మ సిద్ధాంతాన్ని తూర్పారబట్టాడు. స్వార్థపరులను ఎండగట్టాడు కవిగా, రచయితగా, సంఘ సంస్కర్తగా సామాజిక అన్యాయాలపై కలంపోటును కత్తివేటుగా మార్చాడు మాధవరావు అనువాదం ఛందోబద్ధం కానక్కరలేదు. స్వేచ్ఛాప్రియత్వంలోనే అనువాదపు అర్థంకుల్ని అధిగమించాడు అయితే ఆంగ్లానువాదానికి సమకూర్చిన 'ముందుమాట'లో మాధవరావు జాషువా కలం సృష్టి అయిన "గబ్బిలం" దోపిడీదార్లతో తలపడే ఆయుధంకాదనీ, దళితుల్లో సాంఘిక చైతన్యం కల్పించడమే దాని ఉద్దేశమని చెప్పారు చైతన్యం ఆచరణ రూపం తీసుకోదా? జాషువా చెప్పినట్టు "నిమ్నజాతుల కన్నీటి నీరదములు పిడుగులై"నపుడు దానినేమంటారు? చైతన్యానికి మారుపేరు తిరుగుబాటు కనుకనే జాషువా తుప్పుపట్టిన కార్యంపూడి కత్తులు ఇప్పటికీ ఆరాటం కలిగిస్తున్నాయన్నాడు! వీరి రుధిర జ్వాలలే జీవన నాళాలన్నాడు! అందుకే కవితా ప్రవంతిలో "వాడు వారని శౌర్యం" సుమించే తెలుగు పొలిమేరలను మనకు చూపడం! మాధవరావు సరళమైన అనువాదంలో అలవోకగా అందమైన అంత్యప్రాసలు కూడా చోటుచేసుకున్నాయి ఆయని రచనకు కొన్ని ఉదాహరణలు అభాగ్యుడైన పీడిత, తాడిత వర్గాల బతుకును తాను నమ్ముకున్న హైందవం ఎలా రాచిరంపాన పెట్టిందో జాషువా ఇలా అన్నాడు "ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి/ గసరి బుసగొట్టు నాతని గాలిసోక / నాల్గుపడగల హైందవ నాగరాజు" దీనికి మాధవరావు అనువాదం *"The demon of poverty thrives/Sucking this poor man's blood/The four hooded cobra of Hinduism/Frowns at his very sight"!* అంతేగాదు, నీతిపారాలలో కూడా జాషువా మొనగాడు సామాజిక ప్రగతికి అడ్డువచ్చే పురాతన ధర్మాలను, కట్టుబాట్లను ఈసడించాడు ఈ వరసలో ఆయన గాంధీ, పటేల్, అంబేద్కర్, నెహ్రూలలో ఉన్న మంచిని గౌరవిస్తూనే, అహింసాబోధను విడవకుండానే తన అభిప్రాయాల్ని నిశితంగా ప్రకటించాడు భారత స్త్రీల కన్నీటి గాథలకు కారణాలను చూపెట్టాడు షెల్లీ మహాకవిలా జాషువా ఎవరి రెక్కల కష్టంపైన దేశాల సౌభాగ్యం ఆధారపడి ఉందో చెప్పాడు 'వాని రెక్కల కష్టంబులేనినాడు/ సస్యరమ పండి పులకింప సంశయించు / వాడు చెమటోడ్చి ప్రపంచమునకు /భోజనము బెట్టు వానికి భుక్తిలేదు" దీనికి ఆంగ్లానువాదం *"Only he can raise the crops/And only he/Feeds the whole mankind/Alas, he himself has naught to eat"!* షెల్లీ కవి కూడా నూట యాభై ఏళ్ళ క్రితం పారిశ్రామిక విప్లవానంతరం పరిస్థితుల్ని బేరీజువేస్తూ "టు ది మెన్ ఆఫ్ ఇంగ్లండ్" అన్న కవితలో అంటాడు *"The seeds ye sow, another reaps/The wealth ye find, another keeps/ The robes ye weave, another weaves / the arms ye forge, another bears"!* అలాగే రాజకీయ స్వాతంత్ర్య సమర నినాదాన్ని ఆర్థిక స్వాతంత్ర్య

దీక్షగానూ, సమన్వయ భారతానికి సవ్యాఖ్యగానూ భావించి జాషువా మలచిన తీరు "ఏ జాతికెంతవచ్చునొ/ రాజ్యంబంతనాకు రావచ్చుకదా" *("When India attains independence/ Every community should get its share")*[1] అందాకా "సమతులు సౌఖ్యముల్ పెదవిజారిన మాటలు /--పటుత్వ మూడిన దూముడి బంధనాలు ధర్మములు, దయారసాల్ మొసలి రాల్చు అశ్రుకణాలు" అన్నాడు *("Equality is a slogan, fratenity a sham/Crocodile tears are shed by those who slam/The door of Justice on our face / Strange indeed these religious ways")*[1] మాధవరావు అనువాదంతో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో జాషువా సమున్నత స్థానం మరింత పదిలం కావాలి తేనెలూరించే తేటతెనుగు కవిపట్ల కొందరిలో ఇప్పటికీ పాదుకొన్న అసూయాద్వేషాలకు మాధవరావు అనువాదం సమాధానం కావాలి తన కాలంనాటి అసూయలను గురించి 1920లోనే హెచ్ ఎల్ మెంకెన్ వ్యంగ్య వైభవంతో *"Prejudices"* అనే పుస్తకం రాశాడు సుప్రసిద్ధ ఆంగ్లకవి కోల్రిడ్జ్ గురించి షెల్లీ గొప్పగా వర్ణించాడు *"A hooded eagle among blinking owls"* అన్నాడు! జాషువా కూడా అలాంటివాడే! అంత దిలాసాతో, ధిషణతో ధీమాగా తన ప్రభాపుంజాలను తన కాలంలో అందినంత లెక్క చిమ్ముకుంటూ వచ్చినవాడు జాషువా! కనుకనే అతని మానవీయ కవితకు ఇది 'మాధవీయ' స్పర్శ! ఒక్కమాట - వివరణలో మాధవరావు ప్రస్తావించిన ముద్దుపళని 'అతడు'కాదు, 'ఆమె' ఆమె నాయక రాజుల కాలం కవయిత్రి.

ఆదివారం1, డిసెంబర్ 1996

# హుసేన్ తూలికా సృష్టి : కావాలి కళాదృష్టి!

"మాన మధనాయ, మదనాయ మధు సుఖాయ మానసిజాయ నమో నమో" అని కామశాస్త్ర పాఠాలు నేర్పిందెవరు? మనమే! వసుచరిత్రకారుడు శుభమూర్తి (భట్టుమూర్తి) మన్మధ పూజ వైశిష్ట్యాన్ని అలా చెప్పాడు! అందులో చెలికత్తెలు మన్మధుడి ఎడమతొడమీద రతిని నిలుపుతారు, సన్నిధిలో వసంతుణ్ణి పెడతారు, దోసిళ్ళతో పూలు గుమ్మరిస్తారు, పళ్ళు పెడతారు, యువతులు పూజలు చేస్తారు అయితే ఇంతకూ మనసును వికలంచేసేది ఏమంటే-ఈ మదన పూజలో ఉన్నవాళ్ళంతా మన ఆడపడుచులూ, అక్కచెల్లెళ్ళే కావడం! మన పెక్కు ప్రబంధాలు స్త్రీ-పురుష కామకేళీ విలాసాలకు, చిత్రకారులయితే వాత్స్యాయనుడి బాటకూ కట్టుబడి వందల కొలది ఏళ్ళు గడిపారు! అయినా మనం బాధపడలేదు, మన కృష్ణ భగవానుడు రుక్మిణీ సత్యభామల మధ్య నలిగి పోయినందుకూ వగవలేదు, పదహారు వేలమంది గోపికలతో సరసాలాడినప్పుడూ మనకు చీమకుట్టలేదు, రతీమన్మధుల చిత్రపటాలు చూసినా మన కళ్ళు పోలేదు! "అతి సర్వత్ర వర్జయేత్" అన్న ప్రాచీన సూక్తం ఆనాటినుంచి ఈ నాటిదాకా ఎవడూ పాటించింది లేదు, కళాకారులతో సహా, చిత్రకారులతో సహా! ఎటు తిరిగీ, ఆధునిక భారతంలో కళకు కొందరు రాజకీయ పక్షులు, నిరక్షర కుక్షులూ కత్తులబోను తగిలించాలని చూస్తున్నారు ఇందుకోసం భారతీయ సంస్కృతిని పదేపదే గుర్తుచేస్తున్నారు కాని ప్రాచీనానికి వెళ్ళినకొద్దీ పాములబుట్ట తెరుచుకుంటుంది మనకే బెడిసికొట్టే కళాచరిత్ర మనదని మనం మరిచి పోతున్నాం అజ్ఞానం వల్ల ఓర్పు నశించి కుంచెవీరుల స్వేచ్ఛను అడ్డుకోబోతున్నారు కళాకారులను మతప్రాతిపదికపై విభజించే ధోరణులను మనం వేనోళ్ళ ఖండించాలి. అందేకే సంస్కృతికీ సంస్కారానికీ నిర్వచనం తెలిసిన వాజ్‌పెయిలోని సాహితీమూర్తి, కళాకారుడూ సుప్రసిద్ధ భారతీయ చిత్రకారుడైన హుసేన్ కళాఖండాలు ప్రస్తావనకు వచ్చినప్పుడు ఇలా వ్యాఖ్యానించాడు "కళపైన, స్వేచ్ఛగా దాని అభివ్యక్తీకరణపైన దాడిచేయడ మంటే సమాజానికి అపారమైన హాని తలపెట్టడమే"! ఈ సంస్కారానికి దూరమైన కొందరు "హైందవం"పేరిట మత రాజకీయాలను కళా సృష్టికి అంటగడుతున్నారు దేవతామూర్తులను (సరస్వతి, దుర్గ, ద్రౌపది వగైరా) అర్ధనగ్న రూపంలో చిత్రించినందుకు అహ్మదాబాద్, బొంబాయి, నాగపూర్, ఇండోర్‌లలోని హుసేన్ కళాఖండాలను ధ్వంసం చేశారు, ఆయనపైన దుమ్మెత్తి పోశారు, సమాజాన్ని మత ప్రాతిపదికపై విభజించడం ఎంత కిరాతకమైన చర్యో, సాహిత్య, లలితకళా సృష్టిని "మతం" పేరిట విభజించడం కూడా అంత ఘోరమేనని గ్రహించవలసిన సమయం వచ్చింది ఏ చాపల్యం వల్లనో జాలువారిన ఒక కళాకారుని ఏ ఒకటి రెండు పెయింటింగ్స్‌నో ఆధారంచేసుకొని అతని మొత్తం కళా విలువలనే అంచనాకట్టడం దుర్లభం. ఇదే హుసేన్, ఆధునిక చిత్ర కళారీతులలో ఒక్క మాధురీ దీక్షిత్‌నే కాదు, స్వేచ్ఛా విహంగంగా కుంచె కదలికలను దిద్ది తీర్చుకొని భారతీయ సంప్రదాయాలలోని సమన్వయ దృక్పధాన్ని ఎన్నో రకాల కళాఖండాలుగా మలిచిన ఉదాహరణలను (ఎన్నికలలో లబ్ధికోసమని) కొందరు మూఢమతులు మరిచిపోతున్నారు దేవతారూపాలు ఊహాజనితాలు అందుకే అవి నిర్గుణం, నిరాకారం గణపతి రూపం ఒకటికాదు, రకరకాలు. వెనుతిరిగి చూసుకుంటే, సర్వమత సమ్మేళనానికి, సమైక్య వారసత్వానికీ హుసేన్ పెయింటింగ్స్ ఎన్నో దోహదం చేశాయని వీరు గుర్తించగులుగుతారు, తప్పు చేశామని ముక్కుమీద వేలు వేసుకొంటారు, ప్రాచ్య,

పాశ్చాత్య చిత్ర కళారీతులకు హుసేన్ దీటైన వారసుడని మనం సగర్వంగా చెప్పుకోవచ్చు ఎందుకంటే భారతీయ కళారీతులపైన విశిష్ట పరిశోధన సాగించిన సుప్రసిద్ధ కళా విమర్శకుడు సి శివరామమూర్తి (*"Art of India"*) చెప్పినట్టుగా "భారతీయ కళ, రసదృష్టికి సంబంధించిన దాని సిద్ధాంతాలూ ఎవరినైనా సరే దివ్యాతి దివ్యమైన నందన వనంలోకి నడిపిస్తాయి భిన్న శయ్యలతో, విభిన్న రీతులతో బంగారు కాంతులు వెదజల్లిన కళాసృష్టి అది ఈ భిన్నత్వంలోనే దాని సమైక్యత, సమగ్రత ఉంది ఈ ఆత్మ ఔన్నత్యమే హిమాలయాలనుంచి కన్యాకుమారి దాకా, గాంధారంనుంచి అస్సాందాకా పరివ్యాప్తమయింది". అయితే ఈ పరివ్యాప్తి భిన్న మతాలతో, విభిన్న సంస్కృతులతో భిన్న భాషా మైనారిటీలతో, రకరకాల ఆచారాలతో ఆదివాసి సంస్కృతీ సంప్రదాయాలతో దీపిస్తున్న సత్యంగా గుర్తించాలి అంతేగాని "హైందవం"పేరిట భారతీయ సంస్కృతికి గిరిగీసుకొని వికృతార్థం కల్పించడం తగదు ఎందుకంటే నిజమైన హైందవానికి నిదర్శనం, నిర్వచనం-ప్రతి నవ్యభావాన్నీ, నూతన కళారీతులనూ ఎక్కడినుంచి వచ్చినా తనలో ఇముడ్చుకోగలగడం, తద్వారా ఉమ్మడి వారసత్వాన్ని ప్రతిష్ఠాపించడమూ ఈ హద్దులు దాటి తమకే తెలియని ఏక సంస్కృతిని ఇతరులపై రుద్దడం అరాచకం నిజమైన హైందవం ఈ అరాచకాన్ని భరించలేదు కనిపించని దైవాన్ని ఒక "సృష్టికర్త" అనుకుంటే, కనిపించే కళాకారుడూ ఒక సృష్టికర్తే! "అతి"ధోరణులు రాజకీయ ఛాందసులలో ఉన్నట్టే, సాహిత్య కళారంగాలనుకూడా అప్పుడప్పుడూ పీడిస్తూ ఉంటాయి! అయితే ఇక్కడొక చారిత్రక సత్యాన్ని కూడా మరవలేం "సృష్టికర్త"కు అడ్డుగోడలుండవు లేవుగనుకనే శరీర సృష్టి మూలం నగ్నం! అందుకే సామెతకూడా వచ్చింది-మనిషి బట్టలతో పుట్టలేదు, ఛచ్చేటప్పుడూ బట్టలతో పోడు! భారతీయ దర్శనాలతో సహా ప్రపంచ తాత్త్విక చింతనకు ఇది సమష్టి వారసత్వంగా వచ్చిన భావన ఆదినుంచీ కళాసృష్టి భిన్న పోకడలు పోతూ పరిణామం చెందింది నవరస పోషణ కళాసృష్టికి ప్రాణధార. అందుకే అధివాస్తవిక వాదులు అని ఉంటారు పైకి కనిపించేదే ప్రపంచం కాదు, లోతులకు వెళ్ళి చూస్తే మనం పైకి అంగీకరించలేక, లోలోపల ఆనందించే ఘట్టాలూ ఉంటాయని! బహుశా అందుకే ప్రసిద్ధ కళావిమర్శకుడు జీన్ దివిగ్నాడ్ "చిత్రకారుడు భువిమీది దైవజ్ఞుడు"అని ఉంటాడు! కనుకనే చిత్రకారుణ్ణి జ్ఞానమూర్తిగానూ, ఒక ప్రవక్తగానూ భావించి, అతని కుంచెలోనుంచి దూసుకువచ్చిన ఏ కళాఖండాన్నయినా సరే పవిత్రమైనదిగా భావించిన సన్నివేశాలు కళాచరిత్రలో కొల్లలుగా ఉన్నాయి ఎందుకని? సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత, కళావేత్త అయిన ఆంద్రే మార్లో అంటాడు "చిత్రకారుడికి మానవుల సృష్టి ఆదిరూపమే (మొండిమొల) కళాసృష్టికి ముడిసరుకు! సృజన శక్తి పెరిగినకొద్దీ ఒక ఆకారం తొడగాలన్న అభిలాషను నాగరీకుడు వ్యక్తం చేస్తుంటాడు" అన్నాడు నిజానికి సుమేరియన్, అజెటిక్ జాతుల కళాసృష్టి, రోమన్, బౌద్ధ, కళాసృష్టి ఇలా జరిగిందే చిత్రకళా చరిత్రలో అడుగడుగునా ప్రపంచ వ్యాపితంగానే కొత్త-పాతల మధ్య ఘర్షణ అనివార్యమైంది ఈ ఉద్రిక్తతలన్నింటిని 19వ శతాబ్దం అనుభవించింది పునరుజ్జీవనోద్యమ దశనుంచీ 20వ శతాబ్ది తొలిరేకలు సోకేదాకా సాహితీ, కళారంగాలను ప్రభావితం చేసిన చిత్రవిచిత్ర పోకడల సమాహారమే-సింబాలిజం, సరియలిజం, ఇంప్రెషనిజం, క్యూబిజం, డాడాయిజం! ఇవి, ఆ చారిత్రక దశలో తలెత్తిన క్షీణ సాంస్కృతిక ధోరణులు కావచ్చు హుసేన్ భారతీయ సమష్టి వారసత్వంలో కలగలిసిపోయిన కళామూర్తి మన సంస్కృతిలోని ఈ గ్రాహ్యశక్తిని గుర్తించలేనివారు కళ్ళులేని కబోదులకింద జమపడతారు! ఎందుకంటే హుసేన్ ధార్మికాంశాలనే

కాదు, రామాయణ, మహాభారత గాధలకు చిత్రవైచిత్రిని కల్పించారు అర్ధనగ్న స్థితిలో ద్రౌపది చిత్రీకరణ మయసభలో దుష్టకూటమి వికృత చేష్టలకు రూపకల్పనగా ఎందుకు మనం గుర్తించం?

దేవతా మూర్తులంతా మన అజ్ఞాత మనో చిత్రాలుగాని, వాస్తవ శక్తులు కావు! అయితే పరిపూర్ణ స్వేచ్ఛ అనేది సాపేక్షం అయినందున కళాకారుడు ప్రజల మనోగతమైన రూపాలను చిత్రించేటప్పుడు జాగరూకత వహించడం అవసరం కాని హుస్సేన్ చిత్రాలు కుంచె సొగసులే కాదు, సంగీత ఝురులుకూడా ఎందుకంటే జీసస్, మదర్ థెరీసా, ఇందిరా గాంధీ రూపాలనే కాదు హిందూజాల కోరికపైన మన "వేదాంత"ఘట్టాలకు "థియోరమా" *(Theorama)* పేరిట అద్భుత రూపకల్పన చేసిన మహా చిత్రకారుడు అవి దేశంలో మతకల్లోలాలు చెలరేగిన సమయాలు అవి ఇతి వృత్తంగా అయిన 10 పానెల్స్‌లో ప్రపంచ మతాలలోని సమైక్యభావనకు గొప్ప రూపకల్పన చేశాడు హైందవం, ఇస్లామ్, బౌద్ధం, జైనం, క్రైస్తవం, సిక్కిజం, జోరాష్ట్రియనిజం, జుడాయిజం-ఇలా ప్రతి ఒక్కదానికీ ఒక్కొక్క పెద్ద పానెల్ సృష్టించాడు 1995లో ఈ "థియోరమా" ఆవిష్కరణకు వచ్చిన అమెరికన్ కళాపోషకుడు హెర్విజన్, హుసేన్ చిత్రప్రదర్శనపై వ్యాఖ్యానిస్తూ "ఇది 20వ శతాబ్దంలో సృష్టించిన గొప్ప కళా ఖండాలలో ఒకటి స్పానిష్ అంతర్యుద్ధకాలంలో పాబ్లో పికాసో సృష్టి "గుయెర్నికా" చిత్రానికి మాత్రమే హుసేన్ కళాఖండం సరిపోలుతుంద"న్నారు! నాటి యుద్ధ బీభత్సకాండకు "గుయెర్నికా" ప్రాతినిధ్యం వహిస్తే, నేటి కల్లోల భారతంలో మత సామరస్యాన్ని ప్రబోధించింది హుస్సేన్ మహా కళాఖండం! అంతేగాదు, భారతీయతను జీర్ణించుకొనబట్టే హుసేన్ మహాభారత ఘట్టాలతో, కాళిదాస రచనలతో ఉత్తేజం పొందాడు ఆమాటకొస్తే "భారతం బొంకు, రామాయణం రంకు" అన్న నానుడినీ వ్యాప్తిలో పెట్టింది హైందవాన్ని ప్రేమించే వాళ్ళేగానీ, అది హుసేన్ లాంటివాళ్ల వాక్కు కాదు! సుప్రసిద్ధ చిత్రకారులైన రాజా రవివర్మ "విక్టరీ ఆఫ్ ఇంద్రజిత్" అయిల్ కాన్వాస్ చూడండి! చేమకూర సత్యనారాయణ రాధాకృష్ణుల చిత్రం చూడండి! సీమాంతరాలు ప్రయాణిస్తే పాశ్చాత్య దేవతామూర్తులను, స్త్రీపురుష సంగమ దృశ్యాలుగా కళాకారులు మలచడం చూస్తారు! జీవితాన్ని పీలికలుగా గాక సమగ్ర స్వరూపంలో చూడదలచిన రచయితలూ, కళాకారులంతా రియలిజం (వాస్తవికత)తో పాటు సరియలిజాన్ని (అధివాస్తవికతను) కూడా పక్కవాటు జాడ్యంగా ఆశ్రయించినవారేనని మరవరాదు లియోనార్డ్ ద విన్సీ మోనాలిసా, రింబా "నైట్‌వాచ్"లతో పాటు, 16వ శతాబ్దం నాటి "రోకబీ వీనస్", 20వ శతాబ్దంలో పికాసో "అవిగ్నాన్", "ది రోజ్ పిరియడ్", విలియమ్ బ్లేక్ "గుడ్ అండ్ ఈవిల్ ఏంజిల్స్", షేక్ రహ్మత్ అలీ "జామి కవలలు", ఫ్రాంక్ ప్రాజెట్టా "గోల్డెన్ గరల్", అనిబల్ కర్సీ "వీనస్-అడొనిస్", డిలా క్రాయిస్ "సార్డనా పాలస్" క్లిమిట్ "గోల్డ్ ఫిష్"- హుసేన్ అర్ధనగ్న చిత్రాలు కొన్నింటిని మరిపిస్తాయి! మన సంస్కృతిలో అందరం ఆమోదించి అనుక్షణం ఆనందిస్తున్న నగ్నాకృతిలో ఉన్న దేవాలయ శిల్పకళకూ, ఖజురహో, భువనేశ్వర్, కోణార్క్, లింగరాజ్ శిల్పాలకూ అలంపురంలోని "యోని"దృశ్యాలకూ జేజేలు పలుకుతూ హుసేన్ కళాఖండాల విధ్వంసనకు దిగడం ఆధునిక కళపై హిట్లర్ జరిపిన దాడిని గుర్తుకు తేవడమే మహారాష్ట్రలో కినీ హత్యకు కారకులై, కినీ భార్య ఆత్మక్షోభను చల్లార్చలేని పాలకులూ, రాజస్థాన్‌లో ఆదివాస మహిళ థాబో బాయ్‌ని సామూహిక అత్యాచారానికి గురిచేసిన కంట్రాక్టర్లనూ, వారి తైనాతీలనూ శిక్షించలేని పాలకులూ హుసేన్ పెయింటింగ్స్ మీద విరుచుకు

పడడం హాస్యాస్పదం! "లింగ" ప్రస్తావనలేని దేవతా స్తుతి మనకిలేదు. స్త్రీని అవమానించే కొన్ని "ప్రభాత"గీతాల్లోని కుచ వర్ణనలు వినడానికీ చదవడానికీ వెగటు అనిపించడంలేదా? దేవాలయాల్ని సంగమ క్రీడామందిరాలుగా మార్చి, పవిత్రమైన దైవభక్తికి సంభోగాన్ని మన పెద్దలు కొలబద్దగా పెట్టడం అసహ్యంగా లేదూ? బృహదారణ్యక ఉపనిషత్తు స్త్రీ అధోభాగాన్ని యజ్ఞవేదికగా భావించమన్నప్పుడు మన మనస్సులు ఎందుకు మొద్దుబారిపోయాయి? మర్మావయవాలను పూజార్హం చేసిన మన పెద్దలు ఏ కోవకు చెందుతారు? ఏది ఏమైనా హేతువు మన కలాలను, కుంచెల్ని నడిపించాలిగాని ఉద్రేకపరిచే 'అతి'ధోరణులు కాదు హేతువును ఆశ్రయిస్తే 'అతి' సద్దుమణగిపోతుందని బోలియూ అన్నాడు *("Perfect reason avoids all extremities")!* పాతకాలం పోయింది ఆ విలువలూ మారిపోతున్నాయి కనుకనే నాగరికం కావడానికి ప్రయత్నించాలి ఇటీవల హుసేన్ కూడా కళాఖండాలను పెద్ద రేట్లకు (మరికొందరు ఇతర భారతీయ కళాకారుల మాదిరే) అమ్మి సొమ్ము చేసుకోవడానికి అలవాటు పడ్డారు! మార్కెట్ ఎకానమీ జాడ్యం ఆయనకీ సోకింది! అందుకే "ఆధునిక చిత్రకళకు సినిమా ప్రోత్సాహక శక్తి"అని హుసేన్ గొప్పగా చెప్పుకోబోయారు! ఇది తప్పుడు సమర్థన చిత్రకళారీతుల్ని చలన చిత్రరంగమే అనుసరించింది హుసేన్ కళాఖండాలు కొన్ని లాభదృష్టితో సాగిన వాణిజ్య సృష్టి కావచ్చునేమోగాని, అజంతా, కోణార్క్ శిల్ప కళాసృష్టికి మూలం ధనార్జనకాదు, జ్ఞానార్జన, జీవితానందం అని మరవరాదు! అయితే సృజనను అడ్డుకోరాదు సృష్టిని ఆపితే స్థితి నిలవదు, స్థితి లేకపోతే లయం లేదు సృష్టి, స్థితి, లయ మయమే ఈ ప్రపంచం సృష్టి సవరణకు లొంగుతుందేమోగాని, నిర్బంధానికి, సంహారానికి లొంగదు, లొంగదు

ఆదివారం 13, అక్టోబర్ 1996

# దాశరథి వచన వేదం!

వేదాలే బ్రాహ్మణత్వానికి మూలం, ధనం లోక వ్యవహారానికి మూలం అన్నారు (వేదమూల మిదం బ్రహ్మం, ధనమూల మిదం జగత్)! నిజానికి ఈ రెండు మూలాలూ లోకాన్ని, జన జీవితాన్ని అనాదిగా అటో ఇటో కుదుపుతూ వస్తున్నవే! వేదాభ్యాసం "ఉత్తమ లోకాలకు" చేరుస్తుందన్న విశ్వాసమే సుప్రసిద్ధ రచయిత, పండితుడు, నవలాకారుడు అయిన దాశరథి రంగాచార్యను వచనంలో మొదటిసారిగా ఋగ్వేద సంహిత అనువాదానికి ప్రోత్సహించి ఉంటుంది వేదాలకు అనువాదాలు ఇంతకుముందు ఎన్నో వచ్చాయి వాటిలో కొన్ని అసంపూర్ణ పద్యానువాదాలు కాని సంపూర్ణ వచన రచనకు ఆద్యుడు రంగాచార్య కావడం ఇక్కడ విశేషం ఈ అనువాదంలో దాశరథి కలం భారతీయ విజ్ఞానాన్నీ, పలు తాత్త్విక చింతనలనూ అనేక సిద్ధాంతాలనూ, శాఖోపశాఖలనూ ఆరగించుకుని సొంత భావాలతో సొంత బాణీలో వేదానికి భాష్యం సమకూర్చింది ఆయని అంతర్మథనానికి ఈ ఋగ్వేదానువాదమే సాక్షి! భిన్నత్వంలో ఏకత్వాన్ని నమ్మిన రంగాచార్య విభిన్న తాత్త్విక చింతనల మధ్య సమన్వయం లేకపోయినా కనీసం సహజీవనం ఉందని అన్నింటినీ తనవిగానే భావించుకోగల విశాల దృష్టితో ఈ అనువాదానికి పూనుకున్నారనిపిస్తుంది సులభ శైలిలో, అతి సౌలభ్యంతో పొందుపరిచిన దాశరథి ఋగ్వేదానువాద వచన రచనకు శోభకూర్చిన మరొక అంశం-వేదంలోని అనేక సూక్తాలను స్వీయానుభవంతో పొందుపరిచిన ఆలోచనాధార అదే ఆయని 'ఆలోచనామృతం'! అయితే దాశరథి భాష్యంలో ముందుమాటగా సమకూర్చిన 'తొలికిరణం' లో అక్కడక్కడా కొన్ని భావ వైరుధ్యాలు లేకపోలేదు వేదాల విశిష్టతను, వాటి పుట్టుపూర్వాల్లోకి వెళ్ళబోయేముందు మరో దృక్కోణం నుంచి కూడా పరిశీలించవచ్చు ఎందుకంటే, వేదాల్ని ప్రమాణంగా వ్యతిరేకించే వారున్నారు, సమర్థించే వారూ ఉన్నారు కాని విశిష్టతల్లా ఈ ఇరు వాగులవారూ ఎటుచూసినా వేదాలవల్ల ఏదో విధంగా ప్రభావితులు కాకుండా ఉండలేకపోవడం! అది వైదిక సమాజంలో కుల, మతాల ప్రసక్తి లేదన్న విశ్వాసంతో, బ్రాహ్మణ, బ్రాహ్మణేతర అసమానత్వాన్ని తొలగించడం కోసం వేద వేదాంగాల్ని ఆంధ్రీకరించినవారు కూడా - వేద భాష్యాలలో పూడ్చరాని ఈ లోటును మాత్రం భర్తీ చేయలేకపోయారని అంగీకరించితీరాలి! వేదానికి ఎవరి భాష్యాన్ని సాధికారంగా భావించాలన్న ప్రశ్నకు ఈ రోజుకీ సంతృప్తికరమైన సమాధానం లేదు ఆర్య సమాజం వారి తరఫున కొన్ని అనువాదాలు వెలువడ్డాయి అన్నే కేశవాచార్య ఒకటి అనువదించారు కొందరికి రాజనీతి విశారదుడైన 14వ శతాబ్ది నాటి శయణాచార్యులు నమ్మదగిన వ్యాఖ్యాత కావచ్చు, నేమాని వేకంట నరసింహశాస్త్రి ఋగ్వేద సంహితను 'వాఙ్మయ బ్రహ్మ' వడ్లమూడి గోపాలకృష్ణయ్య సంపాదించి స్వతంత్ర భాష్యంతో పరిష్కరించారు అదీ పరిశీలకుల విమర్శలకు దూరం కాలేకపోవచ్చు, ఆ మాటకొస్తే దాశరథి వచన ఋగ్వేద రచన కూడా ఆధారపడింది ఆచార్య శాయణుడి సూక్తాలపైనా, వాటి వినియోగ పద్ధతిపైనే కాని ఇక్కడ కూడా పరిమితులున్నాయి దాశరథి విశ్వసించిన శాయణుడికీ, ఆ తరువాత ఆధునిక భారతీయ తాత్త్వికులకు తలమానికంగా భావించిన దయానంద సరస్వతి వేద భాష్యానికీ సంబంధం లేదు మళ్ళీ వివేకానందుడి భాష్యం వేరు ఇలా వేదాల గురించి ఏ ఇద్దరి భాష్యకారుల మధ్య ఏక వాక్యత లేదు. ఇందుకు ప్రధాన కారణం - వేదాలకు మూలం గురించీ, వాటి కాలనిర్ణయం గురించీ ఏర్పడిన వాదోపవాదాలే శాయణ భాష్యం దయానందుడికి నచ్చలేదు, వ్యతిరేకించాడు కాని ఆ శాయణ భాష్యమే దాశరథికి చాలావరకు ప్రమాణం అయింది! శాయనుడి లక్ష్యం పురాణ హైందవాన్ని పునరుద్ధరించడం, బ్రాహ్మణాలలోని యజ్ఞయాగాదుల్ని, కర్మకాండను తవ్వి

తలకెత్తుకోడం, జైన-బౌద్ధ చైత్యాల, విగ్రహాల స్థానంలో పురాణ దేవతా విగ్రహాలను ప్రతిష్ఠించడం, వేదాలు ఆధారంగా బహు దేవతారాధనను (చెట్టు చేమలు సహా) ప్రవేశపెట్టడం అయితే శాయణుడికీ, దయానందుడికీ మధ్య భావసామ్యం కొన్ని విషయాల్లో కుదురుతుంది- వేదం "దైవసృష్టి" అని ఉభయులూ నమ్మారు అలాగే ఉభయులూ వేదాలు స్థలకాలాలకు అతీతమని నమ్మినవారే కాని వేదాల్లో చరిత్ర, భూగోళ విషయాలున్నాయని శాయణుడు విశ్వసిస్తే, అలాంటివేవీ వేదాల్లో లేవని తెగేసి చెప్పినవాడు దయానందుడు! ఎందుకని? లిఖిత చరిత్రకు పూర్వమీమాంసే వేదాలన్నాడు దయానందుడు చివరికి 'గంగ', యమునలు కూడా కొన్ని "విలువలకు" ప్రతీకలేగాని, "పవిత్రత" దృష్ట్యా వాటిని చూడగూడదన్నాడు! శాయణుడితో విభేదించిన కారణంగానే దయానందుడి "ఋగ్వేద ఆది భాష్య భూమిక" రచన ఆనాటి భారతీయ తాత్త్వికలోకంలో పెద్ద భావ విప్లవానికి దారితీసింది. అతి ఛాందస వర్గాల్లో అది కల్లోలం రేపడమేగాక వేదాలకు చెప్పే భాష్యధారనే మార్చివేసింది! తంత్ర శాస్త్రాన్ని, "వామ" మార్గాన్నీ వ్యతిరేకించినవాడు దయానందుడు, వివేకానందుడిలా అన్ని మతాల సారాన్ని ఈయన వడపోశాడు బౌద్ధ, జైన, చార్వాక, క్రైస్తవ, ఇస్లామ్‌లతోపాటు హైందవ సమాజంలోని కులాల కుళ్ళునూ, మతాల మాత్సర్యాన్నీ, దురాచారాలనూ కడిగివేయడానికి ఉద్యమించాడు ఈ విశిష్ట ప్రయత్నానికి ఆదర్శ రచన ఆయని "సత్యార్థ ప్రకాశ్". సదాశయ సాధన కోసం ఆయన నెలకొల్పిన "ఆర్య సమాజం" కాలక్రమంలో బౌద్ధ శాఖల మాదిరిగా ఆచరణకు దూరంగా జరిగిపోయి అచేతనంగా ఉండిపోవచ్చుగాక అంతమాత్రాన దాశరథి భావిస్తున్నట్టు దయానందుడు ప్రచలితం చేసిన స్ఫూర్తి, భావనాశక్తీ వృధా పోయినట్టు భావించరాదు దాశరథి ఒకచోట చెప్పినట్టు "సహజీవనం"చేసిన విభిన్న తాత్త్విక చింతనల్లో దయానందుడి భాష్యమూ ఒకటని మరవరాదు! అన్ని విజ్ఞాన శాఖల సారాంశమే 'వేదం' అన్నాడు దయానందుడు కొన్ని హైందవ ధర్మాలపై విసుగెత్తి ధ్వజమెత్తిన దయానందుడు స్వధర్మంలోని లోటుపాట్లు తెలుసుకొన్నాడు కనుకనే "సత్యార్థ ప్రకాశ్"లో-"ఏ ధర్మాన్నీ (రెలిజియన్) కూల్చడం, ప్రతిఘటించడం నా లక్ష్యం కాదు ప్రతీ మత ధర్మంలోని సత్యాన్ని, అసత్యాన్ని తులనాత్మకంగా పరిశీలించి నిగ్గుదేల్చడం నా ధర్మం సత్య ప్రతిష్ఠాపనకు మించిన ఉద్దేశం నాకు లేదు" అన్నాడు! వైదిక ధర్మాలకు ఎక్కడ తెగులు పట్టిందో చెబుతూ "పురాణాలొచ్చి వైదిక సూత్రాలను తారుమారు చేశాయి, విగ్రహారాధనను, పురోహితులను, ఛాందస కర్మకాండలను ప్రవేశపెట్టి హైందవ సమాజాన్ని ముక్కలు చెక్కలు చేయడం ద్వారా పురాణాలు సమాజానికి చెరపరాని హాని కలిగించాయి దీని ఫలితంగా అంతర్గత కలహాలతో చితికిపోవలసి వచ్చింది" అన్నాడు దయానంద సరస్వతి కనుకనే ఛాందసాలకు దూరంగా ఉండే 'వేదం' ఆయన వేదనగా మారింది. వేదం 'దైవదత్తం' అని భావించి కూడా దయానందుడు ఛాందస కర్మకాండనూ, యజ్ఞయాగాదుల్నీ ఈసడించుకున్నాడు శాయణుడు కూడా వేదం "ఈశ్వరప్రోక్తం" అని విశ్వసించినా ఛాందసధోరణులను వదులుకోలేక పోయాడు! అలాగే జైమిని లాంటి మహాముని దేవుడిని అంగీకరించకపోయినా ఆదివేదాన్ని ప్రమాణంగా తీసుకున్నాడు! సంప్రదాయానికి అనుగుణంగా లేకపోయినా దాశరథి "వేద ప్రతిష్ఠాన్" (ఢిల్లీ) వారి సంహిత ఆంగ్లానువాదాన్ని అనుసరించారు, చౌఖాంబా విద్యాభవన్ వారి గ్రంథాన్నీ తన వచనానువాదానికి ఆధారం చేసుకున్నాడు అయితే వేదం ఎప్పటిదో, ఎన్నడు మొదలైందో తెలియదని చెబుతున్న రంగాచార్య ఇతరులను "వాస్తవ సంప్రదాయాలకు అపార్థాలు కల్పిస్తున్నార"ని ఆరోపించకూడదు. ఎందుకంటే "వేదాలు అపౌరుషేయాలు" (మనుషులు రాసినవి కావు) అన్న విషయంలోనూ, మన నాగరికతకు, మన వేదాలకు పాశ్చాత్యులు వక్రభాష్యాలు చెప్పారనీ, ఆర్య అనార్య వాదాన్ని వాళ్ళే లేవనెత్తారనీ చెప్పే విషయంలోనూ ఎన్నో భేదాభిప్రాయాలున్నాయి

ఎందుకంటే దాశరధి అన్నట్టు "వేదం అనాగరికమానవుణ్ణుంచే" వస్తే అది విజ్ఞాన సంపుటం ఎలా అయింది? వేదాలు "అపౌరుషేయాలే" అయితే భరద్వాజ, వశిష్ఠ, విశ్వామిత్రాదులు రుక్కులను ఎలా రచించినట్టు? "అపౌరుషేయాల"కన్నా 'అసామాన్యాలు' సరైందికాదా? కాని దాశరథే చెప్పినట్టు వేదసూక్తుల్ని వివిధ రుషులు వివిధ సమయాల్లో "దర్శించి అక్షరబద్ధం" చేసినప్పుడు ఇంకా "అపౌరుషేయం" ప్రసక్తి దేనికి? అంతేగాదు, రుషి విన్నదే రాశాడు కాబట్టి రుగ్వేదరచన నాటికే 'లిపి' ఉందని మరొక వాదన! అయితే వేద రచన ఆర్యుల రాకకు ముందు జరిగిందా? ఆ తరువాతనా? అన్న అసలు ప్రశ్నకు వచ్చే సమాధానం మీదనే 'లిపి' వాదనకు సరైన సమాధానం దొరుకుతుంది! కాలగర్భంలో కలిసిన ఒక నాగరికతకు, సభ్యతకు, సంస్కారానికి దివిటీ పట్టిన సమాజానికి ప్రతీక వేదం అని నమ్మినప్పుడు ఆ కాలం ఏదో మనం స్పష్టం చేసుకోగలగాలి! కాని రుగ్వేద రచన ఆర్యుల రాక తరువాతనే, సింధునాగరికతను ధ్వంసంచేసి, "సప్త సింధు" ప్రాంతాల్లో ఆర్యులకన్నా ముందునుంచీ స్థిరనివాసం ఏర్పరుచుకుని వర్ధిల్లుతూ వచ్చిన అనార్య జాతుల ప్రజలపై దండెత్తి వారిని లోబరుచుకున్న తరువాతనే, వారి జీవనాన్నీ, పురాలను ధ్వంసంచేసిన తర్వాతనే 'నాగరికుల' పేరిట ఆర్యుల ఆధ్వర్యంలో ప్రారంభమైన రచనే - రుగ్వేద సంహిత అని పలువురు పండితుల అభిప్రాయం! అంటే ఆర్యులరాక క్రీస్తు పూర్వం 1500 అని రాహుల్ సాంకృత్యాయన్ లాంటి మహాపండితులు, పురావస్తు శాస్త్రవేత్తలూ నిర్ధారిస్తుండగా మన దాశరధి "కలియుగాన్ని" నమ్ముకోడంగానీ, వేదసంహితం క్రీస్తుపూర్వం 6,000 ఏళ్ళనాటిదని విశ్వసించడంగానీ హేతుబద్ధంగా ఉంటుందా? మన పరిశీలనకు అందని కాలాన్ని మన సిద్ధాంత నిరూపణకోసం వేల సంవత్సరాలు వెనక్కి నెట్టేయవచ్చా? అలా నెట్టివేయడంవల్ల మన జాతికి జరిగే నష్టం ఒకటికాదు, ఎన్నో! బ్రిటిష్ వాడు మన దేశాన్ని చీల్చడంకోసం పాలనా యుగాల్ని-మొగలాయీ యుగమనీ, హిందూయుగమనీ, బ్రిటిష్ యుగమనీ విభజించడంలో సఫలీకృతుడయ్యాడు అలాగే రుగ్వేద రచనా కాలాన్ని అలా వెనక్కి జరిపేయడంవల్ల ఒక వర్గం ప్రాముఖ్యాన్ని ఉగ్గడించి, ఇతర సామాజికుల, వర్గాల ప్రాధాన్యాన్ని తక్కువచేసినట్లవుతుంది 'హైందవం' పేరిట, ఇస్లామ్‌పేరిట నేడు జరుగుతున్నదీ అదే చరిత్రలో తరచుగా జయించిన జాతి ఓడిపోయిన జాతితో పొత్తు కలుపుకొనలేక పోయినప్పుడు వర్ణభేదం ఏర్పడుతూ వచ్చిందన్నాడు రాహుల్జీ నిజానికి "సప్తసింధు"లో (పంజాబ్ - హరప్పా, మొహంజదారో నాగరికత) ఆర్యుల వల్ల జరిగిన పని అదే! అప్పటివరకూ, ఆర్యుల రాకముందువరకూ ఉన్న ఉన్నతమైన ప్రాచీన సంస్కృతికి అద్దంపట్టిన ఆర్యేతర ద్రావిడులతో, ఇతర తెగలతో ఆర్యులు తగాదాలకు, దాడులకు దిగి వారి సంస్కృతిని ధ్వంసం చేశారని కొందరు పండితులవాదన ! అంతేగాదు, రానురానూ వేదాలకు అర్థాలు చెప్పడానికి భారతీయులు తప్ప పాశ్చాత్యులు అర్హులుకారన్న వాదనను కూడా క్రమంగా ప్రచారంలో పెట్టారు కొందరు ఛాందసులు, ఇది తప్పుడు వాదన ఈ విషయంలో ఎవరికన్నా కూడా మనకు రాహులీజనే ప్రమాణంగా తీసుకోవలసి వుంటుంది పశ్చిమయూరప్‌లోని ప్రాచీన గ్రీకు, లాటిన్ భాషలకు, నేటి జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలైన భాషలకూ వైదిక భాషతో సంబంధాలున్నాయి. అందువల్ల వేదార్థాన్ని తెల్పడానికి ఈ భాషలన్నింటికీ అధికారం ఉందన్నాడు రాహుల్జీ ఆర్యుల్లో (భారతీయ ఆర్యుల్లో) ఒక శబ్దానికి దేనికైనా అర్థం వాడుకలో లేకపోతే అందుకు సమానమైన, సరైన అర్థం భారతదేశానికి వెలుపల ఉన్న ప్రాంతీయ భాషల్లో, లేదా జానపదభాషల్లో వాటి ప్రయోగం దొరుకుతుందన్నాడు. మన సంస్కృత ధాతువుల ఎన్నో ప్రయోగాలు ప్రాచీన సంస్కృత సాహిత్యంలోగానీ, నవీన సంస్కృత ధాతువుల్లోగానీ కనపడవు. కాని బయటి భాషల్లో ఆ ప్రయోగాలు న్నాయన్నాడు దానికి ఉదాహరణగా

ఆయన 'దబాయించు' అనే ధాతువును చూపాడు. ఇది మన ఆధునిక భాషలన్నిటిలోనూ వాడుకలో ఉంది. రష్యన్‌లో కూడా ఉంది! 'దబ్ల్యాత్' పదం హిందీలో 'దబానా' అయింది (కాని సంస్కృతంలో దాని ప్రయోగమే లేదట)! ఈ సత్యాన్ని మనకు జైమిని అనుభవమే రూఢపరుస్తోంది. వేద పక్షపాతి అయిన జైమిని మహర్షి వేదాల్ని పరమ ప్రమాణికాలుగా భావించి కూడా శబ్దానికి అర్థాలు చెప్పడానికి ఎన్నో చోట్ల ఆర్యుల ప్రయోగాల్ని వదిలేశాడు. అనార్యుల ప్రయోగాల్నే అంగీకరించవలసి వచ్చింది! ఆమాటకొస్తే దాశరథి కూడా ఉమ్మడి సంస్కృతికి భాష్యం చెప్పవలసి వచ్చేసరికి మనందరికన్నా గొప్ప సమన్వయంతో ముందుకు ఉరుకుతాడు. ఆయన కొన్ని తాత్త్విక చింతనల్ని, సిద్ధాంతాల్ని నిర్మూలించిన స్వార్థపరుల్ని విమర్శించాడు. దేశంలో మిశ్రమ సంస్కృతికి కారకులయిన మహమ్మదీయ పాలకులు భారతీయులై సంగీత సాహిత్యాల్లో మనల్ని ఎలా ప్రభావితం చేసిందీ వివరించాడు. ఆదిశంకరుని అద్వైతం, రామానుజుని విశిష్టాద్వైతం, చైతన్య ప్రభువు, తులసీదాస్ రామాయణం, సూరదాస్ తెలుగు భారత, భాగవత రచనలు, ఇలాంటి తత్త్వచింతనా మహమ్మదీయుల కాలంలోనే వర్ధిల్లాయని గుర్తుచేస్తూ. అలాగే భారతీయ చింతనతో ప్రభావితులైన ముస్లిం సూఫీ కవులూ, ఉపనిషత్తులు, అనువదించిన మహమ్మదీయ కవులున్నారని మంచిగా సమన్వయం చెబుతాడు. అంతకన్నా గొప్ప ప్రకటన - ఆదిశంకరుని అద్వైత (దేవుడొక్కడే) చింతనకు ఇస్లామ్ మత ప్రభావమే కారణం అని చెప్పడం! కాని ఇన్ని తెలిసిన దాశరథి ఋగ్వేద రచనాకాలాన్ని కాలియుగారంభానికి నెట్టడం - బుద్ధుడికి సమకాలీనుడుగా చిత్రించి బుద్ధుడుకంటే గొప్పవాడని నిరూపించడంకోసం శంకరుని జన్మదినాన్ని బుద్ధుడి జన్మకాలానికి కొంచెం అటూ ఇటూగా కొందరు జరిపినట్టుగానే ఉంది! కనుకనే రాహుల్జీ "ఋగ్వేదార్యులు" అన్న విశిష్ట రచనలో లౌక్యంగా పేర్కొన్నట్టు-"ఆర్యులు భారతదేశానికి బయటనుండి వచ్చారని ఒప్పుకోకపోతే 'ఆర్య' భాషతో పారివారిక సంబంధం ఉన్న భాషల వారుకూడా ఇక్కడ నుంచి వెళ్ళారని అంగీకరించవలసి వస్తుంది. దీనివల్ల ఇంకా అనేక సమస్యలు తలెత్తుతాయి. వాటికి సమాధానం, సమన్వయం కష్టం. ఆర్యుల భాష, భారత-ఐరోపా(ఇండో-యూరోపియన్) భాషలు, వాటికి సంబంధించిన ఇతర సామగ్రి-వీటిలో శ్రద్ధలేకపోవడంవల్లనే పై అభిప్రాయానికి కారణం! ఈ కారణంచేతనే మన శాస్త్రవేత్తలు కలియుగాన్నీ, మహాభారత కాలాన్నీ విశ్వసించి చరిత్రను వేల సంవత్సరాలు వెనక్కి నడిపించడానికి ప్రయత్నించారు. వాస్తవానికి ఆసియా మైనరులో హిట్టైటులు, గ్రీసులో యవనులు, ఇరాన్‌లో ఇరానీయులు ప్రవేశించిన కాలాన్ని పరిశీలిస్తే ఆర్యులు భారతదేశంలో ప్రవేశించింది. క్రీ.పూ.1500కంటే పూర్వం కానేకాదని తెలుస్తుంది"!! రంగాచార్య "తొలికిరణం"లో ఒక మాట అన్నారు: లోగడ నలుగురు పెద్దలు కలిసినప్పుడు అనుకునేవాళ్ళట - మన వేదాలు ఎత్తుకెళ్ళి హిట్లర్ బాంబులు తయారుచేశాడని, హిట్లర్ మనవాడు, ఆర్యుడు, అతడే గెలవాలి, మళ్ళీ మన వేదాలొస్తాయి, అని అనుకునేవారట!! మొత్తం మీద ఆర్యవంగడం చాలా గొప్పదనీ, అది వర్ణ వ్యవస్థను రద్దుచేసే బదులు అందరికీ 'నామాలు' పెట్టిందనీ దీన్నిబట్టి అర్థం అవుతుంది. 'వేదం' చాటుచేసుకొని చాతుర్వర్ణ వ్యవస్థను పెంచినదానికి స్పష్టమైన ఉదాహరణ - ఋగ్వేదంలోని తొలి తొమ్మిది మండలాల్లో లేని నాలుగు వర్ణాల పేర్లూ పదవ మండలంలో ఎవరు చేర్చినట్టు?! ఎవరు, ఎందుకీ ప్రక్షిప్తానికి పాల్పడ్డారు? అంతేగాదు, ఋగ్వేదకాలంనాటి చారిత్రక సామాగ్రిని తారుమారు చేసే పాడుబుద్ధి యజుర్వేద కాలంలోనే ప్రారంభమైందన్న పండితుల మాటే నిజమైతే వైదిక వాఙ్మయం ఆధారాలనే ప్రశ్నించవలసి వస్తుందేమో! ఏది కల్పితం? ఏది అకల్పితం?

ఆదివారం 19, జనవరి 97

# గాంధీ తరంలో గరిమెళ్ళ, గరీబోడు.....

కపటమైన బతుకులతో గడుపుతున్న ఈతరం దృష్టిలో చచ్చినవాడి కళ్ళు చారెడేసి! మొసలి కన్నీటితో మహనీయులకు వర్ధంతులు, జయంతులూ జరుపుకొంటున్న తరం మనది కంపునోటి[illegible] సంపాదిస్తే కమ్మని నోటివాడు ఎగదన్నుకుపోయాడట భారత స్వాతంత్ర్య సమరానికి తమ సర్వస్వాన్ని వొడ్డి, ఇల్లూ, వొల్లూ గుల్ల చేసుకున్న యోధులూ తెలుగుయోధులూ ఎందరో! అందులో [illegible] భావసమైక్యతా ప్రకటనతోనే సరిపెట్టుకొనక, స్వాతంత్ర్య సమర శంఖారావం పూరించిన కవి సమరవీరులలో అగ్రభాగంలో నిలిచిన వ్యక్తి "జాతీయ గేయకవి సార్వభౌమ" గరిమెళ్ళ సత్యనారాయణ ఆయని శతజయంతి 1992 జూలైలో జరుగుతున్న సందర్భంగా రెండేళ్ళు ముందు మాత్రమే మనకు జ్ఞాపకం వచ్చి ఈ నెల 15న మనవాళ్ళు జయంతి జరుపుకోవలసి వచ్చింది అంటే గాంధీ తరానికి చెందిన ఉద్యమ కవిసార్వభౌముడు గరిమెళ్ళను, చనిపోవడానికి ముందు (1952కు ముందు) ముప్పయ్యేళ్ళు ఎవడూ పట్టించుకోనట్టే, ఆ తరువాత ముప్పయ్యొనిమిదేళ్ళుగా కూడా గరిమెళ్ళ ఊసులేదు మనకు! ఈనాటి మన 'సంస్కృతి' కళ్ళకు ఒకనాటి బడిపండితుల బతుకు, అతను పెరిగి, విరిగిన పరిస్థితులు, జైలు జీవితం ఆనకపోవడం సహజం ఎందుకంటే జాతిపితనే మరచిపోయిన దేశంలో, స్వాతంత్ర్యోద్యమంనాటి గాంధీజీ నిర్మాణ కార్యక్రమానికి స్వరాజ్య సాధన తరువాత కూడా 'సున్న' చుట్టిన దేశంలో గరిమెళ్ళగానీ, అతని త్యాగంగానీ గుర్తుకు రావలసిన అవసరం లేదు! బహుశా అందుకనే విశ్వనాథకు గరిమెళ్ళ గుర్తుకు వచ్చినప్పుడు అరమరికలు లేకుండా ఒక మాటన్నాడు ఆ అన్నదేదో భోళాగా, ధైర్యంగా అన్నాడు: జాతీయోద్యమంపట్ల (విశ్వనాథ) అభిమానం ఉన్నవాడినేగాని కొంపా గోడూ మాత్రం వదిలిపెట్టుకున్న వాడిని కాననీ, తనకు తాను ఉద్యమానికి బలైనవాడే నిజమైన దేశభక్తుడనీ విశ్వనాథ, అన్నాడు, అంతేకాదు, నాయకుడు కావడం కోసం స్వార్థంతో ఉద్యమాలలో చేరే బాపతు ఉంటారనీ, కాని, వారిలో దేశం ఆత్మగానీ, సంస్కృతిగానీ ప్రతిబింబించదనీ చెప్పాడు, ఈ బాపతు వారు "విచిత్రమైన స్వార్థపరుల జాతి, వంట తినెడివారు వేరు, పండించెడివారు వేరు", ఆ పండించెడి వారిలో కవితా రూపంలో పండించినవారు "గరిమెళ్ళ శిఖామణి" అని, ముందాయనను చెప్పిన తరువాతనే ఇతరులను చెప్పాలనీ విశ్వనాథ అన్నారు!

1920-29 సంవత్సరాల మధ్యకాలం జాతీయ స్వాతంత్ర్య సమరంలో గడ్డుకాలం తెల్లవాడి ఆగడాలు పెచ్చుమీరుతున్న దశ, భారత జాతి మూకుమ్మడిగా పరాయి పాలకుల పాశవికతను సమయానుకూలంగా, సందర్భానుసారంగా సాత్త్విక ధోరణిలోనూ, అవసరాన్ని బట్టి వీరోచితంగానూ ఎదుర్కొనడానికి సమాయత్తమవుతున్న సమయం అది జనరల్ డయ్యర్ జలియన్‌వాలాబాగ్‌లో జరిపిన నరబలి, వెంటనే ప్రారంభమైన రౌలట్ చట్టం, ఆ దరిమిలా గాంధీజీ పిలుపునందుకొని సాగిన శాసనోల్లంఘనోద్యమం, అసహాయోద్యమం, చౌరాచౌరి కాల్పులు, తెలుగుదేశంలో పన్నుల నిరాకరణోద్యమం, పల్నాడులో కన్నెగంటి హనుమంతు తెల్లవాడికి సింహస్వప్నంగా అవతరించడం, రైతులు, వ్యవసాయ కార్మికులు, విద్యార్థులు, మేధావులు, లాయర్లు, డాక్టర్లు అంతా ఉద్యమంలోకి దుముకుతున్న ఘడియలవి, ఆనాటి కవి ఉద్యమ కార్యకర్తలకు ఈ ఘట్టాలేగాక, విజయవాడలో అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభలూ, ఖద్దరు ఉద్యమం, తిలక్ నిర్యాణం, ఆ తర్వాత తిలక్ స్వరాజ్యనిధి వసూళ్ళ

కార్యక్రమం కూడా కవితా వస్తువులై అద్వితీయ ప్రచార సాధనాలుగా ఉద్యమ ఉద్ధతికి తోడునీడై నిలిచాయి ఆ ఊపులోనే త్యాగధనుడైన గరిమెళ్ళ జాతీయగేయకవి సార్వభౌముడుగా అవతరించాడు. గాంధీ నిర్మాణ కార్యక్రమంలోని ప్రతి అంశానికీ - అస్పృశ్యతా నిర్మూలన, నూలువడకడం, ఖాదీ ప్రచారం, మద్యపాన నిషేధం, హరిజనోద్ధరణ, విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ పరిశ్రమాభివృద్ధి - గరిమెళ్ళ స్పందించాడు ఆ స్పందనలో కూడా కొరుకుడుపడని పాటలను గాక, జానపద గేయ ఫణితులలో ఉద్యమ ప్రచార కవితలు సామాన్య ప్రజలకు, కార్యకర్తల మనస్సులకు హత్తుకునేటట్టుగా, పాడుకోడానికి అనువైన పల్లవితో, అనుపల్లవితో గరిమెళ్ళ కలం కదం తొక్కించాడు ఆనాడు రాష్ట్రగానం, జాతీయ గీతం చేయని, ఆలాపించని కవిలేడు, దేశభక్తి కవితలో గురజాడ తొలికవికాగా, గరిమెళ్ళతోపాటు బలిజేపల్లి, రాయప్రోలు, చెన్నాప్రగడ, మంగిపూడి, చిలకమర్తి, గడియారం, తుమ్మల, జాషువా, దువ్వూరి, త్రిపురనేని, ఏటుకూరి, అబ్బూరి, వానమామలై, కాళోజి, దాశరథి, వేదుల, మధునాపంతుల, ధవళ శ్రీనివాసరావు, గురజాడ రాఘవశర్మ లాంటివారు స్వాతంత్ర్య సమరానికి ప్రచార కవితలు అందించినవారే

కాని ప్రజా బాహుళ్యానికి అతి దగ్గరగా, అర్థమయ్యేలా ప్రచార కవితలను లయబద్ధంగానూ, సందేశాత్మకంగానూ మలచిన బహుకొలది మంది కవులలో గరిమెళ్ళ అగ్రగణ్యుడు రాగబద్ధం గానూ, తాళయుక్తంగానూ వాటిని మలిచాడు, పల్లెపదాలు, కోలాటపు పాటలు, జానపద గేయాలు, బాలగేయాలు, రామదాసు కీర్తనలు, శృంగార గేయాలు, మంగళహారతులు, మేలుకొలుపులు, గుమ్మడి పాటలు, బొబ్బిలిపాటలు, సెలయేటి పాటలు, లాలిపాటలు, జోలపాటలు - అతని వాణికి బాణీలు సమకూర్చి పెట్టాయి! గరిమెళ్ళ "మా కొద్దీ తెల్లదొరతనము - దేవ" చరణాన్ని పల్లవిగానూ, "మా ప్రాణాలపై పొంచి - మానాలు హరియించె" చరణాన్ని అనుపల్లవిగానూ రాసిన పాట ఆనాటి ప్రతివారి నోట నానిన మాట ప్రచార పాటను బట్టి కవి ఎవరో శ్రోతలు చెప్పగల గౌరవం ఆనాటి వారిలో గరిమెళ్ళ తరువాత- "భరత ఖండంబు, చక్కని పాడియావు" రాసిన చిలకమర్తికి, "కొల్లాయి గట్టితేనేమి, మా గాంధి కోమటై పుట్టితేనేమి" రాసిన బసవరాజుకు, "వీర గంధము తెచ్చినారము, వీరులెవరో తెల్పుడీ" రాసిన త్రిపురనేనికి, "అంటరాని వారెవరో కాదు, మా వెంట రానివారె" అన్న మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రికి దక్కుతుంది గరిమెళ్ళ "పాంచాలం" పాట, "మాతృస్తవం", "గాంధీ", "స్వరాజ్యం", "సైతాను ప్రభుత", "రాజ్యమేలుదాము రారా", "కొయ్యోడ గీతం" దేనికదే సాటి ఆ పాటలలో ప్రతిఫలించిన ఆనాటి ఆశయ ఆదర్శాలకు నేడు మన తరంలో ఎదురవుతున్నవన్నీ ఆటంకాలే నాడు విదేశ వస్తు బహిష్కరణ, నేడు విదేశ వస్తువులకు ఆదరణ, స్వదేశీ పరిశ్రమాభివృద్ధి నాడు మన ధ్యేయం, నేడు బహుళ జాతి సంస్థలకు ప్రోత్సాహం మన ఆదర్శం! "నిమ్న జాతుల నెత్తుమోయి - వారు నీరసించిన యెడల నిక నీకు గోయి" అనీ, "హస్త నిపుణతను ధ్వంసం చేసిన / పరుల చేతలకు బానిసలగుదుము" అని, "ఆంగ్ల విద్యమాని, అల-ఆంగ్ల దుస్తుమాని / ఆంగ్ల కల్లుమాని అల - ఆంగ్లేయతమాన"మనీ గరిమెళ్ళ అన్నాడు! నేడో! తెల్లవాడి "ఆంగ్ల కల్లు" పోయినా, నల్లవాడి "ప్ర సా దు " లు (ప్రభుత్వ సారా దుకాణాలు) వీధికొకటి వెలసాయి, "గాంధీ చెప్పిన త్రోవ నడువురా" అని బోధిస్తూ "కోర్టు సంబంధము" విడిచిపెట్టి, ఆ కూపంలోపల కూరుకుపోవద్దని ఆయన హెచ్చరిస్తే, లిటిగేషను, కరప్షనూ జాతీయం అయి కూర్చున్నాయి

నాడు! నాడాయిన మతసామరస్య భావనను ఉద్దీపనగా 'ఇస్లాము కీర్తిని ఇగురెత్తజేదాము / విశ్రమముగను నీ విశ్వమునుంబయు'' అని గొంతెత్తి చాటగా స్వార్థ రాజకీయాల కోసం నేడు మతకల్లోలాలకు పాలక పక్షాలే ఆశీస్సులు పలుకుతున్నాయి, పరోక్షంగా ప్రోత్సాహమిస్తున్నాయి 'మాతృస్తవం'' అసహాయోద్యమ కీర్తిని ప్రస్తుతించుతూ రాసిన ఉత్తమ గేయం "వందనమిదె గైకొనుమూ భారత జననీ / యుద్ధ శకము బాపునట్టి బుద్ధిశాలివీ/ బుద్ధిశాలివీ - అనిరుద్ధ ప్రజ్ఞవీ / స్వారాజ్యం కనుగొనిన, సత్యమూర్తివి సత్యమూర్తివీ అసహాయమూర్తివీ'' అని కీర్తించాడు ఇలా గరిమెళ్ళతో పాటు అనేక ఖండకావ్యాల ద్వారా "స్వరాజ్య సమస్య''ను వివరించి, మారణకేళిగా మారిన "నవకాళి''కి సాగిన గాంధీ యాత్రను విజయ కాహళిగా కీర్తించి, 'స్వరాజ్య ఢంకా''లు మోగించి, "స్వరాజ్య నవనీతా''లు, "స్వరాజ్య తాంబూలా''లు పంచి, "గీతామృతా''లు అందించిన వారెందరెందరో ఉన్నారు!

జూలై 22, 1990

# మాట అమృతకావ్యంగా, పాట పరమ గానంగా....

క్షామములెన్నివచ్చిన రసజ్ఞత మాత్రము చావలేదు/జ్ఞానామృత వృష్టికిన్ కొరతనందని రాయలసీమలోపలన్ - అని ఏనాడో నండూరి కృష్ణమాచార్యులన్న మాటలు ఎప్పటికీ అక్షర సత్యాలే నేటికి సరిగ్గా ముప్పయ్యేనిమిదేళ్ళనాడు పండిట్ నెహ్రూ క్షామపీడిత రాయలసీమలో పర్యటన్తూ రాయచోటిలో మకాం వేసినప్పుడు మన పుట్టపర్తి నారాయణాచార్యులను కలుసుకొన్న ఘడియలివి "మీ రాయలసీమలో కరవు పరిస్థితులున్నమాట నిజమేగాని మీలాంటి మహాకవులున్నచోట రాయలసీమ సాహితికి మాత్రం కరవుండద"ని 1952లోనే చమత్కరించాడు నెహ్రూ అయితే శనివారంనాడు (సెప్టెంబర్ 1) అస్తమించిన "సరస్వతీపుత్ర" పుట్టపర్తి నారాయణా చార్యులను ఒక్క రాయలసీమకే ధృవతారగా భావించడంగాని, ఆ మూర్తిని ప్రాంతీయం చేయడంగాని తగదు ఆయన భారతీయత పుణికిపుచ్చుకున్న సర్వాంధ్ర కవికోకిల సాహితీ రంగంలో అనాదిగా అగ్రస్థానంలో ఉన్న సీమ సారస్వతేయులలోని విశిష్టగుణాలకు, అఖిలాంధ్ర కవుల స్వతంత్ర ప్రతిపత్తికీ వారసుడు పుట్టపర్తి పదకవితలు, సంకీర్తనా సాహిత్యంలో అన్నమయ్యకు, ప్రౌఢసాహితీ సౌరభాలు వెదజల్లడంలో రామరాజభూషణునికి, సరస కవితలలో, చతుర శృంగార కవితలలో కవిచౌడప్పకూ పుట్టపర్తి వారసుడుగాక, కరుణ వీర రసాలకూ మానవతా దృక్పథానికీ జయస్తంభంగా నిలిచిన మహాకవి కూడా హరీన్ ఛటోలా, సరోజినీదేవిలా నిన్నగాక మొన్ననే చనిపోయిన సీమాంతర కవయిత్రి మాదమె పేపన్స్ స్ట్రాంగ్‌లాగా పుట్టపర్తి కూడా బాలకవి, బాలరసాల కవి సృష్టిలో, ఈ చరాచర ప్రకృతిలో అనుక్షణ స్పందనకు సంకేతంగా, ఈ సర్వప్రపంచమూ కదలికలో ఉందని నిరూపించడానికి ప్రతిరూపంగా శివుణ్ని భావించుకున్న పుట్టపర్తి సంగీత, సాహిత్య, నాట్య సంకేతాలతో రాసిన "శివతాండవం" ఓ మహారచన తాండవ లాస్యాలకు ఆదిగురువైన "శివుణ్ణి" ఆయన సంబోధించిన తీరు, ఆయని చేష్టలను తేట మాటలో, ఆట పాటలతో లయబద్ధంగా వర్ణించిన తెన్నూ అనితరసాధ్యం అనిపిస్తుంది మాట అమృత కావ్యంగా, పాట పరమగానంగా సాగిన రచన అది నిజానికి "శివతాండవం" రచనలో పుట్టపర్తిలో స్పందనకు బీజం ఆయన అంతకు ముందు రాసిన "పాద్యము" అన్న ఖండకావ్యంలోనే ఉంది 'పాటల జటాభరణంబు శిరీషమాలపై / పై లయ సూప కన్బొమల చంచుచు నాట్యము దీర్తువేమి? నీ మనను పజ్జలనే తలపుల్ ఫలించురా! కూరిమి నా యెడెంద గుడి గోపురముల్ వెలిగించి వేయరా" అని ఈశ్వరుడ్నే ప్రార్థిస్తాడు! గుడి గోపురాలలో దీపకాంతులు పెట్టడంతోపాటు కడలి తరగల్లా సుడులు తిరుగుతూ, అడుగడుగునా సరిగమలు పలికిస్తూ "శివతాండవం" చేపట్టి "స రి సా /పద పాప సరిగ నెత్తులు ముడిచి" తాను ఆడింది శివుడుగా, పాడింది భవుడుగా విజృంభించాడు! సీమలో, జాతీ యోద్యమ దినాలలో గళమెత్తి కలంపట్టిన అగ్రగామి కవుల రచనలలో "రాణాప్రతాప" కావ్యం చెబితే రాజశేఖర శతావధాని పేరు చెప్పక్కరలేదు, "శివభారతం" పేరువింటే "గడియారం' మన చెవులలో మోగవలసిందే, ఆ తరువాత "శివతాండవం" స్ఫురణకు వస్తే పుట్టపర్తి పేరు వీనులవిందు చేయవలసిందే' ఇంతకూ నాటికీ, నేటికీ విశేషమేమంటే - బహు భాషావేత్త, మహాకవి అయిన పుట్టపర్తి "శివతాండవం" భాగాలు కాటూరి వారి "తెలుగు కావ్యమాల" సంకలనంలో గాని, ముద్దుకృష్ణ "వైతాళికులు" (ఏడవ ముద్రణ) లోగానీ చోటు చేసుకొలేకపోవడం! నిద్రపోతున్న వాడిలో చైతన్యం

కలిగించడానికి, అన్యాయంపై క్రోధజ్వాలలు కక్కడానికి, అక్రమాలపై ధ్వజమెత్తడానికీ ఆదర్శమూర్తి అయిన నటధూర్జటి తాండవ లాస్యాలకు మాట, పాట, ఆటలతో కావ్యగౌరవం కల్పించిన మొనగాడు పుట్టపర్తి కనుకనే అతని కావ్యధార అమృతవాహినిగా సాగిపోతుంది

"నవ వసంతపు శోభ భువి గప్పికొన్నట్లు / శివుచెంత శర్వాణి సిగ్గు జారినయట్లు / కన్నెమది కోరికల కలలు దూకినయట్లు / సన్న జాజుల తీరు సంధానమైనట్లు / ప్రతిగజ్జె యెడదలో భావములు పులకింప / ప్రతి భావమున రసమువారి దిక్కుల ముంప/ ఆడెనమ్మా శివుడు / పాడెనమ్మా భవుడు"!!

అంతేగాదు, గతించిన విజయనగర విమలకీర్తి ప్రభలనూ, పెనుగొండ దుర్గశోభలను రాళ్ళపల్లి ఒక విధంగానూ, పుట్టపర్తి వేరొక దృక్పధంతోనూ వర్ణించారు "పెనుగొండ" భిన్నకోణాల నుంచి ఉభయులనూ ప్రభావితం చేసిన సానబెట్టిన బండ! అనంతకృష్ణశర్మ దృష్టిలో అది శాత్రవులు "రక్తధారలు త్రాగి త్రేచిన ఆంధ్ర కన్నడ రాజ్యలక్ష్ముల అరితి నీలపుదండ" అయితే, పుట్టపర్తి భావనలో అక్కడి ప్రాచీన వైభవము, గగనమహలు "రాయల పాదముద్రలు తలదాల్చి సొంపులు దిద్దుకొన్నట్టి కలికిమిన్న/తెలుగు ఢంకాలు మ్రోగిన దివ్యభూమి "

పుట్టపర్తి "పెనుగొండ లక్ష్మి" వయస్సులో కొడాలివారి "హంపీక్షేత్రం" కంటే పదిహేనేళ్ళు పెద్దదైనందున క్షేత్రప్రశస్తికి చెందిన కావ్యరాజాలలో తొలి పుష్పంగానే భావించుకోవచ్చు! అలాగే, సంగీత, సాహిత్య, నాట్య సంకేతాలలో, కావ్యగతిలో పుట్టపర్తి "శివతాండవం" ఎంతగా భక్తపోతన "భోగినీలాస్యం" రచనను స్ఫురింపజేస్తున్నప్పటికీ, వర్తమాన సాంఘిక పరిస్థితులకు అనుగుణంగా మానవతా దృష్టితో సులభశైలిలో సాగిన పుట్టపర్తి ఖండకావ్యం "మేఘదూతం" ప్రజారంజకమైన రచనగా చెప్పి తీరాలి ప్రాచీనతలోని సుసంప్రదాయాలను ప్రేమించిన పుట్టపర్తి ప్రగతికీ, ఆధునికతకు దూరం కానివాడు, కాపిటలిస్టు ప్రపంచాన్ని "రాబందుల వ్యవస్థ"గా, అసుర ప్రపంచంగా భావించినవాడు పుట్టపర్తి తాను జీవిస్తున్న శతాబ్దంలో ఘటిల్లుతున్న పరిణామాలకు తాను కర్మసాక్షిగా మెలగాలనీ, సమకాలీన సమాజంలోని మంచి-చెడులకు తాను స్పందించి తీరాలనీ, స్పందనలేని జీవిబతుకు నిరర్థకమనీ స్పృహతో చాటిచెప్పిన వాడు పుట్టపర్తి కావ్యకాంతను ప్రేమించిన మనసుతోనే శాంతి దేవతనూ ప్రేమించాడు, యుద్ధాన్ని నిరసించాడు ఈశ్వరో పాసకుడైనా, ఈసురోమని బతుకులీడుస్తున్న తాడితులనూ, పీడితులనూ వలకరించాడు. అతని "పురోగమనం" ఖండకావ్యం మానవాభ్యుదయ సాహితికి మరొక హారతి జైలులో ఉన్న రాజకీయ ఖైదీ దూరాన ఉన్న భార్యకు ('ఇన్‌ఫార్మెంటు'గా మారే మనిషిని నమ్మలేక') "మేఘం" ద్వారా పంపిన సందేశం "మేఘదూతం" రాజకీయ కార్యకర్త జైలుకు ఎందుకు వెళ్ళవలసి వస్తుందో చక్కని గేయఫణితిలో చెప్పాడు "తన వంటి మానవుల దైన్యమే సుఖశయ్యగా/వారి నిట్టూర్పు గాడ్పులే చామరలుగా/వారి కన్నీట గరగు దినములపైని నిలిచి 'మేమూ మానవుల' మంచు గొంతెత్తి/ మార్చు ధనికుల జూచి అసురులని యన్నాడు - వాడు మానవుడూ!" అంతేగాదు, బాల కార్మికుల గోడు వినిపించాడు, పోషకాహారంలేక చిక్కిశల్యమైపోయిన ఒక తల్లి, తన బిడ్డకు పాలింకిపోయిన స్తనాలను అందించినప్పటి వేదన మన గుండెలను పిండివేస్తుంది "తెలినవ్వులందగుల / జలికించు మొగముపైని / పాల్గారు యేడ్చుచున్నాడూ - బుడతండు/ పట్టుదల కెత్తికొన్నాడూ - ఆ తల్లి [illegible] / [illegible] జీర్ణి రక్తముబితే త్రావునో, ధనికు లేమొగుగుదురు?!

ఇంతటి హేతుదృష్టి, తర్కపటిమావున్న మరో వ్యక్తి, పుట్టపర్తికి దీటైన కవయిత్రి, ఆయని సతీమణి కనకమ్మ కూడా! ఆమె స్వయంగా "యశోధర", "రాతిరథం" కావ్యాలు గుప్పిస్తే, వాగర్థాల వాగై ఉభయులూ కలిసి "అగ్నివీణ" మీటారు! ధర్మానందకోశాంబి సుప్రసిద్ధ మరాఠీ రచన "బుద్ధ భగవానుడు" తెలుగులోకి తెచ్చిన ఘనత మన పుట్టపర్తిదే బుద్ధుని చరిత్రపై బయలుదేరిన ఎన్నో అపోహలకు, అబద్ధాలకు ఆధారాలతో చెప్పిన సమాధానం ఆ గ్రంథం ఈ అభినవ వాగనుశాసనుడికి 'పద్మశ్రీ'లు, డిగ్రీలూ మనలను మనం గౌరవించుకోడానికే గాని ఆయన ప్రతిభకు కొలమానాలు కాజాలవు ఆంధ్రుల గుర్తింపు వెనుకబడినప్పుడు మళయాళ కవి సూరనీడు కుణ్ణన్‌పిళ్ళై బాధపడుతూ పుట్టపర్తి గురించి చెప్పిన మాటలు ఎవరికైనా వర్తిస్తాయి "రత్నం తనను తాను అమ్ముకోడానికి సంతకు పోదు, రత్నం కావాలనుకున్నవాడు దాన్ని వెతుక్కుంటూనే రావాలి" ఆయనకు జ్ఞానపీఠ్ అవార్డు వస్తే ఎంత రాకపోతే ఎంత? అన్ని విజ్ఞాన శాఖలలో మాదిరే తాలుతప్పలకు తేడా తెలియకుండా ప్రతిభా పురస్కారాలు పైరవీకారుల చేతి ఎత్తు బిడ్డలై సాగిపోతున్న ఈ రోజులలో, కవితారంగంలో కూడా 'బినామీ' పురస్కారాలు అవతరిస్తున్న ఈ రోజులలో - ఆ అవార్డు రాకపోవడం పుట్టపర్తి అదృష్టం! పుట్టపర్తి ఒకచోట "తెలుగు రాయడు" పూర్వ వైభవాన్ని తలచుకొని వర్తమాన పరిస్థితులను చూచి క్రుంగిపోతూ "బాష్పస్నిగ్ధముగ్ధాంజలుల్" సమర్పించుకోలేదూ! మనం చేయవలసిన పనీ అదే!!

మంగళవారం 4, సెప్టెంబర్ 1990

# 'వరద' కాదు, సెలయేరుల కలకలం....!

ఒక్కొక్క రచన చేయడానికి ఎంతటి ధిషణ, ఆర్ద్రత కావాలి, మరెంతటి అనుశీలన, అనుభూతి, అనుకంపన అవసరం! అందులోనూ స్థలకాలాదులకు అతీతంగా పలుపురు ప్రసిద్ధులతో, పరిసరాలతొ ఏర్పడిన పరిచయాలనూ, అనుభవాలనూ అప్పటికప్పుడు లిఖితం చేయడం కాదు, కొన్ని దశాబ్దాల తర్వాత ధారణశక్తితో, "రసనాగ్రనర్తకి"లా మననం చేసుకొని అకుంఠితంగా కలాన్ని నడిపించడానికి ఎంతటి సాధన కావాలి! అలాంటి కృషిలో అగ్రతాంబూలం అందుకోగల రచనలు అటు మొన్నటి వరకూ రెండే రెండు - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి "అనుభవాలూ - జ్ఞాపకాలూ", శ్రీశ్రీ "అనంతం" కాగా, మొన్నటి రచన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి "గౌతమీ గాథలు", ఆ తర్వాత చెప్పుకోదగింది నిన్నటి, నేటి రచన అబ్బూరి వరద రాజేశ్వరరావు "కవన కుతూహలం"! యుద్ధంలో కదన కుతూహలమూ, సాహిత్య సమరాంగణంలో 'కవన కుతూహలమూ' ఒకే కోవకు చెందుతాయి! శ్రీ వరద రచన ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఒకటి రెండు దశాబ్దాలకు పూర్వం "స్వర్ణయుగం'గా భావించుకున్న "ఒక మహోజ్వల ఘట్టంతో "సంబంధం ఉన్న సాహితీ స్రష్టల గురించిన జ్ఞాపకాలు మాత్రమే కాదు, ఇది రొడ్డ కొట్టుడు పద్ధతిలో వెలువడిన ఆత్మకథ అంతకంటే కాదు, పరనిందా రచన అసలే కాదు, రెండు దశాబ్దాలకు కాదు, అగణితమైన సంఖ్యలో వరద పేర్కొన్న కవులూ, రచయితలు, నాటక కర్తలూ ఇందులో బారులు తీరి పాఠకులకు అజ్ఞాతనేత్ర దర్శనం చేయడానికి 'క్యూ'లో నిలబడడం చూస్తే - ఇది, సాహిత్యావలోకనంలో అయిదు దశాబ్దాలకు ప్రతినిధిగా నిలబడుతుంది అయితే ఆ పనిని శ్రీ వరద సాహిత్య సిద్ధాంత, రాద్ధాంతాలతో బాధించే ప్రక్రియతో కాకుండా తనకు సహజమైన చతురిమతో, హేళన అనిపించని పరిమిత అవహేళనతో, పరదాలు తొలగించి సరదాగా సాధించారు! సాహిత్య వివేచన, విమర్శన, హాస్య ప్రియత కలబోసిన రచన ఆయన కవిత్వమేమోగాని, తెలుగు సాహిత్యం బతికున్నన్నాళ్ళూ పాఠకుల మనస్సులపై చెరగని ముద్ర వేయగల రచనగా "కవన కుతూహలం" నిలిచిపోతుంది విశాఖ, మదరాసు, ఢిల్లీ, తెనాలి, గుంటూరు, బెజవాడ, ఇత్యాది నగరాలలో ఎక్కడ సాహిత్య సభ్యులు జరిగినా, గోష్ఠులు జరిగినా అదొక 'వ్యసనం' గా కాళ్ళు కదిపి, విజ్ఞానఖనీ, మహాపండితుడైన తండ్రి అబ్బూరి రామకృష్ణారావుకు తగిన సాహిత్య పుత్రుడుగా ఆ సభలలో పాల్గొని, గడించిన ఎన్నో అనుభవాలకు అక్షరరూపమే ఈ గ్రంథం ఈయనకు ఎవరెవరితో పరిచయం అంటే చెప్పడం కష్టం! ఒకరా, ఇద్దరా! వారిలో కొందరు తన సమకాలికులయితే, మరికొందరు తండ్రి రామకృష్ణారావుగారి వృద్ధ సాహితీమిత్రులు! ఆ సంపర్కం ఈ రచన ద్వారా వరదలో ఆచంద్రతారార్కం కావడానికి అవసరమైన సంభారాలూ, వాతావరణమూ అలా కుదిరాయి ఇందులో ప్రాచీన, అర్వాచీన, పాశ్చాత్య సాహిత్యోద్యమాలతో కవితా ధోరణులతో మునిగి తేలుతున్న వారంతా వరద రచనా వైశిష్ట్యంవల్ల మీకు ఎంతో పరిచయస్తుల్లా ఎదురై పలకరిస్తారు! అదొక సాహితీ ఇంద్రధనుస్సు అబ్బూరి సమకాలికులైన రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభృతులతో పాటు ఆధునిక సాహిత్య వ్యవసాయాన్ని సుసంపన్నం చేస్తూ వచ్చిన శ్రీశ్రీ, శిట్లా, జలసూత్రం, ఆరుద్ర, మల్లవరపు, ఏల్చూరు, తిలక్, బైరాగి, బెల్లంకొండ, అజంతా, దాశరథి, నారాయణరెడ్డి, నగ్నముని ప్రభృతులూ, వారి కవితా విన్యాసాలూ, వాటిపై వరద ఉరవడిలో నడిచిన 'వరద' భాష్యపరంపరా మనల్ని గిలిగింతలు పెడతాయి! అందుకే ఇది కొలదిమందికి పరిమితమైన అనుభవ పేటిక కాదు, ఆంధ్రదేశమంత వెడల్పూ, తెలుగు సాహిత్యమంత లోతూ ఉన్న

అపురూపమైన రచన అని చెప్పడం రాత్రింబవళ్ళు చర్చలలో, కవితా విన్యాసంలో గడిపి తిండీ తిప్పలెరుగని అనేకమంది కవులకు, రచయితలకు తన యిల్లే ఆశ్రయంగా జీవించిన, నేటికీ జీవిస్తున్న శ్రీ వరద రచనా పద్ధతి, కమ్మని వచన శైలీ, ధారాశుద్ధి ప్రశంసనీయం ఆ మాటకొస్తే, నేటికీ ఎందరో యువకులను, పరిచయమైతే చాలు ఎడంపెట్టని మనీషి వరద ఈ విషయంలో ఆయనకుండే ఉత్తమ సంస్కారి, రచయిత్రి అబ్బూరి ఛాయ దేవి ఈ రోజుకీ అతను "అబ్ధి ఘోషలో శబ్ద తరంగం"గానే ఉన్నట్టుంటారు!! ఒక తరానికి తండ్రితోపాటు కౌమారదశలోనే కవి కుమారుడై తన తరానికి వరద ఒక ఇన్‌స్పిరేషన్‌గా మారాడు కనుకనే శ్రీ అజంతా చెప్పినట్టు "ఆయా కవి ప్రముఖుల జీవితాలలో రసవత్తర సన్నివేశాలను, వచో వైభవ స్మృతి విశేషాలను అనితర సాధ్యమైన రీతిలో" శ్రీ వరద గ్రంథస్థం చేయగలిగారు

ఇలాంటి రచనకు, అనుభవ నైవేద్యాలకూ సీమాంతరాలలో పోలిక బెర్నార్డ్ లెవిన్ "కండక్టెడ్ టూర్" అతనిది వాగ్గేయకారుల కుటుంబం కాకపోయినా ప్రసిద్ధ రచయితగా యూరప్‌లో 12 సంగీతోత్సవాలకు హాజరైన లెవిన్ సాహిత్య గుబాళింపులతో రసవత్తర ఘట్టాలతో సంగీత సమీక్షలు చేశాడు అలాగే 1920-30 లలో పారిస్ సాహిత్య గోష్ఠులకు నిలయమై ఒక తరాన్ని అమితంగా ప్రభావితం చేసి సిల్వియా బీచ్ నెలకొల్పిన "షేక్స్పియర్ అండ్ కంపెనీ" ప్రచురణ సంస్థ ఈ సందర్భంలో గుర్తుకు రాకమానదు అబ్బూరివారి ఇల్లు మాదిరే ఒక దశలో అదొక కవన మందిరం, కావ్య తీర్థం దాన్ని పావనం చేసిన ప్రముఖులు - జేమ్స్ జాయిస్, టి ఎస్ ఇలియట్, ఎజ్రాపౌండ్, జోన్స్, లీపాల్ ఫార్గ్, జాపోల్ సార్త్, లూయీ ఆరగాన్ అలాగే అమెరికాలో హెమింగ్ కోహెన్ "అమెరికన్ రచనల్లో మైలు రాళ్ళు" *(Landmarks in American Writing)* అన్న గ్రంథం కూడా శ్రీ వరద రచన మాదిరే సాహిత్యం, లలితకళలు, రాజకీయ ధోరణులకు సంబంధించిన ఎన్నో అంశాలను ఎరుకపరుస్తుంది వాల్ట్‌విట్‌మన్‌లా వరద అవసరమైన చోట్ల ఎంతటివారినైనా 'వడ్డించకుండా' వదిలింది లేదు! అయితే ప్రజల సమస్యలతో బొత్తిగా సంబంధంలేని భావకవితా ధోరణికి చెందిన 'వరద' వచన కవితను "మిల్లు ఖద్దరు"గా అవహేళన చేయడం, అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని కేవలం "నినాదబ్రహ్మ"గా ఈసడించుకోవడం ఆయనలోని కొంటెతనానికి నిదర్శనం! అజ్ఞాతంగా ఉండవచ్చుగాని 'నాదం' కూడా ఒకరకమైన నినాదమేనని మరవకూడదు!! ఇది శ్రోత సంస్కార సంబంధి! ఈ రోజున "కంటెప్ట్" పేరిట కోర్టులకెక్కి సాహిత్య విమర్శనే అడ్డుకోజూస్తున్నారుగాని, రామకృష్ణ కవులూ, తిరుపతి కవులూ 'ఢీ'కొన్న సన్నివేశాలను మరచిపోతున్నారు కొన్నాళ్ళక్రితం ఇంగ్లాండులో "బ్లూమ్స్‌బరీ" సాహిత్యమండలి (గ్రూపు), బ్రిటిష్ రచయితల, కవుల, కధలూ, గాధలూ యధాతథంగా అచ్చువేసి ముందు తరాలకు మహోపకారం చేసింది ఆ పనిని ఇక్కడ కూడా చేయాలన్న శ్రీ వరద తలంపు "కవన కుతూహలం"తో ఒక మేరకే నెరవేరింది ఇప్పటికైనా "తీరిక చిక్కితే" అన్న పదాన్ని ఆయన మానుకుని తీరిక చేసుకొని ఈ పుస్తకంలో ప్రస్తావించని పెక్కుమంది తన సన్నిహితుల కధలూ గాధలూ కూడా ప్రచురించి తీరాలి ఇది అనుశాసనం! అంతవరకూ మనం -

"సెలయేరుల కలకలముల
చిరుగాలుల మృదుగీతల
మంజులమగు నీ పలుకులె
మదికి దోచురా!"
అనుకుంటూ ఉందాం !!

జూన్ 25, 1989

# చిరంజీవులూ - చింతాజీవులూ !

పోయిన నీటికి కట్టకడితే ప్రయోజనం ఉండకపోవచ్చు! కాని పోయిన ప్రాణికి, పోగొట్టుకున్న తన దానికి, తన వాడికీ, ఆత్మీయతకి ఏదో రూపంలో "చంద్రునికో నూలు పోగు"లా స్మృత్యంజలి ఘటించడం లోకంలో రివాజు ఓ కవి చనిపోతేనో, మరో నాయకుడు దివంగతుడయితేనో మాత్రమే రాసేది స్మృతి గీతమో లేదా స్మృతి కావ్యమో కాదు కనీసం ఆ వివక్ష "ఎలిజీ"కి లేదు తల్లి పోయినా, భార్య పోయినా, కుటుంబ సభ్యుడు ఎవరు పోయినా ఆత్మీయతానుబంధాల లోతుపాతులనుబట్టి విషాద గీతికలు, వియోగ కావ్యాలూ, స్మృతికావ్యాలూ - అవే "ఎలిజీ"లు - చాలకాలంగా వెలువడుతున్నాయి ఈ శోక భరితమైన కవిత గ్రీకులతో మొదలయి ("ఎలిగాస్" - శోకం) మన పెద్దన, శ్రీనాధదులదాకా వచ్చి, ఆధునిక కాలంలో శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, విశ్వనాధులవరకూ కొనసాగింది శోకంలోకూడా ఆత్మాభిమానం జ్ఞప్తికి రాకుండా దిగాలుపడినవాడు అల్లసాని పెద్దన అయితే ("కృష్ణరాయలతో దివికేగలేక/ బ్రతికియున్నాడ జీవచ్ఛవంబనగుచు"), దీనావస్థలో తన ప్రాణాలు వదులుతూ చివర క్షణంలో కూడా దిలాసాగా ప్రకటించుకున్నవాడు శ్రీనాధుడు "(దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ/ అరుగుచున్నాడు శ్రీనాధుడమరపురికి")! 'ఎలిజీ'కి వస్తువు చావులే కాదు, ప్రేమలు, యుద్ధాలు కూడా కధావస్తువులుగా ఉన్నాయి 15,16 శతాబ్దులలో పాశ్చాత్య ప్రపంచంలో ప్రారంభమైన ఈ స్మృతికావ్యాలు పద్యరూపంలో ఉన్నాయిగాని వచన కవిత రూపంలోనూ, డైరీ (దినచర్య)ల రూపంలోనూ ఉన్నట్టు తోచదు మన "ద్విపద" కవితా లక్షణంతో పోల్చబడిన రెండేసి శ్లోకాల రూపంలో ప్రారంభమైన ఈ ఎలిజీలకు పాశ్చాత్య సాహిత్యకారులు *"elegiac distichs"* అని పేరు పెట్టుకున్నారు. ఈ తరహా కవితా ప్రక్రియను మనోభావాలకు బింబప్రతిబింబాలుగా *(Natural to a reflective mind)* కోల్‌రిడ్జ్ వర్ణించాడు. అంతెందుకు? మన వాల్మీకి "మా నిషాద" శ్లోకం శోకగీతం కాదా?! సుదీర్ఘ శోకగీతాలకు ముందు ఒకే ఒక్క వాక్యంగా (మిగతాది చెదిరిపోగా) భావితరాలకు మిగిల్చి వెళ్ళిన వియోగ గీతాకారుడు గాలస్ అంటారు ఇలా కడచిన మూడు శతాబ్దాలుగా, ప్రపంచ సాహిత్యంలో ఆంగ్ల కవితా క్షేత్రంలో థామస్ గ్రే మొదలు డబ్ల్యు హెచ్ ఆడెన్ వరకూ కుప్పలు తెప్పలుగా ఎలిజీలు రాసిపడేశారు మిత్రుడు ఎడ్వర్డ్ రాజు కోసం మిల్టన్ "లైసిడస్" రాస్తే, కవి కీట్స్ స్మృత్యర్థం షెల్లీ "అడొనాయిస్", ఆర్థర్ హాలన్‌కోసం టెన్నిసన్ "ఇన్‌మెమోరియమ్" రాశారు మేజర్ రాబర్ట్ గ్రిగరీకోసం డబ్ల్యు బి యేట్స్ ఒక స్మృతి కావ్యం రాస్తే ఆ యేట్స్ కోసం ఆడెన్ కవి మరో విషాద కవిత రాశాడు సహచరుడు ఎ హెచ్ క్లో కోసం మాత్యూ ఆర్నాల్డ్ "థిర్సిస్" అనే ఓ శోక కావ్యం *(MONODY)* రాశాడు ఎవరేది రాసినా ఏడుపులో కూడా అద్భుతమైన పదచిత్రాలు పుట్టించారు! "అంతిమ యాత్ర" లప్పుడు ఇటలీలో అద్భుతమైన ఎలిజీలు వెలిసాయట చనిపోయిన మహిళల గురించి, దివంగతులైన 'దేవకాంతల'గురించీ సెక్సటస్ అనే కవి తాదాత్మ్యంలో రచనలు చేశాడంటారు అయితే బతికున్నప్పుడు భార్యలను బాధలుపెట్టి బతుకు చాలించిన తరువాత బ్రహ్మాండంగా భార్యలను కీర్తిస్తూ పాటలూ, అవార్డులూ, ప్రకటించేవాళ్ళు కూడా నాడూ ఉన్నారు, నేడూ ఉంటారు ఈ రహస్యాన్ని కనిపెట్టిన కవి ఆడెన్ "మేధావి" పదానికి "భార్యను మోసగించినవాడ"న్న కొత్త అర్థాన్నిచ్చిన కవి ఆయనొక్కడే *("The word intellectual suggests straight away/A man who's untrue to his wife")!* అందుకనే కవితలో కనిపించే అతిశయోక్తి

వాస్తవ ప్రేమలో కనిపించదు కనుకనే శోకం శ్లోకంగా మారినా అది 'భావానందం'గా మాత్రమే తీసుకోవాలంటాడు జోసఫ్ ఎడిసన్! అయితే అంతమాత్రాన కవులందరూ అలాంటి బాపతేనని తీర్మానించుకోరాదు! అమలిన ప్రేమకు హద్దులుండవు భార్య మరణంతో మనస్సులో వెలితి భావించిన విశ్వనాథ గాద్గదికమైన కంఠంతో రాసుకున్న వియోగకావ్యం "వరలక్ష్మీ త్రిశతి" నీ కర్మకాండను భర్తగా నిర్వహించమంటావా, నీ కొడుకుగా నిర్వర్తించమంటావా" అని చనిపోయిన భార్యను ప్రశ్నించుకున్న విశ్వనాథ "ప్రాణ చలనంబున కింకను స్వస్తి చెప్పుదున్" అన్నాడే గాని ఆ తర్వాత నిత్యవ్యాపకాలేవీ మానుకోలేదు! ఆమెను "వెలుగురేక"గా తననొక మట్టి మనిషిగా, ఆమెనొక "సదాచారి"గా తనను దురాచార నిష్ఠుడిగా వర్ణించుకున్న విశ్వనాథకు ఆ క్షణంలో ఆమే సర్వస్వం, మరొక మూర్తినీ, వేరొక కీర్తినీ అతను ఊహించుకోలేడు! ఆ క్షణంలో, అతనికీ, అతని స్మృతిలో ఇతరులకూ వైట్‌లాక్ చెప్పినట్లుగా "కలలు కరిగిపోయినట్టూ" అంబరాలూ, ఆడంబరాలూ విరిగిపోయినట్టు" కన్పిస్తాయి *("These dreams passed and these pomps vanished")!* ఆత్మీయతకు దూరమైనప్పుడు కలిగే నిస్పృహను, ఆ ఎడబాటునూ తట్టుకుని తాను నూతన వాయువులను పీల్చుకుని ఇతరులకు కొత్త టానిక్‌ను అందించగల శక్తి ఏ ఆండ్రూ యంగ్‌లాంటి కొద్దిమంది కవులకో ఉంటుంది, అలాంటివారు నిర్జీవశక్తులకు జీవం పోస్తారు అలాంటి తెలుగు కవులలో చెప్పుకోదగినవారు శ్రీశ్రీ ఒకడు అతను కవితా ప్రాణమిత్రుడు కొంపెల్ల జనార్ధనరావుకు 'మహాప్రస్థానం' అంకితమిస్తూ రాసిన స్మృతిగీతం తెలుగు సాహిత్యంలో చెరపరాని మెరుపు అలాగే, అతను బాల గంగాధర తిలక్ అకాల మృత్యువాత పడినప్పుడు రాసిన ఎలిజీ "కవితా సతి నొసట నిత్యరస గంగాధర తిలకమ్"! అలాగే శ్రీదేవి మరణించినప్పుడు నాయని కృష్ణకుమారి రచన "ఏం చెప్పను నేస్తం"అనే స్మృతి గేయమూ

ఇవన్నీ ఒక ఎత్తు కాగా ఇటీవల కాలంలో కుందుర్తి అంజనేయుడి సురుచిర వచన కవితా విపంచిగా, విషాద, వియోగ కవితగా వెలసిన "హంస ఎగిరిపోయింది", రావూరి భరద్వాజ రాసిన "నాలోని నీవు", "అంతరంగిణీ", "ఐతరేయం" ఎలిజీలూ సుందరమ్మ కుందుర్తి భార్యగా, కాంతమ్మ భరద్వాజ సతిగా వారి వారి జీవితాలను ఎంతగా భర్తలు ప్రభావితం చేశారో ఈ రచనలు వెల్లడిస్తాయి కవిగా కుందుర్తి పదచిత్రాలు విషాదం మధ్యనే విచ్చుకున్న విచ్చుకత్తులు కాగా, దినచర్య (డైరీ) రూపంలో వెలువడిన తొలి 'ఎలిజీ'లుగా భరద్వాజ కలం వియోగ బాధ మధ్యనే సామాన్యుని దైనందిన జీవిత సమస్యలను మరిచిపోకుండా అతనిచేత వకాల్తా పట్టించింది భార్య మరణానంతరం ఈశ్వరపద జిజ్ఞాసువుగా మారినట్టు భరద్వాజ కనిపిస్తాడేగాని 'స్వార్థ చింతన' ఏ కోశానో లేకపోతే "భగవంతుడు కూడా నీ రూపంలో కనబడితే తప్ప నేనిప్పుడు గుర్తించలేను కాంతం" అని ఉండడు! ఆమెను అడ్డం పెట్టుకుని ఆయన లోక కార్యాలెన్నింటినో చర్చించాడు! ఈశ్వరుడ్ని ఏ పేరుతో పిలవాలో తెలియక భార్యకే అన్ని శక్తులూ ఆపాదించి కాంతం లేని బతుకును ధృవాలు కోల్పోయిన అయస్కాంతంగా తలచుకుంటాడు! ఇంత విషాదంలో కూడా అతని పద చిత్రాలకు మచ్చుతునక. "ఎంత అందంగా ఉన్నదీ ఉదయం! కుంకుమ చేను విరబూసినట్టుగా ఉన్నది" "ఈ వేళ చిరునవ్వు చిరిగిపోయిన వేళ / ఈ వేళ చిరుతరగ విరిగిపోయిన వేళ"!

అలాగే సుందరమ్మను కుందుర్తి కోల్పోయినవేళ చనిపోయిన తన "చిరంజీవి"కోసం తాను చింతాజీవిగా మారిపోయి "హంసపాడిన చివరి పాట"గా అద్భుత పద చిత్రాలతో ఇలా రోదిస్తాడు "నాతో పాటు చెరిసగంగా బరువుమోసి / నాతో పాటు చెరిసగంగా కరువుమేసి / ఒక మహా కవిత్వ దీక్షా పారమ్యపారవశ్యంతో / ఒడలు పుల్కరింత పూదోటలో వుయ్యాల లూగినప్పుడూ / ఎందుకులే యీ సొదంతా / ఎవడిక్కావాలి యీ యేడుపు గీత లు "!! నిజమే మరి, కవులూ, రచయితలూ కాబట్టి వీరు ఇన్ని విషాద గీతికలను అంత అందంగా రాసుకుంటారు. కాని జీవితం అందరికీ సమానమే రెక్కాడినా డొక్కాడక బతుకులీడుస్తున్న సామాన్యుల, నిరక్షరాస్యుల విరహ బాధలకూ, వియోగ గాథలకూ అక్షర తర్పణ చేసేవాడెవడు?! వాటిని అజరామరం చేసేవాడెవడు? ఎవడు?!

జూలై 30, 1989

# చిరుపల్లె విశ్వరూపం ఆర్.కె. "మాల్గుడి"!

పుస్తకాల పూర్వాపరాలను వెదుకుతూ ప్రసిద్ధ ఆంగ్లసాహిత్యవేత్త జె బి ప్రీస్ట్లీ పువ్వు పుట్టగానే ఎలా పరిమళిస్తుందో విశదీకరించాడు పంటరాలుబడిని నిర్ణయించేది విత్తనంకాదు, భూసారం! అలాగే సాహిత్య రచన వైశిష్ట్యానికి కొలమానం రచయిత సొంత ఆలోచనా, వ్యక్తిత్వ బలమూ ఇలాంటి శక్తివంతమైన "విత్తనాలు" స్వతహాగా భావుకులను, స్వీయానుభవంగల సాహితీ మూర్తులను విశ్వవేదికపైన నిలుపుతాయి సామాజిక పరిణామాలు వీరికి ఉద్దీపనలు మాత్రమేకాని, రాజకీయ సంక్షోభాలకూ ఉప్పెనలకూ వీరి శక్తియుక్తులు అతీతంగా ఉంటాయి అలా ఉన్నప్పుడే రచయితలో అజ్ఞాతంగా రూపుదిద్దుకుంటున్న ప్రతిభా వ్యుత్పత్తులు సాహితీ క్షేత్రంలో నూతన సృష్టికి అంకురార్పణ చేస్తాయి, అనుక్షణం స్పందిస్తాయి, ప్రతి స్పందిస్తాయి ఇటీవల 90వ జన్మదినోత్సవం జరుపుకొన్న సుప్రసిద్ధ భారతీయ ఆంగ్ల రచయిత, పాత్రికేయుడు, కథ, నవలా చక్రవర్తి అయిన ఆర్ కె నారాయణ్ పటువైన తన కథా రచనతో సాహిత్య భారతిని కదన రంగంలోకి ఉరికించిన వ్యక్తి ఆంగ్ల రచనా వ్యాసంగంతో "ఆంగ్లో ఫైల్స్"గా దేశంలోనే గాక విశ్వవ్యాపితంగా కూడా పేరొందిన బహుకొద్ది మంది ప్రతిభావంతులలో నారాయణ్, నైపాల్, రాజారావు, విక్రమ్ సేత్ ఉన్నారు బ్రిటిష్ వలస పాలనా ఫలితాలు ఇతరత్రా ఎలా ఉన్నా విశ్వసాహితీ విలువలను భారతీయ భాషలకు సంతరించి పెట్టడంలోనేగాక, వాటిని పరిపుష్టంచేసి, ఇంగ్లీషులో కూడా పాశ్చాత్యులకు దీటైన విధంగా ఇతి వృత్తంలో, శైలిలో, నిర్మాణంలో, కథా సంవిధానాన్ని అందమైన మలుపులు తిప్పడంలో వీరు చేయి తిరిగిన రచయితలుగా గణుతికెక్కారు సాహితీ విమర్శకుడు జాన్ ఉప్‌డైక్ అన్నట్టు కథా రచనగాని, నవలా రచనగాని ఒక విధమైన "గూఢచారిత్వమే", ఎందుకంటే కిటికీలనుంచి తొంగి చూసినప్పుడూ, లేదా ఎవరైనా పిచ్చాపాటి మాట్లాడుకుంటే చెవులొగ్గి విన్నప్పుడూ, ఎదుటివారు ఏం చేస్తున్నారో తెలుసుకోవాలనుకున్నప్పుడు - రచనా శక్తీ, ఆసక్తీ ఉన్నవాడికి కలం పెరపెరలాడుతుంది సామాజిక దృష్టి రచయితకి ఎంత అవసరమో, కష్టపడి పనిచేసుకునే వారికి కథా రచన ఉబుసుపోని ఒక డైవర్షన్‌కూడా అన్నాడు అర్ కె రచనకు ముడిసరుకు ఎక్కడినుంచి వస్తుందనే ప్రశ్నకు అర్.కె నారాయణ్, ఆర్ కె రామానుజం ఇంచుమించుగా ఒకే సమాధానం ఇచ్చారు. రచయిత కళ్ళూ, చెవులూ పనిచేస్తున్నంతకాలం భారతీయ సమాజంలో కథా రచనకు ఇతివృత్త దారిద్ర్యం లేదన్నది ఉభయుల భావనా. విభిన్న జాతులతో, సంప్రదాయాలతో, భిన్న దృక్పథాలతో, అనేక ఆచార వ్యవహారాలతో, పెక్కు తాత్విక చింతనలతో భిన్నత్వంలో ఏకత్వాన్ని అనుక్షణం ప్రకటించు కొంటున్న మన ఉమ్మడి సంస్కృతిలో కథకుడికి కావలసిన ముడి పదార్థం లభించకపోవడం అన్నది లేదు ఇది ఒక మూసలో పోసిన సమాజం కాదు, యాంత్రిక వ్యవస్థ అంతకన్నా కాదు. "పాత చింతకాయపచ్చడి" అసలు కాదు, ఉగాది పచ్చడిలాంటి తీపి-చేదుల విశిష్ట కలయిక, భారతీయ సంస్కృతి, వివిధ రంగులు వెదజల్లుతున్న వర్ణదర్శిని, సువర్ణమాల ఈ దృష్టి అర్ కె లో సునిశితమై, మూడు పూవులూ, ఆరుకాయలుగా వర్ధిల్లితూ రాబట్టే పల్లె పట్టుల్లో, పట్టణాలలో బ్రిటిష్ పాలననుంచి స్వాతంత్ర్య సిద్ధివరకూ, ఆ తరువాతా వస్తున్న జనజీవన పరిణామ క్రమాన్ని తన రచనా స్రవంతిలో అక్షర బద్ధం చేశాడు ఈ పనికోసం ఆయన సృష్టించిన పాత్రలద్వారా, వర్ణించిన వ్యక్తుల స్వభావాల దృష్ట్యా, ఎవరికివారు ఈ

కధ తనను గురించే రాసిందని గుర్తించకుండా ఉండడం కోసం కాలాన్ని కదిపినా స్థలాన్ని కదపలేదు! అయితే తన కధలకు ఆయన ఎంపిక చేసుకున్న ఊహాప్రదేశం-తాను పెరిగి పెద్దయిన మైసూర్ నగరం కాదు, ఒక ఊహామాత్రంగా కళ్ళముందు వచ్చి నిలిచిన "మాల్గుడి" కావ్యకర్తల కనసన్నులలో నిలిచిన ఒక అలకాపురి ఎలాగో, మరొక అరుంధతీ నగరం ఎలాగో అలా ఆర్.కె మానస కేదారంలో వెలసిన ఓ పల్లె, ఓ చిరు పట్నం "మాల్గుడి" అర్ధ శతాబ్దంగా పాఠకులను కవ్వించి కదిలిస్తున్న మాల్గుడి మరో మాటలో చెప్పాలంటే ఆర్.కె కలం చిందులవల్ల ఒక "గ్లోబల్ విలేజ్"గా మన కళ్ళముందు ఎదిగి వచ్చింది! ఇది దేశ పటాలలో కనిపించే పట్నంకాదు, అయినా ఆర్.కె "ఊహాసుందరి"గా ఉన్న ఈ ఆదర్శ ప్రాంతాన్ని దేశపటానికి ఎక్కించాలన్న ఆలోచనతో చికాగో యూనివర్సిటీ ప్రెస్‌వాళ్ళు ఇండియా పటంవేసి అందులో "మాల్గుడి"ని గుర్తించడానికి విఫలయత్నం చేశారంటే-మాల్గుడి కధలూ, వ్యధలూ, దేశ, విదేశీ పాఠకుల్ని ఎంతగా ప్రభావితం చేశాయో అర్ధంచేసుకోవచ్చు! నిజానికి మాల్గుడి దక్షిణ భారతంలోని ఏ చిరుపట్టణానికైనా ప్రతినిధిగా మనం భావించుకోవచ్చునని ఆర్.కె మనల్ని నమ్మించడానికి ప్రయత్నించాడు కాని అది ఇప్పుడు "గ్లోబల్ విలేజ్"కే ప్రతినిధి కాగల ప్రతిపత్తిని పొంది ఉంది కాబట్టే ఆర్.కె న్యూయార్క్‌లోని "వెస్ట్-23 స్ట్రీట్"లో కూడా మాల్గుడి వాతావరణాన్ని చూడగలుగుతున్న విశ్వమానవుడయ్యాడు! నవలా రచయిత్రి జాయిస్ కరోల్ వోట్స్ చెప్పినట్టుగా ప్రాణమే ఇంధనం, ఆ ఇంధనమే సృజనశక్తి వ్యక్తులుగా మనం పోయినా కళాఖండంద్వారా, బలమైన కథా సంవిధానం ద్వారా ఆ శక్తి చిరంజీవం అవుతుంది ఆలా తన కధల్ని, నవలలను అజరామరం చేసుకున్న రచనా శిల్పి ఆర్.కె నారాయణ్ ఒక విధంగా చూస్తే ఆర్.కె ఆదర్శకేంద్రమైన "మాల్గుడి" తామస్ మోర్ "ఉటోపియా" లాంటి ఆదర్శ పట్టణమే యూరప్‌లో వికాసనోద్యమం నాటివాడు మోర్ మధ్యయుగాల చీకటి తెరలు చీల్చుకొని సర్వరంగాలలో బయలుదేరిన పునరుజ్జీవనోద్యమ దశలో మోర్ "ఉటోపియా దీవి" *(Island of Utopia)* ని ఊహించి, ఆదర్శ పట్టణంగా తీర్చి దిద్దాలనుకున్నాడు మైసూర్ పూర్వ రంగంగా వలస పాలనా దశలను విదిలించుకొని తానూహించుకొన్న నవభారత దృశ్యానికి ఒక ప్రతీకగా ఆర్.కె ఆదర్శించిన పట్టణం "మాల్గుడి" అలాగే మోర్ "ఉటోపియా" సృష్టికి ఉద్దీపన కలిగించే ప్రాంతం అతను నివసించిన ఫ్లాండర్స్ నగరం! అయితే ఈ రెండిటికీ ఒక తేడా ఉంది "ఉటోపియా" సృష్టి లక్ష్యం - సామాజిక, ఆర్థిక, రాజకీయ స్వతంత్ర ప్రతిపత్తిగల ఒక సమతా వ్యవస్థ కాగా జీవన సమరంలో ప్రజల ఈతి బాధలు, సుఖదుఃఖాలు, నాయకుల, అధికారుల దాష్టీకాలు, దౌర్జన్యాలు, మోసాలు-వీటిని ఛేదించుకొని బయటపడగల ఆత్మస్థయిర్యాన్నీ, మనో నిబ్బరాన్నీ అందజేయగల వాతావరణ సృష్టి "మాల్గుడి" ధ్యేయం విలియమ్ ఫాక్నర్ మనో మందిరంలో వెలసిన ఆదర్శ ప్రాంతం "యోక్నా పటాఫా కౌంటీ" ఇదీ మన "మాల్గుడి"కి సమ ఉజ్జీయే! రాజారావు కధల్లో చూపించిన 'కాంతాపురం' కూడా మరో "మాల్గుడి"! అందుకే ప్రసిద్ధ నవలా కారుడు గ్రాహంగ్రీన్ మన ఆర్.కె రచనలకు అమెరికాలో ప్రచురణ భాగ్యం కల్పించడమే కాకుండా రష్యన్ కధకులు తుర్గనీవ్, చెహోవ్‌లతో పోలుస్తూ "మాల్గుడి"ని ఎవరికివారు ఎక్కడున్నా తన సొంత ఊరుగానే భావించు కుంటారన్నాడు! అదొక విశిష్టమైన కాల్పనిక సృష్టి *(romantic invention)* గా భావించాలి అంటే "డివైన్ కామెడీ"లో ఎక్కడికక్కడ ప్రదర్శించిన మానవతా విలువల్ని ఆర్.కె "మాల్గుడి" కధా స్రవంతిలో అడుగడుగునా మనం చూస్తాం

సామాజిక దృక్పథంలో ఛాందసాలను, మౌఢ్యాన్ని ఎదిరించడంలో పౌరునిగా రచయిత బాధ్యతలలో, పిల్లల పోషణలో, పారశాల పిల్లల అవసరాలను కనిపెట్టి ఉండడంలో ఆర్.కె. పాటించిన నీతి నియమాలు ఒక్క రోజులో పెల్లుబికి వచ్చినవి కావు "మాల్గుడి" కేంద్రంగా ఆర్ కె రూపొందించిన కథలూ, నవలలూ సమాజంలో ఉన్న కుళ్ళును, మోసాలను ఎండగట్టడంతో పాటు, వాటిని ఎదిరించి నిలిచేటట్టు పారకులను నర్మగర్భంగా ఉద్బోధిస్తాయి "మాల్గుడి" చుట్టూ కథ తిరిగినా, నవల తిరిగినా మాల్గుడిని ఒక ఆదర్శంగా నిలబెట్టడం, ఆర్ కె లక్ష్యం, జాతీయ స్వాతంత్ర్య సమరంతో ఆయని అనుబంధం, ఆ ఉద్యమానికి కర్మసాక్షిగా ఆయనకి కలిగిన అనుభవాలూ, కథల రూపంలో అక్షర సత్యాలుగా ఆణిముత్యాలుగా మారాయి దేవాలయ ప్రాంగణాలు ప్రజా ఉద్యమ కేంద్రాలు కావడాన్ని చాలామంది అంగీకరించరు కాని ఆర్ కె యువకుడుగా ఉన్నప్పుడు మద్రాసులోని ఈశ్వరదేవాలయం బ్రిటిష్‌వాడి రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా సాగిన జాతీయోద్యమానికీ, నిరసనకూ కేంద్రస్థానమైంది దేవాలయంనుంచి ప్రారంభమైన ఈ ఉద్యమంలో ఆర్ కె పాల్గొన్నాడు అవినీతి, లంచగొండితనం, మోసాలు ఆయా పాత్రల ద్వారా కథల్లో వ్యక్తం చేయడంలో ఆర్ కె లో ఈ ఉద్యమ స్ఫూర్తి ప్రస్ఫుటంగా కనపడుతుంది తన కాలానికి ఆయన సాధికార వ్యాఖ్యాత భావకవులుగా ప్రసిద్ధులైన వరడ్స్ వర్త్, కోల్రిడ్జ్, రాబర్ట్ సౌదీలను "లేక్ పోయట్స్" అన్నారు వాళ్ళ పేరిట "లేక్"జిల్లాకూడా వెలిసింది ఆర్ కె సృష్టి "మాల్గుడి"'ని ఎవరూ ఆయని స్వప్నసీమగా, కాల్పనిక ప్రదేశంగా భావించరు అంతగా దాని సృష్టినీ, వ్యక్తిత్వాన్నీ, పరిసరాలనూ, అక్కడి ప్రకృతినీ దిద్దితీర్చి అనితర సాధ్యం చేసి వదిలాడు! ఆ ఊహా జగత్తులోకి జీన్ పాంట్స్‌ను, టి-షర్టులను చొప్పించడమే కాదు, అన్ని ఆధునిక సౌకర్యాల కల్పనకూ ప్రయత్నిస్తూ కార్పోరేట్ స్థాయికి 'మాల్గుడి'ని నడిపించాడు! "స్వామి అండ్ ఫ్రండ్స్", "బాచిలర్ ఆఫ్ ఆర్ట్స్' తో ప్రారంభమైన మాల్గుడి కథా స్రవంతి మరి పన్నెండు నవలలకు ఊపు అందించింది మెత్తమెత్తగా చమత్కారాలతో సంఘ వ్యతిరేకులకు, దోపిడీ దారులకు ఈ కథల్లో తొడపాశాలు పెట్టాడు హేతువాదిగా, జ్యోతిష్యం పేరుతో మోసాలు చేసే హంతకుల్నీ ప్రజలకు దూరమవుతున్న బురాక్రసీనీ ఉతికేశాడు ఈ కరకుదనం, చతురిమ సమపాళ్ళలో రచయితకు ఎందుకు ఉండాలో చెబుతూ జాన్ స్టీన్ బెక్ *"the discipline of the written word punishes both stupidity and dishonesty"* అన్నాడు ఈ సత్యాన్ని మనం ఆర్ కె. రచనల్లో - రైటర్స్ నైట్‌మేర్, గైడ్, ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్ , డార్క్‌రూమ్, వెయిటింగ్ ఫర్ మహాత్మా మాన్-ఈటర్ ఆఫ్ మాల్గుడి, పెయింటర్ ఆఫ్ సయిన్స్ వగైరా కథల్లో చూడొచ్చు "ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్" కథ, మన దేశంలో "నూతన ఆర్థిక విధానం" అమలుకొకి వచ్చిన తరువాత పుట్టుకొచ్చిన ఆర్థిక కుంభకోణాలకూ, స్కామ్స్‌కూ సరిపోలిన పూర్వరంగాన్ని ఏనాడో బట్టబయలు చేసిన రచన ఇందులోని "మార్గయ్య" (అంటే 'మార్గదర్శి') 1990 లలో బ్యాంకుల్ని చట్టబద్ధంగా దోచుకున్న హర్షద్ మెహతాకు నకలు!

ఆర్ కె మహిళా ఉద్యమ హితైషి, వారి విమోచనోద్యమానికి ఊత "ఆమెకు పురుషుడు సమాన ప్రతిపత్తిని నిరాకరించాడు, తన స్వతంత్ర ప్రతిపత్తిని, వ్యక్తిత్వాన్ని, హోదాను, తన శక్తినీ స్త్రీ మరిచి పోయేంతగా కుహనా తెలివితేటలతో నర్మగర్భంగా మగవాడు అణచి ఉంచాడ''ని పితృస్వామిక వ్యవస్థ కల్మషాన్ని కడిగి పెట్టాడు రాజ్యసభ సభ్యునిగా బడిపిల్లలపై నేటి విద్యా వ్యవస్థ మోపుతున్న చదువల భారం నుంచీ, 'చింపాంజీ'లా నడుం వంచుకొని మోసే

సంచుల బరువునుంచీ పిల్లలకు విముక్తి కల్పించాలని ఆర్ కె కోరుకున్నాడు అవసరమైతే ఆర్డినెన్సుద్వారానైనా సరే ఈ మోత బరువును ఒక జాతీయ విధానంగానే రద్దు చేయాలని ఆవేదన చెందాడు వారు స్వేచ్ఛావాతావరణంలో పెరగడానికి డ్రెస్ నిబంధనలను కూడా సడలించాలన్నాడు! జీవితాన్ని ఇన్ని కోణాలనుంచి పరిశీలించిన ఆర్ కె నారయణ్ కలం వెలుగులు తొంబయ్యవ పడిలోకూడా చూడగలగడం పాఠకుల అదృష్టం ఆయని కథా ఆగదు, కథనమూ ఆగదు గానము లేక ప్రాణము లేదన్నాడు కృష్ణశాస్త్రి రచన నాకు శ్వాసలాంటిది ఊపిరి పీల్చుకోకుండా బతకలేను, రచన చేయకుండా ఉండలేను అన్నాడు పాబ్లో నెరూడా ఈ కథకు ముగింపు ఉండదు ఆర్ కె చిరంజీవి! ఒక నవలా కారుడు అన్నట్టు *"to finish the story is sadness to a writer - a little death he puts the last word down and it is done But it is not really done The story goes on and leave the writer behind for no story is ever done!"*

ఆదివారం 20, అక్టోబర్ 1996

# కవి 'మాంచాల' ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ!

"పూల మాలిక లల్లినందుకు/కరకు కత్తులె కాన్కలాయెను/తేనె సుధలను చల్లినందుకు తేటికాటుల పోటులాయెను" ఓహో! ఎంత సుందరమైన భావకవిత్వం ఇది! 20వ శతాబ్దం తొలి సంధ్యలో నవ్యాంధ్ర సాహితీ క్షేత్రాన్ని ఏలిన భావకవితా యుగంలో ఈ మధుర కవిత అల్లిన విదుషీమణి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ. కవితామ తల్లిని క్షీణయుగ బంధనాలనుంచి తెగతెంపులు చేయించి, అభ్యుదయ కవితా ప్రస్థానానికి కటిబద్ధుల్ని చేయడానికి మధ్య - ఒక సంధియుగం నడిచింది. దానిపేరే భావకవితా స్రవంతి. ఆ సమయంలో అర్థంలేని భావాలను రాయప్రోలు ఈసడించాడు, దేవులపల్లి వంతపాడాడు! ఆంధ్ర సరస్వతిని రమ్యాక్షరక్షోణికి తిప్పమన్నారు. భారత స్వాతంత్ర్య సమర భేరీలు కూడా అప్పుడప్పుడే మోగుతున్న సమయం, దేశభక్తి గీతాలకు సమయం ఆసన్నమవుతున్న ముహూర్తాలు. భావకవిత, అహంభావకవిత గిరజాలూ, నరదాలూ కట్టిపెట్టి జాతీయ భావాలతో ప్రేరేపితమవుతున్న రోజులు. ఆ పరిణామక్రమంలో ఒక విశ్వసుందరమ్మే కాదు, మరొక చావలి బంగారమ్మే కాదు - "ఆంధ్ర సరస్వతి"గా, సాహితీ రుద్రమగా, సాహితీ వేదినీ, సంగీత హృదయ సంవాదినిగా, సానతీరిన జాతిరత్నంగా భావకవిత్వం పట్టునువిదిలించుకుని జాతీయభావాలతో కవనరంగాన్ని కదనరంగంగా నడిపించిన అగ్రశ్రేణి ఆంధ్ర కవయిత్రులలో ఇటీవల కన్నుమూసిన ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ ఒకరు. ప్రాచీనతకూ, నవీనతకూ వారధి లక్ష్మీకాన్తమ్మ. దేశభక్తితోపాటు, వీరరసప్రధాన ఘట్టాలకు చెవికోసుకోవడమేకాదు, స్వయానా ఉద్యమ స్ఫూర్తితో కలంపట్టిన వ్యక్తి. పాతకొత్తల మేలు కలయికగా-భారతీయుల ఆర్షవాఙ్మయం గురించి ఎంత అధికారంతో చెప్పగలదో, ఆధునిక యుగ సత్యాలను కూడా అంతసాధికారికంగానూ వెల్లడించగలిగిన విదుషీమణి కాన్తమ్మ. విశ్వసాహిత్య ఉద్యానవనంలో భారతీయ కవయత్రులు తీసిన పంటలను అరవైలనాటికే "ఆంధ్రకవయిత్రులు"సహా ప్రాచీన మధ్యయుగాల వాఙ్మయాలను సమీక్షిస్తూ "అఖిలభారత కవయిత్రులు" సంకలనాన్ని మన ఆడపడుచులకు అందించిన 'కళాప్రపూర్ణ' కాన్తమ్మ! పుట్టినింటికి, మెట్టినింటికి ఉభయ వంశదీపికగానే గాక, సారస్వతేయులందరికీ ఉభయ భాషా రూపికగా కూడా వర్ధిల్లిన కవి. స్త్రీ విద్యకోసం, ఆర్థిక సమానత్వం కోసం ఆవేదన చెందిన కాన్తమ్మ మహిళాలోకానికి స్ఫూర్తినిచ్చేందుకు, నిరాశా నిస్పృహల నుంచి వారిని విముక్తి చేసేందుకు చేసిన పని-పనిగట్టుకొని ఋగ్వేద పరిశీలనకు దిగడం, తద్వారా అందులో పేర్కొన్న 2,000 మంది "మంత్రద్రష్టలైన మహాపురుషుల్లో" కనీసం 24 మంది విదుషీమణులైన మహిళా మంత్రదర్శినులను పట్టి వెలికి తీయడమూ! సంస్కృతాంధ్ర, ఆంగ్లసాహిత్యాలను పుక్కిట పట్టిన ఈమె సంస్కృత, ప్రాకృత వాఙ్మయంలో మహిళల పరిశ్రమ గురించి 'కవయత్రుల' చరిత్రలో వివరించింది. గార్గి, మైత్రేయి, విశ్వవార, అపాల, విజ్జిగ, అవంతుల గురించే కాదు, మధ్యయుగాన వాఙ్మయంలో గంగాదేవి, తిరుమలాంబ, మధురవాణి, త్రివేణి, మొల్ల, రంగాజి, ముద్దుపళని, తిమ్మక్కల గురించీ, తొలి తెలుగు కవయత్రులయిన చానమ్మ, పోలమ్మ, కనపర్తి వరలక్ష్మమ్మల గురించీ అపురూపమైన సమాచారాన్ని కాన్తమ్మ సేకరించింది. 544 వ్యావహారిక భాషలలో, 174 ప్రాంతీయ భాషా సాహిత్యాలలో (ఉర్దూసహా) భారతీయాత్మను పట్టి, పిండి, పంచిన ఉత్తమ సంకలనం కాన్తమ్మ "కవయత్రులు"! సాహిత్యంలో సౌందర్య

ప్రభావీచికలు ప్రసరించడమే కాదు, కీర్తన వాఙ్మయకళాసేవలో కూడా కీర్తి పతాకాలు అందుకున్న కవి అని చెప్పడానికి "విమల గాంధర్వ మీరీతి విశ్రుతిగన/బాలమురళి నీ వొకడవె చాలు చాలు "అన్న కవితా శకలం చాలు! అంతేగాదు, ' నా తెలుగు మాంచాల", గేయకావ్యంద్వారా తానే కవి 'మాంచాల'గా స్థిరపడి, చచ్చుబడిపోయిన తెలుగు మహిళకు విచ్చుకత్తిని చేతికిచ్చిన చాన లక్ష్మీకాన్తమ్మ! దేశభక్తినీ, వీరనారీమణుల స్వజాతి అభిమానాన్నీ తెలుగు మహిళకు ఎక్కించడానికి కృషిచేసిన కవి కదనరంగంలో ఆమె కలం ప్రబోధించేది వీరధర్మమేగాని, శత్రువుకు వెన్ను చూపే 'ప్రేమ ధర్మం'కాదు! అత్త అయితాంబ, భర్త బాలచంద్రుడూ, మగువ మాంచాల ప్రధాన పాత్రలుగా ప్రతిపద రమ్యంగా కాన్తమ్మ ఈ గేయ కావ్యాన్ని తీర్చిదిద్దింది ఆమె రచనలిన్నంటిలోకి ఈ కావ్యాన్ని తలమానికమని చెప్పుకోవచ్చు వీరవనితగా మాంచాలను దిద్దిన కాన్తమ్మ ఆ తన్మయత్వంలో మాంచాల వ్యక్తిత్వాన్నే కాదు, తన కవితా వ్యక్తిత్వాన్ని కూడా కాపాడుకొంటూ అంటోంది "నా తెలుగు మాంచాల/నాణెంపు పతిశీల/నవరాగ మణిమాల/స్తవనీయ గుణలీల"అని! అర్థ సౌందర్యానికీ, శబ్దమాధుర్యానికీ, అంత్యప్రాసల ప్రయోగ వైచిత్రికీ కాన్తమ్మ కొత్త సొబగులు తొడిగింది! ఆమె సాహిత్య జీవితాన్ని ప్రభావితం చేసిన దేశీయ విదుషీమణులు ఒకరు కారు చానమ, ప్రోలమల శౌర్య సాహసాలంటే చెవికోసుకుంది, 35 ఛందస్సులతో కావ్యం అల్లిన నిశ్శంక రాయరాణి అంటే ఉప్పొంగిపోతుంది, కన్నడ సాహిత్య ప్రక్రియ "సాంగత్య ఛందస్సు" అన్నా, మలయాళం వారి 'అట్టిక్కథ' అన్నా ఆమె మనస్సు చవులూరుతుంది, కాశ్మీర సాహిత్యంలో జాతిమత భేదాలు లేని అవ్వలల్ల, లాల్‌దీది కవయిత్రులంటే ఆమెకు ఎక్కడలేని ప్రేమ, రసపుత్రాంగన గుజరాతీ మీరా మధురభక్తి, తమిళుల "అవ్వై" సూక్తులు, ఆండాళ్ దివ్యకీర్తనలూ, మరాఠీలో ముక్తాబాయి, జనాబాయి, వంగభాషలో చంద్రావతి, కామినీరాయిల కవన ప్రలోభాలకు లొంగిపోతుంది! తోరూదత్తుకు తండ్రి గోవిందదత్తు శిక్షణలాగా, తండ్రి మధురకవి నాళం కృష్ణారావు కల్పించిన ఉత్సాహ ప్రోత్సాహాలు కాన్తమ్మ కవితా శిఖరారోహణకు ఆశీర్వాదాలయ్యాయి!

అంతేకాదు, లక్ష్మీకాన్తమ్మ రాసిన విలక్షణ రచన "సరస్వతీ సామ్రాజ్య వైభవం" మదురమైన సంవాద చాతుర్యంతో నడిచిన రూపకం ఆంధ్ర కవయిత్రుల ప్రజ్ఞాపాటవాలను లోకానికి తెలియజెబుతూ రాసిన ఈ రూపకం సరికొత్త బాణీలో సాగింది ఒక విధంగా ఈ రూపకం 'స్త్రీ వాద' సాహిత్యానికి తొలి పూజగా భావించుకోవచ్చు! ప్రాకృత కవయిత్రులలో "రోహ", రాళ్ళపల్లి వారి గాథాసప్తశతిలోని "వోహ" నిజానికి ఆనాటి ఫెమినిస్టులే నేమో! ఈ రూపకంలో - తన విద్వత్ ప్రభాపుంజాలతో మంచుకొండలను కూడా కరిగించిన మొల్ల కనిపిస్తుంది, గంగాదేవి తెలుగు నుడికారాలతో కలకండలు కుమ్మరిస్తుంది కవితా జాజుల కమ్మని పరిమళాలను దశదిశలా ప్రసరింపచేస్తుంది, మధురవాణి అందంగా రసనిష్యందంగా విజ్ఞాన కళాప్రపంచానికి చక్కని శిల్పంతో కైమోడ్పులర్పిస్తుంది, తిమ్మక్క జాను తెలుగులో శారదాస్తుతి చేసి ప్రేక్షకులను చతుర కవిత్వంతో రసరమ్యసాగరంలో ముంచెత్తుతుంది, ముద్దపళని ముద్దు పల్కులతో మనోరంజకమైన శబ్ద సాగరంలో ఓలలాడిస్తుంది, రంగాజి రంగుల హరివిల్లులా కవితామృతాన్ని చిలికించి, కరుణను గంగలా పొంగిస్తుంది, వేంగమాంబ మహిళలకు ఉన్నతిని కూర్చు మహాత్ముడెవరో చెప్పమని నిలదీస్తుంది, శాంతిని, అహింసను, ప్రేమను, సత్యనిష్ఠను కలలో కాదు ఇలలో ప్రతిష్టించే మొనగాళ్ళెవరో చెప్పమని సవాళ్ళు

చేస్తుంది క్షీణయుగ లక్షణంగా అతివేలంగా శృంగార వర్ణనలు చేసిన ముద్దుపళని కూడా కాన్తమ్మ చేతిలో దారికొస్తుంది! నేడు మహిళలపై జరుగుతున్న అత్యాచారాలకు వర్తింపజేస్తూ కాన్తమ్మ అన్యాపదేశంగా (తానే సరస్వతిగా మారి) ఇలా హెచ్చరిస్తుంది "కొందరు పురుషులు అసభ్య శృంగారానికి కావ్యాలకెక్కించి ఊరేగించారు సిగ్గు సింగారంగా ఉండదగిన స్త్రీలు కూడా అలాంటి రచనలనే చేస్తే ఇంకా కావ్యాలు విశ్వశ్రేయస్సును కోరే రచనలు ఎలా అవుతాయి! ఈ లోకంలో ఇప్పటి జనాల విపరీత ప్రవర్తనకూ, స్త్రీలపై జరుపుతున్న అత్యాచారాలకు ఇలాంటి (శృంగార) రచనలే కారణం కాదా?" ఈ ప్రశ్నకు 'చానమ్మ' ఇచ్చిన సమాధానం కూడా గమనించదగ్గది, "రచనని కూడా ధనార్జకి ఉపయోగించడం వల్ల నేటి సంఘంలో ఇట్టి ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయి"! హిందీ కవయిత్రుల గురించి ప్రస్తావిస్తూ లక్ష్మీకాన్తమ్మ -కవయిత్రి కమలారూప్ కరణ్ మాటల్ని స్త్రీవాదంగా మనకు వినిపించింది "సంఘంలో పురుష సంతానేచ్ఛ అధికమయింది మగశిశువు జన్మకోసం మంత్రతంత్రాలు, ప్రార్థనలూ ప్రారంభమైనాయి ఇంటిని ఉద్ధరించే వాడు మగవాడన్న భావన అభివృద్ధి పొందిన కొద్దీ ఆడబిడ్డ విలువ తగ్గిపోసాగింది కేవలం కొడుకులను కన్నతల్లికి తప్ప స్త్రీ జీవితం వ్యర్థంగా చూడబడింది స్త్రీని చిన్నతనంలో తండ్రి, యౌవనంలో భర్త, ముసలి తనంలో కొడుకూ పోషించాలన్న నియమం ఏర్పడింది ఈ నియమంవల్ల స్త్రీ స్వాతంత్ర్యం పూర్తిగా బంధింపబడింది హైందవ సమాజం సనాతన ధర్మాచారాలనే పేరుతో మూఢవిశ్వాసాలకూ, గుడ్డినమ్మకాలకూ ఆటపట్టయింది ఇందువల్ల అనేక దురాచారాలు సంఘంలో వేళ్ళూనుకుని స్త్రీలపై తమ ప్రభావాలను కనపరుస్తున్నాయి ఇలా కేవలం మత విషయాలేకాదు, సాంఘిక రాజకీయాది పరిస్థితులు కూడా స్త్రీ పతనానికి భాగం పంచుకున్నాయి" "కాన్తమ్మ 'మహిళా విక్రమ సూక్తాలు' బోధించడమేకాదు, ప్రయోజనకరమైన ఉత్తమ కథాసంకలనం "కథా మందారం" కూడా మనకు అందించింది ఇందులో బాపిరాజు "మధుర బిందువుల"నుంచి భానుమతి "జీవితంలోని అగాధాల" వరకూ, రంగనాయకమ్మ "ఆడది" నుంచి రామలక్ష్మి "ఇదిగో మాట"వరకూ, నాయని కృష్ణకుమారి "ప్రకాశరావు కథ" నుంచి రచయిత్రి సుకాంచన "కోరల మధ్యన కోటి స్వర్గాలు" దాకా మెదడుకు మేత పెడతాయి! కాన్తమ్మ జీవించి ఉన్నన్నాళ్ళూ ఒక మణిదీపమై వెలిగింది తనకాలపు రచయితలకు తలలో నాల్కలా మెలిగింది, తెలుగు భాషామ తల్లికి గారంగా, ముదిగారంగా, వెలలేని తులలేని కీర్తికి చెక్కుచెదరని పాదుగా మిగిలింది! ఒక సందర్భంగా కాన్తమ్మే చెప్పుకున్నట్టుగా -

"మందాలమాలతో అందాలు కూర్చనీ
ఆంధ్రి కందాలు కూర్చనీ
విందైన నీ మనసు ఆనంద మొందనీ"

అంటూ తన ఆనందలోకాలను మనకి పంచుతూ మనకు అందని లోకాలకు ఆమె చేరుకుంది!!

ఆదివారం 29, డిసెంబర్ 1996

# కాకలు తీరిన కాకతీయ కవియోదుడు 'కాళోరా'!

సముద్రానికి ఉన్న గంభీరత నిండుకుండలాంటి సాహితీ వేత్తకూ ఉంటుంది రత్నరాశుల్ని మనమే వెళ్ళి వెతుక్కురావాలిగాని అవి మన వద్దకు రావు అలా వెతికితేగాని అందిరాని ఆణిముత్యాల్లో ఒకరు ఇటీవలనే అస్తమించిన కాళోజీ రామేశ్వర్రావు కావడానికి కాకలు తీరిన కాకతీయ కవియోధుడే అయినా, ఆయన అఖిలాంధ్ర సాహితీ బంధువు, సంస్కృతీ సింధువు! మనకు కవుల సంఖ్యకు కొదవలేదు, కాని ఉద్యమాలతో పెనవేసుకున్న కవుల సంఖ్య మాత్రమే తక్కువ అలా విభిన్న ఉద్యమ సాగరాలలో ఈదులాడిన ఘనత 'కాళోజీ' సహోదరులకు దక్కింది అందుకే వారిద్దరూ (రామేశ్వర్రావు, నారాయణరావు) నిఖిలాంధ్రుల మనో నేత్రాలుగా వర్ధిల్లుతూ వచ్చారు పండితరాయలవల్ల ముంగండ గ్రామం (గోదావరి) సాహితీ చరిత్రకు ముంజేతి కంకణమైనట్టుగా, వరంగల్ జిల్లా "మడికొండ" గ్రామం 'కాళోజీ' సోదరులు తదితర సాహితీ దురంధరులవల్ల కవితామాణిక్యమయింది! మడికొండవాసి రామేశ్వర్రావు హనుమకొండ నివాసి అయిన తరువాత రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య, వైజ్ఞానిక ఉద్యమాలకు, తెలంగాణాలో నవ్యచైతన్యానికి తలమానికమైన కేంద్రాలలో అగ్రస్థానంలో ఉన్న వరంగల్‌కు మరింత రంగూ, రుచీ, వాసన అబ్బాయి! కనుకనే రామేశ్వర్రావును, వరంగల్ కేంద్ర స్థానంగా సాగిన సకల ఉద్యమాలతో కడిచిన అరవై అయిదేళ్ళుగా సజీవ స్పందనకు ప్రతిరూపంగా అందరూ భావిస్తూవచ్చారు బహుభాషావేత్తగా, సౌమ్యుడిగా, నిగర్విగా, చమత్కారిగా, సహనశీలిగా, స్నేహశీలిగా,అనురాగమూర్తిగా, అఖండ ప్రతిభా సంపన్నుడిగా వాసి కెక్కిన రామేశ్వర్రావు కవితాపరమైన అన్వర్థనామం - "షాద్" ఆనందించేవాడు "షాద్" కాళోజీ సోదరులిద్దరూ ప్రసిద్ధకవులే అయినా నారాయణరావు తెలుగు కవిత్వానికి అంకితమైపోగా, రామేశ్వర్రావు ప్రధానంగా ఉర్దూ కవన ఝరిలోనే ఈదులాడుతూ వచ్చిన వ్యక్తి కనుకనే అతను ఉర్దూ కవితా ప్రపంచంలో సర్వసామాన్యమైన కవి "చిరు" నామానికి సంకేతంగా "షాద్"పేరిట ఆయన రచనలు వెలువడ్డాయి వాటిలో కొన్నిటికి మంచి అనువాదాలూ వచ్చాయి

ఆయన సుప్రసిద్ధ తెలుగు కవి కావలసినవాడే బహుశా తన కవితా రచన ప్రారంభదశల్లో "భారతి"కి పంపిన ఓ తెలుగు కవిత సంపాదకుని తిరస్కారముద్ర పొందడంతో నిరుత్సాహపడి తెలుగు కవితా రచనను మానుకునైనా ఉండాలి, లేదా నిజాం పాలనలో ఉర్దూ మినహా మాతృభాష తెలుగుపై ఉన్న పెక్కు ఆంక్షలవల్ల ఉర్దూభాషలోనే కవితా రచనను కొనసాగించైనా ఉండాలి కొందరిలా వట్టి ఆత్మానందంకోసమే రామేశ్వర్రావు కవిత్వం రాయలేదు సంఘపరమైన ఆవేదన, ఆవేశం కలగలిసిన రచనగా కవితను ఆరాధించాడని ఆయన రచనలు స్పష్టం చేస్తాయి అందుకే అతను "ఆవేదనతో కూడిన ఆత్మానందాన్ని" మాత్రమే కవిత్వంగా పరిగణిస్తాడు ఈ ఆవేదన ఎక్కడినుంచి జనించింది? తానుపుట్టి పెరిగిన పరిసరాలనుంచీ, రాజకీయ సామాజిక పరిస్థితులనుంచీ, సాంస్కృతిక, వైజ్ఞానిక పునరుజ్జీవనోద్యమ దశలనుంచీ రామేశ్వర్రావు నిజానికి'సంగమేశ్వర్రావు'! పలునదులకు మహా కూడలి అతని ఇంటిలోగిలి, పండితులకు పరిశోధకులకూ అహర్నిశలూ పుష్టికూర్చిన వాకిలి! అతడు తెలుగులకు ఆణిమైన (పుట్టిన, మెట్టిన) తెలంగాణాలో ఒక స్వాతంత్ర్యసమర యోధుడు, ఒక వైతాళికుడు, ఒక మానవతావాది, ప్రజ్ఞాశాలి. "మాన్ ఆఫ్ ముషాయిరా"గా

పేరుమోసిన రామేశ్వర్రావు వందేమాతరం, ఆర్యసమాజ ఉద్యమాలలోనే గాక, కాంగ్రెస్ ఉద్యమాలతో పాటు పెరిగిన ఆంధ్రమహాసభ ఉద్యమంలోనూ ప్రముఖ పాత్ర వహించిన సామాజిక కవీ, మేధావీ అందుకే 'కాళోద్వయాన్ని " స్వతంత్ర సమార్జనయందు యోధులై/ క్రమ్ముచు మాతృభూమి తెలంగాణపు దాస్య విముక్తి యుద్ధమం/దిమ్మహి పోరియుంటిరి కవీశ్వరులై, కవితా త్రిశూలులై " అని ఓ కవికుమారుడు వర్ణించాడు!

రామేశ్వర్రావు కార్యక్షేత్రం ఒకటి కాదు నిజాం వ్యతిరేకపోరాటంలో రైతుల పక్షాన కొమ్ముకాసిన న్యాయవాది అతను, జాగిర్దార్ల, భూస్వాముల దౌర్జన్యాలనుంచి రైతులను వృత్తి ధర్మంగా కాపాడి వారికి న్యాయం చేకూర్చిన న్యాయవాదీ, సమాజవాదీ! ఇప్పటిలా మంచి చెడులతో నిమిత్తంలేకుండా ఎడాపెడా రెండు చేతులా సంపాదనే ధ్యేయంగా ప్రవర్తిస్తున్న కొందరు న్యాయవాదుల మాదిరికాకుండా ఆయన పరిమితమైన కేసులను మాత్రమే చేపట్టిన వ్యక్తి యువన్యాయవాదుల్ని కదిలించి స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా తెలంగాణాలో న్యాయస్థానాల బహిష్కరణోద్యమానికి కూడా శ్రీకారం చుట్టిన ఆకారమే రామేశ్వర్రావు ఛైర్మన్ పదవికి ఎగబడకుండానే వరంగల్, హనుమకొండ పట్టణాల అభివృద్ధికి దోహదంచేసి సాంఘిక సేవాధర్మానికి కొత్త అర్థాన్ని చూపించిన కర్మయోగి ఆయన! గ్రూపులకూ, వర్గాలకూ, వర్ణాలకూ అతీతంగా ఉన్నందుననే అతను అజాత శత్రువయ్యాడు! పబ్లిసిటీ రుగ్మతకు దూరంగా ఉన్న కార్యవాదిగనుకనే వరంగల్‌లో జరిగిన "కాకతీయ ఉత్సవాల"కు అఖిలాంధ్ర పరిశోధకులను, పండితులను, కవులనూ, చరిత్ర కారులనూ సూదంటూరాయిలా అకర్షించగలిగాడు! ప్రతిమంచి కార్యానికి ఆయన చేదోడు వాదోడు లభించేదనేది ప్రతీతి తాను సమిధయ్యాడు గాని, ఇతరులను సమిధలుగా చేసినవాడు కాడు! ఇంత స్ఫూర్తి రామేశ్వర్రావుకు కలగడానికి కారణం వరంగల్ చరిత్ర చెబుతుంది మట్టినుంచి మహావీరుల్ని సృష్టించిన తెలంగాణాలో పుట్టిన పాలకురికి (వరంగల్ సమీపాన) సోమనాథుడు , బమ్మెర పోతన కవితామకరందాల్ని గ్రోలి ఎదిగినవాడు రామేశ్వర్రావు అంతేగాదు, "తెనుగు" పత్రిక, 'శ్రీగ్రంధమాల' నిర్వహించిన వడ్డిరాజు సోదరులూ, ప్రబంధకర్తలైన పరశురామపంతుల లింగమూర్తి, అచ్చ తెలుగు నిఘంటువు రచించిన తూమురామదాసు, రాజకీయ చైతన్యానికి ఈ ప్రాంతంలో పునాదులు వేసిన పాములపర్తి సదాశివరావు ఎం.ఎస్. ఆచార్య-ఓరుగంటి తీరు తెన్నులు దిద్దిన సంస్కృతీ పరులే. నారాయణరావు 'నాగొడవ' రాజకీయ, సామాజిక స్పృహకు అద్దమెత్తిన ప్రజావాణి! రామేశ్వర్రావు గణపతి ఉత్సవాలను బాలగంగాధర్‌తిలక్‌లా మతపరమైన ఉత్సవాలుగాకుండా రాజకీయోద్యమ స్ఫూర్తికి ఆనవాళ్ళుగా మాత్రమే మలిచాడు!

అన్వేషణ, ఆరాధన-రెండు చక్రాలుగా కవితా రథాన్ని నడిపించిన రామేశ్వర్రావు కవితా లక్షణాన్నీ, ఆదర్శాన్నీ ఇలా నిర్వచించాడు "ఆవేశము రవంత/ ఆవేదన ఇనుమంత/ అంతర్యస్వచ్ఛత అమరినంత/కలిపి నేరుగా బలుక/కవితయై ఒప్పారు" అన్నాడు! అతని వ్యక్తిత్వమూ, కవితా తత్వమూ ఆయన తెలుగులోనే రాసిన "నేను" ఖండికద్వారా మనకు తెలుస్తుంది "గాలివెంటా మింటితిరిగీ సౌరభము వెదజల్లుకొను/మంచి గంధము చెక్కపొలిక మారుమూలన అణగియుందను/శ్రద్ధమై శ్రమనోర్చువారికి అరిగి అరిగీ కరిగి కరిగీ/మంద మంద సుగంధమిత్తును/డెందమున కానంద మిత్తును"! ఆ నిర్మలత్వంతోనే రామేశ్వర్రావు చివరి శ్వాసవరకూ గడిపారన్నది సమకాలికులందరి సమాలోచన! హిమాలయ శిఖరం లాంటి ఔన్నత్యానికీ, ఉత్తుంగ తరంగంలాంటి భావధారకూ వారసుడైన రామేశ్వర్రావుది -

అంతటి విద్వత్తులో కూడా ఎంతో వినమ్రత "ముషాయిరా" లలో మొనగాడు అతను ఉర్దూలో రాసిన ' షబ్‌నమ్" (మంచు బిందువు) కవితా ప్రియులు వీనులవిందుగా భావిస్తారు "కలామె-ఏ-షాద్" (ఆనంద గీతాలు/కల్యాణ గేయాలు) రెండు సంపుటాలలో వెలువడిన రామేశ్వర్రావు కవితా ఖండికలు ఆయని భావధారకు దీప్తి కలిగించిన ఒక హిందీ కవితను (తెలుగు అనువాదం) చూడండి "అన్యాయపు లోకంతో పోట్లాడి-మాటిమాటికీ గాయపడతాను/ఓడి ఓడి అలసిపోతాను/అప్పుడేకాంతంలో రోదిస్తాను/నా హృదయంలో పడిన లోతైన గాయాన్ని గేయంగా చూపిస్తాను/రాయిని కరిగిస్తాను '! కారుణ్యం ఉన్న వ్యక్తికి ఆర్ద్రత ఎక్కువంటారు అది రామేశ్వర్రావు వ్యక్తిత్వంలో, కవిత్వతత్వంలో 'నకు అడుగడుగునా కనిపిస్తుంది జీవిత సత్యాన్ని జీవన సంగీతంగా మలిచాడాయన బాధను భరించలేడు అలా అని ఆ బాధను కవిత్వం ద్వారా వెళ్ళగక్కకుండానూ ఉండలేడు!

ఒక "గజల్" లో రామేశ్వర్రావు ఇలా తన హృదయావేదనను రసరమ్యంగా ప్రతిపద తత్వంగా ఎలా మలిచాడో అనువాదంలో చూడండి "అసంపూర్ణంగా ఉన్న గీతం పూర్తయితే జీవించి యేం చేయాలి?/ నేను గన్న కలలు నిజమైతే, ఏం చేస్తూ కాలం గడపాలి!/అనాదినుండీ నేటిదాకా, కాలం ఎవడికోసం నీరీక్షిస్తున్నట్లు?/వాడే నాకు లభ్యమైతే మరి దేనికోసం నేను వెదకాలి?"!! కాబట్టే, అటు అన్వేషణ, ఇటు ఆరాధన జమిలిగా సాగుతూనే ఉండాలన్నది రామేశ్వర్రావు ధోరణి బూర్గుల, విశ్వనాధ, శ్రీశ్రీ, జాషువా, దాశరధులవంటి సమకాలికులతో సాహితీ సాంగత్యమే కాదు, సంస్కృతీ, కవితా మాగాణంలో కొత్త పంటలు తీస్తున్న నవ్యాంధ్ర యువకవులతో కూడా సాన్నిహిత్యం కాపాడుకున్న సమతావాది రామేశ్వర్రావు సత్యం, అవకాశవాదాన్ని దరిచేరనివ్వదనీ అందువల్ల సత్యం అన్నది సమయానుకూలంగా మారదనీ, మారకూడదనీ అయని నిశ్చితాభిప్రాయం స్వాతంత్ర్యానంతరం దేశ పరిస్థితుల గురించి ముచ్చటిస్తూ ఆయన చెప్పిన వ్యంగ్య కవిత "హమారికారు గుజారి" దీనికి సుదర్శన్ రావు కూర్చిన ముత్యాల సరం "ప్రజల సేవకు వచ్చి ప్రభుత చిక్కిన యంత వారిపైనే స్వారి చేసినాము/ఎన్నికల వేళ వాడెంతో గొప్పవాడు/ఓటున్న ప్రతివాడు ఒక చక్రవర్తి/ఆ క్షణం గడిచెనా అన్నార్తి వాడు/తన దేశమున తానే శరణార్థి వాడు"! సాంస్కృతికంగా కూడా ఆయన హెచ్చరించిపోయాడు; "స్వైరవిహారమే మనకు/స్వాతంత్రమై పోయె/దోషవర్తన నేడు దొడ్డగుణమయిపోయె!/ అంగడి నరుకులే ఆరాధ్య సతులైరి/చవక పాటలే నేడు సంగీతమైపోయె"! ఈ తప్పుడు పరిణామాన్ని మనం ఎదుర్కోవాలన్నదే ఇందులోని సందేశం, ఆదర్శం!

అలాంటి కాళోజీ రామేశ్వర్రావుకు ('కాళోరా') కవి వి ఆర్ విద్యార్థి సమర్పించిన నివాళితో మనం అరమరికలు లేకుండా ఏకీభవించవచ్చు ముళ్ళపొదల మధ్య గులాబీ పువ్వులే కాదు, వారి సమక్షంలో పేడతట్ట ముఖాలు సహితం కమలాల్లా వికసించేవి! రామేశ్వర్రావు ఓ పెద్ద గ్రంథాలయం, ఒక మేధావుల సభ, ఒక పసిఫిక్ మహాసముద్రం, ఒక తపోవనం, అదో అనంత నవజీవన ప్రవాహం!!

ఆదివారం 8, డిసెంబర్ 1996

# ఆంధ్ర 'పాల్ రాబ్సన్' గద్దర్!

"గద్దరమ్మ నోటికి దండం' అనేవాళ్ళు, ఇప్పుడు 'గద్దర్' నోటికి దండాలు పెట్టే రోజులొచ్చాయి!

ఒక ఉద్యోగిగా సరిపెట్టుకుని, పెరుగుతున్న ధరలతోనే రాజీపడి బతుకుభారాన్ని చిరునవ్వుతో మోసుకుంటూ కాలక్షేపం చేయలేక, కళారంగాన్ని కదనరంగంగా మార్చిన విప్లవ కవితా ఉద్యమ వారసుడు, కవి, మధుర గాయకుడు అయిన గుమ్మడి విఠల్‌రావు (గద్దర్) కాకతీయ మహాయుగానికి, తెలంగాణా విప్లవోద్యమానికి కారణమయిన తెలంగాణాలో పుట్టి పెరిగినవాడు జనం మనిషి, నిరుపేద జనం నుంచి వచ్చానవాడు, బతుకు పుస్తకమే చదువుగా చేసుకున్నవాడు, ఆ చదువు ఉద్యమానికి, ఉద్యమం బతుకుకీ దారిచూపాలని తపన పడుతున్నవాడు అతని విమర్శ వ్యక్తిగతమైనది కాదు, వ్యవస్థాగతమైనది అందుకే వర్గాలు, వర్ణాలు లేని సమాజాన్ని ఆశించినవాడు, నిత్య హత్యాసత్యమైన ఆస్తిహక్కుకు బద్ధవిరోధి అది రద్దు కానంత వరకు ఈ కుల వ్యవస్థ,ఈ మత దురహంకార వర్గ సమాజం మారదనీ, మానవుడు మారడనీ నమ్ముతున్నవాడు కనుకనే "అనునిల్య ప్రాణభయం ఆనందదాయకం" అని గొంతెత్తి చాటగలిగాడు! అందుకనే మొండివాడు రాజుకంటే ఘనుడంటారు! అతని మొండితనం వర్గరహిత సమాజం కోసమే. కనుకనే గద్దర్ తన మాటను 'మున్నేరు'గా మలిచాడు, పాటను 'పాలేరు'గా పారించాడు! ఈ దశాబ్దంలో ఒక ప్రసిద్ధ ప్రజా కళాకారుడిగా జానపద కళారూపాలతో సరికొత్త బాణీలతో, సొంత గొంతుతో అట్టడుగు ప్రజల యాసలో, మాండలిక బాసలో సరికొత్త రూపాలతో కళారంగాన్ని విప్లవీకరించిన వ్యక్తిగా గద్దర్‌కు ఈ దేశంలోనే కాదు, ఖండాంతరాలలో కూడా పోలిక--నీగ్రో బానిసల బ్రతుకులకు అర్థం చెప్పి వాళ్ళ బాధల గాథలే పల్లవిగా, అనుపల్లవిగా, వీధి వీధిని గానం చేసి అజ్ఞాత జీవితాలకూ, అస్థిరమైన ప్రవాస జీవితాలకూ నాద బ్రహ్మగా నిలిచిన పాల్ రాబ్సన్ ఒక్కడే! ఆ బానిసల గర్భశోకానికి శ్రుతిగా సంగీతం వెలయించిన పాల్ రాబ్సన్ 1950లలో 'ఫిస్క్ జూబ్లీ గాయకుల'కు ప్రత్యక్ష వారసుడు "రెక్కలొచ్చిన దేవుడి బిడ్డలు -- హరిజనులు" (*God's Children got wings*) అన్న యూజిని 'ఓనీల్ ' నాటకంలో ప్రసిద్ధ పాత్ర వహించిన రాబ్సన్ వీధివీధినీ ఆనాడు తన మాటలకూ, పాటలకూ రంగస్థలం చేసుకున్నాడు అమెరికా, యూరప్‌లలో నాడు రాబ్సన్ నిర్వహించిన బృందగాన సభలన్నీ మోడువారిన బ్రతుకులను చిగురింపజేసిన ఆవేదనా కలశాలు, బడుగు జీవులకు సమర్పించిన నిత్యనైవేద్యాలు, కారుణ్యం, కారిన్యం కలగలిపిన జానపద కళారూపాలు! స్పానిష్ అంతర్ యుద్ధంలో సమరగీతాలు ఆలాపించాడు ఈ సమర కళాయాత్రను సహించలేని అమెరికా పాలకులు రాబ్సన్ నోరు నొక్కబోయారు, అతని గాన సభలను దేశమంతటా నిషేధించారు, విదేశాలకు వెళ్ళకుండా పాస్‌పోర్ట్ నిరాకరించారు అయినా జ్ఞాతంగాను, అజ్ఞాతంగాను, దేశంలోనూ దేశాంతరాలలోను ప్రసిద్ధ సంగీత కళా సంస్థలు, నాట్య సంఘాలు, అభ్యుదయ రచయితల సంస్థలు, ప్రభుత్వాలు, ప్రసిద్ధ అధికారులు, అనధికారులు, సాధారణ జీవన రంగంలో సర్వవిభాగాలకు చెందిన మేధావులూ రాబ్సన్‌ను తలకెత్తుకున్నారు, దీవించారు, అతనిలో తామూ జీవించారు అందుకే పాల్ రాబ్సన్ దిలాసాగా, కులాసాగా, దీటుగా ధాటిగా "ఇక తీర్పు మీదే" (*Here I Stand*) అని తన స్వీయ చరిత్రను చాటుకున్నాడు అలాంటివాడు మన గద్దర్ "ఫిస్క్ జూబ్లీ" గాయకులకు రాబ్సన్ వారసుడైనట్లే , నూతన

ఫక్కీలో శ్రీకాకుళ గిరిజనోద్యమానికి అక్షర రూపమిచ్చిన జముకుల కథకు జనకుడు, గాయకుడూ అయిన పాణిగ్రాహి జానపద కళాసృష్టికి ప్రత్యక్ష వారసుడు గద్దర్ పాణిగ్రాహి జముకుల కథలోని కథకుడైన చినబాబు వయస్సు ఆనాటికి 14 ఏళ్ళే అయినా బుద్ధిలేని ప్రభుత్వం రైల్వేస్టేషన్లో జనం మధ్యనే అరెస్ట్ చేసి అర్ధరాత్రి అడవులలో "ఎన్‌కౌంటర్" జరిపి ఆ "అభిమన్యుడి"ని పొట్టన పెట్టుకుంది! నాటి ఆంధ్ర కళారంగంలో విప్లవానికి అదే నాంది రచయితలను, కళాకారులను నిర్బంధించడం ఏ ప్రభుత్వ పతనానికైనా తొలి మెట్టు అవుతుంది అప్పుడు ఎవరికి వారే ఆలోచించుకుని కాంగో కవి 'లెవెన్ ట్రీ' అన్నట్టుగా "తన విముక్తికి తానే నడుం కడతాడు " *(I myself will be the stage for my salvation!)*

కనుకనే శ్రీకాకుళం ఏజెన్సీ ప్రాంతకల్లోలానికి కలం గళం సారధ్యం వహించిన పాణిగ్రాహి గాని, తెలంగాణాలో గిరిజన ప్రాంతాలలో దోపిడీ వ్యవస్థపై గజ్జెకట్టి గుండె చప్పుళ్ళు విన్పించిన గద్దర్‌గాని తాము పుట్టి పెరిగిన నేలతల్లి సౌందర్యాన్ని, సంపదైశ్వర్యాలను గురించి తమ మాటలలో పాటలలో ఏ తెలుగు భావకవికన్నా కూడ గుండెను గుడిగా చేసికొని అతి రసస్ఫోరకంగా చిత్రించి చూపారు, లక్షలాది జనాన్ని కదిలించారు సమాజంలోని ధనిక నిర్ధనిక భేదాలు, వ్యత్యాసాలు వాళ్ళ వాణినీ బాణినీ కూడా మార్చాయి కళింగ యుద్ధం అశోకుణ్ణి అస్త్రసన్యాసం చేయిస్తే, అదే కళింగ రాజ్యంలో భాగం అయిన శ్రీకాకుళం పాణిగ్రాహి 'వర్గ' కవులచే అస్త్ర విన్యాసాలు, శస్త్ర విన్యాసాలు చేయించింది! చెట్లపాదుల చేత పొట్లపాదులచేత రాజకీయాలను మాట్లాడించిన తెలంగాణా ఉద్యమానికి వారసుడైన గద్దర్ ఆదిలాబాద్ జిల్లా ప్రకృతిశోభను, రామణీయకతను, సంపదను, గిరిజనుల పాట్లను వారిపై సాగుతున్న దోపిడీ దౌర్జన్యాలను కాలి చిరుగజ్జెల సవ్వడిలో సరికొత్త బాణీలలో అనితర సాధ్యంగా, అందంగా పొందుపరిచాడు అతని బాణి విప్లవ రచయితల సంఘానికి "పారాణి"గా అమరింది ఆంధ్ర ప్రజా నాట్యమండలి చేతుల మీదుగా, ఒకనాటి సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో పునరుద్ధరణ పొందిన ఎన్నో జానపద కళారూపాలు ఆనాటి వాతావరణాన్ని పుణికి పుచ్చుకోగా ఇటీవల పాణాగ్రాహి, గద్దర్ చేపట్టిన కళారూపాలు సరికొత్త ఫక్కీలో తెలుగుభారతి నొసట వీరరస గంగాధర తిలకాలు దిద్దాయి! అందుకే తెలుగు బుర్రకథను రమ్యమైన కళాఖండంగా తీర్చిదిద్ది దేశాన్ని ఊపివేసిన నాజర్ కూడ పాణిగ్రాహి, గద్దర్ ప్రయోగాలను కళ్ళ కద్దుకున్నాడు! విరామచిహ్నంగా, ఆకస్మికంగా గొంతు గాద్గదికం అయినప్పుడు ప్రేక్షకుల గుండెల్లో ఝల్లుమనిపించే సందర్భాలలో తప్ప--మిగతా అన్ని పట్టుల్లోనూ అందమైన పదచాలనంతో ప్రేక్షకుల అంతరంగాలను కదిపివేసే సంప్రదాయం గద్దర్‌ది కథకు, వర్ణనకు, హాస్యానికి, గంభీరతకు, రౌద్రానికి, కరుణకు, కారిన్యానికి, బీభత్సానికి రమ్యతకు, సభ్యతకు--ఒకటేమిటి, నవరసాలకు మించిన నవ్య పోషణకు నగలు తొడిగే సామాన్యుని నాగరికతా సంస్కృతుల నట్టింటి మాణిక్యంగా గద్దర్ బృందం దిద్ది తీర్చినదే జన నాట్యమండలి! గోదావరి, ప్రాణహితల లయలకు హొయలు చిందించే అనుబంధాలు, సహ్యాద్రి కొండల అమరికలకు ఢమరుకలే గద్దర్ కళారూపాలు! అమరవీరులను తలుచుకుంటూ అతను రాసిన "పాదాపాదాల పరిపరి దండాలు", "సిరిమల్లె చెట్టు కింద", "లాల్ సలామ్" పాటలు, కవాలీ, సంగీత నృత్య రూపకాలు మరపురాని కళాస్మృతులు. బాబాల పేరిట ప్రజలలో మౌఢ్యాన్ని పెంచుతున్న శక్తులకు గద్దర్ ప్రత్యక్ష సమాధానం, వ్యంగ్య చిత్రీకరణ "సాయిబాబా" పాట గద్దర్ లాంటి సంప్రదాయాల్ని నెలకొల్పిన వాళ్ళు ఖండాంతరాలలో ముఖ్యంగా ఆఫ్రికా తెగలలో అనేక

మంది కనిపిస్తారు ఈ ఖండంలోని పెక్కు దేశాలలో మౌఖిక సంప్రదాయ కవిత తిరుగుబాటు కవితగా నల్లజాతుల ప్రత్యేక సంస్కృతీ చిహ్నంగా "బ్లాక్ ఆరిఫన్" సుప్రసిద్ధ కళాసంస్థగా అవతరించింది। ఎరూబా తెగలు ప్రత్యేక బాణీలతో ముందుకుసాగి పాత సంప్రదాయా లెన్నింటినో వెనక్కు నెట్టాయి అలాగే 'అకాన్ కవిత, హూసాలాండ్‌లో 'హూసా' కవిత, స్వాహిలీ కవితలు, సంగీత నాటక రూపాలు కూడా ఇలా కొత్త బాణీలలో సాగిపోతున్నాయి కొన్ని కరిబియన్ దీవులలోని కొన్ని కళారూపాలు చూస్తే, నృత్యనాటికలు గమనిస్తే గద్దర్ గుర్తుకు రావలసిందే ఆ వంతులు కలపడంలో, ఆ పదచాలనంలో, ఆ గజ్జె కట్టడంలో, ఆ చిందువేయడంలో--1928 నాటికి క్యూబన్ కవి కార్పెంటర్ చిత్రించిన ఓ విచిత్రమైన "రిబాంబరంబ" *(La Rebambaramba)* అన్న సంగీత రూపకం గుర్తుకొస్తుంది గద్దర్, వంగపండు ప్రసాద్ (విశాఖ బాణీలో) "జజ్జనక జనారే" అనే పాట విన్నపుడు ఈ జోస్టాలే *"Rumba"* పాట గుర్తుకొస్తుంది। గద్దర్ అంగోలా కవి అగస్తినో నేటో లాంటివాడు గద్దర్ రాష్ట్ర సరిహద్దులు దాటి, దండకారణ్యంలో దూకి, రాముడికి బదులు పరుశురాముడై సంచరించి, మణిపూర్ అస్సాం ఉద్యమాల ఊపిరిని కూడా పొదుగుకొని, భాషల అక్షరాభ్యాసం చేసి హైదరాబాద్‌లో మళ్ళీ పొద్దుపొడుపై వాలాడు।

ఫిబ్రవరి 25, 1990

---

** లార్క్, మ్యూజికల్ ఆఫ్రికన్ కవి వర్ణించినట్టుగానే గద్దర్ కవిత కూడ సామాజిక అంతరాల దొంతరలను అంతరింపచేసే కొత్త గాలులకు జవజీవాలకూ, ప్రాణ కవితగా అదే 'ప్రాణహిత'గా మారవచ్చు అందుకే నేటి తెలుగు వెలుగు గద్దర్--రేపటి వెలుగు భారతి 'రాబ్సన్'!!*

# "తెనుగు లెంక" వెలుగు చంద్రవంక!!

కలాన్ని కత్తిగా వాడుకున్న నాటి తెలుగు కవులెందరెందరో! ఒక వైపునుంచి 'స్వాతంత్ర్యం మా జన్మహక్కు' నినాదభేరీలతో తెల్లవాడిని హడలగొడుతున్న జాతీయోద్యమం, మరొక వైపు నుంచి అందులో అంతర్వాహినిగా పొరుదలలో ఉన్న ఆంధ్రోద్యమం, ఇంకొకవైపు నుంచి సారస్వతరంగంలో భావకవిత్వం, నవ్యకవిత్వోద్యమాల సంరంభం - ముప్పేటగానూ మూడుపాయలుగానూ తెలుగువారి మనస్సులను ఊగించి, శాసించిన విశిష్ట సంస్కృతీ వారసత్వం జాతీయోద్యమానికీ, రాష్ట్రోద్యమానికీ బాసటగా నిలిచిన నాటి కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికలు ఉద్యమ ఉధృతికి సారస్వతేయులకు మనసారా వాకిళ్ళు తెరిచిన కాలం అది, కోస్తాంధ్రలో ప్రథమాంధ్ర మహాసభ, తెలంగాణా గడ్డపై విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి అవతరణ, రాయలసీమలో భారత జాతీయతా భావాలే కేవల కథా వస్తువులుగా ఉత్తేజపూరితమైన కమనీయ కవితలుగా వెలువడిన రెండు తొలి కావ్యాలు - రాజశేఖర కవి రసపుత్ర గాథాలహరి "రాణా ప్రతాప సింహుడు", "చిత్తవృత్తి నుడికించి సివమెత్త జేసిన" గడియారంవారి "శివ భారతం" వెలుగుచూసిన కాలం కూడా అదే! ఆ శుభఘడియలలో, ఆ ఉద్యమాల ఊగులో, ఆ శౌర్య ప్రతాపాల తూగులో తెలుగుదనం మూర్తీభవించి వచ్చినట్టు మహోపాధ్యాయులు... కొట్టవొచ్చినట్టు జనపదంలో, పదపదంలో మనస్సులను రంజింపజేసి, ఉద్యమాలకు ఉడతా భక్తులుగా, వీరులుగా, ధీరులుగా పౌరులను దిద్దితీర్చిన అచ్చమైన స్వచ్ఛమైన తెలుగు కవులు కొలదిమందిలో ఒకరు - ఒకనాటి బడిపంతులూ, స్వాతంత్ర్య సమరయోధుడూ బుధవారంనాడు అస్తమించిన "అభినవ తిక్కన", కాదు, కాదు "తెనుగు లెంక" నిస్వార్థజీవి, తుమ్మల సీతారామమూర్తి జాతీయతా దృక్పథానికి తెలుగునాట "దేశభక్తి" గీతంలో అంకురార్పణ చేసినవాడు గురజాడ కాగా, జాతీయోద్యమ కవితకు, ఆంధ్రోద్యమ కవితాలతకూ స్పష్టమైన ఆకృతినీ, ఆవేశాన్నీ 'జన్మభూమి' ద్వారా, "ఆంధ్రావళి" ద్వారా కల్పించినవాడు రాయప్రోలు గురజాడ, రాయప్రోలు రెండు చక్రాలుగా సాగుతున్న నవ్యాంధ్ర కవిత్వోద్యమ రథచక్ర ఘోష, దాని ప్రభావమూ అబ్బూరి, దేవులపల్లి, విశ్వనాథ, తుమ్మల, త్రిపురనేని రామస్వామి, శ్రీశ్రీ, వేదుల, బసవరాజు, పుట్టపర్తి, మధునాపంతుల, జంధ్యాల మీదుగా సాగి కాళోజి, దాశరథి, నారాయణరెడ్డి వరకూ పాకింది ఆ ఊపులో జాతీయోద్యమానికీ, ఆంధ్రోద్యమానికీ అక్షరాస్యతలు అందించని కవులు లేరు! "ఆత్మవిశ్వాస సూర్యోదయకాంతి"లో అలా ముందుకు సాగారు వాళ్ళు పరాయిపాలననుంచి దేశ విముక్తికోసం భారతాన్ని 'మాత' గా కొందరు, అంబగా ఇంకొందరు, శక్తిగా మరికొందరూ ఆవాహనం చేశారు, ఆ జాతీయ ఉద్యమంలో అంతర్లీనమై ఆంధ్రప్రశస్తినీ, ఆంధ్రతేజాన్నీ, ఆంధ్రపౌరుషాన్నీ, తెనుగు కత్తినీ, తెనుగు వాణినీ, బాణినీ కీర్తించి పలికించారు

ఈనాడు అన్నిరకాల పిదప బుద్ధులు, అవినీతి అందలమెక్కి అన్ని విలువలను మంటగలుపు కుంటున్నాంగాని - అసూడు జారిన దేశగౌరవాన్ని చక్కదిద్దుకొని పరిపాలనా యంత్రాంగాన్ని ప్రశంసార్హంగా ప్రజారంజకంగా తీర్చిదిద్దుకోవాలని ఉవ్విళ్ళూరిన గాంధేయ కవులలో సుప్రసిద్ధుడు తుమ్మల సత్యాగ్రహ ఉద్యమంలో జైలుకి వెళ్ళిన తుమ్మల స్వాతంత్ర్య సమర కాంతిలోనే గాంధీజీ ఆత్మకథను తెలుగులో పరిపూర్ణ కవితాత్మగా మలిచిన మహోద్దండ పండితుడు ఆయని "రాష్ట్రగానం", ధర్మజ్యోతి, పరిగపంట, జాతీయ భావాలనూ,

ఆంధ్రాభిమానాన్ని ఇంపైన తెలుగులో సొంపైన నుడికారాలతో పాఠకుల మనస్సులను దోచుకున్న కవితా ఖండాలు "ఓసి జాతీయతా, నీ బలోజ్వలత్వమెంత/ నీ శక్తి సామర్థ్యమెంత!/ అస్థిపంజరములు సైత మాడునౌర!" అని ఒక వైపున దువ్వూరి రామిరెడ్డి సింహపురినుంచి ఆశ్చర్యం ప్రకటిస్తున్న ఆ ముహూర్తంలో ఇటు తుమ్మల భరతమాతను "వెన్నతోడనె చతుర్వేద బుక్కులు పంచి సుతులచుంచు" (జుట్టు) దువ్విన గంగానదీ జల క్షీరమెపుడు కురిసి బిడ్డల పోషించుకొనుచున్న పచ్చి బాలెంతరాలు మా భరతమాత" అని ఆర్ద్రంగా గానంచేశాడు అంతేగాదు, అర్ధశతాబ్దం కిందటి తరం కవులు కేవల ఆంధ్రాభిమానంతోనే తృప్తి పడలేదు కుల మతాలు ఈతరం వారికి అబ్బిన కుళ్ళుగాని ఆ తరం సమతాదృష్టినే అలవరచుకున్నది నేటి సిక్కు - మనలో కొందరికి 'అంటరాని' వాడు కావచ్చు! కాని, ఔరంగజేబు చేతజిక్కిన తేజ్ బహదూర్ అనే సిక్కు వీరుడ్ని అతని రోషాన్నీ తుమ్మల అసిధారగా వర్ణించాడు "అకుంఠిత శౌర్యులు సిక్కు జోదులీ వీరుని నెత్తురుచుక్కనొక వేవురు పుట్టి మొగల్ ప్రభుత్వ ధాత్రీ రుహమున్ పెకల్తురు గరిష్ఠులు కూకటి వేరులూడగన్"! వీరగణాలను ఉపయోగించుకోవడం చేతగాని వాజమ్మలు దేశ సమైక్యతకూ, సమగ్రతకూ చేజేతులా చిచ్చు పెట్టుకుంటారు!

అలాగే నాడు ఆంధ్ర శౌర్య పతాకలను పట్టించిన వాళ్ళూ, 'ఆంధ్ర సామ్రాజ్య దిగ్జయ స్తంభమెత్తించిన వాళ్ళూ, ఆ పౌరుషాన్ని గుర్తుచేసిన వాళ్ళూ కవులేగాని స్వార్థపరులైన రాజకీయవేత్తలు కాదు! ఆంధ్రయువకులు "తూరుపు కనుమ దుర్గముల నేలిన దినమ్ము"లనూ, ఆంధ్రపౌరుషం ఆటలాడిన చోటులనూ విశ్వనాథ మనకు చూపిస్తే, తుమ్మల సొంపైన తెలుగులో "తెలుగు జోదుల తుటారి కటారి చెలరేగి పగర చీల్చిన" దినాలను గుర్తుచేస్తాడు! ఢిల్లీ, చోళ, పాండ్య శత్రువాదులను తిప్పికొట్టిన "స్వర్ణయుగం"లో తాను పుట్టనందుకు "ఏల పుట్టితి నిపుడిసీ! యేటి బ్రతుక"ని కుసిస్తాడు అంతేగాదు, "యావదాంధ్ర విషయమ్మొ నొక్క రాజ్యమ్ము జేసి/విజయ దుందుభిపై దెబ్బవేయువరకు/ తెలుగు వసి పావకైన నిద్రింపదగునె" అని బొడ్డులో చేయివేసి ప్రబోధాత్మకంగా ప్రశ్నించి కర్తవ్యానికి కటిబద్ధుడ్ని చేస్తాడు! సరిగ్గా తుమ్మల కలం చిందుల మధ్యనే త్రిపురనేని కూడా "కంచి కోటల కంచు తల్పులు ఖంగు ఖంగున" మ్రోగినప్పటి రోజుల్ని గుర్తుచేశాడు! అంతేగాదు, ఆనాటి స్త్రీల పౌరుష రేఖలను కూడా తుమ్మల మనకు కళ్ళకుకట్టి చూపించాడు. "కలము ఖడ్గము పట్టగల నేర్పు వడసిన" రెడ్డి నాగమ్మను, "జగమగంటిమి నాంధ్ర జగతి లాలించిన" రుద్రమాంబనూ, "మానంబుకై నిజ ప్రాణంబు బలియిచ్చు" మల్లాంబనూ, "గండికోటను మల్కదండుపై దూకించిన" గోవింద మాంబనూ, "ఏగివచ్చిన హృదయేశు వెక్కిరించి పోరికంపిన" చానమ్మనూ గుర్తుచేస్తాడు నైలునదికీ, కృష్ణానదికీ ఉన్న వాణిజ్య బాంధవ్యాన్ని తెలిపాడు ఆనాటి ఆంధ్రనౌకలు "సకల దీవుల విజయ ధ్వంసముల నాటి/ తనదు తెరచాప చిర్రాజునకు కట్టుకోకగా" అమరి తిరిగాయని సగర్వంగా చెప్పాడు! ఆనాటి ఆంధ్రభోగం ఇరుగుపొరుగుకు కన్నెర్రగా మారి "పండ్లు పుల్లనై పోవు నీ భోగమ్ము కన్నచో" అని తెలుగుతల్లికి నీరాజనాలర్పించాడు ఇక ప్రకృతి వర్ణన అంటారా, తెలుగు పలుకుబళ్ళను దోసిళ్ళలో నింపుకొని, మనం అరగించుకోలేనంత నుడుల సంపదను కావిళ్ళకెత్తినవాడు తుమ్మల. అందుకే అతనికి "అభినవ తిక్కన" అన్న బిరుదిచ్చారుగాని, తాను మాత్రం ఎప్పటికీ నిగర్వి అయిన తెలుగు సేవకుడనేనని, కనుకనే తనకు "తెనుగులెంక" చాలుననీ తృప్తిపడ్డాడు!

ప్రకృతి ఒడిలో ఎదిగిన తుమ్మల, పల్లె జీవనానికి , ప్రకృతి రామణీయకతకూ అద్దం పడుతూ - సంక్రాంతి వైభవంలో గుమ్మడి పూదుమారాలు చూపాడు మిర్యపుపండు బొట్టులు పెట్టాడు బంతి పువ్వులకు చేమంతులతో నెయ్యంకట్టాడు, నెలదప్పిన కోడలిని, భోగి పొంగలి పూజలనూ చూపాడు, పెంకె బావలను, గడుసు మగళ్ళను, మరదళ్ళనూ పరిచయం చేశాడు. లేగటి పాలు, భోగి పాయసాలు, చవులూరించే కరివేప తాలింపులూ, ఘుమఘుమలాడే పైర వంకాయ కూర, నక్కదోస బజ్జి, ముదురు గుమ్మడి పండు ముదురు పులుసులతో మన జిహ్వను కాస్తా ఇట్టే జివ్వుమని గుంజేస్తాడు! ఒక్క మాటలో - మకర సంక్రాంతి ధ్వజమెత్తిన తెలుగు భూమి "మధుర మధురానురాగ సామ్రాజ్యపీఠి" పైన తుమ్మల అధ్యక్షతన తిష్ఠవేసింది! గూడుకట్టిన తెలిమబ్బు గొడుగు నీడల్లో పంట కళ్ళాలు కదిలివచ్చి భాగ్యరాశులు నింపి పొమ్మని ఆశించి ఆహ్వానించిన తుమ్మల సీతారామమూర్తి - తెలుగువారి బుద్ధులకు వంకలు తీర్చిన లెంక, ఆరంభ శూరత్వానికి ముగుదాళ్ళు వేసి ఆలోచనలతో మరీ ముందుకు నడిపించిన వెలుగుల చంద్రవంక!!

మార్చి 24, 1990

# 1999 డిసెంబర్ 31

ప్రస్థానం అంటే ప్రయాణమనే కాదు, శాస్త్రం అని కూడా అర్థం 'శాస్త్రం' అంటే ధర్మమీ మాంస అనే కాదు. జ్యోతి అని కూడా అర్థం అర్ధ శతాబ్దంగా తెలుగు సాహితీ లోకంలోనే గాక తెలుగు సామాన్య ప్రజల హృదయాలలోకూడా తనకొక యుగాన్ని సృష్టించుకొని, ప్రస్థానభేరి మోగించిన మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావు ఇప్పుడు "పయొనీర్"లాగా మహాప్రస్థాన యుగం దాటి పోయాడు అనంత విశ్వంలొ కలిసిపోయాడు

శ్రీరంగం శ్రీనివాసరావు ఒక వ్యక్తిగానే గాక, ప్రాచీన నవీన జాతీయ అంతర్జాతీయ కవితా శాఖలను పుక్కిట పట్టినవాడేగాక, స్థలకాలాలను సామాజికదృష్టితో జయించి విశ్వమానవుడుగా, తానే ఒక వ్యవస్థగా మారి విలయతాండవం చేసిన మహాకవి వెనక బాణభట్టు తిని వదిలినదే మిగతా ప్రపంచానికి 'తిరపెం' అనుకునే వారు అలాగే ఆధునిక యుగంలో శ్రీశ్రీ సాహితీ క్షేత్రంలో చేయని సాగులేదు, తీయని పంటలేదు కనుక ఈ రోజుకీ సాహితీపరుల ఉపన్యాసాలలో, రేడియో ప్రసంగాలలో, సభలలో సమావేశాలలో ఏదో ఒక దశలో 'శబ్ద బ్రహ్మ' శ్రీశ్రీ నీడలు, శ్రీనీడలు వక్తల భావజాలాన్ని వెన్నంటుతూనే ఉంటాయి అతని కవిత్వ తత్వాన్నీ ప్రయోజనాన్నీ లక్షణాన్నీ నిర్దేశించినది "కవితా - ఓ కవితా" కాగా, అతని ప్రాపంచిక దృష్టినీ, సంఘ పరిశీలననూ, పేదసాదల జీవన సరళిని కొత్త దృక్కోణాల నుంచీ, మానవతా సులోచనాలనుంచీ నిశితం చేసినది 'మహా ప్రస్థానం' మనసులు కలిసిన మనోహర ప్రేమకోసం తహతహలాడిన శ్రీశ్రీ భావకవితా దశలనుదిద్ది తీర్చిన ప్రభావ మూర్తులు రాయప్రోలు, కృష్ణశాస్త్రి కాగా, ఆయనదృష్టినీ, కావ్యసృష్టినీ ప్రబంధ శైలినుంచి ప్రజాశైలికి మరల్చినవాడు గురుజాడ ఎన్నెన్ని విన్యాసాలు, ఎన్ని పదబంధాలు, ఎన్ని లయలు! తాను కదిలాడు, ఇతరులను కదిలించాడు అందుకే అతను యుగకర్త కాగలిగాడు 'ప్రభవ' రచనా కాలంనాటి ప్రజలకు దూరంగా మెరుగులు దిద్దుకుంటున్న శ్రీశ్రీ జాతీయోద్యమం, ఆర్థిక సంక్షోభాలు, ప్రపంచ విప్లవాల ప్రభావంతో విప్లవ కవిగా ఆ రచయితల సంఘానికి నేతృత్వం వహించగల దిట్ట కాగలిగాడు

శ్రీశ్రీకి భాషమీద ఇంతటి అధికారం, భావం మీద మరింత ప్రభుత్వమూ అబ్బడానికి కారణం కొత్త పాతల మేలు కలయికవల్ల , సుఖమైన పరివర్తన సాధ్యమని నమ్మినందువల్లా, ప్రాచీనత చేత చాకిరీ చేయించుకుని నవీనతను మరింత నవనీతం చేసి పెట్టాడు తలుచుకుంటే శ్రీశ్రీ ఏకకాలంలో ఒక కాళిదాసుగా, లేదా కుమారిల భట్టుగా దర్శనమివ్వగలడు ఈ క్షణంలో నన్నయగా, మరు క్షణంలో అతనే పండిత రాయలుగానూ రాణించగల సమర్థుడు కనుకనే ఆధునిక కవితా యుగంలో అంతటి హిమాలయ శిఖరాలను అధిరోహించగలిగిన శ్రీశ్రీ అటు భావ,నవ్య, అభ్యుదయ, దిగంబర, విప్లవ కవితా పాయలకూ శాఖలకూ సమన్వయ కర్త కాగలిగాడు ఈ అన్ని దశలనూ అతను పువ్వులో తేనెను జుర్రుకునే తుమ్మెదలా తనివితీరా అనుభవించాడు అనుభవ పరిపాకాన్ని మరి మరీ లోకానికి ఇంద్రధనుస్సులా పంచిపెట్టాడు

మధ్య మధ్యలో, మార్గ మధ్యంలో పెడదారులలో సరదాలు చేశాడు · 'సర్రియలిజం', 'డాడా యిజం' అతనిపై ప్రభావం మోపిన యవ్వన చాపల్యాలు కాగా దీర్ఘ కాలంలో అతనికి మనస్తత్వ శాస్త్రంలో, ఫ్రాయిడ్, మానవతా దృక్పథంలో కార్ల్ మార్క్స్ గురుతుల్యులయ్యారు

కాగా, ఫ్రెంచి విప్లవ సంప్రదాయాలకు వారసులుగా, ఎదిగి వచ్చిన మపాసా, అలెన్‌పో బాద్‌లేర్‌లను తన 'రుషిత్రయం'గా పేర్కొన్నాడు శ్రీశ్రీ ఇక్కడ మధ్య యగాలలో వేమనను, అధునిక కాలంలో గురజాడను గురువులు అన్నాడు డికెన్స్ రాసిన 'పిక్‌నిక్ పేపర్స్'ను సోములు కథ'గా శ్రీశ్రీ చెబితేనే వినాలి, చదవాలి, చదివించాలి

ప్రవర్తనలో పసిపిల్లడూ, మనస్తత్వంలో శిశువు అయిన శ్రీశ్రీని ఒకప్పుడు కొందరు మతిచెడిన చాందసులు 'శ్రీశ్రీ అంటే సిరి అనే కాదు, 'విషం అని కూడా వ్యంగ్యంగా విషం కక్కారు కానీ ప్రపంచాన్ని మరొక పదడుగులు ముందుకునెట్టి అందరి జీవితాలను సుఖమయంచేద్దామని ఆశించే ప్రగతి కాముకులందరూ శ్రీ అంటే - సిరి అనే కాకుండా కీర్తి, బుద్ధి, వృద్ధి అని కూడా సమన్వయించుకున్నారు! మానవుణ్ణి చంద్రలోక యాత్రకు మానసికంగా 30 ఏళ్ళక్రితమే కవితాపరంగా సిద్ధంచేసిన శ్రీరంగం శ్రీనివాసరావు రాబోయే కాలంలో బహుశా ఈ శతాబ్దం చివరికే (1999 డిసెంబర్ 31 నాటికే) అంటే 2000 సంవత్సర సుదినం తొంగిచూసే రోజుకే - మానవుడు మరణాన్ని కూడా జయిస్తాడని చెప్పేశాడు! అది కవితా జోస్యం కావచ్చు కానీ మానవకోటిపైన అనంతమైన ప్రేమతో, విశ్వాసంతో, మనఃపూర్వకంగా కవి పలికి ఆశీర్వాదం 'చతురస్రం' అనే ఈ నాటికా రచనలో ఈ శతాబ్దాంతానికి కూడా ఇప్పటి మాదిరిగానే మానవ ద్వేషులు కొందరు ఇంకా మిగిలి ఉండి, 'అమృతా'న్ని పంచొద్దు అనేవాళ్ళు ఉంటారనీ, అయితే హెచ్చుమంది పంచాలనే వాళ్ళు ఉంటారని వూహామాత్రంగా హెచ్చరించాడు రెండువేల సంవత్సరం నాటికి 'ఆఫ్రో ఆసియన్ తీర్మానం' ప్రకారం అమృతాన్ని పంచి లోకంలో అంతమందినీ 30 ఏళ్ళ వాళ్ళుగా మార్చడానికి అద్భుత ఊహాచిత్రాన్ని వ్యూహాత్మకంగా, కవితామకుటంగా కమ్మని 'బ్లూ ప్రింట్' కి అందజేసిన వాడు శ్రీశ్రీ అది సాధించుకునే బాధ్యతను తన తరువాతి తరానికి విడిచి వెళ్ళిన తార ధృవతార శ్రీరంగం శ్రీనివాసరావు

# దళిత సాహిత్యంలో 'ఆత్మకథా'విష్కరణం

కడుపు నిండినవాడి బేరంవేరు కడుపు మండినవాడి బాధ వేరు ఈ రెండు సంస్కృతుల మధ్య అగాధాన్ని పెంచి పోషించిన మరో సంస్కృతి ఉంది దాని పేరే కులం అది కుత్సితానికి మారుపేరు, మనిషిని పెరగనివ్వదు, మనసును ఎదగనివ్వదు, ఈ దేశంలో మమతను, మానసిక ఔన్నత్యాన్ని 'బోనసాయ్ మొక్కల్లా' పెంచి పోషిస్తున్న దౌర్భాగ్యపు నాగరికతకు కులం ఓ కొలబద్ద! ఈ బద్దను విరిచి తునాతునకలు చేయనిదే కులాలమధ్య అంతరాలు తొలగవు, కులాలు అంతకన్నా మాసిపోవు! భారతీయ సమాజాన్ని కుమ్మరి పురుగులా తొలుచుకుంటూ వస్తున్న ఈ 'కుల'జాడ్యం-దేశానికి రాజకీయ స్వాతంత్ర్యంవల్ల తొలగలేదు, ఆ తరువాత రావలిసిన సాంఘిక, ఆర్థిక విప్లవాలు వాయిదా పడినందున ఈ జాడ్యం మరింత పెచ్చరిల్లింది, మాక్డోనాల్డ్ కమ్యూనల్ అవార్డువల్లగానీ, పూనా సంధివల్లగానీ సాంఘిక అసమానతలు మరింత గుణకారం పొందాయేగాని తగ్గుముఖం పట్టలేదు ఫలితంగా ఈ దేశంలో వర్ణ(కుల)వ్యవస్థ తెచ్చిపెట్టిన 'మాలోకం' యధాతధంగానే కొనసాగుతోందిగాని మాటవరసకు కూడా మారినట్టు కనిపించడంలేదు! చివరికి 3,500 పుస్తకాలు కులవ్యవస్థమీద అచ్చయినా, దళిత వర్గాల జీవనంలో మార్పు చెప్పుకోదగినంతగా రాలేదు! ఈ పూర్వ రంగంలో సాంఘిక, ఆర్థిక న్యాయానికి ఇంకా చాలాదూరంలో ఉన్న షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల, తదితర బడుగువర్గాలనుంచి పెల్లుబికిన దళితుల ఉద్యమం-దళితసాహిత్యాన్ని ఆవిష్కరించింది ఈ సాహిత్యానికి ఇతర వర్గాలను ద్వేషించడం ప్రధానం కాదు, తమ ప్రజల వాస్తవ జీవనాన్ని ప్రతిబింబించడం, వారిని చైతన్యవంతులను చేయడం, వ్యక్తిత్వ వికాసంకోసం పడుతున్న తపనలో భాగంగా తన తనాన్ని నిండుగా నిరూపించుకోవడం ప్రధానం అయింది దళితులపై సాగుతున్న అగ్రవర్ణదాడులు, ఆగడాలు, భూమికోసం, భుక్తికోసం సాగుతున్న పోరాటాలపై వస్తున్న నిర్బంధాలూ, వదలని వర్ణ వివక్ష తాలూకూ నీడలూ దళిత సాహిత్యం ఎప్పటికన్నా ఎక్కువ శాఖోపశాఖలై (కవిత, కథ, నవల) శరవేగంతో విస్తరించడానికి తోడ్పడ్డాయి ఈ పరివ్యాప్తి వ్యవధి సుమారు రెండు దశాబ్దాలు 1960లలో మహాత్మాపూలే, అంబేద్కర్‌ల స్ఫూర్తితో మహరాష్ట్రలో ప్రారంభమై, 1980లనాటికి గుజరాత్‌కు వ్యాపించి, 1990లనాటికి తెలుగునాట విస్తరిస్తున్న దళిత సాహిత్యం దళిత యువతలో చైతన్య స్ఫూర్తి కలిగించింది వర్ణవ్యవస్థ రూపుమాసిపోతేగాని మనిషిలోని ప్రేమానురాగాలకు పరిపూర్ణత సిద్ధించదని నమ్మిన అంబేద్కర్, నెహ్రూల దృష్టి ఒకటే నెహ్రూ ఇలా అన్నాడు. " వర్ణ వ్యవస్థ చట్రంలో సామాజిక ప్రతిపత్తిలో సమానత్వంగానీ, అందుకు తగిన అవకాశంగానీ ఉండనే ఉండదు అలాగే, రాజకీయ ప్రజాస్వామ్యమూ ఉండదు, ఇక ఆర్థిక స్వాతంత్ర్యం అసలే ఉండదు. ఈ రెండు ధోరణుల మధ్య ఘర్షణను తప్పించలేము. ఏదో ఒకటే బతుకుతుంది". నేటి సమాజ పరిణామం కూడా నెహ్రూ, అంబేద్కర్ దర్శించిన ఆ ఘర్షణవైపే సాగుతోంది. కనుకనే వర్ణవ్యవస్థపై ఆధారపడిన హైందవంలో సమూలమైన మార్పులు రాకపోతే సంస్కరణలు మానవాభ్యుదయంవైపు [illegible] కళ్ళకు కప్పిన 'కులం' పొరలు తొలగకపోతే, మనో దౌర్బల్యాన్ని వీడనాడకపోతే పురోగతి లేదని వివేకానందుడు, దయానంద సరస్వతి చాటారు వ్యక్తుల మార్పిళ్ళపట్ల ప్రాతికూల్యం వ్యక్తం చేస్తున్నా మనం



హైందవ సమాజంలో కుల వ్యవస్థపై ఆధారపడిన సాంఘిక అసమానతను ఎందుకు తొలగించుకోవడంలేదని మొదటిసారిగా ప్రశ్నించిన వాడు వివేకానందుడు  అంతేగాదు, దారుణ దారిద్ర్యంలో మగ్గుతూ, జనాభాలో అసంఖ్యాకులను అస్పృశ్యులుగా చూస్తున్నప్పుడు (దళితులనే కాదు, చివరికి బౌద్ధులను కూడా అలాగే చూశారు) ఊరటకోసం ఉసురు నిలబెట్టుకోవడానికి దళితులు ఇస్లామ్‌నో క్రైస్తవాన్నో ఆశ్రయిస్తే తప్పేమిటని ప్రశ్నించిన మొదటి దేశభక్తుడు కూడా వివేకానందుడే (చూ "హిందూయిజం")। అదే విషయాన్ని ఇంకొంచెం విస్తరిస్తూ అంబేడ్కర్ ఇలా అన్నాడు  "ఈ ఆదివాస తెగలు (దళితులు) ప్రమాదకర పరిస్థితులను సృష్టించగల శక్తిమంతులని హైందవం గుర్తించడంలేదు। ఆదివాసులు బానిసలుగానే పడి ఉన్నంతకాలం వారినుంచి ఎలాంటి హానీ జరక్కపోవచ్చు  కానీ హైందవేతరులు ఈ దళితుల్ని తమలో చేర్చుకొని, తమ మత విశ్వాసాలవైపు ఆకర్షితుల్ని చేసుకున్నప్పుడు హైందవ విరోధి గణాల సంఖ్య పెరిగిపోతుందని మరవరాదు'  విభిన్న కోణాలనుంచే అయినా వివేకానందుడు, అంబేడ్కర్ వివరించి హెచ్చరించారు  అయినా మనం మారలేదు

పరివర్తనకు మనం దూరంగా ఉన్నాం కాబట్టే దళితులు కదలబారారు చైతన్యవంతులవుతున్నారు  ఆ చైతన్యాన్ని ఇతర వర్గాల చైతన్యంతోనే కొలవగలగాలి  ఆ పనికూడా వివేకానందుడే చేశాడు  దళితుల 'అంత్యోదయం' దళితులనుంచే పుట్టుకొస్తుందన్నాడు  రేపటిపాలకుడు దళితుడేననికూడా తెగేసి చెప్పాడు  ఈ చైతన్యానికి కొలమానమే దళిత సాహిత్యం  జాషువా కులగోత్రాలను నామరూపాలు లేకుండా చేసి బూడిద చేయగలిగిన "భస్మ సింహాసనా"న్ని (శ్మశానం) మనకు చూపింది భవిష్యద్వాణిని వినిపించడానికే, రాబోయే పరిణామాల గురించి హెచ్చరించడానికే, మనలో పరివర్తన తేవడానికే  అందుకు కావలసింది నిరుద్ధులు కారు, అనిరుద్ధులు। ఈ అనిరుద్ధులే దళిత కవులూ, రచయితలూ  ఇటీవల దళిత సాహిత్యంలో మరొక కొత్తశాఖ వెలిసింది  అది-దళిత బిడ్డల అనుభవనైవేద్యం, జీవితమనే తిరుగలిలో నలిగిపోయిన బతుకుల ఆత్మకథావిష్కరణం  భారత రామాయణ రచయితలు వ్యాస, వాల్మీకులెవరు? చర్మాన్ని ఒలిచి దానంచేసిన కర్ణుడు ఎక్కడివాడు? కండలు ఒలిచి ఇచ్చిన శిబి ఏ గూటివాడు? వెన్నెముకనే తీసి ఇచ్చిన దధీచి ఏ తెగవాడు? పసుపు బట్టలతో ప్రాణం ఇచ్చిన ఆ జీమూతవాహనుడు ఎవరి బిడ్డ? మాతంగుడికథ మన పుట్టుపూర్వాలను మనకే చూపించే అద్భుతగాథ కాదా? దళితులు దేవాలయాల్లో అర్చకులుగా ఉన్నచోట్ల అగ్రవర్ణులు పోటీలు పడి 'శరగోపం' పెట్టించుకున్న ఘట్టాలు చరిత్రలో లేవా? రాజశేఖరకవి కీర్తించగా, బాణ, మయూరకవులతో శ్రీహర్ష చక్రవర్తి సమంగా చూసి తన ఆస్థాన కవిగా నియమించుకొన్న దివాకరుడు దళిత కిశోరం కాదా? అందుకనే ఈనాటి దళిత రచయిత తన స్వీయానుభవాన్ని నిష్కర్షగా ప్రకటించడంలో 'ఆత్మకథ'ను కూడా తెలుసుకోగోరేవారికి, తన ప్రజల ఆవేదనను అర్థం చేసుకోగోరేవారికి, అందుబాటులో ఉంచుతున్నాడు  భాషలో, భావంలో, అభివ్యక్తిలో ఆదర్శమూర్తుల ఎంపికలో సంప్రదాయ సాహితీ స్రవంతికి భిన్నంగా కొత్త పుంతలు తొక్కుతున్నాడు. ఈ విషయంలో తెలుగు దళితసాహిత్యంకన్నా మరాఠీ, గుజరాతీ సాహిత్యాలు ముందంజలో ఉన్నాయి  తెలుగులో 'ఆత్మకథ'ను వచన రచనగా వెలువరించకపోయినా,

ఆనాడు జాషువా 'నా కథ' పద్యకావ్యంగా వెలువడితే, ఇటీవల కాలంలో సతీష్ చందర్ 'నాన్న సైకిల్' వచన కవితా ఖండికగా వచ్చింది ఆధునిక మరాఠీ దళిత రచయితల 'ఆత్మకథలు' సంకలనంగా వెలువరించిన వారు అర్జున్ డాంగ్లే అంబేద్కర్ భావస్ఫూర్తితో, ఆనాటి ఉద్యమ ఉద్ధతివల్ల శంకర్రావు ఖరత్‌నుంచి యువరచయిత శరణ్ కుమార్ లింబాలే ఆత్మకథల దాకా వెలువడిన రచనలన్నీ-ఎన్నో సాంఘిక దురాచారాలకు, కట్టుబాట్లకు, వెలివేతలకు, దౌర్జన్యాలకు గురైన దళితుల సాంఘిక చరిత్రకు అనవాళ్ళు యూరోపియన్ దళితులైన 'బ్లాక్స్' 1970లలో ఉవ్వెత్తున ప్రారంభించిన ఆత్మావిష్కరణ ఉద్యమాలనుంచీ, బ్లాక్స్ జాజ్ మ్యూజిక్ నుంచీ ఉత్తేజితులై, ఆగ్రహ భార్గవులుగా మారిన మరాఠీ యువ దళిత కవులూ, రచయితలూ ఇండియాలోని ఇతర చోట్ల దళిత యువతకు మార్గదర్శకులయ్యారు అంబేద్కర్ జన్మస్థలమైన మహారాష్ట్ర-దళితులలో సరికొత్త ఆత్మగౌరవ భావాన్ని ఉద్దీపింపజేసింది నారాయణ్ సుర్వే 1958 నాటికే ప్రారంభించిన దళిత సాహిత్యోద్యమం 1960లలో "లిటిల్ మాగజైన్" వాఙ్మయ చరిత్రకు కొత్త భూషణాలు అమర్చింది "దళిత పాంథర్లు" ఉద్యమం కవిత, కథ, నాటిక, ఆత్మకథా చరిత్రకు అంకురార్పణ చేసి మూడుపూవులూ ఆరుకాయలుగా వర్ధిల్లుతోంది మరాఠీ, గుజరాతీ దళిత రచయితల ఆత్మకథలన్నీ-స్త్రీ,పురుష సంబంధాలకు, కుటుంబ వ్యవస్థకు సంబంధించిన బూజు పట్టిన భావాలనూ, విలువలనూ పక్కకు నెట్టాయి, దళిత ఉద్యమంలోని నిమ్నోన్నతాలను లోపాలను నిశితంగానూ, అభిమానంతోనూ సమీక్షించుకొని మరీ ముందుకుసాగాయి, గ్రామీణ, పట్టణ జీవితంలో దళితులెదుర్కొంటున్న సమస్యలను ఆత్మకథా రూపంలో రచయితలు చర్చించారు మైనారిటీల మధ్య ఐక్యతను చూటారు "చిల్లర దేవుళ్ళ"ఆగడాలను ఎండగట్టారు గ్రామసింహాల అభిజాత్యాన్ని చీల్చి చెండాడారు దళితుల బాధను తెలియజెప్పారు. శంకర్రావు, దయాపవార్, శాతాబాయ్ కాంబ్లే, కుముద్ పావ్‌డే మొదలైన రచయితలు అడుగడుగునా భూస్వామ్య నాగరికతను అభిశంసించారు 'మహర్లు' (దళితులు) అయినంతమాత్రాననే వారిని విద్యా గంధానికి, ముఖ్యంగా సంస్కృత విద్యాభ్యాసానికి దూరంచేయడానికి ప్రయత్నించిన 'అగ్ర'జుల పెత్తనాన్ని ఎదిరించిన గాథ లింబాలే ఆత్మకథ తల్లిదండ్రులది వర్ణాంతర వివాహం తల్లి దళితురాలు, తండ్రి లింగాయత్ కాని లింబాలేను పెంచింది ముస్లిం. ఇప్పుడు తానెవరికి చెందాలన్నది అతని ప్రశ్న? నేను దళితుణ్ణా, అగ్రవర్ణ బిడ్డనా? తల్లి 'అస్పృశ్య'రాలు, తండ్రి 'అగ్ర'వర్ణుడు నా పని జరాసంధుడిలా అయిపోయిందంటారు రచయిత! ఈ ప్రశ్న వర్ణవ్యవస్థకు చెంపపెట్టు: "నేనిప్పుడు సమాజంలో సగం మనిషిని, సమాజం వెలుపల మిగతా సగం మనిషిని నా పేగుబంధం ఎవరితో?!" అలాగే గుజరాతీ దళితసాహిత్యంలో 1975లో మొదటిసారిగా రమేష్ చంద్ర పార్మార్ "పాంథర్" ప్రచురణతో ముందుకొచ్చారు పురాణ ప్రతీకలకు విరుద్ధంగా దళిత సాహిత్యోద్యమాన్ని ముందుకు నెట్టారు రావణ, ఏకలవ్యులు అభిమాన హీరోలయ్యారు విష్ణువుకు బదులు బుద్ధుడు 'సుదర్శన' చక్ర ధారి అయ్యాడు! స్వర్ణయుగం పేరిట జరిపిన వేట మొహంజదారో, హరప్పా శిథిలాలకు ఎలా దారితీసిందీ-భింబేట్కా గుహాముఖాల్లోకి ఎలా తొంగిచూసిందీ-గుజరాతీ దళిత రచయితలు చెప్పారు! హరీష్ మంగళం దృష్టిలో, దళిత కుటుంబాల నుంచి వచ్చిన రచయితల కలంపోటువేరు, ప్రత్యక్ష అనుభవానికి వేరే సాక్షులుండరు! అతని దృష్టిలో దళితేతర రచయితలు దళితులపట్ల ఎంత సానుభూతి

చూపినా, అభిమానించినా వారు తోటి ప్రయాణీకులే అవుతారు। యుగయుగాలుగా అణగారిన దళితుల చైతన్య స్రవంతికి వాగ్దేవి దళిత సాహిత్యమే  ఆంధోనీ బార్త్లేమి "బ్లాక్స్" గురించి చెప్పిన మాటలు దళితులకూ వర్తిస్తాయి "విచిత్రమేమంటే-దళితుల జీవితాలను నమోదు చేయడం అంటే వారి ఆర్థిక దైన్య స్థితినికూడా రికార్డు చేయడమే" ఎందుకని? "శతాబ్దాల తర్వాత తవ్వినా అవమానాలు ప్రాణాల్తోనే బయటపడతాయి"కనుక।

ఆదివారం 29, సెప్టెంబర్ 1996

# మరపురాని, మరవలేని మహామేధావి కె.బి.కృష్ణ

'భారతదేశ చరిత్రలో, దాని తాత్త్విక చింతనలో ప్రయోజనకరమైన అంశాలకంటే అందులోని పైపై తళుకు బెళుకులకూ పటాటోపాలకూ ఇండియా ప్రసిద్ధికెక్కడం దురదృష్టకరం. ఈ దేశం పులులకూ, పాములకే ప్రసిద్ధి కాదు; ఈ దేశం అంటే రుషులు, ముని పుంగవులే కాదు, కొల్లాయి గుడ్డకూ, మేకపాలకూ, తాజ్‌మహలుకూ, సిమ్లా ధవళ ప్రాసాదాలకు మాత్రమే ఈ దేశం ప్రసిద్ధికాదు ఇండియా అంటే మూడు వందల అరవై అయిదు రోజులూ పూజలూ పునస్కారాలలో, ధ్యానంలో కాలం గడిపే దేశమని కాదు, ఇండియా అంటే అసంఖ్యాక ప్రజా బాహుళ్యంతో, పోరాటాలతో, చరిత్రతో దీపిస్తున్న దేశం, మునులు, సన్యాసుల దేశంగా మాత్రమే తెలిసిన వాళ్ళు ఇండియాను అర్థం చేసుకోలేరు పీడనా దోపిళ్ళ కింద మగ్గిన భారత ప్రజలు జీవన సమరంలో కాకలుతీరిన వాళ్ళు ప్రతిఘటనా శక్తిగలవాళ్ళు, ఆయుధాలు పట్టినవాళ్ళు, ఓటమిని చవిచూసినవాళ్ళు, మోసపోయిన వాళ్ళు! అప్పుడప్పుడూ ఒక బుద్ధుడు, ఒక మహావీరుడు, ఒక అశోకుడు, ఒక చైతన్య వారికి తగులుతూ ఉంటారు ప్రజలు పొందిన ప్రయోజనం తక్కువ, కోల్పోయింది ఎక్కువ ఒకరి ఏకచ్ఛత్రాధిపత్యం పోతే మరొకరి నిరంకుశాధికారం-నిరంతరం ప్రజల వెన్నెముకను విరిచేసింది"

ఈ మాటలన్న వ్యక్తి సామాన్యుడు కాదు, అసాధారణ వ్యక్తి అయిఉండాలి. దేశ సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణామక్రమాన్ని చారిత్రిక దృష్టితో, తార్కిక దృక్పథం నుంచి పరిశీలించిన మేధావి అయి ఉండాలి ప్రాచ్య, పాశ్చాత్య చరిత్రలు, దర్శనాలు, దేశీయ తాత్త్విక ధోరణులు తెలుసుకొని ఏది గ్రహించదగిందో, ఏది పరిహరించదగిందో తెలుసుకున్న మహామేధావి అయి ఉండాలి అతనెవరో కాదు, బిరుదబీరాలతో నిమిత్తం లేకుండా అజ్ఞాత ప్రతిభావంతుడుగా అర్థాయుష్షుతో కాలంతో కరిగిపోయిన డాక్టర్ కె బి కృష్ణ. కడచిన యాభై ఏళ్ళుగా సాగుతున్న పరిశోధనలో భారతీయ దర్శనాలలో ఏది సజీవధోరణి, ఏది మృతప్రాయమో క్షుణ్ణంగా చర్చ జరుగుతూ వచ్చింది ఈ కృషిలో భారత దర్శనాలలో కేవల భావవాద ధోరణులే కాదు, సామాజికాభివృద్ధికి, మానసిక ఔన్నత్యానికి, ఉత్పత్తి శక్తుల పెరుగుదలకు దోహదం చేయగల భౌతికవాద ధోరణులను కూడా కొందరు తత్త్వవేత్తలు శోధించి బయటకు లాగారు. వీరిలో ప్రథములలో ప్రథముడుగా ఎం ఎన్ రాయ్‌ని చెప్పాలి ఆ తర్వాత మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయను పేర్కొనాలి ఈ చివరి ఇద్దరి కంటే ముందుగా, ఎం ఎన్ రాయ్ తర్వాత మార్క్సిస్టు దృక్పథం నుంచి భారతీయ దర్శనాలను పరిశీలించి, స్పష్టమైన అవగాహనతో రచనలు చేసిన మేధావి గుంటూరు జిల్లాకు చెందిన డాక్టర్ కాట్రగడ్డ బాలకృష్ణ ఈయని గ్రంథం "స్టడీస్ ఇన్ హిందూ మెటీరియలిజం" (హైందవ భౌతికవాదం ఒక అధ్యయనం) దీనిని ఇటీవల వెలువరించిన ప్రచురణకర్త భారతీయ చరిత్రాధ్యయనంలో అమితమైన ఆసక్తి కలిగిన ఔత్సాహికుడు టి. రవిచంద్. 1930ల నాటికే డాక్టర్ కృష్ణ రచనలు లిఖిత ప్రతుల రూపంలో సిద్ధమై మేట వేసుకుపోయాయి దేశభక్తుడూ, తాత్త్వికుడూ, స్వాతంత్ర్య సమరంలో జైలు శిక్షలు అనుభవించిన వాడూ డాక్టర్ కృష్ణ. ఈ రచన కొత్తది కాకపోయినా, ప్రచురణకు నోచుకోనంతవరకూ, పదిమందికి తెలియనంతవరకూ ఇప్పుడు వెలువడినా అది కొత్తదే అవుతుంది గదర్‌పార్టీ వీరుడు దరిశి

చెంచయ్య, డాక్టర్ కృష్ణ జైలు పక్షులు చెంచయ్య చొరవ వల్లనే డాక్టర్ కృష్ణ రాతప్రతులకు మోక్షం లభించింది ఆ తరువాత పరిశోధనలో కంభంపాటి (సినియర్) చేయూతతో విశాలాంధ్ర ప్రచురణాలయం డాక్టర్ కృష్ణ తాలూకు రెండు ఆంగ్ల పుస్తకాలను ప్రచురించి చరిత్రాధ్యయనంలో ఆసక్తి ఉన్న వారికి మహోపకారం చేసింది అవి 1 సోషల్ అండ్ పొలిటికల్ థాట్ ఆఫ్ బుద్ధిస్ట్ రైటర్, 2 థీరీస్ ఆఫ్ కింగ్ షిప్ ఇన్ ఇండియా ఇప్పుడు రవిచంద్ పరిశోధన ఫలితంగా బయటకొచ్చిన డాక్టర్ కృష్ణ గ్రంథం "స్టడీస్ ఇన్ హిందూ మెటీరియలిజం" మిగతా రాతప్రతులు రాష్ట్ర పురావస్తు సంచయంలో భాగమైపోయాయి డాక్టర్ కృష్ణ రాసిన మరి రెండు మంచి పుస్తకాలున్నాయి అవి 1 ఇండియాలో మైనారిటీల సమస్యలు *("Problems of Minorities in India")* 2 స్టాలిన్‌పై ప్రత్యేక అధ్యయనం ఈ రెంటిని కూడా రవిచంద్ వెలుగులోకి తెస్తే మంచిది ప్రస్తుత సమీక్షా గ్రంథంలో డాక్టర్ కృష్ణ భారతీయ దర్శనాలలోని భౌతికవాద ప్రతిపాదనలు ఎన్నింటినో పరామర్శించారు అయితే ఆయన తన గ్రంథంలో 'హిందూ మెటీరియలిజం' అని ఎందుకు పేర్కొన్నారోనని కొందరికి అనుమానం రావచ్చు ఆ మాటను ఆయన వాడడానికి కారణం బహుశా -'హైందవం' పేరుతో ఇప్పటిలాగనే ప్రాచీన కాలంలోనూ, వేదాలనే 'హైందవ' దర్శనాల పేరిట చెలామణీ చేయడానికి, హైందవ దర్శనం అంటే భౌతిక ప్రపంచంతో, మానవుని భౌతికావసరాలతో సంబంధంలేని కేవల భావవాదంగా భావించి ఉండడమే అలా అని చెప్పి, శ్రమశక్తికి ఏమాత్రం విలువ లేకుండా చేసి, సమాజ ప్రగతిలో ఉత్పత్తి శక్తుల ప్రాశస్త్యాన్ని కప్పిపుచ్చడం కోసం జరిగిన ప్రయత్నాన్ని తిప్పికొట్టేందుకూ, ప్రాచీన దర్శనాలలోని భౌతికవాద ధోరణులకు పెద్ద పీటవేసేందుకు డాక్టర్ కృష్ణ ఇందులో ప్రయత్నించారు ఈ పరిశోధనలో భాగమే ఆయన-కొందరు ప్రసిద్ధ భౌతికవాదుల గురించి, ఆది 'సాంఖ్య' దర్శనాలకు ఆద్యుడైన కపిలుడు, అతని సిద్ధాంతాల గురించీ, ఉపనిషత్తుల అనంతరం తలెత్తిన, భౌతికవాద మేధావుల గురించీ, భగవద్గీతలోని భౌతికవాద ఛాయల గురించీ, క్రీస్తు తర్వాత 7వ శతాబ్దంలో కృష్ణమిశ్రా రాసిన అద్వైత రచన, వ్యంగ్య నాటకం "ప్రబోధ చంద్రోదయం" గురించీ, వేమన గురించీ చేసిన పరిశీలన, చెప్పిన భాష్యాలూ డాక్టర్ కృష్ణ పరిశోధనలో పేర్కొన్న ఉపనిషత్తుల తర్వాతి కాలానికి చెందిన దార్శనికులైన అజితకేశ కంబాలిక, పురాణ కాశ్యప, మఖాలి గోసాల, పాకుధ కాత్యాయన, సంజయ బెలాతపుట్టలాంటి భౌతికవాద మేధావుల పేర్లు చాలామందికి తెలియనివి ఒక్క మాక్స్ ముల్లర్ పండితుడే భారతీయ తాత్త్విక ధోరణుల చరిత్రలో ఈ భౌతికవాదులకు ప్రత్యేక స్థానం కల్పించాడని విజ్ఞుల అవగాహన బుద్ధునిపైన, మహావీరుడిపైన అమితమైన ప్రభావం నెలకొల్పింది క్రీస్తు పూర్వం 5-6వ శతాబ్దికి చెందిన కపిలుని భౌతికవాదం ఆనాడు ఛాందసుల దృష్టిలో కపిలుడు భావవాది కాగా, ప్రగతివాదుల దృష్టిలో అతడు నిరీశ్వరవాది! ఆనాటి ఛాందస పురోహితవర్గం సాంఘిక ప్రగతికి కల్పిస్తున్న అవరోధాలను ఎదుర్కోవడంలో అప్పటి భౌతికవాదులు లౌక్యమైన మార్గం ఎంచుకున్నారనిపిస్తుంది ఎందుకంటే ప్రగతివాదులైన ప్రతీ భౌతికవాదినీ'నాస్తికుడ'ని ముద్రవేసి, తమ బతుకు తెరువుకోసం స్వప్రయోజనాలను కాపాడుకోజూచిన ఛాందస వర్గం వెలివేయజూసింది వైదికకాలానికే పరివ్యాప్తిలో ఉన్న చార్వాక మతం, (లోకాయతం), కపిలుడి 'సాంఖ్య'వాదం, బౌద్ధాన్ని, జైనాన్ని ప్రభవితం చేశాయి బ్రాహ్మణ్యంలో కూడా నాడు రెండు వర్గాలు ఏర్పడ్డాయి - ఒకటి భావవాదులు, రెండు భౌతికవాదులు. భౌతికవాద వర్గం వేదాల్ని నిరాకరించాయి దైవాన్ని విశ్వసించినా యజ్ఞ

యథాగాథల్ని ఈసడించాయి మానవపుడి విమోచన మతంవల్లగానీ, ఊకదంపుడు నైతికసూత్రాలను వల్లె వేయడం వల్లగానీ కలగదనీ జ్ఞానార్జన వల్లనే తన స్థితిగతుల్ని తెలుసుకొని మానవుడు విమోచన సాధించగలడనీ వీరు విశ్వసించారు ఇంతకూ భావవాదులతో వచ్చిపడిన చిక్కల్లా వర్ణాశ్రమ ధర్మంపై ఆధారపడిన తప్పుడు కులవ్యవస్థను (శ్రమవిభజనను పక్కకు నెట్టి), సంఘువ్యవస్థను సవాలు చేయనంతకాలం నీ నమ్మకాల్ని స్వేచ్ఛగా చెప్పుకోవచ్చు ప్రశ్నిస్తే మాత్రం నిన్నూ, నీ ఆలోచనల్నీ తుంగలో తొక్కుతారు తాము సోమరిపోతులై కాని సంపన్నార్థలకూ, సోమరిపోతులకూ వీరు వత్తాసు పలికారు అవీ ఆనాటి స్థితిగతులు!

సరిగ్గా ఈ స్థితిగతుల అధ్యయనంలోనే డాక్టర్ కృష్ణ తన కళ్ళకు సామాజిక సుఖాంతులకు దోహదపడగల లోకాయత సాంఖ్య, బౌద్ధధర్మ సులోచనాలు తొడుక్కున్నాడు పరిశీలనలో ఆయనకు ఒక ప్రశ్న ఎదురైంది "భారతీయ పండితులు భారతీయ భౌతికవాదాన్ని ఎందుకు అధ్యయనం చేయకుండా విడిచిపెట్టారు?" అని! భారతీయ సామాజిక శాస్త్రంలో, దార్శనిక చింతనలో క్రియాశీలమైన అంశాలను వీరు ఎందుకని వెలికితీసి తగిన ప్రచారానికి నడుం కట్టలేదని ప్రశ్నించాడు "దేశంలో పండితుల పరిశోధనలు శ్రామికవర్గం, రైతాంగం అవసరాలను ప్రతిబింబించలేదు తనకు అనుకూలంగా సంఘుశక్తులు పెరుగుతున్నప్పటికీ దేశంలోని శ్రామిక వర్గానికి సరైన నాయకత్వం, నిర్మాణ వ్యవస్థ, రాజకీయ చైతన్యం అందించలేకపోయార"ని కృష్ణ 1930ల నాటికే ఆవేదన చెందాడు! అయితే ఛాందస బ్రాహ్మణ్యంలోని భావవాద వర్గం భౌతికవాదులపై ఎందుకని ఆంక్షలు పెట్టిందో, ఆ క్రమంలో భౌతికవాదులు తాత్కాలికంగా ఎలా లౌక్యంగా తలదాచుకోవలసి వచ్చిందో అనంతర పరిశోధనలు వెల్లడిస్తున్నాయి ఒక వైపున తమ వాదాన్ని వినిపింపజేయడానికి 'న్యాయ-వైశేషికుల' వంటి భౌతికవాదులు ఆగమాల (వేదాల) పట్ల విధేయతను పైకి ప్రదర్శించినా, పురోహితవర్గం సెన్సార్‌షిప్‌ను తప్పించుకోడానికే ఆ పని చేశారు అణు వాదకర్త కణాదుడు, తదితరులూ అలాగే బతకవలసి వచ్చిందని మరవరాదు! 'ధర్మం' అంటే పదార్థం అనీ, అదే భౌతికార్థం అనీ చెప్పి వైదికార్థంలోనే 'ధర్మ'బోధ చేయడం తన విధి అని కణాదుడు తిప్పి కొట్టాడు! తన "వైశేషిక" భౌతికవాద ప్రబోధం కోసం అతను తన రచనకు వైదిక రంగులు అద్దాడు కాని భౌతిక వాద దృష్టిని వదులుకోలేదు పిల్లల కోసం యజ్ఞాలు చేసే బాపతును (పుత్రకామేష్టి), అశ్వమేధాలు నడిపే వాళ్ళనూ ఎదిరించిన వాత్స్యాయనుడూ అదే పని చేశాడు. భార్యాభర్తల కలయిక ఫలితం పిల్లలు గానీ, యజ్ఞంవల్ల సంతానం కలగదని గౌతముడి ఘోష! అలా నాటి భౌతికవాదులు ఛాందసవర్గాల సెన్సార్‌షిప్‌ను తెలివిగా తప్పించుకోడానికి 'గుంపులో కలిసి గోవింద' కొడుతూనే బ్రాహ్మణ్యంలోని భావవాదుల గుట్టును రట్టు చేశారు, భౌతికవాద ధోరణులను పటిష్టం చేశారు, తమ పనిని నెరవేర్చుకున్నారు! మనవాళ్ళు ఎంత వెర్రి వెంగళప్పలంటే-వేదానికీ ఆయుర్వేదానికీ సంబంధం లేదని వైద్యశిఖామణులైన చరకుడు, సుశ్రుతుడూ చెప్పినా సరే నైయాయకులైన విశ్వనాథ అతడి అనుచరులూ మాత్రం మంత్రాలు, ఆయుర్వేదం 'అధర్వవేదం'లో భాగమనేవాదిస్తూ వచ్చారు! భారతదేశంలో సైన్స్, టెక్నాలజీలు ఎందుకని పురోగతి సాధించలేదో 11వ శతాబ్దంలో భారతదేశంలో విస్తృతంగా పర్యటించిన ఆల్ బిరూనీ వివరించాడు ఛాందసవర్గాల ఒత్తిళ్ళ వల్లనే 6-8 శతాబ్దులలోని వరాహమిహిరుడు, బ్రహ్మగుప్త సూర్య-చంద్ర గ్రహణాల గురించిన తమ ప్రగతిశీల పరిశీలనను బలవంతంగా వాయిదా వేసుకోవలసివచ్చింది! రాహువు సూర్యుణ్ణి మింగుతోంది కాబట్టి, సూర్యగ్రహణం

వస్తోందన్న భ్రమను వరాహమిహిరుడు, శ్రీ సేన, ఆర్యభట్ట, విష్ణుచంద్రులూ పటాపంచలు చేశారు! సైన్స్-టెక్నాలజీలు దేశంలో పురోగతి సాధించకపోవడానికి ఆదిశంకరుడు ఎలా కారకుడో తొలి భారతీయ ప్రమాణ శాస్త్రవేత్తలలో ఒకరైన పి సి రే *("History of Hindu Chemistry")* నిరూపించాడు! ప్రయోగపరిజ్ఞానమే విజ్ఞాన వ్యాప్తికి పరమౌషధం అన్నాడు నిజానికి ఆది వైదికంలో కూడా శ్రమ జీవన సౌందర్యానికి హారతులు పట్టే సోమరిపోతుల్ని గాక వర్క్ కల్చర్‌ను ప్రోత్సహించిన ఘట్టాలున్నాయని పరిశోధకుల భావన శ్రమను బట్టే మానవుల్ని దైవ సమానులుగా భావించిన (రుభువులు/భృగువులు) ఉదాహరణలున్నాయి. అందుకే డాక్టర్ కృష్ణ తన రచనల ద్వారా భారతీయ దర్శనాలలోని ప్రగతిశీల శక్తులకు ఏ రోజుకైనా సాధికార ప్రతినిధిగా నిలబడగల్గుతాడు!

ఆదివారం 22, సెప్టెంబర్ 1996

# హల్లూరు తవ్వకాలు ఆలూరు భాష్యాలు!

"చారిత్రక విభాత సంధ్యల మానవకథ వికాసమెట్టి" దని ప్రశ్నించిన మహాకవి సందేహాన్ని రెట్టిస్తూ కొలది రోజులనాడు సుప్రసిద్ధ కర్ణాటక జంతు శాస్త్రవేత్త, పురాజంతుశాస్త్రంలో ప్రపంచంలోనే వేళ్ళమీద లెక్కించదగిన కొలదిమందిలో ఒకరైన డాక్టర్ కె ఆర్ ఆలూర్ కొత్త రాతియుగానికి చెందిన తవ్వకాలు ఆధారంగా ఓ కొత్త వివాదం లేవనెత్తారు ధార్వాడ జిల్లాలో తుంగభద్ర తీరంలోని హల్లూర్ గ్రామంలో కొత్త రాతియుగానికి చెందిన "అశ్వాస్థికలు" (గుర్రం ఎముకలు) బయటపడ్డాయి. ఈ తవ్వకాల పరిశోధనను డాక్టర్ ఆలూర్‌కు అప్పగించడానికి కారణం - పురాజంతుశాస్త్రంలో ఆయన ప్రసిద్ధుడు కావడం ఆ ఎముకల పరిశోధనానంతరం ఆయన నిగ్గుతేల్చబూనిన అంశం - మధ్యాసియానుంచి భారతదేశానికి వలసవచ్చిన ఆర్యులతోనే మనకు గుర్రం వచ్చిందన్న వాదన అబద్ధమనీ, అసలు ఆర్యుల నివాసమే ఇండియా అని, ఇక్కడనుంచే వారు ప్రపంచంలోని ఇతర ప్రాంతాలకు పాకిపోయారనీ, గుర్రం ఆర్యులకంటే ముందు కాలంనాటిదనీ! ఈ సిద్ధాంతం మరొకసారి దేశంలో ఆర్య-అనార్య లేదా ఆర్య - ద్రావిడ వివాదాలకు మరింత కారణం కాకతప్పదు ఎందుకంటే, ఈ రోజుకీ ఆ వివాదం అడుగంటలేదు కాలక్రమంలో మానవాభ్యుదయ పరంపరకు సాక్షిభూతంగా ఉన్న నదీలోయ నాగరికతలనూ, సమాజాలకూ, సామాజికుల ప్రాభవ పతనాల పరిశీలనకు తిలోదకాలిచ్చి, కేవలం జాతి, కుల, మత అంశాల పరిశీలనకే చరిత్రకారులు, పురాశాస్త్ర పరిశోధకులు ఇంతకాలంగా కట్టుబడిపోయారు దాని ఫలితమే చరిత్రను వక్రంగా చదవడానికి చేసే ప్రయత్నం ఇంతకాలం సాగుతున్న ప్రధానమైన వాదన, హెచ్చుమంది నమ్ముతున్న విషయం - ఆర్యుల రాకతోనే ఇండియాకు నాగరికత అబ్బిందని ఇది పాశ్చాత్యులు వ్యాప్తిలోకి తెచ్చిన ప్రచారం ఆ వాదాన్ని అంగీకరిస్తే, ఆర్యులను ఇండియాపైకి దాడి వెడలివచ్చిన మూకలుగా మనం చిత్రించినా పాశ్చాత్యులకు బాధలేదు ఎందుకని? వాళ్ళకు కావలసింది ఇండియా ప్రాచీన చరిత్ర విశిష్టత యూరోపియన్ చరిత్రతో ముడిపడివున్నప్పుడు మాత్రమే సాధ్యమని మనం నమ్మితే చాలు! కాని దయానంద సరస్వతి, కొందరు తరువాతి భారత చరిత్రకారులు కూడా చేసిన పనేమిటి? మరో కొసకు వెళ్ళి, ఇతర జాతులకు చరిత్ర లేనట్టుగా అసలు మొత్తం ప్రపంచానికే నాగరికత నేర్పిన దేశం ఇండియాయేననీ, "భారతీయ సంప్రదాయమే ఆర్య నాగరికత" అని భావించి అందుకు వేదాలను ఆధారంగా చూపబోవడం అంటే "ఆర్య" జాతి తమదంటే తమదని ఎవరికి వారు చాటుకోడానికి వెనుకాడడం లేదు "ఆర్య" శబ్దానికి పెద్దమనిషని, పవిత్రుడనీ, స్వేచ్ఛా ప్రియుడనీ, అర్థాలు చెప్పి "ఉత్తమ జాతిరక్తం" అంతా ఆర్యులలో మాత్రమే ప్రవహిస్తోందనీ, ఆర్యులెవరోకాదు, జర్మన్ జాతే అని నాజీ హిట్లర్ మూకలు కూడా వాదించాయి, ఈ "జాతి" మౌఢ్యం అక్కడితో ఆగలేదు, "ఆర్యజాతి" భావన వెర్రితలలు వేసి యూరోపియన్ సాహిత్యాన్ని ప్రభావితం చేసిన రొమాంటిక్ ఉద్యమానికి కూడా ఉసురు పోసింది! గోబినో లాంటి చరిత్రకారుల దృష్టి వక్రీకరణకు అది తోడ్పడింది అందుకే పండిట్ నెహ్రూ ప్రపంచ చరిత్ర రచనలోను, ఆత్మకథలోనూ ముందుగానే జాగ్రత్తపడ్డాడు "జాతి" వివరణకు మూలం, జాతి అస్తిత్వ వికాసాలకు, రంగుకూ కారణం ఆయా ప్రాంతాలభౌగోళిక పరిస్థితులూ, వాతావరణం, ఆహార విహారాలే గాని "పవిత్ర రక్తం" కాదని స్పష్టం చేశాడు కాలక్రమంలో జీవరాశి రక్తంలో కూడా మార్పులు వస్తాయనీ, ఒక

"జాతి" రక్తమే పరిశుద్ధమైనది, మిగతా జాతులది అపవిత్రమైన దన్న వాదన పరమ దుర్మార్గమనీ ఆధునిక జీవశాస్త్ర పరిశోధనలు నిగ్గుతేల్చాయి సింధులోయ నాగరికతకు చెందిన హరప్పా, మొహంజదారో నాగరికత ఆర్య నాగరికతకు చాలా పూర్వపుదని తవ్వకాలు రుజువు చేసినప్పుడు, నాటి వ్యావసాయిక తెగలకూ, వారి రక్షణ పాటవానికీ ఆధారాలైన పశు సంపదలో హరప్పన్లకు "అశ్వం" కూడా ఒక విశిష్టమైన సాధనంగా ఉండి ఉండాలి ఈ మేరకు డాక్టర్ ఆలూర్ చెప్పినట్టు "గుర్రం" ఆర్యులకంటే ముందునుంచి మనకు ఉన్నదే ఎందుకంటే, ఇండియాపై ఆర్యుల దండయాత్రకు చాల పూర్వమే వాయవ్య భారతదేశంలోకి చిన్న చిన్న తెగలుగా చొచ్చుకువచ్చిన అశ్వారూఢులైన ఆదిమ వానులకు చెందిన అనేక పురావస్తువులు నిరూపించినట్టు (బలూచిస్థాన్ తవ్వకాలు) మరో ప్రసిద్ధ చరిత్రకారుడు ఎ ఎల్ బాషామ్ పేర్కొన్నాడు ఈ విషయాన్ని చరిత్రకారులు బెనర్జీ, జాన్ మార్షల్ కూడా ఎనాడో రూఢం చేశారు హిమయుగాలు ఖండాలను ముమ్మరించిన సందర్భంలో, పరిసరాలను తట్టుకొని నిలబడడం కోసం, అవసరంకొద్దీ మానవుడు ప్రకృతిని బలంగానే ఎదిరించి బతకడం నేర్చుకొన్నాడు, అప్పుడే అతను ఆహార సేకరణ దశనుంచి ఆహారోత్పత్తి దశకు జాంబవంతుని అంగలతో ముందడుగు వేసి, వ్యవసాయానికి అవసరమైన పశుసంపదను, శత్రువులను ఎదిరించడానికి తోడ్పడే గుర్రాన్నీ ప్రాణప్రదంగా కాపాడుకొంటూ వచ్చాడు బలూచిస్థాన్, లోథాల్, భింభేడ్కా తవ్వకాల విశేషాలన్నీ ఈ వాస్తవాన్నే నిరూపిస్తున్నాయి

అయితే డాక్టర్ ఆలూర్ పరిశోధనల వైశిష్ట్యం-లిఖితపూర్వకమైన ఆధారాలు లభించని పురాచరిత్రకు, ఈ ధరాచరిత్రకు పురాజంతుశాస్త్రం తోడునీడగా ఉంటుందని విశ్వసించడం సాధికార చరిత్ర రచనకు జంతుశాస్త్రవేత్త మాత్రమే అర్హుడని ఆలూర్ అతిగా వాదించబోయి, కేవలం ఆహారం, పరిసరాలు, ఉష్ణోగ్రత, వర్షపాతం పరిశీలనకే కట్టుబడి ప్రాచీనజంతువుల అవశేషాలను ఆయా కాలాలనాటి సిరమిక్, మృణ్మయపాత్రల అవశేషాలతో తైపారువేసి చూడకపోతే అది సమగ్ర చరిత్ర కాదన్న వాదన మాత్రం సరైనదిగానే మనం అంగీకరించాలి మానుషశాస్త్రం, జంతుశాస్త్రం, సామాజికశాస్త్రాలు - ఈ మూడింటి సమాహారంగా చరిత్రాధ్యయనం, పురాచరిత్ర పరిశోధన సాగాలి అదే డాక్టర్ ఆలూర్ సిద్ధాంత విశేషం అంతేగాదు, చరిత్రకు అందని కాలానికే కాకుండా (ప్రీ-హిస్టారిక్) అందివచ్చిన ఆ తర్వాతి చారిత్రక దశల అధ్యయనానికి కూడా (ప్రో-హిస్టారిక్) జంతు అవశేషాల పరిశీలన అవసరం, కేవలం మానవాస్థికల పరిశోధనవల్లనే ప్రాచీన యుగాల సామాజిక, మానవాభ్యుదయ చరిత్ర పరిపూర్ణ చిత్రం అందిరాదన్న డాక్టర్ ఆలూర్ విశ్వాసాన్ని మనం పంచుకోవచ్చు అయితే ఒక్క విషయంలో ఆలూర్ సిద్ధాంతం స్వవచోవ్యాఘాతం అనిపించే అవకాశం ఉంది ఏమంటే, హరప్పా నాగరికత ఆర్యులకు ప్రాచీనమని ఒప్పుకుంటున్నప్పుడు, ఆ తర్వాత ఆర్యుల రాకవల్లనే, అందులోనూ సొంత లిపి లేని ఆర్యగణాల దండయాత్ర వల్లనే హరప్పా నాగరికత ఎందుకు ధ్వంసం కావలసివచ్చింది? ప్రసిద్ధ చరిత్రకారుడు డాక్టర్ ధర్మానంద కోశాంబి చెప్పినట్టు ఆర్యులు భారతీయులే అయితే హరప్పా నాగరికతకు జీవం పోసిన ఆహారోత్పత్తి పునాదులనే ఎందుకు ధ్వంసం చేసుకున్నట్టు? హరప్పా నిర్మించుకున్న వేల సంవత్సరాల నాటి ఆనకట్టల (డాములు) వ్యవస్థను కూడా ఎందుకు వీరు మూలముట్టుగా కూల్చివేసినట్టు? ఆర్యుల తొలి నివాసం భారతదేశమే అయితే ఈ స్వవినాశానికి వారు కంకణం కడతారా? సమన్వయం కుదరడం లేదు! ఇవి ప్రశ్నలు, ప్రశ్నలు. ఇలా యూరోపియన్లు ఒక దృష్టినుంచి

"ఆర్య" జాతి వాదానికి అంకురార్పణ చేయగా, కొందరు భారతీయులు మరొక దృష్టినుంచి అదే వాదానికి ఆశీస్సులు పలుకగా, రష్యన్ చారిత్రికులు, సోవియెట్ మధ్యాసియాకూ ఆఫ్ఘానిస్తాన్‌కు, హరప్పా నాగరికతకూ సంబంధాన్ని ఖాయ పరుస్తున్నారు! ఆర్యులకు పూర్వమున్నది ద్రావిడ నాగరికతగానూ, అదే హరప్పా చరిత్రగానూ కొత్త నిరూపణలు చూపుతున్నారు కాని హరప్పాలో దొరికిన వేయి ముద్రలలో నేటికీ లిపిని గుర్తించగలిగిన ముద్రలు 400 మాత్రమేనని తెలుసుకున్నప్పుడు ఏ సిద్ధాంతాన్నీ రూఢం చేయలేము! హరప్పా లిపిని ఒకరు ఈస్టర్ ఐలాండ్ లిపి అనీ, మరొకరు అది "హిట్టిటీ" చిత్ర లిపిగానూ, వేరొకరు సెమిటిక్ లిపిగానూ, ఇండో-ఆర్యన్ తెగల నివాసం ఇండియా కాబట్టి ఇండో-యూరోపియన్ భాషలకు కూడా సంస్కృతమే ఆధారలిపి అనీ ఇంకా గుద్దులాడుతూనే ఉన్నారు పాశ్చాత్యులు చేసిన తప్పిదాలనే మనమూ చేస్తున్నాం హరప్పా లిపి రచన, కుడినుంచి ఎడమకు సాగిన పరిణామం అని రష్యన్లు కొత్త ఆధారాలు చూపారు ఏదిఏమైనా అక్షరం అన్నది "కాలం చేతుల్లో ఎదిగి చరిత్ర భుజస్కంధాల కందివచ్చే ఆయుధం" అయినప్పుడు భిన్న భాష్యాలకు కూడా అదే కత్తివాదర, ఖడ్గధార కాకతప్పదు!!

మే 6, 1990

# టిప్పుకత్తీ, కమామీషూ!!

తంజావూరు నాయకరాజులలో ఉద్దండుడైన రఘునాథ నాయకుని కత్తి వాదర ఎలాంటిదో చేమకూర వెంకటకవి 'విజయవిలాసం'లో ముచ్చటిస్తూ "అరాతి మస్తక ఖండనోత్థ/ రక్తధారానుషం గాతి రక్తధార/నిజకృపాణిక కావేరి నీట కడిగె "అంటాడు అలా, ప్రశాంతంగాను పవిత్రంగాను ఉండే కావేరి జలాలను రాజ్యవిస్తరణకో లేదా విదేశీ పాలకులను ప్రతిఘటించడానికో రక్తంతో రాగాలాపన చేయించిన దక్షిణభారత పాలకులలో ఒకరు టిప్పు సుల్తాన్ దక్షిణభారత చరిత్రకు తెలిసినంతవరకు హిందూ, ముస్లిమ్ రాజులు మత ప్రమేయంలేని రాజ్య విస్తరణకే పాటుపడ్డారు, ఎవరికివారు భక్తులు కావచ్చుగాని, మతావేశంతో, పరమతద్వేషంతో రాజ్యాలను వారు విస్తరించలేదు, వారికి రాజకీయ ప్రయోజనాలు ముఖ్యంగాని మత రాజకీయాలు కావు! నిజానికి భారతదేశ సమైక్యతకోసం, ముఖ్యంగా దక్షిణ భారతాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల బారినుంచి, తూర్పు ఇండియా కంపెనీ కబంధహస్తాలనుంచి కాపాడి దక్షిణ భారతదేశ వ్యక్తిత్వాన్ని ఇనుమడింప జేయడానికి కృషిచేసిన దేశభక్తుడుగా, సమర్థుడైన పరిపాలకుడుగా, రాజనీతి చతురుడుగా భారత చరిత్రలో పేరొందినవాడు హైదరాలీ కొడుకు టిప్పుసుల్తాన్ అయినా అతడు ముస్లిమ్ పాలకుడయినందున, చరిత్రను కొందరు వక్రపరిచి బలవంతంగా హిందువుల మతాంతరీకరణకు, మలబార్ ప్రాంతం విధ్వంసానికి అతను పాటుపడ్డవాడనీ నిరాధారమైన ఆరోపణలుచేసి, గిద్వానీ రాసిన "ది సోర్డ్ ఆఫ్ టిప్పు" కథా చిత్రం సీరియల్‌ను శ్రీ సంజయ్‌ఖాన్ దూరదర్శన్‌లో ప్రదర్శించకుండా అడ్డుకోవాలని విశ్వప్రయత్నం చేసి విఫలమయ్యారు అయినా "విశ్వహిందూ పరిషత్తు"వారు కొందరూ, "కేరళ సమాజ్" పేరిట ఇంకొందరూ ఈరోజుకీ టి వీ సీరియల్‌కు అభ్యంతరం చెబుతూనే ఉన్నారు! చివరికి బి.జె పి నాయకులలో ఒకరూ, చరిత్రకారుడైన కె ఆర్. మల్కానీ సీరియల్‌లో "అంతగా అభ్యంతరకర" విషయాలు లేవని చెప్పినా, ఈ సణుగుళ్ళు సమసిపోలేదు నిజానికి, చరిత్రను రంగుటద్దాలతో పరిశీలించేవారికి వాస్తవాలు కన్పించవు. 17వ శతాబ్దంలో మొగలాయీలు దక్కన్‌పైన సాగిస్తున్న దండయాత్రలను తిప్పికొట్టిన మొనగాడు మహారాష్ట్ర "ఛత్రపతి" శివాజీ ఒక్కడేకాగా, 18వ శతాబ్దంలో మొత్తం దక్షిణ భారతం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాదాక్రాంతం కాకుండా ఎన్నో ఆటంకాల మధ్యనే ఒక్క చేతిమీదుగా ప్రతిఘటించి వీరమరణం పొందిన దేశభక్తుడు టిప్పు సుల్తాన్ కనుకనే - ఇవాళకాదు, అర్ధ శతాబ్దం క్రితమే సుప్రసిద్ధ భారతీయ ఆంగ్ల దినపత్రికలలో ఒకటైన "టైమ్స్ ఆఫ్ ఇండియా" గ్రూపు నేతృత్వంలో "హోమ్ లైబ్రరీ క్లబ్" ప్రచురణగా వెలువరించిన "గ్రేట్‌మెన్ ఆఫ్ ఇండియా" గ్రంథంలో టిప్పును మైసూర్ రాజ్యాధినేతగానేగాక, దక్షిణభారత వీరునిగానే గాక యావద్భారత ప్రముఖులలో ఒకనిగా చేర్చింది 16వ శతాబ్దం మధ్యలో చెలరేగిన తళ్ళికోట యుద్ధంలో ఓడిపోయి విజయనగర సామ్రాజ్యం క్రమంగా పతనం కావడంతోనే దక్షిణభారత రాజకీయాలు సంక్షోభ దశలో ప్రవేశించాయి, నడుస్తున్న చరిత్రలో రాజకీయ వ్యూహాలు మారకుండా, మార్చుకోకుండా, ఎత్తుకుపైఎత్తులు వేయకుండా రాజ్యరక్షణగానీ, రాజ్యవిస్తరణగానీ జరగదని చరిత్ర చెబుతోంది! ఆ పనిని పదిహేడవ శతాబ్దిలో మన శివాజీ చేయలేదూ? బీజాపూర్‌కోసం, ఆ తర్వాత కర్ణాటకను స్వాధీనం చేసుకోడానికీ లేదా మొగలాయీల ధాష్టీకం నుంచి మహారాష్ట్ర, కర్ణాటకలను రక్షించడం

కోసం దక్కన్‌లో శివమెత్తి శివాజీ జరిపిన పదఘట్టనలో శత్రువులతోపాటు హైందవులైన పౌరులూ, అడ్డువచ్చిన సామంతులూ కూడా ఎంతమంది చనిపోలేదు? మొగలాయీల విస్తరణను అటకాయిస్తూ బీజాపూర్‌ను కైవసం చేసుకొనే పేరుతో కర్ణాటక లేదా "దక్షిణాది దండయాత్ర"ను మన శివాజీ సమధికోత్సాహంతో ప్రారంభించి "మైసూర్ యుద్ధాలు" చేయవచ్చుగాని, అప్పుడప్పుడే చాపకింద నీరులాగా వర్తకం పేరిట కేరళ కోస్తాలో ప్రవేశించి, ఆర్థిక వనరులను కేంద్రీకరించి రాజకీయ వ్యవహారాల విస్తరణకు చకచకా పునాదులు వేసుకుంటున్న బ్రిటిష్‌వాళ్ళను అడ్డుకోడానికి మైసూర్ పాలకుడు టిప్పుసుల్తాన్ మలబార్‌కు సైన్యాన్ని నడిపి తన అదుపులోకి తెచ్చుకోవడం తప్పా?!

1799లో శ్రీరంగపట్నంలో బ్రిటిష్‌వాళ్ళతో జరిపిన హోరాహోరి యుద్ధంలో ఆఖరి శ్వాస విడిచేవరకూ టిప్పుసుల్తాన్ మొక్కవోని ధైర్యసాహసాలు ప్రదర్శించి సమకాలీన సామంతులను, దక్షిణ భారతంలో విజయనగరం పతనానంతరం తలకొకదారై కేవల రాజ్యకాంక్షతో కీచులాడుకొంటున్న రాజుల, తరాజుల ఉనికినే ప్రశ్నించాడు మొగల్‌సామ్రాజ్య పతనానంతరం 18వ శతాబ్దంలో భారత రాజకీయ వ్యవస్థ అస్తవ్యస్త పరిస్థితులలో పడిపోయింది, ఒక కేంద్రాధికారం లేక ఎక్కడికక్కడ అనేక ప్రాంతీయ శక్తులు తలెత్తి, పరాయి ప్రాంతాలపై పెత్తనం కోసం రాజ్యకాంక్షకొద్దీ రాజులు ఎవరికివారు కుమ్ములాడుకొంటున్న దశ అది ఈ సంక్షోభాన్ని కనిపెడుతున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పారిశ్రామిక విప్లవం ద్వారా ఆయుధాలలో, అధునిక టెక్నాలజీలో తమకు సంక్రమించిన ఆధిక్యత ఆధారంగా బిళ్ళబీటున జోక్యం చేసుకోవడానికి పొంచికూర్చున్న సమయం అది భారత రాజ్యవ్యవస్థలో యూరోపియన్ పాలకుల ఈ జోక్యందారీ విధానాన్ని ఆనాడు పసికట్టగలిగిన భారత పాలకులు చాలా కొద్దిమంది మాత్రమే వారిలో కూడా రానున్న ప్రమాదాన్ని ముందుగానే ఊహించి, వ్యూహరచనకు దిగిన అగ్రగామి టిప్పుసుల్తాన్, దక్షిణ భారతంలో వివక్షలేకుండా హిందూ, ముస్లిమ్ పాలకులను ఒక్కతాటిపైకి సమీకరించి బ్రిటిష్ వాళ్ళను సమైక్యంగా ప్రతిఘటించడానికి నాడు టిప్పుసుల్తాన్ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి ఇందుకు కారణం - మిగతా పాలకులెవరికీ నాటి రాజకీయ పరిస్థితిని అవగాహన చేసుకోగల సామర్థ్యమూ, ముందుగానే ప్రమాదాన్ని దర్శించగల శక్తీ లేకపోవడమే ఈ పరిస్థితులలో ఒంటరివాడైనా టిప్పు ధైర్యం కోల్పోకుండా బ్రిటిష్‌వాళ్ళను వీలుచిక్కినచోటల్లా, మైసూర్ అధీనంలో ~ న్న ప్రాంతాలన్నిటా ప్రతిఘటిస్తున్న సమయంలో ఉత్తర, దక్షిణ భారతాలలోని మిగతా 'ఛోటా మోటా' పాలకులంతా చేసిన పనేమిటి? సిగ్గుచేటైన పని! రాణా ప్రతాప్‌సింగ్ దిద్దితీర్చిన రాజపుత్ర "వీరులు" కూడా అస్త్ర సన్యాసం చేసి తమ ప్రాంతాలపై ఆధిపత్యాన్ని కాస్తా బ్రిటిష్ వాడికి కట్టబెట్టుకున్నారు, ఇటు శివాజీ వారసులు ప్రాణరక్షణకోసం, అధికారం కాపాడుకోడం కోసం బ్రిటిష్ వాళ్ళతో లాలూచీపడి యుద్ధాన్ని మానుకొని లొంగిపోయారు, "పంజాబ్ సింహం"గా పేరొందిన రంజిత్ సింగ్ బ్రిటిష్ పొలిటికల్ ఆఫీసరైన చార్లెస్ మెట్ కాఫ్‌తో మంతనాలు సాగించి రాజీ బేరాలతో సరిపెట్టుకున్నాడు, పీష్వాలూ, నైజాం పాలకులు బ్రిటిష్‌వాడి పంచలు చేరారు, చంకలు నాకారు ఇక రాజీలేని పోరాటంలో ఆఖరి రక్తపు బొట్టువరకూ బ్రిటిష్‌వాడితో ఆనాడు, ఆ విషమ ఘడియలలో, ఆ జీవన్మరణ సమరంలో తలపట్టుపట్టి వీరమరణం పొందిన ఒకే ఒక్క నాయకుడు టిప్పుసుల్తాన్!! అంతేగాదు, నాటికి ఇండియాలో తలకొకమూలన స్థావరాలేర్పరచుకొని కూర్చున్న ఫ్రెంచి, డచ్చి, బ్రిటిష్ వలసపాలకుల మధ్య పొడసూపుతున్న వైరుధ్యాలను వినియోగించుకోడంలో

చాకచక్యం ప్రదర్శించిన పాలకుడు కూడా టిప్పు సుల్తాన్ సైన్స్ - టెక్నాలజీలలో బ్రిటిష్‌వాడి ఆధిక్యతను చూచిబెదరకుండా దక్షిణ భారత రక్షణకోసం ఫ్రెంచివారితో స్నేహం చేసి, ఫ్రెంచి టెక్నాలజీని వినియోగించుకోవాలన్న ఆలోచన చేసిన పాలకుడు కూడా అతనే! ఇంతటి సామర్థ్యం ఉన్న పాలకుడు కాబట్టే నెపోలియన్ కూడా అతణ్ణి కీర్తించక తప్పలేదు, అయితే యూరప్‌లో ఫ్రెంచివారికి ఇంగ్లండు వారికీ కుదిరిన రాజీవల్ల టిప్పు ప్రయత్నాలన్నీ కూడా వమ్ముకావలసి వచ్చింది తప్పుచేస్తే మైసూర్ ముస్లిమ్ నాయకుడిని (అబ్దుల్ హకీమ్ ఖాన్) కూడా టిప్పు వదలలెదు, ఒప్పుచేసిన హిందూ సేనానుల వీపు తట్టకుండా మాననూలేదు! నిష్పాక్షిక పాలకునిగా, హిందూ ధర్మ సంస్థలన్నింటినీ ఆదరించాడు దేవాలయాలకు భూములు దానంగా ఇచ్చాడు, బహుశా సంఖ్య "13" మీద మోజు ఉందేమో తెలియదుగాని, టిప్పు పదముగ్గురితొ ఉన్న తన మంత్రి మండలిలో హిందువులు ఏడుగురిని చెర్చుకున్నాడు, అంతేగాదు, టిప్పుకాలంలో ఇండియాలో ఉన్న పదముగ్గురు పెద్ద ప్రభువులలో ఏ ఒక్కరూ, ఇంగ్లీషువాడిపైన ఒక్క యుద్ధంలొకూడా గెలపలేకపోయారు అన్నింటి కంటే విశేషం - టిప్పు సుల్తాన్ విజయభేరిక, రణకౌశలానికి, కీర్తికి, విక్రమస్ఫూర్తికీ కారణమైన కరవాలం మైసూర్ పురావస్తు సంపదగా అయినా సంజయ్ ఖాన్ సీరియల్‌కు మిగిలిందిగాని, "ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమ సమూహము" లన్నట్టుగా మన ఛత్రపతి శివాజీ ఎత్తిన కత్తి "జై భవానీ" తల్వారా, లేక "సతారా" ఖడ్గమా, లేదా కొల్హాపూర్ కరవాలమా నేటిక చెప్పి చెప్పలేకపోవడం! వీటికోసం "ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం" వైపు ఈ రోజుకీ మొరలు చాచవలసి రావడమూ!!

జూలై 1, 1990

# అయోధ్య - ఇంతకీ ఎవరిది?!

మధ్య యుగాల మనస్తత్వాన్ని దాటి చాందసుల బుర్రలు ఎదగకపోయినా, కనీసం జాతీయతా దృక్పథంతో "రామజన్మభూమి - బాబ్రీమసీదు" అయోధ్య వివాదానికి పరిష్కార మార్గాలు సూచించుతున్న జాతీయ పక్షాల హేతుబద్ధమైన ప్రతిపాదనలనైనా పరిశీలించాలి బి జె పి రాజకీయ అండదండలతో విశ్వహిందూపరిషత్, ఆర్.ఎస్ ఎస్, భజ్రంగ్‌దళ్ సంస్థలు అయోధ్యలో ఉన్న బాబర్ మసీదును తొలగించి రామాలయ నిర్మాణం జరిగి తీరాలని ఇంకా పట్టుబడుతూనే ఉన్నాయి అటు ముస్లిమ్‌లలోని చాందసవర్గాలు, ఇటు హిందూమతం పేరిట కొందరు చాందసులూ కలిసి భిన్న తెగలతో విభిన్న మతాలతో కూడిన భారతదేశ సమష్టి జాతీయతనూ, ఉమ్మడి వారసత్వాన్నీ చెదరగొట్టడానికి పూనుకొన్నాయి మసీదు ఆవరణలో మందిర నిర్మాణం కూడదని బాబ్రీమసీదు రక్షణ సంఘమూ, మసీదును తొలగించి మందిరం నిర్మించేది ఖాయమని "రథయాత్ర" నడుపుతున్న బి జె.పి వి హెచ్ పి బృందాలూ భీష్మించుకుని ఉద్రిక్తతకు ముహూర్తం పెట్టాయి! ఈ సందర్భంగా కొన్ని చారిత్రక వాస్తవాలను అన్ని రాజకీయ పక్షాలూ, ప్రజాస్వామ్యవాదులూ, సెక్యులర్ శక్తులూ పరిశీలించి, కార్యరంగంలోకి దిగవలసిన అవసరం ఉంది అందరూ మరచిపోతున్న ఉమ్మడి వారసత్వానికీ, మత సామరస్యానికీ, భిన్నమతాలమధ్య, సంస్కృతుల మధ్య సుగుణ శీలమైన ఆదాన ప్రదానాలకూ నిలయం అయోధ్య ఈ సత్యాన్ని తొక్కిపెట్టి అయోధ్య కేవలం హిందువులకు మాత్రమే అరాధ్య కేంద్రమనీ, మరొకరు దానిని తాకరాదనీ భావించి ప్రచారం చేసేవారు అసత్యవాదులనీ, భక్తి ఉద్యమ లౌకికతత్వానికే విరోధులనీ ప్రకటించవలసిన సమయం వచ్చింది ఈ సందర్భంగా భారత కమ్యూనిస్టు పార్టీ సీనియర్ నాయకులలో ఒకరైన ఎ బి బ(వ)ర్ధన్ తాజాగా రాసిన ఒక పుస్తకంలో చేసిన సూచనలు జాతీయ సమైక్యతకు ఎంతగానో ప్రోదిచేసేవిగా ఉన్నాయి అయోధ్య విస్తీర్ణం చాలా పెద్దది కాబట్టి "బాబ్రీ మసీదు" ఉన్నచోటనే రామమందిరం ఉండనక్కరలేదు, మసీదును కదల్చకుండానే అయోధ్యలోనే మరొకచోట రామమందిరం నిర్మించుకోవచ్చు అంతేకాదు, అసలు మత చాందసుల దృష్టిలో వివాదంలో ఉన్న స్థలాన్ని మొత్తంగా "జాతీయ చిహ్నం"గా *(National monument)* నే ఎందుకు ప్రభుత్వం ప్రకటించకూడదు? ఎందుకంటే, శ్రీబ(వ)ర్ధన్ చెప్పినట్టుగా "శ్రీరాముని జన్మ భూమిగా హిందూమతంతో అయోధ్యకు భావసమైక్యత ఉంది, అలాగే సంవత్సరాల తరబడి గౌతమ బుద్ధుని కార్యకలాపాలకు, బోధలకూ కూడా కేంద్రంగా ఉన్నది సాకేత అయోధ్య, అలాగే మొదటి తీర్థంకరుడూ, నాల్గవ తీర్థంకరుడూ పుట్టింది కూడా అయోధ్యలోనే కాబట్టి జైనులకు కూడా పవిత్ర స్థలం అయోధ్య, అలాగే నాలుగు వందల ఏళ్ళుగా ముస్లిముల ప్రార్థనా కేంద్రమైన బాబ్రీ మసీదు ఉన్నది కూడా అయోధ్యలోనే! అందువల్ల మత సామరస్యానికీ, అందరికీ పవిత్ర స్థలంగానూ, హిందువుల, ముస్లిముల, బౌద్ధుల, జైనుల సహకార భావానికీ ప్రతీకగాను అయోధ్యను జాతీయ సామరస్య చిహ్నంగా ఎందుకు ప్రకటించుకోకూడదు? అలాంటి అయోధ్యను అసహనానికీ, విరోధానికీ, సంఘర్షణకూ కేంద్రంగా మార్చుకునే కంటే సకల మతాలకు చెందిన భక్తులకు ఆకర్షణీయమైన మహోన్నత కేంద్రంగా, యాత్రాస్థలంగా ఎందుకు దిద్దితీర్చుకోకూడదు?" శ్రీబ(వ)ర్ధన్ ప్రతిపాదనను ప్రతి ఒక్కరూ అంగీకరించదగింది అనేక జాతీయ సమస్యలను పక్కకునెట్టి, ఒకే ఒక "జాతీయ సమస్య"గా మత సమస్యను

ముందుకు నెట్టజూచే వారికి చారిత్రక సత్యాలతోగాని, వాస్తవ పరిస్థితులతోగాని సంబంధం ఉండదు కనుకనే ఉక్కుమనిషి సర్దార్ వల్లభాయ్ పటేల్ సోమనాథ్ దేవాలయ పునర్నిర్మాణం సందర్భంగా నాటి యు పి ముఖ్యమంత్రి గోవింద వల్లభ పంత్‌కు సమైక్యత గురించి, సామరస్యం గురించి చేసిన బోధను మరచి "సోమనాథ్ దేవాలయ పునర్నిర్మాణ" భాగం వరకే చాందసులు పరిమితమవుతున్నారు అర్థసత్యాలు వ్యాప్తి చేస్తున్నారు నిజానికి ఆనాడు జూనాఘడ్ సంస్థాన పాలకుడు జూనాఘడ్‌ను సంస్థానాల విలీనీకరణలో భాగంగా భారతదేశంలో అంతర్భాగం చేయకుండా పాకిస్తాన్‌లో కలుపుతానని మొరాయించినపుడు సోమనాథ్ పునర్నిర్మాణం ద్వారా నాడు సంస్థాన ప్రజలను సమీకరించ యత్నించినవాడు పటేల్ గణపతి ఉత్సవాలను బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వంపై ప్రజలలో రాజకీయ చైతన్య దీప్తికోసం తిలక్ తాత్కాలికంగా వినియోగించుకున్నట్టే పటేల్ ఆ పని చేశాడు (అయితే ఈ ధోరణి రాను రాను సెక్యులరిజానికి ఉరిత్రాడుగా కూడా మారింది అది వేరే విషయం) కాని ఇక్కడ గమనించవలసిన అసలు రహస్యం - గాంధీజీ హత్యకు కారణమైన ఆర్ ఎస్ ఎస్‌ను నిషేధించిన వ్యక్తి కూడా సర్దార్ పటేలే అన్న సత్యాన్ని బి జె పి నాయకులు మరచిపోతేఎలా?! అంతేగాదు, సోమనాథ్ దేవాలయాన్ని కొల్లగొట్టిన ఘజ్నీమహ్మద్ ముస్లిమ్ పాలకుడు అయినంత మాత్రాన ముస్లిములందరినీ మనం ఆ దృష్టితోనే చూడడం అనర్థం కాదా? ఎందుకంటే, దండయాత్ర వెడలి వచ్చిన అతను కూడా ఘజ్నీకి - సోమనాథ్‌కూ మధ్య మరే హిందూ దేవాలయాన్నీ ముట్టుకోకపోవడానికీ అత్యంత సంపద్వంతమైన సోమనాథ్ ను మాత్రమే దోచుకోడానికి గల చారిత్రక, ఆర్థిక కారణాలను కూడా పరిశీలించవలసి ఉంటుంది

ప్రొఫెసర్ ఆర్ ఎస్ శర్మ "కమ్యూనలిజం, అయోధ్య ఇష్యూ" అన్న రచనలో వివరించినట్టుగా 'తాము ఏ మతానికి చెందిన వారైనా, పాలితులైన తమ ప్రజలను దోచుకొని ప్రజలనూ, శత్రువులనూ అణచివేసి, కొల్లగొట్టిన సంపదను కాస్తా పాలక వర్గాలలోని ఉన్నత వర్గాలమధ్య పంపిణీ చేసుకోవడం - చరిత్రలో అన్ని పాలకవర్గాల వారసత్వంగా నమోదై ఉంది" అదే పనిని కొందరు ముస్లిమ్ (మొగలాయిలు) పాలకులు, హిందూ పాలకులు కూడా చేశారు ముస్లిమ్ వాస్తు శిల్పం రీత్యా మసీదులు ధనరాశులు దాచుకోడానికి వీలులేని కేంద్రాలు అవి కేవలం ప్రార్థనలకే తగినవనీ, కాగా మందిరాల, గర్భగుడుల నిర్మాణం వాస్తురీత్యా సంపదలు దాచుకోవడానికి అనువైనవనీ శ్రీ శర్మ పరిశోధనలో తేల్చారు! బహుశా ఈ కారణంవల్లనే అయి ఉంటుంది, కాశ్మీర్‌ను ఏలిన (11వ శతాబ్దంలో) హర్షునిలాంటి కొందరు హిందూ పాలకుల కళ్ళు కూడా భక్తుల విరాళాల రూపంలో పోగుబడిన దేవాలయ సంపదపైనే పడ్డాయి. వీరు అపురూపమైన అతి విలువైన లోహాలతో తయారుచేసిన దైవవిగ్రహాలను ధ్వంసం చేసి, వాటిని కరిగించి ఆ సొమ్మును ఖర్చుచేసుకునేందుకు వెనకాడలేదనీ, ఇందుకోసం ప్రత్యేకంగా అధికారులను కూడా నియమించినట్టూ చరిత్రకారులు స్పష్టంగా నమోదు చేశారు దీనికే వారు ఆనాడు "దివోత్పతనం" అని కూడా నామకరణం చేశారు! ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే రాళ్ళపాలయింది రాజుల సొమ్ముకాదు, ప్రజల సొమ్ము అనీ - ప్రజల సొమ్మును దైవం పేరిట, మతం పేరిట దోచుకోవడంలో పాలకవర్గాలంతా (మతంతో నిమిత్తం లేకుండా) ఒకటేనని స్పష్టం చేయడానికే! ఘజ్నీ, ఘోరీ మహ్మద్‌లు, సామర్కండ్ అధినేత తైమూర్‌ల పాలనవల్ల, దాడులవల్ల బాధలు పడినవారు, అణగారినవారూ ఆయా ప్రాంతాలలోని ముస్లిమేతర ప్రజలేగాక, మధ్యాసియా పాలకులు,

అసంఖ్యాకంగా సామాన్య ముస్లిం ప్రజలంతా ఇబ్బందుల పాలైనవారేనని చరిత్రచెబుతోంది ఆమాట కొస్తే మనం "స్వర్ణయుగం"గా చెప్పుకొనే గుప్తరాజుల కాలమంతా అంత "స్వర్ణ" మయమూ కాదు, దండయాత్రలకు దూరమూ కాదు! ఈ రోజుకీ మనం చూస్తూనే ఉన్నాం - మన పవిత్ర దేవాలయాల్లో ప్రవేశించి కోట్ల రూపాయల విలువైన వస్తువులను, హుండీలను, అపురూపమైన "నటరాజ" విగ్రహాలనూ పరాయివాళ్ళకు విక్రయించేందుకు దోచుకుపోతున్న ప్రబుద్ధులు మనలోనే ఉండడం! వారు స్టూవర్ట్‌పురానికి చెందినవారా లేక అయోధ్యలోని కోసల పురానికి చెందినవారా అన్నది ఇక్కడ సమస్య కానేకాదు! సమస్యల్లా - నాడు పాలకుని దండయాత్రలకు, సైన్యాన్ని మేపడాని[illegible]పైస ఖర్చులు భరించలేక తన జనాన్ని పీడించడంతోపాటు ఇతర ప్రాంతాలను కూడా దోచుకోడానికి అక్కడి సంపదపై కన్నువేస్తే, ఈ రోజున ఉదర పోషణార్థం బహుకృత వేషంలో భాగంగా ఈ దోపిడీలు యథేచ్ఛగా సాగుతున్నాయి ఈ దుర్మార్గాలు, దోపిడీలు ఏ నీతికీ కట్టుబడవు ఈ రోజుకీ అయోధ్య సమస్యపై పరిష్కారం కుదర్చడానికి ప్రయత్నించే పీఠాధిపతుల మధ్యనే సయోధ్య లేకపోవడం, కొందరు చాందసులు చివరికి కంచి పీఠాధిపతి చేసిన హేతుబద్ధమైన ప్రతిపాదనలను కూడా కాలదన్ని జాడడం వైదిక ధర్మాలకూ, ఉపనిషత్తుల సారానికీ, ప్రజాస్వామ్య విలువలకూ, హేతువాద దృష్టికీ, మానవతా దృక్పథానికీ పొసగని ప్రవర్తన అని గమనించాలి

అక్టోబర్ 4, 1990

# "సింధు" "హిందు" గా ఎలామారింది?!

ఈ దేశంలో ఎవరివి వోటు రాజకీయాలో, ఎవరివి కావో తేల్చి చెప్పలేని దుర్గతి నేడు దాపురించింది! మత రాజకీయ పక్షాలు సహా ప్రతి రాజకీయ పక్షమూ తనను మినహాయించుకొని ఎదుటిపక్షం వారిది "వోటు రాజకీయాల"ని ఆరోపణలూ, ప్రత్యారోపణలూ చేసుకుంటున్నాయి విజ్ఞానవేత్తలూ, తలనెరసిన రాజకీయ వేత్తలయిన భారతీయ జనతాపార్టీ నాయకులు అద్వానీ, వాజ్‌పేయ్‌లు కూడా వేద విజ్ఞానాన్నీ, ఉపనిషత్తుల సారాన్నీ మరచిపోయి సమన్వయవాదానికి విడాకులివ్వబోవడం విచారకరం భారతదేశ ప్రగతి యావత్తూ, దాని అభ్యుదయం అంతా రామజన్మభూమిని నికరం చేయడంపైనా, వివాదాస్పదమైన అయోధ్య స్థలాన్ని ఏకపక్షంగా నిర్ణయించడం పైనా ఆధారపడి ఉన్నట్టు వీరు భావిస్తున్నారు!! అలా భావించి, అయోధ్యలో ఉన్న బాబర్ మసీదు స్థలం వద్దనే రామదేవాలయ నిర్మాణానికి, కరసేవ ("పరిక్రమ") కు నాందీగా "వివాదాస్పద" స్థలం వద్దకు ఎనిమిది రాష్ట్రాలనుంచి పెద్దఎత్తున "యాత్ర"లు తలపెట్ట బోతున్నారు అక్టోబర్ 30 ఇందుకు ముహూర్తంగా నిర్ణయించారు రామజన్మ భూమి - బాబ్రీమసీదు స్థల వివాదంపై అలహాబాదు కోర్టు తీర్పు కోసం కూడా వేచి ఉండకుండా భిన్నజాతులకు, విభిన్న మతాలకు నిలయమైన భారతదేశపు సెక్యులర్ స్వభావానికి గౌరవానికి విరుద్ధంగా వ్యవహరించ బోతున్నారు ఇందుకోసం వీరు చేస్తున్న సరికొత్తవాదన - అయోధ్యలో రామదేవాలయ నిర్మాణానికి ముస్లిములు అంగీకరిస్తే, వారణాసి, మధురలలో దేవాలయాల నిర్మాణ ప్రతిపాదనను బి జె పి, విశ్వహిందూ పరిషత్‌లు వదులుకుంటాయని బి జె పి నాయకులు ఒక బేరంగా ప్రతిపాదించడం, తద్వారా ముస్లిం చాందసులను రెచ్చగొట్టడమూ. విజ్ఞాన వాదానికి, జ్ఞానభిక్షకు, పరమత సహనానికి పేరెన్నికగన్న భారతదేశంలోని బాధ్యతాయుత పౌరులు ఈ ఉభయవర్గాలు ప్రదర్శిస్తున్న వెర్రిబాగుల తనాన్ని అడ్డుకోవాలి పైగా, ఇండియాను సెక్యులర్ రాజ్యంగా, మతాతీతమైన వ్యవస్థగా ప్రకటించిన భారత రాజ్యాంగ లక్ష్యానికి విరుద్ధంగా కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులూ, కొందరు పార్లమెంటు సభ్యులూ "రథయాత్రల" ద్వారా దేవాలయ నిర్మాణం పేరుతో వివాదాస్పద స్థలానికి వెళ్ళే వాలంటీర్ దళాలకు నాయకత్వం వహించబోవడం దేశ సమగ్రతకు గానీ, సమైక్యతకుగానీ దోహదపడదు మరోవైపునుంచి "బాబ్రీ మసీదు రక్షణోద్యమ సమన్వయ సంఘం" కూడా, ఈ సమస్య మరో దేశ విభజనకు దారితీయకుండా ఉండాలంటే ఈ యాత్రలను కట్టిపెట్టించాలని కేంద్ర ప్రభుత్వాన్ని హెచ్చరించింది! నిజానికి ఉభయ వర్గాలలోని చాందసులు దేశ స్వాతంత్ర్యం తర్వాత పెరిగిపోవడానికి కారకులు - పాలకపక్షాలేనని మరవరాదు వోటు రాజకీయాలు ముదిరి, స్వార్థ ప్రయోజనాలకొద్దీ కులమత సంస్థలకు, మైనారిటీల పేరిట ప్రత్యేక సదుపాయాలు కల్పించి సెక్యులర్ భావానికి వికృతార్థం కల్పించడంవల్లనే ఈ మతశక్తులు విచ్చలవిడిగా వ్యవహరిస్తున్నాయి. అందరివీ వోటు రాజకీయాలు కాకపోతే భోపాల్ కన్వెన్షన్‌లో బి జె పి వేదికపైన గాంధీజి, అంబేద్కర్ విగ్రహాలు కూడా అకస్మాత్తుగా వెలసి ఉండవు!

మనది విజ్ఞాన వాదానికి హారతులు పట్టిన భూమి భారతదేశ చరిత్రలో ముఖ్య ఘట్టాలుగా భావించుకొనే ఉపనిషత్తుల కాలంలో, క్రీస్తుకు పూర్వం అయిదు శతాబ్దాలపాటు వర్ధిల్లిన బౌద్ధుల కాలంలో, ఆ తరువాత క్రీస్తు అనంతరం వర్ధిల్లిన గుప్తుల కాలంలో మూడు

పువ్వులూ ఆరు కాయలుగా వికసించింది విశ్వమానవతా వాదమేగాని, "విశ్వ హిందూపరిషత్" వాదం కాదు!!

చక్రవర్తుల రాజగోపాలచారి చెప్పినట్టుగా మనకు ఉన్నది "వేద విజ్ఞానం"గాని హిందు మతం కాదు కాని వేదాలలోనూ, ఉపనిషత్‌లలోనూ ఉన్న సమన్వయవాదం, విశ్వమానవ దృష్టి, ప్రాపంచిక దృక్పథం ఆధునిక చాందసులలో నశించిపోయి సంకుచిత ధోరణులు, పరమత ద్వేషం ప్రబలడం విచారకరం నేటి చాందసులు చెప్పే ప్రతీవాదనా, భారతీయ దర్శనాలలోని మేలిమి సంస్కృతికి వారసులైన రాజారామోహన్‌రాయ్, రామకృష్ణ పరమహంస, వివేకానంద, దయానంద సరస్వతి, టాగోర్, గాంధీ, నెహ్రూల విశ్వ మానవతావాదానికి పరమ విరుద్ధం ప్లాటో రిపబ్లిక్‌లాంటి "రామరాజ్య" భావన గాంధీజీకి కూడా ఉందికాని ఆయనెన్నడూ పరమత ద్వేషంతో యాత్రలు జరపలేదు చివరికి, జాతీయోద్యమ కాలంలో ప్రజలలోని స్తబ్దతను వదిలించడానికి తాత్కాలిక దశగా గణపతి ఉత్సవాలను ప్రోత్సహించిన బాల గంగాధర తిలక్ కూడా, ఆ ఉత్సవాలను స్వార్థ ప్రయోజనాలకు వాడుకొంటున్న శక్తులను చూచి నాలుక కరచుకొని 1895లోనే ఇలా హెచ్చరించవలసి వచ్చింది

"మత విద్వేషానికి, సాంఘిక దురన్యాయాలకు మనం అంకితమైపోయి, మన మనస్సులలోకి ప్రజా సంక్షేమానికి దోహదంచేసే విజ్ఞాన స్రవంతిని ప్రవహించనివ్వకపోతే, ఇక మనం ఎదిగేదిలేదు, మనకు ప్రగతి లేదు" ఇప్పుడు రామజన్మభూమి-బాబ్రీ మసీదు తగాదా పేరిట జరుగుతున్న తతంగం కూడా అదే మన వేదాలు "యతో మత, తతో పథ" (ఎన్ని మతాలున్నాయో, అన్ని మోక్షమార్గాలూ ఉన్నాయి) అని చెప్పాయి, సెక్యులరిజానికి అర్థం మన ఉపనిషత్తులు చెప్పిన సమన్వయం, సంయమనం అనే కాని మరొకటి కాదు "సత్యం ఒకటే, ఋషులు దానికి వేర్వేరు పేర్లు మాత్రమే పెట్టారు" అని ఋగ్వేదం చెబుతోంది ఆ "సత్య" మార్గాన్ని ఉభయవర్గాలలోనీ చాందసులు విడిచిపెట్టి అసత్యాలతో, అర్థ సత్యాలతో, కాలక్షేపం చేస్తున్నారు! ఈ ఋగ్వేద శ్లోకపాదాన్ని వివేకానందుడు భారతీయ దర్శనాలలో విశిష్ట "చింతనా పత్రం"గా ("మాగ్నాకార్టా") పేర్కొనడం సమన్వయం కోసమేగాని సర్వనాశనం కోసం కాదు! "సర్వ మానవుల ఉనికిని, ఐక్యతను, సంఘీభావాన్నీ గుర్తించే తాత్త్విక చింతనకు నా జోహార్లు, సర్వుల సుఖ సంతోషాలకోసం, వారి సంక్షేమంకోసం పాటుపడే తాత్త్విక చింతనకు నా నమోవాకాలు" అన్న వాడు గోడపాదుడైనా, శ్వేతశ్వతరోపనిషత్తు అయినా మనమందరం నమస్కరించవలసిందే. విద్యకు మూలం వినయం ఆ వినయ సంస్కారాన్ని పెంచే విజ్ఞాన వాదిగా రాజకీయవేత్త అవతరించాలి ఇంతకూ రామజన్మభూమి సమస్యకు సంబంధించి సుప్రసిద్ధ చరిత్రకారులు తెల్పిన అభిప్రాయాలను కూడా చాందసులు ఖాతరు చేయకపోవడం దేశానికి అరిష్టం. 11-12 శతాబ్దుల నాటికే అయోధ్యలో "రామ దేవాలయం" ఉందని చెప్పి, మొగల్ చక్రవర్తి బాబర్ 15వ శతాబ్దంవాడు కాబట్టి మసీదుకోసం ఆ దేవళాన్ని కూలగొట్టి ఉంటాడన్న ఊహాపోహలపై ఆధారపడి చాందసులు ఉద్రిక్తత సృష్టిస్తున్నారు. నిజానికి ప్రసిద్ధ చరిత్రకారుడు ప్రొఫెసర్ ఆర్ ఎస్ శర్మ పరిశోధన ప్రకారం - "11-12 శతాబ్దం నాటికి అయోధ్యలో రామ దేవళం ఉన్నట్టు చారిత్రక దాఖలాలేవీ లేవు అక్కడ జరిగిన తవ్వకాలు, పరిశోధనలూ ఈ వాదాన్ని పూర్వపక్షం చేస్తున్నాయి" అలాగే, 11వ శతాబ్దినాటి భట్టలక్ష్మీధర రచించిన సుప్రసిద్ధ "కృత్యకల్ప తరువు" గ్రంథంలో భాగంగా ఉన్న "తీర్థ వివేచన కాండ"లో (తూర్పు

ఉత్తర ప్రదేశ్ అంతా ఎక్కడా అయోధ్య దేవాలయ ప్రస్తావనగాని, రామజన్మభూమి ఊసుగానీ లేదని శ్రీ శర్మ తెలిపారు. ఎటు తిరిగీ అయోధ్య ఏడు ప్రధాన యాత్రాస్థలాల్లో ఒకటిగా పేరులోకి వచ్చింది మధ్యయుగాల చివరిలోగాని లేదా ఆధునిక యుగంలోగానీ అనీ *(Bakker "Ayodhya")* బాకర్ రాశాడు పైగా కేవలం రామనామంతో కట్టిన 'దేవాలయాలేవైనా ఉంటే అవి 12వ శతాబ్దంలో మధ్యప్రదేశ్‌లో వెలిసినవేగాని ఉత్తరప్రదేశ్‌లో కాదని చరిత్రకారులు తేల్చారు, 16వ శతాబ్దం చివరిదాకా యు పి లో రామదేవాలయమే లేదు, ఉన్న "కనక భవన్", కనక మండపం 17వ శతాబ్దం తొలిరోజుల్లో వెలసినవేనని నిగ్గుతేల్చారు అంతేగాదు, 15వ శతాబ్దం బాబర్ కాలమైతే, అదే శతాబ్దం తులసీదాస్‌ది కూడా! అయినప్పుడు అయోధ్యలో రామ దేవాలయాన్ని బాబర్ పడగొట్టి మసీదు కట్టినట్టు "బాబర్ నామా"లో కూడా లేదుట; ఆ కాలానికి (15-16వ శతాబ్దం) చెందిన తులసీదాస్ రామాయణం "రామచరిత మానస"లో కూడా మనకు కనిపంచే కావ్యక్షేత్రం "అవధపురి" ఎన్నడూ యాత్రాస్థలంగా లేదు అయోధ్యను రామదేవాలయం ప్రాంతమనిగానీ, పుణ్యక్షేత్రమనిగాని తులసీదాస్ చూపలేదు కేవలం కావ్య వస్తువుగా, కథానాయకునిగా రాముడు ఒక ఆదర్శమూర్తి, కనుకనే రామజన్మభూమి తబిశీళ్ళు ఇండోనేషియా లోని బాలినుంచి ఇండియాలోని బీహార్‌వరకూ వ్యాపించి ఉన్నాయి! కృష్ణుణ్ణి మధురకు, రాముణ్ణి అయోధ్యకు బందీలుగా చేయలేము!! మనస్సులు విశాలం కావాలి.

జూన్ 17, 1990

# నీ బాంచను దొర....'దాసి'

"జగత్తంత రగుల్కొన్న
క్రుద్ధ జ్వాల వృధా పోదు
అడుగడుగునా ఎడద నెత్తురు
గడగడమని తాగినావు
పడుతుల మానాలు దోచి
గుడగుడమని 'హుక్కా' త్రాగి
జడియక కూర్చుండినావు
మడికట్టుక నిలిచినావు
దగా కోరు బటాచోరు
రాజావారి పోషకుడవు"

తెలంగాణాలో నిజాం నిరంకుశ పాలనలో తెలుగుదనం కుచ్చు టోపీల చాటున వేళ్ళుగా మొలిచిన పచ్చి ఫ్యూడల్ సంస్కృతిలో జాగీర్దార్లు, దేశ్‌ముఖ్‌లు నిరాఘాటంగా సాగించిన అకృత్యాలపై అక్షర రూపంలో దాశరథి వెళ్ళగక్కిన క్రోధాగ్నులే ఈ చరణాలు అరువు తెచ్చుకున్న నడమంత్రపుసిరిలో గడీ లోపల ఆడవాళ్ళను లేదా దాసదాసీ జనాలను అమానుషంగా ఏడిపించి మానవచరిత్రను అపహాస్యం పాలుచేసిన ఆనాటి దుర్మార్గపు వ్యవస్థలో గడిచిపోయిన ఒక చీకటి అధ్యాయానికి వాస్తవ చిత్రీకరణ చిరంజీవి బి నరసింగరావు నిర్మించిన కథా చిత్రం 'దాసి' ఈ చిత్రానికి ఇంతవరకూ జాతీయ స్థాయిలో మరే తెలుగు చిత్రానికీ (బహుశా ఇతర భాషా చిత్రాలతో సహా) రాని గౌరవాదరాలు 36వ ఫిల్మ్ అవార్డుల ప్రకటనలో లభించడం యావత్తు తెలుగు జాతి గర్వించదగ్గ ఘట్టంగా భావిస్తున్నాం నరసింగరావు 'లిటిల్ ఇండియా' పతాకం ఒకే దఫా అయిదు అవార్డులు సాధించి 'బిగ్ ఇండియా' పతాక స్థాయికి చేరుకుందని చెప్పాలి! నిజానికి నర్సింగరావు బ్యానరు పొందినవి అయిదు అవార్డులు కావు, ఆరు మానుష విజ్ఞానశాస్త్ర ప్రతీకగా అతను తీసిన 'మా ఊరు' డాక్యుమెంటరీకి కూడా ఈ సందర్భంలోనే ఒక అవార్డు రావడంతో జాతీయ స్థాయిలో ఏ భాషా చిత్ర దర్శక, నిర్మాతకూడా దక్కని పురస్కారం అతనికి జరిగినట్లయింది

మన రాష్ట్ర స్థాయిలో ఏ చిత్రాలు ఎన్ని అవార్డులు పొందినప్పటికీ జాతీయ స్థాయిలో 'శంకరాభరణా'నికి మూడు అవార్డులు దక్కగా, 'శంకరాచార్య'కు సహితం నాలుగే లభించాయి కాని, రాష్ట్రస్థాయిలో నంది అవార్డులకు పంపిన ఎంట్రీలలో 'దాసి' కూడా ఉన్నప్పటికీ ఇటీవల ప్రకటించిన 'నంది' అవార్డులలో ఒక్కటి కూడా దానిని ఆశ్రయించలేకపోవడం శరవేగాన మారిపోతున్న మన రుచులకు, విలువలకు, క్రిటిక్స్ పేరిట విమర్శకుల చౌకబారు అభిరుచులకు నిదర్శనం కాదా? రచయితకు, చలన చిత్రానికి ప్రధాన సాంఘిక బాధ్యత మూగజీవులుగా పడి ఉన్న పేదసాదలకు నోళ్ళు కల్పించడమూ, వారితో గొంతుకలపడమూ అన్నాడు అల్బర్ట్ కామూ ఆ పని 'మా భూమి', 'దాసి' చిత్రాల ద్వారా నిర్మాత చేశాడు వ్యాపార నాగరికతలో నిర్మాత భాగస్వామే అయినా ఆ ఛాయలను అదుపు చేసుకుని పురోగమించడంలో సాంఘిక ప్రయోజనాన్ని సాధించి పెట్టడంలో, చైతన్య దీపాలు వెలిగించి జనాల్లో ఒక దుర్మార్గపు వ్యవస్థపట్ల ఏహ్యతను, జుగుప్సను రెక్కొట్టడంలో తన ముద్రను

వేసుకోగలడు ఈ చైతన్యానికి దూరమైన క్రిటిక్స్, న్యాయనిర్ణేతలు మంచిని చెడుగా గుర్తించి తీర్పరులవుతుంటారు ఈ విషయంలో 'సలాం బాంబే' కూడా 'దాసి' లానే ఇబ్బంది పడింది ఉన్నమాట చెప్పాలంటే 'రోజులు మారాయి' చిత్రంతో తెలుగు చిత్రాలు అవాస్తవిక సరిహద్దులను అభిమానించడం ప్రారంభించినాయేమో అనిపిస్తుంది ఆధునిక సాహితీ పరిజ్ఞానాన్ని అనువదించడంలో పాశ్చాత్యుల కంటే కనీసం పాతికేళ్ళయినా వెనకబడి ఉండటంవల్ల కూడా ఈ తొట్రుపాటు వస్తూండవచ్చు కాని, అది టెక్నిక్‌కు సంబంధించినది మాత్రమే మనోనేత్రం తెరవడం వ్యక్తిచైతన్యం ఫలితం ఇందుకు సాక్ష్యం కె వి రెడ్డి 'పెద్ద మనుషులు', బి ఎస్ రెడ్డి 'బంగారు పాప', రామబ్రహ్మం 'రైతుబిడ్డ' ఎల్ వి ప్రసాద్, 'షావుకారు' చిత్రాలు నరసింగరావు 'దాసి' వీటిలో దేనికీ తీసిపోదు మనవాళ్ళు సుఖాంతాలైన చిత్రాలకే అలవాటుపడ్డారు గాని, విషాదాంతాలను అంతగా అభిలషించరు ఈ మనస్తత్వం వాస్తవ విరుద్ధం సుఖాంతం కావాలనడం మనలోని మంచికోరిక కానీ విషాదాంత గాథను భరించలేకపోవడం పిరికి తనం, పలాయన తత్వం ఆ విషాద కారణాన్ని కూకటివేళ్ళతో తొలగించగల మనోనిబ్బరాన్ని కల్పించడం చిత్రం ఆదర్శం కావాలి సందేహాలకు తావులేని సందేశం ఉండాలి గాని 'భట్టిప్రోలు పంచాయతీ' తీర్పులు ప్రేక్షకుడ్ని అయోమయంలోకి నెడతాయి 1986లో హైదరాబాద్‌లో వర్ధమాన దేశాల మహిళా చిత్రాలను ప్రదర్శించినపుడు అర్జెంటీనా దర్శకురాలు మేరియాలుసా బీంబర్గ్ తన చిత్రం 'నో బడీస్ లైఫ్' గురించి ముచ్చటిస్తూ ఈ విషయాన్నే నొక్కిచెప్పింది కుటుంబ జీవిత కథాచిత్రంలో భార్యను భర్త విడిచిపెట్టవచ్చు గాని, భర్తను భార్య విడిచి పెట్టకూడదట-అందుకని ఆ కారణంపైన సెన్సార్ ఆ చిత్రాన్ని నాలుగేళ్ళపాటు అణగదొక్కారట పురుషాధిక్య సమాజంలో బతుకుతున్న మనకు 'దాసి' బతుకును అర్థం చేసుకోవడం కూడా కష్టమే ఒక వేళ అర్థం చేసుకున్నా మనస్సు మళ్ళించుకోవడం కష్టం దుర్యోధనుడు ఏమన్నాడు? "తప్పేమిటో నాకు తెలుసు కాని దానినుంచి నా మనసు మళ్ళదు నిజం ఏదో కూడా నాకు తెలుసు దానివైపునా మనసు మళ్ళదు"

బంగారపు పళ్ళెరానికి కూడా గోడ చేర్పు అవసరం కదా! సత్యజిత్ రే 'పథేర్ పాంచాలి' ని ఎవరో మిత్రుడు మన్రోవిలార్‌కు పరిచయం చేస్తే తప్ప 'ఫిఫ్త్ అవెన్యూ సినిమా' గేట్లు తెరచుకోలేదు 'దాసి' ఈ అవరోధాలకు అతీతంగా అల్లుకుపోగల శక్తి సామర్థ్యాలున్న ఉత్తమ చిత్రంగా రాణించవచ్చు.

ఏప్రిల్ 14, 1989

# ప్రయోగ నాళికలో సూర్యోదయం!!

ఎంతటి వింత! ఈ శతాబ్దంలో మరొక వింత! వింతలలో వింత! ఇంధనం కొరతగా ఉన్నవారందరికీ ఒక శుభవార్త

"దివిలో సహస్ర సూర్యులొక్కసారిగా ఉదయిస్తే ఆ కాంతి మహాత్ముడి తేజస్సుకు సమాన"మని భగవద్గీత చెబుతోంది దుష్టుల లోకసంహారం కోసం విశ్వరూపం ధరించిన కాలుణ్ణేతానని ప్రకటించుకున్నాడు కృష్ణుడు నిజానికి అణువు అంతపనీ చేస్తుంది సూర్యబింబం అంచు పదిలక్షల డిగ్రీల తాపశక్తితో దీపిస్తుండగా, సూర్యగర్భం ఉష్ణోగ్రత కోటి యాభై లక్షల కెల్విన్ల శక్తిగలదని (మామూలు గది ఉష్ణోగ్రత 300 కెల్విన్‌లు) భావించినప్పుడు - ఎంతటి తీవ్ర స్థాయిలో అణువుల విచ్ఛిత్తి జరిగితేనో గాని అంతటి శక్తి పుట్టదని అర్థమవుతుంది. అణువుల విచ్ఛిత్తివల్లనే, అభ్యంతర కల్లోలం వల్లనే అంతటి శక్తి విడుదల కాగలదని భౌతిక విజ్ఞానశాస్త్రంలో ఇప్పటివరకు బలపడి బట్టకట్టిన విశ్వాసం కాని విచ్ఛిత్తి వల్లనే కాదు, అణువుల సంయోగంవల్ల కూడా అపారమైన అంటటి శక్తిని (విద్యుత్‌ను) పుట్టించవచ్చని సౌథాంప్టన్ యూనివర్సిటీకి (ఇంగ్లాండ్) చెందిన శాస్త్రవేత్త మార్టిన్ ఫ్లెష్‌మాన్, "ఉటా" యూనివర్సిటీ (అమెరికా) ప్రొఫెసర్ స్టాన్లీ పాన్స్ ప్రయోగశాలలో జరిపిన ప్రయోగాలవల్ల రుజువైనట్లు చెబుతున్నారు లేబొరేటరీల్లో ఇలాంటి ప్రయత్నాలు ఇతరచోట్ల కూడా కొందరు చేశారు కాని అవి అంతగా ఫలప్రదం కాలేదు అయితే ఈసారి తమ ప్రయోగం జయప్రదమయినదని ఫ్లెష్‌మాన్ - పాన్స్ ప్రకటించడంతో భౌతికశాస్త్ర ప్రపంచంలో సౌరశక్తికి దీటైన, విద్యుదుత్పాదనలో విప్లవాత్మకమైన పరిణామానికి ఆశీస్సులు పలికి నట్టయింది గత కొలది రోజులుగా ఈ విశిష్ట ప్రయోగ వార్త లేబరేటరీల సరిహద్దులుదాటి ఖండాంతరాలకు వ్యాపించబట్టే, దివిలో జరిగే పరిణామాన్ని భువిలో జరిపి ప్రయోగ నాళికలోనే "ఆదిత్య హృదయాన్ని" (సూర్యోదయం) అణు సంయోగ క్రియ ద్వారా ఆవిష్కరింపచేయడానికి గత ముప్పయ్యేళ్ళుగా శాస్త్రవేత్తలు జరుపుతున్న కృషికి తొలి విజయ సంకేతం అందబట్టే - భారత శాస్త్రవేత్తలు కూడా ఇందుకు హర్షిస్తున్నారు బొంబాయిలోని బాబా అణు పరిశోదనా కేంద్రం డైరెక్టర్ డాక్టర్ పి కె.నాయర్ ఈ పరిణామం గురించి ఆచితూచి వ్యాఖ్యానించినప్పటికీ రానున్న ఫలితాల పట్ల ఆసక్తి వ్యక్తం చేశారు.

శక్తి, పదార్థం ఒకటే అని చెప్పి, ఆ రెంటినీ మానవుడు విజయానికీ విలయానికీ కూడా ఎలా మార్చుకోవచ్చునో, మలచుకోవచ్చునో ఐన్‌స్టీన్ నిరూపించి పోయాడు దాని ప్రతిఫలమే అణు విజ్ఞాన శాస్త్రాభివృద్ధి అణువులో రెండు నెగటివ్ కణాల మధ్య ఒకదాని పొడమరొకదానికి గిట్టి చావదు. కనుకనే దీనిని రిపల్షన్ అన్నారు అలాగే పాజిటివ్ - నెగిటివ్‌ల మధ్యనే ఆకర్షణ ఉంటుంది కాబట్టి 'ఎట్రాక్షన్' అన్నారు కాని ఈసారి ప్రయోగంలో శాస్త్రవేత్తలు సాధించామని చెబుతున్నది - ఒకే రకమైన రెండు అణువులను (అంటే పరస్పరం పడని వాటిని) సంధించి, ఒకటిగా సంయోగపరచడం అదే "ఫ్యూజన్". ఈ ప్రయోగం నిజంగానే పూర్ణ ఫలితంగా స్థిరపడితే శ్రీ శ్రీ చెప్పినట్టు "నిజంగానే, నిజంగానే నిఖిల లోకం నిండు హర్షం" ప్రకటిస్తుంది! ఎందుకని? మన ఊహకు అందని ప్రయోజనాలను, ఫలితాలను ఈ పరిణామం మన లోగిళ్ళలోకి చేర్చుతుంది. ఇంధనం పుష్కలంగా లభించడమే గాక కృత్రిమ

సౌరశక్తి కారుచౌకగా లభిస్తుంది రూమ్ టెంపరేచర్‌లో సాధించుతున్న ఈ ఫలితాన్ని శాస్త్రవేత్తలు "కోల్డ్ ఫ్యూజన్" అంటున్నారు అంటే ఈ అణు సంయోగాన్ని ప్రచ్ఛన్నంగా, ప్రశాంతంగానే సాధించుకోవచ్చున్న మాట! మరో మాటలో చెప్పాలంటే ఇది పరిశోధ నాళికలో వెలసిన శిశుమూర్తిలా, టెస్ట్‌ట్యూబులో వెలసే "కాంతి పుంజం" అన్నమాట! కనుకనే దీనిని -- ఈ శతాబ్దంలోనే ప్రముఖమైన ప్రయోగంగా భావిస్తున్నారు ఈ ప్రయోగం పూర్తి సాఫల్యం పొంది నిత్యజీవనానికి అనువదించుకున్నప్పుడు -- విద్యుత్‌ను సముద్ర జలాల నుంచే సరాసరి పొందవచ్చు అంతేగాదు, నేటి అణువిద్యుత్తు కర్మాగారాల నుండి విడుదలయ్యే ధార్మిక శక్తి కూడా నామమాత్రం అయిపోతుందటున్నారు గది ఉష్ణోగ్రతలోనే కావలసినంత ఉష్ణాన్ని, విద్యుత్‌నూ పొందగలిగిన ఆచరణ సాధ్యమైన టెక్నాలజీ ఇది

హిట్లర్ వేధింపులకు ఊరు విడిచిపోయిన బెర్లిన్ రచయిత అల్ఫ్రెడ్ డోబ్లిన్ ఒక మాట అన్నాడు "మానవాళిపై కొందరు బుద్ధిపూర్వకంగా తలపెడుతున్న దాడులన్నీ ఇకపైన డ్రాయింగ్ బోర్డుల నుంచీ, లేబొరేటరీల నుంచీ జరగబోతున్నాయి". అయితే శాస్త్రవేత్తల తాజా ప్రయోగం --హిరోషిమా, నాగసాకీల వంటి మానవ నగరాల జనావాస ప్రాంతాల వినాశనానికి కాకుండా శ్రమ జీవన సౌందర్యానికీ, పరిశ్రమ సౌభాగ్యానికీ దీపకళికలై మానవ శ్రేయస్సే అణు విజ్ఞానశాస్త్ర శ్రేయస్సుగా భావించి వర్ధిల్లగలదని ఆశిద్దాం!

బుధవారం, ఏప్రిల్ 19, 1989

# పత్రికాలోకంలో చారిత్రక సంధ్య!

"వార్త పత్రిక లక్ష్యాలలో ఒకటి - జనాభిప్రాయాన్ని అర్థం చేసుకొని, దాన్ని వ్యక్తీకరిస్తూ అక్షరబద్ధం చేయడం, మరొక ఆదర్శం - వాంఛనీయమైన భావాలు ప్రజల్లో ప్రబుద్ధమయ్యేటట్టు రెక్కొట్టడం, ఇక మూడవది - లోపాలను కొట్టొచ్చినట్టు నిర్భయంగా ఎండగట్టడం దినపత్రిక లక్ష్యంగా ఉండాలి" ఈ మాటలన్నది బోఫోర్స్ కుంభకోణాలను వెల్లడిస్తున్న పాత్రికేయుడు కాదు, ఈ విషయం చెప్పింది ఏ "గార్డియన్" పత్రిక సంపాదకుడోకాదు, ఈ నగ్నసత్యాన్ని అరమరికలు లేకుండా చెప్పింది ప్రజాస్వామిక వ్యవస్థను అభిమానించే ఏ రాజకీయ నాయకుడో కాదు సాక్షాత్తు గాంధీజీ అన్న మాటలవి! కాని ఆ గాంధీజీ ఆదర్శాలను దేశ స్వాతంత్ర్యా నంతరం నాయకత్వం మురుగుకాల్వల్లోకి నెట్టివేసింది, అలాగే పత్రికా స్వేచ్ఛకు సంబంధించి, దాని ధర్మాలకు సంబంధించి చెప్పిన నీతిపాఠాలను కూడా పాలకులు, యాజమాన్యాలు, వ్యాపార ప్రకటనా కర్తలూ గంగలో కలిపారు, కలుపుతున్నారు ఇప్పటికి 111 సంవత్సరాల చరిత్ర కలిగి, తన జీవిత కాలంలో ఎన్నో ఒడిదుడుకులను, ఒత్తిడులను, సవాళ్ళనూ ఎదురొడ్డి నిలిచిన ప్రసిద్ధ ఆంగ్ల దినపత్రిక "హిందూ లో, ఒకనాటి 'మౌంట్ రోడ్డు మహావిష్ణువు"గా పేరొందిన "హిందూ" వార్తా నిర్వహణలో ఈ నెల 11-12 తేదీలలో వచ్చిన కల్లోలం - గాంధీజీ మాటలను మరొకసారి పత్రికా ప్రపంచానికి గుర్తుచేసింది! ఆ కల్లోలం పత్రిక పెట్టుబడులకు సంబంధించిన వాటాల పంపిణీ గురించి కాదు, ఆ కల్లోలం ఆ పత్రికను ఎవరు నిర్వహించాలన్న వారసత్వ తగాదాల గురించి కాదు, ఆ కల్లోలం సిబ్బంది సంక్షేమం గురించి పడిన వివాదంవల్ల తలెత్తింది కానే కాదు! అది - కేవలం పత్రికా నిర్వహణలో పాటించవలసిన కొన్ని సత్సంప్రదాయాలకూ, నైతిక విలువలకు, స్వతంత్ర ప్రతిపత్తికీ, వృత్తిలో నిర్భీతికీ సంబంధించి తలెత్తిన ఒక చారిత్రిక కల్లోలం! ఒకనాటి "హిందూ" కన్సర్వేటివ్ చరిత్రలో మూలముట్టుగా మార్పులు తెచ్చిన అసోసియేట్ ఎడిటర్, దాని యజమానులలో ఒకరూ అయిన ఎన్ రామ్ గత పదిహేనేళ్ళలో దాని ఆకృతిలో, అంతరంగంలో ప్రవేశపెట్టిన మార్పులు ఒక ఎత్తుకాగా, 12వ తేదీన ఆ పత్రికనుంచి ఒక జాతీయ సమస్యపైన - బోఫోర్స్ కుంభకోణం దేశ రక్షణకు సంబంధించి జరుగుతున్న కొన్ని అవకతవకల గురించిన కొన్ని డాక్యుమెంట్ల ప్రచురణ నిల్పివేత, ఆ దరిమిలా రామ్ నిష్క్రమణ - మరొక ఎత్తు! ఒకనాడు పత్రిక మొదటి పేజీని వార్తలతో గాక క్లాసిఫైడ్ యాడ్స్‌తో నింపి, గాంధీజీ హత్య వార్తను సహితం లోపలి పేజీల్లోకి నెట్టివేసుకోగలిగినంత 'ఛాందసబ్రహ్మ'గా మారిన ఈ పత్రిక రూపురేఖలను మార్చినవాడు రామ్ 'హిందూ'లో రామ్ నిష్క్రమణ పత్రికా ధర్మాలేమిటో నీళ్ళు నములకుండా, కాళ్ళు తడబడకుండా అధికార స్థానాలతో నిమిత్తం లేకుండా జర్నలిస్టులందరూ ఒకటికి పదిసార్లు ఆలోచించుకోవలసిన విషయం అంతేగాదు, ఒక పత్రిక స్వేచ్ఛకు, నిష్పాక్షికంగా దాని విధి నిర్వహణకూ ప్రభుత్వాలు అడ్డుపడినప్పుడు, వ్యాపార ప్రకటనలు నిలిపివేస్తూ బెదిరించినప్పుడు పత్రిక స్వతంత్ర ప్రతిపత్తిని ఎలా నిలబెట్టుకోవాలి? అది చేతకానప్పుడు విధి నిర్వహణలో విఫలమైనందుకు పశ్చాత్తాపంతో ఆ పత్రికను ఎందుకు మూసివేసుకోకూడదు? ఇత్యాది సమస్యలు పాత్రికేయుల మనస్సులను పీడించి తీరుతాయి. ఎందుకని? ఎన్ రామ్ చేసిన ప్రకటనలో కొన్ని వత్తిళ్ళకు లోనై యాజమాన్యాలే ప్రకటిత లక్ష్యంనుంచి దూరమై, తాముగానే వార్తలనూ, సమాచారాన్నీ కొన్ని ప్రయోజనాలకోసం తొక్కిపడుతూ "ఆంతరంగిక ఆజ్ఞల్ని"

*(Internal Censorship)* ప్రవేశపెట్టి ప్రజలను, పాఠకులను అంధకారంలోకి నెట్టడాన్ని నిరసించవలసి వచ్చింది! తానూ, చిత్రా సుబ్రహ్మణ్యం 48 మాసాలుగా చేసిన పరిశోధనాత్మక పాత్రికేయ ధర్మనిర్వహణ కాస్తా "ఈనకాచి నక్కలపాలవుతున్న" సమయంలో - ఎన్ రామ్ చేసిన ప్రకటనలో వృత్తి ధర్మం గురించి ఒక హెచ్చరిక ఉంది, "ఒక కీలకమైన జాతీయ సమస్యపైన, నైతిక సమస్యపైన సమాచారం తెలుసుకొనే హక్కు ఈ దేశ ప్రజలకు ఉందా లేదా అన్నదే - నేడిక్కడ పెద్ద సమస్య, అంతేగాదు, జర్నలిజం తన వృత్తి ధర్మాలను, విలువలనూ ఈ హక్కుకు లోబడి ఉండేలా చేసితీరాలా, అక్కరలేదా?" అయితే, ఎడిటర్‌గా 'కస్తూరి' అసాధారణాధికారాలనూ కాదనలేము, సంస్థ అధిపతిగా విస్తృతమౌతున్న సంస్థ బహుళ ప్రయోజనాలను (సిబ్బంది భవితవ్యం వగైరా) కాపాడుకోవలసిన బాధ్యతనూ కాదనలేము. కాని "హక్కులూ", బాధ్యతలూ అన్నవి ఏ ఒక్కరి ప్రయోజనాల రక్షణకో తాకట్టు పడకూడదు! అవి దేశానికీ, ప్రజలకూ మాత్రమే తాకట్టుపడాలి, అంకితంకావాలి నిజానికి ఏతావాతా జరిగిన పని - అభాసుపాలైన 1988 నాటి "డిఫమేషన్ బిల్లు" ద్వారా సాధించలేని కార్యాన్ని బురాక్రసీ 'సన్నాయినొక్కుళ్ళ' ద్వారా సాధించింది!

"హిందూ" కథ విన్న తరువాత ఇకనెంతమాత్రం పాత్రికేయులమనుకుంటున్న వాళిక యంగ్ ఇండియా, హరిజన పత్రికల ద్వారా గాంధీజీ చూపిన తెగువ గురించి, ధైర్యం గురించీ మాట్లాడగల శక్తి ఉండదు, "కేసరి" ద్వారా లోకమాన్య బాలగంగాధర తిలక్, "న్యూ ఇండియా" ద్వారా అనిబిసెంట్, "లీడర్" ద్వారా చింతామణి, "ట్రిబ్యూన్" ద్వారా బిపిన్ చంద్రపాల్, కాలీనాథ్‌రాయ్ రాతలలో, తలపోతలలో, అన్యాయాల వెల్లడిలో చూపిన తెంపూ, తేకువ గురించి గొప్పలు చెప్పుకునే దమ్ములు మనకు చాలవు! అలాగే "బొంబాయి క్రానికల్" ద్వారా హార్నిమాన్, "ఫ్రీ ప్రెస్ జర్నల్" ద్వారా సదానంద పాలకుల చేష్టలపైన చెరిగిన నిప్పుల గురించి మాటమాత్రంగానైనా ప్రస్తావించుకోగల స్తోమత ఇక మనకు చాలదు! "ఎమర్జన్సీ" కాలంలో దేశీయ పత్రికలు ఎదుర్కొన్న అగచాట్లు ఇన్నీ అన్నీ కావు "హిందుస్తాన్ టైమ్స్" నుంచి ఎడిటర్ జార్జి వర్ఘీస్ ఎలా వైదొలగవలసి వచ్చిందీ, మనకు తెలియనిది కాదు, 1970లో ఆంధ్ర-తెలంగాణా ఘర్షణలప్పుడు ఒక వార్త విడుదల చేసినందుకు సచివాలయం నుంచి పి టి ఐ వార్తా సంస్థను ఆనాటి రాష్ట్ర ప్రభుత్వం ఎలా తొలగించిందీ రహస్యమేమీ కాదు, అడ్వర్‌టైజ్‌మెంట్ల నిల్పివేతను, వార్తా ప్రచురణ ఆపివేతను పాలకులు బాహాటంగా కాదు "చాపకింద నీరులా" అమలు జరిపిస్తారు! అది కుదరనిచోట ఒక గోయెంకాయో, ఒక ఇరానీయో నిలుస్తాడు! కోటంరాజు రామారావు "సెర్చిలైట్" సంపాదకుని హోదాలో 1950ల పాలకుల వత్తిడివల్ల బిర్లాల నుంచి ఎదుర్కొన్న మిడిమేలం, ఉద్యోగ ఉద్వాసన భారతీయ జర్నలిజంలో, "ఇంటర్నల్ సెన్సార్‌షిప్"లో తొలి మజిలీ! బ్రిటన్‌లోని పత్రికా 'మాలోకం' గురించి చార్లెస్ వింటోర్ - దినపత్రికలపై ప్రభుత్వాల 'నాలిముచ్చు' వత్తిడులతోపాటుగా, పరిశ్రమాధిపతుల, అడ్వర్‌టైజర్ల, చివరికి పత్రికా యాజమాన్యాల వత్తిడికూడా ఎంత భయంకరంగా ఉంటుందో వెల్లడించాడు! కొన్ని జాతీయ కుంభకోణాల వెల్లడికి సంబంధించిన రాతలు నచ్చలేదనుకొన్నప్పుడు, పత్రికలను వత్తిడితో అణచడానికి ప్రయత్నించే కంటే భిన్నాభిప్రాయాన్ని సకారణంగా, హేతుబద్ధంగా ఎదుర్కోవడమే సరైన మార్గమన్నవాడు తామస్ జఫర్సన్ *("error of opinion may be tolerated when reason is left to combat it")* అదేమంటే, "అధికార రహస్యాల" వెల్లడి నిరోధక చట్టాన్ని బెదిరింపుగా చూపిస్తారు! ఆఫ్రికాలోని "బియాఫ్రా"

ఘోరకలిలో బ్రిటిష్ ప్రభుత్వంచేసిన దూర్మార్గాలను, అక్రమాలను వెల్లడిచేసిన అధికారిని కొరతవేయాలని నిర్ణయించినప్పుడు - జస్టిస్ కాల్‌ఫీల్డ్ అడ్డుపడ్డాడు! అసలు "అఫీషియల్స్ సీక్రెట్స్ యాక్టు"లోని రెండవ సెక్షన్‌కు "రిటైర్మెంటు వయస్సు వచ్చిందనీ, దానికి పింఛను ఇచ్చి సాగనంపడం మంచిద"నీ వ్యంగ్యంగా పాలకులను శరించాడు! 1970లలో అమెరికాలో వాటర్‌గేట్, రక్షణ వ్యవహారాలకు చెందిన "పెంటగాన్ పత్రాల" కేసుల్లో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులు ప్రపంచ పత్రికా లోకానికి శిరోధార్యాలు, ప్రభుత్వాలకు శిరోవేదనలూ కావా? జాతి గౌరవం మంటకలుస్తున్న సమయంలో పత్రికలొక్కటే ప్రజలకు ఆధారమన్న తీర్పు సువర్ణాక్షరం కాదా? పత్రికాస్వేచ్ఛ గురించి హచిన్సన్ రిపోర్టు(అమెరికా) పేర్కొన్నట్టుగా పాత్రికేయుల పురోభివృద్ధి కంటకావృతం *("If we are to live progressively, we must live dangerously")* బుద్ధి చెప్పువాడు గుద్దిననేమయా అని వేమన అనలేదూ?!

అక్టోబర్ 15, 1989

# ప్రచార కవితలు !

ఓటు కోసం ప్రచారం అన్నది - అసలు యాచకవృత్తి నుంచే వచ్చి ఉండాలి శ్రీకృష్ణదేవరాయలు ముందుముందు ఏ ప్రయోజనం ఆశించి ఇచ్చాడో తెలియదుగాని తన కాపలావాడైన తిమ్మన్నకు ఒక ఆకు పచ్చని శాలువా/పచ్చడం బహుమానంగా ఇచ్చాడట అడుక్కుతినేవాడికి అడుక్కుతినే వాడే శత్రువంటారు తిమ్మన శాలువాపైన ఆస్థాన కవులైన పెద్దన, భట్టుమూర్తి, ముక్కు తిమ్మన, రామలింగడి కళ్ళు పడ్డాయి! నలుగురూ కలిసి శాలువా కోసం తిమ్మన్నకు 'తైరు' కొడుతూ ఓ పద్యం అల్లేశారుట "వాకిటి కావలి తిమ్మా!/ ప్రాకటముగ సుకవి వరుల పాలిటి సొమ్మా!/నీకిదె పద్యము కొమ్మా!" అని మొదటి ముగ్గురూ అంటే, తెలివిగల రాజకీయ నాయకుడి లాంటి తెనాలి రామలింగడు లౌక్యంతో "నాకీ పచ్చడము చాలు నయముగ నిమ్మా!" అని సిగ్గు లేకుండా కాపలావాడి శాలువా కాస్త కొట్టేశాడు! వోటరు జాగ్రత్తగా లేకపోతే మన రాజకీయ 'రామలింగళ్ళు' వోటేగాదు, వొంటిమీద వలువలు కూడా ఊడ్చి పెట్టుకుపోతారు! వాకిలి దాటేవరకే వాగ్దానాలు, ఆ తరువాత వన్నీ వాగ్దాన భంగాలే! వెనక రాజా కళింగ గంగు, వేములవాడ భీమకవికి వాగ్దానం చేసిన పనిని ఎన్నాళ్ళకూ చేయకుండా 'రేపురా మాపురా' అని అదే పనిగా తిప్పించుకుంటూంటే నీవు "రాజ్యభ్రష్టుడివి" కమ్మని శపించాడట! శాపానుగ్రహ 'శక్తి' కలవాడు కాబట్టి భీమకవి అప్పటికప్పుడు శపించగలిగాడు కాని మన వోటరు, మాట తప్పిన మంత్రినీ, గాడి తప్పిన ప్రతినిధినీ గద్దెలెక్కిన తర్వాత మళ్ళీ అయిదేళ్ళ వరకూ దించనూలేరు, వాళ్ళను వక్రంగా ప్రవర్తిస్తే మధ్యలోనే వెనక్కి రమ్మని పిలవనూలేరు ఆ హక్కు నియోజకవర్గాల ప్రజలకూ లేదు! ఇలాంటి పనేదో నైజీరియా (ఆఫ్రికా)లో జరిగినట్టుంది వోటరు వాణి మూగబోయినప్పుడు ఫన్‌సలో అయోజీనా అనే కవి "మరవకండి! మరకవండి" అన్న కవితలో ప్రజలనుద్దేశించి కొత్త పల్లవి పెట్టాడు! తన దేశ ప్రతినిధుల్ని అతను ఇలా శరించాడు "ఎన్నికైన సభ్యులు ఎన్నుకున్న వోటర్లకు విడాకులిచ్చారు!/ తమ కుటుంబాల భోషాణాలు నింపేందుకు కొల్లగొట్టిన ఖజానాలను భర్తీ చేసేందుకు బందిపోటులై/చందాలిస్తారా చస్తారా అని గద్దిస్తున్నారు/ప్రజలిచ్చిన అధికారం కాస్తా ఆ ప్రజల ఉనికికే ఎసరుపెట్టింది" *["Men of parliament vacationed the electorate/and power dissolved the people .. "]* అయినా తమ ప్రతినిధులతో వోటరుకూ, వోటరుతో ప్రతినిధులకూ మధ్య చెరవరాని బంధం ఏదో ఉండనే ఉంటుంది! వోటరు తెంచుకోవాలనుకున్నా అభ్యర్థి ఒక పట్టాన వదలడు!! భాషలు మారుతాయి, భూషలూ మారుతాయి, భంగులు మారుతాయి, భంగిమలూ మారతాయి! 'దిష్టి' తీసుకొని మరీ వోటుముష్టికి బయలుదేరతాడు వెనకటికి రాజును ప్రసన్నం చేసుకొనేందుకు డొక్కసుద్ధి ఉన్నవాళ్ళు 'అర్జీ' పద్యాలు రాసుకొనేవాళ్ళట "మీకు దయరాదు, మునుపటి మిసిమిలేదు" అని ఆడిదం సూరకవి లాంటివాడు పడిగాపులు పడ్డాడు! ఈ విషయంలో తిరుపతి వేంకట కవులు కూడా తక్కువ తినలేదు! ఆ అవసరం అలాంటిది యుద్ధం చేయలేము, వ్యవసాయం చేయలేము, సంతలో సరుకులు కూడా అమ్ముకురాలేము, ఎందుకూ పనికిరాము కాబట్టి "ముష్టి చెంబొకటి కొనిపెట్ట"మని ఓ గజపతిరాజుని పరిహాసంగానైనా ప్రాధేయపడవలసి వచ్చింది!! ముష్టిలో మళ్ళీ వీరముష్టి! ఇక వోటరు దగ్గరకొచ్చే సరికి అభ్యర్థులను ఆ 'ముష్టి' కాస్తా - ఎన్నడూ లేని నమ్రతగా, ఎక్కడలేని వినయంతో, సౌశీల్యంతో, ముకుళితకమైన హస్త

ముద్రలుగా ముమ్మరిస్తుంది! "ఓటు కన్యతో సంవాదం" ఇవాల్టిది కాదు ఎన్నికల సమయంలో పాటలూ, నాటికలూ ఇప్పటివి కావు తెలుగుదేశంలో ఎన్నికల ప్రచార కవితలకు పునాది బహుశా 1937లో 'జస్టిస్ పార్టీ' వారే వేసి ఉండాలి కొంత మోటుగా సాగినా "ఓటు కన్యతో సంవాదం"లో ఓ జమిందారు "నన్ను పెండ్లాడవే భామా/ నా వంక చూడవే భామా/ మా తాత తండ్రులు ఓ భామా/ మహిని శూరులే భామా/ చెర్వులు తవ్విరే ఓ భామా/ వారు కాల్వలు తవ్విరే భామా" అంటూ జాతీయ కాంగ్రెస్‌కు పోటీగా బయలుదేరి "ఓటు ముష్టి" ఎత్తారు! కాని "ఓటు కన్య" ఏం సమాధానమిచ్చింది "నీ పొత్తు నా కేల పుల్లన్న/ నీ సొత్తు నాకేల పుల్లన్న/ మీ తాత మా కొద్దు పుల్లన్న/ నీ చేత చూపించుకో పుల్లన్న/ చెర్వులు, కాల్వలు నీవు చెరపకుండిన చాలు పుల్లన్న/ పలికి బొంకుటలోన/మీసాటి వారెవరయ్య పుల్లన్నా"!! అలాగే "జమీన్ రైతు" స్థాపకుడు వెంకట్రామా నాయుడు ఎలెక్షన్ రోజుల్లో "విశ్వదాభిరామ వినురవేమ" మకుటంతో కొన్ని ఆటవెలదులు రాశారు స్వతంత్ర అభ్యర్థులపై ఓ విసుర్లు విసురుతూ వీరికి "పార్టీ లేదు, నియమ పద్ధతి లేదు/ పెద్దవాడు దాన్కి - పిన్న లేదు/ ఇంది పెండెండం/యతిమతం అన్నట్టు విశ్వదాభిరామ వినురవేమ"/ "విందులిచ్చి మెప్పు పొందవచ్చు/ ఓటు నివ్వరాదు, చేటును తెచ్చురా" అని ముక్తాయింపులు విసిరాడు కవి!

అలాగే 1960లో, 1972లో, ఆ తరువాత కమ్యూనిస్టుల ఎన్నికల ప్రచార కవితలు వెలువడ్డాయి. వీటి విలువ తాత్కాలికమే అయినా వోటరుపై చెరగరాని ముద్రలు వేస్తాయి: "మావూరి చైరుమానూ/మీ వూరి పైలుమానూ/ మనవాడ రోడ్డు తవ్వి/ తనదొడ్డి నింపిరోరి/ మావూరు ఖద్దరోడు/మీ వూరు మిద్దెలోడు/ఇద్దరును గుద్దులాడి/బస్‌రూట్లు పట్టిరోరి"! ఇలా ఎన్నికల్లో పాల్గొనే రాజకీయ పక్షాలు తమకు నచ్చిన నినాదాలతో, వోటర్లు మెచ్చిన పాటలతో ప్రచార రథాలు కదిలిస్తూంటారు 1983 ఎన్నికల్లో ఎన్టీఆర్ ఆంధ్రాభిమానం పేరుతో ప్రారంభించిన ప్రచారోద్యమానికి ఊపిరిపోసిన "చేయెత్తి జైకొట్టు తెలుగోడా" పాటను కమ్యూనిస్టులనుంచి కాపీకొడితే, ఈసారి కొందరు కాంగ్రెస్‌వారు, అజ్ఞాతవాసంలో ఉన్న గద్దర్ పాటలను కాపీ కొట్టారు! కాగా ఎన్టీఆర్ ప్రవేశపెట్టిన క్యాసెట్ సంస్కృతిని అన్ని పార్టీలూ పులుముకుంటున్నాయి!

ఎన్నికల పాటలకూ, నినాదాలకూ విలువెంత, అని ప్రశ్నించే వారికి ఓ కవి సమాధానం "రాయి-రాయి రాసుకుంటే నిప్పు రవ్వ పుడుతుంది/ వర్గాలు సంఘర్షిస్తున్న చోట నినాదం రగులుతుంది/ నిజమూ నెత్తురూ రాసుకున్న చోట నినాదం అగ్నిపర్వతమై పేలుతుంది"/. ఈ ప్రచార కవితలకు కూడా నిబంధన కంటే స్పందన ప్రధానం స్పందన ముఖ్యమని ఎందుకు చెప్పాల్సి వస్తోందంటే అందరూ ఎన్నికల సభలను గురించి తలపోస్తున్న వేళ ఓ యువకవి దృష్టిలో బహిరంగ సభకూ, నినాదానికీ అర్థమే మారిపోయింది "ఆకలి అధ్యక్షతన/ ఖాళీ కడుపే ఒక బహిరంగ సభ/ నినదించే పేగులే జనం" అంటాడు! అలాగే "ఓట్లు నోట్లు ఓటివాగుడుకు/అమ్ముడైపోతుంటే/ ఔట్లు ఎన్ని పేలిస్తే ఏం ప్రయోజనం?" అని ప్రశ్నించే మరో కవి దృష్టిలో "వాగ్దానాల ఎండమావులను/ కురిపించే నాయకులకు/ప్రతిరోజు ఏప్రిల్ ఫస్టే!/ వాటితో దాహం తీర్చుకోవాలనుకొనే/ ప్రజలెప్పుడూ ఫూల్సే"!! తేనె పూసిన కత్తులంటే ఇవే! అందమైన గులాబీ కత్తికన్నా పదునయిందట! ఈ మాటలు విన్నప్పుడు ఆధునిక బ్రిటిష్ కవయిత్రి చార్లెటీ మ్యూ వాక్యాలు గుర్తుకొస్తాయి ఒక్కొక్కప్పుడు *"A rose can stab you accross the street, /Deeper than any knife"*!! రకరకాల భంగిమలలో నాయకుల కటౌట్లు

ప్రచార రధాలను అలంకరిస్తున్న సెట్లూ, క్యాసెట్లూ ఇప్పటికే వోటరు మనసును కొండంత ఉత్సాహం మధ్యనే తికమకపెడుతున్న సమయంలో - నవంబర్ 20వ తేదీ వరకు ప్రశాంతంగా ఆలోచించుకోడానికి అతనికి వీలుండదు! ఈ పరిస్థితుల్లో ఆవేదనా భరితుడైన మరో యువకవి చేస్తున్న 'గీతా' బోధ కూడా శ్రద్ధతో గమనించగల ఓపిక ఓటరుకు ఉంటుందని మనం ఆశించలేము "వరుసగా ఎవరెవరు ముఖ్యమంత్రులైనా/ఇరవైనాలుగ్గంటల కుట్ర ఇంకొకణ్ణి ప్రమాణ స్వీకారం చేయించినా/ అక్షరాలా అరాచకంలో మార్పుండదు/ గాంధీ చచ్చిపోయినా బోసి నవ్వు కురిపిస్తూనే ఉంటాడు / గులాబీలతో నెహ్రూ పరిమిళిస్తూనే ఉంటాడు/ ప్రజాస్వామ్యం మాత్రం ప్రతి రోజూ/నెత్తురోడుతున్న దృశ్యాలతోనే ప్రత్యక్షమౌతుంది/పట్టపగలు ఈ దేశాన్ని/ బౌద్ధస్తూపం కింద హత్య చేసినా/ ప్రశ్నించే దిక్కులేదు"!!

ఆదివారం, 12 నవంబర్ 1989

## పైథాగరస్ కావాలా ? పైసాకావాలా ?"

"నాటి తెలుగువారి మేటి జాతీయత / నాటి విజయనగర నగర భూతి / తలచుకొన్న మేను పులకించి పొంగారు" అన్నాడు జాషువా ఈ ఆనందం, ఈ అనుభూతి రెండు రకాలుగా ప్రాప్తిస్తుంది: (అ) తన కాలం నాటిది కాకపోయినా పురాచరిత్రలకు సంబంధించిన చరిత్రనూ, సాహిత్యాన్ని చదువుకోవడం వల్లా, (ఆ) ప్రాచీన కట్టడాలను పురావస్తు శాలలనూ కళ్ళారా దర్శించి, ఆనాటి పురా గాథలనూ, జీవన సరళినీ వెలికితేవడానికి మనిషి లోక సంచారి కావడంవల్లా కనుకనే, లోకోత్తర ఖ్యాతి పొందిన సుప్రసిద్ధ లోక సంచారి పండిత రాహుల్జీ తరచుగా తన గురువైన "కపోతరాజు" సందేశాన్ని మననం చేసుకుంటూ ఉండేవాడు: "ఓ ప్రమత్తుడా! ప్రపంచంలో పర్యటించు, ఈ జీవితం ఇక ఉండదు! ఒకవేళ జీవితం ఉన్నా యవ్వనం ఉండదు" అన్నాడు! నిజానికి ఈ యాత్రా సాహిత్యం లేదా, లోక సంచారం పాశ్చాత్యులకు ఒంటబట్టినంతగా భారతీయులకు పట్టలేదు అయితే ఇప్పుడిప్పుడే ఈ సాహిత్యం విస్తృతమవుతోంది యాత్రా సాహిత్యాభివృద్ధిలో ఈ "నత్తనడక"కు ఒక ప్రధాన కారణం-- ఆర్థికం, ప్రోత్సాహం లేకపోవడము అయినా రాహుల్జీ లాంటివాళ్ళు బికారులయినా సరే బీద అరుపులు అరవకుండా లోకయాత్రలు చేశారు ఇంట్లో డబ్బులు దొంగిలించి మరీ తమ అనుభవాలను విజ్ఞాన ఖనిగా తన తరంవారికీ, ముందు తరాలవారికీ అందించి వెళ్ళారు! పరిస్థితులు తారుమారై ఇప్పుడు 'ఆర్థికం' కారణమయింది గాని ప్రాచీన భారతంలో దేశాటనకు ఎంతో విలువ ఉంది బౌద్ధ, జైన మతాల వ్యాప్తికి తీర్థంకరుల లోకసంచారమే కారణం భవభూతి, కాళిదాసుల అనుభవమూ అదే సాంకృత్యాయన్ చెప్పినట్టు శంకరుణ్ణి శంకరుడిగా నిలబెట్టి అతను చెప్పిన 'బ్రహ్మానాదం' కాదు, ఈ సంచార స్వభావమే! ఎంతకూ తరగనిది ఈ సంచార ప్రవృత్తి ! హిమాలయాలకు వెళ్ళిన వారిద్వారా మనకు అందే ఫోటోలు ఎన్ని చూచినా, సౌందర్యాన్ని మరొకరెవరో ఎంతగా వర్ణించి చెప్పినా-- స్వీయానుభూతి లోకసంచారి కానివాడికి రాదు కాని లోకసంచారి సృజించిన సాహిత్యం చదవడంవల్ల ఎవరికివారికి తానూ లోకసంచారి కావాలన్న "ప్రేరణ" కలుగుతుంది ఈ సాహిత్యానికి మన దేశంలో ఎక్కువ ప్రాచుర్యం ఇంతకుముందు లభించకపోవడానికి కారణం, దానిచుట్టూ జనంలో అల్లుకున్న ఒక అపప్రధ అదే-- యాత్రా సాహిత్యం కేవలం "ట్రావెల్ గైడ్" అన్న భావన! ఇది తప్పని "లోక సంచారి" గ్రంథంద్వారా రాహుల్జీ, నిరూపించాడు, కాశీలో కూచుని మండూకాలుగా వ్యవహరించిన పండితులతో వాగ్వివాదాలు చేసి భారతదేశ పర్యటనద్వారా లోకసంచార తత్వాన్ని పెంచి పోషించి, తన "సత్యార్థ ప్రకాశం" ద్వారా లోకానికి వెలుగులు పంచిన స్వామి దయానంద సరస్వతీ నిరూపించారు కొలంబస్ లేకపోతే అమెరికా డిస్కవరీ మనకు వెంటనే తెలిసేది కాదు, వాస్కోడిగామా ఇండియా పర్యటన లేకపోతే 'గుడ్‌హోప్' ఉండేది కాని మనస్సులు గజిబిజిగా ఉండేవి! ఫాహియాన్, హుయాన్‌సాంగ్‌ల జీవనస్మృతులు ఇండియా--చైనాల సాంస్కృతిక బంధాలను పటిష్టం చేశాయి, ఫెరిస్తా, న్యూయెజ్‌లు దక్షిణ భారతంలో కాలుమోపకపోతే విజయనగర సామ్రాజ్య వైభవ ప్రాభవాలు మనకు విస్మృత ఘట్టాలుగానే మిగిలిపోయేవి, శ్రీనాథుడు లోకసంచారిగా రంగ ప్రవేశం చేయబట్టే-- పల్నాటి సీమలో పల్లెపట్టుల కడగండ్లు మన కళ్ళకు కట్టినట్టు చూపాడు!

అంతేగాదు, పాశ్చాత్య సాహిత్య ప్రభాకరులలో ఒకరైన బైరన్ మహాకవికీ, మన

శ్రీనాథుడికీ ఏదో 'భావ సంబంధం', లేదా బాదరాయణ సంబంధం ఉండి ఉండాలి! ఎందుకంటే తన మనస్సును తేటగా, నవంనవంగా ఉంచుకోవడానికి బైరన్ మూడు వ్యసనాలకు అలనాటు పడ్డాడట జూదం, పోరాటం, లేదా లోకసంచారం మన శ్రీనాథుడు కూడా క్రీడాభిరామంలో జూదక్రియను "పామరులై పన్నిదమాడి (జూదమాడి) యోడి మరి / దుర్మానంబుతో నాటగొల్పిరి" అని వర్ణించాడు! లోకసంచారికి నాటి సాంఘిక జీవనం, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, వాటిని ప్రజలు పాటిస్తున్న తీరూ, మరింత ప్రగతి కోసం ప్రతిఘటిస్తున్న తీరూ పరిశీలనాంశా లవుతాయి ఉదాహరణకు పదిలక్షలకుపైగా రకరకాలు జీవులున్న ఈ భూలోకంలో "ప్రమైట్స్" దశనుంచి నేటి జ్ఞాన దశకు ఎదిగివచ్చిన మానవుడు ఏ మహోన్నత శిఖరాలను, ఏ దూర తీరాలను అధిరోహించాడో, చేరుకున్నాడో తెలియజెప్పడానికి సుప్రసిద్ధ రష్యన్ ఇంజనీర్లు ఇలిన్, సెగెల్ రాసిన "మానవ విజయం" *(How man became a Gaint)* జిజ్ఞాసువులకు ఉపకరించే గ్రంధం. ఆజన్మ లోకసంచారి రాహుల్జీ కూడా దేశ, విదేశాటన ఫలితంగా శతాధిక గ్రంధాలద్వారా అనుభవ సాగరాన్ని ఆవిష్కరించి పోయాడు డార్విన్ లోక సంచారి కాకపోతే ఆధునిక విజ్ఞాన శాస్త్రం "పరిణామవాదా"నికి ప్రభాత గీతం పాడి ఉండేది కాదు! అలాగే సాంకృత్యాయన్ లోక సంచారంలో పురాతన భారతీయ సంస్కృతిని శాస్త్రబద్ధంగా అద్దమెత్తి చూపుతున్న టిబెటిన్ మూలగ్రంధాలు మనకి దొరికేవి కావు! అంతేగాదు, ప్రాచీన భారతంలో ప్రవర్ధిల్లిన నీతులు, ధర్మాలు, శృంగారం - ఓ పెద్ద ఆసక్తికరమైన కలగూరగంపగా, పురాణగాథా కోశంగా వెలువడిన "కాశీ మజిలీ కథలు", మణిసిద్ధుని కథనుంచి మణిమంజరి గాథ వరకూ పెనవేసుకున్న వీరగాథాలహరి "కాటమరాజు కథలు" - లోక సంచారం వల్లనే సాధ్యమవుతాయి కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపూ, దక్షిణాది ఆవుల మేపూ లోకోత్తర గాథల సంపుటీకరణమే! మానవ జీవన వికాసాన్ని 7500 సంవత్సరాల చరిత్రలో, 14 భాషలలో అక్షర చిత్రంగా మలచిన "ఓల్గా - సే - గంగా" కాంగ్రెస్ నాయకుడు, అల్లూరి సత్యనారాయణ రాజు అనువాదంలో " ఈ సమాజాన్ని మార్చగల దిట్టలు యువకులే"నని ప్రబోధించిన ఉత్తమోత్తమ విజ్ఞాన గ్రంథం- లోక సంచారి లోకాలోకనం! ఆమాటకొస్తే, మల్లంపల్లి సోమశేఖర శర్మ 'కాళ్ళకు బలపాలు కట్టుకుని' తిరగకపోతే రెడ్డి రాజ్య ప్రాభవ చరిత్ర మనకు మరో విస్మృత ఘట్టంగానే ఉండిపోయేది! తెలుగుదేశానికి సంబంధించినంత వరకు లోకసంచార సాహిత్యం వేళ్ళమీద లెక్కించదగినదిగానే ఉన్నా 19వ శతాబ్దంలో ఇందుకు శ్రీకారం చుట్టిన గ్రంథం - [illegible]గుల వీరస్వామి "కాశీయాత్ర" అప్పటికే శ్రీనాధుడు అయిదు శతాబ్దాలనాడు "కాశికావీరేసు కలిసె వీరారెడ్డి" అని తలపోసుకున్నాడు! విశ్వనాధవారి "ఆంధ్రప్రశస్తి", కొడాలి సుబ్బారావు "హంపీయాత్ర" తిరుపతి కవుల "నానా రాజసందర్శనం", చాటువులు కూడా లోకసంచార అనుభవ సాహిత్యంగానే పరిగణించవచ్చు అలాగే, 1970-75 మధ్య ప్రభుత్వ దమనకాండకు గురయిన ప్రజల కన్నీటి గాథల కదంబం మేరీ టేలర్ రాసిన "భారతదేశంలో నా జైలు జీవితం", జ్ఞాపకాల సారాంశం అనేక అనుభవాల పొందిక

ఇదిలావుండగా, ఇటీవలనే నాయని కృష్ణకుమారి "కాశ్మీర దీపకళిక", సినారె రష్యా అనుభవాలు, భరద్వాజ "ఇనుపతెర వెనుక", దాశరధి యాత్రా విశేషాలూ - సంచార సాహిత్యంగా వెలువడ్డాయి పాశ్చాత్యుల్లో తామరతంపరగా యాత్రాసాహిత్యాన్ని సృష్టించిన వారిలో అల్-బిరూనితో పోల్చదగిన వ్యక్తి బోయార్డ్ టేలర్. పైగా ఇతను ఇండియా

సందర్శించిన తొలి అమెరికన్ పాత్రికేయునిగా "ఎ విజిట్ టు ఇండియా, చైనా, జపాన్ ఇన్ ది ఇయర్ 1853" అన్న గొప్ప పుస్తకం రాశాడు ఇది 16 ఎడిషన్లు అందుకుంది పైగా తనకు ముందువచ్చిన రచయితల పుస్తకాలతో బేరీజు వేసుకున్నప్పటికీ అల్-బిరూనీ పుస్తకాన్ని టేలర్ ప్రస్తావించలేకపోయాడు! ఇంగ్లాండ్‌లో బెర్నార్డ్ లెవిన్, ఇండియాలో అనీస్ జంగ్ అపారంగా ఈ సాహిత్య సృష్టికి తోడ్పడుతున్నారు బెర్నార్డ్ లెవిన్ యూరప్ సంగీతోత్సవాలకు సాధికార 'లోకసంచారి' కాగా, ఒకనాడు ఖండఖండాలలోని, రాజకీయ సామాజిక పరిణామాలకు ప్రత్యక్ష సాక్షిగా "ఇన్‌సైడ్స్" గ్రంధమాలను దిద్ది తీర్చినవాడు జాన్‌గంథర్ యూక్లిడ్ ఒకనాడు లెక్కలు వేసుకుంటూ, ఓ బానిసను "నీకు విజ్ఞానం కావాలా, పైసా కావాలా" అని ప్రశ్నించాడట: "నాకు కాసే" కావాలన్నాడు బానిస "ఓహో! ఇతడు జ్ఞానాన్ని పైసకు తార్చుతున్నాడు", పైసా పరమాత్ములు వద్దనుకొని యూక్లిడ్ "రేఖాగణితం కావాలి, మానవ పురోగతిలో అదొక సోపానం, కావలసింది పైథాగరస్ సూత్రంగానీ, పైసా కాదు" అన్నాడు *(A diagram and a step, not a diagram and a penny")!*

సెప్టెంబర్ 3, 1989

# ఈ ఆర్య వంగడం....!

రెండు రకాల సంస్కృతులు ఘర్షిస్తున్న వేళ - ప్రజలకు కష్టాలు, కన్నీళ్ళూ తప్పవని హెర్మెన్ హెసీ అన్నాడు *[When two cultures collide is the only time when true suffering exists]*[1] భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించలేని, ఊహించలేని మూఢమతులు మన దేశంలో తలెత్తినందువల్లనే భిన్న జాతులతో, భిన్న మతాలతో బహుళ సంస్కృతీ నిలయంగా దీపిస్తున్న ఈ భారతదేశ ఉమ్మడి వారసత్వాన్ని నాశనం చేయడానికి నడుం కట్టారు ఆ సంకుచిత ధోరణికి పరాకాష్టే - మొత్తం భారత ఉపఖండంలోనే బహుళ కళా సంస్కృతీ కేంద్రంగా భోపాల్‌లో అవతరించి గత ఎనిమిదేళ్ళుగా వర్ధిల్లుతూవచ్చి, గత ఎనిమిది మాసాలుగా అల్లరిపాలవుతున్న సర్వోత్కృష్ట సదనం - "భారత భవన్" నిర్వహణ వివాదాస్పదం కావడం ప్రజా కళలకు, ఆధునిక కావ్య, చిత్ర, రంగస్థల కళలకు నిలయంగా ఉంటున్న ఈ భారతీయ సంస్థను రాజకీయాలకు దూరంగా, స్వపరిపాలనా సంస్థగా పెంచి పోషించాలన్నది భవన్ తొలి ఆదర్శాలలో ఒకటి కాని రాజకీయాలు కళాసంస్కృతులను మింగేస్తున్నాయి దాని అర్థం - రాజకీయంలేని కళనూ, కళంకంలేని రాజకీయాలనూ త్యజించాలని కాదు సమపాళ్ళలో ఈ రెండూ సాగాలనే ప్రజల ఉద్దేశం, కాని గత ఎనిమిదేళ్ళుగా భవన్ తన సృజనమందిరాలుగా దిద్దితీర్చిన రంగమండల్, రూపాంకర్, వాగర్థ, అన్హద్‌లు సాధించిన విజయాలను వమ్ముచేసే ప్రయత్నాలు జరగడం విచారకరం ఈ భవన్‌ను "ట్రస్టీ"ల పేరిట ఒకప్పుడు మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి అర్జున్‌సింగ్ కాంగ్రెస్-ఐ రాజకీయ ప్రయోజనాలకోసం వినియోగించు కోదలచితే, నేడు బిజెపి ముఖ్యమంత్రి సుందర్‌లాల్ పట్వా తిరిగి అదే "ట్రస్ట్" ల పేరిట "హిందూత్వ" మౌఢ్యాన్ని నూరిపోసే కళాకేంద్రంగా బిజెపి - ఆర్ఎస్ ఎస్‌లు "మనోవికాస" సదనంగా వాడుకోదలిచాయి కనుకనే ఇప్పుడు ఏది "సంస్కృతి", ఏది "హిందూత్వం" అన్న ప్రశ్న మరొకసారి చర్చనీయాంశం అవుతోంది సంస్కరణ ప్రియంకానిదీ, మార్పును వ్యతిరేకించేదీ, మంచి పరిణామాన్ని ప్రతిఘటించేదీ, ఆధునిక భావజాలానికి అడ్డుకట్టలువేసేదీ, నూత్న ప్రయోగాలను ఒల్లనిదీ సంస్కృతి కాదు, కాజాలదు మధ్యప్రదేశ్‌లో బిజెపి అధికారానికి వచ్చిన తరువాత భారత భవన్ భిన్న సంస్కృతీ వారసత్వానికి చేటు మూడింది 'అయోధ్య' లో రేపిన మందిర -మసీదు తగాదాకు, ఇటు భోపాల్‌లో భారత భవన్‌కు తలపెట్టిన మౌలికమైన నిర్మాణమార్పులకూ, ప్రకటించిన ఉద్దేశాలకూ వ్యత్యాసాలకంటే సామీప్యమే ఎక్కువ! రెండు చోట్ల బిజెపి-ఆర్ఎస్ఎస్ కంబైన్ అనుసరిస్తున్న విధానం, చేస్తున్న ప్రచారం, చెబుతున్న మాటలు, ప్రకటిస్తున్న బుద్ధులూ, విధ్వంసనా సంస్కృతికి ఆనవాళ్ళు మాత్రమే అరవైఏళ్ళనాడు జర్మనీలో యూదు వ్యతిరేక ఉన్మాదంలో నాజీ హిట్లర్ కళా సంస్కృతీ రంగాలలో ఉమ్మడి వారసత్వం పై తలపెట్టిన విధ్వంసనకు, ఆధునిక కళావైభావానికి వ్యతిరేకంగా తలపెట్టిన విధ్వంసనో ద్యమానికీ ఇండియాలో నేడు "హిందూత్వం" పేరిట కొందరు తలపెడుతున్న ఉన్మాదపు చర్యలకూ తేడాలేదు అర్జున్‌సింగ్ హయాంలో భారతభవన్ ట్రస్టీల ఆధ్వర్యంలో ఉండడమేగాక, అర్జున్‌సింగ్ అధ్యక్షతన అర్జున్ సహా ముగ్గురు వ్యక్తులు (మిగతావారు పూపుల్ జయకర్, అశోక్ వాజ్‌పేయ్) శాశ్వత ట్రస్టీలుగానూ నమోదు చేసుకోవడమే ప్రజాస్వామ్య విరుద్ధచర్య సమాధులనుంచి కూడా పరిపాలన సాగించడానికి ఉత్సాహపడేవారు మాత్రమే లైఫ్ ట్రస్టీలుగా కూడా చెలామణి కావాలని కోరుకుంటారు! కాని బిజెపి ముఖ్యమంత్రి

పట్వా - భవన్ నిర్మాణంలో పెనుమార్పులు తలపెడుతూ తెచ్చిన చట్టం (1990) ప్రకారం జరిగిన ఒక్క మంచి పనిని మనం ప్రశంసించకుండా ఉండలేము భవన్‌పై శాశ్వత జిరాయతే హక్కును కల్పించే "శాశ్వత ట్రస్టీల" వ్యవస్థను పట్వా రద్దుచేశాడు కాని, ఈ ఒక్కచర్య మినహా అయన చేస్తున్న మిగతా పనులూ, ప్రకటనలూ సర్వమత సమ్మేళనానికి, సహజీవన సంస్కృతికి ప్రతీకగా పేరుమోసిన నిజమైన హైందవ (ఇది మతంకాదు, జీవనసరళి, కలివిడి సంస్కృతి) ధర్మాలకూ బద్ధవిరుద్ధమైనవీ, కేవలం పురోహిత వర్గ ప్రయోజనాల కోసం ఉద్దేశించినవీ! నిజానికి "భారత భవన్" స్వయం ప్రతిపత్తిగల సంస్థ అని ప్రకటించారు, రాజకీయాలకు దూరంగా ఉంటుందని ఆదర్శం చెప్పారు కాబట్టే - భిన్నమతాలకు, కళా, సాహిత్య రంగాలలో విభిన్న ధోరణులకు ప్రాతినిధ్యం వహించే సుప్రసిద్ధులెందరో సభ్యులుగా చేరవలసివచ్చింది కాని బిజెపి ముఖ్యమంత్రి ఆధునిక కళా రూపాలను ఎత్తివేయాలనీ, "దేవునిలో ఐక్యం కావడా"నికి (మోక్షసాధన) తోడ్పడగల "ప్రాచీన నాగరికతకు" ప్రతిబింబంగా మాత్రమే భవన్ కళా ప్రదర్శనలు, "వాగర్థ" ఉండాలనీ నిర్ణయించడంతో భారత ప్రసిద్ధ చిత్రకారులు, రచయితలు, కళాకారులయిన స్వామినాథన్, ఎమ్ ఎఫ్ హుస్సేన్, మంజిత్ బావా, నిర్మల్ వర్మ, శ్రీమతి వర్మ, శ్రీమతి విభామిశ్రా, పూపుల్ జయకర్, కుమార గంధర్వ, బిర్జూ మహారాజ్, హబీబ్ తన్వీర్ ప్రభృతులలో కొందరు రాజీనామాలు చేయవలసి వచ్చింది ఇంకొందరు బిజెపి ప్రభుత్వ వైఖరిని ఖండిస్తూ దేశవ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు నిర్వహించవలసి వచ్చింది! ఒక బొంబాయి వారపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో సుందర్‌లాల్ పట్వా ఈ భవన్‌ను "మా ప్రాచీన సంస్కృతీ ప్రతిబింబంగా" మాత్రమే దిద్దితీర్చడం బిజెపి కర్తవ్యంగా ప్రకటించాడు, భవన్ నాటక శిక్షణా కేంద్రం "రంగమండల్"లో జర్మన్ విప్లవ కళాకరుడైన బెర్టోల్ట్ బ్రెష్ట్ నాటకాలు ప్రదర్శించడాన్ని విమర్శించిన వాళ్ళు ఈ మూఢులే, సుప్రసిద్ధ ఆధునిక భారత కళాకారుడైన ఎమ్ ఎఫ్ హుస్సేన్ పెయింటింగ్స్‌ను భవన్ జాతీయ తీర్మానం చేసినవారూ ఈ మూఢులే! చాందసులు ఆధునిక సౌకర్యాలు అనుభవిస్తూనే వర్తమానాన్ని ద్వేషిస్తారు - వారికి యజ్ఞయాగాదులు, తాంత్రిక విద్యలపై వున్న మోజు జ్ఞాననేత్రంపై ఉండదు!

నిజానికి "భారత్ భవన్" అన్ని శాఖలూ వర్తమాన దేశ కాల పరిస్థితులను ప్రతిబింబించే అనేక నాటకాదులను ప్రదర్శించాయి, ప్రాచీన, అర్వాచీన కవితా ఝరులు "వాగర్థ"లో ప్రవహించాయి విభిన్న తెగల కళారూపాలకు ఆదర్శకేంద్రం భవన్. అయినా భిన్నత్వంలోని ఏకత్వాన్నీ కాదని, ఏకత్వంలోని భిన్నత్వాన్నీ కాదని "కుహనా హిందూత్వం" పేరిట ఏ మొగంతో ఈ దేశపు సహజీవన సంస్కృతిని ఈ చాందసులు నిర్వహించదలచారు ? బహుశా అందుకనే మహాపండితుడు రాహుల్ సాంకృత్యాయన్ వేదాలలో కూడా కలుషితం కాని ఒక్క ఆది ఋగ్వేదాన్ని మాత్రమే నమ్ముకోండి, కలుషితమైన మిగతావేదాలను పట్టించుకోకండి అని ఉంటాడు! ఎందుకని? ఋగ్వేదంలో "హిందూ" శబ్దమేలేదనీ, వేదాల్ని విశ్వసించాలని కోరేవారు ఈ సత్యాన్ని ఎందుకు దాస్తున్నారో తనకు తెలియదనీ చెప్పాడు! మధ్యాసియానుంచి ఇండియాకు వలసవచ్చిన ఆర్యుల రక్త సంబంధీకులు ఇరుగుపొరుగైన పారశీకులకు "స" పలకక, దానిని "హ"గా ఉచ్ఛరించారు కనుకనే "సప్తసింధు" (పంజాబ్) వారి ఉచ్చారణలో "హప్తహిందూ"గా మారి, దాని సంక్షిప్తరూపంగా "హిందు" మిగిలిపోయింది! ఈ చారిత్రక సత్యాలను మనలోని కొందరు మూఢులు తారుమారుచేసి, వక్రప్రచారం చేయబట్టే నేడిన్ని

సమస్యలు ఉత్పన్నమయ్యాయి! హిట్లర్ "నాజీ సంస్కృతి" *(Nazification of culture)* నిర్మాణానికి ఎలా బీజాలు వేశాడో, ఇక్కడకూడా కొందరు కుహనా హిందువాదులూ రామకృష్ణ, అరవింద, స్వామి వివేకానందలు ప్రవచించిన లౌకిక ధర్మాలను, విశ్వమానవ సిద్ధాంతాన్ని విడనాడి "ఇండియనైజేషన్" అనీ, "హిందూత్వం" అనీ భారతీయ సమష్టి సంస్కృతికి భిన్నమైన ధోరణులను ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు హిట్లర్, గోబెల్సు నాజీ సంస్కృతిని ప్రవేశపెట్టేముందు "రీచ్ చాంబర్ ఆఫ్ కల్చర్"కు పునాదులు వేసినట్టే, పట్వావర్గం భారత భవన్ నిర్మాణాన్నే తలకిందులు చేయదలచింది హిట్లర్ ఉద్దేశంలో ఆధునికమైన ప్రతి కళ, లేదా కళాఖండం, కవిత పతన సంస్కృతి కిందలెక్క *("All modern art was degenerate and senseless")!* ఈ ఉన్మాదంవల్లనే యూదు జాతీయుడైన ప్రసిద్ధ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్‌ను, బితోవెన్, మొజార్ట్‌లతో సరిసమాన ప్రతిపత్తిగల వాగ్గేయకారుడైన మెండెల్ సోన్‌నూ ఇముడ్చుకోలేక పోయాడు! అలాగే ఇక్కడ బిజెపి సంస్కృతీపరులుకూడా భారతభవన్‌కు చెందిన ప్రపంచ ప్రఖ్యాత ఆధునిక కళాకారుల్లో ఒకరైన ఎమ్ ఎఫ్ హుస్సేన్ పెయింటింగ్స్‌ను కూడా తొలగించాలని మత దురహంకారం ప్రదర్శించారు! ఈ ఉన్మాదంవల్లనే "ఆర్య"జాతి దురహంకార సిద్ధాంతంలో విశ్వాసం పెంచుకున్న హిట్లర్ మూకలు జర్మన్ ప్రసిద్ధులే అయినా - ఆధునిక కళాకారులైనందువల్ల కోకోస్చ్కా, గ్రోజ్ కళాఖండాలనే గాక, వాంగో, మెటిసే, పికాసోలాంటి ప్రపంచ ప్రసిద్ధుల పెయింటింగ్స్ మొత్తం 6500 కళాఖండాలను జర్మన్ మ్యూజియమ్స్ నుంచి తొలగించాయి! ఓహో అటూ ఇటూ కూడా "ఆర్య" వంగడం ఎంత 'గొప్ప'ది!!

జనవరి 13, 1991

# విజయ 'గీతా' రహస్యం!

సీమ దాటితేనే తెలుగువాడిపై మనం 'ప్రేమ' కురిపించేది! అంతవరకూ అతని మనస్సీమాంతరాలను మలిచేవాడూ, అందుకోసం నోరుపెట్టి అరిచేవాడూ లేడు కనుకనే సంగీత రసధునీ, వేణుగాన కళానిధీ, ఏల్చూరి విజయ రాఘవరావు కవితా శక్తి మనకంటే ముందుగా అమెరికా గుర్తించింది! ఇంతకు ముందే ఆయన తెలుగు కవితలూ, ఖండకావ్యాలూ "అంతర్వాణి", 'అభ్యుత్థానం' పేరిట వెలువడ్డాయి కాని, 'నిర్వాణ' పేరిట ఒక ఆంగ్ల కవితా సంపుటి వెలుగు చూసినా తెలుగువాళ్ళు, ఆంగ్లో-ఇండియన్ సాహిత్య సంప్రదాయానికి వారసులుగా ఎదుగుతున్న ఈ భారతీయ ఆంగ్ల విద్యాధికుల మనుకునే వాళ్ళూ దర్శించలేని కొత్తకోణాలను నోబెల్‌బహుమతి గ్రహీతలు సహా పలువురు ప్రముఖులతో కూడిన "వరల్డ్ ఆఫ్ పొయిట్రీ" సంస్థ (అమెరికా) విజయ రాఘవరావు కవితలో దర్శించింది, అతని "2001 ఎ.డి " అన్న ఆంగ్ల కవితకి 1989 స్వర్ణపతకం బహూకరించడానికి నిర్ణయించింది అన్నిటా బహునాయకత్వ లక్షణాన్ని వదులుకోలేని తెలుగువారందరూ ఆ ఉన్మాదాన్ని కాస్సేపు పక్కకు పెట్టి, అసూయా ద్వేషాలను అవతలకు నెట్టి తెలుగు వాడిది "గోల్డెన్ పోయిట్రీ" అయినందుకు మనసారా ఆనందించండి, ఆశీర్వదించండి, అభినందించండి అంతర్జాతీయ కవి సమ్మేళనంలో తెలుగు వారి ప్రతినిధిగా పాల్గొనగల హక్కు (శ్రీశ్రీ మాటల్లో) ఉన్న గురజాడను అలా ఎలాగూ నిలుపు కొనలేకపోయాం! ఆ తర్వాత శ్రీశ్రీని ఆ స్థాయిలో నిల్పి మన పెద్దరికాన్ని నిలబెట్టుకోలేకపోయాం! బెంగాలీ వాడికి తెలుగువాడికీ అదే తేడా! తనవాడిని పైకెత్తుతాడు బెంగాలివాడు, తనవాడిని పడదోస్తాడు తెలుగువాడు విశ్వకవి రవీంద్రుని తర్వాత సాహితీ రంగంలో నోబెల్ బహుమతి కాకపోయినా "గోల్డెన్ పోయెట్" గా విజయరాఘవరావు ఎంపిక కావడం మనందరికీ గర్వకారణం గీతానికీ సంగీతానికీ అంతటి అనుబంధం ఉండబట్టే నారాయణ దాసును "సంగీత్యం సాహిత్యం సరిచూసిన త్రాసు" అని శ్రీశ్రీ చేసిన వర్ణన-- పబ్లిసిటికి దూరంగా అజ్ఞాత కవిగా బొంబాయిలో ఉండిపోయిన విజయరాఘవరావుకూ వర్తిస్తుంది. ఇంతవరకూ సుప్రసిద్ధ వేణుగాన మూర్తిగా, వేణుగాన ధ్వనిముద్రికా కర్తగా, వాగ్గేయకారుడుగా, సంగీత దర్శకుడుగా,నృత్య సంగీత కళా నిర్దేశకుడుగా శ్రోతలను ఆనందపరిచిన ఆయన--అభ్యుదయ భావాలతో ఆధునికతకు హితంగా సామాన్య ప్రజలకు సన్నిహితంగా జరిగి, పనికివచ్చే కవితలు, జడత్వాన్ని చీల్చి ఆలోచింపజేసి ముందుకు నడిపించే రచనలు కూడా చేశారు కనుకనే ఆత్మవిశ్వాసంతో అతను తన కలం ఈ గుడ్డి లోకపు కళ్ళు తెరిపించేందుకు "వాణీ వేణువీణల్లో మధుర వీక్షణం చేస్తూ/విజ్ఞానం వెదజల్లుతూ/నటరాజ తాండవ విన్యాసాలతో నడిచిపోతుంది నవనవ నగోన్నతాలను దాటేసుకుంటూ" అంటాడు' అలా అతని గీతం సంగీతం సమ్మతించిన చోటల్లా *(If music and sweet poetry agree)* అనువుగాని చోట్లకూడా, జీవనసమరంలో మానవుడి పాట్లకు ఆవేదనా కలశంగా మారింది అతను సామాన్యుని బాధలకు చలించాడు, ప్రాతినిధ్యం వహించాడు, కొత్త అర్థాలు చూపాడు, కొత్త బాణీలు కట్టాడు యంత్ర నాగరికతలో, ముఖ్యంగా ఈ మరమనుషుల (రోబోట్సు) యుగంలో, ధనదాహంతో స్వార్థంకోసం మానవజీవన విలువలను నాశనం చేస్తూ పరిసరాలనూ, రోదసీని కుళ్ళబొడుస్తున్న నూతన సాంకేతిక పరిజ్ఞానం పట్ల అతను వ్యక్తం చేసే ఆవేదన -- ఆధునికతను కాలదన్నుకునే నిరాశ, నిస్పృహ మాత్రంకాదు. మనిషి అంతర్ముఖుడై తన

విలువలను తను గుర్తెరిగి, అన్ని విలువలనూ కాలరాసే యుద్ధోన్మాదానికి కాకుండా శాంతికామనకు హారతులు పట్టమన్న "విన్నపాలు" మాత్రమే అందులో కన్పిస్తాయి అలాంటి ఆవేదనలకు అర్థంపట్టి, మానవుణ్ణి కర్తవ్యానికి పురిగొల్పే రచనే "గోల్డెన్ పొయెట్రీ" అందుకోబోతున్న "2001 ఎ డి " అన్న కవిత మానవుడు చంద్రలోకాధినేత కావడానికి పదేళ్లముందు "ఎల్లుండి ఏ తమాషా జరుగుతుందో/ ఎవ్వడూ చెప్పలేడంటే నమ్మండి/చెబితే మాత్రం నమ్మకండి" అని హెచ్చరించిన మహాకవి రచన "శరచ్చంద్రిక" ఒక మహోన్నత భావనా తరంగం అలాగే విజయరాఘవరావు తన కవితలో మారణాస్త్రాలవల్ల రాగల ప్రమాదం గురించి హెచ్చరిస్తూ మానవుడు ఇంతటి వైజ్ఞానిక ప్రగతి సాధిస్తున్నప్పటికి శాంతి కొరవడడానికి, అశాంతి కొనసాగడానికి కారణాలు తెలుసుకొని యంత్రనాగరికతపై చురకలు వేశాడు లేని ఆనందం కోసం దిగాలుపడకుండా మనిషి అంతర్ముఖుడై "తత్త్వమసి" కావాలన్న తాత్త్వికార్థాన్ని అందులో విప్పిచెప్పాడు అదుపులేని భౌతికవాంఛల మధ్య, అదుపుతప్పిన ఐశ్వర్యంవల్ల అమెరికాలోని "కృష్ణచైతన్య" ఉద్యమం ఎందుకు వస్తోందో అతను తెలుసుకున్నాడు అందుకు తగిన భావోద్రేకాన్ని తన కవితలో హాస్యరసం ద్వారా అమెరికన్లలో కలిగించగలిగాడు ఆ కవులకు ఇది నచ్చడానికి కారణం--ఎలిజబెత్ జెన్నింగ్స్ చెప్పినట్టుగా ఎల్లలూ, సహాయం ఎరుగని కవుల భావాలు పరస్పరం కలవడమే విభిన్న దేశాలలోని కవులు ఒకేకాలంలో ఒకేరీతిలో స్పందించడం సహజం *(Poets work upon and through each other).* భాష, భావం సమైక్యతకు ఆనవాళ్ళు మనిషి ఉనికికే వచ్చిన ప్రమాదం గురించి హెచ్చరించిన కవి బలెన్స్ సింగర్ "18 111 X నాడి" అన్న ఓ విచిత్ర కవితలో *"I am in my survivals hands/ I am my shadows' theme Between no langauge roars and it floods to drown me in"* అన్నాడు! అలాంటి భావనా స్రవంతికి వారసుడు విజయ రాఘవరావు కూడా. ఆయన ఆంగ్లకవితకు మాతృకలు అంతకు ముందు తానే తెలుగులో రాసుకున్న రెండు ఖండికలూ (వార్తావాహిని--"2001 ఎ డీ " గప్‌షప్ః 2001 ఎ డి ") ఆంగ్ల సంకలనం "నిర్వాణ" లోని "కన్వర్సేషన్" --3000 ఎ డి " కవితా ఈ మూడు ఖండికల సమన్వయమే, వాటిలోని పిండితార్థమే విశ్వకవితా స్వర్ణపతకానికి అర్హుణ్ణి చేసిన 'విజయు' ని గీతిక! మాతృకకు అన్యాయం జరగలేదనుకుంటే--అందుకు దగ్గర అనుకరణంగా ఈ క్రింది పాదాలను తెలుగువాడు స్వీకరించుకోవచ్చు ("2001 ఎ డి "):

"నానమ్మ అందాల చందమామ దగ్గరకెళ్ళింది పిక్నిక్-నాన్నను నాకలోకంలోంచి తీసుకొచ్చింది స్పుత్నిక్-ఇంకెందుకు పుస్తకాలూ, రబ్బరు తొడుగులూ, "ఊలూ-పెట్టెలో మడిచిపెట్టండి, నా టెస్ట్‌ట్యూబ్‌బేబి మానవుని మనస్సు దురాలోచనా కేంద్రం 'మనీ' "మాయా జూదగృహం! పొలాలనిండా బాంబుల పంట! కోతకొచ్చేది పీనుగుల పెంట!"

పుట్టింటి నందనవనం కాస్తా కౌలుకిచ్చారు/ మరమనుషులైతే రతీమన్మధులవుతారు!/ సంపద కొల్లలుగావున్నా మనసులో తీరని వెలితి/ఇంతకూ ఎక్కడ దొరుకుతందా సుఖానుభూతి/ గుడికెడుతున్నా, క్రైస్తవ దేవళానికెడుతున్నా/అగోచరమైన అనంతలోకాల్లో తిరుగాడుతున్నా-పురా చరిత్రలు వెలికి తీస్తున్నా అవిశ్రాంతంగా భావిని వెంటాడుతున్నా/అయినా శాంతిలేదు, మృత్యువు వెంటాడుతోంది!/ యంత్ర భూతాల రణగొణల్లో కూరుకుపోయిన కాలం/ అపశృతులకు దూరంగా కొన్సైనా మధుర స్వరాల నాదం/భయంలేదు, గియం లేదు! చూసుకో కాసుకో నీవే నీలోనేనున్న నీలో, లోలోపల కాలోచిస్తే నీలోనాలో ---- రాఘవరావు ఆంగ్లకవితా

సంకలనం" నిర్వాణ" (NIRVAN) లోని 30 ఖండికలూ దేనికదే ప్రత్యేకం, ప్రయోజనకరం, సందేశాత్మకం అలాగే తెలుగు కవితా ఖండికలలో కూడా ఉబుసుపోని రచన కనిపించదు ప్రధానంగా హేతువాదాన్ని ఆయన ఆశ్రయించినందున "నయాగరా" కవులలో ఒకరైన తన అన్న ఎల్చూరి సుబ్రహ్మణ్యాన్ని మించిన వారసుడనిపించుకున్నాడు పేదల బాధల నివృత్తికి మందేమిటో కూడా రాఘవరావుకి తెలుసు "శివుడి మూడవ కన్ను శీఘ్రమిక తెరిచి, ప్రళయాగ్ని రగిలించగల "సత్తా ఉన్నవాడు! సర్వమానవ కళ్యాణం కోసం సమతాగానం చేశాడు, "సామ్యవాదపు సరళి ప్రజాక్షేమానికి సార్థకం" ఆయన ఏకైక పరిష్కారంగా చెప్పాడు! కొంగ జపాలపైన, దొంగ బతుకులపైన, పటాటోపాలపైన, పోచుకోలు వాగ్దానాలపైన, కపటనాటకాలపైన, కరడుగట్టిన చాందసాలపైన అత్యంత వ్యంగ్య వైభవంతో కవితా కొరడాలతో కానరాని దెబ్బలు చరిచాడు, కపటశాంతిని చెండాడాడు దేశాన్ని భక్షించి దేశద్రోహులను కవితాపరంగా తునుమాడాడు, ప్రజలగాధలను బాధలను తన స్వీయచరిత్రగానూ, "క్రాంతికారులాహుతైన క్రతువులను" దేశ చరిత్రగానూ కీర్తించాడు చివరికి చలన చిత్ర సీమల మలిన గాధల్ని తలపోసుకుంటూ చతురచతురంగా యమ దెబ్బ కొట్టాడు "కాళిదాసైనా కారల్ మార్క్సు అయినా/చిత్రసీమలో పొరపాటున స్థిరపడి ఛతకాలంటే/ కామసూత్రం పాటలతో కధరాసి తీరాల్సిందే" నట!

కవి అయినవాడు యుగయుగాల భావోద్రేకాలకు, తనకాలానికీ ప్రతిబింబం కాబట్టి తనలాగే కవీ, సంగీతవిద్వాంసుడూ అయిన థామస్ హార్డీ అన్నట్టు--విజయరాఘవరావు కూడా "ఈ ప్రపంచం మనల్ని పట్టించుకోకపోవచ్చుగాని, నిర్లక్ష్యం చేయజాలదు"అన్న ధీమాతో బతకొచ్చు! "కడలేని ఈ విజ్ఞాన గతికి" తోడెవ్వరు, నీడెవ్వరు? నీవూ,నేనూ!

జనవరి 22, 1984

# రంగారాజు లింగయ్యా! నందమూరి రామయ్యా!!

తెలుగులో తిట్టు కవిత్వాలకు అశేషమైన ఆదరణ ఉన్న రోజుల్లో ఎడవల్లి పర్వతన్న అనే ఓ కవి "అంగజ సంహారుండగు" అంటూ అయిదుచోట్ల "హ"కారం ప్రయోగించి ఓ పద్యం అల్లేసి, ఓ బంగారు కామయ్య శరీరం కాస్తా బూగిద చేసేశాడట! అలాగే ఇంకో ఏలూరి శేషమంత్రి అనే కవి అయిదుచోట్ల 'క' కారంవాడి శ్రీశైలాన్ని దోచుకుపోయిన (అ ప్రటికది 'బోఫోర్స్' అయి ఉంటుంది) తుక్కరుసు మంత్రిని కాస్తా మూడురోజుల గడువులోనే ముక్కుమూసుకుని చనిపోయేటట్టు చేశాడట! ఈ తిట్టు కవితలో 'నేను మాత్రం ఏం తక్కువ తిన్నాను' అనుకొన్న ఓ రంగరాజు లింగయ్య అనే కవి మూడింట 'క'కారం ఉంచి "జూపల్లి లింగణ్ణి" -- "నీ ఇల్లు రవికోటి ధామమగుగాక" (అంటే, ఇంటి కప్పంతాపోయి చిల్లులు పడుగాక) అనీ, నీ ఇల్లు "శివాన్వితమగుగాక" (నీ ఇంట్లో నక్కలు కాపురముండుగాక) అనీ నోరు నొక్కకుపోయేదాకా తిట్టేశాడట!

అదేదో కవిత్వం కాబట్టి, ఆ తిట్లూ, శాపనార్థాలు, కొక్కిరాయి మాటలూ ఆ నలుగురు కవులకే పరిమితమవుతాయి జరిగే నష్టం స్వల్పం, వ్యాప్తి తక్కువ! కాని అలాంటి భాష, ఇంకా అంతకన్న అధమస్థాయి పదాలు, శతృత్వాన్ని పెంచి ఘర్షణలకు దారితీసే పదప్రయోగాలు ఎన్నికల సమయంలో రాజకీయ వేత్తలు సభాముఖంగా వాడడం అభ్యంతరకరంగా భావించాలి ఇంతవరకూ ఈ రాష్ట్రంలో సమయా సమయాలతో కూడా నిమిత్తం లేకుండా, ముఖ్యంగా ఎన్నికల సమయంలో 'బజారుభాష'కు దిగి రాజకీయాలను కలుషితం చేసిన వారు ఇద్దరు ఒకరు వెంగళరావు, వేరొకరు ఎన్ టి రామారావు. 'తంతే గారెలబుట్టలో పడతాడన్న'ది మనకో సామెత ముఖ్యమంత్రిని 'ఇక్కడ తంతే మద్రాసులో వెళ్ళిపడతాడన్నది' వెంగళరావు వాచకం! పాలకపక్షం ముఖ్యులూ, ప్రతిపక్షం ప్రముఖులూ పరస్పరం ద్రోహులనీ, దేశద్రోహులనీ నిందించుకొంటూ కాలక్షేపం చేస్తున్నారు! పోనీ అంతవరకూ సరిపెట్టుకుందామా అనుకుంటే, ఈలోగా ఎన్ టి ఆర్. ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవంనాడు కూడా అవతరణోత్సవ వేదికను దుర్వినియోగపరిచి కాంగ్రెస్ నాయకులను 'ఎలుకలు, కుక్కలు, పందికొక్కులు' అంటూ పరోక్షంగానైనా సరే పరుషమైన పదజాలంతో దూషించారు ఇది 1983 నుంచీ వస్తున్న సంప్రదాయం! సహనం కోల్పోయిన వారి ఆఖరి తురుపు కోపతాపాలూ, పరుష వాక్యాలూనంటారు బాధ్యతగల నాయకులు విధానాలు మరచి వికటమైన ప్రకటనలకు దిగజారకూడదు ఒకవైపున మాజీ కేంద్రమంత్రి, కాకలు తీరిన రాజకీయ వేత్త అయిన సి సుబ్రహ్మణ్యం, ఇంకొకవైపున జస్టిస్ కృష్ణయ్యార్, ఎయిర్‌మార్షల్ అర్జున్‌సింగ్, జస్టిస్ రాజేంద్ర సచార్, అగ్నివేష్, శ్రీ లతా స్వామినాథన్, నిఖిల్ చక్రవర్తి-- రెండు వేర్వేరు వేదికలు ఆధారంగా (మచ్చలేని పబ్లిక్ జీవితంకోసం ఏర్పడిన "పీపుల్స్ మూవ్‌మెంట్", ఎన్నికలను నిష్పాక్షికంగా పరిశీలించేందుకు ఏర్పడిన "ఇండిపెండెంట్ ఇనిషియేటివ్" సంస్థలు) శతృత్వాన్ని పెంచే చర్యలను, పరుష పదజాలాన్ని నిరసిస్తున్న సమయంలో మళ్ళీ ఈరకమైన తిట్ల రాజకీయం గర్హనీయం ఇప్పటికే, అభ్యర్థుల ఎంపికలో గందరగోళం ఫలితంగా కాంగ్రెస్(ఐ), తెలుగుదేశం నాయకుల నివాసాలవద్ద ధర్నాలూ, తిట్లూ సాగుతున్నాయి నాయకత్వం నిర్ణయించిన జాబితాలకు క్రమశిక్షణతో కట్టుబడి ఉండే వారి సంఖ్య తరిగిపోతోంది ఉభయ పక్షాల నాయకత్వాలు, మహిళలకూ, యువకులకూ 30

శాతం ప్రాతినిధ్యం ఇస్తామన్న హామీలు 'కబుర్ల కార్ఖానా'గా మారినందున--యువకుల్లో అసహనం ప్రబలింది గుంటూరులో ఎన్ జీ రంగా ఇంటిపైన సొంతపార్టీకి చెందినవారే దొమ్మీగా వచ్చి, గాంధీ--నెహ్రూ తరం వాడైన ఆ వృద్ధనాయకుణ్ణి దుర్భాషలాడడం ధన రాజకీయాలకు, పతనమవుతున్న మన రాజకీయ సంస్కృతికీ ఒక ఉదాహరణ అలాగే 'దేశం వారీ మధ్య భువనగిరిలో 'చెప్పుల' ప్రహసనమూ! ఈ పనులకు దిగుతున్నవారికి రాజకీయంకంటే రౌడీయిజం ప్రధానంగా కనిపిస్తోంది

వ్యక్తి సంస్కారాన్నిబట్టి, అనుసరించే రాజకీయం మంచి చెడులనుబట్టీ పదాలూ, వాటి ప్రయోగమూ వాడకంలోకి వస్తాయి! తిట్టు రాజకీయాలకు బ్రిటన్ కూడా అంతో ఇంతో పేరుమోసి ఉంది కామన్స్ సభలోనూ, బయటాకూడా కొందరు రాజకీయవేత్తలు భాషను ఖూనీ చేస్తున్నారనీ పరుషపదజాలం ద్వారా "భాషా కాలుష్యానికి" (*Linguistic litter*) దిగజారారని చెబుతూ "భాషా కాలుష్య ప్రతిఘటనోద్య"మానికి నాయకత్వం వహిస్తున్న ప్రసిద్ధ సాహిత్య వేత్త ఇయాన్ రాబిన్‌సన్ అన్నాడు! ఎందుకంటే, బ్రిటిష్ మంత్రులలో చీటికిమాటికి అలా నోరు పారవేసుకున్న వ్యక్తిగా పేరుమోసినవాడు--సర్ కీత్ జోసఫ్ (1972-73)! ఆయని ప్రసంగాలు విన్న పీటర్ హెన్నెసీ అనే సుప్రసిద్ధ విలేకరి జోసెఫ్ పదజాలాన్ని అభ్యంతరకరంగా (*"Worst kind of exchange"* ) వర్ణించాడు ఏట్లో మునిగిపోయేవాడు 'గడ్డిపోచ'ను పట్టుకొని ఎలా బయటపడాలనుకుంటాడో వాదనాబలం నశించిన రాజకీయ వేత్తలకు, వాగ్దాన భంగాలలో ఆరితేరిన నాయకులకు ఆఖరి ఆయుధం అసహనం. దానినుంచి పుట్టుకొచ్చేది దూషణ దూషణే రాజకీయం అయితే--హిట్లర్‌కు ఎవరూ సాటిరారు! అతని మాటకారితనం కూడా అతుకుల బొంతగా, తాత్కాలిక ప్రయోజనం నెరవేర్చుకునేటట్టుగా ఉండేదట ఆకుకు అందకుండా పోకకు పొందకుండా ఉండేదట. అయినా అరచేతిలో వైకుంఠం చూపగలిగేవాడు అందుకే అతణ్ణి బాగా అధ్యయనంచేసిన జె పి స్టెర్న్ అనే రచయిత హిట్లర్ ప్రచార పద్ధతిని *"Tinkerbell ploy"* అని నామకరణం చేశాడు!! ఎందుకిలా జరుగుతోంది అంటే, రాజకీయవేత్తలు సభలో జనాన్ని చూసి తమను తాము మరిచిపోవడమేగాక తాము ఏమి మాట్లాడాలో కూడా తెలుసుకోలేనంత మైకంలో ఉంటారన్నాడు జార్జి ఆర్వెల్! ఇప్పుడుకాదు, 40 ఏళ్ళనాడే ఆర్వెల్--రాజకీయంపైన, సమస్యలపైనా పట్టులేనివాడు, దిట్టకానివాడు సమస్యలపై మాట్లాడవలసి వచ్చినపుడు ఎలా తడబడతాడో, ఇలా వర్ణించాడు: "స్పష్టత అవసరమైన చోట్ల వంకర్లు తిరిగి అస్పష్టంగా అతనిమాట మారుతుంది (*The concrete melts into the abstract*). ఒకటే రొడ్డకొట్టుడు పదాలు,కొత్తదనం ఉండదు, పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరి అన్నట్టుంటుంది, చెప్పదలచుకొన్న దానికి మాటలు అందవు; దొరికిన పదాలకు టాకాలు వేసి కోళ్ళగూడు గదులల్లే పేరుస్తాడు" అని వ్యంగంగా దెబ్బకొట్టాడు!! అయితే రాజకీయ వేత్తలు ఈ పనికి ఎందుకు దిగుతారంటే మరో కారణం కూడా చెప్తాడు రాబిన్‌సన్: వోటర్లకు బాధ్యత వహించవలసినది ప్రభుత్వం కాబట్టి--మోసం ద్వారానో, ప్రలోభాలద్వారానో, భడవాతనం ద్వారానో, రాజకీయాలు మాత్రమే మాట్లాడుతున్నట్లు నటించడం ద్వారానో, వోటర్లతో రాజకీయవేత్త సంబంధాలు పెంచుకోవాల్సి వస్తుందన్నాడు! కనుకనే, ఆ వరసలో "విమర్శ" రాజకీయంలోకి చొరబడి, భాషమారి స్పర్శకోల్పోయి, రాజకీయ భాష కాస్తా తిట్లను శాపనార్థాలనూ ప్రసవిస్తుంది! హెరాల్డ్ మాక్మిలన్ తానుగా ఎంత గొప్పవాడైనా, తనకంటే గొప్పవాడైన లాయిడ్ జార్జి నుంచి "ప్రవర్తనా నిబంధనావళి"ని నేర్చుకున్నవాడు "మీ

ప్రసంగాలు బాగానే ఉన్నాయిగాని ఇంకా మెరుగుపెట్టుకోవలసిన అవసరం ఉంద''న్న జార్జి మాటను మాక్మిలన్ కాదనలేకపోయాడు! నటన ఎలా ఉన్నా రాజకీయం ఆడడంలో తెలివి ఎవడబ్బసొమ్ము! కాని ఈ లౌక్యం సుతరామూ ఇష్టంలేనివాడు మాత్యూ ఆర్నాల్డ్. సాహిత్య భాషలో ఉపన్యాసాలిస్తే రాజకీయాలు నడవవని లార్డ్ మెకాలేని దువ్వినవాడు ఆర్నాల్డ్! సత్యాన్ని సాహిత్య భాషలో గాకుండా నగ్నంగా సామాన్యుడి భాషలోనే పచ్చిపచ్చిగా చెప్పాలన్నాడు!! అదే బ్రిటన్‌లో చాలారోజులవరకూ ''ఆర్నాల్డ్ లా'' గా చెలామణి అయింది!! అయినా, ఇప్పుడు 'గుణం' ఎవడిక్కావాలి?!

నవంబర్ 5, 1989

# సాహితీ వెలుగు వాకిలి--జర్నలిజం

ఒక్క నెల రోజుల తేడాలో ఇద్దరు ప్రముఖులు దివంగతులయ్యారు ఖండాలు వేరయనా, దేశాలు వేరయినా స్వయం కృషితో ప్రభా పుంజాలు విరజిమ్ముకున్న వ్యక్తులు వారు ఈ మాట ఇక్కడ చెప్పడానికి అసలు కారణం --ఆ ఇరువురి అసలు పేర్లకు ముందు మూడు అక్షరాలు ఒకటి కావడమే! వారివురూ ఒకరు -- సి ఎల్ ఆర్ జేమ్స్ సుప్రసిద్ధ కరిబియన్ రచయిత, మరొకరు--సి ఎల్ ఆర్.శాస్త్రి-- సుప్రసిద్ధ భారతీయ ఆంగ్ల పాత్రికేయుడు(*Anglophile*) ఎందుకంటే, సి ఎల్ ఆర్ అనగానే చాలామంది విద్యావేత్తలకు చటుక్కున గుర్తుకొచ్చేది సి ఎల్ ఆర్ జేమ్స్ అని మాత్రమే కాని ప్రస్తుతం మన 'కథానాయకు' డైన సి ఎల్ ఆర్ శాస్త్రి గురించి చాలామందికి, ముఖ్యంగా ఈ కాలం పాత్రికేయులకు తెలియదు ఈ అజ్ఞానానికి రెండు కారణాలు తోడయ్యాయి ఒకటి-- భారత మేధావి వర్గానికి, పాత్రికేయ వర్గాలకూ తెలిసిన"లీడర్"పత్రికా సంపాదకుడు సి వై చింతామణి కొడుకైన సి ఎల్ ఆర్ శాస్త్రి పాత్రికేయ వృత్తిలో, ఆంగ్లభాషలో తండ్రికి మించిన ప్రతిభావంతుడే అయినా పేరు ప్రతిష్ఠల కోసం పాకులాడని అజ్ఞాత 'కలం వీరుడు'గానే ఉండిపోవడం, రెండవ కారణం-- భారత పత్రికా ప్రపంచ వైభవ ప్రాభవాల గురించి, దాని పురోభివృద్ధిలో ఎదురైన సాధక బాధకాల గురించి, కష్ట నష్టాల గురించి తెలుసుకుందామన్న ఆబగానీ, ఆసక్తిగానీ మన తరం పాత్రికేయులకు లేకపోవడమూ 90 ఏళ్ళ వయస్సులో బొంబాయిలో పండి రాలిపోయిన సి ఎల్ ఆర్ దేశ పత్రికా రంగంలో ఇంత వరకూ ఏ "ఫ్రీలాన్స్ జర్నలిస్టూ" నెలకొల్పని రికార్డు సృష్టించిన పాత్రికేయుడు ప్రసిద్ధ రచయితగానూ, సుప్రసిద్ధ విలేఖరిగానూ ఆయన ఒకచోట ఉద్యోగానికి కుదురుకోకుండానే కడచిన ఏభైయేళ్ళుగా "ఫ్రీలాన్సర్" గా పనిచేసి రికార్డు స్థాపించాడు అదైనా ఏ పరిస్థితుల్లో చేశాడు? స్వతంత్ర భారతంలో మొదటి ప్రెస్ కమిషన్ ప్రకటించినట్టుగా, సరసమైన ఆదాయానికీ, నిత్యాదాయానికీ ఫ్రీలాన్స్ జర్నలిజానికి అవకాశాలు బొత్తిగా లేని సమయంలో సి ఎల్ ఆర్ ఈ రికార్డు సృష్టించాడు! ఈ శతాబ్దం తొలి అర్ధ శతాబ్దంలో భారత దేశంలో ప్రభవిల్లిన ప్రముఖ పాత్రికేయులు వృత్తిలో కష్టపడి అఖండ ప్రతిభతో నెలకొల్పిన విలువలూ, సంప్రదాయాలు పుణికి పుచ్చుకొని, అంతగానూ కష్టపడి సుప్రసిద్ధ ఆంగ్ల పాత్రికేయుడుగా తనతనాన్ని మొహరు వేసుకొన్న తెలుగు వెలుగులలో ఒకడు సి ఎల్ ఆర్ 1920లలో పాత్రికేయ రత్నాలుగా ఇలా ఎదిగివచ్చిన వారిలో చింతామణి సరసనే ఎత్తుపీట వేయించుకోగల ఆంగ్ల పాత్రికేయ ప్రముఖులు జి వి.కృపానిధి, జి ఏ నటేశన్, ఎన్.సి కేల్కార్, హార్నిమాన్, ఖాసా సుబ్బారావు, కోటంరాజు రామారావు, కోలవెన్ను రామకోటేశ్వర్రావు, ఎస్ సదానంద, కె శ్రీనివాసన్, ఎస్ నటరాజన్, ఎన్ ఎస్ వరదాచారి ఆ తరువాత రెండు దశాబ్దాలలో, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే స్వాతంత్ర్య సిద్ధివరకూ, ఆ తర్వాత కొన్నాళ్ళవరకూ జర్నలిజాన్ని వృత్తిగా కాకుండా సమాజ శ్రేయస్సుకు ఉద్దేశించిన సేవా ధర్మ ప్రవృత్తిగా భావించి ముందుకు దూసుకుపోయిన తెలుగు ప్రముఖులు ఎమ్ చలపతిరావు , సి ఎల్ ఆర్ "లీడర్", నేషనల్ హెరాల్డ్', "పయనీర్", టైమ్స్ ఆఫ్ ఇండియా, హిందుస్తాన్ టైమ్స్, త్రివేణి, మోడరన్ రివ్యూ పత్రికల్లో ఈ ప్రముఖుల వ్యాసరాజాలు, వ్యాఖ్యాన విమర్శనా పరంపరా పాఠకులను చైతన్య వంతులను చేస్తూ వచ్చేయి సి.ఎల్ ఆర్ "త్రివేణి", మోడరన్ రివ్యూలలోనేగాక, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, బ్లిట్జ్, మెయిన్ స్ట్రీమ్ తదితర జర్నల్స్‌లోనూ, దినపత్రికలలోనూ రాజకీయ, సాహిత్య వ్యాసాలద్వారా పాఠకలోకంలో చైతన్యధారకు కారకుడయ్యాడు. వృత్తి రీత్యా, ఎడిటింగ్‌లో, ప్రూఫ్‌రీడింగ్‌లో, రచనా శైలిలో తండ్రి చింతామణి పెట్టిన ఒరవడిని మరింతగా రాపాడుకుని కాపాడుకున్నవాడు

సి ఎల్ ఆర్ చింతామణి కాలంలో మద్రాసు ప్రెసిడెన్సీకి "హిందూ" పత్రిక ఎంతో, ఉత్తరప్రదేశ్‌కు "లీడర్" అంతటి ప్రజా ప్రతినిధి, పాఠకుల చింతనా వేదిక తండ్రీ కొడుకులిద్దరూ సుప్రసిద్ధ బ్రిటీష్ పాత్రికేయులయిన మాసింగ్ హామ్, జె ఎ స్పెండర్‌లాంటి వాళ్ళు యాజమాన్యంతో అభిప్రాయ భేదాలొస్తే ఆదర్శాలకోసం పదవులను గడ్డిపోచగా భావించి అవతలకు తొలగినవాళ్ళు

చింతామణి మాదిరే సి ఎల్ ఆర్ కూడా -- "సంగీతం, సాహిత్యం సరితూచిన" ఆదిభట్ల నారాయణదాసు వంటి "త్రాసూ", రసహృదయుడూ కూడా! తన రచనలలో ఆయన జర్నలిజానికి, సాహిత్యానికి ఒక విశిష్టమైన వంతెనగా నిలిచాడు ఆంగ్ల విద్యా సంపర్కంవల్ల ఏ ఇంగ్లీషువాడికీ తీసిపోని శైలిలో రచనలు చేశాడు ఆనాటికి భారత పత్రికా చరిత్రకు, జర్నలిజానికి సంబంధించి వెలువడిన కొలది పుస్తకాలలో ఎస్ నటరాజన్ రచన "ఏ హిస్టరీ ఆఫ్ ది ప్రెస్ ఇన్ ఇండియా" తర్వాత, కాదు, శైలీ సౌభాగ్యంలో అంతకంటే విశిష్టమైన గ్రంథం సి ఎల్ ఆర్ రచన "జర్నలిజం" సీమాంతరాలలో పత్రికా ప్రపంచంలో వస్తున్న మార్పులనూ, నూతన ధోరణులనూ, కొత్త పోకడలనూ ఆపోశనంపట్టి, జర్నలిజం అంటే 'ఇలా ఉండాలని' అందమైన ఉదాహరణలతో బోధించే గ్రంథం ఇది శైలి గురించి ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలకు ఒక మచ్చుతునకః పాఠకుడిని ఆకట్టుకునే పద్ధతులను వివరిస్తూ జర్నలిజంలో పెక్కు శాఖలున్నాయని చెబుతూ, కాలపరిమితిలో పనిచేసే వృత్తిలో శైలీ ప్రాముఖ్యం గురించి ఇలా చెప్పాడుః *"to whatever branch of it one may belong, one must have an eye, first to style--to the apparatus of writing style is absolutely necessary what is not less necessary is the ability to exhibit it when one is hard pressed for time"* అతని ఉద్దేశంలో జర్నలిజం ఒక కళ అది, ఏకకాలంలో శ్రవ్యకావ్యంగా దృశ్యకావ్యంగా ఉండాలన్నాడు (*"Journalism is an art like another"*) అంతేకాదు, పరిశీలన, పరిశోధన వృత్తికి సర్వస్వంగా, అదే పరసీమగా భావించాలన్నాడు జర్నలిస్ట్ అన్నవాడు ఉత్తమ పాత్రికేయుడు కావాలా లేక అనామకుడుగా మిగిలిపోవాలా అన్నది వృత్తి ప్రారంభదశలలో అతను అనుసరించే, దిద్ది [illegible]చిన ఆదర్శాలపైన, లక్ష్యంపైన ఆధారపడి ఉంటుందని చెప్పాడు ఆదర్శరహితమైన వృత్తి అక్కరకు రాని [illegible]న్నాడు ప్రాధాన్యతల ఎంపిక పరిపాలకునికి ఎంత అవసరమో, పాత్రికేయుని జీవితాన్ని తీర్చిదిద్దటానికి [illegible] అవసరం అంటూ, ప్రసిద్ధ నాటక విమర్శకుడు ఐవర్ బ్రౌన్ అన్న మాటలను ఉదహరిస్తూ ఇలా అన్నాడుః *"A fool [illegible] me to Latin, but a wise man brought me to Virgil A single false step at the commencement will spoil all our dazzling dreams, will tip the fat into the fire"*. వహ్వా! అదీ అతని ఆంగ్ల రచనారీతీ శైలీ సి ఎల్ ఆర్ భావనలో పాఠకుల మనస్సులను మలచడంలో శైలీ సౌభాగ్యంతో విలసిల్లే జర్నలిజమూ, సాహిత్యమూ అజరామరాలు నేడు ప్రపంచంలో సుప్రసిద్ధులైన రచయితలకు, కవులకు, నాటక కర్తలకూ జర్నలిజమే (పత్రికలే) ద్వారబంధంగా, పరిచయ వేదికగా ముఖద్వారంగా--ఉపయోగపడుతుందని చెప్పాడు! ఆ మాటకొస్తే, పెక్కుమంది, ముందుగా జర్నలిస్టులు అయి, ఆ తర్వాతనే రచయితలయ్యారన్నాడుః *"Journalism is the vestibule of literature journalism is a necessary introduction to literature News papers serve many queer trades not, least, that queerest trade of all – namely, literature"* రచనా రీతినీ, సృజన శక్తినీ అనటోల్ ఫ్రాన్స్ ఒక "సువర్ణకలశం"తో పోల్చాడు అందులో భద్రపరిచే ఆలోచనా స్రవంతి ముందుతరాలకు అందివచ్చే అమృతభాండం అన్నాడు! అలాంటి భావపేటికే మన సి ఎల్ ఆర్

అగస్టు 27, 1989

# ఆ తరం వేరు, ఆ తలుపులు వేరు......!

"దేవుడు చేసిన మనుషుల్లారా! మనుషులు చేసిన దేవుళ్ళారా?!" ఈ ప్రశ్నతో నిమిత్తం లేకుండా, ఆ ఊసుతో సంబంధం లేకుండా మాలిన్యం ఎరుగని మనసులతో ఎదిగి, సర్వజనుల సుఖం కోసం శక్తికొలదీ పనిచేసి, మానవతా పతాకను సమున్నతంగా నిలపడానికి కృషిచేసిన వారు ఏ కాలంలో చూచినా కొద్దిమందే ఉంటారు. భక్తి భావానికి దురర్థాలు తీయకుండా, కేవలం వ్యక్తి నిష్టమైన ఆత్మానందం కోసం తప్ప, అంతరాంతరాలలోని 'అహంకార బ్రహ్మ'ను తొలగించుకొనే జ్ఞానయోగంగా తప్ప, దైవభక్తిని స్వార్థానికి ఉపయోగించుకోని మన వెనుకటి తరాలు వేరు, వారి తలపులు వేరు. కులపట్టింపులూ, మత వైషమ్యాలూ ఎరుగని మమతాను బంధాలతో పెనవేసుకొన్న జీవితాలవి, సర్వధర్మ సమభావన కోసం, ప్రజల సుఖశాంతుల కోసం, వారి స్వాతంత్ర్యం కోసం, వారి స్వేచ్ఛకోసం సాగిన సంస్కరణ వాద, రాజకీయ ఉద్యమాలలో తమ సర్వస్వాన్నీ త్యాగంచేసిన ఆ తరాలు వేరు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అని రామాయణం చెప్పడంలో అంతరార్థాన్ని - భిన్నతెగల, విభిన్న మతాల, భిన్న సంస్కృతులకు నిలయంగా ఉన్న భారతదేశాన్ని ఉద్దేశించి చెప్పుకొన్నదేగాని వికృతార్థంలో కాదు. ఆ అర్థం ఆ తరం వారికి మాత్రమే తెలుసు. పాత చక్రవర్తుల, ప్రభువుల తప్పిదాలకు వర్తమాన తరం వారిని ఇబ్బందులపాలు చేసే పెడధోరణులకు దూరంగా ఉన్న తరాలవి, కులమతాలకు అతీతంగా ఎదిగిన తరాలవి, ప్రకృతిలో ఎదిగిన తరాలవి, ప్రకృతి ఒడిలో పెరిగి, ప్రకృతితో తాదాత్మ్యం చెంది, ప్రకృతిసిద్ధంగా ఎదిగివచ్చిన తరాలవి, ప్రకృతి సత్యమనీ, దానికి మనిషి కేవలం విధేయుడనీ భావించి, ప్రకృతిముందు వినమ్రులై అహాన్ని చంపుకొని అందరితోనూ కలివిడిగా మెలిగిన తరాలవి. కనుకనే ప్రకాశం పంతులు "నా జీవిత యాత్ర", వీరేశలింగం ఆత్మకథ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి "అనుభవాలూ - జ్ఞాపకాలూను", చిలకమర్తి స్వీయచరిత్ర మనకు జ్ఞానభిక్ష పెడతాయి, ఎన్నో అనుభవాలు అందిస్తాయి. అలాంటి అచ్చట ముచ్చట తీర్చే అనుభవసారమే ఇటీవలి కాలంలో వెలువడిన సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధులలో ఒకరైన కోదాటి నారాయణ రావుగారి "చిన్ననాటి జ్ఞాపకాలు" కూడా. " నా బాల్యంలో జీవితం, ప్రకృతితో అత్యంత సన్నిహితంగా ఉండేది. ఈనాటి పల్లెల్లో పిల్లలకు కూడా బస్తీ నాగరికత అలవడి ప్రకృతికి దూరమైపోతున్నారు. కృత్రిమ జీవితానికి అలవడుతున్నార"ని ఆవేదన చెందుతున్న కోదాటి నేటికి డెభైఏళ్ళనాటి పరిస్థితులను సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, నైతిక రంగాలలో వచ్చిన పరిణామాలను సింహావలోకనం చేసుకొంటూ మనసులోని మాటగా రసవత్తరంగా మనముందు ఒలకబోసుకున్న రచనే ఈ "చిన్ననాటి జ్ఞాపకాలు". నాటికీ, నేటికీ మధ్య వచ్చిన ఈ తీవ్రమైన మార్పులకు "అన్నిటికన్నా కాలమే ప్రధాన కారణం" అని కోదాటి తేల్చారు, మన "పెద్దలు కాలాన్ని భగవత్ స్వరూప"మని చెప్పారు. కాలానికి సంబంధించిన కోదాటి భావన, మనలోని కొందరు స్వార్థపరులు నలుగురికీ తెలియకుండా తొక్కిపట్టిన లేదా అణచివేసిన "శ్వసన్ వేదోపనిషత్" భావాలకు చాలా దగ్గరగా ఉందని చెప్పాలి. ఎందుకని? ఇన్ని మార్పులు చూస్తామని తానెన్నడూ వూహించని కోదాటి దృష్టిలో అన్నింటికీ కాలమే పరిష్కర్త, సమదర్శీ మరోమాటలో చెప్పాలంటే "కాగల కార్యాన్ని గంధర్వులు తీరుస్తార'న్న నానుడికి పూర్వ రంగాన్ని సమకూర్చేది కాలమే! ఈ "కాలన్నీ", సృష్టినీ మనకు కొందరు దూరం చేస్తున్నా శ్వసన్

వేదోపనిషత్తు ఎలా నిర్వచించిందో చూడండి "వేరే సృష్టికర్త అంటూ లేడు, స్వర్గ, నరకాలు అసలే లేవు ప్రకృతే సృష్టికర్త, కాలమే పరిష్కర్త, విధ్వంసకారి"! అలాంటి కాలానికి కీర్తి కిరీటం తొడిగిన కోదాటి అటు కోస్తాజిల్లాలకూ, తెలంగాణాకూ మధ్య వారధిగా ఉన్న ఒకనాటి మునగాల పరణాణాలో (తర్వాత ఈ పరగణాను 1959లో నల్గొండ జిల్లాలో కలిపారు) వర్ధిల్లిన ఉద్యమ సారధులలో ఒకరు హైదరాబాద్ సంస్థాన ప్రజా ఉద్యమాలతో, భారత స్వాతంత్ర్య సమరంతో జీవితం పెనవేసుకు పోయిన కోదాటి విద్యారంగంలో, పయోజన విద్యా రంగంలో, గ్రంధాలయోద్యమ వ్యాప్తిలో అకుంఠిత దీక్షతో పనిచేసిన ఆదర్శమూర్తి

కోదాటి ఇప్పటికి రాసింది చిన్ననాటి జ్ఞాపకాలే అయినప్పటికీ, పెనుకొండ కూడా అద్దంలో చిన్నదిగానే కనిపించినట్టుగా తెలుగువారు ఆయననుంచి బలవంతంగానైనా సరే పిండుకోవలసిన, తక్షణం అక్షరబద్ధం కావలసిన అనంత జ్ఞాపకాలలో రసవత్తర ఘట్టాలింకా ఎన్నెన్నో! ఆనాటి వారి ఆట పాటలు, ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, వినోద కళారూపాలు, విరామ సమయాలు, రాజకీయాలు, ప్రేమానురాగాలు, అభిమానాలు, మమతానుబంధాలు - ఒక్క ముక్కలో సుమారు ఏడుదశాబ్దాల నాటి తెలుగు సంస్కృతి, ప్రజాజీవితం ఈ గ్రంథంలో మనకళ్ళముందు నిలబడుతుంది ఆనాటి కుటుంబ వ్యవస్థ, గ్రామీణ వ్యవస్థ, జమిందారీ, వ్యవస్థలోని సామాజిక నీతి, మనుషుల మధ్య సంబంధ బాంధవ్యాలు పాఠకుల మనస్సులను ఆకట్టుకుంటాయి కోదాటి సంస్కృతీ ప్రియత్వం, సాహిత్య సంస్కారం, సామాజిక చైతన్యం ముప్పేటగా సాగిన ఈ రచన, కులమతాల వూబినుంచి బయటపడలేక కుడితిలో పడిన ఎలుకలా కొట్టుకుచస్తున్న మన దౌర్భాగ్యానికీ, అజ్ఞానానికీ కళ్ళు తెరిపించగలగాలి ఆనాడు వ్యకిగత విశ్వాసాలుగానీ, నమ్మకాలుగానీ సమాజ శ్రేయస్సుకూ, ప్రజాబాహుళ్యం ప్రయోజనాలకూ కట్టుబడి ఉన్నవేగాని, ఉమ్మడి సంస్కృతీ వారసత్వాన్ని చెల్లాచెదురుచేసి, మానవ సంబంధాలను మట్టి పాలుచేసుకున్నవి కావు! అందుకే అంటాడు కోదాటి "అంధప్రాయంగా అనుసరించిన ఆచారాలకంటే నాగరకత బలిసినప్పుడు అనుసరిస్తున విధానాలు సమాజానికి ప్రమాదంగా పరిణమిస్తున్నవి. వసుధైక కుటుంబమని నినాదమిస్తున్న ఈ రోజులలో సమాజాన్ని ఏకీకృతం చేయడానికి బదులుగా కులకక్షలను రెచ్చగొట్టి రాజకీయ చదరంగంలో పావులుగా ఉపయోగించు కోవడం చాలా శోచనీయం" సంప్రదాయ వాదులైన తమ కుటుంబం మూఢవిశ్వాసాల నడ్డివిరగ గొట్టడానికి ఎలా కృషి చేసిందో ఉదారవాది అయిన తన తాతగారి సంస్కరణ కార్యక్రమాలను కోదాటి ఉదాహరించారు ఈ పనిని ఆయన చమత్కారంతో సాధించారు సంప్రదాయవాదులను కూడా మూఢవిశ్వాసాలు వదిలించుకునేట్టు చేశారు శైవ, వైష్ణవ తగాదాలు ఇంకా చల్లారిపోని ఆ కాలంలో "శివుడూ", "విష్ణువూ" పరస్పరం బద్ధశత్రువులని చిత్రించుకొని కొట్లాటలకు దిగిన వీర భక్తుల నోళ్ళు కట్టివేయడానికి శివవిష్ణువులిద్దరూ బావమరదులేనని రకరకాల కథలు చెప్పి, మళ్ళీ కట్టుకథలతోనే వాగ్బంధం చేసేవారు! అంతేకాదు, కోదాటి వారి కుటుంబం సర్వమత సమభావనకు దోహదం చేసిందనడానికి ఉదాహరణ - హైందవ, క్రైస్తవ, మహమ్మదీయ మతాలపట్ల సమదృష్టితో వ్యవహరించడం రిచర్డ్‌క్లాష్టన్ అనే ప్రసిద్ధ ఆంగ్లరచయిత "వివేకం కొరవడినప్పుడల్లా, మన అయోమయం బయటపడి పోతూంటుంద"న్నాడు *[For every credibility gap there is a gullibility fill]'* మనిషిలో తలెత్తే ఈ అవివేకంవల్లనే స్వార్ధపరులు పెట్రేగి పోతూంటారు హిట్లర్ అనేవాడూ - "నేను దేవుని ప్రత్యేక రక్షణలో లేనని చెప్పగల దమ్ములెవడి కున్నాయి" అని

అలాంటివాళ్ళు సమాజంలో అప్పుడప్పుడూ తలెత్తి సంఘానికీ, సమష్టి ప్రయోజనాలకూ హానికరంగా పరిణమిస్తారని కోదాటి తాతగారికి తెలుసు అందుకే ఆయన లౌక్యంగా చమత్కారంగా మూఢులకు ఏమి సమాధానమిచ్చారో తెలుసా "హిందువులం కృష్ణుని పూజిస్తే, క్రైస్తవులు కృష్ణుని కొడుకైన క్రీస్తుని పూజిస్తారు తండ్రిని పూజించినా, కొడుకును పూజించినా ఒకటే కాబట్టి వారికీ మనకూ తేడాలేదన్నాడు కృష్ణుని కొడుకు మన్మధుడన్నావుకదా, మరి ఇప్పుడు కృష్ణుని కొడుకు క్రీస్తు అని చెబుతావేమిటి అంటే, మన మన్మధుడే వారికి క్రీస్తు అని చెప్పేవాడు!!" ఫాదరీలు, బ్రాహ్మణులు ఒకటేననేవాడట! ముస్లిములతో కూడా ఆయన సంబంధాలు అలాగే ఉండేవట మహమ్మదీయుల భక్తిని ప్రశంసిస్తూ, పీర్లను వైష్ణవుల ఆళ్వారులతో పోల్చేవాడు! గణాలు పూనడం, శివాలు తొక్కడం మనుషులు చేసే అట్టహాసాలు, మోసాలు అనేవాడు! ఈనాటి బాణామతికి ఆనాటి రూపమైన గణాచారులను కోదాటి కుటుంబ పెద్దలు చింతబరికెలతో సమాధానం చెప్పారు! ఇలా ఒకటి కాదు, చిన్ననాటి జ్ఞాపకాలలోనే మరెన్నెన్ని ఆసక్తికరమైన పెద్దపెద్ద సన్నివేశాలున్నాయో! చదవండి!

నవంబర్ 4, 1990

# ఆ పాలబుగ్గల మెరపుతావులెక్కడ?!

తెల్లవారితే ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవానికి ఒక రోజుముందే తమ విద్యా కేంద్రానికి ముస్తాబులు చేస్తున్న విశాఖ పోర్టు స్కూలు చిన్నారులు 13 మంది జీవితాలు మొగ్గలోనే "తెల్లవారి"పోవడం మొత్తం మన విద్యా వ్యవస్థ నిర్వహణ తీరుతెన్నుల పైనే ఒక చెంపపెట్టు! నిర్బంధ ప్రాథమిక విద్యావ్యాప్తిని అజ్ఞానంతో అరికట్టుకుంటున్న ఈ దేశంలో, పోషకాహారం లభించక కునారిల్లిపోతున్న ఆరుకోట్ల మంది బాలబాలికలు ఉన్న ఈ దేశంలో, వీరికి సరైన వైద్య చికిత్స అందకపోతే కొన్ని మాసాలలోనే 40 లక్షల మంది చిన్నారులు మృత్యువాత పడనున్నారని ప్రమాద సూచికను ప్రకటించుకున్న ఈ దేశంలో తొంభై ఏళ్ళనాడు కాదు, సరిగ్గా తొమ్మిదేళ్ళనాడు కట్టిన స్కూలు బిల్డింగ్ కూలిపోవడం ఓ విచిత్రమూ కాదు, విడ్డూరమూ కాదు! యథారాజా తథాప్రజా! అవినీతిపరుడైన రాజకీయవేత్త మరొక అవినీతిపరుడైన కాంట్రాక్టరుకు కవచంగా ఉన్నంతకాలం ప్రాజెక్టులు, పాఠశాల భవనాల నిర్మాణం సాగేది సిమెంటుతో కాదు, కేవలం ఇసుకతోనే! శ్లాబ్‌కు అవసరమైన గేజ్ ప్రమాణాలుగల ఉక్కుతో కాదు, లాభాల వేటలో మిగులు తేలిన తుక్కు సరుకుతోనే! నేటి నిర్మాణాల కంటే పాత కాలపు "పిడకల గుడిసెలు" పదిరెట్లు మన్నికగా ఉండేవి పోయిన ప్రాణాలు నష్టపరిహార చెల్లింపులతో తిరిగి రావు బంధుకోటి దుఃఖం ఓదార్పులతో ఉపశమించేది కాదు విద్యార్థులు, ఉపాధ్యాయ సంఘాలు బిల్డింగ్ బాగుచేయించాలని మాసాలుగా మొరపెట్టుకుంటున్నా అధికారులు నిర్లక్ష్యం చేశారు! వీరందరూ ఈ చిన్నారుల సామూహిక బలిలో సాక్షులు కాదు, నేరగాళ్ళే ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలను బలిగొన్న ఈ ఘటన విన్నప్పుడు అమెరికాలో ఒకచోట రోడ్డు యాక్సిడెంట్ సందర్భంగా మనిషిని చంపి నేరం చేసిన ట్రక్కువాడి పరిస్థితినీ, పోలీసుల నిర్లక్ష్యాన్నీ, అధికారులు ప్రదర్శించిన నిర్లిప్తతనూ వర్ణిస్తూ కెన్నెత్ ఫియరింగ్ రాసిన గీతం గుర్తుకొస్తోంది అతను రాసిన ఆ విషాదగీతంలో - అందరికీ వాతలు పెట్టాడు పోలీసు అధిపతి, గూఢచారి శాఖాధిపతీ, ట్రక్కు ఓనర్లూ, కార్ల కంపెనీ అధిపతులూ, ట్రక్కులోకి ఆయిల్ ఎక్కించి పంపిన ఆయిల్ కంపెనీ యజమానులూ, వారినుంచి మామూళ్ళు వసూలు చేసుకొని పోయే బేరగాళ్ళూ, నేరగాళ్ళూ అంతా 'నిర్దోషులే', అంతా 'పెద్దమనుషు'లే, కాని ఆయిల్ ట్రక్కు తీసిన ప్రాణం అమాయకుడిది కొంపెల్ల జనార్ధనరావు నానా అగచాట్లకు గురై ప్రాణం విడిచిననాడు శ్రీశ్రీ విలవిలలాడిపోయి "దొంగ లంజకొడుకులసలే మెసలే ఈ ధూర్త లోకంనుంచి వెళ్ళిపోయావా" నేస్తం అని విలపించినట్లే కెన్నెత్ ఫియరింగ్ కూడా యాక్సిడెంట్‌కు బలైపోయిన వ్యక్తి గురించి అంతగాను విలపించాడు

*"Take him away, he is as dead as they die/hear that ambulance bell, his eyes are staring straight at death/what was the driver's name?/Sergeant, what was your name? Let the Morgans hold the priceless bills /And give Mr Hoover the pint of gin/Because they are all good men! And they were friends of his/Dont forget Gene Tunney/Dont forget Al Capone/They lived with him they are good men, too!"*

1995 నాటికి యావద్భారతాన్ని అక్షరాస్యం చేసి. సభ్య దేశాల మధ్య సజావుగా నిలబడడానికి ప్రయత్నిస్తున్న మనదేశంలో, వయోజనులలో నిరక్షరాస్యతను నిర్మూలించేందుకు వ్యూహాలు పన్నుతున్న మన భారతంలో ప్రాథమిక విద్యాదశ పునాదులే బలహీనంగా ఉన్న విషయాన్ని మరచిపోరాదు ఈ బలహీనత విద్యా బోధనలో, పిల్లల శిక్షణలో, బోధకుల

శిక్షణలో శక్తి సామర్థ్యాలలోనే కాదు, ఈ దశలన్నింటికీ తగిన పరిసరాలను పొందుపరచడంలో, భవంతుల నిర్మాణంలో కూడా ఉంది ఉన్న స్కూలు బిల్డింగుల గతి, అధికార భవంతుల పరిస్థితే దారుణంగా ఉన్నప్పుడు, దేశంలో అసలు బిల్డింగులే లేని ప్రాథమిక పాఠశాలల సంఖ్య సుమారు 80 వేలు అని అంచనా! ఏడాదికి సుమారు రూ 900 కోట్లు విద్యపై ఖర్చు పెడుతూ కూడా, ఇదీ దుస్థితి! అవినీతి అధికారం చెలాయిస్తున్నచోట విద్యా వ్యాపారంలో చిన్నారులు పావులయిపోతున్నారు ప్రభుత్వ "విద్యా సర్వేక్షణ" అయిదవ నివేదిక ప్రకారం దేశంలోని ప్రాథమిక పాఠశాలల్లో 1,48,033 విద్యాలయాలలో ఒక్కొక్క టీచరు మాత్రమే ఉన్నారు కాని, ప్రాథమిక, మాధ్యమిక విద్యా దశలను నిర్లక్ష్యం చేసి మనం చేస్తున్నపని - అప్పర్ మిడిల్ క్లాసు, ఆపై సంపన్న వర్గాల కోసం "పబ్లిక్ స్కూల్సు" పేరిట కాన్వెంట్సునూ ప్రోత్సహిస్తున్నాం అంటే 400 ఎలిటిస్టు స్కూళ్ళ కోసం (కాన్వెంట్స్) రూ 500 కోట్లు కేటాయించగల దేశం 60 వేల సెకండరీ స్కూళ్ళపైన ఏమీ ఖర్చు చేయకపోవడం క్షంతవ్యం కాదు! ఫలితంగా 14 సంవత్సరాల వయస్సులో ఉన్న పిల్లల సంగతి అలా ఉంచి 6-11 ఏళ్ళ మధ్య వయస్సులో ఉన్న బాలబాలికలకు కూడా సార్వత్రిక నిర్బంధ ప్రాథమిక విద్యను అబ్బించడంలో విఫలమయ్యాం, నేడు సుమారు 6 కోట్ల 40 లక్షల మంది (1986-1990 మధ్య పుట్టినవారు) పిల్లల్లో 3 కోట్ల 90 లక్షల మందికి గురుముఖతః విద్య నేర్చుకునే అవకాశం లేదు ఉన్న అవకాశమల్లా అనియత (నాన్ -ఫార్మల్) విద్య అదీ, వయోజనులకు ఉద్దేశించింది మన ప్రకాశం పంతులెవరో, మన జాతీయ నాయకులెవరో తెలుసుకోనివ్వని కాన్వెంటు విద్యావ్యాప్తి "కంప్యూటర్" సంస్కృతిని "కంప్యూటర్ కిడ్స్" ను మాత్రమే పెంచుతోంది! ప్రాథమిక విద్యాదశలో ఉన్న బాలబాలికల సంఖ్య మధ్యలోనే తరిగిపోతోంది, జీవితానికి అవసరమైన వృత్తి విద్యల స్థానే, అవసరం లేని (కొద్దిమందికే అవసరమైన) ఉన్నత విద్యావకాశాలను పెంచివేస్తున్నాం ఒకటినుంచి అయిదవ తరగతి వరకు ఉన్న ప్రైమరీ పాఠశాలల్లో బ్లాక్ బోర్డులు, చాక్‌పీస్‌లు, డస్టర్లు, బల్లలు లేని దుస్థితిని ఎవరో కాదు, కేంద్ర ప్రభుత్వ నూతన విద్యావిధాన పత్రమే వెల్లడించింది! అందుకే ప్రాథమిక విద్యాదశ పునాదులను ఎందుకు పటిష్టం చేసుకోవాలో ఇరవై రెండేళ్ళనాడే కొఠారీ కమిషన్ నొక్కి చెప్పింది ఇంతగా మొత్తుకున్నా, ప్రాథమిక విద్యా వ్యవస్థలో మార్పులేదు; అవసరమైన భవనాలు తక్కువ ఉన్న భవనాల నిర్వహణ ఇంత 'చక్క'గా ఉంది నిజానికి ఈ దశలో భారతదేశం నేర్చుకోదగిన పాఠాలు పశ్చిమ దేశాలకంటే వర్ధమాన దేశాలైన చైనా, ఇండోనేషియా, టాంజానియాల నుంచే ఎక్కువేమో అనిపిస్తుంది. జనాభా విద్యావంతులయినకొలదీ జనాభా సమస్యకు పరిష్కారంకూడా తేలిక. ప్రసిద్ధ విద్యావేత్తలలో ఒకరైన శ్రీ వి శివరామమూర్తి ప్రస్తుత విద్యావ్యవస్థ లోపాలను ఎత్తిచూపుతూ చెప్పిన మాటలు పరిశీలించదగ్గవి "మన విద్యా వ్యవస్థకు ఇవాన్ ఇలిచీ పాలో ఫ్రీరర్ లాంటి వాళ్ళు ఎందరో కావాలి మనం పవిత్రంగా భావించుకునే ప్రస్తుత విద్యావ్యవస్థ విధానాలను, భ్రమలను ప్రశ్నించి, టెక్స్టుబుక్ - క్లాసు రూము లెక్చర్, ఒక్క దెబ్బతో తాడోపేడో తేల్చే రొడ్డకొట్టుడు పరీక్షా పద్ధతినీ మార్చివేయాలి కృత్రిమ మానవులను ఉత్పత్తి చేసే పద్ధతి మారాలి "

అలాంటి వ్యవస్థకు ఆదర్శవంతమైన పరిసరాలు కావాలి జపాన్‌లోని కొబయాషి లాంటి పంతుళ్ళూ, అతను నెలకొల్పిన "టోమో" లాంటి ఆదర్శ పాఠశాల, ప్రకృతి పాఠశాలతో, సంగీత మాధుర్యంతో, ఆటపాటల మేలుకలయికతో లేతమనసులను శాశ్వతంగా దోచుకోగల

ఉపాధ్యాయులు కావాలి "ప్రకృతిలో మోగే శృతిలయల్ని వినిపించే" పాఠశాల అది సుప్రసిద్ధ రచయిత్రి కురొాయినాగి రాసిన "రైలుబడి", ఇటాలియన్ ప్రాథమిక, మాధ్యమిక విద్యావిధానంపై విమర్శనాయుత కావ్యంగా సాగిన బార్బినీయా స్కూలు పిల్లల అనుభవాల పేటిక "పంతులమ్మకు లేఖ" మన ఆలోచనలకు పదును పెడతాయి ఈ రెండు పుస్తకాలు పబ్లిక్ స్కూళ్ళ వ్యవస్థకు, పిల్లలను ఇతర సామాజికుల నుంచి, శ్రమ జీవులనుంచి వేరుచేసే తప్పుడు విద్యావ్యవస్థకు, పరీక్షల పేరిట చీటికీ మాటికీ వేధించి, విసిగించే తల్లిదండ్రుల మనస్తత్వాలకు సమాధానం, ఆకులో ఆకుగా, పూవులో పూవుగా నునులేతకొమ్మగా, రెమ్మగా చిన్నారులను పెంచే వ్యవస్థకోసం పాటుపడేవారికి అవి జ్ఞానదీపాలు టాగోర్ శాంతి నికేతన లక్ష్యాలను, గాంధీజీ బేసిక్ విద్య ఆదర్శాన్ని మరచిన మనకు బిడ్డల విద్యాగంధం సంగతి ఏమి తెలుస్తుంది? ఆ బాధ - "కోటాను కోట్ల పిల్లల ఏడుపులు/కరిగిన హిమాలయాలు" అన్న కవి మనస్సుకే తెలుస్తుంది! ఇది - విశాఖ పోర్టు స్కూలు విద్యార్థుల సంస్మృతి పేరిట తీగ కదిలించిన డొంక! కళ్ళ ముందు కదులుతున్న ఆ విగత కుసుమాలకు, రత్న మాణిక్యాలకిదే శ్రద్ధాంజలి రిచర్డ్ లాటిమోర్ అన్నట్టు *"Where, Where/is that rose and the shine of wit?"* ఆ చిరంజీవులు ఏరి? ఆ పాల బుగ్గల మెరపు తావులెక్కడ?!

ఆగస్టు 19, 1990

# "జాగ్వార్ నవ్వు"

వెనకటికో కవిరాశాడు 'ఎందుజూచిన ధాత్రిలో హృదయ దృష్టి/కవులు గానని మర్మంబు గలదె జగతి" అని! జర్నలిస్టులూ, రచయితలూ అంతే

ఆ పనిని మూడేళ్ళనాడు సాల్మన్ రష్దీ చేశాడు సెంట్రల్ అమెరికాలో సంకుల సమరంలో ఉన్న నికరాగ్వాలో ఆ రాజకీయ "మర్మం" ఏదో కళ్ళారాచూశాడు

రష్దీ "మిడ్‌నైట్ చిల్డ్రన్" రాసి కొందరు ఇండియన్లకు కోపకారణమై వుండవచ్చు!

రష్దీ "షెమ్" పుస్తకం రాసి కొందరు పాకిస్తానీయులకు పీడకలగా కనిపించవచ్చు!

అలాగే, రష్దీ "సైతాను గీతాలు" (శటానిక్ వర్సెస్) రాసి మరి కొందరి ఆగ్రహానికి గురై కొందరు చాందసులు స్వచ్ఛందస మరణ మహాసముద్రం" పొలిమేరలలో జీవిస్తూ ఉండవచ్చు!

కాని, రష్దీని - దేనికి క్షమించినా, క్షమించకపోయినా నికరాగ్వాలో అమెరికా సైతాను వికటాట్టహాసాన్ని, అది "ప్రజాస్వామ్యం" పేరిట, "అహింస" పేరిట, కమ్యూనిజాన్ని మట్టికరిపించేపేరిట దేశపౌరులపై జరుపుతున్న హింసాకాండను, సాగిస్తున్న మారణహోమాన్నీ, రష్దీ ఎండగట్టాడు నియంతలకు నిలయంగా మారిన వాషింగ్‌టన్ చివరికి క్రిస్టియన్ చర్చిని కూడా దూరంచేసుకుని మార్క్సిస్టు ప్రభుత్వమైన శాండినిస్టా, పాలకవర్గాలకూ, ప్రజలకూ చర్చిని మరింత సన్నిహితంచేసి, ఎలా ఆటవికన్యాయాన్ని నెలకొల్పాలని చూసిందో కళ్ళకు కట్టినట్లుగా నికరాగ్రన్ల యాసలో, వారి శ్వాసలో "ది జాగ్వార్ స్మైల్" పేరిట ఉత్తమ యాత్రాగ్రంధాన్ని అందించినందుకైనా (రష్దీని) క్షమించి వదిలేయాలి! రాక్షసిబల్లి నవ్వితే ఎలా ఉంటుంది! "జాగ్వార్" (రాకాసి అడివిపిల్లి) నవ్వినా అంతే!! వికారపు నవ్వు

నికరాగ్వాలో మార్క్సిస్టు శాండినిస్టా ప్రెసిడెంట్ అయిన డేనియెల్ అర్తిగో, అమెరికా మాజీ ప్రెసిడెంట్ జిమ్మీ కార్టర్ అంతర్జాతీయ "సాక్షి"గా జరిపించిన అధ్యక్ష ఎన్నికల్లో "ఓడి" పోయాడు! నిరుపేద నికరాగ్రన్లకు నిండు జీవితాలను కాకపోయినా కనీస జీవన ప్రమాణాలను నిలిపేందుకు, సంక్షేమ రాజ్యాన్ని ప్రసాదించేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తూ వచ్చిన మరొక మార్క్సిస్టు ప్రభుత్వాన్ని దక్షిణ అమెరికాలో లేదా సెంట్రల్ అమెరికాలో పడగొట్టేవరకూ అమెరికన్ సామ్రాజ్యవాదం నిద్రపోలేదు నిన్న పనామాలో నారిగో పతనం - తాను మాదక ద్రవ్యాలిచ్చి పెంచిపోషించిన ఆ నారిగోను దురాక్రమణద్వారా పడగొట్టిన వాడూ "అంకుల్ శామే", నేడు ఆ మాదకద్రవ్యాల వ్యాపారానికి మానవ మారణహోమానికీ ప్రతికూలముూ, ఆర్థిక దోపిడీకి వ్యతిరేకమూ అయిన అర్తిగోనూ "ఎన్నికల" పేరిట పతనం చేసినవాడూ "అంకుల్ శామే"! ఒకవైపున రష్యాలోనూ, తూర్పు యూరప్‌లోనూ ఏకపక్ష నియంతృత్వానికి స్వస్తిచెప్పి బహుళపక్ష రాజకీయ వ్యవస్థకు ఆశీస్సులు పలికిన అమెరికాయే తనదాకా వచ్చేసరికి "రెండు పార్టీల" వ్యవస్థను మాత్రమే శాసించి, అనుమతించి, "నిరసన"కు పరిమితులు విధించి, బలవంతపు "ప్రజాస్వామ్యాన్నీ," ఆదేశిత ఎన్నికలనూ అమెరికాలోనే కాదు, నికరాగ్వాసహా అన్ని చోట్లా అలానే జరిపించి అపహాస్యం చేస్తోంది ఫిలిపీన్స్‌లో మార్కోస్ పతనాన్ని తప్పించడం కోసం ఎన్నికల ఫలితాలనే తారుమారు చేయడానికి చివరిదాకా ప్రయత్నించింది అమెరికా అని మరవజాలం అమెరికాలో మూడోశక్తి పెరగకుండా - సంపన్నుల సంరక్షణ శక్తులుగా "దొందు దొందు"గా రాజ్యపాలన చేసే హక్కును రిపబ్లికన్లకూ,

డెమోక్రాట్లకే కుదించిన వ్యవస్థ ప్రెసిడెన్షియల్ ఎన్నికల పోటీలోకి నీగ్రో జాక్సన్ దూసుకువస్తుండగా బలవంతంగా అతణ్ణి పక్కకు తప్పించింది! పైగా పూర్తిఫలితాలు ప్రకటించేలోపుగా అధ్యక్ష పోటీలో ఉన్న వ్యక్తికి మొత్తం వోట్లలో ఒక్క శాతం మాత్రమే వచ్చినా - తానే గెలిచినట్టు ప్రకటించుకునే విచిత్ర సంప్రదాయాన్ని నెలకొల్పింది కూడా అమెరికాయేనని మరవరాదు! కనుకనే నికరాగ్వా ఎన్నికల ఫలితాలు ఉజ్జాయింపుగా సర్వేజరిపి జోస్యం చెప్పే అరడజను సంస్థలు విఫలమైన చోట అమెరికా పాలకవర్గం మాత్రం 24 గంటలముందే ఆర్తిగో ఓటమికి రంగాన్ని సిద్ధం చేయగలిగింది! నికరాగ్వాలో ఆర్తిగో పోయి వయొలెటా చామొరో నాయకత్వాన సంకీర్ణ మంత్రివర్గాన్ని బలవంతంగా కూర్చోబెట్టినా-ఇరుగుపొరుగైన హోండూరాస్ నుంచి అమెరికా పోషిస్తున్న కిరాయి సాయుధ మురాలయిన 'కాంట్రాలు' అస్త్ర సన్యాసం చేయనంతవరకూ నికరాగ్వా ప్రజలకు శాంతిలేదు! ఆ విషయాన్ని మూడేళ్ళనాడే రష్దీ స్పష్టం చేశాడు - "చరిత్రకు ముందుచూపు ఉంటుంది అది పూర్వాపరాల సింహావలోకనం నికరాగ్వాను సందర్శించడం అంటే, ఈ ప్రపంచం ఓ టెలివిజనో, లేదా ఓ కట్టుకథో కాదని తెలియజెప్పడం ఇది వాస్తవ ప్రపంచం. .నూతన సృష్టినీ, వినాశాన్నీ ప్రతిఘటించే విరుద్ధశక్తులు నికరాగ్వాలో అతి భయానకమైన కుమ్ములాటలో ఉన్నాయి బహుశా, బతికిబట్టకట్టాలన్న నికరాగ్వా సంకల్పం అమెరికా ఆయుధాలకంటే బలవత్తరమైన శక్తిగా రూపొందవచ్చు చూడాలి ఒకామె చెప్పినట్టుగా "కాంట్రాలు" గెలిచి అధికారంలోకి రావడమే జరిగితే శాండినిస్టా విప్లవ ప్రభుత్వ దళాలుతిరిగి కొండలలోకి వెళ్ళి గెరిల్లాలుగా అవతరించవచ్చు ." అన్నాడు

ఇది సాధ్యం అయినా కాకపోయినా, ఆర్తిగో ప్రభుత్వం ఏడాది క్రిందట దేశంలో శాంతికోసం అమెరికా రుద్దిన అంతర్యుద్ధంలో 70 వేల మందిని కోల్పోయి, 25 వేల మంది వికలాంగులను "ఆస్తి"గా మిగుల్చుకున్న నికరాగ్వాలో శాశ్వత శాంతికోసం అయిదు సెంట్రల్ అమెరికన్ దేశాలు (నికరాగ్వా, హొండురాస్, కోస్టారికా, ఎల్‌సాల్వడార్, గౌతమాలా) కలిసి సమష్టిగా రూపొందించిన "శాంతి ప్రణాళిక"ను తూ చ తప్పక అనుసరించినవాడు ఆర్తిగో, ఉల్లంఘించినది అమెరికన్ సామ్రాజ్యవాద ప్రభుత్వమూ, దాని తాబేదారులయిన "కాంట్రాలూ" నికరాగ్వా పరిస్థితి, చిలీ మాదిరిగా మారబోతోంది. అమెరికా కాపాడుతూ వచ్చిన నియంతలను కూలదోసి వచ్చిందే శాండినిస్టా ప్రభుత్వం ఇది "చర్చి" సహా అన్ని వర్గాలతోనూ స్నేహభావంతో మెలగింది కాబట్టే రష్దీ మార్క్సిస్టు-క్రిస్టియన్ చర్చి సహకార మైత్రిని "నికరాగ్ర విప్లవ అనురాగ బంధంగా, లౌకిక, క్రైస్తవ భావసమైక్యతా సమ్మేళనం"గా వర్ణించాడు! ఈ భావాన్ని అమెరికా అభావంగా మార్చి అన్నమాటకూ, 1988 ఏప్రిల్ 1 నాటి యుద్ధ విరమణ ఒప్పందానికీ కట్టుబడకుండా - ఆర్తిగో ఎన్నికలు ప్రకటించేదాకా ఆగి ఎన్నికల రోజున శాండినిస్టా ప్రభుత్వ (ఆర్తిగో ప్రభుత్వ) సైన్యానికి చెందిన రిజర్విస్టులనూ, శాండినిస్టా రాజకీయ పక్షానికి విధేయులై ఉన్న వోటర్లనూ రిజిస్టర్ చేయించుకోకుండా "కాంట్రాలు" అడ్డుకొని చంపివేశారు! ఆర్తిగో బహుశా "పులి" మీద విశ్వాసంతో మోసపోయి, న్యాయంగా జరిపించిన ఎన్నికలలో 'మేకలను' కాపాడు కోవడంలో విఫలమయ్యాడు! ఫలితాలు తారుమారు చేయగల విద్యలో ఓడిపోయాడు! రేపు సాల్వడార్ లోనూ, జమైకా లోనూ, ఎల్లుండి హోండూరాస్ లోనూ, అటుతర్వాత కోస్టారికాలోనూ కూడా అమెరికా మాట వినకపోతే జరగబోయే పని ఇదే! అధికారం సంపన్న కుటుంబాలకు మాత్రమే దక్కేవరకూ అమెరికా ఆగదు అయినా ఆపనులూ ఆ మేరకు

అప్రమత్తులయి ఉంటారు చర్చి కూడా కలిసి వచ్చినంతవరకూ నికరాగ్వా విప్లవం ఆగదు రైతాంగ ప్రజలను కూడగట్టి, సాంస్కృతికంగా, రాజకీయంగా చైతన్యవంతులను చేయడంలో మార్క్సిస్టులతోపాటు కలిసివచ్చిన నికరాగ్వా మతాధిపతులలో విమోచన కర్తలలో ఒకరు ఫాదర్ మోలినా. ఇందుకు మోలినా నెలకొల్పిన సంస్థ *"Misa Campesina"* **పోతే**, మెనీజెస్, జియొకోండా బెల్లీ సమర కవితలందించిన అమర కవితా మాతృమూర్తులు. "భావరసకోటి కాబోలు నీ వధూటి" అన్నట్టు సెక్యులర్ కవయిత్రిగా పేరొందిన బెల్లీ మానస కేదారంలో కదలాడుతున్న ఆ దేశం రూపమేవేరు తన శరీరమే దేశం, అందులోని అణువణువు రక్షణ, ఆత్మరక్షణ ఆమె మనస్సులో నిర్మించుకొన్న అనిర్వచనీయమైన ఆ ఆనంద మందిరాలను ఆదర్శ శిఖరాలనూ మనమూ ఒక్కసారి దర్శిద్దాం

*"Rivers run through me/mountains bore into body/and the geography of this country/ begins forming in me/turning me into lakes, chasms, rafines/earth for sowing love/opening like a furrow/filling me with a longing to live/to see it free, beautiful, full of smiles/ I want to explode with love "*

మార్చ్ 3, 1990

# ఆమె పరాధీన కాదు!

పాశ్చాత్య ప్రపంచంలో ఆలోచనా మథనంలో అనుభవశాలిగా పేరులోకి వచ్చిన మేధావి ఎడ్వర్డ్ డి బోనో *(Bono)* మనిషి ఆలోచనాశక్తిని పెంచడానికి, తప్పుతోవలు తొక్కే మేధస్సును మంచి మార్గానికి మళ్ళించడానికి కొన్ని ప్రయోగాలు చేశాడు! ఏ సమస్యనైనా పరిష్కరించడం కోసం ఓ కొత్త పద్ధతి కనిపెట్టాడు ఆరు రంగులలో ఆరు టోపీలు కనిపెట్టి వాటికి "మదనకామరాజు కథల" మాదిరిగా "ఆలోచనా మథన టోపీలు" *("Six Thinking Hats")* అని ముద్దుగా పేరు పెట్టాడు ఈ ఆరు టోపీల సహాయంతో మనస్సులను చిత్రికపట్టుకుని ప్రభుత్వాలూ, కంపెనీలూ, మేధావులూ లబ్దిపొందుతారని కొందరి నమ్మకం! విమర్శనా దృష్టిని పెంచుకోవాలంటే "బ్లాక్ హాట్", ఆశావాదం పెంచుకోవాలంటే "ఎల్లో హాట్", సృజనాత్మక భావపరంపర పరుగులు పెట్టాలంటే "గ్రీన్ హాట్", తాటస్థ్యానికి "వైట్", ఉద్రేకానికి "రెడ్ హాట్", నిష్పాక్షికమైన, నిరాసక్తమైన పరిశీలనకు ఆకాశపు నీలిరంగులో ఉండే "స్కైబ్లూ' ' హాటూ ధరించాలట! కాని విచిత్రమేమిటంటే - ఎన్ని ధరించినా మనస్సును తొలిచే పురుగును బట్టి బుద్ధిమార్పు ఉంటుంది అందుకే వేమన అనలేదూ - తలలు బోడులైన తలపులు బోడులా, అని! సామాజిక పరిస్థితులపైన, సాంఘిక పరిణామాలపైన, స్త్రీ -పురుష సంబంధాలపైన ఎవరో మామూలు వ్యక్తులు తమకు తోచినట్టుగా వ్యక్తపరిచిన భావాల ప్రభావంతో నిమిత్తం లేకుండా ఎలాంటి అవాకులు, చవాకులు ప్రేలినా జనం పట్టించుకోరు కాని దేశానికి ఉన్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రంగనాధమిశ్రా నవంబర్ 7వ తేదీన ఢిల్లీలో బ్రహ్మకుమారీల సంస్థ ఆధ్వర్యాన జరిగిన మహిళల సభలో ప్రసంగిస్తూ సమాజంలో మహిళల ప్రతిపత్తి గురించి చేసినట్టు చెబుతున్న వ్యాఖ్యలు పెద్ద విమర్శలకు దారితీయడమే గాక, మహిళా ఉద్యమ కార్యకర్తలు ఈ సమస్యపై సంతకాల ఉద్యమాన్ని ప్రారంభించేందుకు పురిగొల్పాయి 40 నిమిషాల ప్రసంగాన్ని ఆడియో టేపు సహాయంతో కొందరు సుప్రీంకోర్టు సీనియర్ మహిళా న్యాయవాదులు, "మానుషి" సంపాదకురాలు శ్రీమతి మధుకిష్వార్, సుప్రసిద్ధ న్యాయవాది రాజీవ్ ధవాన్ ప్రభృతులు శ్రీ రంగనాధమిశ్రా భావాలను తూర్పారపట్టవలసిన అవసరం వచ్చింది ఇంతకూ శ్రీ మిశ్రా ప్రసంగంలోని కీలకాంశాలు ఆయనలో అజ్ఞాతంగా దాగివున్న సంప్రదాయబద్ధమైన కొన్ని ప్రగతి విరోధ భావాలకు నిదర్శనం మరొక్కసారి ఆయన "మనువు"ను గుర్తుచేసి, పితృస్వామిక వ్యవస్థలో మనువు పాత్ర ఇంకా ముగియలేదని బోధించి, ఒక విధంగా మహిళా లోకాన్ని మరింత జాగరూకం చేస్తున్నారు! స్త్రీలు, ప్రతీరంగంలోనూ పురుషులతో పోటీపడరాదు, వంటింటి కుందేలుగా స్త్రీ మహాసమర్థురాలు, ఇంటిని మహిళ స్వర్గసీమగా మలచుకుంటే చాలు, పాత ధర్మశాస్త్రాలకు మళ్ళిపోయి అవి చెప్పినట్టుగా కుటుంబం లోనూ, సంఘంలోనూ ఆమె గొప్పదని గుర్తిద్దాం, తల్లిగా, తోబుట్టువుగా, చేసుకున్న భార్యగా స్త్రీ స్థానం స్త్రీకి ఇద్దాం, అంతేగాని పురుషునితో తగుదునమ్మా అని స్త్రీ సమానత్వం కావాలని పాకులాడడం తగదు, ఈ పోటీ మనస్తత్వాన్ని చాలించుకుని స్త్రీలు ఇతర రంగాలలో పనిపాట్లు కట్టిపెట్టి ఇళ్ళలోనే ఉండిపోవాలి - స్థూలంగా ఇవీ ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న శ్రీ మిశ్రా ఆలోచనలు పైగా మన "ధర్మశాస్త్రాల" ప్రకారం పురుషుని కంటే స్త్రీ వందరెట్లు గొప్పదని చెబుతూనే స్త్రీ "దేవతామూర్తి" అని కీర్తిస్తూనే మిశ్రా మహిళను ఇంటి బానిసగానే కేవలం చాకిరీకి తాకట్టుగానే

బతకమని బోధించడం -అనాదిగా మన చాందసులు విధించిన కృత్రిమ హద్దులలోనే తాను కూడా ఆలోచిస్తున్నట్లు అయింది అంతేగాదు, స్త్రీ పట్ల గౌరవ భావనతో అందమైన మాటలు వల్లిస్తూనే కుల, మత, సెక్స్‌పరంగా పౌరుల మధ్య ఎలాటి సాంఘిక, ఆర్థిక వివక్ష ఉండకూడదని చెబుతున్న రాజ్యాంగం మూడవ అధ్యాయం లక్ష్యానికే భిన్నంగా ప్రధాన న్యాయమూర్తి ఆలోచనసాగడం మరీ అభ్యంతరకరం! పైగా "సమానత్వం" అంటే అయన అర్థం చేసుకొన్న తీరుకూడా విచిత్రంగా ఉంది తండ్రి ఆస్తిలో, భర్త ఆస్తిలో పొందవలసిన సమానహక్కులకు భారత స్త్రీ ఇంకా ఎన్నోమైళ్ళ దూరంలో ఉన్న ఈ రోజున మిశ్రా "సమానత్వం అనే చట్రం" లో *(Frame of equality)* స్త్రీ పురుషుల్ని బంధించకుండా ఉంటేనే స్త్రీకి విలువ ఉంటుందట, పురుషునితో స్త్రీ పోటీ పడరాదంటూనే వాళ్ళ మధ్య "శ్రమ" ఒక బంధం అంటారు ఇది పరస్పర విరుద్ధమైన సూత్రీకరణ

భార్యకంటే భర్త ఎక్కువ అనటం వల్లనే స్త్రీ సమానత్వం పోయినట్టు భావించరాదట సమానత్వ భావాన్ని ఆయన సాంఘిక ఆర్థికాది రంగాలలో నేడు దళితులు, మహిళలు అనుభవిస్తున్న అనేక రకాల అత్యాచారాలు, వ్యత్యాసాల దృష్ట్యా పరిశీలించకుండా చౌకబారు అభిప్రాయాలు వ్యాప్తిచేయడం అభ్యంతరకరం "స్త్రీ మేల్కొంటే ప్రపంచం మేల్కొంటుంది' ' అన్న బ్యానర్‌ను ప్రస్తావించి, మీరు అయిదడుగులో-పదడుగులో పెరగవలసిన పనిలేదు, ఎక్కడున్నవాళ్ళు అక్కడనే (ఇంట్లోనే)ఉండిపొండని స్త్రీలకు ఉద్బోధించడం సనాతన భావాలు ఇప్పటికీ బట్వాడా చేయగోరే విద్యాధికుల పురుషాహంకారానికి, మకిలిపట్టిన మనస్సులకూ పరాకాష్ట! దేవుడు స్త్రీ పురుషులను సమానంగా సృష్టించలేదు కాబట్టి, స్త్రీ-పురుష వివక్ష చూపరాదన్న భారత రాజ్యాంగం ఆదేశం మానవ పరిణామ క్రమానికే విరుద్ధమైనదిగా మిశ్రా చెప్పడం న్యాయమూర్తి పదవికే కళంకం!

రాజ్యాంగం ఆదేశించిన "జండర్ ఈక్వాలిటీ" మానవ పరిణామక్రమానికి విరుద్ధమో కాదోగాని స్త్రీ విద్యా వ్యాప్తి కోసం, మూఢాచారాల నిర్మూలన కోసం, బాల్యవివాహాల రద్దుకోసం, స్త్రీ జన విముక్తి కోసం తద్వారా సంఘ పురోగతి కోసం మహోద్యమాలు నిర్మించిన రాజారామ్‌మోహన్‌రాయ్, టాగోర్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, వీరేశలింగం, గురజాడ, చిలకమర్తి, చలం వంటి సంస్కర్తల కృషిని మిశ్రా భావాలు బూడిదలో పోసిన పన్నీరుగా మారుస్తాయి! ఇటీవల సతీసహగమన దురాచారం మళ్ళీ తలెత్తినప్పుడు దానిని సమర్థించిన పీఠాధిపతులనుగాని, ఆచార్యులనుగాని నిర్బంధించడంలో ప్రభుత్వం విఫలమైంది కాబట్టే తొలివేదాలు, ఉపనిషత్తులు కూడా బోధించని ప్రగతి నిరోధక భావాలను హిందూమతం పేరిట కొందరు విద్యాధికులే పనిగట్టుకుని బోధించ సాహసిస్తున్నారు మిశ్రా భావాలు "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అన్న మన చిలకమర్తి మూర్తికి అవమానం ఇంతకూ భారత స్త్రీని అభ్యుదయపథాన్ని విడిచి ఇళ్ళకు మళ్లండన్న 'నీతి' బోధకు అసలు కారణం - ఆర్థిక పరమైన కోర్కెలతో స్త్రీ ముందుకు రావడమే, దాస్యవిమోచన కోసం ఉద్యమించడమే వరకట్నాలు, విడాకులు, అత్యాచారాలు స్వాతంత్ర్యానంతరం మరింతగా ప్రబలిపోవడంతో, వరకట్న హత్యలు పెరిగిపోవడంతో మహిళా ఉద్యమాల ద్వారా స్త్రీ మరింత చైతన్యం పొందుతోంది "సరిత" కేసులో హైకోర్టు న్యాయమైన తీర్పును సుప్రీంకోర్టు కాలదన్నడంతో మహిళ తిరుగబడవలసి వచ్చింది ఏ ఆస్తి హక్కుతో పురుషుడు తన ఆధిపత్యాన్ని కాపాడుకోడానికి చూస్తున్నాడో అదే హక్కును మహిళ కూడా ఈ అసమ

సమాజంలో ఒక కవచంగా పెట్టుకోవాలని కోరుతోంది ఇదే, పితృస్వామిక వ్యవస్థలోని నేటి విద్యార్థికుల మనస్సులను కల్లోలపరుస్తున్న కీలకాంశం! కులవ్యవస్థతో తీసుకుంటున్న మన దేశానికి ఆ వ్యవస్థలోని మాలోకాన్ని ముందు తొలగించుకొంటే తప్ప వ్యత్యాసాలు లేకుండా అందరికీ ఒకే ధర్మంగా వర్తించే "సివిల్ కోడ్" రూపొందదు! ఆ "కోడ్"కు మనం చేరాలంటే హిందూ ధర్మశాస్త్రాన్నే కూలంకషంగా సంస్కరించుకోవడం మొదటి గ్యారంటీ! అంబేద్కర్ చెప్పింది కూడా అదే! రెండువందల ఏళ్ళనాడు ఫ్రెంచి విప్లవం, దైన్యస్థితిలో ఉన్న బలవంతపు కాపురాలలో విడాకులు మంజూరుచేసే వ్యవధిని మూడుమాసాలకు కుదించింది అయినా మనమింకా ఆ వ్యవధిని మూడేళ్ళకు పైగానే అట్టిపెట్టాం! ఈ విషయంలో కౌటిల్యుడు సమ్మతించినా, పరాశరస్మృతి ఒప్పుకొన్నా వీలుపడదనే మూఢులున్నారింకా! ఆస్తిపై స్త్రీ హక్కును బృహస్పతి ఖరారు చేసినా, బుట్టలోకి నెట్టే ప్రబుద్ధులున్నారు! చివరికి వీరసావర్కార్ కూడా మనుధర్మ సూత్రాలను హిందూదళితులకూ, హిందూ స్త్రీలకూ వర్తింపజేయడాన్ని వ్యతిరేకించాడు! ఎందుకని? నాటి కుల వ్యవస్థ నిబంధనల పరిధిలో మాత్రమే వాటిని మనువు క్రోడీకరించాడు కాబట్టి, కులాంతర వివాహాలను కూడదన్నాడు కాబట్టి, వివాహ వ్యవస్థ చట్రంలో స్త్రీని బలిపశువుగా మార్చాడు కాబట్టి, శూద్రులు, స్త్రీలూ వేదాలు వినరాదు, చదవరాదన్నాడు కాబట్టి, విన్న వాళ్ళ చెవుల్లో సీసం కరిగించిపోయమన్నాడు కాబట్టి! 1500 సంవత్సరాలనాటి పిచ్చిపనులు ఇంకా మళ్ళీ మనకొద్దు! నేటి మహిళ పరాన్న భుక్కుకావడానికి ఇష్టపడడంలేదు, పరాధార స్థితిని ఏవగించుకొంటోంది ఆ స్వయం పోషక భావన ఇన్ఫ్లేషన్ భారాన్ని మోస్తున్న కుటుంబాలకేకాదు, దేశాభివృద్ధికే పట్టుగొమ్మ! అందుకు విద్యార్థికులు ఆమెకు తోడునీడగా నిలవాలి, అయినా ఎవరి తడికి రాయబారం' కోసమూ ఆమె ఎదురుచూడదు "ది సెకెండ్ సెక్స్"లో సిమన్ ది బోవిర్ అనలేదూ *"Once she ceases to be a parasite, the system based on her dependance crumbles, between her and the universe there is no longer any need for a masculine mediator"!!*

నవంబర్ 25, 1990

# అనంతం, అవిశ్రాంతం....!

యాత్రా సాహిత్యం ఒక ప్రత్యేక ప్రక్రియకాగా, సామాన్యుల జీవితాలలోని వెలుగునీడలను, సుఖదుఃఖాలను, అనంత సాధక బాధకాలను, వారి రాగద్వేషాలను, ప్రేమానురాగాలను, మొండిబతుకులను, గుండె లోతులను వాస్తవ రేఖా చిత్రాలుగా ప్రత్యక్ష సాక్షులుగా చూపే రచయితల కలాలనుంచి వెలువడే యాత్రా విశేషాలకు మరింత ప్రత్యేక స్థానం ఉంటుంది 'సిద్దడు' వేమారం వెళ్ళనూ వెళ్ళాడు, రానూ వచ్చాడంటే సరిపోదు, తంపులమారి నారదుడు మాత్రం చూడలేదా, అనలేదా - "చూచితి పెక్కు దేశముల జూచితి పెక్కు ధరాతలేశులం/ జూచితి పట్టణావళుల జూచితిగాని ధరాతలంబునం/నీ చతురత్వ వైభవ మనీష మహాతిశయ ప్రతాపమున్/గోచరకోటికిం దెలిసి కోరి నుతింప నగోచరం బగున్" అని! ఏ రాజును పొగిడో, అతని బంటును తెగిడో కాలక్షేపం చేసే యాత్రికులు, రయయిత యాత్రికులూ ఈనాటికీ ఉన్నారు! అలానే హెన్రీ డేవిడ్ థోరే అన్నట్టు, కొండను తవ్వి ఎలుకను పట్టినట్టుగా ఏ జాంజిబార్‌లోనో పిల్లుల్ని లెక్కపెట్టడం కోసమని ప్రపంచ యాత్ర చేయనక్కర లేదని ఒక సామెత *("It is not worth while to go around the world to count the cats in Zanzibar")!* ఏ జస్టిస్ రంగనాథ మిశ్రాలాంటి వారో అడ్డుతగలకపోతే, (అడ్డుతగిలినా మబ్బుతెరలను, 'పర్దా' పొరలను చీల్చుకు రాగలిగిన) తన యాత్రా సాహిత్యం ద్వారా సామాన్య ప్రజల జీవన సమరాన్ని, చరిత్ర గతిలో మత సామరస్య విలువలను పట్టణ గ్రామసీమలలోని సాధారణ పాత్రలచే నోరారా చెప్పించి జాతీయ సమైక్యతకు, సమన్వయ సంస్కృతికీ దోహదం చేస్తున్న అనీస్‌జంగ్ లాంటి మహిళా రచయితలు మనకెందరో అవసరం! ఆఖరి నిజామ్‌కు ప్రధాన సలహాదారులలో ఒకరైన తండ్రి నవాబ్ హోషయార్ జంగ్ ఉమ్మడి సంస్కృతిలో పెరిగి, "పర్దా" నుంచి బయటపడి, ఉస్మానియా, మిచిగన్ (అమెరికా) యూనివర్సిటీలలో విద్య నభ్యసించి ప్రపంచాన్ని తన ఇల్లుగానూ, తన దేశమైన ఇండియాను మినీ ప్రపంచంగానూ భావించి, విశ్వ సంస్కృతిలోని మేలిమి గుణాలన్నింటినీ పొదిగిన అనీస్‌జంగ్ సృష్టిస్తున్న యాత్రా సాహిత్యం ఒక విలక్షణమైన సాంఘిక చరిత్ర, నడుస్తున్న చరిత్ర, జీవితంలోని నటనను ఎండగట్టి, నడక తీరును దిద్దితీర్చడానికి ప్రయత్నిస్తున్న రచనా స్రవంతి అది ఇటీవల కాలంలో ఆమె రాసిన "అన్‌వీలింగ్ ఇండియా" గానీ, "ది సాంగ్ ఆఫ్ ఇండియా" గానీ భారతీయ సమాజంలో అట్టడుగు ప్రజలు, అతి సాధారణ జీవులు ఎదుర్కొంటున్న రకరకాల సమస్యలకు (తిండి, వసతి, ఉపాధి, చదువుసంధ్యలు) సామాన్యుల మాటలలోనే అద్దం పడుతున్న రచనలివి. తన తల్లిదండ్రులు యాభై ఏళ్ళు కాపురం చేసిన సంగారెడ్డిలో చిన్ననాటి ముచ్చట్లు ఏకరువు పెట్టడంతో పాటు, హిందూ-ముస్లిమ్‌లు మతసామరస్యంతో బతికిన ఆనాటి దినాలను కూడా తలచుకోవడంతోపాటు - ఉత్తర, దక్షిణ భారతాలలోని పెక్కు ప్రాంతాలలో తాను జరిపిన పర్యటనలలో మాట-మంతి, అనుభవాలను ఈ రెండు రచనలూ మనకు అందిస్తున్నాయి పదిమంది గొప్పవాళ్ళను కలుసుకొని వారి అభిప్రాయాలకు అక్షరరూపం ఇవ్వడం గాకుండా, తాను కలుసుకున్న ప్రతి సామాన్య భారతీయ స్త్రీ, పురుషుల గుండె గొంతుకులను అక్షరబద్ధం చేయడం - అనీస్‌జంగ్ యాత్రా రచనలలోని విశేషం. కుల మతాలు, సమాజ జీవితంలో వాటి పాత్ర, వివాహాలు, వైధవ్యాలు, పనిపాటులలో స్త్రీ-పురుష వివక్ష, దారిద్ర్య పరిస్థితులలో సంతానం, పనులు చేసుకుంటూనే పిల్లలను సాకడంలో

స్త్రీలు పడుతున్న ఇబ్బందులు, సాంఘిక వివక్ష తదితర దోపిడీ పద్ధతులనూ వివిధ వాస్తవ పాత్రలద్వారా తన రచనలకు వస్తువుగా మలచుకుంది అంతేగాదు, కొన్ని సందర్భాలలో పరిస్థితుల ప్రభావం వల్లనో, లేదా చట్టాల వల్లనో లేదా మహిళా ఉద్యమాల ధాటివల్లనో క్రమంగా మెరుగుపడుతున్న స్త్రీ-పురుష సంబంధాల గురించీ, వివాహ బంధంలోని ఆనందానుభూతుల గురించే, పనికారాని కొన్ని సంప్రదాయ బంధాలను, కుల మత కట్టుబాట్లు, ప్రగతి నిరోధకమైన కర్మకాండలను వదిలించుకోవడం గురించికూడా అనీస్ ఇందులో సామాన్య స్త్రీల మాటల్లో ప్రస్తావించారు హైందవ, ఇస్లామ్ మతాలలోని మంచి సంప్రదాయాలను గుర్తిస్తూనే, చాందసభావాలకు ప్రజలు దూరం కావలసిన అవసరాన్ని కూడా తన వాస్తవ పాత్రలద్వారా ప్రపంచానికి చాటారు భిన్న జాతుల మధ్య సఖ్యతకు సేతువు కావలసిన పండుగలు పబ్బాలు, మతపరమైన ఉత్సవాలు అనైక్యతకు, విభజనకూ మార్గం తీయడాన్ని అనీస్ ఏవగించుకుంటుంది మానవ సంబంధాలను పెంచి, మానవత్వాన్ని ప్రతిష్ఠించే భిన్న మతాలలోని సత్సాంప్రదాయాల పట్ల అపారమైన గౌరవం ప్రదర్శించే అనీస్ జంగ్ నిరంతర పధికురాలు కాలిడిన ప్రతి గడప ఆమెకొక వింత అనుభవం కలిగించింది, మెట్టిన స్థలాలు, ప్రాసాదాలు, పూరిపాకలు, పవిత్ర యాత్రాస్థలాలు, కలుసుకున్న సామాన్య ప్రజలూ ఆమెలో వింత అనుభూతికి కారణమయ్యాయి "మగవాడు తిరగక చెడ్డాడు, ఆడది తిరిగి చెడింద"న్న సామెతకు ఇక కాలం చెల్లిందనడానికి సాక్ష్యం మనకు జస్టిస్ రంగనాధ మిశ్రా కాదు, అనీస్ జంగ్ మాత్రమేనని మరువరాదు! అనీస్ రచనలు స్వీయచరిత్రకాదు, ఒక పట్టణానికో, నగరానికో, గ్రామానికో పరిమితమైన స్కెచెస్ కావు, "పూటబత్తెం పుల్లవెలుగుగా" రెక్కాడితేగాని డొక్కాడని జీవులే కాదు, రెక్కాడినా డొక్కాడని ఆర్థిక వ్యవస్థలో కుంగిపోతున్న బడుగు జీవుల బతుకుల్లోకి తొంగిచూస్తూ స్పందిస్తున్న చేవగ్గల మహిళా రచయిత అనీస్!

అనీస్ జంగ్ మనం గిరిగీసి పెట్టే "ఫ్రేమ్" లో ఇమిడే వ్యక్తి కాదు, పరిమితులెరిగిస స్వేచ్ఛాజీవి, అరమరికలు లేని రచయిత్రి, తాను ఎవరి జీవితాలలోకి తొంగి చూడదలచిందో, ఎవరి సుఖదుఃఖాల సరిగమలను వినిపించదలచిందో వారితో కలివిడిగా ఉంది, "కూర్చోను మా ఇంట కురిసీలు లేవ"ని చెప్పిన బడుగు జీవులతో పడుగు పేకై మసలిన రచయిత్రి నిజజీవితంతో పాలు పంచుకోవడం ఆమెకు ఇష్టం ఎందుకని? ఎదుటి జీవితో, ముఖ్యంగా బడుగుజీవితో ఈ మమేకతను, అనుభూతిని పంచుకోని స్వేచ్ఛ నిరర్థకమనీ, అసంబద్ధమనీ, అసత్య జీవనమనీ భావిస్తుంది అనీస్ బాల్యంకూడా అడ్డుగోడలు ఛేదించుకు ముందుకు దూకుతుంది, ఇక పుష్పవనాలు ఎంతమాత్రం రాజుల, రారాజుల, ఫ్యూడల్ ప్రభువుల ఉద్యానవనాల సొత్తు కాజాలవు, యువతులకు బేడీలు వేయలేరు అంటుంది. కలివిడితనమే కాలజ్ఞానమంటుంది *("Even freedom without sharing becomes abstract and unreal")!!* ప్రతీ సంఘటనకు స్పందించే మనస్సు ఆమెకుంది ఒక హత్యానో, ఓ దుర్ఘటననో, ఓ దురాగతాన్నో వినోదంగా చూసే ప్రేక్షకులు ఆమెకు శత్రువులు ఢిల్లీలో ఓ ఘటనకు స్పందిస్తూ అనీస్, వైద్య సౌకర్యం అందక విలవిలలాడుతూ మన ఉనికిని ప్రశ్నిస్తూ మరణ శాసనం లిఖించుకున్న ఓ అతి సామాన్య మహిళ నుద్దేశించి రాస్తూ -"అక్కడెక్కడా విషాద ప్రకటన లేదు, విచారముద్ర లేదు, గత స్మృతులు అసలే లేవు కర్మకాండలతో నిమిత్తం లేకుండా మరో సాధారణ మానవ జీవితం అజ్ఞాతంగా ఇలా ముగిసిపోయింది" అని విలపించింది! అనీస్ ఆవేదనకు పూర్వరంగం ఉంది తల్లి పేగు బంధం తెంచుకొని పుట్టినప్పుడు అనీస్ పెట్టిన గావుకేక -

పీడితుల కేకలను కూడా వినిపించుకునే మనస్తత్వాన్ని ఆమెలో పెంచింది! బాధ పల్లవిగా మారాలి, పాటపాడే వాళ్ళే కలలు కంటారట, ప్రతీ కల అగ్నికీల కావాలట! స్వయంగా తానే కవయిత్రి అయిన అనీస్ ఆర్ద్రతను పెంచిన శక్తి ఆమెలోని సంగీతాభిరుచి కుమారగంధర్వ గొంతు వింటే ఆమె ప్రాణం లేచి వస్తుంది, విలాయత్‌ఖాన్ సితార్ వింటే చలించిపోతుంది, రామ్‌నారాయణ్ "సారంగి" మోడెత్తిన భావాలను మోసులెత్తిస్తుంది, మానవుని అంతర్వేదనకు సరిగమలు పెట్టిన తన మిత్రుడైన రాఘవ మీనన్ పాటలన్నా చెవికోసుకుంటుంది, బిస్మిల్లాఖాన్ షెహనాయ్ స్వరాలు ప్రత్యూషకాలంలో పిల్లతెమ్మెరలతో సయ్యాటలాడే సరాగాలు ఆమె దృష్టిలో! కనుకనే, ఆమె విశాల దృష్టికీ, విశ్వమానవతా దృక్పధానికీ గుర్తింపుగా వచ్చిన "హార్మొనీ అవార్డు" ఓ గొప్ప పురస్కారం! అనీస్ రచనలతో పోల్చదగినది - రమా మేల్కోటే ప్రభృతులు "స్త్రీ శక్తి సంఘటన" ఆధ్వర్యంలో ఇటీవల కాలంలో వెలువరించిన "మనకు తెలియని మన చరిత్ర"! అనీస్ వాస్తవ పాత్రలైన బలకేశ్వర్, రుక్మావా, లల్లన్‌బాయ్, సోసామరియమ్మ, గ్యాన్‌సింగ్, కళాకారుడు గణేష్ గీసిన చిత్రం "కాళరాత్రి" *("The night has many tones")*, చర్మకారుడు రాజుమిస్త్రీ, చౌకీదార్ షాదేవ్, రూప్‌కన్వార్ జీవన ప్రతిబింబాలు ప్రసిద్ధ జర్మన్ రచయిత హెన్రీ హీనె *"Where will the travel-weary find his (her) last resting place?"* అని ప్రశ్నించాడు! నిత్య మంగళం నిర్దేశించేవారికి, నిత్యపధగాములకూ అన్వేషణ అనంతం, అవిశ్రాంతం!

జనవరి 1, 1980

# "సూర్యపుత్ర నమస్తేస్తు...."

ఈ రోజు, ఆగస్టు 24, ఖగోళశాస్త్రానికి తోడుగా, రోదసీ పరిశోధనాశాస్త్రానికి నీడగా ఇప్పుడిప్పుడే వర్ధిల్లుతున్న గ్రహాంతర విజ్ఞానశాస్త్రం ముత్యాలముగ్గులు పెట్టుకొనే రోజు! మానవుడు తన విజ్ఞాన పరిధులను 21వ శతాబ్దిలోకి మెడలుచాచి విస్తరించుకోబోతున్న సుదినం!

ఈ రోజు, ఇరవయ్యేళ్ళనాడు మానవుడు చంద్రమండలాధినేతగా ప్రకటించుకున్న తరువాత ప్రకృతిపై సాధిస్తున్న విజయపరంపరలో మరో ముఖ్యఘట్టానికి 'పురోహితుడ'వుతున్న శుభదినం!

ఈ రోజు, అనేక వెలుగునీడల మధ్యనే కడచిన ముప్పయ్యేళ్ళుగా రోచిస్సులు చిమ్ముకుంటూ ఎదిగివచ్చిన రోదసీ శకంలో మరో శుభముహూర్తం!

ఈ రోజు, సౌరకుటుంబ రహస్యాలను ఛేదించే విజ్ఞాన యాత్రలో మలి మజిలీ!

అదే, ఈ రోజు - గత పన్నెండేళ్ళుగా ముందుచూపుతో దూసుకుంటూ, కనిపించని విశ్వరహస్యాలను ఛేదించుకుంటూ జైత్రయాత్ర సాగిస్తున్న, మానవ నిర్మితమైన "వాయేజర్-2" అంతరిక్ష నౌక సౌర కుటుంబంలో అష్టమ గ్రహమైన 'నెప్ట్యూన్' ను సమీపిస్తున్న సుదినం, అది, ఆ సమాగమాన్ని సుసాధ్యం చేసుకుంటున్న 'సుమంగళి'! నీలి - ఆకుపచ్చ రంగులో ఉండే 'నెప్ట్యూన్' సూర్య'పుత్రు'లలో ఒకటి కాబట్టి (నవగ్రహాలలో) దానిని వాయేజర్ రోదసీ నౌక "వలీముఖ నమోస్తుతే/సూర్యపుత్ర నమస్తేస్తు" అని నమస్కార బాణాలు వదులుతూ అతి దగ్గరగా ఇక కొలది ఘడియలలో సమీపిస్తున్నది

ఈ సమాగమాన్ని సాధించిన శాస్త్రవేత్తలకు ఈ శుభసమయంలో యావత్తు మానవాళి అభినందనలూ, ఆశీస్సులూ తెల్పాలి ఎందుకంటే, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధ్యమవుతున్న ప్రతి ఘనవిజయమూ అజ్ఞాతదశలలోని మానవుణ్ణి పీడిస్తున్న మూఢ విశ్వాసాలను చెల్లాచెదురు చేస్తోంది ఒకనాడు ఈ విశ్వానికంతకూ భూమే కేంద్ర బిందువనీ, అది ఒక తార అనీ, దాని చుట్టూ ఇతర గ్రహాలన్నీ తిరుగుతుంటాయనీ, భూమి గుండ్రంగా కాక, బల్లపరుపుగా ఉందనీ విశ్వసించడమే గాక, కాదన్న వాళ్ళను కొరత వేసిన మౌఢ్యం గెలీలియో, కోపర్నికస్‌ల పరిశోధనలతో మంటకలసిపోయింది, చిన్నప్పుడు ముసలమ్మల కథలలోనూ, పాఠాలలోనూ చంద్రునిలో ముసలమ్మ రాట్నాన్నో, జింకనో పిల్లలకు చూపించిన మూఢమతులు నీల్ ఆమ్‌స్ట్రాంగ్ ప్రభృతులు చంద్రమండలంపై కాలుమోపి, చంద్రశిలలను వెంట తీసుకురావడంతో నోళ్ళు కుట్టుకోవలసి వచ్చింది, డెబ్బయి తొమ్మిదేళ్ళనాడు మహాకవి గురజాడ "దూరబంధువు"గా తలచి, భూమికి ఆహ్వానించిన "హైలీ కామెట్" మూడేళ్ళనాడు మళ్ళీ దర్శనమిచ్చి, విజ్ఞాన శాస్త్రవేత్తలకూ, పామరులకూ మరిన్ని జ్ఞాన సుధలను పంచి, మనస్సులను విశాలపరిచింది ఈ రోజున సూర్యుడు కేంద్ర బిందువుగా పరిభ్రమించే నవగ్రహాలలో ఎనిమిదవ గ్రహంగా ఉన్న 'నెప్ట్యూన్' ఉపరితలానికి చెందిన పెక్కు రహస్యాలను

---

*అంతరిక్షనౌక వాయేజర్ - 2 సౌరకుటుంబంలోని ఎనిమిదవ గ్రహం 'నెప్ట్యూన్'ను 1989 ఆగస్టు 24న సమీపిస్తుందనుకున్నారు కాని అది 25న సమీపించింది*

-రచయిత

సంకేతాల ద్వారా, ఛాయాచిత్రాల ద్వారా వాయేజర్-2 వెల్లడిస్తుంది సౌర కుటుంబ రహస్యాలను బట్టబయలు చేయడానికి ఇరవైరెండేళ్ళ నాడు (1977) ప్రారంభమైన ఈ మహాప్రస్థానం నవగ్రహాలలో ఆఖరిదైన "ప్లూటో" పుట్టుపూర్వాలను కూడా వెల్లడించేంత వరకూ ఆగబోదు! అయితే "వాయేజర్-2"కు ముందు బయలుదేరిన "వాయేజర్-1" అంతరిక్ష నౌక యాత్రకంటే ఈ రెండవ నౌక యాత్ర మరింత విశిష్టమైనది ఎందుకంటే, జూపిటర్ (గురు), శాటర్న్ (శని), యురేనస్, నెప్ట్యూన్ గ్రహాల గతులు 1977 నుంచి అనుకూల స్థానాల్లో ఉంటాయని, పరిశోధనలకు వీలు చిక్కిందనీ శాస్త్రవేత్తలు నిర్ణయించి, ఈ వాయేజర్‌లను వదిలారు ఈ అవకాశం, ఈ గ్రహానుకూల్యం మానవునికి (శాస్త్రవేత్తలకు) మళ్ళీ 2155వ సంవత్సరందాకా కలగదు పైగా 'నెప్ట్యూన్' 2011 నాటికిగాని సూర్యునిచుట్టూ పరిభ్రమణం ముగించుకుని తన స్థానానికి చేరుకోదు! అందువల్లనే వాయేజర్ల ఈ తొక్కిసలాట! ఆ ముహూర్తాన్ని అందుకోవాలి ఎంత దగ్గరగా గ్రహానికి చేరువైతే అంత తేలికగా గ్రహ వాతావరణాన్నీ, అక్కడి "ప్లాస్మా" వాయుచలనాన్నీ, గ్రహ పరిసరాలలోని అయస్కాంత ధృవాల పట్టు విడుపులనూ పరీక్షించి ఆ తబిశీళ్ళను రోదసీ నౌక కిందికి పంపడానికి వీలుపడుతుంది అయితే వాయేజర్-1 యాత్రను యురేనస్, శాటర్న్ గ్రహగతుల పరిశీలన వరకే (సమీప దూరంలో) పరిమితం చేశారు నెప్ట్యూన్‌ను ఇది సమీపించగలిగితే గాని సమాచారం పంపలేదు కనుకనే అది నెప్ట్యూన్ కక్ష్యను దాటి వెళ్ళలేకపోయింది ఎక్కడో దూరదూరంగా ప్రయాణిస్తూ అనంత విశ్వంలోకి వెడుతోంది కాగా "వాయేజర్-2" నిర్దేశిత ఘడియలో పరిభ్రమణంలో ఉన్న నెప్ట్యూన్‌కు 3,000 మైళ్ళ సమీప దూరానికి నేడు చేరుకుని తనకు అప్పగించిన పనిని పూర్తి చేస్తుంది ఆ దారిలో మరికొంత దూరమైనా 'నెప్ట్యూన్'కు ఉపగ్రహాలుగా ఉన్న ఇద్దరు "చంద్రుల"నూ - ట్రైటాన్, నెరీడ్-పరామర్శించుకుంటూ పోతుంది! ఈ ప్రయోగం మరొక పరిశోధనకు మార్గం సుగమం చేయబోతోంది రోదసీ నౌకల యాత్రాకాలాన్ని కుదించి, ఆ యాత్రలను మరింత సుకరం చేసేందుకు వీలుగా గురుత్వాకర్షణ సహాయక శక్తులను *(gravitational assistants)* పెంచుకొని వేగాన్ని పుంజుకోగల నౌకలను రూపొందించబోతున్నారు! సూర్యునికి ఇతర గ్రహాలకంటే దగ్గర దూరంలో ఉన్నందుననే సమశీతోష్ణస్థితి భూమికి అనుకూలమైంది ఆ స్థితి సూర్యునికి రెండువందల కోట్ల మైళ్ళ దూరంలో ఉన్న నెప్ట్యూన్‌కు లేదు అక్కడ తగిన వెలుతురు లభించదు అక్కడి కాంతి సాంద్రత *(light levels)* భూమి చుట్టూ ఉండే వెలుతురు కంటే వెయ్యిరెట్లు తక్కువ. అందువల్ల సౌరశక్తి రోదసీ నౌకకు కూడా కావలసినంత తాపశక్తిని అందించలేదు అలా, అలా పోయినకొద్దీ, రేపు "ప్లూటో"ను సందర్శించబోయే మరో రోదసీ నౌకకుకూడా ఆ గ్రహం సూర్యునికి ఇంకా ఎక్కువ దూరాన ఉంటుంది కాబట్టి - ఈ సమస్య ఎదురవుతుంది కాంతి కావలసినంత లేనప్పుడు, రెప్పపాటులో (సెకండుకు) 20 మైళ్ళ వేగంతో నౌక ప్రయాణిస్తున్నప్పుడు తీసే ఛాయాచిత్రాలు ఎలా ఉంటాయో చూడాలి నౌక, భూమి నుంచి దూరమవుతున్న కొద్దీ సిగ్నల్స్ మందగిస్తాయి బొమ్మల స్పష్టత తరుగుతుంది "లాంగ్ ఎక్స్‌పోజర్స్"కు కనీసం ఆ సమయంలో నౌకకు 15 సెకండ్ల వ్యవధి అయినా కావాలిట! అలాంటి ఇబ్బందులేమైనా ఉంటే సరిచేయడానికి సందేశాలిస్తారు! ఈ రెండు వాయేజర్ల గతి, అవి సౌర కుటుంబ వ్యవస్థను దాటిపోయిన తరువాత అంతగా తెలియకపోవచ్చు కాని అంతవరకూ సమాంతరంగా ప్రయాణిస్తున్న వీటిని గురించి మన మువ్వక్షేత్రయ్య మరో సందర్భంలో అన్నట్టుగా "ఇద్దరి వలెనే గూడి -

ఎవరున్నారు తెల్పరా" అని మనమూ పదం పాడుకోవలసి వస్తుంది! వాయేజర్ నౌకల నుంచి సిగ్నల్స్ ఈ రోజుతొనే ఆగిపోవు, 21వ శతాబ్దంలో కూడా కొన్ని సంత్సరాలపాటు మనకు అందుతూనే ఉంటాయి! ఆనాటికిగాని (2011-లేదా 2155?) ఈ నౌకలు సూర్యుని ప్రభావ పరిధుల పొలిమేరలు *(Heliopause)* దాటిపోయి, మన నక్షత్ర రాశిలో కలిసిపోయి ఆ దివ్య సాగరంలో ఓలలాడుతూ, తెప్పల్లా తేలిపోతూ అనంతంలో కలసిపోతాయి అంతదాకా నిత్యంగా, నిత్యచేతనంగా "నిత్యోనిత్యానాం/చేతన శ్చేతనానాం" అనుకుంటూ పోతాయి! గాఢ తిమిరంలో గ్రహగతులను ఈ మానవ నిర్మిత నౌకలు తిమిరంతో సమరంలో రాజీపడి రాలిపోతాయో, పోటీపడి అజరామరమవుతాయో చూడాలి!!

ఆగస్టు 24, 1989

# ఆ అపూర్వ క్షణాలు.....

మానవుడి స్థితిలయాలను, వైభవ పతనాలను అతని పురోగతినీ తాత్వికార్థంలో అక్షరబద్ధం చేసిన మహాకవి శ్రీశ్రీ - పరమాణువు సంకల్పంలో ప్రభవం పొందిన ఆ మానవుడు ఎలా ఆలోచనలుపోతాడో, ఎలా అనునిత్యం అన్వేషణలో గడుపుతాడో, కవితలో, శిల్పంలో, పురుగులో, పుష్పంలో, మెరుపులో, మేఘంలో ఎలా సౌందర్యాన్ని ఆరాధిస్తాడో, విజ్ఞానధనిగా, భావధునిగా ఎలా అవతరిస్తాడో రసమయంగా వర్ణించాడు  రాశీ చక్రగతిలో, నేడు (ఆగస్టు 7వ తేదీన) అటువంటి అన్వేషణలో వంద సంవత్సరాలకు ఒక్కసారి మాత్రమే వచ్చే రసవత్తరమైన ఘటన రాబోతోంది  అది మానవ మేధస్సు ప్రకృతిని ఆలంబనం చేసుకొని సంఖ్యాశాస్త్రంలో సాధించిన అపూర్వమైన సమ్మేళనం, గణిత శాస్త్రానికి సాంస్కృతిక సంబంధమైన మైత్రిని, సామాజిక దృక్పథాన్ని కలిగించుతున్న మధుర క్షణాలివి  నూరేళ్ళకు ఒక్కసారి మాత్రమే సహజ సుందరంగా దర్శనమిచ్చే ఈ అంకెల (సంఖ్యల) సమాహారంలో విశేషం - ఈ రోజున, 1990 ఆగస్టు 7వ తేదీన అపరాహ్ణ సమయంలో 12 గంటల 34 నిమిషాల 56 సెకండ్లకు ఈ సంఖ్యా వినోదం జరగనుండడం  నేడు కంప్యూటర్లకు ప్రాణప్రదమైన "బైనరీ లాస్"కు మూలమైన రెండంకెలతోనే"01" ఈ అపూర్వ క్షణాలు మనకు వినోదం చేస్తాయి  పూర్ణాంకాలకు అసలైన పరిపూర్ణత తెచ్చే సుదినం ఇది  ఎలా? అంకగణితంలో ఒకటినుంచి పదిదాకా బారులుతీరి నిలబడే సంఖ్యలన్నీ- ఈ రోజున ఒక్కక్షణం సేపు ఒకే వరుసలోకి వచ్చి విందుచేస్తాయి! అదే-12 34 56 7 8 90 వరుస "సున్న" సహా ఆఖరి నాలుగంకెలూ (7 8 90) ఏడవ తేదీ, ఎనిమిదవ మాసం, తొంభయ్యవ సంవత్సరం  నిజంగా ఇది సంఖ్యా శాస్త్రంలో, రాశి చక్రగతిలో మధుర క్షణాలు, సౌందర్యక్షణాలు  ఇది ఆగస్టునెలలో సంభవించిన మహద్ఘటన  ఆగస్టు మాసం పండగలకు, పబ్బాలకూ, చరిత్రలో అనేక విశిష్ట ఘట్టాలకూ (మన స్వాతంత్ర్య దినోత్సవానికీ, రాజకీయ స్వాతంత్ర్య సాధనకు పూర్వరంగాన్ని సిద్ధపరిచిన "క్విట్ ఇండియా" ఉద్యమానికి సహా) విశిష్టమైనది కావచ్చుగాని సంఖ్యాశాస్త్రంలో ప్రకృతికీ, మానవప్రకృతికీ, మానవేతర ప్రకృతికీ మధ్య అవినాభావ సంబంధాన్ని క్షణం సేపు అనుభవింపజేసే అపురూప సన్నివేశం ఈ అంకెల సమ్మేళనం! బెర్ట్రాండ్ రసెల్ ఒక సందర్భంలో పేర్కొన్నట్టుగా మానవ వికారాలకు, ప్రకృతిలోని ఆటుపోటులకు దూరంగా ఒక క్రమబద్ధమైన విశ్వాన్ని గణితం మనకు ప్రసాదిస్తున్నది కాబట్టే, మానవుడు నిత్యజీవనంలో, నిత్యవ్యాపకాలలో అంకెలకు దూరంగా, లెక్కకు దూరంగా - సంఖ్యాతీతంగా మనలేకపోతున్నాడు  అంకెను నాలుగువేల ఏళ్ళ నాటి సమాజాలు, నాగరికతలు అపురూపంగా భావించి, గణితశాస్త్రంలో "సంఖ్య" ను గొప్పముందంజగా పేర్కొనవలసి వచ్చింది  ఇండియా, ఈజిప్టు, బాబిలోనియా, చైనాలు గణిత శాస్త్రానికి, సంఖ్యాశాస్త్రానికీ తొలి పూజలు చేసిన దేశాలలో అగ్రస్థానంలో ఉన్నాయి  గణితంతో నిమిత్తం లేని, అంకెలతో ఊసులేని భౌతికశాస్త్ర, విజ్ఞాన శాఖలేవీ మనకు దొరకవు  లెక్కలకున్న విశిష్టత అది. ఇటీవల బీజింగ్‌లో జరిగిన అంతర్జాతీయ మాథమాటిక్స్ ఒలింపియాడ్‌లో విశిష్ట పతకాలు పొందిన వర్ధిష్ణువులయిన నలుగురు చిరంజీవులూ తమ విజయానికి ఒకవైపు ఉప్పొంగిపోతూనే మరొకవైపున "కేవల గణితశాస్త్రంవల్ల మాకు ఉపాధి దొరుకుతుందా?" అన్న నిరాశలో పడ్డారు  కాని మానవాభ్యున్నతిలో, శతాబ్దాలుగా నాగరికతల అభివృద్ధిలో ఈ "విజ్ఞాన శాస్త్రాలకు తలమానికమైన" శాస్త్రాలన్నింటికీ

తల్లి వేరైన గణితానికి అత్యంత కీలకమైన పాత్ర ఉందని ప్రొఫెసర్ ఎం జి కె మీనన్ చెప్పడం యువకులలో గణితశాస్త్రంపట్ల నిరాశాభావాన్ని తొలగించగలదు గణితశాస్త్రం అవసరంలేని సబ్జెక్టు ఏముంది? సూర్యచంద్రుల గతులకు, గ్రహగతులకు, క్రమరహితమైన అనేక సహజ దృశ్యాలకు కొలతలలో లెక్కలుగట్టి ఒక పొందికను కూర్చి పెట్టే సరసమైన భాష్యం - గణితం తార్కిక దృష్టివల్ల, ఊహాశక్తివల్ల, పరిపక్వమైన స్ఫురణవల్ల ఈ పరిశీలన సాధ్యపడుతుంది ఆర్కిమెడిస్ నుంచి ఆర్యభటవరకూ, వరాహమిహిరుడి నుంచి కెప్లర్ వరకు, పైథాగరస్ నుంచి న్యూటన్, ఐన్‌స్టీన్‌ల దాకా ఈ నిశితమైన పరిశీలనవల్లనే విశ్వరహస్యాలు ఎన్నో వెలుగులోకి వచ్చాయి అన్ని కళలలోని ఆనందాలు, విషాదాలు, కష్టాలు, విసుగు, నైరాశ్యం గణితశాస్త్ర విజ్ఞానంలో కూడా సహజం గణితాన్ని "భూతం" గా భావించి, ద్వేషించిన ఆర్థర్ షోఫెనూవర్ లాంటి తాత్వికులు లేకపోలేదు కాని గణిత శాస్త్రానికి సామాజిక ప్రయోజనాన్ని నొక్కిచెప్పిన మారిస్ క్లైయిన్‌లాంటి ఆధునిక శాస్త్రవేత్తలూ లేకపోలేదు

కనుకనే ప్లాస్టిక్ ఆర్ట్స్‌సహా, పజిల్స్, బ్రిడ్జి, మాజిక్ స్క్వేర్స్, చరిత్ర, కెమిస్ట్రి, బయోకెమిస్ట్రీ, రోదసీ విజ్ఞాన శాస్త్రాలన్నింటికి-గణితమూ, సంఖ్యా శాస్త్రమూ తల్లివేరులా ఉపయోగపడుతోంది ఒక్క సౌందర్య జగతికే కాకుండా అన్ని రకాల కళాత్మకమైన ప్రక్రియలకూ గణితం దారిచూపేదిగా వుంది సంఖ్యావాదంలో "మాస్టరీ" సాధించి ప్రపంచ ప్రసిద్ధుడైన రామానుజం నుంచి నేటి వర్ధమాన చిరంజీవి వి వాసుదేవన్ (తొమ్మిదేళ్ళు) దాకా రాణకెక్కడానికి కారణం వారి తార్కిక (లాజికల్) దృష్టి ఈ సంఖ్యాశాస్త్రం ఒక్కసారిగా వృద్ధికాలేదు అనేక ప్రాచీన జాతులు నాగరికతా పరిహద్దులను తాకేనాటికి "4"వ అంకెకు మించి లెక్కించలేకపోయేవారట క్రమేణాగాని ఈ శాస్త్రాన్ని మానవజాతి వృద్ధి చేసుకోలేకపోయింది జ్ఞానం అనంతం, కనుకనే దానిని కుదించి సంకలనప్రాయం చేయలేము జీవపదార్థమైన జ్ఞానంలో అంతర్భాగమే గణితం అది అవిభాజ్యం వివిధ రూపాలలో దర్శనమిచ్చే ఈ జీవ ప్రకృతికి మరో రూపమే అంకె లేదా సంఖ్య! అంకెలతో సరదాలూ తీర్చుకోవచ్చు, సామాజిక ప్రయోజనాలూ ఈడేర్చుకోవచ్చు, హేతువుతో, తర్కంతో నిమిత్తం లేకుండా జ్యోతిషశాస్త్రాన్నీ పెంపొందించుకోవచ్చు! అందుకే ఈ ప్రాచీన కళను ప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త "ఎస్సెంట్ ఆఫ్ మాన్" గ్రంథకర్త బ్రొనిస్కీ, సంఖ్యావాదం లేదా గణితశాస్త్రానికి ఇదీ జన్మస్థలమని ఫలానా ప్రాంతాన్ని పేర్కొనడానికి వీలులేదన్నాడు. ప్రతీ సంస్కృతిలోనూ ప్రజలు నోరువిప్పి మాటలెలా మాట్లాడుతున్నారో, అలాగే చేతివేళ్ళనూ గణిస్తూ వచ్చారన్నాడు. పైథాగరస్ "అద్భుతాలదీవి"గా తన కాలంలో ప్రసిద్ధికెక్కిన "సామోస్" దీవికి వెళ్ళినపుడు అక్కడివారికి బోధలు చేస్తూ ఈ ప్రకృతిని అంకెలు శాసిస్తున్నాయి, ప్రకృతిలో ఇదే సమ్మోహనమైన సఖ్యత, భిన్నత్వంలోనే ఏకత్వం, సంఖ్యకూ ఒక భాష ఉంది, ప్రకృతి భాషే అంకెల మాటలు అన్నాడు! అంతేగాదు, సంగీత ఝరిలోని స్వరసమ్మేళనానికీ గణిత శాస్త్రానికీ సంబంధం ఉంది ధ్వని తరంగాలు క్రమానుగతమైన సంఖ్యాశాస్త్ర పరిణతికి ఆనవాళ్ళు అనేకరూపాలలో - అలలు, తరంగాలు, స్ఫటికాల్లు, మానవ శరీరం రూపంలో దర్శనమిచ్చే ఈ ప్రకృతిని పసికట్టి దానికి కొలమానాలు, కొలగారాలు సమకూర్చిపెట్టే శాస్త్రం సంఖ్యావాదం ధ్వనికీ, దృష్టికీ గీతాబోధ చేసింది సంఖ్యావాదమే! లెక్కలవల్ల ఉపయోగం ఏమిటని ఓ అజ్ఞాని ప్రశ్నిస్తే గణిత శాస్త్రవేత్త యూక్లిడ్ ఇచ్చిన సమాధానం "వాడికి ముఖ్యం డబ్బుగాని విజ్ఞానం కాదు, ఆ పైసా వాడి ముఖాన కొట్టు. కావలసింది మానవ పురోగతి కాని పైసల కోసం పరుగులు కాదు", అన్నాడు

*(A diagram a step not a diagram and a penny)*'' అలాగే-సూర్యుడికి సంకేత సంఖ్య 1 కాగా, కుజుడి సంఖ్య 9 గా జ్యోతిష్కులు భావించి రాజకీయ గ్రహాలుగా పేర్కొంటూంటారు! మన కవులు కూడా జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానంతో కొన్ని ప్రహేళికా చాటువులను అల్లారు, దశావతారాలను చమత్కారంగా అంకెలలో చెప్పారు "కనికట్టు"తో డబ్బులు రాల్చే గారడీవాడు గరీబుగానే ఉన్నాడుగానీ, అమీరు కాలేడు! అందుకే సంఖ్యా శాస్త్రాన్ని మంచికోసం ఉపయోగించుకోవాలి! గానము లేక ప్రాణము లేదన్నాడు కృష్ణశాస్త్రి, సంగీతం లేని జీవితం వ్యర్థం అన్నాడు నీషే కవిత్వానికి ఛందస్సు, విశ్వానికి గణితం - అంకెలతో గారడీలు, మాటలతో "పారడీ"లూ! సృష్టిలో సమన్వయానికి సంకేతం - సంఖ్య!!

ఆగస్టు 7, 1990

# "విశ్వగామి నా మనసు.. !"

ఈ చరాచర ప్రకృతిలోని సర్వస్వమూ తనకు తెలుసుననుకొనేవాడికీ, తనకు మించిన జ్ఞాన సంపన్నుడు మరొకడీ విశ్వంలో లేడనుకునేవాడికీ సమాధానంగా విశ్వనాథవారు స్వాప్నిక జగత్తులో అహంకొద్దీ ఒక పుస్తకంతో పడిన తగాదాను చాలా చమత్కారంగా వర్ణించారు తన మనసుకు మించిన "విశ్వగామి" మరేదీ లేదనుకుని విర్రవీగేవారిని దృష్టిలో పెట్టుకుని ఇలా అంటించారు "నాకు తెలిసిన సర్వ విజ్ఞానములును/తనకుగాని తెలియవట! దాని మాట/వినయ మేమనవలెనట! 'విశ్వగామి/ నా మనసు' జ్ఞానశూన్య సంతమసమంట!" నిజానికి, సర్వవిజ్ఞానం ఒకరి సొత్తు అనుకొన్నప్పుడు ఇన్ని నిఘంటువులూ, విజ్ఞాన సర్వస్వాలు అనవసరం జ్ఞాన సముద్రానికి, లోతులూ, ఎల్లలూ నిర్ణయించలేము-కనుకనే, అనుదినం మనకు తెలియని ఎన్నో విషయాలను తెలుసుకోడానికీ, జ్ఞాననేత్రాలు పెంచుకోడానికీ, సమాజ శ్రేయస్సుకు విజ్ఞానాన్ని మరింతగా పంచడానికీ ఈ ఆధార గ్రంథాల అవసరం కలుగుతోంది మనకు రకరకాల విజ్ఞాన సర్వస్వాలు (ఎన్‌సైక్లోపీడియా) ఉన్నాయి కాని అన్ని రంగాలలో మాదిరే, విద్య, ఆరోగ్య శాఖలలో ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలకు, మనోవికాసం పొందవలసిన దశలో జరుగుతున్న అన్యాయమే-బాలసాహిత్యం, బాల విజ్ఞాన సర్వస్వం సృష్టిలో కూడా జరుగుతోంది ఈ కొరతను కొంతవరకైనా తీర్చడానికి తెలుగులో జరిగిన తొలి ప్రయత్నంగా, బుడ్డిగ సుబ్బరాయన్ సంపాదకత్వాన "అభినందన పబ్లిషర్స్" తాజాగా వెలువరించిన ఉత్తమ సర్వస్వం - "బాలల విజ్ఞాన సర్వస్వం" అయితే, గతంలో తెలుగులో విజ్ఞాన సర్వస్వాల పరిష్కారం కోసం జరిగిన అరకొర ప్రయత్నంలాగా ఈ బాల సర్వస్వ సంపుటాల ప్రచురణ కూడా ముగింపునకు రాకూడదు ఎందుకంటే ఇప్పటికి 'అభినందన పబ్లిషర్స్' చేసిన కృషి కేవలం "సంస్కృతి" విభాగానికే పరిమితమయింది అదికూడా ఇప్పటికి ఒక్క సంపుటి మాత్రమే వెలువడింది ఉత్పత్తి ఖర్చులు అంతరాయం కాకపోతే తలపెట్టిన ఈ యజ్ఞాన్ని, ఇబ్బందులను ఎలాగొలా అధిగమించి అయినాసరే సంస్కృతి రెండో సంపుటాన్ని, మిగతా విషయాలను 'అ'కారాదిగా సంపుటాలుగా ప్రచురించడమూ అవసరం, సుమారు 360 పేజీలలో 160 దేశాలు, భారతదేశంలోని రాష్ట్రాలు, ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాలకు చెందిన భౌగోళిక, చారిత్రక, ఆర్థిక, సిరిసంపదలకు చెందిన, బాలలకు అర్థమయ్యే భాషలో క్లుప్తమైన సమాచారాన్ని అందించడంతో పాటు ప్రపంచ మేధావుల, విజేతల, రాజనీతిజ్ఞుల, మహాకవుల, కళాకారుల వివరాలను కూడా పొందుపరిచారు ప్రపంచ నాగరికతలు, ప్రాచ్య, పాశ్చాత్య భారతీయ భావనా స్రవంతికి చెందిన విశేషాలు, ఉద్యమాలు, విప్లవాలు తాలూకు 1000 అంశాలను 'అ'కారాది క్రమంలో వర్ణచిత్రసహితంగా, పట చిత్ర సహితంగా అందించారు! అసలు తెలుగులో విజ్ఞాన సర్వస్వం ప్రచురణకు ప్రయత్నం యూరప్ దేశాలకంటే రెండువందల యేళ్ళ తరువాతగాని జరగలేదు 18వ శతాబ్దం ఫ్రాన్స్, ఇంగ్లండ్‌లలో విజ్ఞాన సర్వస్వాల ప్రచురణ యుగంగా భాసిల్లితే, తెలుగునాట ఆ జ్ఞాన గంగోత్రికి 20వ శతాబ్దం రెండవ దశకంలో గాని (1912-23) బారసాల జరగలేదు! తర్వాత మరో రెండు దశాబ్దాల తరువాత గాని "తెలుగు భాషా సమితి" ఆధ్వర్యంలో విజ్ఞాన సర్వస్వ సంపుటాల ప్రచురణకు నిష్ఠతో కృషి సాగలేదు ప్రజా బాహుళ్యంలో, ముఖ్యంగా అక్షరాస్యులయిన వయోజనులలో నవజాగృతిని కల్గించడం కోసం తపన పడి విజ్ఞాన సాగరాన్ని మధించి, నవనీతాన్ని అందించడానికి నిరంతరం

కృషిచేసిన మహానీయులు కొమర్రాజు లక్ష్మణరావు, మాగంటి బాపినీడు, మోటూరు సత్యనారాయణ, మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకటరమణయ్య, మామిడిపూడి వెంకట రంగయ్య కాని పిల్లలకు మాత్రం (6-15 సంవత్సరాల మధ్య వయస్కులు) ప్రత్యేక 'విజ్ఞాన సర్వస్వం' అంటూ ఇంతవరకు లేదు ఆధార సంపుటాలకు అవసరమైన సమాచారాన్ని సేకరించగల మేధావులు దొరక వచ్చుగాని, వీటి ప్రచురణ బాధ్యతను స్వీకరించి, బాలబాలికల మనస్సులను రంజింపజేయగల విధంగా ఉత్పత్తి చేయడం వ్యక్తిమాత్రంగా జరిగే పనికాదు ఒకవేళ జరిగినా పరిపూర్ణత కలగడమూ కష్టసాధ్యమైన పని ఆ పనిని ఏనాడో (బాలల విజ్ఞాన సర్వస్వం ప్రచురణ) భాషా సమితిగాని, బాలల అకాడమీగాని ప్రభుత్వ స్థాయిలో తలపెట్టి ఉండవలసింది ఒక దశలో బుడ్డిగ సుబ్బరాయన్‌కు ఈ బాధ్యతను అప్పగించాలను కొన్నారు కాని ఎందుకు నెరవేరలేదో అనూహ్యం తెలుగులో బాలల విజ్ఞాన సర్వస్వం ప్రచురణ కోసం 1950లో ఒక ప్రయత్నం జరిగింది అయితే అదికూడా మహ్మద్‌ఖాన్ గ్రంధకర్తగా "ఖగోళ శాస్త్రం" సంపుటితోనే ఆగిపోవడం విచారకరం అది అందమైన, పొందికైన తెలుగులో వచ్చిన తొలి బాల విజ్ఞాన సర్వస్వమని చెప్పాలి బాల విజ్ఞాన సర్వస్వాల్లో మనకంటే తమిళులు ("శిరుయవర్ కళైకళంజియమ్" 10 సంపుటాలు), కన్నడిగులు ("జ్ఞాన గంగోత్రి" 7 సంపుటాలు) ముందడుగులో ఉన్నారు.

అసలు విజ్ఞాన సర్వస్వాలకు ప్రారంభోత్సవం 18వ శతాబ్దిగా చెబుతారుగాని, వాటి సృష్టి పునాదులు రెండువేల సంవత్సరాల నాటివని కొన్ని ఆధారాలున్నాయి ఎందుకంటే, సమకాలీన విజ్ఞానాన్ని పదిలపరిచిన మొదటి విజ్ఞాన సర్వస్వ కారులు గుమాస్తాలని ఒకాయన రాశాడు! ప్రజాబాహుళ్యాన్ని చైతన్యవంతులను చేయడంలో అగ్రభాగాన నిలబడిన దేశంగా ఫ్రాన్స్‌ను చెబుతారు సానియర్స్ సంకలనపరిచిన "ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ గ్రేట్ మైండ్స్" గొప్ప సర్వస్వంగా పేరొందింది విమర్శనా దృష్టితో అధ్యయనం అవసరాన్ని సామాన్య పాఠకునికి విజ్ఞాన సర్వస్వంద్వారా గుర్తింపజేసిన మొదటివ్యక్తి తాత్వికవేత్త పియర్‌బేలీ *(Pierre Bayle)* ఈ అన్ని విజ్ఞాన సర్వస్వాలకు అచ్చులో ఆది గురువుకూడా అతనే కావడం మరొక విశేషం! (16వ శతాబ్దం) సెయింట్ విక్టర్ మొట్టమొదటిసారిగా 'అ'కార వర్ణక్రమంలో విజ్ఞాన సర్వస్వ నిఘంటువును తయారుచేసినవాడు 12వ శతాబ్దం నాటికే విక్టర్ ఈ విజయం సాధించడం *("Suda or Sudas")* గొప్పవిశేషం కాగా పిల్లల కోసం యూరప్‌లో 19వ శతాబ్దానికి ముందే విజ్ఞాన సర్వస్వాలు వెలుగులోకి రాసాగాయి వాటిలో ముఖ్యమైనవి జాన్ వాగెల్‌సేల్ ఎడిటర్‌గా వచ్చిన "కలెక్షన్ ఆఫ్ జువెనియల్ బుక్స్" (1633-1705), లారోసీ రాసిన "స్మాల్ చిల్డ్రన్స్ ఎన్‌సైక్లోపీడియా", ఆర్థర్ మీ రాసిన తొలి ఆధునిక బాల సర్వస్వం "మోడరన్ ఎన్‌సైక్లోపీడియా" (1875-1943), బుక్ ఆఫ్ నాలెడ్జ్, బ్రిటన్‌లో 1971లో "యంగ్ చిల్డ్రన్స్ ఎన్‌సైక్లోపీడియా వేశారు, అంధ బాలబాలికలకోసం 1961లో బ్రెయిలీ ఎడిషన్ 145 సంపుటాలు వెలువడ్డాయి! ఇవిగాక పాక్షికంగా గుడ్డివాళ్ళు అయిన వారి కోసం మరో 30 సంపుటాలు ప్రత్యేకించి (1964) ప్రచురించారు! అటు అమెరికాలో పదకొండు సంత్సరాల వయస్సులో ఉన్నవారి కోసం ఫ్రాంక్ క్రాంప్టన్ "స్టూడెంట్స్ ఎన్‌సైక్లోపీడియా" ప్రచురించి గడప గడపా తిరిగి, కళాశాలల వరకూ పాకి ఆ సర్వస్వాన్ని సర్వజన సమ్మతం చేసుకున్నాడు! దానినే తర్వాత అతను ప్రాణికోటికి సంబంధించిన సకల రంగాలలోని విశేషాలను, విశ్వ రహస్యాలను 12 సంపుటాలుగా అందిస్తూ 13వ సంపుటంగా విషయ సూచికను *(Index)* ప్రత్యేకంగా వెలువరించాడు! అలాగే ఆక్స్‌ఫర్డ్

తరవున హంప్రీ కార్పెంటర్, మిసెస్ ఇ ఎమ్ ఫీల్డ్ రకరకాల సర్వస్వాలను చిన్నారుల తొక్కు భాషలోనే ఉక్కు భావాలను ప్రకటించగలవాళ్ళ శక్తిసామర్థ్యాలను వెల్లడిస్తూ పుస్తకాలను వెలువరించారు అలాగే వాల్ట్ డిస్నీ పేరిట ఇటీవల కాలంలో వచ్చిన ఉత్తమ బాల సర్వస్వం "వండర్‌ఫుల్ వరల్డ్ ఆఫ్ నాలెడ్జ్" సంపుటాలు దాని ప్రేరణతోనూ, స్వీడిష్ భాషలో హార్టి హెడ్‌మాన్ ప్రచురించిన బాలసర్వస్వం సంపుటాలు ఆధారంగానూ మన దేశంలో ఢిల్లీ పుస్తక్ మహల్ వారు "చిల్డ్రన్స్ లైబ్రరీ ఆఫ్ నాలెడ్జ్" సంపుటాలు ప్రచురించారు జ్ఞానం అనంతం, ఆ నిధిని బాలల మనోవికాసానికి వారి శైలిలో అందుబాటులోకి తేవడానికి చేసే ప్రతి ప్రయత్నమూ హర్షదాయకమే వారి మనస్సులనూ, విజ్ఞానాన్నీ డబ్బుతో కొలవకూడదు నేటి వ్యాపార నాగరికతలో మన బాలబాలికలు కూడా బలిపశువులవుతున్నారు విద్యావ్యాపారం ప్రాథమిక విద్యకే చిన్నారులను (లక్షల సంఖ్యలోనే) దూరం చేస్తోంది అందుకే విద్యావ్యాపారాలను హెన్రీమోర్ మొగం వాచేట్టు పెట్టాడు *I hate that Kestrell Kind / of bastard scholars that subordinate / The precious choice inducements of the mind/To wealth or worldly goods* "!!

ఆగస్టు 5, 1990

# చిత్తశుద్ధిలేని బుద్ధపూజ!!

మనసు నిర్మలంగా ఉన్న ఆత్మవాదీ, హేతువాదీ, అలాగే ముక్కుకు సూటిగా అంటారు! 'యధార్థవాదీ లోకవిరోధీ' అన్నట్టుగానే వేమన కూడా కాలం గడిపిన రోజులున్నాయి. అయినా సంఘానికి అవసరమైన, కలకాలం నిలిచిపోదగిన, ఆత్మమధనానికి ఆదర్శదీపాలుగా కవి వాక్కులు నిలిచిపోయాయి అందుకే మూడువొందల ఏళ్ళనాడే అన్నాడు "ఆత్మశుద్ధిలేని అచారమది ఏల? చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా? రాతి బొమ్మలకేల రంగైన విలువలు - గుళ్ళుగోపురములు కుంభములును? కూడు గుడ్డ తాను కోరునా దేవుండు?"

మన హుస్సేన్‌సాగర్ మధ్య ప్రతిష్ఠ కావలసిన బుద్ధుని అపురూప విగ్రహానికి (గిన్నీస్‌బుక్‌లో రికార్డు కావడం కోసం) ఘోరమైన అవరోధం జరిగినందుకు, విగ్రహ నిర్మాణంలో శిల్పులు పడిన శ్రమ వృధా అయినందుకు బాధపడని వారుండరు కాని అంతకన్నా మనస్సులను వికలంచేసే ఘటన సాగర్‌లోని జిబ్రాల్టర్ శిలాపీఠంపై తథాగతుని విగ్రహ ప్రతిష్ఠ కోసం సంబంధిత అధికారులు, సాంకేతిక నిపుణులు ప్రారంభించిన యాత్రలో విగ్రహంతోపాటు "పంట్" పగుళ్ళిచ్చి ఒరిగిపోయి పదిమంది నిండుప్రాణాలు బలికావడం ఒక సామ్రాజ్యవాది దృష్టిలో యుద్ధంలో సైనికుల ప్రాణనష్టం ఒక లెక్కలోది కాదు! కాని అదే ప్రజాస్వామ్యవాదుల దృష్టిలో ఒక విగ్రహ ప్రతిష్ఠాపనకు సంబంధించిన అయిదుకోట్ల ప్రాజెక్టు, అదెంత పెద్దదైనా, పదిమంది ప్రాణాలకు సరితూగజాలదు! కాని నేడు ఈ విషయంలో సాగుతున్న వాద ప్రతివాదాలు చూస్తుంటే, కొందరు గుండెలు బాదుకోవడం గమనిస్తుంటే - ప్రాణనష్టం కంటే విగ్రహ నష్టమే వారికి ఘనమైనదిగా కనిపించడం విచారకరం! అందుబాటులో ఉన్న ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో, పనిముట్లతో ఏనాడైనా విగ్రహావిష్కరణకు తిరిగి మార్గం సుకరం కావచ్చునేమోగాని, పోయిన ప్రాణాలకు తిరిగి ఉసురుపోయడం ఎంతటి రాజయోగికైనా 'మాంత్రికుడి' కైనా సాధ్యం కాని పని! అటు పాలకపక్షం వారుగాని, ఇటు ప్రతిపక్షంలోని పెద్దలుగానీ ఆవేశకావేషాలకు పోకుండా ఆలోచించవలసిన విషయం ఇది! అందేగాదు, హేతువాదానికి, సాధారణ జీవన మార్గానికి బీజాలు నాటి సర్వోత్తమ ధర్మాలను సంఘానికి ప్రసాదించిన బౌద్ధం మౌలిక సిద్ధాంతాలకే నేటి మన చింతన, ప్రవర్తన బద్ధవిరుద్ధమని మరవరాదు! రాజ్యకాంక్షతో "విశ్వామిత్రుడు" తన క్షాత్రతేజాన్ని విడనాడి బ్రాహ్మణ్యంతో లాలూచీపడి, బొందితో కైలాసం చేరాలని కలలుగన్నవాడు, కాగా, రాకుమారుడైన బుద్ధుడు లోకంలోని బాధలు చూచి భరించలేక వాటి పరిష్కారం కోసం అన్వేషణలో సర్వసంగ పరిత్యాగిగా మారినవాడు. వీరిద్దరి మధ్య ప్రవృత్తులలో హస్తిమశకాంతం తేడా ఉండగా మన ప్రతిపక్ష నాయకుడు ఎన్ టి రామారావు దృష్టిలో ఈ ఇరువురూ (విశ్వామిత్రుడు, బుద్ధుడు) ఏకకాలంలో ఆరాధ్య దైవాలెలా కాగలిగారో అనూహ్యం! అంతకంటే అసలు పెద్ద రహస్యం తొలి బౌద్ధంగాని, బౌద్ధ ధర్మాలుగానీ విగ్రహారాధనకే విరుద్ధం! అందువల్ల విగ్రహ ప్రతిష్ఠ ఎక్కడ జరిగినా ఒకటే అవుతుంది! జిబ్రాల్టర్ రాక్ కాకపోతే ఇందిరాపార్క్ పనికిరాదా? ఆ మాటకొస్తే బుద్ధుడు అర్థబానిస వ్యవస్థలో కలుషితమై ఉన్న సంఘజీవనాన్ని సక్రమ మార్గంలో పెట్టడానికి సహేతుకంగా ప్రతిపాదించిన తొలి ధర్మాలకూ, వాటి విలువలకూ నేటి మన బుద్ధులుగానీ, మన జీవనంగానీ ఏ మాత్రమూ సరితూగలేవు. మనకు సంక్రమించిన సంప్రదాయం 'ఆత్మ'లతో కాదు, మహాత్మలతో మాత్రమే తృప్తిపడగలది! ప్రసిద్ధ బౌద్ధ

నిలయాలలో ఒకటైన తెలుగుదేశంలో కూడా జరుగుతున్న తంతు ఇదే చెడిపోయిన వారూ, భ్రష్టుపట్టిన సిద్ధాంతులే దోపిడీ వ్యవస్థకు ఆశీస్సులు పలుకుతారు అందుకే తొలి బౌద్ధ ధర్మాలకూ మలి బౌద్ధ ధర్మాలకూ అంతటి వ్యత్యాసం వచ్చింది

విగ్రహారాధనను నిరసించిన బౌద్ధాన్ని "హీనయానం"గా ముద్రవేసిన ఆ తరువాతి బౌద్ధులు చీలుబాటల మధ్య ప్రయాణించి తిరిగి విగ్రహారాధనకు ప్రాణ ప్రతిష్ఠ చేసి తమకు తామై "మహాయాన" శాఖగా ప్రచారం చేసుకున్నారు ఈ అడ్డదారులు తొక్కడం బుద్ధుడు మరణించిన తరువాతనే జరిగింది అదే మనకూ ఆరాధ్యమైంది. "శూన్యవాదం", "వజ్రయానం" తలెత్తి దయ్యాలు, చాతబడులూ పెరిగాయి తర్వాత "శైవం" కూడా చెడిపోయింది కాపాలిక, భైరవ తంత్రాలకు మూలం ఇదే శిల్పం వేరు, శిల్పపూజ వేరు గౌతమబుద్ధుడు కళారాధకుడై కూడా చేసిన 'పూజలు' మాత్రం సంఘపూజా, మానవపూజా! అడ్డదారులు తొక్కుతున్న మనం మాత్రం తొలి బౌద్ధ ధర్మాలన్నింటికీ ("ధమ్మపదా"నికి) దూరమవుతూ వచ్చాం జైన, బౌద్ధాలు రెండూ వర్ణ విభేదాలను ఖండించాయి బౌద్ధం అహింసను, సమానత్వాన్ని బోధించింది భౌతిక ప్రపంచాన్ని వాస్తవిక ప్రపంచంగా భావించింది పునర్జన్మ వాదాన్ని తోసిపుచ్చింది, విగ్రహారాధనను నిరసించి, నిషేధించింది, అనాత్మవాదాన్ని ముందుకునెట్టింది యజ్ఞయాగాదులను ఖండించి, వాటి పేరిట బానిస యజమానులకు, కలవారికీ కాపుకాసిన ఆనాటి బ్రాహ్మణ్యంతో, పురోహిత వర్గంతో తలపట్టుపట్టింది, సంపాదనాభిలాషకు కళ్ళాలు పెట్టుకోమంది, ఒకరి పొట్ట కొట్టవద్దు, సహజీవనం సమాజ ధర్మం అన్నది, సంఘంలో స్త్రీ విలువను గుర్తించి, ఆమెను సమున్నత స్థానంలో నిల్పిన తొలి ధర్మం బౌద్ధం, అది కులమతాలను ద్వేషించింది, ఇన్ని సద్గుణాలవల్లనే బుద్ధుడు ఉత్తమపౌరుల సృష్టి - సంఘాన్ని బాగుచేయడంవల్ల, దాన్ని ఆశ్రయించడంవల్ల, సహజ ధర్మాలను పాటించడం వల్లనే సాధ్యపడుతుందన్నాడు ("ధర్మం శరణం", "సంఘం శరణం") గాంధీజీ ఏనాడూ తనను తాను మహాత్ముడని పిలుచుకోలేదు అలాగే బుద్ధుడు కూడా తనను తాను "భగవానుడ"ని చెప్పుకోలేదు కాని ఆ పనిచేసింది - బుద్ధుని పేరుతో మనం చేసే తప్పుడు పనులను కప్పిపెట్టుకోడానికి 'అవతార పురుషు'నిగా, 'భగవానుని'గా మార్చిన మనమే! కనుకనే అతనిది "విజ్ఞాన వాద"మయింది, మనది అజ్ఞానవాదంగా మిగిలిపోయింది! గాంధీని, గాంధీ బోధలను మరిచిపోయినట్లే బౌద్ధ ధర్మాలను కూడా మరచిపోయిన మనం బుద్ధుని తరపున వాదించగల నైతిక హక్కును కోల్పోయాం

నిజానికి బౌద్ధం లక్ష్యం - మనిషిని అవరించిన రెండు "ఆవరణలు" (ముసుగులు) తొలగించడం వాటినే ఆయన "క్లేశావరణం'-మనస్సులోని మాలిన్యం-అనీ, "జ్ఞేయావరణం" అనీ, అమాయకత్వమనీ అన్నాడు ఆయనను "దైవం"గా మార్చింది ప్రధానంగా ఆయన తొలి బోధలందుకున్న వైశాలీ వర్తకులూ, వారిననుసరించిన అమాయకులే! వ్యాస, వాల్మీకులు గతించిన తరువాత భారత, రామాయణ గాథలను కొందరు పెంచి రాసినట్లే, బుద్ధుని మరణానంతరం 'పాలీ' భాషలో ఉన్న "ధర్మఖండాల"ను కూడా వేల సంఖ్యలో కల్పించి పెంచి, విగ్రహారాధనకు, ఇతర రంగాలలో పతనావస్థకూ మార్గాలు తెరిచారు నిజానికి అనేక విశ్వధర్మాలను పొదిగిన శరీరం కాబట్టి బుద్ధునిది "ధర్మకాయం" అన్నారు వర్ణవ్యవస్థను వ్యతిరేకించిన బుద్ధుడు - అందరి జనన కేంద్రం ఒక్కటేగాని, కాళ్ళనుంచొకరూ, నొసటినుంచొకరూ పుట్టలేదన్నాడు! కనుకనే తన "సంఘం"లో - కులం చెప్పుకొని

చేరగోరేవాడికీ, వ్యవహరించేవాడికీ స్థానం లేదు పొమ్మన్నాడు! సముద్రంలో కలిసే ముందు గంగ, యమున, అచిరావతి, సరయూ, మహానది వేర్వేరు పేర్లతో ఉన్నా, సముద్రానికి చేరేసరికి అది మహాసాగరం తప్ప మరొకటి కాజాలదన్నది బౌద్ధం! కనుకనే చాలాకాలం దాకా ఆర్యవర్ణభేదాలు ద్రావిడాంధ్రులలో ప్రవేశించలేదు! అందుకే సంక్షుభిత దశలో ఉన్న సంఘానికీ, మానవులకూ ఆయన బోధించిన ఎనిమిది మార్గాలూ, నాలుగు మహాసత్యాలూ (దైన్యస్థితి నుంచీ, దాని కారణాలనుంచీ మానవుడు విముక్తి పొందడం వగైరా) చిరంతన సూత్రాలయ్యాయి సమానతను బోధించిన బౌద్ధ సంస్కృతివల్లనే భారత యుద్ధానంతరం, దేశంలోని వివిధ జాతుల మధ్య ఐక్యత కొంతకాలమైనా సాధ్యమైంది.

కాని ఇప్పుడో! కులంగాడు ఇంకా గోత్రం చెప్పకొంటూనే ఉన్నాడు ధర్మబోధ "మతం" రూపం పొంది అజ్ఞానాన్ని పెంచుతోంది ఎన్నికలు, కుల, మతాలకు, కుళ్ళు రాజకీయాలకు ఆశ్రయమయ్యాయి చివరికి బెంగుళూరులో జరిగిన "ప్రపంచ తెలుగు మహాసభల" ఆవరణ కూడా విశాల దృష్టిని కాస్తా "కావేరి" లోకి విసిరివేసి కమ్మ సంఘం, రెడ్డి సంఘం, అంబేద్కర్ కులస్థుల సంఘం, కర్నాటక బ్రాహ్మణ "సంఘ ద్వారాలు"గా మారిపోవడం - మన పతనావస్థకు ఆనవాలు కాదా?! విగ్రహారాధనకు, విగ్రహ ప్రతిష్ఠకూ పడే తపన తీర్మానాలలో పదిమంది ప్రాణాలపట్ల కనిపించదెందుకని? మనం జీవచ్ఛవాలం కనుక! అందుకనే మహాకవి గురజాడ ఎనభయ్యేళ్ళనాడే అన్నాడు "బౌద్ధాన్ని ఏనాడు సరిహద్దులు దాటించిందో భారతదేశం ఆనాడే ఆత్మహత్య చేసుకుంది!" స్వార్థ ప్రయోజనాల కోసం నాడు బౌద్ధధర్మ నిర్మూలనమూ, నేడు బౌద్ధ విగ్రహ పతనమూ! అదీ - నాటికీ నేటికీ తేడా అల్లా!

మార్చ్ 18, 1990

# మతసామరస్యం : మంగిపూడి 'పాలిపాట!'

వేదాలకు దురర్థాలు చెప్పేవాళ్ళున్న చోట, దేవుడు నిర్గుణుడు, నిరాకరుడూనని, ఎక్కడున్నా "దేవుడొక్కడే" ననీ చెప్పిన అద్వైత భావనకు వికృతార్థాలు చెబుతున్నచోట, కల్పిత గాథలలోని వీరులను నిజజీవితాన్ని కలుషితం చేయడానికి పనిముట్లుగా వాడుకుంటున్నచోట - భారతదేశంలో అనాదిగా పెరుగుతూ వచ్చిన మిశ్రమ సంస్కృతి గురించీ, ఉమ్మడి సంస్కృతి గురించీ ఆలోచించే వాళ్ళ సంఖ్య తక్కువైపోతోంది! ఈ సమయంలో నేటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్, ఒకనాటి "యంగ్‌టర్క్స్"లో ప్రసిద్ధుడూ అయిన శ్రీ కృష్ణకాంత్, మత సామరస్య సాధనకోసం, హిందూ - ముస్లిం ఐక్యతకోసం 1931లో ప్రాణాలర్పించిన ప్రముఖ హిందీ పాత్రికేయుడు గణేశ్ శంకర్ విద్యార్థి శత జయంతి ఉత్సవాలను ప్రారంభిస్తూ చెప్పిన మాటలు సదా గుర్తుంచుకోదగ్గవి భారతదేశంలో "మిశ్రమ సంస్కృతి" లేదా ఉమ్మడి సంస్కృతి గురించి కొత్త అవగాహన ఏర్పరచుకోవడం అవశ్యమనీ, స్వాతంత్ర్య సమర దినాలలో హిందువులూ, ముస్లింలూ ఈ ఉమ్మడి సంస్కృతికి వారసులని భావించేవారనీ, అదే నిజమైతే దేశం మత ప్రాతిపదికపై ఎందుకు విడిపోవలసి వచ్చిందనీ ప్రశ్నించారు! దేశ విభజనకుగల కారణాలను, కారకులను పరిశీలించడానికి ఇది సమయం కాదు కాబట్టి శ్రీ కృష్ణకాంత్ మరొక అంశానికి సంబంధించి ప్రకటించిన ఆవేదనను అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది "భారత చరిత్రను హిందూ యుగమనీ, ముస్లిం యుగమనీ, సిక్కు యుగమనీ విభజించడం తగద"ని ఆయన చేసిన విమర్శ అక్షరాలా నిజం ఎందుకంటే ఈ తప్పుడు యుగవిభజనవల్లనే భిన్న తెగల, విభిన్న జాతుల, భిన్న సంస్కృతుల సర్వకళా సంగమ క్షేత్రంగా ఉన్న ఆధునిక భారతదేశంలో యువతరం మనస్సులను స్వార్థపర వర్గాలు పదే పదే చికాకు పరుస్తున్నాయి, సర్వమానవుల సంక్షేమానికి ఉద్దేశించిన సామాన్య ధర్మాలకు 'మతం' రంగుపూసి మనస్సులను కలుషితం చేసి రోజుకొక ఆలీఘడ్‌నూ, ఒక జమ్‌షెడ్‌పూర్‌నూ, ఒక నాడియాను, లేదా మరొక భగల్పూర్‌నూ హింసాప్రవృత్తి కేంద్రాలుగా మలచిపెడుతున్నాయి! చరిత్రకు చెప్పే తప్పుడు భాష్యాలకు భరతవాక్యం పలికితే తప్ప హేతుబద్ధమైన అంచనాలను ముక్కుపచ్చలారని మన ముద్దుబిడ్డలకు నవనీతంలా అందించలేము! శ్రీ కృష్ణకాంత్ ఉమ్మడి సంస్కృతీ ప్రాశస్త్యం గురించి, మంచివారసత్వం గురించీ ఉగ్గడిస్తున్న సమయంలోనే శ్రీ సంజయ్‌ఖాన్ టి.వి సీరియల్ "టిప్పు సుల్తాన్" (ది సోర్డ్ ఆఫ్ టిప్పు) సక్రమంగానే ఉందనీ, విడుదల చేయవచ్చుననీ బిజెపి నాయకులు కూడా ప్రకటించి సామరస్య ధోరణికి నివాళి పట్టారు కృత్రిమంగా దేశాన్ని విభజించిన తరువాతనైనా నాయకులు కనీసం భారత చరిత్ర యుగ విభజన అయినా మత ప్రాతిపదికపై జరక్కుండా జాగ్రత్తలు తీసుకోవలసింది కాని ఏ స్వార్థప్రయోజనాలకోసం దేశాన్ని విభజించారో, అవే ప్రయోజనాలకోసం వక్రమార్గంలో చరిత్ర యుగ విభజనకు ఆశీస్సులు పలికారు! ఈ సత్యాన్ని సుప్రసిద్ధ చరిత్రకారులైన డాక్టర్ బి.ఆర్ భండార్కర్, బి ఎన్ పాండే (ఒరిస్సా మాజీ గవర్నర్)లు పదే పదే వెల్లడించారు. ముఖ్యంగా భారత చరిత్రలోని మధ్యయుగాల చరిత్రను స్వార్థపరులు వక్రీకరించారని వారు స్పష్టం చేశారు ఇదే వాదాన్ని అభినవ చరిత్రకారులైన శ్రీ బిపన్‌చంద్ర, డాక్టర్ రొమిల్లా థాపర్‌లు కూడా తిరుగులేని ఆధారాలతో సమర్థించారు. కానీ, వారి పుస్తకాలను మనపిల్లలకు పాఠ్యగ్రంథాలుగా ఉంచకుండా చేయాలని కొన్ని శక్తులు ఇంకా ప్రయత్నించడం దురదృష్టమే కాదు, ఖండనార్హం

పరస్పర దండయాత్రలు, దోపిడీలు, కొల్లగొట్టడాలు చరిత్రలో ఏ ఒక్క మతానికి చెందిన పాలకునితోనో ప్రారంభమైనవి కావనీ, అన్ని "మతాల"కు చెందిన పాలకవర్గాలూ రాజ్యకాంక్షతో, అధికార దాహం తీర్చుకోడానికి, ఆర్థిక వనరులకోసం ఆ పనికి దిగినవేనని ప్రపంచ చరిత్ర స్పష్టంచేస్తోంది!' అందువల్ల ఇండియాకు మొగలాయిలు, లేదా ముస్లింల రాకను (మధ్యయుగాల్లో) మాత్రమే "విదేశీయులు"గా "పరాయి మూకలు"గా పరిగణించి, దానికి "మతం" రంగును పులమలేము! ఏభయ్యేళ్ళు పాలించిన అక్బర్ ఒక్కడే యాదృచ్ఛికంగా అవతరించిన సెక్యులర్ శక్తి అనీ ఆ తర్వాత మిగతా ఆరువందల సంవత్సరాల చరిత్ర "నాన్ సెక్యులర్"అనీ, కేవలం "మత చరిత్ర" అనీ చెప్ప సాహసించలేము! ఎందుకంటే, భిన్న జాతుల, తెగల, సంస్కృతుల, విశ్వాసాల అపురూప సమ్మేళనమైన ఈ మహాభారతం పూర్వ (ప్రీ) ద్రావిడులనూ, ద్రావిడులనూ, ఆర్యులనూ - ఒక్క ముక్కలో, ఆర్య, అనార్య శాఖలలోని మేలిమి సంస్కృతినంతా ఒక్క చోట చేర్చిన సువిశాలమైన దేశం జనపదాల కదలికలు, వాటి స్థిరీకరణ చరిత్రలో ఒక్కనాడు కాదు, దశలవారీగా సాగిన ఒక మహాప్రస్థానం అందులో భాగంగా భూభాగాలకోసం, భూమికోసం, భుక్తికోసం పాకులాడని జాతి ఏదీ ప్రపంచ చరిత్రలో లేదు! అలాంటిదే వోల్గా నుంచి గంగా తీరందాకా సాగిన జనజీవన యాత్ర, ప్రస్థానజాతర ఈ యాత్రలో భాగమే అరబ్బులూ, తురుష్కులూ, మొగలాయిల (ముస్లిములూ) రాకపోకలూ కాబట్టి, ఎవరినైనా ఒక వేళ ఈ దేశానికి పరాయివారుగా చెప్పుకోవలసివస్తే అది మధ్య యుగాలలో ముస్లింల రాకకు పరిమితం చేయకుండా అంతకుముందే ఈ ఉపఖండానికి వలసగా వచ్చిన ఆర్యగణాలనే విదేశీయులుగా పరిగణించవలసి వస్తుంది! నిజానికి ఉత్తర భారతదేశమంతా క్రీస్తుపూర్వం రెండువేల సంవత్సరం నాటికే "విదేశీ పాలన" కిందకు వచ్చేసిందని కొందరు చరిత్రకారుల అంచనా! కానీ, ఇక్కడ గమనించవలసింది - ఈ మానవ సమూహాల కదలికలతోపాటు వారి ఉమ్మడి సంస్కృతి, వారసత్వం కూడా మన దేశానికి అబ్బడమూ, ఈ విశిష్ట సమ్మేళనం మూడు పూవులుగా, ఆరుకాయలుగా వర్థిల్లడమూ

అందువల్ల ఏ అక్బర్‌నో, ఏ ఔరంగజేబునో కేవలం ఇస్లాం సంస్కృతీ సంరక్షకులుగా ఎలా భావించలేమో, అలాగే ఏ రాణాప్రతాప్‌నో, శివాజీనో కేవల హైందవ ధర్మరక్షకులుగానూ భావించలేము! ఎందుకంటే, అవసరాలూ, ఆదానప్రదానాలూ ఏనాడూ ఏకపక్షంగా కలగవు, సాగవు హల్దీఘాట్ యుద్ధంలో హైందవుడైన రాణాప్రతాప్ సేనలకు అధిపత్యం వహించింది ముస్లిం సేనాని హకీమ్ ఖాన్‌సూర్ కాగా, అక్బర్ సేనాపతి రాజామాన్‌సింగ్! ఇది చరిత్ర దాన్ని సమన్వయించుకోవాలి! పోనీ ముస్లిం కదా అని నిజాముల్ ముల్క్‌ను ముస్లిమ్ ఛాందసులు (ప్రభువర్గాలకు కొమ్ముకాసి) గద్దెదించకుండా ఆగారా? లేదు ఎందుకని? నిజాముల్ ముల్క్ ముస్లిములలో నిరుపేద చేనేత కార్మికుని కొడుకుకావడంవల్ల సంపన్న ముస్లింలు అతణ్ణి వెలివేశారు! అంటే పాలకుడెవడైనా సాంఘిక, ఆర్థిక వ్యవస్థలు మారనంతకాలం కలవాళ్ళకూ, లేనివాళ్ళకూ మధ్య కులవర్గ వ్యత్యాసాలు చెక్కుచెదరవు! దోపిడికి మతం ఒక సాధనం, మనస్సులకు మత్తుమందు. చల్లకొచ్చి ముంతదాచేది మతం! మన రాజులూ, జమిందార్లూ, చౌధరీలు, ముకద్దమ్‌లూ మన రైతాంగాన్ని పీల్చి పిప్పిచేసిన ఘట్టాలు చరిత్రలో భాగం కావా? మధ్యయుగాల్లో - అటు యూరప్‌లో ఫ్యూడలిజమూ, ఇటు రాజపుత్రుల రాచరికమూ ఒక్కసారే తలెత్తిన పరిణామం కాదా? నిరంకుశుడూ, మత ద్వేషీ అని నిన్నటిదాకా అనుకున్న ఔరంగజేబు కూడా - హిందూ దేవాలయాలకూ,

బ్రాహ్మణులకూ భూరి [illegible], మడిమాన్యాల రూపంలో రకరకాల దానధర్మాలను చేసినట్టు ప్రొఫెసర్ [illegible] గర్గ్ అందుకు సం[illegible]న అనేక ఫర్మానాలనూ, సనదులనూ, పర్వాణాలనూ ఇటీవలనే బయటపెట్టలేదూ?! సామ్రాజ్యాధిపత్యం కోసం అసలు ఏ గడ్డీ కరవని పాలకుడు - అటు ప[illegible]ంలలోగానీ, ఇటు హిందువులలోగాని దొరకడని గమనించాలి! మత దృష్టితో చూస్తే కర్ణా[illegible] (మైసూర్) యుద్ధాలలో, మహారాష్ట్రులతో తగాదాలలో ఉన్న టిప్పుసుల్తాన్‌ను ఇక్కడి నిజామ్ నవాబు సమర్థించాలి, కాని టిప్పుకు వ్యతిరేకంగా పీష్వాలకు కొమ్ముకాశాడు నిజామ్! బ్రిటిష్ వాళ్ళకు 'జోహుకుం' అన్నవాడు నిజామ్, వీరోచితంగా పోరాడిన వాడు టిప్పుసుల్తాన్! అక్కడ రాజ్యాధికారం ముఖ్యంకాని మతాలూ, మమతలూ కావు! అందువల్ల ఏనాటికైనా, కుల, మత సామరస్యగానం చేసిన జాతీయోద్యమ కవి మంగిపూడి పురుషోత్తమ శర్మ "పొలిపాట"ను మనం ఆశ్రయించుకోవలసిందే "హిందూ ముసల్మానులందరము వచ్చాము/బౌద్ధ సిక్కులు ఏకభావులై వచ్చాము/పారసీ క్రైస్తవులు పరుగున వచ్చాము/బ్రాహ్మణ పంచముల్ బలిసి కలిసొచ్చాము/మా భేదభావములు మంట కలిపేశాము/మమ్ము మన్నింపవమ్మా - మా తల్లి, మమ్మాదరింపవమ్మా!" మనకెప్పటి కాజ్ఞానోదయం?

ఏప్రిల్ 1, 1990

# కాంతాస్మృతిలో ఓ ఏకాంతం!

లోకవృత్తాన్ని దర్శించడానికి వేయినొక్క మార్గాలు, సవాలక్ష సంకేతాలు వాటిలో ఒక సాధనం (మీడియం) స్మృతికావ్యం విషాదం కరుణకు, కారుణ్యం మానవుని సమస్యల అంతర్దర్శనానికి పునాది వియోగబాధ, విషాదస్పర్శ బహుశా కృష్ణశాస్త్రికి తెలిసినంతగా మరొకరికి తెలియదేమో! అందులోకూడా ఆయన బెదిరించి మరీ పిలిపించుకుంటాడు "ఏను మరణించుచున్నాను, ఇటు నశించు/నా కొరకు చెమ్మగిల నయనమ్ములేదు" అంటూ ఫిర్యాదు చేస్తూనే విషాదభావాన్ని తన విలాపానికి తోడు నీడగా మలచుకొంటూ తననుతాను సముదాయించుకోడానికి ప్రయత్నిస్తాడు "నాకు నిశ్వాస తాళవృంతాలు కలవు/ నాకు కన్నీటి సరుల దొంతరలు కలవు/ నిరుపమ నితాంత దుఃఖంపు నిధులు కలవు" అని తృప్తిపడతాడు ఈ తృప్తి కోసమే వేదుల కూడా తన అర్ధాంగిని తలచుకొంటూ ఆమెను తన నవనీత హృదయిగా, అంతరంగ శాంతిదేవతగా, ఆశాపథాంత రాళపారిజాతంగా, ప్రేమ జీవన విభాత కైశికీ గీతంగా, తపఃకల్పవల్లిగా ఆరాధించి ఆవాహనం చేశాడు అర్ధాంగులేకాదు, ఆత్మీయులు పోయినప్పుడు, ఆదర్శ మూర్తులు గతించినప్పుడూ స్మృతిగీతాలు, లేదా విలాపగీతాలు సాహిత్యంలో ఒక శాఖగా స్థానం ఏర్పరచు కున్నాయి గ్రీక్, లాటిన్ సాహిత్యాలలో క్రీస్తుపూర్వం ఏడవ శతాబ్దానికే తామరతంపరగా అల్లుకుపోయిన ఈ శాఖ ఆ తరువాతి శతాబ్దులలో విశ్వవ్యాపితమైంది నాటినుంచీ స్మృతిగీతాలకు వరసీమగా, ఆత్మీయతా తలపోతలకు వరాకాష్ఠగా ఆంగ్లసాహిత్యంలో థామస్‌గ్రే కవిత "కంట్రీ చర్చియార్డ్" నేటికీ నిలిచిపోయింది అలాగే అబ్రహాం లింకన్ హతుడైనప్పుడు వాల్ట్ విమన్ రాసిన *"When Lilacs last in the Dooryard Bloom'd"* అమర కవితగా నిలిచిపోయింది, శ్రీశ్రీ "అంకితం" కూడా అలాంటిదే ఇవన్నీ ఆత్మీయతలు ఒలకబోసుకున్న స్మృతి ఖండాలు. ఇలా అర్ధనారీశ్వరికీ, ఆప్తబంధువులకూ "ఎలిజీ"లుగా వెలువడిన కవితలకు పాశ్చాత్యులు *"Graveyard School of Poetry"* అని పేరుపెట్టారు దీనికి ప్రసిద్ధి ఐర్లాండ్ "ఎలిజీ"కి మారుపేర్లు చాలా వెలసాయి కొరనాచ్, మెనోడీ, డిర్జ్, ఉబిసెంట్, ఎపిసిడియమ్, లామెంట్, త్రెనోడీ వగైరా విషాదగీతిక వస్తువులో తేడాయేగాని తరతమభేదాలతో ఇవన్నీ స్మృతిగీతాలకిందనే లెక్క కానీ, ప్రపంచ సాహిత్యంలో ఇంతవరకూ వచ్చిన "ఎలిజీ"లన్నీ - (ఒక్క ఫ్రాన్స్‌లో తప్ప) కావ్యాలుగానే వచ్చాయిగాని, వచనంలో రాలేదు అయితే ఒక్క ఫ్రాన్స్‌లో మాత్రమే 'ఎలిజీ' కావ్యంగానే గాక వచన రూపంలోనూ, లేఖల రూపంలోనూ, సంగీత రూపకాలుగానూ వెలుగు చూసింది. అప్పటికీ ఎలిజీ డైరీల రూపంలో ఎక్కడా ఉన్నట్టు కన్పించదు కానీ, మొదటిసారిగా, కనీసం మన తెలుగువాళ్ళకు సంబంధించినంత వరకు దినచర్య (డైరీ) రూపంలో, వచనంగా, శక్తిమంతంగా స్మృత్యాంజలి ప్రారంభించిన ఘనత రావూరి భరద్వాజది విగత జీవి అయిన తన భార్య కాంతమ్మకు అతను సమర్పించుకొన్న తొలి స్మృతి చిహ్నం "నాలోని నీవు" కాగా, మిగతా మూడు రచనలూ - "అంతరంగిణి", "ఐతరేయం", "అయినా ఓ ఏకాంతం'-భార్య కాంతం కేవలం సంకేతంగా ఈ లోకవృత్తాంతాన్ని ఒక తాత్వికునిగా, జిజ్ఞాసిగా, భాష్యకారునిగా, వ్యాఖ్యాతగా, ఆదర్శవాదిగా, సమదర్శిగా భరద్వాజను చూపెడతాయి

"నాలోని నీవు"తో ప్రారంభమైన కాంతాస్మృతి క్రమపరిణామంలో మిగతా మూడు రచనల్లోనూ ఈశ్వర-నిరీశ్వరవాద చర్చకు దారితీసింది కామికానిదే మోక్షగామి కాడన్న వేమన్న

వేదానికి భరద్వాజ లౌకికార్థంలో ఈ రచనల ద్వారా బలం చేకూర్చాడు వేదుల మాదిరిగానే భార్యను రకరకాలుగా ఊహించుకొన్న - చిన్నితల్లిగా, బంగారుతల్లిగా, దేవతగా, ఆదర్శ దేవతగా, కాంతంగా, దేవకాంతంగా భావించుకున్న భరద్వాజ, ఎందరెందరున్నా అందరిమధ్యా ఒంటరితనం అనుభవించలేక ఈశ్వరపద జిజ్ఞాసిగా మారుతున్నాడు భాషమారింది, భావం మారింది అదృష్టం, ప్రభువు, ఈశ్వరుడు, విధి, పరలోకం, తపస్సు, యోగం ధ్యానంలాంటి కొత్త పదజాలం ఇప్పుడు అతని కలాన్ని నడిపిస్తోంది ఒకనాడు బాధలతో, దుఃఖాలతో, అవమానాలతో, ఈసడింపులతో, సమస్త దారిద్ర్యాలతో నిండిపోయిన భరద్వాజ బతుకును పునీతంచేసిన వ్యక్తిగా, హితోక్తితో, చిరునవ్వుతో, దయతో, మృదుస్పర్శతో, కన్నీటితో, తనకు వ్యక్తిత్వాన్ని ప్రసాదించిన ఒక "అపురూపవరం"గా తన జీవిత భాగస్వామినికి సమర్పించిన అర్చనాంజలి ఈ రచనలు వ్యక్తిగతమైన ఈ సొంతగొడవ మాకెందుకని కొందరు భావించవచ్చు కానీ, అతని కాంతం, అతని తరువాతి రచనల్లో కేవలం చిహ్నం మాత్రమే దేశ రాజకీయ సామాజిక, ఆర్థిక పరిణామాలు, సాహిత్య, కళాదిరంగాలు, విషాదమయ జీవితానుభవమూ, సామాజిక స్పృహ అడుగడుగునా ఈ ఆఖరి మూడు రచనలలో అభివ్యక్తమవుతూ వచ్చాయి అతను 'డైరీ'ల రూపంలో సమర్పించిన 'మొనోడీ'లు - అవే ఎలిజీలు -తెలుగు పలుకుబడులకు, నుడులకు నానుడులకూ వెలుగు దివ్వెలుగా, తెలుగు భారతికి సమర్పించిన అక్షరాంజలిగా, తెలుగు గీతాంజలిగా ప్రకాశిస్తాయి ఈ నాల్గింటిలోనూ అక్కడక్కడా పునరుక్తి దోషాలు తటస్థపడుతున్నా, ఈ నాలుగు రచనలలో భావచిత్రాలుగా, వర్ణచిత్రాలుగా సాగిన అనుభవ చిత్రాలను తిరిగి ఏర్చి కూర్చుకుని ఒక్కచోట చేర్చగలిగితే - అదొక రసవత్తర ఖండ కావ్యంగా, రమ్యమైన వచన కవితా భాండంగా అవతరించగల అవకాశం ఉంది రచయిత ప్రసిద్ధ కథకుడు కూడా కావడంవల్ల, విషాదానికి, అనుభవానికి, లోకదర్శనానికీ కవితాంశ తోడునీడై - తన స్వప్నశకలాలకు రెక్కలు తొడిగి వదిలాడు! కవిత్వం, సంగీతం, వర్ణచిత్రం - ఈ మూడింటి సమాహారమే "ఎలిజీల" మాటున సాగిన భరద్వాజ రసమయి సాహితీ కసరత్తులు తామస్ నాషే తన భార్యచనిపోయిన తర్వాత సుస్తీపడిపోయాడు, మళ్ళీ కోలుకోలేదు ఆ బంధం, అనుబంధం, అనిర్వచనీయమైన ఆ ఆత్మీయతానుబంధం, ఎదతీపులూ వియోగబాధ అనుభవించిన వాడికి మాత్రమే తెలియాలి. అందుకే నాషే తానూ ఒక బతకలేనని చెబుతూ *"I am sick, I must die/Lord have mercy on us"* అని వేడుకుంటాడు! కాని భరద్వాజ కూడా అలా విన్నపాలుచేసుకొన్నట్టు కన్పించినా పూర్తి నిరీశ్వరవాదిగా మారడానికి తనకు తెలియకుండానే లోలోన నిరాకరిస్తాడు! కనుకనే వియోగంలో కూడా ఈ విశ్వకర్మకు తాను సాహితీ రూపంలో సాక్షిభూతుడు కాదలచి, అనుభవపేటికలుగా రచనాపరంపరను వృత్తిగా, వ్యావృత్తిగా నిరాఘాటంగా కొనసాగించగలుగు తున్నాడు! నిరీశ్వరవాదాన్ని ఖండించకుండానే "అస్తినాస్తి" విచికిత్సను ప్రశ్నోత్తర ఉపనిషత్తుగా ఈ రచనల్లో అతను మలచాడు, భగవంతుడు దయామయుడైతే, ఈ నిరుపేదల బాధలను ఎందుకు తొలగించడన్న యుగయుగాల ప్రశ్నకే తిరిగి తానూ మళ్ళుతాడు! ఆర్షగీతానికి నవీనార్థం భరద్వాజ అక్షర సంపద మతం ప్రజలపాలిట మత్తుమందు మాత్రమేగాదు, అణగారిన ప్రజల ఆర్తనాదమే మతం అన్న మార్క్స్ భావనకు ఈ శతాబ్దంలో వకాల్తాపట్టిన కవులలో ఒకరు క్రైస్తవుడైన డేవిడ్‌గాస్కోనీ. విప్లవానికి బీజం మానవుని దైన్యం, దారిద్ర్యం అన్నాడు గాస్కోనీ దానినుంచే విప్లవ సారథులూ, కవితా వారధులూ పుట్టుకొస్తారన్నాడు " *from the tree of pain/Redeem*

*our sterile misery/Christ of Revolution and Poetry"* భరద్వాజ కూడా కుహనా వేదాంతుల్ని ఎండగట్టాడు అతను"నిరీక్షణ" "స్పర్శ"కు ఇచ్చిన నిర్వచనం కవితామయం స్త్రీ పట్ల అపారమైన గౌరవానికి కూడా సంకేతం "అయినా ఒక ఏకాంతం". మానవ మానవేతర ప్రకృతికి మధ్య అనుబంధాన్ని అందంగా తీర్చిన రచనలివి ఇందులో అనురాగంతోనూ అభిశంసనతోనూ కూడిన మానవ దర్శనంతోపాటు మనకు - కాలం ఉభయ సంధ్యలుగా, దివారాత్రాలుగా, రుతువులుగా అలంకారాలు మార్చుకొంటుంది, పరామర్శించిపోయే వసంత గ్రీష్మాలూ, హేమంతశిశిరాలు, గాలితరగలూ, వానచినుకులూ, కలసిమెలసి కలగలిసి తిరిగిన ప్రదేశాలు, వీధులు, బాటలు, తోటలు, వాటిలోని రాలురప్పలు, కొమ్మలరెమ్మలు, గరికపోచలు, ఊనీగలు, గాలితరగలు చూస్తాం, నీలాకాశంలో బిక్కుబిక్కు మంటున్న నెలవంకను, నక్షత్ర వీధులను చూపడమే గాక లోకంలో మనిషి ఆకలిని, దారిద్ర్యాన్ని, కపటాన్ని, మారణ హోమాన్ని, అమానుషత్వాన్ని, మోసాలను, కుట్రను, వంచనను, ఈర్ష్యని, అమాయకత్వాన్ని, క్రూరత్వాన్ని, ఆటవిక న్యాయాన్ని చూడకుండా కళ్ళుమూసుకోవద్దని కోరుతాడు, భూదేవి శిరస్సున దోసిళ్ళకొద్దీ వెండి ముత్యాల తలంబ్రాలు పోస్తున్న చంద్రుడు, మెరుపులన్నీ వెన్నెలగా మారి కొండల మీద, బండలమీద, పురాలమీద, గోపురాలమీద, మొగ్గలమీద, చిన్నారి బుగ్గలమీద, పూలమీదా, పచ్చని నేలమీదా, చివరికి భరద్వాజ తలనీలాల మీదుగా కూడా జారిపోవడం చూస్తాం!! శోకమే శ్లోకమైనట్టుగా కాంతాస్మృతిలో ఏకాంతంగా, విషాదాశ్రుల మధ్య, విలాపాగ్నుల మధ్యనే విశ్వశ్రేయోగీతాలాపనగా, వాగర్థాల మేలుకలయికగా సాగిపోతుంది అతని కలం అదొక క్షీరసాగరం, ఓ చందనచర్చ, ఓ సుధా సారసమీరం, సుమధుర భావనా స్రవంతి!!

ఏప్రిల్ 22, 1990

## చిలిపి చినుకులు, చిగురుటాకులు!

"మహాగజీవిని, త్యాగజీవిని"
"చిద్విలాసిని, స్థిత ప్రజ్ఞని"
"సరస్వతీ దేవికి నేను ప్రతిరూపం
సాహిత్య వాణికి నేను అపురూపం"
"ప్రతి జీవితం ఓ గ్రంధం
ప్రతి పరిచయం ఓ బంధం"
"కవి మనస్సు వికసించే కవితా పుష్పాలు
కవి నిజ జీవితంలో కన్నీటి బాష్పాలు"
"ఈ కలం ఆగిపోయినా కాలం ఆగదు
ఈ గెండె ఎండిపోయినా కన్నీరు ఆగదు"
"అణువణువున కవిత్వం
మనసంతా రసికత్వం"

బాల "గంధర్వులు" మీటింది రాగం, బాల "సరస్వతులు" కట్టిందిపాట! కాకపోతే ఏమిటి? ఓ వైపునుంచి మాండొలిన్ శ్రీనివాస్ (బాలమురళిలా) తన శ్రోతలను ముక్కుపచ్చలారని తన మునివేళ్ళ మీటింపులతో రాగమాలికలల్లి రక్తికట్టించి గంధర్వ లోకాలకు తీసుకెడుతూండగా, ఇటు పద్నాలుగేళ్ళ చిరంజీవి జె వి ఎస్ భావన బాలకవితా సరస్వతిగా రూపురేఖలు దిద్దుకుని భావనా కదంబాలు లోకం మీదికి విరజిమ్ముకుంటూ వచ్చింది! "భావన" మానస సరోవరంలో పూసిన ఆ తొలి "కవితాకదంబం" లోనివే పైన ఉదాహరించిన భావనా వీచికలలో కొన్ని పువ్వుపుట్టగానే పరిమళిస్తుందన్నది నిజమేగాని, పెంపూ, పోషణాలేని పువ్వు పరిఢవిల్లదని కూడా మరచిపోరాదు! చేయి తిరిగిన కలంలా, వాసికెక్కిన వాణిలా కనిపించే "భావన" రచనలు విద్యార్థినిగా ఏడెనిమిది తరగతులలోనే పోషించుకున్న చిరిమువ్వలు, చిలిపి చినుకులు, చిగురుటాకులూ! ఈ చిరంజీవి కదంబంలోని 29 కవితలలో చాలావరకు ప్రకృతికి స్పందించే చిన్నారుల మనస్సులలో అనుక్షణం కదలాడే భావచిత్రాలకు, అనుభూతులకు అందమైన ప్రతిరూపాలు అయినప్పటికీ, నిరంతర అభ్యాసంవల్ల వచన కవితారూపంలో, పాటల పోకడలో సాగిన ఈ భావచిత్రాలు ముందు ముందు ప్రజల నుత్తేజపరచే కవితలను కూడా మరింత స్పందన శక్తితో, సాధనాబలంతో అందించగల అగ్నిస్పర్శ "భావన" కలానికి ఉందన్న విశ్వాసం కలిగిస్తాయి 'సినారె' ఆశీస్సులు, తురగా జానకిరాణి "ఆకాంక్ష", చిరంజీవికి గురువైన డాక్టర్ శారద 'పరిచయం' భావన కవితా శక్తికి పూర్వరంగాన్ని వివరించాయి విద్యార్థి దశలో "ఆశయ సౌధాలు నిర్మించుకు"నే చిరంజీవులలో సృజనశక్తిని, భావదీప్తినీ పెంచిపోషించడంలో గురువులిచ్చే ప్రోత్సాహం, తల్లిదండ్రులు కల్పించే ఉత్సాహం పిల్లలలో రచనా ధారనేకాదు, సామాజిక దృష్టినే నిశితం చేస్తుంది నిర్మాణ మార్గంలో వారి మనస్సులను సునిశితం చేస్తుంది! "భావన" విషయంలో సరిగ్గా అదే పని జరిగి ఉంటుందనడానికి "కవితా కదంబం" ఒక చక్కని ఉదాహరణ ప్రకృతి, మానవప్రకృతి, తన చుట్టూవున్న సమాజం - "భావన"లో విచిత్రమైన అనుభూతి కలిగించాయి తోరుదత్, సరోజినీదేవి, కమలాదాస్, అమృతాప్రీతమ్ తొలిస్పందన అంతా ప్రకృతి నుంచి పొందిందే

తొమ్మిది-పది సంవత్సరాలకే కవితలు అల్లిన భారత కవికోకిల సరోజినీ చెప్పినట్టుగా మన "భావన" కూడా ఇక రెక్కలు తొడుక్కుని కవితా రోదసీ యాత్రకు సిద్ధమైనట్టే *["the bird is on the wing"]!* ఆమె మాదిరిగానే భావన కూడా లలిత లలితమైన భావాలతో ప్రపంచాన్ని జయించదలచింది ఊహల తోటల్లో విరబూసిన పుష్పంగా దూసుకువస్తున్న "భావన" రచనలు తొక్కు, పలుకలుకావు, తేనెలొలికే తెలుగు తేటగీతులు, లయబద్ధంగానూ, అంత్యప్రాసానిబద్ధంగానూ సాగిన వచన కవితా కుసుమాలు దేశ, విదేశాలలో ఇలాంటి "బాలసరస్వతులు" చెగురుమదురే అయినా చేవగల కవితా కదంబాలు సృష్టించిన వాళ్ళున్నారు కేవలం రచనా వ్యాసంగం ద్వారానే జీవికను వెళ్ళబుచ్చిన తొలి ఇంగ్లీషు మహిళ అఫ్రా బెన్ అన్నట్టుగా "భావన" కవితలు చదువుతున్నప్పుడు *"Her eyes assume new fires"* అనిపిస్తుంది! కాగితానికీ, కవిత్వానికీ అందమైన నిర్వచనం చెప్పడం పెద్దకవుల సొత్తేకాదు, చిరంజీవి భావన సొమ్ముకూడా చిన్నారి దృష్టిలో "రూపులేని నాకు అక్షరరూపు కలిగించిన కవికి చిరుదీపికనై/నన్నంటే గౌరవంగా అఖిల జనాళికి చూపే చిరుదివ్వెనై" కనిపించే కాగితం "దయలేనివారు నన్ను పరపరా చింపేస్తారు/ దయార్ద్ర హృదయాలు నన్ను పదిలపరుస్తారు" అని దీనంగా వాపోతుంది! అంతేగాదు, "నా సమస్త జీవితం సమాజానికే ధారపోస్తా"నని కాగితంతో చెప్పించడంద్వారా రానున్న రోజులలో తనలో సామాజిక దృష్టిని నిశితం చేసుకోగలనని పాఠకులలో "భావన" కలిగిస్తున్నది భరోసా! కల్పనలో, భావనలో, చెప్పే పొందికలో స్వతంత్ర మార్గం పడుతున్న "భావన" కవిత్వానికిచ్చిన నిర్వచన కూడా స్పందన సాహితికి పట్టిన వందన హారతిగానే ఉంది! "మది రోదించినప్పుడు, విధి వేధించినప్పుడు/ గుండె వేడెక్కినప్పుడు, గుండె వీణలోని తంత్రులు మోగి/కళ్ళుపాడేటి కన్నీటి రాగానికి/అక్షర రూపమిస్తే" అదే కవిత్వం అట! ఎంతటి ఊహ! బహుశా అందుకనే వర్జీనియా ఉల్ఫ్ పిల్లలలో కళాభిజ్ఞత, ప్రజ్ఞ, ఉపజ్ఞ మూడు పూవులు ఆరుకాయలుగా వర్ధిల్లాలంటే ఇంటి వాతావరణం కూడా మెరుగ్గా ఉండాలనీ, తనదంటూ ఓ ప్రత్యేక ప్రతిపత్తి ఉండాలని *["a room of one's own"]* చెప్పి ఉంటుంది! ఆ మానసోల్లాస ఘడియలు ప్రతి ఇంటా అవసరం ఎందుకంటే చిన్నారుల తలపోతలన్నీ ఎలాంటి వడపోతలు లేకుండా ముడిసరుకుగానే అయినా ముద్దుముద్దుగా బయటపడవలసిందే ఈ మధురానుభూతులనే డొరొతీ పార్కర్ *"let the air out of the tyres"* అని ఉత్ప్రేక్షించింది! చిన్నారుల తలపోతలలో మానవత్వమేగాని మాలిన్యం ఉండదు, మనసు కరగడమేగాని ఇతరుల మనసులు విరవడం ఉండదు! భావన "ఆశీర్వాదం", "అంకితం" "ఆర్ద్రమైన" ఆవేశపూరితమైన ఒక స్వీయానుభూతి "శాంతి కిరణాలు" సూర్యునికిచ్చిన వింత ఆదేశం! నిత్యం ప్రచండ కాంతిని రువ్వే కిరణాలు కావయ్యా నేడు కావలసింది, ఆ భ్రాంతి కిరణాలు తొలగించి, అశాంతిలో "అంధకారం[illegible]న్న ప్రపంచానికి శాంతి కిరణాలు పంచ"మంటుంది భావన!

చిన్నారులలో జ్ఞాపకశక్తికి వీలుగా వాలుగా ఉండే మినీ కవితలను "పొయిట్రీ ఫర్ చిల్డ్రన్" పేరిట ఏనాడో ఒక సంకలనంగా రూపొందించిన లూసీ అకిన్ తన బంధువు ఒకావిడ - కవిత్వం పిల్లలకేమి అర్థమవుతుంది, వాళ్ళకు నచ్చదు అంటే, ఊయెలలో చిన్నారి ఊగుతున్నప్పుడే పదాల శైలీ మంత్రకవాటం తెరుచుకుంటుందని అకిన్ జవాబిచ్చింది *['the magic of rhyme is felt in the very cradle"]* కనుకనే తల్లిదండ్రులు పిల్లలను గారాబంతో అపురూపంగానే కాకుండా గౌరవంతో అర్థవంతమైన జీవితానికి ఆలోచనా మందిరాలు వాళ్ళ

మనస్సుల్లో నిర్మించడానికి చేదోడువాదోడు కావాలి. అలాంటి ప్రయత్నం ఉన్నప్పుడు "అంతా ఒక్కటే/మనమంతా ఒక్కటే" అన్న సందేశాత్మక కవిత కూడా పెల్లుబికి వస్తుంది, కల్మషమూ, కుత్సితమూ లేని మనస్సులకు కుల, మతాలు అంటవు ప్రసిద్ధ బ్రిటిష్ మానవతా ఉద్యమ సారధి, ఖగోళ శాస్త్రవేత్త అయిన హెర్మన్ బాండీ అందుకే అన్నాడు "పిల్లలు కలిసి జీవిస్తారు, కలిసి నేర్చుకుంటారు, కలిసి ఆడుకుంటారు ఈ కలివిడితనమే వారిలో మానవతా దృష్టిని పెంచుతుంది, మతాలూ, ఇతర దురభిమానాలూ లేని కొత్త సమాజ అవతరణకు తోడ్పడుతుంది" ఈ సందేశాన్ని మనం చిన్నారి "భావన" కవితలో చూస్తాం స్వాతంత్ర్యం తెచ్చిన ధీరులు, మహావీరులు భారతీయులంతా ఒక్కటని నిరూపించగా, ఇప్పుడా ఆదర్శాన్ని కాస్తా మనవాళ్ళు "బూడిదలో పోసిన పన్నీరు"గా మార్చారని శరిస్తుంది "ధరిత్రినంతా కప్పి కాపాడే ఆకాశానిది/ భూమి అంతటా వ్యాపించి ఉన్న గాలిది/ ఏ కులం? వీటిది ఏ మతం?/ అని ఆలోచించలేదు ఎన్నడూ/అలా అనుకోలేదు ఎవ్వడూ" అని అధ్వాన్నపు మార్గం తొక్కిన పెద్దలందరికీ గడ్డి పెడుతోంది!! "భావన" భావనా బలం చూస్తుంటే, నేటి పిల్లలు మనం ఏదో ఒక సమాధానమిచ్చేలోపుగానే దూసుకొచ్చి మరీ తమ సమాధానం చెబుతారన్న లారెన్స్ పీటర్ మాటలు గుర్తుకొస్తాయి కాదేదీ కవితకనర్హం అన్నట్టుగానే చిరంజీవి "భావన"కు ప్రతిదీ కవితా వస్తువే సరోవరాలు, కోకిలలు, కమలాలు, జాబిల్లి, అలలు, పొగలు, ఆకాశం, తారకలు, మేఘాలు, పిడుగురాగాలు,కొండలు, చిలిపి చినుకులు, దైవలీలలు, మద్దెల వాద్యాలు - అన్నిటా తానై వాటిని తన సొంతం చేసుకొంటుంది. ప్రకృతిలో చిన్నారికి ప్రతిదీ సంగీతమే తాను లయ సమకూరుస్తుంది ఇరవయ్యో శతాబ్దపు జర్మన్ కవయిత్రులలో ఒకరైన రికార్డా హుక్ బాల కవిగా ఉన్నప్పుడు చెప్పలేదూ *"Music stu s me. for you / Sea and Cloud / Mountain & star / Touch me for you"* అని! ఇక్కడ "భావన" కూడా తన కవితాశక్తిలో అపారమైన ఆత్మవిశ్వాసం ప్రకటించుకుంటూ ఎంతో గడసరిగా "ప్రశంసిస్తే హాయిగా నవ్వుకుంటాను", అంటూ "విమర్శిస్తే" ఏడ్చేస్తాననలేదు - "తప్పులు దిద్దుకుంటా"నన్నది! తానే ఒక అణువు, అందులోనే ముదినాపసాని అణకువ! "అహో గీతస్య మాధుర్యం"! వాల్మీకి ఆశీస్సు కుశలవులకే కాదు, నేటి, రేపటి వర్ధిష్ణువులందరికీనూ!

డిసెంబర్ 12, 1990

# మతపంజరాలు దాటి ముందుకు సాగే సాహితీమూర్తులు

ఈ ప్రపంచం విచిత్రమైంది  ఉచ్చులూ, పగ్గాలూ ఎవరో వచ్చి మన మెడచుట్టూ వేయనక్కరలేదు  మానవుడు తనకు తాను తగిలించుకొనే సంకెళ్ళనుంచి విముక్తి కావడం తిరిగి అతడివల్లనే సాధ్యం  కనుకనే మహాకవి జాషువా అన్ని మతాలలోని సారమూ సౌభ్రాత్రం, సౌహార్దం అని తెలుసుకొని కులమతాల కుళ్ళును కడగికడిగి వదలిపెట్టాడు  కులమతాలు గీసుకున్న గీతలను దాటి, మత పంజరాలను బద్దలు కొట్టిన "విశ్వనరుడ"య్యాడు  విశ్వమానవ సౌభ్రాత్రాన్ని చాటిచెప్పిన ఇస్లామ్ మత సారాంశాన్ని ఇరాన్ పాలకులు ఇప్పటికిగాని అర్థంచేసుకొన్నట్టులేరు  జాషువాలా విశ్వనరుడై సంచరిస్తున్న ప్రసిద్ధ నవలాకారుడు సల్మాన్ రష్దీ "సైతాను గీతాల"ను ("సెటానిక్ వర్సెస్") నిషేధించడమేగాక, నవలను నవలగా గణించకుండా సామాజిక పరివర్తన అవసరాన్ని పరోక్షంగానూ, ప్రబోధాత్మకంగానూ నచ్చచెప్ప జూసిన రష్దీపైన "మరణ శిక్ష" అమలు జరపాలని తీర్మానించిన ఒక నాటి ఖొమెనీ 'ఫట్వా' ను నేటి ఇరాన్ అధినేత రఫసన్‌జానీ ఉపసంహరించుకొన్నందుకు అభినందిస్తున్నాం  ఇందుకు మనమేగాదు, ప్రపంచంలోని ప్రజాస్వామ్య వాదులు, మానవ వికాసాన్ని, వ్యక్తిత్వ వికాసాన్ని అభిలషించే రచయితలు, కవులు, కళాకారులు, ప్రగతి కాముకులంతా హర్షిస్తారు  ఎందుకంటే 1988లో "సెటానిక్ వర్సెస్"రాసిన సంవత్సరం తర్వాత ఖొమెనీ 'ఫర్మానా' అమలులోకి వచ్చినప్పటినుంచీ సల్మన్ రష్దీ గత ఎనిమిదేళ్ళుగా యూరప్‌లో పడిన మానసిన క్షోభ వర్ణనాతీతం  మత మౌఢ్యానికి మమతాను బంధాలుండవు  గుడ్డెద్దు చేలో పడినట్టే దాని ప్రవర్తన  అంత మాత్రాన ఆయన మానసికంగా కుంగి, కృశించిపోలేదు  ఆయనే ఒక సందర్భంగా చెప్పినట్టు 'మరణశిక్షా' శాసనం అతని మనో నిబ్బరాన్ని మరింతగా పెంచింది అజ్ఞాతవాసంలోనే అనేక సభలు, సమావేశాలకు వెళ్ళి విశ్వమానవ సౌభ్రాత్రాన్ని చాటి వచ్చాడు కొందరి దృష్టిలో పలువురు నడిచిన మార్గమే పదిలమైనది కావచ్చు  కాని ఆ పిరికితనం రష్దీలో లేదు  ధర్మానికి పోతే కర్మం చుట్టుకున్నట్టు ఇస్లామ్ ప్రబోధించిన విశ్వమానవ దృష్టిని కల్పించడానికి మరో మార్గంలో వెళ్ళి రష్దీ ముస్లిమ్ పీడిత జనావళి మనస్సులలో చైతన్యదీపాలు వెలిగించడానికి ప్రయత్నిస్తున్న రచయితా, నవలా కారుడూ  ఒక జీవన విధానాన్ని మతంగా ఇతరులపైన రుద్దకూడదని రష్దీ అభిప్రాయం  నోరు మంచిదైతే ఊరు మంచిదవు తుందన్నట్టుగా వాక్కులో, ఆచరణలో మానవ జాతి సుఖశాంతులను కోరుకున్న వ్యక్తి నిజమైన ముస్లిమ్ అని భావించిన కలం స్నేహితుడు రష్దీ  ఈ ఎనిమిదేళ్ళు అమెరికా, యూరప్ ఖండాలలోని పెక్కుదేశాలలో రష్డి ప్రాథమిక హక్కులను, స్వేచ్ఛాప్రియత్వాన్నీ సమర్థిస్తూ వందల కొలదీ సాహిత్య గోష్ఠులూ, సదస్సులూ, సమావేశాలూ జరిగాయి  న్యూయార్క్, పారిస్, లండన్, బెర్లిన్ నగరాలలోని సాహితీ మూర్తులు స్పందిస్తూ, రష్దీ ప్రాణరక్షణకోసం ఉద్యమించారు  కొన్ని యూరోపియన్ ప్రభుత్వాలు ఇరాన్‌తో ఉన్న వ్యాపార ప్రయోజనాల స్వార్థచింతనతో ఇరాన్ పాలకులపై అంతగా ఒత్తిడి తేకపోయినా, 15 దేశాల "యూరోపియన్ యూనియన్" ఇటీవల రష్దీ విడుదలకోసం జారీచేసిన శక్తిమంతమైన ఆదేశాన్ని ఇరాన్ పాలకులు పాటించక తప్పలేదు  "ఫట్వా"ఉపసంహరణ రష్దీ ఒక్కడిదికాదు, ఖండ ఖండాలలోని స్వేచ్ఛాప్రియులైన కలం వీరులందరికీ ఘన విజయంగా భావించాలి  విమర్శ ఎన్నటికీ దైవదూషణ కాదు  క్రైస్తవంలోనూ, ఇస్లామ్‌లోనూ, హైందవంలోనూ విశ్వాసంలేకుండా

కూడా మనిషి దైవ భక్తుడు కావచ్చు మతాలలో వచ్చిన సంస్కరణ ఉద్యమాలన్నీ తమ కాలంనాటికి బూజుపట్టిన భావాలను తొలగించుకోవడానికి వచ్చిన వేగాని "కొత్తసీసాలో పాతసారా"ను నింపడానికి తలెత్తినవికావు! ప్రసిద్ధ యూరోపియన్ నవలాకారులలో ఒకరైన రాబెలీ "గార్గాంటా పంటాగ్రూయెల్", "ఫోర్త్‌బుక్" నవలల్లాగానే రష్దీ "సెటానిక్ వర్సెస్" చమత్కార కథామంజరి! రాబెలీ మాదిరే సల్మన్ రష్దీ సంస్కరణవాది "సైతాన్ గీతాల"లోని సలాడిన్ చంచా, జిబ్రీల్ ఫెరిస్తాలు గొప్ప హాస్యపాత్రలు హాస్యం, వక్రోక్తి, పరిహాసం సాహిత్యానికి పరసీమలని గుర్తించగలిగితే పాలకవర్గాలు నీరసబ్రహ్మలు కాకుండా జీవించగలుగుతారు! అది కొరవడి నందువల్లనే అసహనాన్ని కూసువిద్యగా చేసుకొని 'ఫట్వా' లు జారీచేయడం!

రష్దీ అంతకుముందు (1980లో) రాసిన "మిడ్‌నైట్ చిల్డ్రన్"-భారత ఉపఖండ పరిస్థితులపైన ముఖ్యంగా భారతదేశానికి అర్ధరాత్రి స్వాతంత్ర్యప్రదానం తర్వాత జరిగిన పరిణామాలను చిత్రించిన నవల ఈయన ఇటీవల రాసిన "ది మూర్స్ లాస్ట్ సై" శివమెత్తి వ్యవహరిస్తున్న 'శివసేన' చేష్టలపైన వ్యంగ్య వైభవంతో దిద్దితీర్చిన నవల, భారత ప్రభుత్వం నిషేధించబోయి, ఆత్మనిగ్రహంతో తమాయించుకొన్న గ్రంథం సమాజ పోకడలకు అద్దంపట్టే నవలలో వచ్చే ప్రతీపాత్రా తనను గురించేనని పాలకులు కంగారు పడకూడదు ఈ నవల కొందరు కాంగ్రెస్ వాదులకు కూడా కన్నెర్ర అయింది అందులో శునకం పాత్ర పేరు "జవహర్"అని, 'బ్రైట్', 'హిట్లర్'అని కొన్ని జాగిలాలకు పెట్టినట్టే పేరు పెట్టాడు రష్దీ! మన రా వి శాస్త్రి కూడా తెలుగునాట "షోకు పిల్లి" అని గొప్ప కథరాశాడు అదీ ఇలాంటిదే! అందుకే మిలన్ కుండేరా అనే ప్రసిద్ధ నవలాకారుడు సల్మన్ రష్దీ "సెటానిక్ వర్సెస్" పై వ్యాఖ్యానిస్తూ నవలా రచయిత పాత్రల చాటున దాగాలేగాని, తన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ ముందుకొచ్చి నిలబడకూడదన్నాడు ఈ స్పృహ రష్దీలో బాగా ఉన్నందుకు మెచ్చుకున్నాడు మతం మానవతా దృష్టిని విశాలంచేయాలిగాని మత్తుమందుగా పనిచేయకూడదు, భావ ప్రకటనా స్వేచ్ఛను అడ్డుకొన్నవాళ్ళు తిరిగి అంధ యుగాలకు, మధ్యయుగాలకూ ఆహ్వానం పలుకుతూనే ఉంటారు చర్చి రాజకీయానికీ, మందిర రాజకీయానికీ, మసీదు రాజకీయానికీ స్వస్తి వాక్యం పలకనంతకాలం యూరోపియన్ మధ్య యుగాల తలరాతలను మార్చిన ఒక హేతువాద యుగాన్నీ, ఒక పునర్వికాసన శకాన్నీ మనం చూడలేము స్వేచ్ఛను దుర్వినియోగం చేయడాన్ని సంఘ'దూషణ'గా భావించవచ్చునేమోగాని భావప్రకటననే (అదెంత కటువుగా ఉన్నా) దూషణగా ఎంచకూడదు ప్రజాబాహుళ్యం మనో భావాలను గౌరవిస్తూనే సాంఘిక, ఆర్థిక, నైతిక దురాచారాల మధ్య, అత్యాచారాలమధ్య, అన్యాయాలు అక్రమాలమధ్య జీవిస్తున్న అమాయకులైన సామాన్యులకు విమోచన లభించే వరకూ రచయితలు భావవిప్లవానికి వకాల్తా వహించక తప్పదు ఈ పని చేస్తున్నందుకే ప్రపంచవ్యాపితంగా నేడు 1800 మంది రచయితలు, కవులు, జర్నలిస్టులు, ఇతర మేధావులు ప్రవాస జీవితాలు చేస్తున్నారు; ఈ కర్తవ్య దీక్షలో ఉన్నందుకే కనీసం మరో వెయ్యి మందైనా కారాగారవాసం గడుపుతున్నారు ఇస్లామ్‌లో సంస్కరణలను అభిలషించినందుకు లండన్‌లో సయెద్ సుల్తాన్ పూర్, రహ్మాన్ హాతీఫి, మెహ్ది షాక్రి, దెల్వార్ మరియవాని, అబ్దుల్-నబీమజీద్ ఇత్యాది ప్రసిద్ధ నవలాకారులను, కవికిశోరాలను ఛాందసవాదులు పొట్టన పెట్టుకున్నారు ప్రాణాలు కోల్పోతున్న ఘడియలలో వీళ్ళు ఇచ్చిన సందేశం: "కాగితంపై కలంపెట్టినప్పుడల్లా నీ మరణ శాసనాన్ని నువ్వే

రాసుకుంటున్నట్టు భావించుకో"! నేడు బంగ్లాదేశ్ ప్రగతి రచయిత తస్లీమా నస్రీన్ "లజ్జ" నవల తర్వాత ఎదుర్కొంటున్న సమస్య కూడా ఇదే. ఇరాన్‌కు చెందిన 30 మంది రచయితలను యూరప్, పశ్చిమాసియాల్లో వారి ప్రవాసకాలంలో మతోన్మాదులు చంపివేశారు బహుశా అందుకే 'దైవ దూషణ' పేరిట జరుగుతున్న రాజకీయాలను ఎండగట్టిన లియోనార్డ్ లెవీ అంటాడు దైవ దూషణను శిక్షించే పేరిట పాలకులు రాజకీయ ప్రయోజనాలను కాపాడుకొంటూ వచ్చారని, నిరంకుశాధికారాలను నిలబెట్టుకోడానికి ఇదొక సాకుగా చూపారనీ, గత చరిత్రంతా ఇదేననీ అన్నాడు! సోక్రటీస్, అరిస్టాటిల్, బ్రూనో, తామస్‌పైన్, సర్విటస్, మార్టిన్ స్కోరెసి-అందరూ "దైవ దూషణ" పేరిట సమకాలీన నిరంకుశ ప్రభువుల చేతుల్లో కొరతపడిన వాళ్ళేనని మరచిపోరాదు. మరొక్కసారి గురజాడను గుర్తుచేసుకుందాం.

'మతం వేరైతేను ఏమోయ్ !

మనసులొకటై మనుషులుంటే

జాతమన్నది లేచిపెరుగును'!

శుక్రవారం మార్చి 15, 1996

# యథార్థవాది ఎ.జి.నూరాని - లోక విరోధి!

దేశ భక్తులు, విప్లవకారులు చేసే త్యాగాలకు అడ్వాన్స్ గ్యారంటీలు ఉంటాయా? అవకాశవాదులు తప్ప అలాంటి ముందస్తు హామీలపై త్యాగాలకు సంసిద్ధమయ్యేవాళ్ళు దేశభక్తులలో ఉండరు! విభిన్న పాయలుగా సాగిన భారత స్వాతంత్ర్య సమరంలో ఆస్తిపాస్తులనే గాక ప్రాణాలనే తృణప్రాయంగా ఎంచి బ్రిటిష్ పాలనాధికారంపై ధ్వజమెత్తిన మహనీయులెందరో ఉన్నారు సామాన్యుడికీ, అసామాన్యుడికీ మధ్య అంతరాన్ని చెరిపి భారత దేశ విమోచనమొక్కటే ధ్యేయంగా ప్రకటించి త్యాగాలకు యువ కిశోరాలను పురిగొల్పిన మహత్తర ఘడియలవి అహింస ఆయుధంగా గాంధీజీ నాయకత్వం ఒక వైపునుంచీ, ఆశయాలు సంఘర్షిస్తున్న వేళ ఆయుధాలు 'అలీనం' కాజాలవని చాటి సమరశీల దృక్పథంతో దేశం యువతరాన్ని విప్లవోద్యమం వైపు ఆకర్షిస్తున్న వీర భగత్‌సింగ్ నాయకత్వం మరొక వైపునుంచీ దేశాన్ని కుదిపివేస్తున్న ముహూర్తాలవి! భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఈ రోజుకీ ప్రశ్నోపనిషత్తుగానే మిగిలిపోయిన ఒక కీలకమైన అధ్యాయం బ్రిటిష్‌వాడు వీర భగత్‌సింగ్‌ను ఉరికంబమెక్కించకుండా నిరోధించడంలో విఫలమైన గాంధీ-ఇర్విన్ ఒడంబడిక (1931 మార్చి 5)! జాతీయ స్వాతంత్ర్య సమరానికి, జాతీయ సంస్కృతీ విలువల పునరుద్ధరణకు అత్యంత దోహదకారి కాదగిన ఈ రాజకీయ పరిణామాన్ని గురించిన సరైన అంచనా ఇంతవరకూ రాలేదని అనేకమంది విజ్ఞులు ఇంతకాలం భావిస్తూ వచ్చారు సుప్రసిద్ధ భారత చరిత్రకారులలో ఒకరైన ఆర్ సి మజుందార్ 'స్వాతంత్ర్య సమరంలో మూడు ప్రధాన దశల'ను పేర్కొంటూ ముచ్చటైన ఒక మాట చెప్పారు భారత స్వాతంత్ర్య సమరం ఏ ఒక్కరి సొత్తుకాదు, అది విభిన్న జాతులు, మత మైనారిటీలు, వివిధ రాజకీయ పక్షాలు, సమరశీల శక్తులు, కాంగ్రెస్, సోషలిస్టులు, గదర్ పార్టీ, హిందూస్తాన్ రిపబ్లికన్ ఆర్మీ, కమ్యూనిస్టులూ, పలువురు విప్లవకారుల సామూహిక చైతన్యం ఫలితం అందువల్ల ఈ సమర ఖ్యాతి ప్రజలకు దక్కాలిగాని ఏ ఒక్క పక్షానికో లేదా ఏ ఒక్క నాయకునికో ఆపాదించడం చారిత్రక ద్రోహం అవుతుంది, ఈ దృష్ట్యా జాతీయ స్వాతంత్ర్య పోరాటం కేవలం కాంగ్రెస్ చలవగానో లేదా గాంధీ ఒక్కడి నాయకత్వంవల్లనే అది సాధ్యమయిందనో చిత్రించబోవడం తగదని మజుందార్ హెచ్చరించారు ఎందుకంటే, గాంధీ, దక్షిణాఫ్రికాలో ప్రయోగాలు ముగించుకుని ఇండియాకు వచ్చే నాటికే - దేశంలో బాలగంగాధర తిలక్ బ్రిటిష్‌వాడితో సహాయ నిరాకరణోద్యమానికి రంగం సిద్ధం చేసి ఉంచిన విషయాన్ని కాంగ్రెస్ చరిత్రకారులు మభ్యపరచజూచారు ఆ ఉద్యమం అంతా గాంధీ సృష్టి అనే అపవాదును వ్యాపింపజేశారు అలాగే స్వాతంత్ర్య సమరానికి హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్, రిపబ్లికన్ ఆర్మీ భగత్ సింగ్ నాయకత్వంలో పలువురు త్యాగధనులైన యువకిశోరాలు కల్పించిన మూర్తి, స్ఫూర్తి అనుపమానమైనవీ, అజరామరమైనవీ, మరపురానివీ కాని వారి త్యాగాలను మెచ్చుకోవడం, ఆశయాలను తూలనాడడం, వారి దేశభక్తిని కొనియాడడం, వారి కార్యాచరణను మాత్రం కించపరచడం జాతీయ నాయకత్వంలో కొందరికి అలవాటుగా అబ్బిన విద్య బహుశా దృక్పథాలలోని ఈ నాల్క చీలిన ధోరణివల్లనే, అవకాశవాద రాజకీయాలవల్లనే, ఎముకనూ, వెన్నెముకనూ కోల్పోయిన 'వానపాముల బతుకు'లవల్లనే - వాస్తవాలను గుర్తించడం అలవాటు చేసుకోలేక పోయాం నిరసననుకూడా బెర్రరిజంగా భావించిన రోజులవి. గాంధీ - ఇర్విన్ ఒడంబడిక వల్ల భగత్‌సింగ్ ఉరితీత ఖాయమైనప్పుడు, 'వందేమాతరం' గీతాలాపనతో 'ఇంక్విలాబ్ జిందాబాద్' నినాదాలతో భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ్‌గురు ఉరికంబాన్ని ముద్దిడుతూ

విప్లవస్మృతులను ప్రజలకు వారసత్వంగా మిగిల్చి వెళ్ళినప్పుడు - గాంధీ, జవహర్ లాల్ నెహ్రూలకు కలగవలసినంత స్పందన కలగలేదు అయినా భగత్‌సింగ్ ఉరి తర్వాత అయిదేళ్ళకు రాసిన తన స్వీయ చరిత్రలో నెహ్రూ చారిత్రక సత్యాలను ఏకరువు పెట్టక తప్పలేదు ఆయన అన్న మాటలివి ఏ కార్యాచరణకు ఏ కారణాలు ఉద్దీపన కలిగించాయో, ఏ లక్ష్యం ప్రోత్సాహం కలిగించిందో అర్థం చేసుకోకుండా వాటికి బాధ్యులైన వ్యక్తులనూ, వారి చర్యలనూ ఖండించడం చాలా చులకనైన పనీ, చొల్లు పనీ భగత్ సింగ్ ప్రజల మనిషి అయింది హింసాకాండవల్ల కాదు, టెర్రరిజం వల్లకాదు ఇండియాలో టెర్రరిస్టులు అప్పుడప్పుడూ తలెత్తుతూనే వచ్చారు, సుమారు ముప్పయ్యేళ్ళుగా తమ ఉనికిని చాటుకుంటూనే ఉన్నారు బహుశా ఒక్క బెంగాల్‌లో తొలి రోజుల్లో తప్ప వారెన్నడూ భగత్ సింగ్ పొందిన పాపులారిటీలో అవగింజంతకూడా పొందలేకపోయారు ఈ సత్యాన్ని ఎవరూ కాదనలేరు, అంగీకరించి తీరవలసిన వాస్తవం ఇది

అయినప్పుడు భగత్ సింగ్ ప్రాణాల్ని రక్షించడానికి, బ్రిటిష్ రాజ ప్రతినిధియైన లార్డ్ ఇర్విన్‌తో జరిపిన సంభాషణల్లో, సహాయ నిరాకరణోద్యమాన్ని మధ్యలో ముంచడానికి వెనుదీయని గాంధీజీ ఇర్విన్‌తో ఒడంబడిక కుదుర్చుకోడానికి భగత్ సింగ్ ప్రాణ రక్షణను షరతుగా ఎందుకు పెట్టలేకపోయారు? ఒడంబడిక కుదిరిన రోజుకి, భగత్ సింగ్‌ను ఉరితీయడానికి మధ్య కడచిన పద్దెనిమిది రోజులలో ఏ పరిణామాలు ఈ దుర్ఘటనకు దారి తీశాయి? అసలు ఒడంబడిక ప్రాధమిక ఉద్దేశం - రాజకీయ నాయకులపై ప్రాసిక్యూషన్ కేసులు ఎత్తి వేయడం, నాయకులను విడుదల చేయడంకాగా, ఆ సూత్రంనుంచి భగత్ సింగ్‌ను, ప్రఖ్యాత విప్లవకారులను ఎందుకు మినహాయించవలసి వచ్చింది? అసలు ఇంతకూ ఇర్విన్‌తో బేరసారాల్లో విప్లవకారుల ప్రస్తావన వచ్చిందా లేదా? వచ్చి ఉంటే ఏ మేరకు? రాకపోతే ఏ కారణంచేత గాంధీజీ వెనుకంజ వేయవలసి వచ్చింది? 1930 నాటికే వివిధ 'కుట్ర' కేసులలో బ్రిటిష్ సామ్రాజ్య వాదులు ఇరికించినందున భారత ప్రజాబాహుళ్యంలో వీర పూజలందుకుంటున్న భగత్ సింగ్ జనాకర్షణ, ప్రేమాభిమానాలు పెరిగిపోయినందున అతను రాజకీయ రంగంలో పోటీదారు అవుతాడని గాంధీజీ భావించారా? ఆ భావనే, సింగ్ ఉరిశిక్షను యావజ్జీవ శిక్షగా మార్పించాలని కాంగ్రెస్ వర్కింగ్ కమిటి చేసిన డిమాండ్‌ను సహితం గాంధీజీ తోసిపుచ్చడానికి దోహదం చేసిందా? ఈ ప్రశ్నలకు సరికొత్త కోణం నుంచి సమాధానాలు రాబడుతూ ఈ రోజుదాక చరిత్రకు అందని మరికొన్ని విశేషాలతో సుప్రసిద్ధ న్యాయవాది, వ్యాఖ్యాత, రాజ్యాంగ సమస్యలపై విశ్లేషణాత్మక రచనలు అందించే ఎ.జి నూరాని వెలువరించిన గ్రంథం 'ది ట్రయల్ ఆఫ్ భగత్ సింగ్' ఈ గ్రంథంలో కనువిప్పు కలిగించే అధ్యాయాలలో ప్రసిద్ధమైనది-దేశ విభజనవల్ల కలిగిన మనస్తాపాల చరిత్రను అవతలకు పెట్టి రాగ ద్వేషాలను దరిచేరనివ్వకుండా ఉంటే -భగత్ సింగ్ ప్రభృతులకు ప్రవాస జీవిత శిక్ష విధించినప్పుడు, సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో మహ్మద్ అలీ జిన్నా చేసిన (అముద్రిత) ప్రసంగం ఇండియా, పాకిస్తాన్ - రెండు దేశాలలోనూ జిన్నా ప్రసంగం ఎలా విస్మృతి పథంలోకి వెళ్ళిపోయిందీ నూరాని ఇందులో వివరించాడు సాధారణ హక్కులకోసం రాజకీయ ఖైదీలు జరిపే పోరాటానికి జిన్నా బాసటగా ఉండి సమర్థించడమే గాక 'నిరాహార దీక్ష'లను నేరంగా పరిగణిస్తూ క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌ను సవరిస్తూ బ్రిటిష్‌వాడు తెచ్చిన బిల్లును చాల వ్యంగ్యంగానూ, సూటిగానూ దెబ్బ తీశాడు కరడు కట్టిన క్రిమినల్ ఎవ్వడూ నిరాహార దీక్షకు దిగడని చాటాడు 'నిరశన దీక్ష పట్టేవాడికి ఆత్మ ఉంటుందనీ, అదే అతణ్ణి ముందుకు నడిపించే శక్తి అనీ, తాను విశ్వసించిన లక్ష్యంలో ఎంత న్యాయం ఉందో అతని కొక్కడికే

తెలుసున'నీ జిన్నా వాదించాడు అంతేగాదు, నిందితులకు కోర్టుకు హాజరై వాదించుకునే హక్కును కాలరాచి, వారి గైర్ హాజరీలోనే ఎక్స్‌పార్టీ తీర్పులు చెప్పే అవకాశాన్ని కల్పించిన సి ఆర్ పి సి సవరణ బిల్లును జిన్నా తూర్పారబట్టాడు *(trail in absentia)* ఖైదీల మధ్యకూడా యూరోపియన్ అనీ, నాన్-యూరోపియన్ అనీ వర్ణ వివక్షను ప్రవేశపెట్టినప్పుడు, 'యూరోపియన్ పద్ధతుల్లో జీవన విధానం' గడిపేవారికి మాత్రమే అనుకూలంగా జైలు మాన్యుల్స్ ఉండడాన్ని జిన్నా వ్యతిరేకించాడు భగత్‌సింగ్ ప్రభృతులుకూడా 'టోపీలు' ధరిస్తున్నారు కాబట్టి వారినెందుకు యూరోపియన్లుగా భావించి, సకల సౌకర్యాలు కల్పించకూడదని ఎదురు ప్రశ్నించాడు! రాజకీయ వాదనను సునిశితం చేసుకుంటూ జిన్నా, సింగ్ ప్రభృతుల కార్యాచరణ వివరాల్లోకి పోకుండా బ్రిటిష్ దోపిడీ పాలన వల్లనే దేశం ఇంత అధ్వాన్న స్థితికి దిగజారవలసి వచ్చిందని చెప్పి 'దిగజారిన ప్రస్తుత వ్యవస్థను ప్రజలు నిరసిస్తున్నారనీ, నిరాకరిస్తున్నార'నీ జిన్నా తెల్లవాడి నెత్తిమీదకే తిరిగి భారాన్ని నెట్టాడు! 'ఈ ప్రభుత్వం ప్రాసిక్యూషన్‌లపై నడుస్తోంది, బతుకుతోంది, *(Governance by prosecutions)* ఇలా ప్రజల్ని ప్రాసిక్యూషన్స్‌తో అనుక్షణం వేధించే నాగరిక ప్రభుత్వం ఏదైనా ఈ ప్రపంచంలో ఉందా అసలు, అని జిన్నా గద్దించాడు!

నాడు బ్రిటిష్ సామ్రాజ్య వాదుల వలన ప్రభుత్వంపై పెల్లుబుకుతున్న నిరసన పరంపరలో భాగంగా, భగత్ సింగ్ ప్రభృతులపై కుట్ర కేసుల విచారణ, ఉరిశిక్షల పరంపర సందర్భంగా నాడు గాంధీ, నెహ్రూలకంటే ఎక్కువ తపనతో నిరసన పరంపరను తెలిపినవారు మోతిలాల్ నెహ్రూ, జయకర్, సుభాస్ చంద్రబోస్, సి ఆర్ దాస్ సతీమణి బసంతీదేవి వగైరా సైమన్ కమిషన్ రాకకు నిరసనగా ఉద్యమించిన పంజాబ్ కేసరి లాలా లజ్‌పత్‌రాయ్‌పై ధ్వజమెత్తి ఆయనను గాయపరిచి, ఆ గాయాలతో ఆయన మరణానికి కారకుడైన సాండర్స్‌ను హతమార్చినవాళ్ళు భగత్ సింగ్ ప్రభృతులు నాటి ఉద్యమ ఉధృతి ఫలితం అది బ్రిటిష్ గూఢచారి శాఖ అధిపతి సర్ హోరేస్ విలియమ్‌సన్ ఏమన్నాడు? 'భగత్ సింగ్ ఏ తప్పూ చేయలేదు ఖైదీల బ్యారక్ రాజకీయ వేదికగా మారిపోయింది భగత్ సింగ్ వీరోచిత గాథలతో గ్రామీణ ప్రాంతాలు ప్రతిధ్వనిస్తున్నాయి అయన ఫొటోలను నగరాలలో, పట్టణాలలో ప్రజలు కిక్కిరిసిగా కొంటున్నారు కొంతకాలంగా గాంధీకన్నా భగత్ సింగ్‌కే ప్రజల్లో ఎక్కువ పలుకుబడి స్థిరపడింది!'

కాని, 'అహింస'ను ఆయుధంగా చేసుకున్న గాంధీజీ బ్రిటిష్‌వాడితో ఒప్పందంద్వారా, భగత్ సింగ్ ప్రభృతుల ప్రాణాలకు ముప్పు తెచ్చారు లార్డ్ ఇర్విన్ (వైకౌంట్ హాలీఫాక్స్) సింగ్ ఉరితీత తర్వాత ఇరవైయేళ్ళకు రాసుకున్న స్వీయ చరిత్రలో గాంధీ పాత్ర గురించి ఇలా వెల్లడించాడు 'ఈ యువకుణ్ణి (భగత్‌సింగ్) ఉరితీస్తే అకస్మాత్తుగా అతను జాతీయ స్థాయిలో అమర జీవి అయిపోతాడు, వాతావరణం ఉధృతం అవుతుంది అని నాతో గాంధీ అన్నారు' అందువల్ల కాంగ్రెస్ సమావేశానికి ముందు ఉరి తీయకుండా ఆ తరువాత తీసుకోమని గాంధీ సలహా ఇవ్వడం ఘోరాతిఘోరం ఒక వైపున కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఉరిశిక్షను యావజ్జీవ శిక్షగా మార్చమని గోల పెడుతుండగా, ఉరిశిక్షను కాంగ్రెస్ సమావేశంకోసం వాయిదా వేయమని గాంధీ కోరడం భగత్ సింగ్ పేరు భారత ప్రజల మనసుల్లో చిరస్థాయి అవుతుందన్న బాధ వల్లనేనని అర్థం అవుతుంది! 'తలలు బోడులైన తలపులు బోడులా'? కావని వేమన బోధ!

ఆదివారం 8, సెప్టెంబర్ 1996

# 'ఆమె'ను వీడని పితృస్వామ్య వ్యవస్థ నీడలు...!

చట్ట సభలలో మహిళలకు 33 శాతం సీట్లు రిజర్వ్ చేయాలని 'తలపెట్టి' 81వ రాజ్యాంగ సవరణ బిల్లును లోక్‌సభలో ప్రవేశ పెట్టినట్టే యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం చివరికి బిల్లును తుస్సు మనిపించింది. ఫ్రంట్ 'కామన్ మినిమమ్ ప్రోగ్రాం' (సాధారణ కనీస కార్యక్రమం) కాస్తా కామన్ మినిమమ్ ప్లండర్ (కనీస సార్వత్రిక దోపిడీ)గా మారిపోయింది! అబద్ధాల అంకయ్యలకు అరవై నాలుగు అసత్య ప్రమాణాలని సామెత! పార్లమెంటు, అసెంబ్లీలలో మహిళల రిజర్వేషన్ బిల్లుకు ఒకవేళ సవరణలు అవసరమైతే ఉత్తరోత్తరా చేసుకోవచ్చు. కాని ఈ రిజర్వేషన్ కోటాలో మైనారిటీలకు, వెనుకబడిన తరగతుల వారికి స్థానం కల్పించాలని కొంతమందిచేత డిమాండ్ పెట్టించడం ద్వారా ఫ్రంట్ ప్రభుత్వం పార్లమెంటు ప్రస్తుత సమావేశంలోనే ఆమోదించవలసిన బిల్లును కాస్తా వాయిదా వేసేసింది. పార్లమెంటు సెలెక్టు కమిటీ అభిప్రాయానికి నివేదించడంద్వారా మన సమాజంలో మహిళపైన పితృస్వామిక వ్యవస్థ ప్రభావం ఎంత ఉందో మరొకసారి నిరూపించుకున్నట్టయింది! కాంగ్రెస్ ప్రభుత్వం ఒక కారణంపైన, ఫ్రంట్ ప్రభుత్వం మరొక కారణంపైన, ఇలా చట్ట సభలలో మహిళల రిజర్వేషన్‌ను నిర్ద్వంద్వంగా, నిండు మనస్సుతో నికరం చేయకుండా దాటవేస్తూ వచ్చాయి. 'ఆకాశంలో సగం మాది' అని ఆధునిక మహిళ ఎలుగెత్తి చాటుతూండగా, 'లేదు లేదు, అవకాశంలోకూడా సగం మీది కాదు' అని పురుషాధిక్య సమాజం చాటి చూపుతోంది! పురుషుడితో స్త్రీకి సమాన హక్కులను నిరాకరిస్తున్నందుననే ప్రపంచ వ్యాపితంగా స్త్రీ వాద ఉద్యమాలు ప్రబలవలసి వస్తోందన్న వాస్తవాన్ని గణించడానికి పురుషాధిక్య వ్యవస్థ ఇప్పటికీ మొరాయించ బోవడం విచారకరం, ఖండనార్హం. భారత స్వాతంత్ర్యం అర్ధ శతాబ్ది ఉత్సవాలు జరుపుకొనబోతున్న తరుణంలోకూడా భారత పాలకులలో వైజ్ఞానికాభివృద్ధి లేకపోవడం, వారు రోజురోజుకీ మరుగుజ్జులుగా మారిపోవడం విచారకరం. కడచిన యాభై ఏళ్ళలోనూ భారత మహిళా ప్రగతి కాగితాలకు మాత్రమే ఎలా అతుక్కుపోయిందో ఇటీవల కాలంలో సమాజంలో 'మహిళల ప్రతిపత్తి'గురించి ప్రభుత్వమే నియమించిన పరిశీలనా సంఘం నివేదిక వెల్లడించింది. అందులో ఈ కింది నగ్న సత్యాలను ఏకరవు పెట్టారు. 'భారత మహిళలకు సంక్రమించిన రాజకీయ సమానత్వ హక్కు, దేశ రాజకీయ వ్యవస్థ నిర్మాణంలో భాగస్వాములుగా వారు తమ పాత్రను పెంచి పోషించుకోడానికి ఏమాత్రం సాయపడలేదు. పైగా ఈ హక్కులు మహిళలకు స్వేచ్ఛనూ, అధికారాన్ని ఇచ్చినట్టు భ్రమను కల్పించడానికి మాత్రం తోడ్పడ్డాయి'! అలాంటి 'భ్రమ'నే గౌడ ప్రభుత్వం పార్లమెంటు సమావేశంలో 'మహిళా రిజర్వేషన్ బిల్లు'ద్వారా మరోసారి కల్పించింది! ఈ భ్రమా పూరితమైన సన్నివేశానికి ప్రధాన కారణం మహిళలలో నిరక్షరాస్యత కాదు. నిరక్షరాస్యత మహిళలను మభ్యపెట్టే అనేక కారణాలలో ఒకటి మాత్రమే. సాంఘిక, ఆర్థిక రంగాలలో మహిళలపట్ల చిన్న చూపు, అనాదరణ, దుర్మార్గపు ఆలోచనా ధోరణులు- ఒక్క ముక్కలో పురుషాధిక్యతా ధోరణీ మహిళా సమస్యలను వాయిదా వేయడానికి అసలు కారణాలని గుర్తించాలి. ఉదాహరణకు కేరళ తీసుకోండి. మహిళా సమీకరణలో, అక్షరాస్యతలో అగ్రస్థానంలో ఉన్న కేరళలో లెజిస్లేచర్‌కు చాలా తక్కువ మంది మహిళలను పంపించడంల కూడా రికార్డ్ సృష్టించింది! అంటే మహిళల పట్ల సాంఘిక దృక్పథంలో, సామాజిక స్పృహలో మార్పు రాలేదన్న మాట. అలాగే, రాజకీయంలో మహిళల భాగస్వామ్యం బాగా తక్కువగా

ఉన్న ఉత్తర ప్రదేశ్‌లో లెజిస్లేచర్‌కు పెద్ద సంఖ్యలో మహిళలు ఎన్నిక అవుతుంటారు! స్వార్థ ప్రయోజనాల కోసమైనా రాజకీయ పక్షాలు మహిళలను రంగంలోకి దించవలసి వచ్చింది ఇందిరా గాంధి కూడా ఈ దేశంలో పరిస్థితుల వత్తిడివల్ల ప్రధానమంత్రి పదవికి ఎదిగి రావలసి వచ్చిందిగాని మహిళాభ్యుదయంలో భాగంగా మహిళ ప్రధాని కావాలన్న సదుద్దేశంతో కాదు! ఎందుకంటే-మురార్జీ దేశాయ్, లేదా 'సిండికేట్' పరిభాషలో చెప్పాలంటే, 'ఈ దేశానికి విధవ(మహిళ) ప్రధాని కావడం' పురుషాధిక్య సమాజం సహించలేదు! ఈ అసహిష్ణుతే చట్ట సభలలో ఇంతకాలంగా జనాభాలో సగం శక్తిగా ఉన్న మహిళలకు న్యాయంగా దక్కవలసిన 50శాతం గాకుండా కనీసం 33 శాతం సీట్లయినా చేజిక్కడం లేదు! ఎన్ని అంతర్జాతీయ మహిళా సంవత్సరాలు వచ్చిపోతే ఏమి? ప్రపంచ మహిళా దశాబ్దికి స్వాగతం చెబితే సరిపోతుందా? 'సార్క్' దేశాలు 'ఆడ శిశు దశాబ్ది' ఉత్సవాలు ప్రకటిస్తే సరిపోయిందా? ప్రజలలో ఈ దొనోత్సవాలూ, దశాబ్ది ఉత్సవాలూ మహిళా సమస్యలపట్ల కొంత చైతన్యం తీసుకువచ్చి ఉండవచ్చుగాక కాని మహిళలపట్ల మొత్తంమీద పురుషాధిక్య సమాజాన్ని మానసిక పరివర్తన వైపు ఎంతవరకు నెట్టగలిగిందన్నది అసలు ప్రశ్న 1990తో ముగిసిన ఇరవై సంవత్సరాలలో మన దేశంలో 'సెక్స్' నిర్ధారణపై ఆధారపడి శిశు హత్యలు *(female infanticide)* చాలా ఎక్కువ జరిగాయి మరోసారి 18-19వ శతాబ్దాలు పునరావృత్త మయ్యాయనిపించింది! మనం రాచరికాల్ని ఇతర కారణాలవల్ల ఎంత అప్రజాస్వామికమని భావించినా కొన్ని సందర్భాల్లో అభ్యుదయకర సంస్కరణలకు అవి చేయూత నిచ్చాయి ఆడపిల్ల జననం 'అనర్థం'గా భావించి ఆడ శిశు హత్యలు పెట్రేగిపోయిన ఒక దశలో జైపూర్ మహారాజా బ్రిటిష్ చట్టాలను సమర్థిస్తూ, 'చట్టాలు కఠినంగా అమలు జరిపి ఈ దారుణ ఆచారాన్ని అంతమొందించాల'ని ప్రకటించాడు! అందువల్ల కొలదిమంది సంస్కర్తల అండదండలతోనే అయినా భారత మహిళ కొన్ని హక్కుల్ని సాధించుకుంది అయితే ఆర్థిక విమోచనకు ఆమె చాలా దూరంలోనే ఇప్పటికీ ఉన్నందున దానిపై ఆధారపడిన సాంఘిక విమోచనకు కూడా ఆమె దూరం కావలసి వస్తోంది కాబట్టి ఈ రెండు పునాదులను పటిష్టం చేయగల రాజకీయ విమోచనానికికూడా ఆమె ఇంకా దూరంగానే ఉండిపోతోంది మహిళా చైతన్యం మొత్తం రాజకీయాలనే శాసిస్తుంది అందుకనే వారి సీట్లకు శాతాలు కట్టి పురుషాధిక్య సమాజం తాను ఆమోదించగల పరిమితులకు మించి మహిళను ఎదగనివ్వదు! నేడు నడుస్తున్న చరిత్ర ఇదే. లేకపోతే, ఒక్క 8వ లోక్‌సభలో (1984) తప్ప మొత్తం సభ్యులలో 8 9 శాతానికి మించి మహిళలకు ప్రాతినిధ్యం లేదు పరిపూర్ణ పార్లమెంటుకు ముందు 1950లో తాత్కాలిక పార్లమెంటులో (అదే రాజ్యాంగ నిర్ణయ సభ) కేవలం ఏడుగురు మహిళలే ఉండగా, ఆ సంఖ్య 1952 తొలి పార్లమెంట్‌లో 22 మందికి పెరిగింది 'ఎన్నికల సంస్కరణల' పేరిట జరుగుతున్న తతంగం కూడా మహిళా ప్రాతినిధ్యం కుంచించుకు పోవడానికి ఒక కారణం అవుతోంది. ఎన్నికల ఖర్చులు, డిపాజిట్ ఖర్చులూ పెంచివేస్తున్నందున రాను రాను సామాన్యుడు పోటీ చేయగల పరిస్థితి అంతరిస్తోంద. ఎన్నికల ప్రచారం విపరీత ఖర్చులతో కూడుకున్నందున, పురుషాధిక్య సమాజానికి అనుగుణంగా పాలసీలు నిర్ణయిస్తున్న రాజకీయ పక్షాల చేతుల్లో అభ్యర్థుల ఎంపిక ఉన్నందున - మహిళా ప్రతినిధులకు పోటీ కష్టసాధ్యమవుతోంది!

భారత సమాజంలో దుశ్శాసనులూ ఉన్నారు, శ్రీకృష్ణులూ ఉన్నారు! అబలలూ ఉన్నారు, 'దుర్గ'లూ ఉన్నారు ఒక దశలో - 19వ శతాబ్దిలో విధవా పునర్వివాహాల చట్టం, విడాకుల చట్టం, వివాహిత స్త్రీల ఆస్తి హక్కు చట్టం, సివిల్ వివాహాల చట్టం, ఏజ్ ఆఫ్ కన్సెంట్ యాక్టు, సతీ సహగమన నిరోధక చట్టం - మహిళా సంక్షేమానికి, రక్షణకు ఉద్దేశించి వచ్చాయి వీటి అవతరణకు అడ్డు తగిలినవారి సంఖ్య అసంఖ్యాకంగా ఉన్నా మహిళలకు తోడు నీడగా ఉన్న మహనీయులూ ఉన్నారు ఆ కోవలోని వాళ్ళే రాజా రామమోహనరాయ్, వీరేశలింగం, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, దయానంద సరస్వతి, చాంద్ కరణ్ శారద(శారద చట్టం), అలాగే మహిళా విద్యకు అత్యంత ప్రాధాన్యం కల్పించి, వారిలో విశ్వాస సూర్యోదయాలు సృష్టించిన ఆచార్య కార్వే, బనస్థలి విద్యాపీఠ్ నిర్మాత హీరాలాల్ శాస్త్రి మహిళా జగత్తుకు చిరస్మరణీయులు అయినా ఆధునిక యుగంలో మరిన్ని ఆగడాలకు, దౌర్జన్యాలకు, హింసకూ మహిళలు గురి అవుతూనే ఉన్నారు, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఆధునిక స్త్రీనికూడా అబలగా మార్చుతోంది! విద్య, వివాహాది విషయాల్లో యువతులింకా స్వతంత్రనిర్ణయాలకు దూరంగానే ఉన్నారు, ఒక దశలో కన్యాశుల్కం ఊళ్లేలితే, ఇప్పుడు వరశుల్కం, కన్యాశుల్కం రెండూ పేట్రేగిపోతున్నాయి, వాటితోపాటు ఆడపిల్ల కట్న చావులూ పెచ్చరిల్లిపోతున్నాయి, తన జన్మమీదనే కాదు, ఆస్తిమీదనే కాదు, కుటుంబ నియంత్రణలో కూడా ఆవిడ మాటకు విలువ లేదు, అబార్షన్ విషయంలోనే కాదు శిశువు 'సెక్స్'ను కూడా (అమ్నియోసెంటిసిస్) పురుషుడే నిర్ణయిస్తున్నాడు! హత్యలనూ, ఆత్మహత్యలనూ తారుమారు చేస్తున్నాడు, చౌలాన్ రాజపుట్స్ ఒక దశలో ఒక్క ఆడపిల్లనుకూడా లేకుండా చేసేశారట! అలాంటి దుర్దశను ఇప్పుడూ కల్పిస్తున్నారు, ఎన్నడూ లేనంత స్థాయిలో వ్యాపార ప్రకటనల ద్వారా స్త్రీని అవమానపరుస్తున్నారు, ఇవన్నీ - కట్న నిషేధపు చట్టం, సతీ సహగమన నిషేధ చట్టం, వేశ్యా నిరోధక చట్టం ఉండగానే చాపకింద నీరులా కాదు, యధేచ్ఛగా, బాహాటంగా సాగిపోతున్నాయి! అహంకారంతో పురుషాధిక్య సమాజం కల్పిస్తున్న ఇబ్బందులవల్ల మహిళలపై సంసార జీవితంలో బాధలూ పెరిగాయి కుటుంబభారాన్ని తెలివిగా స్త్రీ మీదికి నెట్టిన ఫలితంగా మహిళలు విధిగా సాకవలసిన కుటుంబాల సంఖ్య గత పాతికేళ్ళలో పెరిగిపోయింది వర్ధమాన దేశాల్లో 33 కోట్ల కుటుంబ సభ్యుల భారాన్ని 70లక్షల మంది మహిళలు మోయవలసి వస్తోందని ఆర్థిక నిపుణుడు ఇద్రీస్ బజారీ అంచనా! ఈ సమస్యల పరిష్కారానికి మహిళా ప్రాతినిధ్యం చట్టసభలలో ఇనుమడించి తీరాలి. ఇది మనదేశంలోనే కాదు, మహిళలకు ఓటు హక్కును శతాబ్దంనాడే కల్పించిన దేశాలు కూడా చట్ట సభలలో మహిళా ప్రాతినిధ్యంలో వెనుకబడి ఉన్నాయి ఒక్క సోవియట్ యూనియన్ (బతికున్నప్పుడు), ఉత్తర వియత్నాంలలో తప్ప పార్లమెంటులో మహిళలకు 30 శాతం ప్రాతినిధ్యం కల్పించిన దేశాలు తక్కువ! సమితి సభ్యదేశాలలో సగానికి సగం దేశాల జాతీయ శాసన సభలలో మహిళలకు ప్రాతినిధ్యం లేదు! పశ్చిమ దేశాల్లో (పైగా 'ప్రజాస్వామ్యం' అనిపేరు) కూడా ఈ ప్రాతినిధ్యం 23 శాతానికి మించిలేదు! ఈ పరిస్థితుల్లో కూడా గుడ్డిలో మెల్లగా భారత పార్లమెంటరీ చరిత్రలో సంఖ్యాత్మకంగా మహిళల ప్రాతినిధ్యం నామమాత్రంగానే ఉన్నా - కడచిన పది లోక్‌సభలలోనూ తనతనాన్ని మొహరు వేసుకున్న మహిళా మణులున్నారు ప్రశ్నోత్తరాల సమయాన్ని, వాయిదా తీర్మానాల సందర్భాన్ని, చర్చలనూ రసవత్తరంగా వినియోగించుకొన్నవారున్నారు. వారిలో దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్, సుచేత కృపలానీ, రేణుకాచక్రవర్తి, విమలాదేవి, పార్వతి కృష్ణన్,

సుశీలానాయర్, శశాంక మంజరీదేవి, గాయత్రీదేవి, మృణాళ్ గోరె, అహల్యా రంగ్నేకర్, మొహినా కిద్వాయ్, సుశీలా గోపాలన్, మెమోనా సుల్తానా, జయంతి పట్నాయక్, దిల్‌కుమారి భండారి, గీతా ముఖర్జీ, కల్పనాదేవి వగైరాలు ప్రముఖులు  అలాగే పార్టీ అధ్యక్షులుగా, ముఖ్యమంత్రులుగా రాణకెక్కిన వారున్నారు  అలాగే సుప్రసిద్ధ మహిళా పరిశోధకురాలు ముక్తామిత్తల్ చెప్పినట్టుగా 'గ్రామీణ ప్రాంతాల మహిళలు అభ్యుదయకర భావాలుగలవాళ్ళే వీళ్ళను సాంఘిక సమస్యల పరిష్కారంలో ముందుకు నెట్టగలిగితే అద్భుతమైన పాత్ర నిర్వహించగలరు'  ఒక తరంవరకు కొంత తొట్రుబాటు ఉన్నా మరో తరమైనా సొంత ముద్ర వేసుకోగలుగుతుంది  అందుకే వారి ప్రాతినిధ్యం చట్ట సభల్లో పెరగాలి  అయితే ఇంతకూ ప్రగతికి అసలు సిసలు ఆటంకం ఏదో ప్రగతి శీల మహిళా కార్యచరణ 'అజెండా21' ఇలా పేర్కొంది  'దారిద్ర్య భారంవల్ల అనునిత్యమూ పెరుగుతున్న హింసకు, పరిసరాలు కలుషితం కావడానికి మహిళలపై రకరకాల దోపిడీకి ప్రధాన కారణం-నూతన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఈ వ్యవస్థ మానవుని సంక్షేమంకన్నా, పరిసరాల రక్షణకన్నా పెట్టుబడికి మాత్రమే ప్రాధాన్యమిస్తుంది  అదీ అసలు ప్రమాదం అంతా'!

ఆదివారం 15, సెప్టెంబర్ 1996